# అమ్మతో సంభాషణలు




శ్రీ విశ్వజనని పరిషత్
జిల్లెళ్ళమూడి
గుంటూరు జిల్లా

అమ్మతో సంభాషణలు

సర్వస్వామ్యములు:
శ్రీ విశ్వజననీ పరిషత్
జిల్లెళ్ళమూడి

మొదటి ముద్రణ :
శ్రీ వృషనామ సంవత్సర ఆశ్వీయుజమాసము

ప్రతులు : 1000

మూల్యం : రూ. 125/-

డి.టి.పి.:
అగ్ని గ్రాఫిక్స్
ఆనాలవెంకటప్పారావు రోడ్
రాజమండ్రి
ఫోన్ : 0883 - 473280

ముద్రణ :
శ్రీ శారదా ప్రింటర్స్
సీతంపేట, రాజమండ్రి
ఫోన్ : 0883 - 473554

# మామాట

"నేనేది చెప్పినా నా అనుభవంనుంచే చెబుతాను"

"నా మాటలు నా భావాలే"

ఇవి అమ్మ వాక్యాలు.

అమ్మ ప్రసంగాలు చేయక పోయినప్పటికీ, గ్రంథరచన చేయక పోయినప్పటికీ – జిజ్ఞాసువులు అడిగిన ప్రశ్నలకు అమ్మ జవాబులు చెబుతారు. ఈవిధంగా అమ్మ అనేకులతో అసంఖ్యాకమైన సంభాషణలు చేశారు. అందులో మన అదృష్టంకొద్దీ కొన్ని అక్షరబద్ధం అయినాయి. ఇందుకు కారణమైన సోదరీ సోదరులు కుమారి భవాని, శ్రీమతి బాలాత్రిపురసుందరి, శ్రీమతి వసుంధర, శ్రీ గరుదాద్రి సుబ్రహ్మణ్యం ప్రభృతులకు మనం ఎంతైనా ఋణపడి ఉన్నాము. ఈ పవిత్ర కార్యక్రమం వారు నిత్యకృత్యంగా, వారి స్వధర్మంగా నిర్వహించినప్పటికీ – వారు మానవాళికి మహోపకారం చేశారు.

ఈ సంభాషణలన్నీ ఆయా సోదరీ సోదరులు వారు వ్రాసిన 'అమ్మడైరీ' లలో నిక్షిప్తమై ఉన్నాయి. ఎంతశ్రద్ధతో ఆ డైరీలనుండి యీ సంభాషణలను విడదీసి ఒకచోట సంకలనం చేశారు కీ.శే. డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు. వారికి జిజ్ఞాసులోకం సర్వదా ఋణపడి ఉంటుంది.

అమ్మ చాలా బాగా మాట్లాడుతారు. ఎంత జటిలమైన విషయాన్నయినా అత్యంత సరళంగా చెబుతారు. అమ్మ సంభాషణా చాతుర్యాన్ని మనం వర్ణించలేము. అమ్మ వాగీశ్వరి!

మనం యీ సంభాషణలు చదువుతుంటే - ఎవరో చేసిన సంభాషణలు మనం చదువుతున్నట్లుండదు. మనమే అమ్మకు ఎదురుగా కూర్చుని మాట్లాడుతున్నట్లుంటుంది.

సవరణలు అవసరంలేని వివరణలు, అతి సూక్ష్మప్రవచనాలూ, అధునాతన నిర్వచనాలూ అమ్మ పలుకుతుంటే మన మేధలకు పదును బెట్టుకుంటున్నట్లుంటుంది.

అమ్మ మన తలపై చెయ్యివేసి నిమురుతూ, మనచేత గోరుముద్దలు తినిపిస్తు న్నట్లుంటుంది.

అమ్మ సంభాషణలన్నీ చదివితే - అవాఙ్మానస గోచరుడయిన భగవంతుడు సర్వత్రా దర్శనం యిస్తూ మనకు పరమాప్తుడైపోతాడు. ముళ్ళపొదవలే భయపెట్టే వేదాంతం పూపొదరిల్లై హాయిని గొలుపుతుంది.

అపూర్వమయిన అమ్మ అనుభవంనుండి పలికిన పలుకులు రవ్వలూ రత్నాలూ అయి మన జీవనమార్గంలో దివ్యకాంతులను ప్రసారిస్తాయి.

- ప్రచురణ కర్తలు

# విషయసూచిక - మొదటిభాగము

ఓం

అం అ

# ముందుమాట

**బొప్పూడి రామబ్రహ్మము**

అధ్యక్షులు

శ్రీ విశ్వజననీపరిషత్

జిల్లెళ్ళమూడి.

జిల్లెళ్లమూడి అమ్మగా సుపరిచితమైన అమ్మను "నీవు ఎవరమ్మా?" అని అడిగితే "నీకూ మీకూ అందరికీ అన్నిటికీ అమ్మను" అని ఆ తల్లి సమాధానము. ఇంకొకసారి "నేను నేనయిన నేను" అని అన్నారు. ఈ రెండవనిర్వచనాన్ని వివరిస్తూ "మీలో ఉన్ననేనూ, నాలో ఉన్న నేనూ అందరిలో అన్నిటిలో ఉన్న నేనూ నేనే" అని చెప్పి అనుగ్రహరూపిణియై తన విశ్వజననీతత్వం మనకు తెలియచెప్పింది.

అమ్మ వేదమాత ఆమె ముఖాంబుజము నుండి జాలువారిన వాగమృతం మాధుర్యభరితం. ఆమాటలు ఎంతో క్లుప్తంగా, గుప్తంగా ఉంటాయి. ఎంతటి క్లిష్టమైన విషయాలను కూడ సులభంగా సరళంగా చిన్నచిన్న మాటలతో చమత్కృతితో, అందరికీ తెలిసేటట్లుగా ఉంటాయి.

అమ్మ ఏవిషయాన్ని గురించి మాట్లాడినా తన అనుభవంలోనుంచి ఎదురుగాను దగ్గరలో ఉన్న వస్తువును ఉపమానంగ తీసుకుని వివరణ నిస్తుంది. తన స్మృతిలోనుంచి చెబుతానని శ్రుతులు చదువుకోలేదని పదేపదే చెబుతారు. అట్లాగ అని ఆమెకు శాస్త్రములు రావని భ్రమపడే అవకాశముంది. ఆమె సర్వశాస్త్రమయి. సర్వోపనిషదుద్ఘుష్టా. సర్వవేదాంత సంవేద్య. సర్వ వేదాంత సంసిద్ధి సుతత్వ. సృష్టే శాస్త్రమని నిర్వచించారు. అమ్మ సరస్వతి వాగదీశ్వరి. వాగ్వాదిని. అందుచేత తనమాటలను గురించి అమ్మ"తాలుమాట రావడానికి, తోలునోరు కాదు కదా!" అన్నారు. అమ్మ శంకరుని భాష్యం రామానుజుని గురించి, గౌడపాదులు ప్రతిపాదించిన సిద్ధాంతమును గురించి, రమణమహర్షి షిర్డీసాయి

గురించి ఉపనిషత్తులు, గీత, ఖురాన్, బైబిలు గురించి అనేక విషయాలు సంభాషణలలో ప్రసక్తి తీసుకుని వచ్చి చక్కటి వివరణలు ఇచ్చి తన "సర్వమత సమ్మతి" తత్వాన్ని తెలిపారు.

అమ్మమాటలు విజ్ఞానపుమూటలుగా, విముక్తి బాటలుగా గుర్తించి అందలి అనుభవసారాన్ని, ఆనందానుభూతి మాధుర్యాన్ని గ్రోలినవారు శ్రీమాన్ డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు.వీరు భౌతికశాస్త్రంలో నిష్ణాతులు. ఆ శాస్త్రపు గీటురాయిపై అమ్మ సిద్ధాంతాలను పరీక్షించుకుని సంతృప్తులై పలువురు మహానుభావుల జీవితాలను వారి ప్రవచనాలను అధ్యయనం చేసి పూర్వశాస్త్ర గ్రంథాలను అవగాహనచేసుకుని - తులనాత్మక పరిశీలన జరిపి అమ్మ చెప్పేది అన్నివిధాల సంపూర్ణంగా భాసిస్తున్నదని నిర్ణయానికి వచ్చి ఆసిద్ధాంతాన్ని జనబాహుళ్యానికి అందించవలెనని దీక్షతో జీవితాన్ని అంకితం చేసుకున్న తపస్వి. వీరిని గురించి ప్రస్తావిస్తూ "తపించాడు, తరించాడు, తానంతా అమ్మే అయినాడు" అని అమ్మే వివరించింది. అమ్మను గురించి అంత తెలుసుకుని ఇతరులకు వివరించి "నిన్నెరుగుదునని అనుటకు దమ్ములేదు" అన్న పరమ వినయశీలి ఈగ్రంథ సంకలనకర్త. అట్టి సోదరులు శ్రీమాన్ వీరమాచనేనిప్రసాదరావుగారి సహకారంతో అమ్మ "దివ్యవాణిని" టేపురికార్డు చేసినదానిని "అమ్మతో సంభాషణలు" పుస్తకరూపంగా అందించినారు.

గురువు శిష్యులకు నిర్భేధస్థితిని బోధించుటే గమ్యం. అమ్మ ప్రథమ గురువు.. అమ్మ గురురూపిణిగ, దక్షిణామూర్తి రూపిణిగ, మనకు శివజ్ఞాన ప్రదాయినియై, జ్ఞానదయై, వాత్సల్యంతో సందేహ నివృత్తిచేస్తూ జ్ఞానబిక్ష పెట్టారు.

"అమ్మతోసంభాషణలు" అన్న పుస్తకాన్ని పరిశీలిస్తే, అమ్మమనలను ప్రశ్నిస్తూ, మనలను ఆలోచింపచేస్తూ సమాధానాలను మనలనుండి రాబట్టుతుందని తెలుస్తుంది. అమ్మే ఇది మంచి బోధనాపద్ధతి అని కూడా చెప్పారు. మనందరికి సామాన్యంగ వచ్చే సందేహాలకు సమాధానాలు ఇందులో దొరుకుతాయి. ఏశాస్త్రం చదువుకోవాలన్నా, ఆ శాస్త్రానికి సంబంధించిన పారిభాషికపదాలు తెలియాలి. అమ్మ ఉపయోగించిన శబ్దాలకు నిర్వచనాలు మన అవగాహనను పెంచి మనకు తెలియకుండానే మన నరనరాలలో

జీర్ణించుకుని మార్గనిర్దేశము చేసి మనలను ఆచరణపథములో నడిపించుతాయి. ఉదాహరణకు 'సహనము" అంటే "తన యిష్టాన్ని చంపుకుని ఒకరిష్టప్రకారము నడుచుకోవటమే అనుకుంటాను" అన్నారు. "సహజ సహనమంటే కష్టమే తోచక పోవటం ఏ స్థితిలో కూడా". అలాగే "లోచూపు (అంతర్ముఖం)" అంటే చక్కటి నిర్వచనం ఇచ్చారు ఇలా అనేక నిర్వచనాలు తెలుసుకొనడం వలన విషయం సులభంగా అర్థమవుతుంది.

అమ్మ చాలా సూక్తులకు సంభాషణలద్వారా అమ్మ స్వయంగా ఇచ్చిన వివరణలు అమ్మమ మాటలలో తెలుసుకోవచ్చు. ఉదాహరణకు "తనుమూలమ్ ఇదం జగత్తు", "నేను నేనయిన నేను"వివరణలలో సర్వవేదాంతసారం గోటిముద్దలలో అందించబడింది. దీనివలన ఆధ్యాత్మికగ్రంథాలను అవగాహనచేసుకునేశక్తి విశేషంగా పెరుగుతుంది. యదార్థంగా "అమ్మజీవిత మహోదధి తరంగాలు" "మాతృసంహిత", "అమ్మ- అమ్మవాక్యాలు", "అమ్మతో సంభాషణలు" నాలుగు వేదాలు. జిజ్ఞాసువులకు అమ్మ పెట్టిన జ్ఞానభిక్ష. అమ్మతాత్త్విక చింతనను వంటబట్టించుకోవాలనే సోదరీసోదరులకు ఈ వేదాలను అందించాలనే తపనతో పునర్ముద్రణ కార్యక్రమాన్ని చేపట్టాము. అమ్మ దయానిధి. ఆమె కరుణావీక్షణతో "అమ్మ-అమ్మవాక్యాలు" మూడు భాగాలను ఒకే పుస్తకంగా అందించగలిగాము. ఇప్పుడు "అమ్మతో సంభాషణలు" మూడు భాగాలను ఒకే పుస్తకంగా అందరికి అందుబాటులో ఉండాలనే ఉద్దేశ్యంతోమీముందు ఉంచుతున్నాము.

ప్రతి ఇంటిలో కనీసం నాలుగు పుస్తకాలైనా ఉండాలని నా కోరిక. సోదరీ సోదరులు ఈ సదవకాశమును వినియోగించుకొని అమ్మమాటలను మనన నిధి, ధ్యాసలద్వారా అనుభవించి అమ్మ రూపులుగ తీర్చిద్దిబడాలని ఆకాంక్షిస్తూ,

అమ్మ సేవలో
భవదీయ సోదరుడు
**బొప్పూడి రామబ్రహ్మము**

జిల్లెళ్ళమూడి
22-10-2001

# అమ్మను గురించి

## 1. మాటలు నేర్చావు!

"తాతమ్మా - నువ్వు తలుపులు వేసి చెబుతావే వాళ్ల కందరికీ? - నాకుకూడా చెబుతావా?"

'తప్పమ్మా, పెళ్ళయితేగాని పనికిరాదు.'

"పెళ్ళయితే చేయించేవారే చెబుతారుగా?"

'పెళ్ళయితే భర్తని అలా చూసుకోవాలి' అని శ్రీరామపట్టాభిషేకం బొమ్మని చూపించారు మరిదమ్మగారు.

'ఫొటోలాగా చూసుకోమంటావా? ఫొటోలోలాగా చూసుకో మంటావా?

ఫొటోలాగ చూడాలంటే గోడకి మేకు కొట్టి తగిలించాల్సిందే.

ఫొటోలోలాగా చూడాలంటే ఎప్పుడూ తొడ ఎక్కి కూచోవలసిందే గదూ?"

'నేర్చావు మాటలు మలప సన్నాసి!'

# 2. స్వామీజీ కోపం

(17-10-57)

1957లో సీతాపతిగారి అనారోగ్య కారణంగా అమ్మ బాపట్లకు వెళ్ళారు. అప్పటికి అమ్మను గురించి విన్నవాళ్ళు అక్కడికి వెళ్ళి చూసి వెళుతుండేవారు. ఆ రోజుల్లోనే అక్కడ ఉన్న స్వాములవారు అమ్మకు కబురు చేశారు, వారికి అమ్మతో మాట్లాడాలని ఉన్నదని - అమ్మ గృహిణి, వారు సన్యాసులు కనుక వారితో అమ్మ మాట్లాడుతారా లేదా అని.

దానికి అమ్మ ఈ విషయం తనకు చెప్పిన ఆమెతో అన్నారు. "అయితే వారు ఎక్కడ భిక్ష తీసుకుంటున్నారు?"

ఆమె : మా అందరి ఇళ్ళలో పుచ్చుకుంటారమ్మా. ఎవరు పిలిస్తే వాళ్ళ ఇంట్లో తీసుకుంటారమ్మా.

అమ్మ : (చిలిపిగా) మీరెవరూ? మీరూ గృహిణులేగా?

ఆమె : మేము సన్యాసులమయితే ఆయనకు భిక్ష ఎట్లా పెడతాము?

అమ్మ : గృహస్థుల ఇంటికి రావటానికి సందేహిస్తున్నట్లు కబురు చేస్తే అడుగుతున్నాను.

ఇంతలో కామేశ్వరమ్మగారు వచ్చి ఆ స్వాములవారిని తప్పకుండా రమ్మని మరీమరీ చెప్పారు ఆమెతో, అంతటి బాగ్యం కలిగినందుకు ఎంతగానో సంతోషిస్తూ.

కామేశ్వరమ్మగారి ఆహ్వానం అందుకొని తన శిష్యబృందంతో స్వామీజీ వచ్చారు.

ఆ రోజు అక్టోబరు నెల 17వ తేది. స్వామీజీతో వచ్చినవాళ్ళు, ఆ సన్నివేశాన్ని చూద్దామని వచ్చిన వాళ్ళు స్వామీజీ ఎదుట కూర్చున్న

అమ్మను చూసి త్రాచు ఎదుట ఉన్న కప్పపిల్లలా ఉన్నదనుకున్నారు. అంతా వారిద్దరి మధ్య జరగబోయే సంభాషణకోసం ఆతృతగా, ఆసక్తిగా ఎదురుచూసారు.

కానీ....

చిటికెలేస్తూ గొంతు ఒకసారి సవరించుకొని ఆ స్వామీజీ అడిగారు. 'ఏమిటమ్మా నీ సాధన?' ఆ కంఠంలో ధ్వనించిన అహంభావ అధికారాలకు ఒక లిప్తకాలం జనం ఉలిక్కి పడ్డారు.

కొన్ని క్షణాల తర్వాత అమ్మ అన్నారు నెమ్మదిగా.

"సర్వసాధారణమైనదే సాధన".

స్వామీజీ : ఆం ఏమిటీ?

అమ్మ : సర్వసాధారణమైనదే సాధన.

స్వామీజీ : మీరు ఆహారం ఏం తీసుకుంటారు?

అమ్మ : సర్వం సాధారణమే. అందులో ఈ ఆహారం కూడా ఉన్నది.

స్వామీజీ : అయితే నీకు ఇంతకూ సాధన లేదంటావు?

అమ్మ సమాధానం ఇవ్వలేదు. వారూ ఆశించలేదు. కనుకనే అమ్మ సమాధానాలతో నిమిత్తం లేకుండానే గంతులు వేస్తున్నట్లు ఒక దాని తర్వాత ఒకటి ప్రశ్నించసాగారు.

స్వామీజీ : నీ ఇష్టదైవం ఏమిటి?

అమ్మ : అయిష్టత లేనిదే ఇష్టదైవం.

స్వామీజీ : చూసేదంతా నీకు ఎట్లా కనబడుతుంది.

అమ్మ : చెట్లు చెట్లుగా, ఇళ్ళు ఇళ్ళుగా – దేని కదే కనబడుతుంది.

స్వామీజీ : అయితే అవన్నీ ఎక్కడనుండి వస్తున్నాయి?

అమ్మ : భూమిలోనుండి వస్తున్నట్లు కనబడుతున్నాయి.

స్వామీజీ : ఎట్లా? చెట్టుకు విత్తనముండాలి కదా. ఆ విత్తనం ఏర్పాటు చేసింది ఎవరూ?

అమ్మ : ఉన్నదే మొల్చింది.

స్వామీజీ : ఉన్నదే మొల్చింది అన్నావు. ఇవన్నీ ఎక్కడనుండి వచ్చాయి?

అమ్మ : ఒక చోటినుండి ఒక చోటికి రావటం అంటూ లేదు. ఎక్కడిది అక్కడే అంతటా ఉన్నది. ఎక్కడ ఏది ఉన్నదో అదే బయటికి వచ్చింది.

అమ్మ ఇచ్చే సమాధానాల తీరుకు వారికి బాగా కోపం వచ్చింది. గొంతు పెద్దదిచేసి అడిగారు.

'అయితే అద్వైతమంటే ఏమిటమ్మా? విశిష్టాద్వైతమంటే ఏమిటో తెలుసా? పోనీ విన్నావా?

అమ్మ వెంటనే ప్రక్కనే ఉన్న అరటిపండు తీసి పండు చూపింది. "ఇది అద్వైత మనుకుంటున్నాను". ఒలిచి తొక్కాపండూ వేరువేరుగా చూపించి "ఇది ద్వైత మనుకుంటున్నాను" అన్నారు.

స్వామీజీ : భూమి అన్నింటికీ ఆధారం అన్నావు, భూమికి ఏది ఆధారం?

అమ్మ : భూమికి భూమే ఆధారం.

స్వామీజీ : సరే భూమికి భూమే ఆధారం అన్నావు. నీ కెవరు ఆధారం అంటావు?

అమ్మ : నేనే.

స్వామీజీ : సంస్కారం ఉంది శాస్త్రజ్ఞానం లేదు. బాగా శాస్త్రం చదువుకో.

అమ్మ : శాస్త్రం అనుభవం ఇవ్వదు. అనుభవం శాస్త్రాన్నిస్తుంది.

హద్దులు దాటిన కోపంతో ఆ స్వామీజీ 'శాస్త్రం నీకోసమే పుట్టలేదు. అది ప్రమాణం' అంటూ వెంటనే లేచి వెళ్ళి పోయారు.

# 3.అమ్మకు కానుక

**(3-4-66)**

మధ్యాహ్నం అమ్మ వరండాలో కూర్చున్నారు. ఆనాటి నూతన ఆగంతకులు పూజచేసుకొని తీర్థప్రసాదాలు తీసు కుంటున్నారు. కొందరు తమ కష్టసుఖాలు చెప్పు కుంటున్నారు.

పదహారు సంవత్సరాలు గల ఒక అబ్బాయి బంగారు బొట్టు ఒకటి అమ్మకు ఇచ్చాడు.

అమ్మ : ఎందుకు నాన్నా?

ఆ అబ్బాయి మాట్లాడలేదు.

అమ్మ తిరిగి ఇవ్వబోతే 'వద్దు మీకే తెచ్చాను' అన్నాడు.

అమ్మ తిరిగి ఇవ్వబోతే 'వద్దు మీకే తెచ్చాను' అన్నాడు.

అమ్మ : (నవ్వి) ఎందుకు? పరీక్షకు వెళుతున్నావా?

విషయం అదే అయ్యేటప్పటికి ఆ విద్యార్థి కూడా నవ్వుతూ 'అవునమ్మా' అన్నాడు.

అమ్మ : ఇవ్వటానికి నీ పరీక్షకూ సంబంధం లేదు. ముందే చెబుతున్నాను. ఇది ఇచ్చావు కనుక రేపు తప్పితే బాధపడవద్దు. పాస్ అయినా తప్పినా దీనితో సంబంధం లేదు. నాకు బొట్టు ఇచ్చినా తప్పొచ్చు. ఇవ్వకపోయినా పాస్ అవ్వొచ్చు. ఇచ్చినంత మాత్రాన జరిగేదేమున్నది?

ఆ విద్యార్థి ఏం మాట్లాడలేదు. అమ్మ ఆ బొట్టు తీసుకున్నారు.

# 4. అమ్మకు జ్యోతిషము

**(2-7-65)**

అమ్మ పడుకున్నది. "తలుపు దగ్గర ఎవరో ఉన్నారు తలుపు దియ్యండి" అని అక్కడున్న కృష్ణశర్మ అన్నయ్యను చూచి "కృష్ణా - నువ్వేనా అక్కడ? లోపలికిరా" అని, కృష్ణశర్మ రాగానే ఆరోగ్యాన్ని గూర్చి పరామర్శచేసి, తనకేవో తెలియనివి కృష్ణశర్మ నడుగుతున్నట్లుగా మొదలుపెట్టారు.

అమ్మ : ఏంరా సాముద్రికంలో గ్రహాలు తెలుస్తాయా?

కృష్ణ : గ్రహబల మెంతవర కున్నదో తెలుస్తుంది.

అమ్మ : నీ జాతకం ప్రకారం నీకు జరుగుతున్నదిట్రా?

కృష్ణ : ఏమో, నేనంతగా చూడలేదు.

అమ్మ : ఎందుకులే అని వదిలేశావా?

కృష్ణ : సమాధానాలు అనేక రకాలుగా వస్తున్నాయి.

అమ్మ : పతంజలి వైద్యశాస్త్రం, యోగశాస్త్రం చెప్పాడు. జ్యోతిషం జోలికి రాలేదు.

కృష్ణ : ప్రతిగ్రహమూ ఫలప్రదమే కదా?

అమ్మ : ఈ మాట తీసుకోలేదుగాని, యీ విషయమే వచ్చింది. ఏదో ఒకటి అర్థమైనా, అన్నీ సమన్వయం చేసుకోవచ్చు. నేనెప్పుడూ శాస్త్రాన్ని అబద్ధమనీ, తప్పు అనీ అనను. ఏ జాతకాన్ని అయినా దగ్గరపెట్టుకుని అట్లా చూశావా?

కృష్ణ : మన మెంత?

అమ్మ : ఎందు కడుగుతున్నా నంటే మన కెంతవరకు తెలిసిందీ అని తెల్సుకోవటానికి

.... ....

కృష్ణ : .... .... .... .... .... ....

అమ్మ : నాన్నా- అసలు లగ్నమంటే ఏమిటి?

కృష్ణ : కలయిక.

అమ్మ : దేని దేని కలయికను లగ్నమని వాడుతున్నాం?

కృష్ణ : జననకాలంలో - భూమి, ఆకాశాలు తూర్పువైపున ఏ బిందువువద్ద కలుస్తున్నదో - దాన్ని లగ్నమంటారు.

అమ్మ : ఒకటికి, ఒకటి కలుస్తున్నది కాబట్టి ఇది లగ్నమైనది.

కృష్ణ : శరీరమూ, మనస్సూ కలయిక.

అమ్మ : మనస్సు బలంగా వుండి, శరీరం ఎందుకు బాధపడుతుంది?

కృష్ణ : తాను కారకుడు గనుక. లగ్నంపైన తాను కారకుడైనందు వలన.

అమ్మ : శరీరమూ, మనస్సూ కలిసిందే లగ్నమన్నావుగా.

కృష్ణ : పెద్ద చిక్కే వచ్చింది.

అమ్మ : నా చక్రం నువ్వేశావుగా?

కృష్ణ : పంచాగాన్ని బట్టి ఒక చక్రం, సూర్యసిద్ధాన్తరీత్యా ఒక చక్రం వచ్చింది. గ్రహస్థితి మార్పుగా వుంది. గ్రహస్థితిని బట్టి జరుగుతుంది. రెండింటికీ లగ్నం ఒకటే. కుజుడే కారకుడు.

అమ్మ : కారకుడంటే ముఖ్యుడనా?

కృష్ణ : నడిపించేవాడు. ఫలమిస్తే ఆత్మకారకుడిస్తాడు.

అమ్మ : ఏదిచ్చినా ఆత్మకారకుడే అనుకున్నప్పుడు.... నా చక్రం జైమినీసూత్రం ప్రకారం వేశావా?

కృష్ణ : గణితం కాదుగా.

అమ్మ : ఇన్ని వ్యాఖ్యానాలు చదివేకంటే, చక్కనిభాష వస్తే సూత్రాలను చదువుకుంటే - సరిపోతుంది.

దొడ్లోకి వెళ్ళి వచ్చి మళ్ళీ మొదలెట్టారు.

నా ఆకారంలో ఎందుకింత త్వరగా మార్పువచ్చింది.

# 5.అమ్మకు సభాహ్వానము

ప్రభాకర ఉమామహేశ్వరపండితులు అమ్మను దర్శించటానికి వచ్చారు. అంతటి పండితులు వచ్చారు, అమ్మతో ఎంతగా మాట్లాడుతారో - ఎన్ని సందేహాలు తీర్చుకుంటారో అనే కుతూహలంతో అందరమూ చేరాం. అమ్మ వచ్చే సమయానికి నిలబడ్డ ఉమామహేశ్వరపండిట్ అమ్మను చూస్తూనే నమస్కరిస్తూ నిలువునా కుప్పకూలిపోయారు. వణుకుతూ వెక్కివెక్కి ఏడ్వటం మొదలుపెట్టారు. వారికి మడితో భోజనం అమ్మ ఏర్పాటు చేయించారు.

భోజనానంతరం వారు - అమ్మను తిరిగి దర్శించారు. వారితో వచ్చిన బాపట్ల C.T.O. గారు ప్రస్తుతం తమ ఆగమన కారణాన్ని అమ్మకు ఎఱుక పరుస్తూ అన్నారు -

'రేపు బాపట్లలో ఉమామహేశ్వర పండితులుగారిని సన్మానిస్తారు. ఫంక్షన్ మొదలయ్యే వేళకు కారులో మిమ్మల్ని తీసుకువెళ్ళి ఒక గంట కాగానే ఆ టాక్సీలో తీసుకొచ్చి దింపుదా' మని.

"నేను వస్తే ఒక గంటలో తిరిగిరావటం ఎట్లా కుదురుతుంది నాన్నా? నేనంటూ కదిలితే మొన్న చీరాల వచ్చినట్లు వచ్చి ప్రతి ఇంటికి రాగలిగితేనే వస్తా నాన్నా. ముందు కూలీ నాలీ చేసుకునే వాళ్ళ దగ్గరకూ... చెంచులవాళ్ళ ఇళ్ళకూ, ఒకళ్ళని ఏమిటి? అన్ని ఇళ్ళకూ వెళ్ళగలిగితేనే ప్రయాణం అనేది పెట్టుకుంటా. డబ్బు కలవాళ్ళు కారు వేసుకువచ్చి తీసుకువెళతామంటున్నారు. కానీ రావాలని ఉండి రాలేని వాళ్లు ఎంతమందో! రాగలిగిన వాళ్ళు ఎటూ వస్తారు - చూస్తారు."

# 6.వచ్చే గీత

"నేను మన్నవలో భగవద్గీత చెప్పబోతున్నా."

"ఎప్పుడు ప్రారంభం?"

"రేపే మొదలు. మీ అన్నగారి ఊరేగా? మీరు వస్తారా అమ్మా?"

"నేను వచ్చేదాకా మీరు చెపుతుంటే సరి."

"ఎన్నిరోజుల్లో వస్తారు?"

"మీరు ఎన్నిరోజులు చెపుతారో మీకు తెలుసా?"

"గీత అయిందాకా చెపుతా."

"నేను 'వచ్చే గీత' వచ్చినప్పుడు వస్తా."

## 7. అభయం

'ఇక సెలవు తీసుకుంటా నమ్మా.'

వారికి అమ్మ ప్రసాదంతోబాటు తాను కట్టుకునే చీరెల్లో ఒక చీర ఇవ్వబోయారు.

'చీరెకు బదులా అమ్మా?' – అని ఆమె తీసుకోలేదు.

"ఆడపిల్లవి ఇంటికి వచ్చావు, పెట్టుకోవాలనుకున్నాను. పెట్టుకుంటున్నాను, తీసుకోమ్మా."

ఈసారి కూడా తీసుకోలేదు. పైగా ఒక పేచీపెట్టింది.

తనకు 'జ్ఞానమార్గంలో – ఆధ్యాత్మిక సాధనలో పైకి వెళ్ళగల' వని అమ్మ అభయం ఇస్తే తీసుకుంటా నన్నది.

అమ్మ రెండు, మూడు సార్లు అన్నా ఆమె ఇదేవిధంగా అంటూంటే – అది నావల్ల కాదు. నే నేం మాటలు ఇవ్వలేను. నువ్వు చీర తీసుకోక పోయినా నా కిష్టమే".

అన్నారు అమ్మ, తానూ పట్టుదలగా.

చీరె తీసుకోక తప్పలేదు ఆమెకు.

ఆమె : నన్నాశీర్వదించు మాతా.

అమ్మ : ఆశీస్సులకు మాటలతో పని లేదు.

# 8. ఇదంతా వాక్కే

ఒకరు : (కుటుంబ బాధ లేవో చెప్పి) ఇవి చాలా బాధగా ఉన్నాయి. వీటినుండి విముక్తి ఎప్పుడమ్మా?

అమ్మ : (చిరునవ్వుతో) నేనూ అదే ఆలోచిస్తున్నాను. నువు చెప్పుకుంటే కనీసం ఊరుకో నాయనా అనయినా అంటాను నేను. నేను ఎవరికి చెప్పుకునేది, నా బాధల గురించి?

అతను : (నవ్వి) మీకు బాధ లేమిటి? వచ్చినా మీరు తప్పించుకో గలరు. మీరేదైనా వాక్కు సెలవిస్తే....

అమ్మ : నేనేం వాక్కు ఇవ్వను? ... ఇదంతా వాక్కే.

అతను : సెలవు తల్లీ.

అమ్మ : పోయి-రండి.

# 9. అమ్మ ఏమైనా చెపుతారా?

సాయంకాలం 4-40 ని॥లకు అమ్మ హాల్లో కూర్చొని ఉండగా గదినిండా జనం ఉన్నారు. ఎవరో ఒక నూతన సోదరుడు వచ్చి అమ్మకు నమస్కారం చేసి కూర్చొని - 'అమ్మా ఎప్పటినుంచి మీరిట్లా?' - అని ప్రశ్నించాడు.

అమ్మ : శక్తులంటారా? చిన్నప్పుడు ఎలా ఉన్నాయో ఇప్పుడూ అట్లాగే ఉన్నాయి. ఎప్పుడూ ఒకటే. మార్పు నాలో లేదు. నన్నడిగితే ఏమీ లేదు. అంతటా ఉన్న దానిలో ఎవరెవరి ఇష్టదైవాన్ని వాళ్ళు చూస్తున్నారు కదా! గజంలో అంగుళాలు ఉన్నాయి గానీ అంగుళంలో గజం లేదు. నేను కొలతబద్ద అన్నది అదేగా. ఎవరిబద్ద ఎంతమటుకో అంతమటుకే.

సోదరుడు: ఇంతమందికీ మీలోనే ప్రత్యేకించి ఏం గోచరించిందంటారు?

అమ్మ : నాకు తెలియందీ వాళ్ళకు తెలిసిందీ. లడ్డుకు లడ్డు రుచేం తెలుస్తుంది? దానిని తింటే తెలియాలి. అంధ విశ్వాసం. అది అనిర్వచనీయం. ప్రశ్నకే సమాధానం ఉన్నది గానీ మనస్సుకు లేదు. సర్వానికీ మనస్సే. అదే దైవం, అదే జ్ఞానం, అదే అజ్ఞానం. మానుకోవాలంటే మానుకో నివ్వనిదీ - చెయ్యాలంటే చెయ్యనియ్యనిదే నిర్ణయం. అదే దైవం.

సోదరుడు: అమ్మా- గుర్తుంటామా మేము?

అమ్మ : మరుపంటూ ఉంటే జ్ఞాపకం ఉంటుంది.

సోదరుడు: ఇంతమంది పిల్లల్లో గుర్తు ఉండద్దా అని.

అమ్మ : గొఱ్ఱెలను కాసేవాడికి ఏ గొఱ్ఱెకా గొఱ్ఱె గుర్తు. ఏది ఎంతకు కొన్నాడో వాడికి గుర్తు. గొఱ్ఱెలవాడికి, గొఱ్ఱెలే గుర్తుండగా లేనిది కన్నతల్లికి బిడ్డలు గుర్తుండరా?

సోదరుడు: మీరు చదువుకోలేదంటారే - ఇంత లాజికల్‌గా ఎట్లా మాట్లాడుతున్నారు?

అమ్మ : లాజికల్‌గా అంటే నాకు తెలియదు. తెలుగులో చెప్పు.

సోదరుడు: ఇక్కడ తర్కం.

అమ్మ : ఎప్పుడూ జరుగుతుండేదేగా? తరగటమేగా తర్కమంటే.

సోదరుడు: అమ్మా! మా బాధ్యదంతా నీదే.

అమ్మ : సర్వ బాధ్యతలూ నాయందు వేస్తే ఇంకా బాధెక్కడిది?

ఇంకెవరో ఒక శ్లోకం చదివారు.

"శ్లోకం చదవగలిగారు కానీ, ఆ స్థాయి వారికి రాలేదుగా?" – అన్నది అమ్మ.

అక్కడున్న శేషగిరిరావన్నయ్య అందుకుని – 'ఇందులోకూడా జారుడేనా?' అన్నారు.

అమ్మ : అంతా జారుడే. ఇది జారుడు బాట –

అని కనకాంబరపు రేకుని తీసుకుని బూరా వాయించినట్లు గానూ, సన్నాయి వాయించినట్లుగానూ ఊదుతూ మాట్లాడుతున్నది.

"అంతా లేదన్నా సరే. పూర్తిగా ఉన్నదన్నా సరే. ఈ రెంటి స్థితి ఒక్కటే. 'అంతా అనంతశక్తి' అంటూ లేనిది ఏముంది? ఇది కాదు, ఇది కాదు – అంటూ అంతా 'ఒకటే' అనటం. పువ్వు విచ్చుతున్నది అనుకోండి. రెండు కన్నులూ దానిమీద పెట్టి చూసినప్పటికీ తెలీదు. విచ్చిన తర్వాత తెలుస్తుంది. కానీ వచ్చేటప్పుడు స్పందన, కదలికా – సంధి తెలియదు... దేవులాడినా దొరకని వాడే దేవుడంటాను. విగ్రహాలు పెట్టుకుంటున్నాం. కానిదంటూ లేదు గనుక – అన్నీ అదే గనుక ప్రతి పదార్థంలో శక్తి ఉన్నదిగా. కట్టెకు కాలే శక్తి ఉన్నప్పుడు, గిన్నెకు కాల్చుకునే శక్తి ఉన్నప్పుడే అన్నం ఉడుకుతుంది. ప్రతిదాంట్లో ఉన్న శక్తిని దైవంగా చూడటం కోసం మనవాళ్ళివన్నీ పెట్టారు. ఆధ్యాత్మికం, ఆచారం – ఆరోగ్యం అన్నీ ఒక దాంట్లోనే ఉన్నాయి" –

# 10. అమ్మ

విజయవాడనుండి వచ్చిన ఆ ముగ్గురూ క్రొత్తవారేమీ కాదు. నాలుగైదుసార్లు వచ్చారు. కూడా తెచ్చిన పళ్లూ - పూలూ అమ్మకు సమర్పించి కూర్చున్నారు. కొన్ని క్షణాల అనంతరం అందులో ఒక సోదరుడు 'అమ్మా! ఎప్పుడన్నా నేను మీకు గుర్తువచ్చానా? అన్నాడు.

అమ్మ : (చిరునవ్వుతో) ఇవ్వాల్టికి మూడు రోజులనాడు - చాల కాలమైనదే మీరు వచ్చి - అనుకున్నాను.

అన్నయ్య : (తృప్తిగా నిట్టూర్చి) మాకు నువ్వు మామూలుగా గుర్తుండవమ్మా. ఏదైనా బాధ కలిగినప్పుడు తప్పక గుర్తువస్తావు.

అమ్మ : ఎట్లా అయితేనేం నాయనా, గుర్తుండటానికి. ఆ రూపంలో నైనా జ్ఞాపకం ఉంటానుగా.

అన్నయ్య : అందరూ - అంటే కొందరు నీలో దైవత్వం చూడగలుగు తున్నారు. మరి నాకు చేతకావటంలేదమ్మా.

అమ్మ : దైవత్వమంటే?

అన్నయ్య : అమ్మను అమ్మగా కాక దైవరూపంలో చూడటం.

అమ్మ : నువ్వనుకునేది కాకపోతేగా? నువ్వేం బాధపడబోకు నాన్నా - అమ్మను అమ్మగా చూసినా చాలు. ఈ మధ్య జగ్గయ్యపేట నుండి ఒకావిడ వచ్చి రెండు రోజులున్నది. వెళ్ళిన తర్వాత మొన్న ఉత్తరం రాసింది - ఈ ఆవరణనూ ఇక్కడి పద్ధతులనూ విమర్శిస్తూ. ఆ ఉత్తరం చూచి కోపం వచ్చింది వీళ్ళకు. కాని ఆమె విమర్శిస్తూ రాసినా. ఈ రూపంలో నన్ను చూడగలిగిందిగదా - అంతే. అమ్మపటాన్నే పూజించినా అది శుక్రవారం పూజిస్తే లక్ష్మి అనీ, మరోవారం అర్చిస్తే మరో దైవం పేరూ పెట్టుకుంటారు. ఇక్కడ పూజ నాకే చేస్తున్నా - అమ్మ అని చేస్తున్నారా? లేదు. పార్వతి అనీ రాజరాజేశ్వరనీ ఏదో వాళ్ళ ఇష్టదైవ రూపాల్లో చూస్తుంటారు.

ఒక అబ్బాయి ఉన్నాడు నాన్నా, అతనికి అమ్మను దేవుడితో పోల్చటం కూడా ఇష్టం ఉండదు. ఒప్పుకోడు. రాముడూ - కృష్ణుడూ అవతారమూర్తులే అయినా అమ్మ పదానికి ఇచ్చిన నిర్వచనం అమ్మకే సరిపోతుందంటాడు.

కొందరు ఎవరి ఇష్టదేవతలను వాళ్లు చూసుకుంటే కొందరు కేవలం అమ్మగానే చూస్తారు.

ఇందులో ఏముందీ? అంతా దైవం అయినప్పుడు నువ్వు అనుకునే అమ్మ దైవం కాకుండా పోతుందా?

మరొక

అన్నయ్య : ఏమిటో నమ్మా, ఎంత ప్రయత్నించినా నాకు దైవంమీద విశ్వాసం కుదరటంలేదు. నాలో దైవభక్తి లేదమ్మా ఇంత వరకు. ఇక అమ్మమీదే కలగాలి.

అమ్మ : నీకు కలిగినా, కలగకపోయినా - నాకు నీమీద ప్రేమ ఉంటుంది.

అన్నయ్య : అంతకంటే ఏం కావాలి నాకు?

అమ్మ : నాకు మిమ్మల్ని దగ్గరకు తీసుకోవాలనీ, ఒళ్ళో పడుకోబెట్టు కోవాలనీ, పళ్లు పెట్టాలనీ, అన్నం పెట్టాలనీ తప్ప మరింకేమీ అనిపించదు నాన్నా! నేను అనుకుంటాను. మమకారం అనిపిస్తున్నది, మమకార మంటే మిమ్మల్ని దగ్గరకు తియ్యటం, మీరు కావాలను కోవటం, దీన్ని మమకారమనూ, అనురాగమనూ, అయితే నీ విరాగ మేమిటి? అనే వాళ్లతో నా పోట్లాట ఏమిటో తెలుసా? సర్వత్రా అనురాగమే విరాగ మని.

అన్నయ్య : మరి మమకారం అంటే స్వార్థంతో కూడినది కదా!

అమ్మ : ఏది కాదు స్వార్థం? తమకు కావాలనుకోవటమే స్వార్థం. ఇప్పుడు ఇదంతా నా స్వార్థం కాదూ!

# 11. అమ్మకు బాధ

అమ్మ : నాకు తలనొప్పిగా ఉంది. హైమను గురించిన ప్రతి చిన్న విషయమూ గుర్తు కొస్తుంటుందిరా.

డాక్టరుగారు: అమ్మగారికి కూడా బాధా? – అంటారమ్మా.

అమ్మ : అట్లా అనుకోవటానికి అలవాటుపడ్డారు. శరీరం అనేది ఉన్న తర్వాత అన్నిరకాలూ ఉంటాయి.

భరద్వాజ: 'ఆమెకు బాధేమిటి' – అంటాడు ఒకడు. 'ఎక్కడ ఏమి జరిగిందోలే ఇక్కడ అనుభవిస్తున్నది' – అనుకుంటాడు ఇంకొకడు. 'ఎవరిదో' – అనుకుంటాడు మరొకడు. 'శరీరం ఉన్నదికదా మనతోపాటు అనుభవిస్తుందిలే' అంటాడు మరొకడు. ఈ నలుగురి నాలుగు భావాలు నిజమేనా! నిజంగా నువ్వు బాధపడేది ఏభాగం?

అమ్మ : ఒక నిజమే నలుగురికి నాలుగు విధాలుగా కన్పడుతుంది.

భరద్వాజ: ఒకటే నాలుగయిందా?

అమ్మ : మామిడికాయ తిన్నాము. వేడి చెయ్యటం ఒక నిజం. జీర్ణం కాకపోవటం మరొక నిజం.

డాక్టరుగారు : అయితే మీరు బాధపడట మనేది నిజం.

అమ్మ : శరీరం ఉంది కనుక నిజం.

డాక్టరుగారు : మీ బాధలు ఎందువల్ల కలుగుతాయి?

అమ్మ : మనస్సువల్ల – మనస్సువల్ల కలుగుతాయి,

మనస్సువల్లనే పోతాయి. మీకు కనపడకపోయినా బాధ పడటం ఉంటుంది. నేనిట్లా చెయ్యి - అన్నాననుకో. బాధవల్ల అన్నానని - మీరు అనుకోకపోవచ్చు. 'ఎందుకో అన్నది' అనుకోవచ్చు.

డాక్టరుగారు: ఎవరిదో జబ్బు లక్షణం అనుకోవచ్చు.

అమ్మ : ఎవరిదో కాదు. నా జబ్బు లక్షణమే. ఎవరిదనీ నేననలేదు. నాది నేను అనుభవిస్తున్నాను.

భరద్వాజ: తీసేసుకుంటే పోతాయిగా ఎందుకు బాధపడటం!

అమ్మ : వద్దనిపిస్తేగా తీసెయ్యడానికి? అందరితోపాటు అవీ ఉన్నాయి.

అంటూ స్నానానికి లేచింది అమ్మ.

# 12. మీరు వెలిసారా?

**20-5-64,** చీరాలనుండి మధ్యాహ్నం నలుగురు విద్యార్థులు వచ్చారు. అందులో పన్నెండు సంవత్సరాలు ఉన్న ఒక అబ్బాయి అమ్మను ఏవో అడగాలని అడగలేక సందేహిస్తున్నాడు. అమ్మ అది గ్రహించి "నీకు ఏదైనా అడగాలని ఉంటే అడుగు నాన్నా" అన్నది.

విద్యార్థి : మీరు వెలిసారా? లేక ఏ మునీశ్వరులో మల్లే సాధన చేసి ఇంత గొప్పవారు అయ్యారా?

అమ్మ : (చిరునవ్వుతో) నాకు తెలియదు నాన్నా. అసలు గొప్పతనమేమిటో, అది ఉందో లేదో కూడా తెలియదు.

విద్యార్థి : గొప్పతనం లేకపోతే మరి ఇంతమంది ఎందుకు సేవిస్తారు? పూజిస్తారు?

అమ్మ : నాకు తెలియదు నాన్నా. వాళ్ళనే అడుగు. లేదా నువ్వే కనుక్కో. నాలుగురోజులు ఇక్కడే ఉండి నా గొప్పతనానికి కారణమేమిటో?... ఏం ఉంటావా!

విద్యార్థి ఏం మాట్లాడలేదు.

వాళ్ళు వెళ్ళాక అమ్మ అన్నది – "అది వాడి సందేహం కాదు. ప్రక్కవాళ్ళు వాడిచేత అడిగించారు. కానీ అలా నిర్భయంగా అడగటం, వెధవ ఎంత ముద్దువచ్చాడో!"

# 13. అమ్మ సంగతులు

15-2-68 రాత్రి 7 1/2 గంటలకు అబ్బరాజు సీతారామ చంద్రమూర్తి. ఆయన భార్య హేమలత, కొడుకు వచ్చారు.

'మీరు ఆహారమూ - నిద్ర వర్జించి ఎంత కాలం అయింది?' - అని సీతారామచంద్రమూర్తిగారు అడిగారు.

"నేనేదీ వర్జించలేదు. ఆహారమూ వర్జించలేదు. నిద్రా వర్జించలేదు" - అన్నది అమ్మ.

"మిమ్మల్ని గురించి మీరేమనుకుంటారు?" అని అడిగారు సీతారామచంద్రమూర్తిగారు.

"నేను నేననే అనుకుంటాను. మీరైన నేనని అనుకుంటాను" - అన్నది అమ్మ.

'మేము ఉదయాన్నే కాఫీ త్రాగకుండా ఉండలేము. మీకు మాలాగా ఉండదుగా!"

"నేనూ త్రాగుతున్నాను నాన్నా కాఫీ. కాకపోతే త్రాగాలని కానీ వద్దని కానీ లేదు."

'మీరేమయినా ధ్యానం చేస్తారా?'

"మీ ధ్యానమే."

'ప్రత్యేకంగా భగవద్ధ్యానమని గానీ ఏదయినా చేస్తారా?'

"కనబడేదంతా కాదనుకుంటే గదా! మీరంతా ముగ్గురు నలుగురు పిల్లలకోసం అంత తాపత్రయ పడతారు గదా. మరి నేను మీ అందరికోసం. నాకు ఎప్పుడూ మీ ధ్యాసే! ధ్యాసంటే ధ్యానమే."

"భగవంతుని గురించి మీ అభిప్రాయ మేమిటి?

"భగవంతుడంటే?"

విద్యార్థి ఏం మాట్లాడలేదు.

"భగవంతుడు వేరుగా ఉన్నాడని అనుకోను. కనపడేదంతా భగవంతు డనే అనుకుంటాను. అంతటా నిండి ఉండి అన్ని రూపాలలో ఉన్నాడని అనుకుంటాను. నేనెప్పుడూ ప్రత్యేకించి భగవంతుడికి పూజ చెయ్యలేదు. చిన్నప్పుడూ అంతే...... ఇక్కడకు వచ్చిన తరువాత కూడా (అత్తవారింటికి వచ్చిన తరువాత). మామూలుగా ఇంటిపనులు చేసేదాన్ని. అత్తగారు చెప్పిన పనులన్నీ చేసేదాన్ని. అంతేగాని ప్రత్యేకించి పూజలూ, ధ్యానం ఏమీ చెయ్యలేదు."

'అయితే విగ్రహారాధన గురించి మీ అభిప్రాయమేమిటి?'

"నిగ్రహం కోసమే విగ్రహారాధన. ఏ విగ్రహానికయినా ఆరాధన చెయ్యొచ్చు."

'మీదగ్గర ఉన్నవాళ్ళకు ప్రత్యేకించి విగ్రహారాధన అక్కరలేకపోవచ్చు.'

(మధ్యలో నరసింహమూర్తిగారు కలుగజేసుకొన్నారు.)

'అమ్మకు దూరమేమిటి?' అన్నారు.

"నాకు లేకపోవచ్చు. అతనికి ఉందిగా."

'ఏదో మహత్తు లేకపోతే జనమంతా ఇట్లా రారు' - అని అన్నారు సీతారామచంద్రమూర్తిగారు.

"ఆ మహత్తు మీలోనే ఉంది. అది మహత్తరమయినదని గుర్తించిన మహత్తు మీలోనే ఉంది. పిల్లవాడికి జ్వరం వచ్చింది - తగ్గుతుందనే రావచ్చు. ఆ నమ్మే శక్తి - ఆ నమ్మకం మీలోనే ఉంది."

'అయితే... ఇక్కడకు రావాలని ఏముంది?'

"నా దృష్టిలో ఎక్కడికయినా పోవచ్చు. ఎక్కడయినా ఒకటే. ఇక్కడకు రానివాడూ వచ్చేవాడూ ఒకటే. కాకపోతే, ఇక్కడకు రానివాడికి, వచ్చేవాడు చెప్పే తీరు వేరుకావచ్చు."

'అయితే ఏనామం చెయ్యనివాడుకూడా ఇక్కడ ఈ నామం చేస్తాడుగా.'

"ఏ నామం చేసినా నా నామం చేసినట్లే. చివరకు మృత్యువుకూడా దేవతే."

'అయితే మీదృష్టిలో అంతా దైవస్వరూపమే?"

"అంతే నాన్నా. రూపం తేడా. అంతేగానీ అన్నీ దైవమే. అన్నం రూపాంతరం పొందితే అశుద్ధమవుతుంది. ఒకచోట ఉన్న అశుద్ధాన్ని రోజూ వెళ్ళి చూస్తుంటే క్రమంగా దానిలో పురుగులు పుడతాయి. అక్కడిదాకా ఎందుకు? కురుపులో లేవూ పురుగులు? అంతా సజీవమేగా!"

'అది తెలుసుకోవాలమ్మా. మీకీ ఆలోచన ఎప్పణ్ణించి?'

"నాకు (అతని బిడ్డని చూపుతూ) అంతపిల్లప్పుడే ఆలోచన కలిగింది. ... ఇంకా ముందే."

# 14. అమ్మతో ఇంటర్‌వ్యూ

1966లో మేనెల 20వ తేది. ఆ రాత్రి ఉన్నతవిద్యల నభ్యసిస్తున్న ఓ ఆరుగురు విద్యార్థులు నందూరునుండి వచ్చారు. అందులో ఇంజనీరింగ్ మూడవ సంవత్సరం చదువుతున్న ఒక సోదరుడు అమ్మతో దాదాపు రెండు గంటలపాటు సంభాషించాడు. ఆ మాట్లాడే సమయంలో అతనెక్కడా తడుముకోలేదు. తనకు తోచినవి తోచినట్టు నిర్భయంగా సూటిగా అడిగాడు. ఆ అన్నయ్య ప్రశ్నించిన తీరుకు అమ్మ సరే - శ్రోతలుకూడా ముగ్ధులయ్యారు. ఆ ప్రసంగంలో....

అన్నయ్య : మీరు హిందూమత ధర్మాన్ని ఆచరిస్తారా?

అమ్మ : ప్రత్యేకించి ఒక మత ధర్మమంటూ ఆచరించేదేమీ లేదు.

అన్నయ్య : భగవంతుడు నిరాకారుడు - నిర్గుణుడు అని అంటారుకదా? మరి మీరు స్త్రీరూపంలో గుణాలతో కనిపిస్తుండగా మిమ్మల్ని అంతా భగవంతుడు అంటుంటే - ఎట్లా అంగీకరిస్తారు?

అమ్మ అతని ఆవేశానికి నవ్వి అన్నది.

"మీరు నన్ను ఏది అంటుంటే కాదన్నాను కనుక ఈ విషయంలో కాదనమంటావు నాన్నా? భగవంతుడు అన్నది నువ్వు పెట్టిన పేరు. కానీ ఆ శక్తికి స్త్రీ పురుష భేదం లేదు నాన్నా. అది భగవంతుడనే కాదు. ఇంకా ఏ పేరైనా పెట్టు. ఉన్నది ఒకటే. దాన్నే సైన్సు స్వభావం అంటే ఆధ్యాత్మికం దైవం అంటుంది.

నిరాకారుడు అంటే అన్ని ఆకారాలు తానైనవాడు. నిర్గుణుడు అన్నా అంతే - అన్ని గుణాలు తానైనవాడు."

అన్నయ్య : (చివర్లో) మీరు ఇక్కడే ఉండదల్చుకున్నారా జీవితాంతం?

అమ్మ : తెలియదు నాన్నా. ఎప్పుడు ఏది జరిగితే అది అనుభ వించడమే తెలుసు.

అమ్మ : మీరు ఇచ్చే సందేశం ఏమిటి?

అమ్మ : ఏది జరిగినా ఎవరు చేసినా మనం కాదు చేసేది, మనని నడిపించే శక్తి మరొకటి ఉన్నదనుకోవటమే.

ఇదే ఆ అన్నయ్య అడిగిన చివరి ప్రశ్న. ఆ తర్వాత మరేం ప్రశ్నించలేదు. ఆ పూటే సెలవు తీసుకుంటామన్నారు అంతా. అమ్మ భోంచేసి వెళ్ళమని తీర్థప్రసాదాలు ఇచ్చింది. వాళ్లు వస్తూ ఒక పండైనా - పువ్వు అయినా తీసుకురాకపోయినా వెళ్ళేటప్పుడు ప్రసాదంతో తమ చేతులు నింపిన అమ్మవంక చూస్తూ అందులో ఒకరు ఏదో అనబోయారు. "మీరు వెళ్ళి భోంచేయండి" అంటూ అమ్మ లోపలికి వచ్చింది.

# 15. ప్రశ్న చెప్పాలా?

**(26-6-67)**

దాదాపు నెలరోజులు క్రితం గుడివాద నుండి 'స్వరూపానంద' అనే స్వామీజీ ఇక్కడకు వచ్చారు. వారు ప్రత్యేకించి అమ్మతో ఎప్పుడూ మాట్లాడలేదు. కానీ ఎప్పుడైనా సంభాషణలు జరుగుతున్నప్పుడు వారు కూడా ఆ సమయానికి అక్కడ ఉంటే ఏదైనా ప్రశ్నిస్తుంటారు. నేడు అదేవిధంగా సంభాషణ జరుగుతున్నప్పుడు భరద్వాజ అంతకుముందు స్వామీజీ తనతో చెప్పిన వారి సందేహాన్ని అమ్మకు చెప్పారు.

'ఇందాక వారు ఒకటి అడిగారమ్మా – 'ఏవరయినా మా అమ్మాయి పెళ్ళి విషయం చెప్పండి – అని కానీ ఇంకా ఏవైనా విషయాలు చెప్పమనీ వచ్చినప్పుడు ... అమ్మ "నాకు తెలియదు" అంటారు. తెలిసికూడా చెప్పకపోవటం అసత్యం కాదా? అని.'

అమ్మ : ఏం తెలిసి?

భర : వాళ్ళకు ఏం జరగాల్సి ఉన్నదో అది తెలిసి.

అమ్మ : ఎందుకంటే వాళ్ళకు జరిగే రోజు నిర్ణయించి ఉన్నది. ఈ మాటలతో పనిలేదు అనుకుని, ఈ చెప్పాల్సిన అవసరం నాకు లేదు. నేను అబద్ధాలాడుతున్నా నన్నా – నాకు భయం లేదు. నేను ఆడతాను – వాటికి వెరవను. నేను నిద్రలేచి పడుకోబోయేలోగా ఏమీ తెలీదంటేనే ఇట్లా ఉంటుందే...

ఇది వ్యాపారం. వ్యాపారం అంటే ఇది దుకాణం అనుకుంటున్నారు. కనుక ఏం సరుకులు ఉన్నాయని అడుగుతారు. ఏం లేదంటే – ఒకరికి పదుగురు చెప్పుకుని (ఇక్కడికి) రారు. వాళ్ళు ఇంకోచోటుకి వెళ్ళినా ఇక్కడికివచ్చినా ఎక్కడికి వెళ్ళినా – ఉన్నది ఒకటే.

స్వా : (నవ్వి రాఘవయ్యగారితో) ఇందాక మీరు చెప్పింది తృప్తికరంగా లేదు. ఇప్పుడు చెప్పింది సంతృప్తి కలిగించింది.

# 16. అమ్మ కిరీటం

(25-11-64)

పాలకొల్లునుండి తరుచుగా ఇక్కడకు వచ్చే ఒక అన్నయ్య ఎప్పుడు వచ్చినా అమ్మతో తగాదా వేసుకుంటాడు. అంటే అట్లా తప్ప వారికి మాట్లాడటం సాధ్యంకాదు. ఆ ఆవేశంలో ఏం మాట్లాడుతున్నారో ఎట్లా ప్రవర్తిస్తారో వారికే తెలియదు. అది కేవలం అమ్మ దగ్గర మాత్రమే. వారు ఉదయం వచ్చారు.

కొన్ని క్షణాలు ఆగి -

అన్నయ్య : మీరు పూజలు చేస్తుంటారా?

అమ్మ : పూజించటం అంటే మీరు కావాలనుకోవటమే.

అన్నయ్య : మీరు ప్రార్థన చేస్తుంటారా?

అమ్మ : (చిరునవ్వుతో) ఆc.... మీరంతా నేను అనుకోవటమే నాప్రార్థన.

అన్నయ్య : ద్వైతాద్వైతాలకు తేడా ఏమిటి?

అమ్మ తన పాదాలమీద ఉన్న మల్లెపూవునొకదాన్ని తీసి చూపించి తర్వాత దాని కాడను త్రుంచి -

"ఇది ద్వైతం - రెండూ కలిసి ఉన్నప్పుడు అద్వైతం-" అన్నది.

అన్నయ్య : నాకు వ్యక్తి పూజమీద నమ్మకంలేదండీ.

అమ్మ : మంచిదే నాన్నా. నీకు దేనిమీద నమ్మకం ఉంటే - అదే పూర్తిగా చెయ్యి.

అన్నయ్య : పునర్జన్మను గురించి మీరేమంటారు?

అమ్మ : దాన్ని గురించి నేను మాట్లాడను. నాకు ఆలోచన లేదు దాన్ని గురించి.

అన్నయ్య : అయితే జన్మలు లేవంటారా?

అమ్మ : నాదృష్టిలో లేవు. ఈ జన్మలోనే ఎదురుగా ఉన్నదాన్ని గురించే అర్థం రావటం లేదు. ఇంకా జన్మలదాక ఎందుకు?

ఈ జన్మలో ఏదో పాపం చేస్తే, వచ్చే జన్మలో అనుభవిం చాలనే భయం కొద్దీగా వీటి గురించి ఆలోచన? పోనీ జన్మలు ఉన్నా యనుకుందాము. ఉన్నాయనుకుంటే పాపం చెయ్యకుండా ఉంటాడా? మంచిపనులే చేస్తాడా? జన్మలు లేవు అనుకో - నిర్భయంగా పాపం చెయ్యగలడా? నీకు పాపం లేదంటాను. ఏది జరిగినా బాధ్యత నాది అని కత్తి ఇచ్చి ఓ పదిమందిని చంపి రమ్మంటే నువ్వు చంపగలవా? చంపలేవు. పాపం లేదని అంటున్నానుగా. అయినా నువ్వు చంపలేవు.

ఏదీ నువ్వు చెయ్యలేనప్పుడు ఏదో శక్తి నిన్ను నడుపు తున్నప్పుడు - ఇంకా పాపపుణ్యాల గురించి, జన్మల గురించి ఆలోచన ఎందుకు?

అన్నయ్య : సృష్టికి నాశనం లేదా?

అమ్మ : నా దృష్టిలో లేదు. సృష్టికి రూపాంతరం తప్ప నాశనం లేదు.

# 17. అమ్మకు అమ్మా?

(28-4-68)

వెల్లటూరు దగ్గరున్న తిప్పలకట్టనుండి ఆ సాయంత్రం వచ్చిన సోదరులలో ఒకరు అమ్మను ప్రశ్నించారు.

'మిమ్మల్ని అందరూ అమ్మ అంటున్నారు. మీరు ఎవరికి అమ్మ?'

అమ్మ : నా పిల్లలకు.

అన్నయ్య : మీ పిల్లలు ఎవరూ?

అమ్మ : అందరూ.

అన్నయ్య : అందరూ అంటే వాళ్ళంతా మిమ్మల్ని అమ్మగా గుర్తిస్తున్నారా?

అమ్మ : వాళ్ళు గుర్తించినా లేకపోయినా - నేను వాళ్ళనందరినీ పిల్లలగానే గుర్తిస్తున్నాను. కనుక నేను అమ్మనే.

అన్నయ్య : మీరు మానవులకేనా లేక సమస్త ప్రాణికోటికీ అమ్మేనా?

అమ్మ : నాకు పిల్లలు కానివి కనిపించటం లేదు. నా దృష్టిలో అంతా పిల్లలే.

అన్నయ్య : ఇతర వ్యవహారాలలో పడి తల్లిని మరచిపోవటం బిడ్డ స్వభావం. అయినా తల్లికి బిడ్డ మరపురాదుగా అమ్మా?

అమ్మ : తల్లికి ఎప్పుడూ రాదు. అసలు తల్లి స్వభావం ఎట్లా ఉంటుందంటే బిడ్డ బురద పూసుకు వచ్చినా ఇంకా ఏం పూసుకువచ్చినా సరే అసహ్యించుకోకుండా ఆ బురదను కడిగి వాడిని శుభ్రపరచటమే.

అన్నయ్య : అయితే బిడ్డ కోరిందెల్లా తల్లి ఇస్తుందా? వారు తనకు అపకారం చేసే వస్తువు అడిగినా తల్లి యిస్తే - అది ప్రేమ ఎట్లా అవుతుంది?

అమ్మ : వాడు అడిగిందల్లా ఇవ్వదు. వాడికి అవసరమైనదని తనకు తోచిందే ఇస్తుంది. వాడికి అవసరమైనది వాడికంటే తల్లికే ఎక్కువగా తెలుస్తుంది.

అన్నయ్య : (కాసేపాగి) మీ అమ్మగారికి కూడా మీరు అమ్మేనా?

అమ్మ : మా అమ్మ అమ్మే. నేనూ అమ్మనే.

అన్నయ్య : అంటే మీ అమ్మ మీకు అమ్మ, మీరు ఆమెకు అమ్మ – అనా?

అమ్మ : అంతే. కాని నాన్నను 'నాన్నా' అని పిలిచినట్టు అమ్మను 'అమ్మా' అని పిలిచే అవసరం అవకాశం లేకపోయింది.

నేను అందరికీ అమ్మనే కనుక ఆమెకూ అమ్మనే. కాని రంగమ్మగారి కడుపున నేను పుట్టాను కనుక ఆమె నాకు అమ్మే. ఆమె కూతురునే నేను. నాకు ఆమె కూతురే. అది ఆమె ఉంటే తెలిసేదేమో, నాన్న పిలిచాడు కదా 'అమ్మా' అని.

అన్నయ్య : (ఆశ్చర్యంగా) మీ తండ్రిగారా!!

అమ్మ : అవును నాన్నా. ఆయన తండ్రిగారి ఆబ్దికం పెడుతున్నప్పుడు భోక్తను, పురోహితుడిని – అన్నీ నేనే కావాలన్నారు.

అనంతపద్మనాభస్వామి వ్రతంనాడు "నేనే అనంత పద్మనాభుడిని" అంటే గాని వాయనం ఇవ్వలేదు. ఆయన నాకు పూజ చేశారు. మీరు ఎట్లా పాదాలు కడిగి చేస్తారో అట్లాగే చేశారు.

అన్నయ్య : అప్పుడు మీకు ఎట్లా ఉన్నది?

అమ్మ : అసలు ఆ ఆలోచన ఉంటేగా? మీరు కడుగుతున్నప్పుడు ఎట్లా ఉన్నదో అప్పుడూ అంతే, మిమ్మల్ని ఎట్లా నాన్నా అని పిలుస్తున్నానో ఆయననూ అంతే. నాకు ప్రత్యేకత ఎప్పుడూ లేదు.

అన్నయ్య : మీరు వారి కడుపున పుట్టారు కనుక 'అమ్మ' అని 'నాన్న' అని పిలవటమేకాని మీకు వాళ్ళు కూడా పిల్లలే అన్నమాట.

అమ్మ : అంతే నాన్నా.

అన్నయ్య : మీ దర్శనానికి మేము వస్తున్నాము. అంటే మీరు రప్పించుకోవటమా? మేము రావటమా?

అమ్మ : మీరే వచ్చారు అనుకుంటున్నాను. ఇక్కడికి రావాలంటే రైలెక్కి, బస్సెక్కి నడచివస్తున్నారు కదా, అది కనపడుతున్నప్పుడు మీరే వచ్చారు అనిపిస్తుంది.

అన్నయ్య : మరి మీరు రప్పించుకున్నారు అనేది ఎట్లా తెలుస్తుంది?

అమ్మ : మీరు రావాలనుకున్నప్పుడు రాలేకపోవటం. రాలేనని నిరాశపడుతున్నప్పుడు అకస్మాత్తుగా రావటం.... ఇట్లాంటి అనుభవాలు తెలియచేస్తాయి- మనం చేస్తున్నది ఏమీలేదని. ప్రయత్నం అర్థమైనంతగా ప్రేరణ ఎప్పుడూ అర్థం కాదు.

# 18. అమ్మ స్వగతం

(29-4-1962)

సాయంత్రం 5 గం॥ లప్పుడు అమ్మ - హాల్లో మంచంమీద పడుకున్నది. ఈ ఊళ్ళోని ఆయుర్వేదిక్ డాక్టర్ సాంబయ్య, వలివేరురెడ్డిగారు ఇంకా ఎవరో ఇద్దరు కొత్తవాళ్ళు కూర్చున్నారు. అమ్మ సాంబయ్యను చూస్తూ - 'ఈ వూళ్ళో వాళ్ళ కిదొకటి కలిగిందిరా. 'ఈమె దాటిన తర్వాత ఈ ఇళ్ళల్లో ఎవరుంటారు. అని, పైగా మొన్న మంత్రిణితోటి వచ్చి నాయన ఆంధ్రదేశంలోకల్లా ఇది మహాక్షేత్రమౌతుందని చెప్పారు. నీళ్ళు లేవు - ఇంత మొండికేసుకున్న దేమిరా? ఈ కప్పలు చచ్చే నీళ్ళు తాగుతుండాల్సిన పనేంటీ?....డ్రైన్ కాలువదాకా ఇళ్ళు పడితే, అక్కడ్నుంచి నీళ్ళు తెచ్చుకుంటే అదే జీవనదైతే...." అనగానే -

సాంబయ్య: ఎటూ జీవనదేగా.మానవరూపం ఉండడంతో అను కుంటారు.

అమ్మ : రూపం ఉన్నా లేకపోయినా - శుభమూ అశుభమూ జరిగేదే క్షేత్రం. (అందరివీ)

సాంబయ్య వాళ్లు కొంచెం సేపు కూర్చుని వెళ్లిపోయారు. అమ్మ పందిట్లో వున్న బల్లమీద కొచ్చి కూర్చుని - అయిదారుగురు అన్నయ్య లక్కడుంటే వాళ్లతో కబుర్లు చెబుతున్నది.

"అందరూ తలా ఒకచోట ఉన్నారు. వీళ్ళందరూ ఒకచోట ఉన్నారు. అందరి తలలూ ఒకచోట ఉన్నై. అందరి తలంపులూ ఒకచోట వున్నై. తను మూల మిదం జగత్తు. తాను లేకపోతే ఏమీ లేదిక్కడ. "నే ననే నేను, నేనని తెల్సుకున్న నేను, తెలుసుకోబడే నేను, తెల్సుకోటానికి ప్రయత్నించే నేను, నేనైన నేను."

అని ఇంకా చెబుతున్నది.

"నిప్పు నిప్పే. మంట అంటూ వున్న చోట పొగవస్తుంది. ఇవతల స్వచ్ఛంగా వున్నప్పుడు అవతల దాని రిఫ్లెక్షన్. బింబ ప్రతిబింబ న్యాయం - బింబం ప్రతిబింబం కావాలంటే మాలిన్యం కావాలి. ఒక వస్తువుయొక్క రూపాంతరమే భిన్నత్వం. భిన్నత్వం వున్నప్పుడే పరిణామం. సమిష్టి వ్యష్టి కావటమే సృష్టి. మాయ అంటే ఆవరింపబడ్డది, ఉన్నది వున్నట్లుగా కనబడనిది.

కదిలే శక్తి కాలు; కదలని శక్తి చెప్పు.

రూపాంతరాలు తప్ప భిన్నత్వం లేదు. అదే పరిణామం. మనస్సుకే భిన్నత్వం. భిన్నత్వం లేని మనస్తత్వమే దైవత్వం. దైవత్వం అంటే నాలుగు చేతులూ, కిరీటమూ కాదు.

రూపాయలు పెట్టి భూమి కొంటున్నాం. భూమిని అమ్మి డబ్బు తీసుకుంటున్నాం. డబ్బు మాత్రం చేతులు మారుతుంది గాని భూమి అక్కడే ఉంటుంది. భిన్నత్వం అంటే హెచ్చు తగ్గే. నా మనస్సు సరిగ్గా లేదు - అంటాడు కాని, నేను సరిగ్గా లేననటం లేదు. నేతి, నేతి - నేను ఇది కాదు ఇది కాదు - అంటూ అంతా నేను కావాలి. శరీరంలో ఏ చిగురంటినా నేను బాధపడుతున్నాను గాని ఒక చేతి కొస్తే మరొక చెయ్యి బాధ పడుతుందా? ఎవరి కొచ్చినా నేను బాధపడాల్సిందే."

- అంటున్నది,

అప్పుడే పనినుంచి వచ్చిన పిల్లలంతా నామం చేస్తూ అమ్మ చుట్టూ చేరారు.

# 19. ఆశా - అసంతృప్తి

**(11-11-1967)**

ఒకసారి .... ఏదో ప్రసంగంలో "ఆశా-అసంతృప్తి ఈ రెండూ కలసి జీవితమైనది" అన్న అమ్మ సూక్తిని గురించి సోదరుడు లక్ష్మీనారాయణ అడిగాడు.

'మాకు సరే' నీ జీవితానికి కూడా వర్తిస్తుందా?'

అమ్మ : మీతో ముడిపెట్టుకున్నప్పుడు అంతేగా.

అన్నయ్య : నీకు ఆశా – అసంతృప్తి ఏమిటి?

అమ్మ : మీరు కావాలి అనుకోవటం ఆశ. ఈ పిల్లలందరికి కావాల్సినంత పెట్టుకోలేక పోయానే అన్నది అసంతృప్తి. ప్రపంచంలో ఎవరూ దరిద్రం అనుభవించకూడదు. అందరూ హాయిగా తిని తిరగాలన్నది ఆశ.

అన్నయ్య : జరుగుతుందా ఎప్పటికైనా అది? నువ్వు గట్టిగా అనుకుంటే తప్పకుండా జరుగుతుంది.

నీ చేతిలో పనే గదా?

అమ్మ : జరిగిననాడు ఆశ ఏముంది?

నాకు ఆశ లేకుండా పోయిన రోజు అట్లా జరుగుతుంది.

అన్నయ్య : ఆశ ఎప్పుడు పోతుంది?

అమ్మ : సృష్టి ఆగాలికదా!

# 20. అన్నీ వాడికున్నవే

**(9-8-67)**

చీరాలలో ఉద్యోగం చేస్తున్న రోజుల్లో ఇక్కడికి తరచుగా వస్తుండేవారు. ప్రస్తుతం కటక్‌లో ఉద్యోగం చేస్తున్న భీమరాజు ప్రసాదరావు అనే అన్నయ్య. ఇప్పుడు ఇక్కడికే కాదు ఈ ప్రాంతానికి రావటమే అనుకున్నప్పుడల్లా కుదరటంలేదు. వారు ఈ రోజు వచ్చారు. తిరిగి సాయంత్రం వెళ్ళారు, వెళ్ళేముందు వారు అమ్మని ఒక ప్రశ్న అడిగారు. "మీరు పోతుకూచి రవి చనిపోయినప్పుడు ఏడ్చారటకదమ్మా! ఒకసారి మీరే "నేను పెళ్ళి ఎట్లా చేస్తానో, చావూ అట్లాగే చేస్తాను" అన్నారుగా మరి?'

అమ్మ : ఇప్పుడు మాత్రం కాదన్నది ఏమున్నది? చచ్చిపోయినప్పుడు ఆ శవాన్ని పడేసి రావొచ్చు. అక్కడ జరిగేదంతా నిశ్చలంగా నిలబడి చేయొచ్చు. కాని వాడి మంచితనం నన్ను ఏడిపిస్తుంది. వాడే కాదు ఎవరిలో మంచితనం చూసినా నాకు కన్నీళ్ళు వస్తాయి. చెప్పానుగా నన్ను తిట్టీ, కొట్టీ ఎవరూ ఏడిపించలేరు, మంచితనంతో ఏడిపిస్తారని.

అన్నయ్య : మీరు ఏడవటం ఏమిటీ? మీ కన్నీరు భూమిమీద పడకూడ దంటారు కదా!

అమ్మ : భూమిమీద ఉన్నవన్నీ నా కన్నీళ్ళే. ఒక బొట్టు ఏమిటి అనేక బొట్లు పడ్డాయి. అవి పడకపోతే మీకు దాహానికి కూడా నీళ్ళు ఉండేవి కావు. దుఃఖం కష్టపెట్టేది కాదు, నేను ఏది కాదని నాకు ఏమి లేవు అంటావు?

దుఃఖం ఉన్నది. సంతోషం ఉన్నది. నేను త్యాగిని, భోగిని, రోగిని - అన్నీ నేనే.

అన్నయ్య : పరమాత్మకు కూడా ఇవన్నీ ఉంటాయా?

అమ్మ : అంటే వాడికి అతీతమైనవా ఇవి? లేక, వాడినుండి వేఱనా? అతీతమైనవి అయితే మానవుడే గొప్పవాడు. ఇంకా ఎందుకు వాడూ? ఓ మూల కూర్చుంటే సరిపోతుంది.

మానవుడికి ఇవి ఎక్కడనుండి వచ్చాయి? వాడు సృష్టించు కున్నాడా? సృష్టించుకుంటే చెప్పానుగా ఇంకా వాడి ముందు పరమాత్మ ఎందుకు? వీడు అనుకున్న వేళకు మంచినీళ్ళు తాగలేదే! గుటక వెయ్యాలనుకున్నప్పుడు గుటక వెయ్యలేదే! .... .... ...

అన్నయ్య : అయితే పరమాత్మ స్థితి ఏమిటి?

అమ్మ : తాను కాకుండా (ఏమీ) లేదనే స్థితి.

అన్నయ్య : పరమాత్మ అంటే?

అమ్మ : తాను కాకుండా (ఇతరము) లేనివాడు. అంతా తానైన వాడు.

# అందరిల్లు

## 21. అక్కడ చేసుకునే పూజలు

వరంగల్ నుండి వచ్చిన ఒక సోదరి అమ్మను అడిగింది 'పదేండ్లబట్టి వరంగల్‌లో నవరాత్రిళ్ళు చేసుకుంటున్నానమ్మా. ఈ ఏడు ఇక్కడ చేసుకుందామని అనుకున్నాను. మీరు ఏం సెలవు ఇస్తారు?'

అమ్మ : నాకు ఏం తెలియదమ్మా. మీ ఇష్టం.

అన్నయ్య : మీరు చెబితే -

అమ్మ : మీ ఇష్టమమ్మా. అక్కడ పార్వతిని ఏం అడిగి చేస్తున్నారు? అంతే. అట్లాగే చేసుకో.

అక్కయ్య : తల్లివని. ఇక్కడ ప్రత్యక్షంగా కనిపిస్తున్నావని కదమ్మా మిమ్మల్ని అడుగుతున్నది? చెప్పమ్మా?

అమ్మ : చెప్పేదేముందమ్మా? అక్కడ ఎట్లా చేసుకుంటావో - ఇక్కడా అట్లాగే చేసుకో. అయితే ఇక్కడ నవరాత్రులని చాలామంది జనం వస్తారు, ఈ తొమ్మిదిరోజులు. ప్రతివాళ్ళకీ అవకాశం ఉండేటట్టుగా నీ పూజ నువ్వు చేసుకో. పూజ అంటే ఏమిటో ఇప్పుడే విన్నావుగా, పెద్ద చీరలు పెట్టటమూ, పూలతో పూజ చెయ్యటమే పూజ కాదు. గడ్డిపోచతో చేసినా - అది పూజే. పూజకు చిన్నా పెద్దా ఏం లేదు.

సహస్రనామ అర్చనతో నీ ఇంట్లో నువ్వు పూజచేసుకోగలవు. కాని ఇక్కడ అట్లాకాదు. ఒకరు సహస్రనామాలు చదువుతుంటే - ఆ పూట

నాలుగువందలమంది వస్తే వాళ్ళంతా చేసుకుంటారు. ఆ నామాలు చదివేలోగా ఈ నాలుగువందలమందీ మారాలి. ఒక్కదాన్నే చేసుకుంటానంటే కుదరదు. అందరికీ అవకాశం ఉండాలి. నీ ఇష్టం ఎట్లా ఉన్నా - పూజ చేసుకో.

అక్కయ్య : మీరు ఎట్లా సెలవిస్తే అట్లాగమ్మా. అప్పటికి ఏం వస్తువులు ఎంతెంత తెప్పించుకోమంటారు.

అమ్మ : నాకు తెలియదమ్మా ఇవన్నీ. నేను ఎవరికీ పూజ చెయ్యలేదు. నేను ఫలానాది కావాలనీ చెయ్యలేదు.

అని కాసేపాగి -

అక్కడ నవావరణ పూజ చేస్తావా?

అక్కయ్య : అవునమ్మా. రాత్రే ఇక్కడ చెయ్యాలని మనస్సు కలిగింది. ఒకదాన్నే వచ్చాను కనుక మిమ్మల్ని అడిగి ఇంటికి ఉత్తరం రాద్దామని అడుగుతున్నానమ్మా.

అమ్మ : అడిగితే తప్పేంలేదమ్మా.

# 22. ఆశ్రమం కాదు, ఇల్లు

**(7-3-64)**

అమ్మ స్నానం చెయ్యకుండానే వేకువజామునే వెళ్ళేవారికి ప్రసాదాలు ఇవ్వటానికి వచ్చింది. ప్రసాదాలు ఇస్తుండగా మన్నవనుండి వచ్చిన ఒక సోదరుడు అన్నాడు - తనకు ఇక్కడనే ఉండాలని ఉన్నదని.

అమ్మ : ఉండటానికి నాకేం అభ్యంతరం లేదు నాయనా, ఇంతమంది అన్నం తింటుంటే నీ ఒక్కడికి భోజనం లేకుండా పోదు. ఇది ఆస్తిగల సంస్థకాదు. అంతేకాక ఇవ్వాల్టివరకు దీనికి చందా లివ్వమంటూ ఎవరినీ యాచించింది లేదు. ఎట్లా వస్తుందో, ఎట్లాపోతుందో మనకు అనవసరం. ఇది అందరిల్లు. ఇక్కడ ఎవరి ఓపికకు తగినట్లు వారికి పని ఉంటుంది. ఊరికినే ఎవరూ కూర్చోరు. ఉండటానికి ఆశ్రయం ఇచ్చేది ఆశ్రమమే కాని ఇది ఆశ్రమం కాదు, ఇల్లు. అనేక రకాల మనస్తత్వాలు, ప్రవృత్తులు కల వ్యక్తులందరూ కలిసి ఉన్న ఇల్లు. అందరితో సర్దుకు పోవటమనేదీ, అందరిలో లోపాలు చూడక, మంచే చూడటం అనేదీ - అంత తేలికైన విషయం కాదు. నువ్వు ఇక్కడ ఉండటానికి నాకు అభ్యంతరం లేదు. నీ కిష్టమైనన్ని రోజులుండు. కాని నువ్వు కుటుంబీకుడివి, వాళ్ళను వదిలి ఒంటరిగా ఉంటాననడం బాగుండలేదు. నీకు పెద్దవాడు అంటూ మీ మావయ్య ఉన్నాడు. కనుక ఆయన్ని అడిగి ఏదైనా చెయ్యి.

'అట్లాగే అమ్మా-'

అంటూ ఆ సోదరుడు సెలవు తీసుకున్నాడు.

# 23. అందరింట్లో పరిస్థితులు

ఈ ఉదయం విజయవాడ నుండి వచ్చిన ఒక అక్కయ్య అమ్మకు తన కుటుంబ విషయాలు పరిష్కరించుకోలేని తన చిక్కు సమస్యలు గురించి చెప్పి తనకు ఇక్కడ ఉండాలని ఉన్నదని, దానికి అమ్మ అనుజ్ఞ కావాలని అడిగింది.

అమ్మ : ఇక్కడ ఉండటానికి నాకు ఏం అభ్యంతరం లేదమ్మా. కానీ నువ్వు నీ కుటుంబంనుండి ఏ చిక్కులు ఉన్నాయని వచ్చావో అవి ఇక్కడా ఉన్నాయి. కాకపోతే మరోరూపంగా ఉంటాయి. కానీ కష్టాలూ, బాధలూ ఇక్కడ లేవు అనుకోవద్దు. సుఖం కంటే కష్టమే ఎక్కువ. ఇక్కడ రుచికి ఆహారం కాదు; ఆకలికి ఆహారం. నన్ను చూస్తున్నారు, నా దగ్గర ఉంటున్నారు – అనే ఆనందం మినహాయించి మిగతావన్నీ మామూలుగానే ఉంటాయి.

ఆమె కాసేపాగి –

'సంవత్సరంనుండి అనారోగ్యంగా ఉన్నదమ్మా' అన్నది.

అమ్మ : ప్రపంచంలో అది లేనిది ఎవరికమ్మా?

ఆమె : ఇక్కడ ఉంటే మనస్సుకి ప్రశాంతత ఉండదంటారా?

అమ్మ : ప్రశాంతత ఎంత దూరం పోయినా ఉండదమ్మా. అది మనస్సునుబట్టి వచ్చేదే కాని చోటునుబట్టి వచ్చేదికాదు.

# 24. బిడ్డమీద ప్రేమ

**(1-4-65)**

(రుక్మిణమ్మగారితో) "కడుపులో ఉన్నప్పుడు ఉన్న సన్నిహితత్వం భూమిమీద పడిన తర్వాత ఉండదు. పదకొండురోజులు, ఆ తర్వాత ఇరవై ఒకటోరోజు, మూడు నెలలూ, తర్వాత క్రమంగా ఎంతదూరం అవుతాడో చూడు. గర్భంలో ఉన్నప్పుడు పడుకోవటంలో కూర్చోవటంలో కూడా ఏం ప్రమాదమో అన్నట్టుగా అంత జాగ్రత్తగా ఉంటాము. పుట్టిన తర్వాత ఆ శ్రద్ధ తరుగుతుంది. అంతదాకా ఎందుకూ పురిటిస్నానం రోజుకూ 21వ రోజుకే ఎంతో తేడా ఉంటుంది. చూడటంలో తేడా ఉంటుంది. ప్రేమలో తేడా ఉండదు. ఎవరు చిన్నవాడో, నలిగినవాడో వాడిమీద ఉన్నంతగా తల్లికి ఆరోగ్యంగా పుష్టిగా ఉండే పిల్లలమీద ఎందుకుంటుంది? ఉండదు. అంటే ప్రేమ లేక కాదుగా. వాడు నువ్వు చేసినా చెయ్యకపోయినా చూసుకోగలడు. వీడు చేసుకోలేడు. అంతే. ఇదంతా ఎందుకూ అంటే అది మన తృప్తికోసం. తల్లి తాను పస్తుపడుకునైనా పిల్లల కడుపు నింపాలని ఆలోచిస్తుందంటే అది తన ఆనందం కోసం. తన తృప్తికోసం. ఏది చేసినా అంతా మన తృప్తి కోసమే. ఇప్పుడు మీకు అన్నం పెట్టటం కూడా నా తృప్తి కోసమే. మీ కడుపులు నిండితే నాకు ఆనందం. మీకు అన్నం లేక కాదుగా.

ఈ మాటలకు తనలో తాను నవ్వుకుంటున్న సుబ్బారెడ్డిగారిని చూసి అమ్మ అన్నది-

"రేపు రెడ్డిగారికి పిల్లలుపుడ్తే-ఇంత శ్రద్ధగా కూర్చొని విసురుతూ - కాళ్ళు రాస్తూ కుర్చుంటాడా? అప్పుడు నామీద శ్రద్ధ ఎక్కువా - బాబుమీద ఎక్కువా అంటే ఏం చెప్తాడు? ఇప్పుడు నువ్వైనా అంతే. అందర్నీ వదిలేయి. నా మీదా? రహీమీదా? ఎవరి మీద నీకు ఎక్కువ ప్రేముందీ? - అంటే ఏం చెప్తావు. వాడి మీద లేదంటే నిజంగా నువ్వు తల్లివే కావు."

అక్కయ్య ఏం మాట్లాడాలేదు. కాని అమ్మ మాటలు కమలలో సందేహపూరితమైన ఆలోచనలను రేకెత్తించి నట్టున్నాయి. అమ్మ కమలవంక చూసి అడిగింది.

"ఏమిటి ఆలోచిస్తున్నావు?"

కమల : ఇప్పుడు నువ్వు చెప్పినదాన్ని గురించి ఆలోచిస్తున్నాను. అయితే మేముకూడా అంతేగా, పాతవాళ్ళు దూరంకావటం, క్రొత్త వాళ్ళు దగ్గరకావటం కొంత కాలం తర్వాత వీళ్ళు దూరంకావటం, మళ్ళీ క్రొత్తవాళ్ళు దగ్గరకి రావటం ఇదంతా...

అమ్మ : ఎటూ అంతేగా? ఇప్పుడు నువ్వు బంగారుశాస్త్రిని చూసుకున్నట్లుగా భగవతిని చూస్తావా? చూడవు. రేపు ఇంకొకడు పుడితే చూసినట్టుగా వీడిమీద నీకు శ్రద్ధ ఉంటుందా? హరిదాసుగారు భగవతిని ఎత్తుకుంటే చాలు - బంగారుశాస్త్రి ఏడ్చి గోలచేసి దాన్ని దింపించి తనను ఎత్తుకో మంటాడు. అదే వాడు అట్లా ఉండి ఇది అందుకోసం ఏడిస్తే దీని మాట వినే వాళ్ళు ఉంటారా? నువ్వైనా ఏమంటావు? దీన్నే నాలుగు బాదుతావు 'చిన్నవాడితో నీ పంతం ఏమిటి' అని.

కమల : నిజమే నమ్మా.

అమ్మ : అది అర్థంచేసుకో. ఈ గదిలోకి రానంత మాత్రాన, నన్ను చూడనంత మాత్రాన, నాకు మీ మీద ప్రేమ తగ్గుతుందని అనుకోవద్దు. ఈ గదిలో మంచం కోళ్ళను అంటి పెట్టుకుని కూర్చున్నంత మాత్రాన, నాలుగుసార్లు అటూ-ఇటూ తిరిగినంత మాత్రాన ఎక్కువయ్యే ప్రేమ ఏం లేదు. ఉండేది ఎప్పుడూ ఉంటుంది. ఒక తల్లికి ఇద్దరు బిడ్డ లుంటారు అనుకో. అందులో ఒకడు తన దగ్గరా మరొకడు దూరంగా ఉంటాడు. పెట్టు పోతల్లో ఈ దగ్గరున్న వాడు అనుభవించ వచ్చు కాని తల్లికి మానసికంగా ఎవరిమీద ఎక్కువ ఉంటుంది? దూరంగా ఉన్న వాడి మీదే. ఏదైనా, ఉండే ప్రేమ ఎక్కడున్నా ఎట్లా ఉన్నా ఉంటుంది. అన్నం వండే వారిమీద ఎంతుంటుందో చిమ్మేవాడిమీదా అంతే. నాలుగు రూపాయలు డిబ్బీలో వేసిన వాడిమీదా అంతే ఉంటుంది. వేయని వాడి మీదా అంతే ఉంటుంది. ఇందులో ఎవరికీ ప్రత్యేకతలు లేవు. ఆవరణలో తిరిగే కుక్కలూ - పిల్లులూ ఎంతో మీరూ అంతే.

# 25. దరిద్రదేవత

**17-1-68**

బాలయ్యగారూ, నరసింహారావు మాష్టరుగారు మొదలయిన వాళ్లు కూర్చుని వున్నారు.

అమ్మ : నేను దరిద్రమూ దేవతే, భాగ్యమూ దేవతే-నన్నాను.

బాల : అయితే నీ కే దేవత కావాలమ్మా?

అమ్మ : నాకు దరిద్రదేవతే కావాలి. నేను బాధలు అనుభవించాలి. అందరికీ సుఖాన్ని యివ్వాలి.

బాల : ఈ దేవతలన్నీ ఒకే శక్తిలో నుండి వచ్చినయ్యా - లేకపోతే వేటికవే పుట్టినయ్యా?

అమ్మ : అన్నీ ఆ శక్తిలోవే,

బాల : అవి వున్నయ్యా?

అమ్మ : అనుభవిస్తున్నాముగా? అందరమూ ఆశక్తి బిడ్డలమే అయినా నిప్పు పట్టుకుంటే కాలుతుంది. నిప్పుకు కాలే శక్తి వున్నట్లే దారిద్ర్యం బాధపెడుతుంది.

బాల : నిప్పు అవసరమమ్మా. దరిద్రమెందుకు?

అమ్మ : భాగ్య మెందుకో దరిద్రమందుకే.

బాల : అయితే ఆ శక్తికి దారిద్ర్యాన్ని సృష్టించే అవసరం ఏముంది?

అమ్మ : కావాలని సృష్టి అనుకున్నది కనుక.

# 26. ఆహారమంటే?

అన్నయ్య : ప్రపంచంలో ఆహారం లేకుండా జీవించడానికి అవకాశం ఉన్నదా?

అమ్మ : ఆహారం అంటే ఏమిటి మీ దృష్టిలో? నేను మంచినీళ్ళు కూడా ఆహారమే అంటాను. గాలికూడా ఆహారమే. నా దృష్టిలో వ్యవహారం కూడా ఆహారమే. ఆహారం ఎప్పుడూ ఎక్కడి కక్కడే ఉంటూ ఉన్నది. పుట్టగానే బిడ్డకు ఏం తిన్నాడని మలమూత్రాలు వెళ్ళి పోతున్నాయి? తల్లిగర్భంలో ఇన్నాళ్ళు ఏం తిని పెరిగాడని?

# 27. రాజకీయాలు

సీ.రా.చం.

మూర్తి : అయితే థర్డ్ వరల్డ్‌వార్ వస్తుందంటారా?

అమ్మ : నాకు తెలియదు నాన్నా.

సీ.రా.చం.

మూర్తి భార్య: ప్రపంచమంతా మీకేనా?

అమ్మ : అయ్యో! అతనూ ప్రపంచంలో వాడేగా. అడుగు నాన్నా.

సీ.రా.చం.

మూర్తి : చైనావాడికి మనకూ మధ్య ముందు ముందు ఎట్లా వుంటుంది? రాజకీయాలు అడుగుతున్నాని అనుకోవద్దు కానీ-

అమ్మ : నాకు లేకపోతేగా రాజకీయాలు? కుటుంబమంతా రాజకీయ మేగా?

సీ.రా.చం.

మూర్తి : ప్రపంచమంతా మన దేశానికి వ్యతిరేకించి-

మాష్టరుగారు : అంటే ఇండియా ఏకాకి అయిపోతుందనా?

సీ.రా.చం.

మూర్తి : ఏకాకి అయిపోయింది. అందుకు సందేహమేమీ లేదు. మనస్ఫూర్తిగా ఇండియాకు సహాయం చేద్దామనుకునే దేశం ఒకటీ లేదు.

అమ్మ : అది మనలోనే లేదుగా - ఒకడి కొకడు సహాయం చేసుకుందామనే లేదుగా? దేశమంటే - కొన్ని గ్రామాలు కలిస్తే ఒక తాలూకా. కొన్ని తాలూకాలు కలిస్తే ఒక జిల్లా. కొన్ని జిల్లాలు కలిస్తే ఒక రాష్ట్రం, కొన్ని రాష్ట్రాలు కలిస్తే దేశం. మరి మనిషికీ మనిషికీ గ్రామానికీ గ్రామానికీ పడదు. రాష్ట్రానికీ రాష్ట్రానికీ పడదు. దేశమంతా ఏకమై ఐకమత్యంగా వున్నా అందరికీ గౌరవమే..... మన సంప్రదాయాలను ఎంత గౌరవిస్తారు? వెనక, ఒక లేడీ డాక్టర్ పొన్నూరులో చిదంబరరావు దంపతులను 'మీకు పెండ్లయి ఎంత కాలమండీ?' అని అడిగింది.

# 27. రాజకీయాలు

సీ.రా.చం.

మూర్తి : అయితే థర్డ్ వరల్డ్‌వార్ వస్తుందంటారా?

అమ్మ : నాకు తెలియదు నాన్నా.

సీ.రా.చం.

మూర్తి భార్య: ప్రపంచమంతా మీకేనా?

అమ్మ : అయ్యో! అతనూ ప్రపంచంలో వాడేగా. అడుగు నాన్నా.

సీ.రా.చం.

మూర్తి : చైనావాడికి మనకూ మధ్య ముందు ముందు ఎట్లా వుంటుంది? రాజకీయాలు అడుగుతున్నాని అనుకోవద్దు కానీ–

అమ్మ : నాకు లేకపోతేగా రాజకీయాలు? కుటుంబమంతా రాజకీయ మేగా?

సీ.రా.చం.

మూర్తి : ప్రపంచమంతా మన దేశానికి వ్యతిరేకించి–

మాష్టరుగారు: అంటే ఇండియా ఏకాకి అయిపోతుందనా?

సీ.రా.చం.

మూర్తి : ఏకాకి అయిపోయింది. అందుకు సందేహమేమీ లేదు. మనస్ఫూర్తిగా ఇండియాకు సహాయం చేద్దామనుకునే దేశం ఒకటీ లేదు.

అమ్మ : అది మనలోనే లేదుగా – ఒకడి కొకడు సహాయం చేసుకుందామనే లేదుగా? దేశమంటే – కొన్ని గ్రామాలు కలిస్తే ఒక తాలూకా. కొన్ని తాలూకాలు కలిస్తే ఒక జిల్లా. కొన్ని జిల్లాలు కలిస్తే ఒక రాష్ట్రం, కొన్ని రాష్ట్రాలు కలిస్తే దేశం. మరి మనిషికీ మనిషికీ గ్రామానికీ గ్రామానికీ పడదు. రాష్ట్రానికీ రాష్ట్రానికీ పడదు. దేశమంతా ఏకమై ఐకమత్యంగా వున్నా అందరికీ గౌరవమే..... మన సంప్రదాయాలను ఎంత గౌరవిస్తారు? వెనక, ఒక లేడీ డాక్టర్ పొన్నూరులో చిదంబరరావు దంపతులను 'మీకు పెండ్లయి ఎంత కాలమండీ?' అని అడిగింది.

వారు చెప్పారు. 'మీరింత కాలం ఎట్లా కలిసివున్నారు?' అని ఆశ్చర్యపోయింది. ఆదర్శప్రేమ అనే ఒక పుస్తక మున్నది. అందులో కథేమిటీ? - పెండ్లయిన భార్యా భర్తా కాపురం చేస్తుండగా అతనికి స్ఫోటకం పోస్తుంది. స్ఫోటకం పోసి తగ్గిన తరువాత కూడా అతనితో వెనుకటిలాగానే కాపురం చేసిందిట. అదే వాళ్ళకి ఆదర్శప్రేమ. మన కది సహజం. ఇట్లాగే ఎన్నో. మనదేశం అంతా ఏకమై వుంటే యింకేం? మొన్న ఔరంగాబాద్‌కు ఉద్యోగం కోసం వెళ్ళితే మహారాష్ట్రభాష వస్తేగానీ వీలు లేదన్నారు.

సీ.రా.చం.

మూర్తి : అవునమ్మా - యిటువైపునుండీ నలుగురు వెళ్ళారు అక్కడకు.

అమ్మ : ఎక్కడ నలుగురు నాన్నా యిక్కడకు వచ్చేవాళ్ళే ఏడుగురు వున్నారు. మన రైళ్ళు పగలకొట్టుకుంటున్నదెవరు? మన వాళ్ళేగా! ఆ దండుగ మనకేగా! ముస్సీనది పొంగినప్పుడు నైజాంనవాబు చేసిన సహాయం సామాన్యమయినదా? ఆ చరిత్ర చదువుతుంటే....

అమ్మ ఆపైన ఏమి చెప్పేవారో మరి సీ.రా.చం. మూర్తి అడ్డు తగిలారు. "అటువంటి వాళ్ళను మర్చి పోతారమ్మా."

అమ్మ : అది ధర్మం - యుగధర్మం. ఎవడో ఒకడు బాగా వుందాము అని అనుకున్నా వాడు వుండలేడు. ఉద్యోగంలో చేరేదాకా నేను న్యాయంగా వుండాలి, లంచాలు తీసుకోకూడదనే అనుకుంటాడు. తీరా వుద్యోగంలో చేరిన తరువాత తీసుకోక తప్పదు. 'నేను దాళువా పంట వెయ్యదలచుకోలేదు, కానీ చుట్టూ చేలవాళ్ళు వేస్తున్నారు. నా చేనుకూడా తడుస్తుంది. కనుక నేను వెయ్యక తప్పదు. వెయ్యకపోతే చేను పాడవుతుంది. అనడముందిగా? - ఏదయినా మీరు వ్యక్తులను అంటున్నారు. నేను యుగధర్మం అంటున్నాను. స్వతంత్రంకోసం ఎంతపాటుపడ్డారు? ఉప్పు కొటారులు పెట్టీ, ఉప్పు తయారుచేసీ - తల్లిలేని పిల్లల మయామని తపించారు. కానీ యిప్పుడు సవతితల్లి

పిల్లలులాగా అయినారు. గాంధీగారు నిష్కామయోగమని ఒక పుస్తకం వ్రాసారు. దైవభక్తి రాజకీయాలు వేరు కాదని. అందరూ అట్లా వుంటున్నారా? కాబట్టే దైవశక్తి అను, ఏదోశక్తి అను - ఏదో శక్తి మనల్ని వెనుకవుండి నడిపిస్తున్నదీ, మనం నడుస్తున్నాము.

సీ.రా.చం.

మూర్తి : రాజకీయాలలో విసుగుపుట్టి దేవాలయాలకు పోతున్నారు. M.L.A. కావటానికయినా తిరుపతి వెళుతున్నారు. ఇక పోనీ నందాలాంటి వాళ్ళున్నారంటే - వాళ్ళున్న చోటే దేవాలయం.

గోపాలన్నయ్య: అమ్మా - దేశం ఏకాకిగా వుండాలన్నావేమిటి?

అమ్మ : దేశానికి స్వేచ్ఛ ఏముంది? దేశనాయకులు దేశాన్ని కుదవ పెడుతున్నారుగా?

సీ.రా.చం.

మూర్తి : అవునమ్మా. అమెరికానుండి అప్పుచేశారుగా -

అమ్మ : కెనడీ చెప్పలా? - అప్పు ఎప్పటి కప్పుడు తీరుస్తుంటే ఉండే గౌరవం అప్పులు వుంటే వుండదు అని.

మాస్టరుగారు: మొన్న రాధ గోల చేసిన రోజున కృష్ణభిక్షుగారు బయటకు వచ్చి 'ఏమిటి?' అని అడిగారు - నేను చెప్పాను. రాధ గోలచేస్తున్నాడు అన్నాను. అప్పుడాయన చెప్పారు. 'రమణాశ్రమంలో కొట్టుకునే వాళ్ళ'ని.

అమ్మ : ఇక్కడ వేరు అంతా చిన్నపిల్లలూ, పోట్లాటలూ అవీ - పైగా నేను వున్నాను అనేది ఒకటీ. మొన్న అందరి రక్తం త్రాగుతా నన్నాడు. వాడు మూర్ఖుడు, గుడ్డివాడని వాడిని కాస్త యిదిగా చూస్తాము. అయితే ఒకటి; వాడికి పశ్చాత్తాపం వుంది. నాకు నేనే శిక్షవేసు కుంటానని వారం రోజులదాకా తీర్థానికి రాడు. నా దృష్టిలో పశ్చాత్తాపమే శిక్ష. శిక్ష ఒకళ్ళు వేసేది కాదు. వాడిలో మార్పు రావటమే ప్రాయశ్చిత్తం.

# 28. వీసా

**(5-1-65)**

గతరాత్రి గుంటూరునుండి వచ్చిన ఆ ముగ్గురు సోదరులలో ఒకరు ఇక్కడికి తరుచుగా వచ్చేవారే. మిగతా ఇద్దరూ కొత్తగా వచ్చారు.

వారు మధ్యాహ్నం అమ్మదగ్గర సెలవు తీసుకునే ముందు ఒక అన్నయ్య అమ్మతో 'శ్రీనివాసరావుగారు (తరచుగా వచ్చే అన్నయ్య) చెప్పినప్పటినుండి మిమ్మల్ని చూడాలని ప్రయత్న మమ్మా. చివరకు ఇవ్వాళ ప్రాప్తించింది చాలా ఆనందంగా ఉన్నది. నాలుగు రోజులు ఇక్కడ ఉండాలని ఉన్నది, కాని తొందర పనులుండి ఈ రోజే వెళ్ళాల్సివచ్చింది. నాదొక చిన్న సందేహమమ్మా' అన్నారు.

అమ్మ : అడుగు నాన్నా.

అన్న : నా తమ్ముడు ఉద్యోగరీత్యా అమెరికాలో ఉన్నాడమ్మా. మరదలిని అక్కడికి పంపించాలంటే ఎంత ప్రయత్నించినా వీసా దొరకటం లేదు. అదే పెద్ద బాధగా ఉన్నది. అసలు ఆ అమ్మాయి అమెరికా వెళ్తుందో లేదో చెప్పండి.

అమ్మ : సమయం వస్తే వెళ్తుంది.

అన్న : మీ దయ.

అమ్మ : (శ్రీనివాసరావుతో) నువ్వూ ఈ పూటే వెళ్తున్నావా!

శ్రీని : లేదమ్మా రేపు వెళ్తాను.

అని అమ్మని ప్రశ్నించిన ఆ అన్నయ్య అన్నాడు.

'మీరు కూడా ఉండండి రేపు వెళ్దాం.'

అన్న : ఇంటి దగ్గర చెప్పలేదండి, వెతుక్కుంటారు.

శ్రీని : అవును, మీరు చిన్నపిల్లలని వెతుక్కుంటారు.

7

అమ్మ : చిన్నపిల్లలైతే దిగులు లేదు. పెద్దవాళ్ళు కనుకే.

అన్న : (నవ్వి) మీ అనుగ్రహం వలన అమ్మాయి వెళ్ళటానికి వీసా లభిస్తే - ఈసారి అమ్మాయితోపాటు వచ్చి దర్శనం చేసుకుంటాను.

అమ్మ : అబ్బాయి ఎందుకు వెళ్ళాడు?

అన్న : ఉద్యోగరీత్యా

అమ్మ : పెళ్ళి అయ్యాక వెళ్ళాడా?

అన్న : లేదు. అక్కడ పనిచేస్తుండగానే జరిగింది. పెళ్ళికి వచ్చి వెళ్ళాడు. అమ్మాయి వెళ్ళటానికి పర్మిషన్ కోసం పెట్టిన ఫారమ్‌లో పెళ్ళి అయింది అని రాయటంవలన అంత ఆలస్యం జరుగుతున్నది. అదే అన్ మ్యారీడ్ స్కాలర్ అని రాస్తే ఇంత గొడవ ఉండేది కాదు. ఒకవేళ ఈ అమ్మాయికి వెళ్ళటానికి పర్మిషన్ లభించకపోతే వాడే రిజైన్ చేసి ఇండియాకు వస్తానంటున్నాడు.

అమ్మ : ఇక అబ్బాయి విషయంలో భయపడాల్సిన అవసర మేముంది?

అన్న : అబ్బాయి విషయంలో మాకెప్పుడూ భయం లేదండీ. వాడు అక్కడ ఉండగానే పెళ్ళి సంబంధాలు చూస్తున్నామంటే - ఆ విషయంలో తన ఇష్టా నిష్టాలు ఏం లేవని అంతా మా ఇష్టమేనని రాశాడు. పెళ్ళికాగానే అబ్బాయికి సెలవు లేకపోవటం వలన వెంటనే వెళ్ళిపోయాడు. అమ్మాయి కూడా చదువుకున్నదే. కాని ఈ జరుగుతున్న కేసులు చూచి భయపడి తనని అక్కడికి పంపమని గొడవ చేస్తున్నది.

అమ్మ : అదీ నిజమే....

శ్రీని : బాపట్లలో ఒక అబ్బాయి కెనడా వెళ్ళి ఆ దేశపు అమ్మాయిని చేసుకుంటానని అంటున్నాడు.

అన్న : ఈ కేసే కాదమ్మా. ఇంకా ఇది చేసుకుంటా ననటంలో ఉన్నది. కాని చేసుకున్నవి కూడా ఉన్నాయి. అందుకే మాకు భయం. అబ్బాయి

మంచివాడే అనుకొనండి. కాని ఏవేళ ఏం జరుగుతుందో, అమ్మాయి వెళ్ళి ఒక నెలరోజులు అక్కడున్నా చాలు.

అమ్మ : అన్నది నిజమే కాని అబ్బాయి విషయంలో మీరు సందేహ పడటానికి ఆస్కారమున్నట్టుగా లేదు అతని ప్రవర్తన. వీళ్ళ మాట వినాలి, నా ధర్మం ఇది - అని గుర్తు ఉన్నది కదా. ఫర్వాలేదు. అంతేకాక అమ్మాయి రాకపోతే తానే రిజైన్ ఇచ్చి వస్తానంటున్నాడు కదా. ఇంకా ఇందులో మీరు భయపడాల్సిన విషయం ఏముంది?

అన్న : (లేచి నిలబడుతూ) అందుకు మీ ఆశీర్వచనం ఉంటే చాలు.

అమ్మ : ఆశీర్వచనం ఎప్పుడూ ఉంటుంది నాన్నా, ఇది ప్రత్యేకంగా తరిగేదీ - పెరిగేదీ లేదు. మార్పులేనిది. మీ ప్రయత్నం మీరు చెయ్యండి. సమయం వస్తే అదే జరుగుతుంది.

అన్న : అలాగే నండీ, వెళ్ళటం జరిగితే అమ్మాయిని తీసుకొని మరోసారి మీ దర్శనానికి వస్తాను.

ఇంకా ఇతరత్రా బాధలు లేవు. ఇదొకటే మమ్మల్ని వేధిస్తున్న పెద్ద బాధ.

అమ్మ : (నవ్వి) అన్నీ ఉండి అనుభవిస్తూ ఇదొకటే పెద్ద బాధ అనుకుంటున్నారు. మీవరకు ఇది పెద్ద బాధే, దీన్నిగురించి అంత బాధ పడాల్సినంతగా - నాకు మీరు చెప్పే మాటలు బట్టి - అనిపించటం లేదు. అమ్మాయి వెళ్తే వెళ్తుంది. లేకపోతే లేదు, కాకపోతే అబ్బాయి ఎటూ వస్తాడుగా? వచ్చినందువల్ల నష్టంలేదు. ఇక్కడ ఎటూ ఉద్యోగం దొరుకు తుంది. దొరకదనే దిగులు లేదు. ఒకవేళ అమెరికాలో ఇచ్చినంత జీతం ఇవ్వరేమో కానీ.

అన్న : అంతే నమ్మా. మీకు తెలియనిది ఏముందీ?

అంటూ నమస్కరించి వాళ్లు వెళ్ళారు.

# 29. అమ్మకు ఆహ్వానం

(22-3-66)

ఉదయం ఒంగోలునుండి వచ్చారు ఆ భార్యాభర్తలు.

వాళ్లు తాము తెచ్చినపూలు, పండ్లు సమర్పించారు. అమ్మ తీర్థప్రసాదాలు ఇచ్చింది.

కాసేపు గడిచాక ఆ అన్నయ్య అన్నారు. అమ్మను ఒంగోలు తీసుకు వెళ్లాలని ఉన్నదని.

అమ్మ : నాకు అక్కడకు వచ్చే యోగ్యత ఉంటే తప్పించుకోలేను నాన్నా.

అన్న : వచ్చే నెలలో జపాను వెళుతున్నా నమ్మా. వెళ్ళేలోగా మిమ్మల్ని చూద్దామని వచ్చాను. చాలా రోజులనుండి రావాలని అనుకోవటమే జరిగింది. కాని అది ఇవ్వాల్టికి ప్రాప్తించింది.

అమ్మ : అదొకటే కాదు. అన్నీ అంతే.

అన్న : ఆరు నెలలనుండి నా భార్యకు బాగా జబ్బుగా ఉన్నదమ్మా.

అమ్మ : (నవ్వి) నాకు పుట్టినప్పటినుండి ఉన్నది. నేను ఎవరికి చెప్పుకోను? ఇంత ప్రేమగా మేము పిలిస్తే అమ్మ రాలేదే అని మీరు అనుకోవద్దు నాయనా. ఆ సమయం వస్తే తప్పించుకోలేను. నేను రావటమే కాని మీరు తీసుకువెళ్ళటం కాదుగా. నేను రావటం అంటే ప్రత్యేకించి మీ ఒక్కరింటికే అని ఉండదు. బిడ్డలందరి ఇళ్ళకీ వెళ్ళాలని ఉంటుంది. మీకు ధనం ఉండొచ్చు, హోదా ఉండొచ్చు. ఇవన్నీ ఏమీ లేనివాడు ఉంటాడు. కనీసం టెంకాయన్నా లేని వాడు ఉంటాడు. మీకు ఉన్నట్టే వాడికి ఉంటుంది- అమ్మ వాడింటికీ రావాలని. కారు ఉన్నది కనుక

మీరు వస్తారు. వాడు ఎట్లా వస్తాడు? అసలు పిలవటానికి ధైర్యం ఎక్కడ ఉంటుంది? నా దృష్టిలో ఉండేవాళ్ళు అట్లాంటివాళ్ళు. మీ దగ్గరికి నేను రాకపోయినా నా దగ్గరికి మీరు రాగలరు. ఆ అవకాశాలు మీకు ఉన్నాయి. కాని వాళ్ళకు ఉండవు. కనుక నేనే వాళ్ళ దగ్గరికి వెళ్ళక తప్పదు. మీకు ఒక్కరికే అమ్మను కాదుగా. మీరు నన్ను సంతోషపర్చటానికి కాని లేక మీ తృప్తికోసం అనుకొనండి నాకు ఏవేవో కొనిపెట్టగలరు. ఇవ్వగలరు.

వాళ్ళకి మనస్సులో ఉన్నా ఇవ్వలేరు. అట్లాంటి వాళ్ళని నేను సంతోషపర్చాలి. ఇట్లా మీలా అడిగే వాళ్ళు ఎంతమందో ఉన్నారు. అందరూ బిడ్డలేగా! ఎవరిని నిరాశపర్చేట్టు? నేను ఒక చోట అంటూ పరిమితంగా ఉంటే – మీరందరూ రావటానికి అవకాశముంటుంది.

ముందే చెప్పానుగా – రకరకాల వాళ్ళు, నన్ను పిలవటానికి సంకోచపడేవాళ్ళు, డబ్బులేని వాళ్ళు, ఉంటారని. అట్లాంటి వాళ్ళందరి ఇళ్ళకు వెళ్ళగలిగిన రోజున వస్తాను. ఒకప్పుడు చీరాల వెళ్తే రెండు నెలలున్నా సరిపోలేదు. అప్పటికీ నేను చూసింది చాలా కొద్ది ఇళ్ళను మాత్రమే. అన్ని ఇళ్ళూ తిరగగలిగిన రోజు అలాగే వస్తాను.

అన్న : మీరు చెప్పింది నిజమే. అందరికీ అమ్మ – కనుక మీ దృష్టి అట్లాగే ఉంటుంది....

# 30. యుగాంతం

సీ.రా.చం.

మూర్తి : అమ్మా! యుద్ధాలొస్తాయా! - ఇంకా దేశంలో ఎటువంటి మార్పు లొస్తయ్!

అమ్మ : చూద్దాముగా మొన్ననే జనవరి ఫస్టున అనుకున్నాం - ప్రపంచంలో ఏదీ యింకా పరాకాష్ట పొందలేదని.

సీ.రా.చం.

మూర్తి : అయితే యుద్ధం వస్తుందంటారు?

అమ్మ : యుద్ధమంటే దేశానికీ దేశానికీ మధ్య వస్తేనే కాదుగా? మొగల్‌సరాయి రైలులో నిన్నటి విషయమేమిటి చెప్పు - ఒక మనిషిని చంపితే మర్డరంటారు. పరిమితంగా ఉన్న మనుష్యులమధ్య జరిగితే పోట్లాట అంటారు. దేశానికీ, దేశానికీ మధ్య జరిగితే యుద్ధమంటారు. అంతేగానీ యివన్నీ ఒకటేగా? యుద్ధం ప్రతి యింట్లోను లేదూ? అన్నదమ్ముల మధ్య జరగటంలేదు? - ప్రతి మనస్సులో జరగటంలేదూ సంఘర్షణ? ముప్పై సంవత్సరాల నాటికి యిప్పటికీ ఎంత తేడా వుంది? -ముప్పై సంవత్సరాలనాడు దేవాలయాలలోకి పోదామని అనుకునే వాళ్ళు లేరు. దేవాలయాలన్నీ పాడుపడ్డయ్. అటువంటిది యిప్పుడు మళ్లీ ప్రతివాడి మనస్సులో మార్పూ, దైవభక్తి పెరిగినై. ఏ రంగంలో నయినా చూడండి - ముప్పై సంవత్సరాల నాటికీ యిప్పటికీ చాలా తేడా వుంది. సైన్సు ఎంతో అభివృద్ధి పొందింది. రాజకీయాలలో మార్పు వుంది. చూడబోతే యుగాంతంగా వుంది.

అమ్మ : చిన్నపిల్లలైతే దిగులు లేదు. పెద్దవాళ్ళు కనుకే.

అన్న : (నవ్వి) మీ అనుగ్రహం వలన అమ్మాయి వెళ్ళటానికి వీసా లభిస్తే - ఈసారి అమ్మాయితోపాటు వచ్చి దర్శనం చేసుకుంటాను.

అమ్మ : అబ్బాయి ఎందుకు వెళ్ళాడు?

అన్న : ఉద్యోగరీత్యా

అమ్మ : పెళ్ళి అయ్యాక వెళ్ళాడా?

అన్న : లేదు. అక్కడ పనిచేస్తుండగానే జరిగింది. పెళ్ళికి వచ్చి వెళ్ళాడు. అమ్మాయి వెళ్ళటానికి పర్మిషన్ కోసం పెట్టిన ఫారమ్‌లో పెళ్ళి అయింది అని రాయటంవలన అంత ఆలస్యం జరుగుతున్నది. అదే అన్ మ్యారీడ్ స్కాలర్ అని రాస్తే ఇంత గొడవ ఉండేది కాదు. ఒకవేళ ఈ అమ్మాయికి వెళ్ళటానికి పర్మిషన్ లభించకపోతే వాడే రిజైన్ చేసి ఇండియాకు వస్తానంటున్నాడు.

అమ్మ : ఇక అబ్బాయి విషయంలో భయపడాల్సిన అవసర మేముంది?

అన్న : అబ్బాయి విషయంలో మాకెప్పుడూ భయం లేదండీ. వాడు అక్కడ ఉండగానే పెళ్ళి సంబంధాలు చూస్తున్నామంటే - ఆ విషయంలో తన ఇష్టా నిష్టాలు ఏం లేవని అంతా మా ఇష్టమేనని రాశాడు. పెళ్ళికాగానే అబ్బాయికి సెలవు లేకపోవటం వలన వెంటనే వెళ్ళిపోయాడు. అమ్మాయి కూడా చదువుకున్నదే. కాని ఈ జరుగుతున్న కేసులు చూచి భయపడి తనని అక్కడికి పంపమని గొడవ చేస్తున్నది.

అమ్మ : అదీ నిజమే....

శ్రీని : బాపట్లలో ఒక అబ్బాయి కెనడా వెళ్ళి ఆ దేశపు అమ్మాయిని చేసుకుంటానని అంటున్నాడు.

అన్న : ఈ కేసే కాదమ్మా. ఇంకా ఇది చేసుకుంటా ననటంలో ఉన్నది. కాని చేసుకున్నవి కూడా ఉన్నాయి. అందుకే మాకు భయం. అబ్బాయి

సీ.రా.చం.

మూర్తి : అవునమ్మా? ఒక న్యూక్లియర్ బాంబు వేస్తే ప్రపంచ మంతా నాశనమవుతుంది.

అతను సైన్సు యింతగా అభివృద్ధి చెందిందని చెప్పటానికి చెప్పాడో - లేక ప్రపంచం నాశనమంది యుగం ఈవిధంగా అంతమయ్యే సూచన వుందనే అన్నాడో గానీ అమ్మ మళ్ళీ అన్నది.

"ఒక టేమిటి? అన్నిటిలోనూ మార్పే నాన్నా."

సీ.రా.చం.

మూర్తి : అయితే అమ్మా! రానురానూ ద్వేషం పెరుగుతుందంటారా? ప్రేమ పెరుగుతుందంటారా?

అమ్మ : ద్వేషం పెరుగుతున్నది. దాని పక్కనే ప్రేమ కూడా పెరుగుతున్నది. ప్రతివాడూ తాను తప్పుచేస్తూ ఎదుటివాడు తప్పు చేస్తున్నాడని బాధపడుతున్నాడు. దేశం అన్యాయమయిపోతున్న - దండీ అంటాడు. బాధపడతాడు. తాను తప్పు చేసినా యితరుల తప్పులయినా గుర్తిస్తున్నారు. ఇటు దైవభక్తి ఆర్తీ పెరుగుతున్నది. 1932 ఆ ప్రాంతంలో ఈ బాధలేదు. మనస్సులలో ఈ కదలిక లేదు.

# 31. ఆలోచనలు

**(12-7-65)**

అమ్మ హాల్లో కూర్చున్నది. నిన్న లంకలకోడేరు నుంచి వచ్చిన అన్నయ్య అమ్మతో మాట్లాడాలని రామకృష్ణన్నయ్యతో చెప్పాడట. అన్నయ్య అమ్మకు చెబితే అమ్మ అడిగింది. అన్నయ్యను చూసి "ఎవరు నాన్నా మాట్లాడతానన్నది- నువ్వేనా?" అని.

'అవునమ్మా' అన్నాడు.

అమ్మ : (దగ్గరకు రమ్మని పిల్చి) ఏమిటినాన్నా? అడుగు -

అన్నయ్య : మానసికమైన కల్లోలాలతో బాధపడుతున్నాను.

అమ్మ : అంటే?

అన్నయ్య : బ్రహ్మచర్యదీక్ష నిర్వహించాలని అభిలాష.

అమ్మ : బ్రహ్మచర్య మంటే - కేవలం పెళ్ళిచేసుకోకపోవటం కాదు. బ్రహ్మచర్యమంటే లింగబేధం, రూపభేదం, స్పర్శభేదం లేకుండ వుండటం - అని నా అభిప్రాయం. దాన్ని గురించి నువ్వేమి ఆలోచించబోకు. ఏది చేసినా ఆ శక్తే చేయిస్తున్నది.

అన్నయ్య : మనస్సులో ఏ సంకల్పం లేకుండా జీవించాలనుకుంటే....

అమ్మ : సంకల్పమే మానవత్వం. సంకల్పమే దైవత్వం. లేకుండ వుండాలనుకోవటం కూడా సంకల్పమే.

అన్నయ్య : మీ అనుగ్రహం కలుగుతుందని వచ్చానమ్మా.

అమ్మ : కలుగుతుంది. ఎప్పుడో అప్పుడు, ఆ ఆలోచన కలగకపోతే రావుగా? ఆలోచించబోకు నాన్నా.

అని వీపు నిమురుతూ ఆయన ఏడుస్తుంటే కళ్ళ నీళ్ళు తుడిచి –

ఏ ఆలోచన వచ్చినా భగవత్స్వరూపమే ననుకో. అప్పుడేవీ నీ జోలికి రావు.

ఏకాగ్రత అంటే ప్రతి ఆలోచన, కనపడేవన్నీ, ఒకటిగా చూడటమే. ఏది చూచినా, ఎందులోనైనా ఒకే వస్తువును చూడటమే – ఏకాగ్రత.

అన్నయ్య : మనస్సు చాలా బలహీనంగా ఉంటుంది.

అమ్మ : మనస్సు పోవటాన్ని నాకొదిలెయ్యి. అమ్మ ఎందుకో ఇట్లా చేస్తున్న దనుకో. మనస్సు నువ్వనుకున్నట్లు వుండటం లేదనేగా నాన్నా. ఇక్కడ నాలుగు రోజులు వుండాలనుకుంటే వుండు. నిన్నెవ్వరూ ఏమనరు నాన్నా.

# 32. ఆలోచనకి కార్యరూపం

గోపాలన్నయ్య :ఇప్పుడు నాకో ఆలోచన వచ్చిందనుకో అమ్మా, అది పనిగా ఎప్పుడు మారుతుంది?

అమ్మ : నిర్ణయించిన కాలం వచ్చినప్పుడు అవుతుంది.

ఇందిర : కోరుకుంటున్న కోరికలన్నీ తీరకపోయినా, కొన్ని కోరికలు మాత్రం అలోచనతో ప్రారంభమయి, కొంత కాలానికి నెరవేరటం జరుగుతూ ఉంటుంది. అట్లాంటప్పుడు, భగవంతుడున్నాడని, మన ప్రార్థన వింటున్నాడని నమ్మకం ఏర్పడుతూ ఉంటుంది.

అమ్మ : మంచిదేగా అది.

గో.అ. : ఆలోచన క్రియగా మారుతోందన్నమాట.

అమ్మ : బీజం పెడితే వృక్షం అయినట్టు.

గో.అ. : ఇప్పుడు నాకో కోరిక వుంది. అది ఎప్పుడు తీరుతుంది.

అమ్మ : కోరిక కలిగించింది ఇక్కడ. కాలం నిర్ణయాన్నిబట్టి, అది నెరవేరటంలో, నెరవేరకపోవటంలో తెలుస్తుంది. నువ్వు కూరగాయలు కాయించాలని ఎన్నాళ్ళబట్టి అనుకోవటల్లేదు? అనుకున్న - నాడే చెయ్యగలిగావా? ఇప్పుడొక బీజం వేసా వనుకో - వెయ్యగానే, వృక్షమయి, కూరలు చేతుల్లోకి రావటంలేదు. అట్లాగే దున్నిన్నాడే తినలేవు. ఈ వేసిన బీజాలు, చెట్లయి, కాసిన తర్వాత, అప్పుడు కూరలు వండుకు తింటున్నాం. అందుకే కృషి చెయ్యకూడదని అనుకోవటం లేదు.

గో.అ. : అంతా చేయిస్తున్నది దైవమే అయినప్పుడు, మనం చేసే కృషి ఏ ముంది?

అమ్మ : ఉన్నదని అనటంలేదు.

గో.అ. : మొన్న సత్యాన్వేషిలో ఇవే వ్యాసాలు, అమ్మేమో, అంతా దైవ సంకల్పం అంటున్నారు. అది అవునా, కాదా! అని చర్చ.

అమ్మ : భగవంతుడు వున్నా డనుకున్న వాడిక్కదా ఈ తిప్పలు (చర్చ).

గో.అ. : ఉన్నాడనేగా అనుకుంటున్నది.

అమ్మ : అనుకుంటే ఇంక వేరే ప్రశ్న ఏముంది? పోనీ అన్నీ తానే (మానవుడు) చేస్తున్నాడనుకోమను. అదీ లేదు. ఇదీ లేదు.

# 33. ముక్తీ - భుక్తీ

**20-2-64**

మద్రాసునుండి వచ్చారు ఆ దంపతులు. ఈ ఉదయం పూజా, తీర్థప్రసాదాలూ ఇవ్వటం కాగానే అవకాశం చూచుకుని ఆ గృహిణి అమ్మతో ఒకప్పటి తమ సంసార పరిస్థితి ఇప్పుడు అన్ని విధాలుగా చితికిపోయిన స్థితి గురించి చెబుతూ.

"ఈ ఇబ్బందులూ – కష్టాలతోనే సరిపోతుంది. కాని ధ్యానం చేసుకుందా మంటే మనస్సు కుదరటం లేదమ్మా. పుష్పగిరిస్వాములవారి వద్ద ఉపదేశం పొందానమ్మా. అయినా మనస్సు నిలుపుకునే సాధన సాధ్యం కావటం లేదు. ఇప్పటి పరిస్థితులను బట్టి దైవానికి సంబంధించిన ఏ శుభకార్యమూ ఇంట్లో పెద్ద ఆడంబరంగా కాకపోయినా తగినంతలో అయినా చేసుకోలేక పోతున్నానమ్మా – భక్తీ – ముక్తీ కంటే భుక్తికోసం వెతుక్కోవాల్సి వస్తుందమ్మా. ఎప్పటికమ్మా దీని నుండి విముక్తి?

అమ్మ ఏం సమాధానం ఇవ్వలేదు.

సోదరి : అమ్మా! మీ చిత్రపటంముందు కూర్చొని నా మొఱ ఆలకించమని వేడుకుంటాను. కాని మళ్ళీ ఏమిటో నా మనస్సు కలుషితమైనదనీ, మీరు నా మొఱ వినటం లేదేమోననీ, అనిపిస్తుంది.

అమ్మ : నేను విన్నా వినకపోయినా నీ మొతే నిన్ను రక్షిస్తుంది. భుక్తిగురించి నీకు ఇంత బాధ ఎందుకు? మనకంటే లేనివారు లేరూ? మనం ఒక పూటైనా తింటున్నాం. అదికూడా లేనివాళ్ళు ఎంతమంది ఉన్నారు?

మనం వారికంటే, మనపై వారి గురించి ఆలోచిస్తుంటాం. వారితో మనని పోల్చుకుని అసంతృప్తి పడుతుంటాం. నిజమే నమ్మా - ఒక రకమైన సుఖజీవితానికి అలవాటుపడిన మనం ఇప్పుదు మరొక రకంగా ఉండాలంటే కష్టంగానే ఉంటుంది. ఉన్నప్పుదు నలుగురికి పెట్టాం కదా, మాకీ దుస్థితి ఏమిటి అనుకోకు. మన కెట్లా ఉన్నదో అట్లా జరుగుతుంది. అయినా ఎక్కడో ఉండటానికి ఇబ్బందిగా ఉన్నది కనుక అమ్మ దగ్గరే ఉండండి. ఎక్కడైనా ఒకరిల్లు కాని ఇది అందరిల్లు. మీరిద్దరూ ఉండండి. హాయిగా వేళకు ఇంత - ఉన్నదే - తిని, కుంకుమ పొట్లాలు కదుతూనైనా ఉండవచ్చు.

## 34. కష్టాలకు అంతం

బాపట్లనుండి వచ్చిన ఒక సోదరి అమ్మను అడిగింది. తన కుటుంబ విషయాలు, అందులోని గడ్డు పరిస్థితులు చెబుతూ "ఈ జన్మ ఈవిధంగా అనుభవించటానికేనా అమ్మా?"

అమ్మ : అందుకేగా అమ్మా పుట్టిందీ? అనుభవించటానికే.

సోదరి : ఈ కష్టాలు ఈ జన్మకు తప్పవా?

అమ్మ : అది మనస్సుకు సంబంధించిన దమ్మా. తృప్తికరమైన పరిస్థితులున్నప్పుడు మనస్సుకు సుఖంగా హాయిగా వుంటుంది. ఇష్టమైనవి లేనప్పుడు కష్టంగా వుంటుంది. ఇష్టం లేనిదే కష్టం కదమ్మా?

ఇంతలో భోజనానికి పిలుపు రావటంతో అమ్మ వాళ్ళందరిని భోజనాలకు వెళ్ళమని తాను లోపలికి వచ్చింది.

# 35. ప్రశ్నలు చెప్పుకోవటం

**(1-11-64)**

ఆ మహమ్మదీయ కుర్రవాడు ఇక్కడికే తరుచుగా రావటం కాదు . ఎక్కడ పెద్దవాళ్ళు, గురువులు, స్వాములవార్లు ఉన్నారన్నా అక్కడికి వెళుతుంటాడు. మొదట్లో ఆ పుస్తకాలూ ఈ పుస్తకాలూ చదివీ, గురువుల ఉపదేశాలు పొందీ ఏవో సాధనలు చెయ్యబోయాడు కాని కుదరక ఆరోగ్యం దెబ్బతినటంతో అమ్మ సలహామీద ఇప్పుడు ఆ సాధనలన్నీ మానేసి ఏవో ప్రశ్నలూ అవీ చెప్పుకుంటూ ఉన్నాడట.

ఈ రోజు **(1-11-64)** ఆ అబ్బాయి, మరో ఇద్దరు విద్యార్థులు కలసి వచ్చారు. అమ్మ వాళ్ళను భోంచేశారా? అని ప్రశ్నించాక ఆ అబ్బాయిని అడిగింది - "అనుభవానందస్వామి దగ్గరనుండి వస్తున్నావా?" అని.

ఆ అబ్బాయి: అవును.

తర్వాత అమ్మ ఆ విద్యార్థు లిద్దరిని పలకరించి వాళ్ల ఏం చదువుకున్నారో, వాళ్ళ తల్లిదండ్రులు ఎక్కడ వుంటున్నారో అడిగారు. అందులో జంషెడ్‌పూర్‌లో వున్న తల్లిదండ్రుల దగ్గరకి తాను తరుచుగా వెళ్ళటానికి వీలుపడదని బాధపడుతున్న అబ్బాయితో అన్నారు ఆప్యాయంగా "నా దగ్గరకి రా నాన్నా - నీకు భయమేముంది?"

అబ్బా : భయం ఏమీ లేదు, కాని ఇక్కడ సెలవులు అంతగా ఇవ్వరమ్మా. ఇప్పుడైనా వీరి మూలాన రావటం జరిగింది. దారిలో చెప్పాడు-మీరు తనని చూడగానే "అనుభవానంద దగ్గరనుండా?" అని అడుగుతారని. అలాగే మీరు అడిగారు.

అమ్మ : (మధ్యలో) ఈ సంవత్సరం మీ పరీక్షా ఫలితాల గురించి కూడా చెప్పాదా?

ఆవిద్యార్థి: లేదమ్మా. అది మీరు చెప్పాలి.

అమ్మ : నాకు ఇట్లాంటివి ఏం తెలియవు నాన్నా! వాడు వున్నాడుగా అడగండి. అన్నీ చెబుతాడు. వాడు అట్లా ఎందుకు చెప్పాడో కాని నేను అడిగిన ప్రశ్న నాకు తెలిసికాదు. వాడు మొన్న వచ్చినప్పుడు ఈ సారి అనుభవానంద దగ్గరకు వెళ్ళి మాతాజీని చూసి వస్తానన్నాడు. అందుకనే అడిగాను. అంతే కాని ఇందులో నాకు ఏదో తెలిసి కాదు.

– అని అబ్బాయితో మందలింపు పర్వంతో,

"నువ్వు ఇంకా పసివాడివి నాయనా! ఈ ప్రపంచంతో సరిగా పరిచయం లేదు నీకు. అందరిలో చెబుతున్నానని బాధపడబోకు.

ఈ ప్రశ్నలు చెప్పటం నీ జీవనోపాధికి పెట్టుకున్నావు. ఆ చెప్పటం అంతా అమ్మమీద భారంవేసి చెబుతున్నాను – అంటున్నావు. అందువల్లే నువ్వు చెప్పింది చెప్పినట్లు అవుతుం దంటున్నావు. బాగానే ఉన్నది. కాని ఇదేమంత మంచి పద్ధతికాదు. బ్రతుకు తెరువుకోసం ఎన్ని దారులు లేవు? ఇంత చిన్న వయస్సులో కుటుంబ భారం నువ్వు వహించావంటే సంతోషించ దగిన విషయమే కానీ ఈ పద్ధతివలన నీ కెంత దెబ్బో నీకు అర్థం కావటం లేదు. కొన్నాళ్ళు ప్రాణాయామం అంటూ చేసి ఆరోగ్యం చెడకొట్టుకున్నావు కదా! అసలు దాని అర్థం, ప్రాణాయామం అంటే ఏమిటో, ఎందుకు చెయ్యాలో తెలిస్తే ఈ అవస్థలు ఉండవు.

ఇట్లాంటి వాటి జోలికి నువ్వు వెళ్ళొద్దు. దీనివల్ల నీకు కలిగే లాభం కంటే నష్టమే ఎక్కువ. నాలుగు ప్రశ్నలు చెప్పినంత మాత్రాన నీకు భవిష్యత్తు అంతా తెలుసా? అందరి భవిష్యత్తుల గురించి చెప్పేవాడివి నీ భవిష్యత్తు కోసం మరొకరి దగ్గరకు వెళ్ళటం దేనికి? పెద్దలయందు నీకు నిజంగా పూజ్యభావం ఉన్నప్పుడు నీకు విమర్శకు తావు ఎక్కడ వుంటుంది? పోనీ-వీటివల్ల నీకు హాయి ఏమన్నా కలుగుతుందా? అంటే అదీ లేదు. ఈ వయస్సులో హాయిగా ఆడుతూ పాడుతూ వుండవల్సిన వాడివి అనవసరంగా వీటిలో తలదూర్చి బాధపడుతున్నావు. ఇందాక నువ్వు చెప్పిన అబద్ధంలో నీకు వచ్చిందేమిటీ? బ్రతకటానికి ఇదే మార్గం కాదు."

ఆ అబ్బాయి చిన్నబోయిన మొహంతో తలవంచుకుని కూర్చున్నాడు. అమ్మ ఆ అబ్బాయిని తన దగ్గరగా రమ్మనమని దగ్గరకు తీసుకుని అతని శిరస్సును లాలనగా నిమురుతూ-

"నేను అన్నానని బాధపడబోకు నాన్నా, ఈ పద్ధతిలో నువ్వు ఉండటం నాకు ఇష్టంలేక చెప్పాను, నీ విశ్వాసం గొప్పదే! కాదనను. దాన్ని దీన్లో వుపయోగించి అందరికీ లోకువ కావొద్దు. నీ దగ్గర నా ఫొటో లేదన్నావు కదూ, ఉండు - తెప్పించి ఇస్తాను."

అని ఒక ఫోటో తెప్పించి ప్రసాదంతో పాటు ఇచ్చింది. వాళ్ళు అప్పుడే సెలవు తీసుకున్నారు.

## 36. భర్తతో తగువు

ఇక్కడికి దగ్గర్లో ఉన్న మరో పల్లెటూరునుండి భర్తమీద అలిగి ఇక్కడ తలదాచుకోవటం కోసం వచ్చిన స్త్రీతో అమ్మ అన్నది.

"నీ ఇంటికి నువ్వు వెడితేనే బావుంటుందమ్మా. కష్టమైనా, సుఖమైనా నీ భర్త ఇంట్లో నువ్వు ఉండటం ధర్మం కాని ఇట్లా తిరిగితే ఏం బావుంటుంది? లేకపోతే నీ తమ్ముల దగ్గర – కెళ్ళి ఆయనతో మాట్లాడమను– తడవ తడవకు ఈ తగాదాలు రాకుండా, ఏదో ఒకటి చూసుకో. కాని భర్తమీద పోట్లాడి ఇంకోచోట ఉండటం అనేది నాకు ఇష్టంలేని విషయం. ఇవ్వాళ ఇది క్రొత్తకాదుగా నీకు. ఎప్పుడూ ఉన్నదే."

ఆమె ఇదివరకు **1-1-66** ఇక్కడకు వచ్చిందే. అప్పుడూ ఇదే తగాదాతో. చాలా రోజుల తర్వాత మళ్ళీ ఇవ్వాళ **(2-8-66)** వచ్చింది. తన రెండేళ్ళ బిడ్డను చంక నేసుకుని.

ఆమె : ఒకరోజు కాదు, రెండు రోజులు కాదు – రెండేళ్ళనుండి పడుతున్నా నమ్మా ఈ బాధ.

అమ్మ : రెండేళ్ళనుండా? అంతకుముందు సుఖ మనుభవించావు కదా, కనుక కష్టం అంటే ఏమిటో కూడా అనుభవించు. జీవితం అన్నాక కష్టసుఖాలు రెండూ అనుభవించాలి.

ఆమె : ఎంత తగాదాలు, పోట్లాటలు జరిగినా అవి గడపదాటనంత వరకు బాధ ఉండదమ్మా. వారు నలుగురికీ తెలిసేట్టు పోట్లాడతారు. అరుగుమీద కూర్చుని మనిషి మనిషినీ పిలిచి చెబుతుంటారమ్మా. అది నా కెంతో అవమానంగా ఉన్నది. ఇక నేను అక్కడకు వెళ్ళలేను. నీ దగ్గరే ఉంటాను. ఒకవేళ వారు వచ్చినా వారికి బుద్ధి చెప్పి పంపించమ్మా.

అమ్మ : (అందుకు ఇష్టపడని స్వరంతో) నేను ఒప్పుకోనమ్మా. నువ్వు ఇక్కడ ఇట్లా ఉంటాననంటే ఒప్పుకోను. ఉండనివ్వను కూడా. ఇదే నీ భర్తకు చెప్పి వచ్చి ఎన్ని రోజులైనా ఉండు, కాదనను, సంతోషంగా ఉంచుకుంటాను. ఈ పరిస్థితిలో మాత్రం ఉంచుకోను. ఆయన వెళ్ళిపొమ్మంటే మాత్రం నీ ఇంటిని వదిలిపెట్టి ఎట్లా వస్తావు? అది నీ ఇల్లు. పొరుగు పంచలలోనూ అరుగులమీదా కూర్చునేకంటే నీ ఇంటి అరుగులమీద నువ్వు కూర్చో. అది నీ హక్కు. నీ ఇల్లు అది. సంసారంలో తగాదాలంటావా? అవి నీ ఇంట్లోనే కాదు ప్రతీ ఇంట్లోను ఉండేవే. అది మీరు మీరు చూసుకోవాలి కాని నే నెట్లా కల్పించుకుంటాను? నాకేం తెలియదు. నేనేం చెప్తాను? నీ తప్పు లేకుండ నువ్వు చెప్తావు. ఆయన తప్పు లేకుండా ఆయన చెప్తాడు. ఇందులో ఎవరిది తప్పు అని పైవాళ్ళు నిర్ణయిస్తారు? – మీ మనస్సులకు మీకు తెలుస్తుంది కాని. నన్ను సలహా అడిగితే "భర్త నీ దృష్టిలో ఎట్లాంటి వాడైనా – దుష్టుడు కానీ, దుర్మార్గుడు కానీ – అతని దగ్గర తప్ప మరోచోట ఉండకూడ'దని నీకు చెప్తాను.

"భార్య ఎట్లాంటిది అయినా కానీ భరించక తప్పేది ఏముంది? భరించు" అని ఆయనకు చెప్తాను. ఇంత కంటే నేను చెప్పేదేమీ లేదు. నీ కూతురు తప్పు చేస్తే తప్పమ్మా – అని సరిదిద్దే వయస్సు నీది. నువ్వే ఇట్లా చెయ్యటం బావుండలేదు. వెళ్ళు, నీ ఇంటికి నువ్వు వెళ్లు. మన లోపాలు మనకుండగా ఇతరులు ఏదో అన్నారని కోపం ఎందుకూ? బాధ ఎందుకూ? ఆయన నీ భర్త. కొట్టినా తిట్టినా ఇంకా ఏం చేసినా ఆ రక్షణలో తప్ప ఎక్కడా నువ్వు సురక్షితంగా ఉండలేవు. వెళ్ళమ్మా. వెళ్ళలేకపోతే మనిషిని పంపిస్తాను. ఇంటికి తీసుకెళ్తాడు. లేకపోతే ఒక్కదానివే వెళ్ళగలవా!

ఆమె : రేపు వెళ్తానమ్మా.

అమ్మ సరే అన్నది.

# 37. పరిత్యక్తతో అమ్మ

(7-2-66)

'అమ్మా! మీతో మాట్లాడాలి-'

"మాట్లాడండీ"-

- అనిఅమ్మ అనగానే ఆ దంపతులు చెప్పటం ప్రారంభించారు. వారు ఈ ఉదయమే విశాఖపట్టణంనుండి వచ్చారు. మధ్యాహ్నానికి కాని అమ్మతో మాట్లాడటానికి అవకాశం లభ్యం కాలేదు. కూడా తీసుకు వచ్చిన వారి అమ్మాయిని అమ్మకు చూపిస్తూ -

'దీని భవిష్యత్తు ఏమిటి? అల్లుడు విడాకులు కోరుతున్నాడు. అయినా కాదని ఇది ఇక్కడికే వెళుతుంటే నానా బాధపెడు తున్నాడు. పైగా అతను పరాయి వాడు కాదమ్మా, మేనరికమే. చిన్నప్పటినుండి పెంచి పెద్దచేసి చదువు చెప్పించి ఒక ఇంటివాడిని చేసినందుకు నన్నిట్లా బాధపెడు తున్నాడు. దీనికి మార్గం ఏమిటి? మీ సలహా ఏమిటి?'

అంటూ ఆ అమ్మాయితండ్రి రుద్ధకంఠంతో చెప్పసాగారు. అప్పటికే ఆయనలో మింగుతున్న ఏడ్పు ఇక ఆపైన ఒక్కమాటను కూడా మాట్లాడనివ్వలేదు.

అమ్మ : నాకు తెలియదు నాన్నా.

అన్న : కాదు మీరు చెప్పాలమ్మా. జగజ్జనని అయిన మీకు తెలియనిది ఏముంది?

అమ్మ : అది విశ్వాసమే అయితే మాటకు తావు లేదు నాయనా. అయినా ఇది మీ కుటుంబ విషయం. మీరే ఆలోచించి అమ్మాయి విషయంలో ఎట్లా చేస్తే బావుంటుందో అట్లా చెయ్యండి. నేను చెప్పేదేముంది?

అన్న : మీరు చెబితే మాకు తృప్తిగా ఉంటుందమ్మా.

అమ్మ : నేను ప్రత్యేకించి చెప్పేదేముంటుంది? ఆ అమ్మాయికి ఎట్లా జరగాలని నిర్ణయమున్నదో అట్లాగే జరుగుతుంది. అతను వదలిపెట్టినా విడాకులు ఇచ్చినా అమ్మాయికి ఏం లేవు? భర్త లేనివాడే అన్నభావం పూర్తిగా వున్నప్పుడు ఇంకా విడిపోవటం ఏముంది? విడాకులు ఎవరికి? అతనికీ....

ఏడుస్తున్న ఆ అమ్మాయితో -

“ఏడ్వకమ్మా, ఏముంది? నీ విశ్వాసం ధృఢమైనప్పుడు ఏదీ, ఎవరూ నీ భర్తను నీ నుండి విడదీయలేరు. పెళ్ళినాడు నీ మెళ్ళో కట్టినది అతని రెండు పాదాలను. ఆ పాదాలను నువ్వు వదలనప్పుడు ఇంకా అతను ఎక్కడికి వెడతాడు? ఆ పాదాలు నీ దగ్గరే వున్నాయి. తిరుగుతున్నది అతని బొమ్మ. ఇట్లా చెప్పటం తేలికేగాని... అనుకుంటావేమో, నిజమే. ఇటువంటి భావన రావాలంటే అంత సులభమైన విషయం కాదు. అందులో మంగళసూత్రం లైసెన్స్ బిళ్ళలాగా వాడుకుంటున్న ఈ రోజుల్లో ‘భర్త అంటే శరీరంకాదు, భావన’ అనే భావన రావటం మాటల్లో చెప్పినంత తేలిక కాకపోవచ్చు. అందుకే మొదటే చెప్పాను - నీ విధిలో నీకెట్లా వున్నదో అట్లా జరుగుతుందని. చెప్పమన్నారు కనుక - నా వుద్దేశం ‘ఇది’ అని చెబుతున్నాను.

నీ భర్త కావాలి, ఆ ఇంట్లో వుండాలి, అనుకుంటావా- అతను ఎన్ని కష్టాలు పెట్టినా, బాధలు పెట్టినా సుఖంగా భరించు, వుండు. ఉండలే

నంటావా, ఎక్కడున్నా భర్త నీవాడన్న దృఢభావం నీలో వున్నప్పుడు - ఇంకా ఏడ్వటానికి ఆస్కారం లేదు.

ఏది జరిగినా మన మంచికే అమ్మా. వెలుతురున్నప్పుడు ఆ వెనుక చీకటీ ఉన్నది. కష్టసుఖాలూ అంతే. నీ బాధను కాదనను. అది అర్థంచేసుకోకుండా ఇదంతా నీకు చెప్పటం లేదు. ఇది నీ మంచికే వచ్చింది. నువ్వు తరించటానికే వచ్చింది ఇది. నీ మనస్సులో ఆ భావానికి ప్రాధాన్యం ఇయ్యి. జపం చేసుకో. ధ్యానం చేసుకో. ఏ దేవుడు అని అడుగుతావేమో, ఆయననే పూజించు, ధ్యానించు.

రాముడిదగ్గర లక్ష్మణుడు ఉన్నాడు. భరతుడు దగ్గర వుంచుకున్నాడు. నువ్వు దగ్గర వుంచుకోమ్మా-"

# 39. తన మూల మిదం జగత్

**6-11-67**

ఈ రోజు కార్తీక సోమవారం. ప్రతి సంవత్సరం లక్ష్మీనారాయణ అన్నయ్య ఆ నాలుగు వారాలూ అమ్మ పాదాలను పాలతో అభిషేకం చేస్తాడు. అన్నయ్య భార్య కమల - పరమాన్నం ఏ రకం చెయ్యమంటాడో - అడగటానికి గదిలోకి వచ్చింది.

కమల రాకని గమనించినా గమనించినట్టే అమ్మతో మాట్లాడు తుంటే అమ్మ అన్నది.

కాసేపు గడిచాక -

"అది నీ కోసం వచ్చిందిరా- ఏం కావాలో చూడు."

అన్నయ్య : (నవ్వుతూ) నాకోసం కాదమ్మా.

అమ్మ : నా కోసం అంటావా?

కమలవంక చూస్తూ నవ్వుతూ అడిగింది.

అన్నయ్య : కావాలంటే దాన్ని అడుగు.

కమల నవ్వింది. అమ్మ అన్నది....

"అది ఎవరికోసమూ రాలేదు. దానికోసం అది వచ్చింది. నా కోసం అది వచ్చినట్లు కనపడినా - అది వచ్చింది తనకోసమే. ఎవరు ఏది చేసినా తన కోసమే. కోపం, తాపం, ధర్మం, ప్రేమ - అన్నీ తన కోసమే, అందుకే అన్నాను - తన మూల మిదం జగత్, ధన మూలం కాదు."

కమల : ఈ మాట చిన్నప్పుడే చెప్పావు కదమ్మా.

అన్న : మరి 'ధనమూలం' అని ఎందుకన్నట్లు?

అమ్మ : (నవ్వి, తేల్చి వేసినట్టుగా)

ఆఁ, ఎవడో నీలాంటి నాగమ్మ దబ్బు సరిపోకో లేకో ఆ సమయానికి అని ఉంటాడు. అంతే.

# 40. రావడానికి చేరువ

**(6-2-65)**

జిల్లెళ్ళమూడికి హైద్రాబాద్ చాలా దూరం కనుక తాను ఇదివరకు ఉండిన విజయవాడ నుండి తరుచుగా అమ్మ దగ్గరకు వచ్చినట్లు - ఇక నుండి రాలేనేమో - అని బాధపడుతున్న ఆ సోదరుడితో అమ్మ అన్నది ......

అమ్మ : అట్లా దిగులు పడబోకు నాన్నా, విజయవాడలో ఉన్నా ఏ మాత్రం రాగలిగావు? అంటే నువ్వు అనుకున్నప్పుడల్లా రాలేదు కదా! హైద్రాబాద్‌లో ఉంటే రావని ఏముంది?

దగ్గరున్నా వస్తారనేమి ఉన్నది? దూరంగా ఉన్నా రారని ఏముంది? వచ్చే సమయం ఉంటే ఎంత దూరంలో ఉన్నా వస్తారు. ఆ సమయం లేనప్పుడు ప్రక్క ఊళ్ళో కాదు, ఊళ్ళో ఉన్నా రాలేరు. దగ్గరా దూరం అని ఏముందీ?

## 41. ఆధారం

అమ్మ వాత్సల్యానికి ఆవిడ ఆనందంలో తలమునకలై కళ్ళనిండిన నీరు తుడుచుకుంటూ -

'అంత కంటే కావాల్సింది ఏమున్నదమ్మా?' ఒక చిన్నకోరిక కోరుతున్నానమ్మా'.

-అని మంగళసూత్రాలు చూపించి -

'ఇలాగే చనిపోయేట్టు అనుగ్రహించమ్మా' అన్నారు.

అమ్మ మందహాసంతో ఆవిడ చేతిని తన చేతిలోకి తీసుకుని నిమురుతూ-

"అది నీకే కాదు. ప్రతి స్త్రీకి సహజంగా ఉండే కోరికే" అన్నది.

సోదరి : నాకు వారూ-మీరూ ఉన్నా రనుకుంటాను. మీబోటి పెద్దల అనుగ్రహమూ, దైవమూ తప్ప ఇప్పుడు నాకు మరో ఆధారం లేదు.

అమ్మ : దైవమే సర్వం అనుకుంటే బాధ ఏముందమ్మా? దైవం కంటే చుట్టం ఎవరూ? దైవం తప్ప ఆధారం లేదనుకున్నప్పుడు ఇంకా అంతకన్నా కావాల్సింది ఏముంది? ఆధారం దైవ మయినప్పుడు - ఆధారం లేకపోవడ మేమిటమ్మా?

# 42.డ్యూటీ

**(18-1-65)**

వారం రోజుల క్రిందట విజయవాడ నుండి ఒక అన్నయ్య వచ్చి ఇక్కడ ఉంటున్నారు. ఇన్నిరోజుల్లో ఒక్కపూట కూడా అమ్మ గదిలోకి రాకుండా అమ్మను చూడకుండా మందిరంలో ఒక్కడే పడుకోవటం, ఆలోచించటం, విపరీతంగా సిగరెట్లు త్రాగటం – ఇదంతా చూసేవారికి చిత్రంగానూ అనుమానం గానూ ఉంది.

వీటికితోడు ఇంట్లో చెప్పకుండా వచ్చాడట. అని ఇవ్వాళ ఉదయం వాళ్ళ మామగారు అతనిని వెతుక్కుంటూ వచ్చేదాకా తెలియలేదు. వారు చాలా తీవ్రంగా ఆవేశంగా అమ్మతో మాట్లాడారు – ఇటువంటి వాళ్ళందరికి అమ్మ ఆశ్రయం ఇచ్చి చెడగొడుతున్నారని.

ఆయనను పూర్తిగా మాట్లాడనిచ్చి ఆ తర్వాత అమ్మ నెమ్మదిగా అన్నది....

“అబ్బాయి వచ్చి వారం రోజులు దాటిందన్న విషయం కూడా నా కీ ఉదయమే తెలిసింది. అతని ప్రవర్తన ఇక్కడందరికీ చిత్రంగా ఉన్నది. ఎప్పుడూ సిగరెట్లు త్రాగుతూ, తనలో తాను మాట్లాడుకుంటూ ఆ మందిరంలో పడుకుంటాడట. తరుచుగా వస్తుంటాడు కనుక మొదట్లో ఎవరూ అంతగా పట్టించుకోలేదు. ఈ రోజే హరిదాసుగారు వచ్చి చెప్పారు ఈ సంగతి. వివరాలు ఏం అడిగినా అతను నోరు విప్పి చెప్పటం లేదట. నేను పిలిచి విషయ మేమిటో కనుక్కుందా మనుకుంటూ ఉండగా మీరు వచ్చారు. వచ్చిన రోజే ఆ అబ్బాయి నన్ను చూడటం. ఆ తర్వాత ఇంతవరకు నాకు కనిపించలేదు. ఒకరిని ఉండమనేది లేదు; పొమ్మనేదీ లేదు. అందువల్ల ఎవరు వస్తున్నారో ఎవరు ఎన్ని రోజులుంటున్నారో నాకు తెలియదు. ఇది రావటానికి – పోవటానికి –

ఉండటానికి అడ్డులేని ఆవరణ. ఎవరైనా చెబితే కాని నాకు ఇటువంటి విషయాలు తెలియవు నాన్నా.

వారు : అక్కడా ఇంతే నమ్మా, ఇదే తీరు. కూతురు నిచ్చాను కనుక దాని ఏడుపు చూడలేక దేశాలవెంట తిరగటమే జరుగు తున్నది ఇతనికోసం. మీరు వెళ్ళమంటే ఎందుకు వెళ్ళడు? ఎప్పుడూ కుంకుమ తింటాడు. ఎందుకూ అంటే – అమ్మ తినమన్నది – అంటాడు. ఉద్యోగ విషయంలోనూ అట్లాగే. మీరు మానెయ్యమన్నారని చెప్పాడు.

అమ్మ : లేదు నాన్నా. నేను ఎప్పుడూ అట్లా చెప్పను. ఎందుకు కుంకుమ తింటున్నాడో ఎందుకు ఉద్యోగం మానుకున్నాడో నాకు తెలియదు. అసలు ఈ కొన్న కుంకుమ పుండు పడుతుంది అని బొట్టే పెట్టుకోవద్దు అన్నాను. ఇంకా తినమని చెప్పాల్సిన అవసరం ఏమున్నది? అది తిన్నందువల్ల వచ్చే లాభం ఏమిటో నాకేం తెలుసు? అయినా అబ్బాయిని పిలవండి. మీ ముందే అడుగుతాను.

వారు వెళ్ళి పిల్చుకువచ్చారు. అమ్మ కాసేపు అతని వంక చూసి మృదువుగా అడిగింది –

అమ్మ : ఎన్నాళ్ళయింది నాన్నా వచ్చి?

అన్న : (నెమ్మదిగా) ఐదు రోజులైంది.

అమ్మ : ఎక్కడ ఉంటున్నావు?

అన్న : ఇక్కడే పందిట్లో.

అమ్మ : ఎందుకోసం వచ్చావు?

అన్న : నిన్ను చూడటానికి.

అమ్మ : చూడటానికైతే చూడటం అయ్యిందిగా, వెళ్ళు.

అన్నయ్య సమాధానం ఇవ్వలేదు.

అమ్మ : కుంకుమ తింటూ నేను తినమన్నానని చెబుతుంటావట. నేను ఎప్పుడైనా అన్నానా? ఇంకా ఆ కుంకుమ బొట్టు పెట్టుకుంటే పుండుపడుతుంది, వద్దని చెప్పలేదూ?

చెప్పినట్టు అన్నయ్య శిరస్సు నూగించాడు.

అమ్మ : నేను చెప్పని సంగతి చెప్పినట్లు ఎట్లా - అన్నావు నాన్నా?

అన్న : నాకు అనిపించింది. ఆ అనిపించటం నువ్వే అనుకున్నాను.

అమ్మ : అయితే ఇక మాట్లాడను.... .... ....

సరే ఈ భావనకు అడ్డులేదు. కాని ప్రతి విషయంలో ఇట్లాగే అనుకుంటావా - ప్రతిదీ అమ్మే చేయిస్తుందని?

అన్న : అన్నీ అనుకుంటాను.

అమ్మ : నీకు తోచే సంకల్పమేనా - లేక ప్రతిదా?

అన్న : నాకు తోచే సంకల్పాన్ని అనుకుంటాను.

అమ్మ : (అన్నయ్య మామగారి నుద్దేశించి) తనకు తోచే సంకల్పమే నేను అనుకుని చేస్తున్నాడట. ఇక నాకు మాట్లాడాల్సిన పని లేదు. కాని ఆ నడక ఇట్లా ఉండదు.

అని ఆ అన్నయ్యని మందలించింది.....

"నువ్వు ఎట్లా నడిచినా నాకు సరిపోతుంది కాని ఇక్కడి వాళ్ళకు సరిపోదు. వాళ్ళు వెళ్ళమంటారు. నీతో ఇట్లా చేయించే అమ్మే వాళ్ళలో అట్లా ప్రేరేపిస్తుంది. నీ ఒక్కడి చేత చేయించేదే కాదు అమ్మ. అందరిలో ఉండి చేయించేదీ అమ్మే.

నేనేం వదలుకున్నాను అని - మిమ్ములందర్నీ అన్నీ వదులకో మంటాను? ఇంక ఇట్లా ఎప్పుడూ చెయ్యకూ, దైవం ఎవరూ అంటే - నీ డ్యూటి

నువ్వు సక్రమంగా నిర్వర్తించటం; నీలోని నిజాయితీయే. అంతేకాని మిమ్ములందర్నీ అన్నీ వదులుకుని ఇక్కడికి వచ్చి కూర్చోమని చెబుతున్నానా? కూర్చుందామన్నా కూర్చోటానికి అవకాశం లేదు. ఇక్కడకు తగ్గ పనులు ఇక్కడా ఉన్నాయి.

భోజనం చేసి ఈ పూటే మీ మామగారితో బయల్దేరు. నీకు ఇక్కడ ఉండటానికి ఇది మార్గం కాదు. నీకు రావాలనిపించి నప్పుడు పెద్దవాళ్ళ అనుమతి పొంది రా. నాలుగు రోజు లుండు – ఉండాలనిపిస్తే. అంతేకాని నీ మనస్సులో ఏదో పెట్టుకుని అది తీరక ఇట్లా నటించటం ఎందుకూ?

అన్న : నాకు ఇక్కడికి రావటానికి పెద్ద అభిలాష ఏం లేదు కాని అల్లుడి మూలాన వచ్చాను.

అమ్మ : ఒక్కొక్కటి ఒక దానికి కారణమౌతుంది.

ఇప్పుడు ఆయన పశ్చాత్తాప పడుతున్నారు.... ఉద్రేకంలో అమ్మను ఇందాక నిందించినందుకూ, అంతేకాక ఈ వారం రోజులు ఇక్కడ అల్లుడి ప్రవర్తనకూ, ఇప్పటి తన మాటలకు అమ్మకు ఏం కోపం వచ్చిందో అని. ఆ మాటే అన్నారు.

'నామీద కోపం వచ్చిందేమో! వాడు పసివాడు. వాడిమీద కోపం తెచ్చుకోకండి.'

అమ్మ : (నవ్వుతూ) పసితనమంటే వయస్సు కాదుగా నాన్నా, తెలియని తనమే. నాకు మీమీద కోపం ఏనాడూ లేదు. రాదు. అవసరాన్ని బట్టి – సమయాన్నిబట్టి కోపం ఉన్నట్టు కనిపించాలి. కాని నాకు ఏనాడూ మీమీద కోపం రాదు. అది వచ్చిన మర్నాడు నేను అమ్మను కాను. మీరు ఇట్లా ఉండరు.

# 41. ఆధారం

అమ్మ వాత్సల్యానికి ఆవిడ ఆనందంలో తలమునకలై కళ్ళనిండిన నీరు తుడుచుకుంటూ -

'అంత కంటే కావాల్సింది ఏమున్నదమ్మా?' ఒక చిన్నకోరిక కోరుతున్నా నమ్మా'.

-అని మంగళసూత్రాలు చూపించి -

'ఇలాగే చనిపోయేట్టు అనుగ్రహించమ్మా' అన్నారు.

అమ్మ మందహాసంతో ఆవిడ చేతిని తన చేతిలోకి తీసుకుని నిమురుతూ-

"అది నీకే కాదు. ప్రతి స్త్రీకి సహజంగా ఉండే కోరికే" అన్నది.

సోదరి : నాకు వారూ-మీరూ ఉన్నా రనుకుంటాను. మీబోటి పెద్దల అనుగ్రహమూ, దైవమూ తప్ప ఇప్పుడు నాకు మరో ఆధారం లేదు.

అమ్మ : దైవమే సర్వం అనుకుంటే బాధ ఏముందమ్మా? దైవం కంటే చుట్టం ఎవరూ? దైవం తప్ప ఆధారం లేదనుకున్నప్పుడు ఇంకా అంతకన్నా కావాల్సింది ఏముంది? ఆధారం దైవ మయినప్పుడు - ఆధారం లేకపోవడ మేమిటమ్మా?

# 43. హైమ మరణం

**(21-2-69)**

ఉదయం తొమ్మిది గంటల సమయంలో అమ్మ గదిలో శ్రీపాదవారు ఏదో చదివి అమ్మకు వినిపిస్తున్నారు. అమ్మ మంచంమీద కూచుని వింటున్నది. కోటేశ్వరరావు అన్నయ్య కూడా అక్కడ వున్నాడు. శ్రీపాదవారు చదువుతూ మధ్యలో ఆపి అమ్మని, 'అమ్మా, అమ్మ దేవుడయితే హైమ ఎందుకు పోయింది?- అని నన్ను చాలామంది ప్రశ్నిస్తున్నారు' అని అడిగారు.

అమ్మ : ఆ ప్రశ్న అడిగినవాడికి పక్కనే వుంది సమాధానం. దేవుడు అంటున్నావు గనుక, సృష్టి, స్థితి, లయహేతు భూతుడనేగా. అమ్మను కన్నది పోయింది. అమ్మకు పుట్టింది పోయింది. అమ్మను కన్నావిడ తాను (అమ్మ) భూమిమీదకు రావటానికి అవసరం అయింది, ఆ పనయి పోయింది, వెళ్ళిపోయింది. అట్లాగే హైమ వచ్చిన కారణం అయిపోయింది, వెళ్ళి పోయింది. పుట్టటం ఎంతో, పోవటం అంతే. రక్షణఅంటే - జబ్బుపడిన వాడికి తీర్థం ఇస్తే నయమయినదే అనుకుం టాడు. అమ్మ కూతుర్ని రక్షించుకోలేక పోయిందా అంటే - అమ్మకు నువ్వెంతో, అమ్మాయీ అంతే. ఈ పొయ్యేవాళ్ళందరినీ ఆపటం లేదుగా. కోటేశ్వరరావు కొడుకు పోయి నప్పుడు ఇక్కడే కూచుని మాట్లాడుతున్నాను. గొడ్లని కాచుకు రావటానికి వెళ్ళాడు, తిరిగి రాలేదు.

పోయే వాళ్ళందరినీ ఆపటం లేదుగా. అమ్మ కూతురని ప్రత్యేకత మీ దృష్టిలో వుండొచ్చు. అమ్మ తండ్రి పోయినాడు, తల్లి పోయింది.

అప్పుడే గదిలోకి వస్తున్న భరద్వాజ అన్నయ్య 'అసలు అవతారాలే శరీరాలు త్యాగం చెయ్యటం కనపడుతోంది గదా, ఇంకొకరి దాకా ఎందుకు?' అన్నారు.

అమ్మ చిరునవ్వు నవ్వి –

"దైవత్వానికీ, దీనికీ సంబంధం లేదు. వాళ్ళకు పనుంటే వుంచటం, పనయిపోతే పంపించటం అన్న ఆలోచన రాదు. (అడిగేవారికి)".

కోటేశ్వరరావు అన్నయ్యవైపు చూస్తూ –

"నీ జీవితానికీ, అమ్మ దైవత్వానికీ సంబంధం లేదు. అమ్మమీద నాకు ఇంత భక్తి వుంటే ఈ జబ్బు ఎందుకు వచ్చిందీ అన్నావనుకో – ఆ మాటకి అర్థంలేదు. కొన్ని శాస్త్రాల్లో – ఆకలే జబ్బు, అన్నమే మందు – అంటారు. అట్లా వరసగా అన్నీ జబ్బులే – శరీరంలో వచ్చే ప్రతిదీని. నవ్వూ జబ్బే, ఏడుపూ జబ్బే – అంటారు హోమియోలో. డబ్బు ఆశకూడా జబ్బేనని మందిస్తాడు. జబ్బు ఎందుకు పుట్టిందీ అని తీసుకుని మందిస్తాడుగాని, జబ్బుకి మందు లేదు. దాని అర్థం ఏమిటంటే – గుణానిక్కాని మందిచ్చేది, జబ్బుక్కాదని. మనస్తత్త్వంమీద పని చేస్తుంది కదా హోమియో."

ఓ క్షణం ఆగి, అమ్మ మళ్ళీ.

"దైవత్వానికి – అసలు ఆలోచిస్తే నీ జబ్బు జబ్బు కాదు. జీవితం జీవితం కాదు. చెవ్వూ, ముక్కూ నీ కవసరం గానీ, వాటికి నీతో అవసరం లేదు. నువ్వుంటూ వున్నప్పుడు నీ లోక వ్యవహారాలు నడపటానికి అవి అవసరం. అవసరం అయినప్పుడు ఒక పాత్రని తీసుకుని వాడుకుని మళ్ళీ అక్కడ ఎట్లా పెడుతున్నామో – ఇది కూడా అంతే. అవసరం అయితే పంపిస్తాను, లేకపోతే పిలుచుకుంటాను."

# 44. పూజలో దీక్ష

(22-10-65)

శాస్త్రి అన్నయ్య వచ్చి నాల్రోజు లైంది. ఈ రోజుకు గానీ అమ్మతో మాట్లాడటానికి వీలుపడలేదు.

అన్నయ్య అమ్మని అడిగారు తన సందేహాన్ని -

'పూజ చేస్తున్నప్పుడు పూలు, ఆకులు ఇవన్నీ కూడా ఏదో యాంత్రికంగా పెడుతున్నట్టుంటుంది. కానీ పూజ చేస్తున్నట్లు ఫీలింగ్ రాదు, ఎందుచేత?

అమ్మ : నువ్వు ఏ ఉద్దేశంతో ఫీలింగ్ అనే పదం వాడావో కాని ఆ స్థితి రాకుండా లేదు. గుళ్ళోకి వెళ్ళినప్పుడు నీకు తెలియ కుండానే నీ చేతులు జోడింపబడ్డాయి. ఎందుకూ? ఆ ఉద్దేశం లేకుండానే బజారున వెళ్తున్నావు కదా. వెళ్తున్నప్పుడు నీ కెందుకు? నిన్నెవరన్నా పిల్చారా? ఇంకో ఇంటికి అయితే వెళ్తావా? ఎవరన్నా పిలవనిదే వెళ్తావా? అకస్మాత్తుగా గుళ్ళోకి వెళ్ళడమూ చేతులు జోడించటమూ మార్పే. అదీ ఫీలింగే. అట్లాంటివన్నీ నీకు తెలియకుండానే నీకు వస్తున్నాయి.

పూలతో పూజ చేస్తుంటావనుకో - నీ మనస్సు తమాషాగా ఈ పువ్వుమీద ఆ పువ్వు పెడితే చాలా బాగుందనిపిస్తుంది. అంతకు ముందు ఆ అభిప్రాయం నీలో లేదు. పేర్చుకు రావటం ప్రారంభించిన తర్వాత ఉద్దేశం దానంతట అదే బయల్దేరుతుంది. అట్లాగే పేరుస్తావు. అది చూసి ఆనంద పడతావు. ఒక్కొక్కసారి నీకు తెలియకుండానే కళ్ళ నీళ్ళు వస్తుంటాయి. ఇప్పుడు ఇదంతా ఫీలింగ్ కాదూ?

ఇదంతా మామూలైంది. కనుక ఇది కాని స్థితి ఏదో ఉన్నదని, అది వస్తే నిజంగా ఫీల్ అయినట్టు అనుకుంటావు.

11

గుళ్ళోకి పోవటం సహజం కనుక అందులో ప్రత్యేకత ఏముంది? అది ఫీలింగ్ ఎట్లా అవుతుందని అంటావు?

నేనూ అదే అంటున్నాను. మన కివి సహజమై పోయాక అందులో ప్రత్యేకత ఉన్నా - ప్రత్యేకత కనిపించదు.

ఒక భక్తిలోనే కాదు. మామూలు విషయాలలో కూడా మనం "ఫీలింగ్" లు అనుభవిస్తూనే ఉన్నాం. నువ్వు ఏదైనా తీవ్రమైన బాధకో, సంతోషానికో లోనయినప్పుడు నీకు నీ చుట్టుప్రక్కల ఏం జరుగుతున్నా అర్థం కాదు. ఆ విషయమే నీ మనస్సులో ఎక్కువగా పనిచేస్తున్నప్పుడు తతిమ్మావన్నీ నీకేం తెలియవు. నీ యెదుట నున్న దానిని నీ కళ్ళు చూస్తుంటాయ్ తప్ప నీ మనస్సు గ్రహించదు. ఏమీ వినపడదు, ఏదీ కనపడదు - ఆ ఒక్కటి మినహాయించి.

ఆధ్యాత్మికంగా పొందుదా మనుకునే ఈ మానసిక స్థితి మనకు నిత్యకృత్యాలలో వస్తూనే ఉంటుంది. విషయం వేరు కావచ్చు కాని మనస్సు అట్లాగే పనిచేస్తుంది. దాన్నైతే - మనస్సు నిల్చింది, లగ్నం అయింది, ధ్యానం అయింది - అంటున్నాం. దీన్ని మామూలు విషయంగా తీసుకుంటున్నాం. అది అనుభవించేదీ మనస్సే. స్థితులు ఎప్పుడూ కలుగుతూనే ఉన్నాయి. పూజ చేస్తున్నప్పుడు ఇంతగా మనస్సు ఎందుకు నిలవదంటే– అక్కడ ఇంత వేదన ఏర్పడలేదు కనుక. నీ చేతిలో ఎవరి వస్తువైనా పగిలిపోతే భయపడి, ఆ వస్తువు మీద నేరం ఎట్లా తప్పించుకుందామా అని నువ్వు ఆలోచిస్తు న్నప్పుడు - నేను కాఫీ ఇవ్వొచ్చు, అమృతం ఇవ్వొచ్చు - నువ్వు సంతోషపడాలని నేనెంతో దగ్గరకుతీయొచ్చు కాని ఏం చేసినా ఆనందపడలేవు. నా కోసం నా వంక చూసి నవ్వినా ఆ నవ్వు నవ్వే కాదు. నీ దృష్టిలో అదే నిలబడుతుంది. ఇటువంటి స్థితే పూజలో రావాలి. ఏం చేసినా ఏం చెందుతున్నా

పెట్టేవి పూలు కావొచ్చు కాని ఈ పూలు కాదు, గుర్తుండాలిసింది. ఎక్కడ ఎట్లా పెడితే బాగుంటుందనీ కాదు. ఆ మూర్తిమీద మనస్సు లగ్నం కావాలి.

శాస్త్రి : అదే అసలు. అదెలా వస్తుందని?

అమ్మ : వస్తుంది. ఇవన్నీ లేవూ వీటితోపాటు అదీనూ. ఎప్పుడు వస్తుంది? ఎట్లా వస్తుంది? అంటే ఈ స్థితులు ఎట్లా ఏర్పడ్డాయో అట్లాగే అదీ వస్తుంది. స్థితి అంటే అది భక్తి కావొచ్చు బాధ కావొచ్చు. ఇంకా ఏదైనా కావొచ్చు. భక్తికి ప్రేమకు తేడా లేదు. భగవంతుడియందుండే దాన్ని భక్తి అన్నాం. మనుష్యులయందుండే దాన్ని ప్రేమ అన్నాం. అది ఏ విషయమైనా కానీ దాన్ని గురించి నీకు తీవ్రమైన వేదన వున్నప్పుడు నువ్వు అనుకున్న ఫీలింగ్ నీకు తెలియకుండానే వస్తుంది.

ఒక వ్యక్తిమీద నీకు తీవ్రమైన కోపం వచ్చిందనుకో నాన్నా – ఆ మనిషి నీకు ఎప్పుడూ గుర్తుంటాడు. వాడిని ఏదో రకంగా సాధించటానికి అనేక రకాలుగా ఆలోచిస్తుంటావు. ఆ ఆలోచనలో వాడు నీ దగ్గరికి వచ్చి కూర్చున్నట్టే. నువ్వు ఏ ధ్యానం చేస్తే వాడు దగ్గరగా వచ్చి కూర్చున్నాడు? అందుకు నువ్వు ఏ సాధన చేశావు?

ఇదంతా వింటున్న గోపాలన్నయ్య అన్నాడు.

'అంటే ఇప్పుడు భగవంతుడిని పూర్ణంగా మనం ద్వేషించినా అంతే నంటావు?'

అమ్మ : అసలు ద్వేషించే స్థితి రావాలిగా మనకు. ఎంత ప్రేమ మిక్కుటమైతే ద్వేషించగలవు? భగవంతుడిని ద్వేషించడానికి ముందు తగినంత ప్రేమ కలిగితేనేగా. ప్రేమ లేని చోట అసలు కోపం కూడా రాదు.

# 45. మృత్యుంజయుడు

**(23-6-67)**

అమ్మ : మృత్యుంజయుడంటే చావు లేకుండా ఎప్పుడూ శరీరంతో ఉంటాడని కాదు. చావును గురించి ఆలోచన లేనివాడు, భయం లేనివాడు మృత్యుంజయుడు. రాముడు, కృష్ణుడు - వీళ్ళంతా మృత్యుంజయులేనని చెప్పుకుంటున్నాంగా, శాస్త్రాధారంతో. అయితే ఏరి వాళ్ళు? శరీరాలతో లేనంత మాత్రాన వాళ్లు మృత్యుంజయులు కారా?

నేను పోతుకూచి రవిని మృత్యుంజయు దంటాను. తాను ఇక కొన్ని గంటలలో చనిపోతున్నా నని తెలిసి కూడా వాడు భయపడలేదు.

వాళ్ళను చూడాలి, వీళ్ళను చూడాలి, కనీసం నన్ను చూడాలి - అని కూడా వాడు కబురు చెయ్యలేదు. చనిపోయేటప్పుడు కూడా వాడి కళ్ళలో నీళ్ళు తిరగలేదు. తెలివి తప్పలేదు. నేను ఆ క్రిందటి రాత్రి చూడటమే, తెల్లవారుజామున నాలుగు గంటలకు వాడి దగ్గరకు వెళ్ళి వచ్చాను. దగ్గర ఉన్న వాళ్ళు కబురు చేసేదాకా వెళ్ళలేదు. పడిపోయాక కబురు చెప్పారు. దగ్గరకు వెళ్ళాను. తీర్థం వేశాను. అంతే. నావంక అలా చూసి కళ్ళుమూశాడు. ఇది మన కళ్ళముందు జరిగింది కనుక అనుకుంటున్నాం. ఇంకా ఇటువంటివి అనేకం ఉండవచ్చు అక్కడక్కడ.

రాఘవయ్యగారు అన్నారు -

'అది కూడా అమ్మ కరుణేగా.'

అమ్మ : ఏది కాదు అమ్మ కరుణ? ఏదో అవసరానికి ఆ మాట ఉపయోగించటమే కాని ఆ స్తిమితం అక్కడ ఉండి గాదు. ఏది చేసినా ఏది ఇచ్చినా - అమ్మ కరుణే - అన్న దృఢ విశ్వాసమే ఉన్నప్పుడు మనం అనుకున్నవి జరగనప్పుడు ఎంత స్వల్ప విషయమైనా కాని - బాధపడటం అంటూ జరగదు. సంభాషణలో వచ్చింది కనుక అనొచ్చు కాని అక్కడ పూర్తిగా వుండి కాదు.

# 46. మనస్సు

ఆమె : అమ్మా- వితంతువులను సంఘంలో అగౌరవంగా చూస్తారు. ఈ వ్యవస్థలోని సంప్రదాయాలు స్వతస్సిద్ధమయినవా! మనం ఏర్పరచుకున్నవా?

అమ్మ : దైవదృష్టిలో తేడాలు లేవు. మనం ఏర్పరచుకున్నవే.

ఆమె : దైవారాధనపట్ల పితృకార్యాలపట్ల పిల్లలు విమర్శాత్మకమైన దృష్టితో ప్రవర్తిస్తున్నారు. నమ్మకం సన్నగిల్లుతున్నది. కారణం ఏమిటమ్మా?

అమ్మ : అపచారాలు చూస్తున్నారు కనుక.

ఆమె : పెద్దలకు నమస్కారం చేయటానికీ సందేహంగా ఉంది. యీనాటి యువతరానికి.

అమ్మ : నమస్కారం చేయించుకునే వాడికంటె చేసేవాడే గొప్ప. అసలు నమస్కారమంటే మనకు తెలియకుండా పాదాలపై చేతులు పడతాయి. కొందరు మనస్సులో చేసుకోవచ్చు. నీ మనస్సులోని భావం ఎవరు తీసేయగలరు?

ఆమె : సంఘ వ్యవస్థను వదలటం కష్టం.

అమ్మ : రెండూ బాధే. చేస్తే ఒక దంటాడు. చేయకపోతే మరొకడంటాడు.

ఆమె : మన మనస్సు దేనిని నమ్మి చేస్తే -

అమ్మ : మనస్సుకేగా సందేహం. అదే వింటున్నది. కావాలను కుంటున్నది. వద్దనుకుంటున్నది. మనస్సూ - మానవుడూ వేరు కాదు. పరిస్థితులకు లొంగిపోక తప్పదు. నిజానికి అది బోధించినట్లుగా ఏ గురువూ బోధించలేదు. ఈ మాట్లాడేదంతా దాని స్వభావమే. ఆలోచన దాని స్వభావమైనప్పుడు ఆలోచన రాకుండా ఎలా? వినేదీ, చూచేదీ అదే. దైవాన్ని వేడుకునేది భక్తి కుదర్చమనే. అది మనస్సు ద్వారానే గదా!

ఆమె : సాంగత్య దోషం వుంటుందా?

అమ్మ : అవకాశం వున్నంతవరకూ తప్పుకోవచ్చు.

ఆమె : నిగ్రహముంటే ఫర్వాలేదు. దేనిమాట వినాలో తోచదు. నటించటం కష్టం.

అమ్మ : నటన అంటే ఒకటి అనుభవిస్తూ మరొకటి చూపించటం.

ఆమె : నాదీ అనుకోకుండా చేయటమెలా?

అమ్మ : అందుకే నీతో నిన్ను జయించాలి. సర్వం నీవు అనుకున్నా సరే. నేనే అనుకున్నా సరే. (మెల్లగా తనలో తానే అనుకున్నట్లుగా) అదే నిలవదు, కష్టం.

ఆమె : రెండూ ఒకటేగా.

అమ్మ : మనమే చేస్తున్నామా? ఇంకొకటి వున్నదా? - అనేది అసాధ్యం అనుకొన్నది అయినప్పుడు - గోచరిస్తుంది.

ఆమె : పిల్లలు ప్రత్యక్ష అనుభవంతో తప్ప వేరుగా విశ్వసించటం లేదు.

అమ్మ : నాకు చెబుతావుగదా, నీవు చూపించూ - అంటారు. కనబడుతున్న ప్రకృతినీ, దానిలోని శక్తినీ ఎదురుగా కనబడుతున్నదానినీ ఏ కుఱ్ఱవాడు కాదనగలడూ! (తన చేతిలోని పువ్వును జూపుతూ) ఈ పువ్వులోని వాసనగా (దేవుడు) ఉన్నాడంటాను. కాదనగలరా! ఇదంతా పొయ్యేది, అశాశ్వతమైనదీ - అని ఇది కానిది ఇంకొకటి ఉందంటే నమ్మటం కష్టం. రెండు పాదాలూ ఒకేసారి వేస్తామా - నడక సాగించదానికి. హెచ్చూ తగ్గూ - అందుకే సృష్టిలో.

# అశాంతి

**(20-10-64)**

ఎప్పుడూ ముగ్గురుగా కలసి వచ్చే ఆ అన్నయ్యలలో ఈ రోజు ఇద్దరే వచ్చారు. ఒకరు నాగపూర్ వారు, రెండోవారు నర్సరావుపేటవారు.

అమ్మ హాల్లోకి వచ్చి కూర్చున్నారు. పూజలు, తీర్థ ప్రసాదాలు ఇవ్వటం పూర్తి అయింది. అప్పుడే తీర్థ ప్రసాదాలు ఇవ్వటం పూర్తి అయింది. అప్పుడే తీర్థం వేస్తున్నప్పుడే అమ్మ వాళ్ళని అడిగింది. మూడో అన్నయ్య ఏరి? అని. హైద్రాబాద్‌లో ఉన్నాడని పనుల ఒత్తిడి వలన రాలేకపోయాడని చెప్పారు.

అమ్మ : (భుజంగరావు అనే అన్నయ్యతో)

ఇంకా తగ్గలేదా, దగ్గుతున్నావు?

ఆ అన్నయ్య తీర్థం తీసుకుంటూ దగ్గాడు.

అన్న : ఇక్కడనుండి వెళ్ళాక తగ్గింది కాని మళ్ళీ ఇవ్వాళే వచ్చింది.

అమ్మ : అమ్మను చూడగానే వచ్చిందేమో.

అన్న : నాకూ అదే అనిపిస్తుంది.

రెండో అన్నయ్య (రంగనాథమ్)ను అడిగింది అమ్మ.

"నాగపూర్‌లో ఉంటున్నావా?"

అన్న : అవునమ్మా. కాని అనంతపూర్‌నుండి వస్తున్నాను.

అమ్మ : వాళ్ళను ఇక్కడ ఉంచి - నువ్వు ఒక్కడివే అక్కడ ఉంటున్నావా?

అన్న : నాకు ఇంకా పెళ్ళికాలేదమ్మా.

అమ్మ : (నవ్వి) నాకు తెలుసు నాన్నా - నీకు పెళ్లి కాలేదని, మొదటిసారి వచ్చినప్పుడే చెప్పావు - నాకు బాగా జ్ఞాపకముంది. వాళ్ళు అంటే తల్లి

దండ్రుల గురించి, నువ్వు చెప్పావు జ్ఞాపకముందా? తల్లిదండ్రులకు పెరిగేవరకు మనం పిల్లలము అనీ మనం పెరిగాక వాళ్ళు మనకు పిల్లలనీ. అంత జాగ్రత్తగా వాళ్ళని చూడాలని అన్నావు. అది గుర్తు పెట్టుకునే ఇప్పుడు నేను అడిగాను.

అన్న : ఆ మాట నిజమే. ఇప్పుడు మీరు చెప్పేదాక నాకీ విషయం గుర్తులేదు. మొదటిసారి మీతో చెప్పిన సంగతి గురించి.

కొన్ని క్షణాలు గడిచాక ఆ అన్నయ్యే అన్నాడు.

'నాకు మానసికమైన శాంతి లేదమ్మా. భౌతికసుఖాల గురించి కాదు, ఆధ్యాత్మిక విషయంలోనే ఈ అసంతృప్తి. పుస్తకజ్ఞానం వలన అహంకారం తప్ప ఇంకేమీ కలగటంలేదు. ఇప్పటికే ఈ జన్మ వృధా అయ్యింది అనిపిస్తుంది. ఈ మనస్సుకు శాంతి ఎప్పుడు దొరకుతుంది?

అమ్మ : పుస్తకాలలో చెప్పిన సాధన చేస్తున్నావా?

అన్న : లేదమ్మా. దానివల్ల ప్రయోజనం లేదనిపిస్తుంది. ఎంతసేపూ నాకు ఈ జన్మ వృధా అనిపిస్తుంది. ఏం చేస్తే నాలో ఈ బలహీనత తొలుగుతుంది? మీరే తొలగించ గలరని నా విశ్వాసం.

అమ్మ : అది తొలగించుకోవాలంటే తొలగుతుందని నాకు నమ్మకం లేదు.

భుజంగరావు : ఈ జన్మ వృధా అని – మనకు ఎట్లా తెలుస్తుందమ్మా?

అమ్మ : తాను అనుకున్నది జరగకపోవటం వలన అట్లా అని పిస్తుంది.

అన్న : అనుకున్నది జరగకపోవటమేమిటి? ప్రయత్నం చెయ్యాలిగా.

అమ్మ : ప్రయత్నం చేసినాకూడా .... అంటే ఇప్పుడు మీరు జిల్లెళ్ళమూడి రావాలని బయల్దేరారు అనుకో నాన్నా. వేళకంటే ముందుగానే బస్సుస్టాండ్‌కు వచ్చినా బస్సులు దొరకవు అనుకో – అప్పుడు మీకేం అనిపిస్తుంది? 'సమయానికి బస్సులు వచ్చి ఇక్కడికి చేరగలిగితే ఇన్ని క్షణాలు వృధా అయ్యేవి కాదు కదా' అని ఇదీ అంతే.

అన్న : కాని చివరకు బస్సులు దొరుకుతున్నాయిగా.

అన్నయ్య మాటలోని అంతరార్థానికి అమ్మ నవ్వుతూ.

"చివరకు దొరుకుతూనే ఉన్నాయి. అట్లాగే తన బాధ కూడా. ఈ జన్మ వృధా అయిపోయింది, గమ్యం ఏమిటీ అని? చివరకు తెలుసుకోవటం జరుగుతుందనుకో, ఆ తెలుసుకునేవరకు అశాంతిగానే ఉంటుంది."

అన్న : మరి దైవం అంటే విశ్వాసం లేని నాకు యీ మార్గాలపట్ల నమ్మకం లేని నాకు కూడా అశాంతిగా ఎందుకు ఉంటుంది అమ్మా? నాకు భౌతికంగా ఏం బాధలు లేవు. అన్నీ అయిపోయాయి కాని ఇంకా ఏదో 'ఇదీ' అని చెప్పలేని అశాంతిగా ఉంటుంది. ఎందుకమ్మా!

అమ్మ : అన్నీ అయిపోయాయా? అయితే అందుకేనేమో ఈ అశాంతి.

అన్న : శాంతి అంటే ఏమిటమ్మా?

అమ్మ : అశాంతిగా లేక పోవటమే.

అన్న : అంటే?

అమ్మ : ఇప్పుడు నీకు అన్నీ పూర్తి అయ్యాయి అంటే మామూలు విషయాలలో నీకేం బాధలు లేవు అంటున్నావు. నీకు అప్పుడప్పుడు ఇక్కడకు రావాలని, ఇక్కడుండాలని అనిపించదా?

అన్నయ్య : ఉంటుందనుకో అమ్మా.

అమ్మ : నువ్వు ఎంతపైకి లేదంటున్నా నాకు తెలుసు నాన్నా. ఇది తీరనప్పుడు నీకు అశాంతిగా ఉన్నట్టు అనిపిస్తుంది. అందులో నీ మనస్సులో మాట చెప్పుకునే ఆత్మీయులు లేకపోతే ఇంకా అశాంతిగా ఏదో కొఱతగా ఉన్నట్టు ఉంటుంది కదూ?

అన్నయ్య అవునన్నట్టుగా చిరునవ్వుతో తల ఊపారు.

అన్న : అశాంతి ఎట్లా తెలుస్తుందమ్మా?

అమ్మ : అంటే – ఒక విషయంలో శాంతి ఒకప్పుడు తనకు తెలియకుండా అనుభవించి ఉంటాడు. కనుక దానికి అవరోధం కలిగినప్పుడు ఈ అశాంతి ఏమిటో తెలుస్తుంది.

అన్న : ఇన్నిసార్లు ఇక్కడకు వచ్చినా – నాలో మార్పు ఏం లేదమ్మా. నిజాయితీ, డ్యూటీ తప్ప మానవుడికి ఉండవల్సిన ధ్యేయం మరొకటి లేదనిపిస్తుంది.

అమ్మ : నీ బాధ చూస్తుంటే ఎంతో జాలి వేస్తుంది. మేము దైవం అంటే, నువ్వు నిజాయితీ డ్యూటీ అంటున్నావు. మాటలు తేడాయే కాని ఉన్నది ఒకటే.

అన్న : వాళ్ళందరిలా నేను ఇక్కడ కూడా దైవాన్ని చూడటం లేదమ్మా. అమ్మ అని తప్ప దేవుడు అనిపించరు.

అమ్మ : అది చాలు. అమ్మగానే చూడు నాన్నా.

అన్న : వాళ్ళకున్నంత ప్రేమ నాకు లేదమ్మా మీ మీద.

అమ్మ : అని నువ్వు అనుకుంటున్నావు.

..... డ్యూటీ నుండి సాయంత్రం ఇంటికి వచ్చాక ఏం చేస్తుంటావు?

అన్న : ఏం చెయ్యను.

అమ్మ : ఏం చెయ్యకపోయినా ఏం అనిపించదా?

అన్న : ఏం అనిపించదు కూడా.

అమ్మ : ఎప్పుడైనా ఇక్కడకు రావాలనీ చూడాలనీ అనిపించదా?

భుజంగం వున్నట్లయితే ఇద్దరూ కలిసి దైవసంబంధమైన చోట్లకు వెళ్ళుతూ వుండేవారేమో!

అన్న : అవును. మధ్యలో అప్పుడప్పుడు ఇదొకటే అనిపిస్తుంది. దైవత్వాన్ని గురించి తెలుసుకోవాలనిపిస్తుంది. ఇది తప్ప ఇంకో ఆలోచన రాదు.

అమ్మ : మీకెంత వైరాగ్యమో! నాకు చూడూ – మీరు వద్దనుకునే దంతా నాకు కావాలనిపిస్తుంది. ఎందుకని?

అన్న : సమాధానం మీ దగ్గరే ఉన్నది.

ఈ సమాధానానికి అక్కడున్న అందరూ అమ్మతోసహా నవ్వారు.

అమ్మ : ఎక్కడికైనా దైవసంబంధమైన చోట్లకు వెళ్ళావా?

అన్న : దానియందు అభిప్రాయం లేకపోయినా వెళుతుంటాను. తిరుపతి, శ్రీశైలం, కాళహస్తి వెళ్ళాను. ఆ దైవాలని చూశాను. కాని నాకు ఏం అనిపించలేదు. తేడా కూడా కనిపించలేదు.

అమ్మ : (నవ్వుతూ) తేడాలో తేడాలో అంటావు. ఎంత ముద్దుగా ఉంటుందో? తేడా కనిపించకపోవటం మంచిదే. అన్నింటిలో ఒకటినే చూస్తున్నావు.

అన్న : అందరికీ ఆ తన్మయత్వం ఇస్తావు. నాకు ఎందుకు ఇవ్వవూ?

అమ్మ : నేను ఎవరికి ఏం కలిగించాను?

అన్న : ఎందుకమ్మా అబద్ధాలు? నా స్నేహితులు అబద్ధాలు చెబుతారా?

అమ్మ నవ్వి ఊరుకున్నది. కాసేపాగి "నీలో ఉన్నా ఇప్పుడు నీకు గుర్తింపు కలగనివ్వని ఆ శక్తే – దాని తరుణం వచ్చినప్పుడు అదే కలిగిస్తుంది."

# 57. ఏకాగ్రత

అక్క : ఏకాగ్రత కలగటానికి కనుబొమ్మల మధ్య, తలపై భాగాన, ముక్కుమీద ఇట్లా ఈ భాగాల్లో దృష్టి నిలిపితే ఏర్పడు తుందంటారు కదా? అది సాధ్యమవుతుందా?

అమ్మ : సాధ్యమౌతుందనే అంటున్నారు మరి. అది కుదరక నానా బాధలు పడేవారే నాకు ఎక్కువగా కనిపిస్తున్నారు. ఇవన్నీ సరే. హృదయంమీద కూడా దృష్టి నిలపాలంటారు, అది ఎక్కడుందీ అంటే మెడకు క్రిందివైపు రొమ్ము భాగంలో చూపిస్తారు.

అక్క : అవునమ్మా అందరూ చెప్పేది అదే.

అమ్మ : నేను అరికాలులో కూడా హృదయం ఉన్నది అంటాను.

అన్న : రమణ మహర్షి కూడా "నేను" అని చూపించింది హృదయం దగ్గరేనమ్మా.

అమ్మ : అవును. ఆయన హృదయం దగ్గర అన్నారంటే ఆ నేను అక్కడే అంతవరకే పరిమితి అన్న అభిప్రాయంతో కాదు. సర్వత్రా ఉన్నదాన్ని నువ్వు చూడలేవు కనుక ఒక గుర్తులో చెప్పటం.

ఈ ఫోటోలూ – గుళ్ళూ – మంత్రాలు ఇవన్నీ ఎందుకు అవసరమో ఇదీ అందుకే. లక్ష్యానికి హేతువైంది. అంతేకాని ఆ కనుబొమ్మల మధ్యా, ఆ కళ్ళలోనే శక్తి ఉన్నదని కాదుగా, అదొక గుర్తు. అంతటా దృష్టి నిలపగలిగే శక్తి ఉంటే ఇవన్నీ అనవసరం. లేదు కనుకనే అవసరమైంది. రమణ మహర్షి హృదయం దగ్గర లక్ష్యం నిలిపారంటే – ఒక ఫోటో ఉన్నదనుకో నాన్నా ఆ ఫోటోలో ఉన్న బొమ్మకు నమస్కారం పెడ్తున్నాము కాని ఆ ఫోటో ఫ్రేమ్‌కు, అద్దానికి, కాగితానికి అది తయారుచేసిన వాడికి, ఆ ఫోటో పెట్టిన బల్లకుగాని నమస్కారం చెయ్యమంటే చేస్తామా. అదే నీళ్ళలో తడిపి ముద్దగా చేసి బొట్టుపెడ్తే గౌరిదేవి అని నమస్కరిస్తాము. అంతటా చూడలేము కనుక ఒక పరిమిత రూపంలో, గుర్తు చెప్పితే లక్ష్యం కుదరటానికి అవకాశం ఉన్నది కనుక ఆయన చెప్పింది అదే.

# 58. పూర్వాచారాలు

**(6-2-1965)**

అన్న : అమ్మా అన్నం తినేముందుకాక తింటున్న సమయంలో ఎవరన్నా భిక్షకు వచ్చినా లేవకూడదు అంటారు నిజమేనా?

అమ్మ : నాకు తెలియదు నాన్నా, ఎందుకు పెట్టారో మరి. పెద్దలు ఏది పెట్టినా ఏది చేసినా మన ఆరోగ్యం కోసం, మనలో దైవభక్తిని కలిగింప చెయ్యటం కోసమే.

అన్నం తింటున్న సమయంలో భిక్షకు వచ్చినా లేవకూడదు అన్నారంటే కొన్ని జాలి మనసులుంటాయి కదూ. అవతలి వాడు లేదంటే తన దగ్గరదైనా ఇచ్చి తనకోసం ఏమి మిగుల్చు కోని వాళ్ళు - వాళ్ళ కోసం పెట్టారేమో. అట్లా వాళ్ళు అన్నం తినకుండా మరొకరికి పెడ్తారేమోనని. ఏది ఉన్నా లేకపోయినా అన్నం - గుడ్డా లేకపోతే జరగదుగా, అందుకోసం అవి కరువైనవాళ్ళు అడుక్కోక తప్పదు. ధర్మం చెయ్యటం మంచిదే అంటూ, ఆ వెంటనే అన్నారుగా తనకు మించిన ధర్మం పనికిరాదని.

ఏమో నాన్నా వీటిని గురించి ఏం ఆలోచించి పెట్టారో. ఇక్కడ జరుగుతుంది. అన్నదానం అనుకుంటే నేను అట్లా అనను. ఎవడి అన్నం వాడు తిని వెళ్తున్నాడు, అనుకుంటు న్నాను. ఇక అన్నం పెట్టటంలో విశేషం ఏముంది? అసలు విశేషమే లేదు. ఇట్లా మిమ్మల్ని నేను దగ్గరకు తీసుకోవటం కూడా. అమ్మా అని వస్తున్నప్పుడు బిడ్డని దగ్గరకు తీయటం లో విశేషం ఏముంది?

అన్న : ఒక వస్తువును గడపదాటి వచ్చి ఇవ్వమంటారు. లేకపోతే మహాపాపం అంటారు. ఎందుకమ్మా?

అమ్మ : చెప్పానుగా నాన్నా అట్లా అనటంలో వస్తువు చేజారి పగిలిపోకుండా ఉండటానికే. అట్లా మాటలతో చెప్తే ఆచరించగలరా? లేదు. అందుకే ఆ భయం ఏర్పరిచారు. అందువల్లనైనా ఆ భీతిలోనైనా ఆచరణలో పెట్టగలరేమోనని. పచ్చడి రుబ్బినప్పుడు రోలుకడగకుండా మళ్ళీ పచ్చడి రుబ్బేవరకు అలాగే ఉంచే ఆడవాళ్ళకోసం - అట్లా పచ్చడి నూరగానే రోలు కడగకపోతే ఒళ్ళంతా మంటలు పుడ్తాయని ఒక భయం కలిగించేసరికి ఆ రోలు శుభ్రంగా కడుగుతారు కదా అని.

ఇప్పుడు ఇళ్ళు కడిగేటప్పుడు లోషన్స్ ఉపయోగిస్తున్నారు అనుకో - ఆ కాలంలో ఏం ఉపయోగించే వారు? ఈ లోషన్ల పవర్ ఆ ఆవుపేడకు లేదా? ఉన్నది. అందుకే ప్రొద్దున్నే లేవగానే వాకిళ్ళు చిమ్మి కళ్ళాపిజల్లి ముగ్గులు పెట్టమనేది కేవలం అలంకారం కోసమేకాదు అందులో ఎన్నో ఆరోగ్యసూత్రాలు న్నాయి.

మట్టి ఇళ్ళను పేడతో రోజూ అలకమన్నది, వంట ఇల్లు రెండు పూటలా కడగమన్నది ఎందుకూ? ప్రతి శుక్రవారం ఇళ్ళు బూజు దులుపుకొని శుభ్రం చేసుకోకపోతే లక్ష్మి ఆ ఇంట్లో నిలవదని ఎందుకు అన్నారు? ఈ విధంగానైనా వారానికి ఒకసారి ఉన్న ఇంటిని శుభ్రపరుస్తారని. ఆవు పేడలో క్రిమికీటకాదులను చంపే గుణం ఉన్నది. ఇట్లా ప్రతీ ఒక చిన్న పనికి భయాన్ని ఏర్పరిచారంటే అవి ఆచరించ టానికి బద్ధకించే బద్ధకస్తులు ఉంటారనే. ఆచారాలను పరిహసిస్తాము కాని వాళ్ళు ఏర్పరిచింది ఆరోగ్యం కోసమేగా.

చిన్నప్పటినుండి ఆడపిల్లలకు ప్రతీ నోము ఎందుకు అని పట్టిస్తారు? పువ్వుతాంబూలం పండు తాంబూలం అని చిట్టిబొట్టు అని. పువ్వులో, పండులో, గంధంలో,అక్షతలలో ప్రతిదాన్లో దైవాన్ని చూడమని, జీవితంలో

ఒక నియమ బద్ధంగా నడవటానికి, శ్రద్ధ, జాగ్రత్త నేర్పటానికి ఇవి పనికివస్తాయి. ఈ నోముపడ్తే ఈ ఫలం అని ఆ నోము పడ్తే ఆ ఫలం అని ఎందుకు పెట్టారు. ఆ ఆశతోనైనా పట్టారుకదా అని. అన్నీ ఆచరించే వాడికి ఏదీ అవసరం లేదు కాని ఏదీ ఆచరించలేని మనకు ఇవన్నీ అవసరమే, అందువల్ల మనం ప్రతీదీ ఆచరించాల్సిందే. ఏముందిలే అని తీసెయ్యకూడదు. ప్రతిదీ చెయ్యాల్సిందే. పెద్దవాళ్ళ చాదస్తాం అని ఇందులో ఏముందని తర్కించటం మనకు అనవసరం. అసలు ఏముందో తెలియదు కాని ఇవన్నీ ఉన్నాయిగా? అందుకోసమైనా ఆచరింపకతప్పదు. బిడ్డల కోసమని కాకపోయినా ఆ రూపేణా ఒకరికి దానం చెయ్య గల్గుతున్నావుగా. అందుకని దేన్నీ తేలికగా తీసెయ్య కూడదు నాన్నా.

అమ్మ చెప్పటం ఆపారు - ఆ అన్నయ్య ఇంక ఏం ప్రశ్నించ లేదు. వెంటనే సెలవు తీసుకుంటానంటే అమ్మ అన్నారు "దూరం వెళ్తున్నావు కదా ఈ ఒక్కరోజు ఉండు"

అందుకు అవకాశం లేదంటూ ఆ అన్నయ్య సెలవు తీసుకొని వెళ్ళారు.

# 59. మడి

27-9-1964

శ్రీపాద : మంత్రపుష్పం గురించి అమ్మ ఏదో చెప్పారట ఈమధ్య; మడి అంటేనూ-

అమ్మ : విధి నిషేధాలతో కూడినదే మడి. ఇంకో వస్తువును, ఇంకో బట్టను, ఇతరులను తాకకూడదంటే ఆకాసేపు ఒక్కరే ఆపని చెయ్యాలని.

వంట చేస్తున్నప్పుడు, ఎవరూ రాకూడదని ఎవరూ తాకకూడ దని నేను మడి కట్టుకున్నాను అంటారు. మిగతావన్నీ మైలపడినవి కనుక ఆ కాసేపు తాక కూడదు వాటిని. మైల మనస్సుకు తగుల్తోంది కాని శరీరానికి తగల నివ్వడం లేదు. అది మైల అని మనస్సేగా గుర్తించేది? గుర్తించకపోతే నేను మడి కట్టుకున్నాను అనలేదు, మడి కట్టుకుని పాస్ కెళ్ళాల్సి వచ్చి వెళ్ళాదనుకో - రాగానే కాళ్ళు కడుక్కుంటాడు. అది పాకీ దొడ్డి అని తెలుసు. వెళ్ళాను కనుక మైలపడ్డానని ఆనీళ్ళతో కడుక్కుంటే శుచి అయ్యానని అనుకుంటాడు.

రామకృష్ణ అభిషేకం చేశాడు అప్పుడు చూశాను. బ్రాహ్మణులు బయటికి వెళ్తే చెంబు తీసుకెళ్ళేవారు. అంటే వాళ్ళ ఉద్దేశం ఈచెంబునీళ్ళు ఆధారంగా శుచి అయ్యామని, తమ మడి మైలపడలేదని వాళ్ళ అభిప్రాయం. పోయింది తనలో ఉన్నదే. కాని ఆ మైల దొడ్లోకి వెళ్తే కాళ్ళు కడుక్కోవాలని, నెత్తిమీద నీళ్ళు చల్లుకోవాలని ఎందుకు నియమంపెట్టారు అంటే శుచికి, శుభ్రతకు, ఇది ఎవరి కోసం? నీకోసమే. శుచి కోసం. శుచిని ఆచరించే దాన్ని ఆచారం అంటారు.

మడి అంటే ఇప్పుడు వంగకు మిరపకు మడులని కద్దారు. అంటే అది

హద్దు, అంతవరకు ఆభాగం త్రొక్కకూడదని. హద్దులే మడి.

ఇప్పుడు ఓంకారం దబ్బాల మీద వాయిస్తూ, పిల్లలు చేశారని, మంత్ర పుష్పం చదివారని అన్నారనుకోండి. ఈ ఆవరణలో రెండేళ్ళ పిల్లలకి కూడా వస్తుందంటే అదే కారణం. వాళ్ళు చెట్లు ఎక్కి, బయటికి వెళ్ళినచోట, మేడ మీద ఎక్కి చదువు తున్నారంటే, వాళ్ళకి వస్తుంది చదువుతున్నారు. అది మంత్రపుష్పం అని తెలుసు కాని దాని అర్థం తెలిసిచదవడం లేదు. తెలిసి చదువుతూ మనం బాధపడ్తున్నాము, ఎక్కడ చదవచ్చో చదవకూడదో అని. వాళ్ళు హాయిగా వచ్చినప్పు డెల్లా చదువుతున్నారు. తెలిసి చదువుతున్న మనం వెళ్ళాలను కుంటున్నది వారిస్థితి లోకే.

శబ్దమే ఆత్మ శబ్దమైనప్పుడు ఒకచోట చదవాలని ఒకచోట చదవకూడదని ఏముంది?

ఆత్మ అంటే అంతటా ఆవరించి ఉండి శక్తిమయంగా ఉన్నది.

13

# 60. కుడీ-యెడమా

**6-6-1966**

అమ్మకు దగ్గరగా ఇంజనీరుగారి కుటుంబిని, ఇంకా కొందరన్నయ్యలున్నారు.

ఆమె : అమ్మా ఏదైనా రాస్తే ముందు కుడి చెయ్యికి, కుడి కాలుకి రాస్తారుగదమ్మా. మరి తాతగారు, ఎడమచేతికి, ఎడమ కాలుకి రాశారేమమ్మా?

అమ్మ : ఆ భేదం ఆయన కుండి వుండదు.

ఆమె : మీరిందాక మాకందరకీ కుడిచేతికి గాజులు వేశారుగా?

అమ్మ : మీరిచ్చిన చేతికి వేశానుగా. ఫలానా చెయ్యి అందించమని నేను అడగలేదుగా? నాకా భేదంలేదు. ఎడం చేత్తో ఒకపని చేస్తున్నాం. కుడిచేత్తో ఇంకో పని చేస్తున్నాం. ఎడమ చెయ్యి ఒకపనికి ఉపయోగపడుతున్నది. కుడి చెయ్యి ఇంకోదానికి ఉపయోగపడుతున్నది. ఇవన్నీ కట్టుబాటు కోసం పెట్టారేగాని; ఒకభాగం ఎక్కువనీ, ఒకభాగం తక్కువనీ కాదుగా? కొన్నేళ్ళు పాకీదొడ్లో పడివున్న రాయి కొన్నాళ్ళికి విగ్రహం కావచ్చు, దేవాలయంలో వుండచ్చు.

పసుపుకొమ్ముకు నమస్కారం చెయ్యం. దాన్ని కొట్టి పసుపుగా చేసి, గౌరమ్మను చేస్తే నమస్కారం చేస్తాం. అన్నీ సమానమే అయితే ఏమీ లేదు.

# 61. అపరకర్మ

**4-1-1969**

ఇక్కడ వుంటున్న సత్యన్నారాయణ అన్నయ్య అమ్మని "ఎవరైనా పోతే, చెయ్యవలసిన కర్మని గురించి ఇంతగా చెప్పారు మనవాళ్ళు. మరి పాశ్చాత్యులకు అసలివ్వేవీ లేవుగా, ఈ కర్మకాండలేవీ", అని అడిగితే;

అమ్మ : కర్మంటే మనం ఒక రకంగా చేస్తున్నాం. వాళ్ళింకో రకంగా చేస్తున్నారు. వాళ్ళుకూడ చచ్చిపోయిన వాళ్ళని తలుచుకుని, ఆనాడు ఏదోఒకటి చేస్తూనేవున్నారు కదా. ఏంచేసినా మన ప్రేమకి చిహ్నంగా చేస్తాం. ఒక స్నేహితుడు ఎంతో ముఖ్య మైన వాడు పోయాడనుకో, వాణ్ణి తలుచుకుని ఆరోజు పదిమందికీ పెడుతూనే వున్నాం. ఇంట్లో వాళ్ళూ, సొంత వాళ్ళూ పోతే కర్మ చేస్తున్నాం. ఇరవై ఏళ్ళు పెరిగినవాడు వడుగు లేకుండా పోతే కర్మలేదు. వడుగయి పోతే అదే మనిషికి బోలెడంత చెప్పారు. వడుగు కాని వాడి జీవుడు అక్కడ లేడనా? నే ననేదేమంటే ఉన్నవాడికి ఒకరూపంలో చేస్తున్నాం సేవ. కర్మ బ్రతికి వున్నవాడిది కానీ, చచ్చిన వాడిది కాదని నాఉద్దేశ్యం. కర్మ రకరకాలుగా చేస్తున్నాం. చిన్న పిల్లవాడు పోయినా, వాడిని తలుచుకుని తెలిసిన పదిమంది పిల్లలకీ బట్టలు పెడుతున్నాం. అదీకర్మే. ఓ బ్రాహ్మణ్ణి పిలిచి భోజనం పెడుతున్నామంటే, కేవలం భోక్త వాడి స్వరూపం లో ప్రవేశించాడనీ అతను విష్ణుమూర్తి స్వరూపం అనీ అనుకుని గదా చేస్తున్నాం? భోక్త ఆ సమయానికే అతనిలో ప్రవేశించాడా? ప్రవేశించాడో, లేదో వున్నాడనుకుని మనం పెడుతున్నాం. కానీ వీడికి (కర్మచేస్తున్న వాడికి) వాణ్ణి స్మరించడం, చెయ్యడం ముఖ్యం గనుక చేస్తాడు. జీవుడున్నాడని చేస్తున్నాడా? వడుగవకపోతే జీవుడు లేడా? ఈ వడుగులో ఏమిటి ప్రత్యేకత? ఇదంతా ఆలోచిస్తే, మన కేమీ తెలియదనిపిస్తున్నది. ఈ విధంగా నలుగురికీ పెడు తున్నాం. ఏదో రూపంలో తలుచుకొని అందరికీ పెట్టడం నాకిష్టం. ఎవరేం చేసినా నాకిష్టం. అందుకే కర్మ రకరకాలు".

# 62. పూజా తంత్రము

రామకృష్ణ

అన్నయ్య : అమ్మా, యీ కొబ్బరికాయ లెందుకూ, యీ బొట్టెందుకూ, యీ నివేదన లెందుకు, నమస్కారాలెందుకు, పళ్ళెందుకు, పూలెందుకు?

అమ్మ : నువ్వెందుకు, నేనెందుకు? అన్నీ అందుకే, బొట్టు యెందు కనుకుంటే, యీ తీర్థాలు తీసుకోవటం, పాదాలు తగిలేలా నమస్కారం చేసుకోవడం యివన్నీ యెందుకు చేసుకొంటాడు.

రా.కృ. : సంప్రదాయం

అమ్మ : అట్లా అనుకుంటే అన్నీ సంప్రదాయమేగా? అసలూ – అచ్యుతుని రామకృష్ణ శర్మగారు, శేషగిరి అన్నయ్యకు బొట్టు పెదుతుంటే నువ్వూ పెట్టించుకోమన్నాడు, డాక్టరుగారితో. అంటే 'అందులో యేముందీ?' అన్నాడు. "ఎందులో మాత్రం యేముందీ అట్లా అయితే" అన్నాను.

రా.కృ. : అన్నిటికీ మనసు ప్రధానమయినపుడు యివన్నీ చిహ్నాలు. అనుగ్రహమున్నా అనుగ్రహానికి చిహ్నాము ప్రసాదము. ముద్దు పెట్టుకుంటున్నామనుకో అమ్మా.

అమ్మ : ముద్దులో – యేముందీ?

రా.కృ. : ముద్దులో యేముందీ? కానీ అది – చిహ్నాం.

అమ్మ : అన్నీ అంతే. కానీ ఆకలట్లాకాదు. తిన్నామనుకుంటే యెట్లా? కొన్నాళ్ళు తీర్థ మెందు కన్నాదనుకో. ఇప్పుడు సీసాలు పట్టించుకుని తీసుకెళ్ళి వేరే తీర్థంలో కలుపుకుని శుక్రవారం అక్కడ వాడతాడు. కొన్నాళ్ల ఫొటో తీసేశాడు. ఇప్పుడు పెట్టుకుంటున్నాడు.

రా.కృ. : అది మటుకెందుకు?

అమ్మ : అదే నేననేది. బొట్టులో యేముందంటే యెందులో మటుకే ముంది? యేవి మటుకెందుకు? ఆకులు ప్రక్కకు నెట్టి పాదాలకే యెందుకు నమస్కారం చేసుకోవాలి? చర్మమేగా తాకుతున్నది? చర్మంలో యేముంది?

స్నానం చేసే నీళ్లు త్రాగుతాను పోసుకోమంటే నాలికా చర్మమేగా? అవి పైగా పోతుంటే యివి మూత్రరూపంలో పోతున్నాయ్. మంచే చెడుగా చూస్తున్నావు గాబట్టే యిందులో లేనిదేమిటి?

రా.కృ. : ఇదవునూ, యిదికాదూ అనుకొన్నప్పుడే యిన్ని ప్రశ్నలు.

అమ్మ : అంతే. అన్నీ లేవనుకుంటే యేవీ లేవు. అక్కడ అడగడు. ఆయన చెప్పటం చెప్పకపోవటం తరువాత సంగతి. (డాక్టరు గారు సమాధానం చెప్పటం చెప్పకపోవటం తరువాత సంగతి)

కావాలనుకున్న వాడికే తృప్తి. లేనివాడికి పెట్టినా పెట్టక పోయినా యేమీలేదు. అమ్మే పెట్టాలంటాడే?

రా.కృ. : నువ్వు పెడితే తృప్తి వేరు అప్పుడు కూడా నోట్లో పెట్టిన తృప్తి వేరు. చేతిలో పెట్టిన తృప్తి వేరు, అన్నం విస్తట్లో వుండగా తృప్తివేరు, తిన్న తర్వాత తృప్తివేరు.

అమ్మ : నేను కొఱికిన తర్వాత అదంతా ప్రసాదంలో కలపమనేవాడు.

రా.కృ. : కొబ్బరికాయ కొట్టడం, నివేదన పెట్టడం, బొట్టు - వీటన్నిటికి మన శాస్త్రా లేమి చెపుతున్నాయ్? అన్నారు, ప్రక్కనే వున్న అచ్యుతుని రామకృష్ణ శర్మగారితో.

"వీటిని గురించి వివరంగా వ్రాసిన శాస్త్రాలు నేనేమి చదివానూ?" అన్నారు, అమ్మ. అచ్యుతుని రామకృష్ణ శర్మగారితో ఏదయినా సరే ప్రసాదము యివ్వటంలో ఆ శక్తి దీనిలోనికి ప్రసారమవుతుందనీ అంటారుగా?

రా.కృ.శ.: దేవతా నివేదన చేసిన తర్వాత ఆ పదార్థం తింటే మనస్సు పవిత్రమవు తుందనీ, తద్వారా రక్తమూ పవిత్రమవుతుందనీ.

అమ్మ : అదే రాజమ్మగారనేది. నామంతో బియ్యం యేరించి, ఒక్కసారిగా బియ్యంతో పులిహోర చేయించి అందరికీ పెట్టించేది. కళాయి పట్టినట్లుంటుందనేది.

రా.కృ. : ఆ పుణ్యం యేరినవాడికి కలుగుతుందా? తిన్నవాడికి కలుగుతుందా?

అమ్మ : ఇరవైనాలుగు గంటలూ ఆ భావంతో చేసినవాడికీ, తిన్నవాడికీ, చేసిందీ అంటే చెయ్యిపట్టిన వాడికీ.

రా.కృ.శ.: మందు తెలిసి వేసినా, తెలియక వేసినా ప్రభావం చూపిస్తుంది కదా?

రా.కృ. : దేవతా నివేదన చేసినపుడు అందరికీ పెడతాము. బాగానే వుంటుంది. ఒక కుక్క అక్కడుంటే తింటుంది. దానికి పుణ్యం వుంటుందా వుండదా?

అమ్మ : ఆ భావం లేనప్పుడు కాఫీహోటల్‌లో తిన్నదానికీ, దీనికి తేడా యేముందీ? ఆ భావంతోనే తృప్తి. ఫలితం మాత్రం ఒకటే.

రా.కృ. : ఉపమానాలు ఒక్కొక్కప్పుడు మోసం చేస్తాయ్. రామకృష్ణ పరమహంస కరకు మనస్సు గలవాడికి మృదువుగా వుండాలని బోధ చేశాడు. మెత్తని మనస్సు కలవాడికి కరుకుగా వుండాలనీ బోధచేశాడు. మనస్తత్వాన్ని బట్టే చెప్పానన్నాడు.

అమ్మ : నిప్పు తెలిసి తాకినా, తెలియక తాకినా కాలుతుంది. చిన్నవాళ్ళకూ పెద్దవాళ్ళకూ కాలుతుంది.

రా.కృ.శ.: రామనామం తెలిసి చేసినా తెలియక చేసినా ఫలితం వుంటుందంటారే అది యథార్థమా?

అమ్మ : భగవద్గీతలో నీమీద కర్తవ్యం పెట్టుకోకుండా చెయ్యమన్నాడు. అప్పుడేమిటి?

రా.కృ. : మనస్సు ప్రధానం. ప్రబోధం మనిషిని బట్టే.

రా.కృ.శ.: వీడికీ మనస్తత్వమే. వాడికీ మనస్తత్వమే.

రా.కృ. : ఎట్లా తెలుసూ? మనస్సు చంచలము.

అమ్మ : నిన్న జిల్లెళ్ళమూడిలో తప్పు, వుండకూడదనుకున్న వాడికి కూడా, యివ్వాళ మనసు మారుతుంది.

రా.కృ.శ.: అన్నిటికి కారణం వేరే వుంది గదా.

అమ్మ : ఆ మొద్దంకె అటుపెట్టి మాట్లాడు.

# 63. మొక్కు, అతిక్రమణ, చేతబడి

**27-10-1964**

"సర్వం తెలిసిన వారు మీరు. మీ మహిమ ముందు వీటి (ఈ క్షుద్ర) శక్తులెంత. నువ్వే నన్ను కాపాడాలి తల్లీ" అంటూ ఆ వృద్ధుడు అమ్మ నాకెంత తెలియదంటున్నా అమ్మ పాదాలు పట్టుకున్నాడు ఏడుస్తూ.

వరంగల్ దగ్గర ఉన్న పల్లెటూరు నుండి అతను నాలుగు రోజుల క్రిందట ఇక్కడకు వచ్చాడు. వచ్చినప్పటినుండి అమ్మతో మాట్లాడాలని ప్రయత్నం - ఆ అవకాశం ఈ మధ్యాహ్నం లభించింది.

అతను ఈ వార్ధక్యదశ రాకముందే దేవాలయం ఒకటి కట్టించాలని, 50 సవర్లకు బంగారం సంపాదించాడు. కాని కొన్ని కారణాల వలన దాని నిర్మాణం జరుగలేదు. సంవత్సరాలు గడిచాయి. ఇతను వృద్ధుడయ్యాడు. జబ్బువాడు. ఇప్పుడు ఆ జబ్బులన్నీ దేవాలయం కట్టించనందుకు దానికి ఫలితంగా ప్రాప్తించాయని అతని ఆందోళన. అంతేకాదు తనంటే గిట్టనివారెవరో చేతబడి చేయించారని అనుమానం. మొదటి కారణంకంటే కూడా ఈ రెండో కారణం అతనిని మరింత కృంగదీసింది.

అతను చెప్పినదంతా విని అమ్మ నవ్వుతూ "నాకేం మహిమలు తెలియవు నాయనా, మహిమ అంటూ ఉంటే ప్రపంచంలో ఎంతమంది అన్నం లేక అల్లాడిపోతున్నారో వాళ్ళందరి కడుపులు అన్నం తినకుండానే నింపనూ? ఈ దాబాలు కట్టటానికి ఇంత శ్రమదేనికీ, వెంటనే

నిముషాలమీద చెయ్యమా, ఈ బాధలూ ఇవన్నీ ఎందుకూ.

కాని ఆ వృద్ధుడిది తన ధోరణి తనదే.

అమ్మ : అసలు శక్తి ఒకచోట ఉండి ఒకచోట లేకపోతేగా. అంతా శక్తే చేయించేది. నీతో చేయించినా నాతో చేయించినా, ఏదైనా కాని అంతా ఆ శక్తివల్లనే జరుగుతూంది. ఇందులో ఎవరి గొప్పలూ – ఎవరి కొద్దితనాలూ లేవు.

వృద్ధు : ఈ జబ్బుకు కారణమేమిటి?

అమ్మ : కారణమేముంది? వృద్ధాప్యం కనుక జబ్బులు రావటం సహజమేగా మరి?

నీ కంటే చిన్నదాన్నేగా చూడు నాకు ఎన్ని జబ్బులో? అయినా నీకీ జబ్బు ఊరికే రాలేదు. రాళ్ళతో కట్టిస్తేనే దేవాలయం కాదుగా. ఈ హృదయంలో నామంతో కట్టు. ఈ ఆలయానికి దబ్బు ఖర్చు ఉండదు. ఇక ఆ దేవాలయం ఎలాగూ కట్టలేవు. ఇదైనా నిర్మించు ఇప్పుడు. వీటన్నింటి కంటే ఎక్కువైనది. ఇక ఈ పిచ్చి నమ్మకాలతో ఏం బాధపడతావు? ఇంటికి వెళ్ళి ఇతర వ్యాపకాలతో బాధపడకుండా నామం హాయిగా చేసుకుంటూ కూర్చో. దైవాన్ని నమ్మి నువ్వు కృషి చేస్తున్నప్పుడు ఇక ప్రయోగాలు ఏమిటి? చేతబడులు ఏమిటి? అవన్నీ ఏం లేవు.

అతడు : (తృప్తినిండిన) గొంతుతో అలాగే తల్లీ అన్నాడు.

# 64. చేతబడి

అమ్మ : మీ అన్నగారి పని బాగుంది. పదిమందిచేత భగవద్గీత చదివిస్తున్నాడు. సత్కాలక్షేపం. క్షణంకూర్చోడు కదా! ఏదో ఒకటి!

భర : వారానికి మూడుసార్లు పురాణ కాలక్షేపం చేస్తాడు. ఒకరోజు రామాయణం, ఒకరోజు భారతము, ఒకరోజు భాగవతము. చేతబడులూ అవీ లేవంటాడు.

అమ్మ : ఆమాట బాగుంది. జనం భయపడకుండా ధైర్యంగా వుంటుంది.

అ.కృ.శ : అదేమిటీ? చేతబడులు చెయ్యటం అనుభవించటం జరుగు తున్నది కదా! నయం చేసినప్పుడు నయమవటం కనబడుతున్నది కదా! లేదంటే ఎట్లా... ....

అమ్మ : మొన్నీమధ్య ఒక పాపాయిని తీసుకువచ్చారు. ఆరునెలల పిల్ల. అయిదు సంవత్సరాల పిల్లకంటె లావుగావుంది. అయితే శరీరమంతా సమంగా ఎదిగింది. అదీ విశేషం. విపరీత మయిన లావు. చూడలేము. దానికి కడుపులో ఏదో పుండు వుంది. అందువల్ల ఆలావు వచ్చింది అన్నారుట. ఇంకొకళ్ళు చేతబడి అన్నారుట. దానికి తెలివుంది. వాళ్ళమ్మ యెట్లా పాటపాడితే అట్లా రాగం తీస్తుంది. చూడమంటే మనవైపు చూస్తుంది. ఈపాదం బొటనవ్రేలు నోట్లో పెట్టుకుని చీకటం మొదలు పెట్టింది, నాముఖంవంక చూస్తూ. ఎంతసేపటికీ వదలదు. నోరు తెరు అంటే తెరిచి, తీర్థం పోస్తే త్రాగింది. అన్నప్రాసన చేస్తే పొంగలి పీల్చి పారేసింది. అయితే ఒకటి. దాని తెలివి మాత్రం చిన్నపిల్లల తెలివిగా లేదు చూపూ, అదీ పెద్దవాళ్ళు చూపినట్లుంది. ఎవరైనా మాట్లాడుకుంటుంటే కళ్ళ

14

పెద్దవి చేసి చూస్తూ ఆలకిస్తుంది. అంటూ అమ్మ ఆపాపవినే విధానాన్ని అభినయించారు. మళ్ళీ అన్నారు.

పుట్టడం యెనిమిది పౌన్లే పుట్టిందట. రెండవ నెలనుండీ పెరిగి యిప్పుదు నలభైరెండు **(42)**పౌన్ల బరువుందిట. 'కదుపులోవుందు ఆపరేషన్ చేస్తాము గానీ సక్సెస్ అవుతుందని నమ్మకంగా చెప్పలేము' అన్నారట డాక్టర్లు. ఆపాప తండ్రి అవేవీ వద్దు. అమ్మకు చూపించుకు వద్దాము అన్నాడట అయితే ఒకటి. ఒక అవయవం యెక్కువా, మరో అవయవం తక్కువా కాకుండా శరీరం అంతా సమానమైన లావులో పెరిగింది.

పళ్లు వచ్చాయేమోనని చూశాను. రాలేదు. సరే, యిదంతా యెందుకు చెపుతున్నానంటే. ఆపిల్లకు చేతబడి అన్నారట.

రా.రా.మాష్టరు గారు : సరే. ఏదన్నా చేతబడో, గ్రహ ప్రయోగమో అయితే యిక్కడకు వచ్చిన తర్వాత దర్శనంతోనే పోవాలి. లేదా స్పర్శవల్లనయినా పోవాలి. మరి బొటనవ్రేలు నోట్లో పెట్టుకుని చీకటం వరకూ వచ్చిందంటే అది యెట్లా అవుతుంది?

రామచంద్రరావు మాస్టరుగారు అమ్మ ఆదిశక్తి అవటంవల్ల నిజంగా గ్రహమే అయితే అది అమ్మదగ్గరకు రాగానే వదలి పారిపోవాలనే భావంతో అన్నారు.

అమ్మ : ఇన్ని మాట లెందుకు? చేతబడి చెయ్యటం మనం నేర్చుకొని చేసి చూసి అప్పుడు నమ్ముదాం.

# 65. ఉచ్చారణ దోషము

ఒకరు : ఆ అమ్మాయికి యెవరో ఆంజనేయోపాసన చెప్పారట. మిరియాలతో చెయ్యటంలో మంటలు.
ఆమంటలకు తగ్గట్టు ఎప్పుడూ స్నానంచెయ్యటం. మనస్సుతో పాటు శరీరం దెబ్బతిన్నది.

అమ్మ : మంత్రాలయొక్క శక్తి ఇదేనంటారా?

వారు : పొరపాటుగా ఉచ్చరిస్తే, ప్రమాదం కాదామ్మా మరి?

అమ్మ : మంత్రంమంటే, మంత్రంలో స్వామి ఉన్నాడా? మంత్రంతో స్వామిని పిలవడమా?

వారు : రెండూ వేరు కాదమ్మా

అమ్మ : రెండూ వేరు కానప్పుడు స్వామికి నా తప్పు తెలియదా? మంత్రం అనట మెందుకూ? ఆ మూర్తిని చూస్తూ కూర్చుంటే చాలదూ?

వారు : మంత్ర శాస్త్రం చాలగొప్పది. వుచ్చారణ దోషం చాల ప్రమాదం. కుటుంబాలు కూల్చివేస్తాయి. అటువంటి మంత్రాలు చెయ్యకపోతేయేం? సక్రమంగా చేస్తే అష్టఐశ్వర్యాలతో తుల తూగతూంటుంది.

అమ్మ : మీరు చాలా ఆస్తి వున్నప్పుడు మంత్రాలు చెయ్యటం ప్రారంభించారా, లేక మీ ఆస్తి మంత్రాలు ప్రారంభించే టప్పటికే పోయిందా?

వారు : తరవాతనే పోయిందమ్మా.

అమ్మ : మీరు స్వచ్ఛంగా వుచ్చరించే వారే గదా మీకు ఎందుకు పోయింది?

# 66. అకారణ భయం

**9-7-1975**

అమ్మ హాల్లో కూర్చున్నారు. బాపట్ల నుండి ప్రిన్సిపాల్‌గారి భార్య, చిట్టెమ్మగారు ఇంకొక ఆమె వచ్చారు.

జమ్ములపాలెం నుండి భావయ్య పెళ్ళామట. ముప్పలనేని మాణిక్య రావుగారి మరదలట. ఇంకా కొంతమంది వున్నారు. మొత్తం పది పన్నెండు మందిదాకా వున్నారు. వీళ్ళంతా బండి కట్టించుకుని వచ్చారట. పండ్లిచ్చి నమస్కారం చేసి కూర్చున్నారు. అందులో నలుగురు చీరలు పెట్టారు. అమ్మ అవి కప్పుకుని వాళ్ళకి తిరిగి ఇచ్చేశారు.

ఒక ముసలమ్మ: వాళ్ళల్లో ఒకామెను చూపి, ఈమెకు ఒంట్లో బాగుండటం లేదమ్మా. నీకు చీర పెడదామనీ, నీవు కట్టుకోవాలనీ తెచ్చింది.

అమ్మ : నేను కట్టుకుంటే పోతుందనా? వీటిలో ఏముందీ? అని చీర ఇవ్వబోతే వద్దన్నారు. తీసుకోలేదు.

ఇంకొకామె: ఈమె ఆరోగ్యం ఎట్లా కుదుటపడుతుందో మీరు చెప్పాలి.

అమ్మ : పెద్దవాళ్ళే నిర్ణయించారుగా జబ్బులకు.

ఆమె : అమ్మ దగ్గర కొస్తే రహిత మవుతుందని, ఎన్నాళ్ళనుంచో రావాలను కుంటూంటే ఇవాళ్టికి రాగలిగాం.

అమ్మ : ఆ నమ్మకం మీకున్నదా?

ఆమె : "అఁ" అని తలూపింది.

అమ్మ : అయితే రహితం కావాలి.

వెంటనే ఇద్దరు ముగ్గురు కలసి మాటంటే తృప్తి అన్నారు.

ప్రిన్సిపాల్‌గారి

భార్య : అమ్మ దివ్యదృష్టి ఆమె మీద ప్రసరిస్తే ఇంకా జబ్బు తగ్గక వుంటుందా!

అమ్మ : అదేం లేదు ఏ దృష్టీ లేదు అని జబ్బుగలామె ఏడుస్తుంటే దగ్గరకు రమ్మని పిలిచి, ఎంత ఏడుపొస్తే అంత ఏడు అన్నారు.

ఒకామె : ఏమిటో మనస్సులో భయంగా వుంటుందమ్మా?

అమ్మ : దేనికి?

ఇంకొక

ఆమె : ఎందుకో తెలియదంటుంది.

అమ్మ : మనకు తెలియదుగాని ఆ అమ్మాయి వైపు తిరిగి ఏమ్మా ఇప్పుడు కూడా భయంగానే వున్నదా?

ఆమె : ఉన్నదని తలూపింది.

అమ్మ : (అయిదు నిముషాలయిన తర్వాత).....

ఏమ్మా – యిప్పుడెట్లా ఉందీ?

పోయిందని తలూపింది.

# 67. లోపాలున్న విగ్రహం

**9-7-65**

హైద్రాబాద్ నుండి తల్లీ, కూతురు 5 సం॥ల బాబు జమ్ములపాలెం వాళ్ళతోటి వచ్చారు. వీళ్ళను జమ్ములపాలెపు ఆమె అమ్మకు పరిచయం చేసింది. వాళ్ళు నమస్కారం చేశారు. తల్లి అందుకుని, 'అమ్మాయిది హైద్రాబాదమ్మా' అనగానే "నువ్వు వచ్చావుగా 2,3 సార్లు" అన్నారు అమ్మ. 'వచ్చానమ్మా' అని అమ్మాయి పార్వతి విగ్రహమిచ్చి 'ఈ విగ్రహాన్ని తెచ్చి పూజ చేస్తున్నప్పట్నుండి అనారోగ్యంగా వుంటున్నది' అన్నది.

అమ్మ : అంతకు ముందు ఆరోగ్యంగా వున్నదా!

తల్లి : అంతకుముందునుంచీ వున్నది.

అమ్మ : అట్లాంటప్పుడు ఆలోచనేమున్నది?

తల్లి : ఆ విగ్రహం తెచ్చినప్పటినుంచే ఎక్కువైందని అంటున్నారు అందరూ.

అమ్మ : అందరూ అంటున్నారు గానీ, నీకు లేదుగా ఆ అభిప్రాయం?

తల్లి : లేదమ్మా.

అమ్మ : నీకు లేనప్పుడు బాధేమున్నది?

తల్లి : ఆ విగ్రహానికేదో లోపమున్నదనీ, అందుకని ఇట్లా చేస్తున్నదనీ మీరు తాకితే అది పోతుందనీ, -

అమ్మ : నేను తాకితే పొయ్యేదీ, లేనందువల్ల వచ్చేదీ లేదు అని ఆ విగ్రహాన్ని చూస్తూ "నువ్వు దీన్ని ఎవరనుకుని పూజ చేస్తున్నావ్?"

తల్లి : లలిత అనుకున్నా.

అమ్మ : ఒక దేముడు అనుకున్నావు. పూజ చేస్తున్నావు. నిజం చెప్పాలంటే నేను దీన్ని దేముడనుకోవడంలేదు. ఒక లక్ష్యం కోసం పెట్టుకున్నాం. ఇది ఇత్తడితో చేసిందే. చెంబూ ఇత్తడే, గిన్నే ఇత్తడే కాని వాటికి పూజ చేస్తావా? చెయ్యవు గదా! కనుకనే ఒక ఆకారాన్ని ఏర్పరచారు. దాన్ని లక్ష్యంగా పెట్టుకొని పూజ చేస్తున్నాం. నువ్వు పూజ చెయ్యటం దేనికి? రోగం తగ్గాలని కాదుగా? ఆమెను పూజ చెయ్యటం కొఱకే పూజ చేస్తున్నావు. ఏ శక్తి నిన్ను పూజ చెయ్యమనే సంకల్పం కలిగించిందో అదే శక్తి అన్నింటినీ చేయిస్తుంది. విగ్రహం యొక్క పీఠాన్ని చూపిస్తూ దీనికి పూజ చెయ్యవు గదా! కేవలం అమ్మ వారనుకుంటేనే పూజ చెయ్యగలుగుతున్నావు. ఇంత లావు అమ్మవారికి కూడా పీట ఆధారమైనది గదా! - అమ్మ వారు అట్లా చేస్తే నెత్తి అణుస్తుందనీ, అదనీ ఇదనీ అంటారు. అట్లాంటి నమ్మకాలేవీ నాకు లేవు. అదేం లేదని నేననను తల్లి నెత్తి అణుస్తుందా? అట్లాంటి పిచ్చి నమ్మకాలు మీరు పెట్టుకోవద్దు.

తల్లి : అమ్మా వీళ్ళు హైద్రాబాద్‌లో ఇల్లు కట్టించుకున్నారు. ఆ ఇంట్లో ఒసేవ్, ఏమేవ్ అన్న ధ్వనీ, నవ్వుతున్న ధ్వనీ విన్పిస్తున్నదమ్మా?

అమ్మ : అవేమిటో నాకేం తెలుస్తాయి? మీరే మనుకుంటున్నారు?

కూతురు : అదంతా అమ్మవారేననిపిస్తుంది.

అమ్మ : అదంతా అమ్మవారే ననుకుంటున్నప్పుడు ఆ సందేహాలకూ అనుమానాలకూ తావెక్కడిది?

తల్లీ, కూతురు : అందరనుకుంటున్నారు, అంటున్నారు. అది వుండబట్టే ఇట్లా జరుగుతున్నది, తీసెయ్యమంటున్నారు.

అమ్మ : అంద రనుకోవడమే గాని, మీకు లేదుగా ఆ అభిప్రాయం? మనస్ఫూర్తిగా మీరు అమ్మవారే ననుకుంటున్నారుగా?

కూతురు : మనస్ఫూర్తిగా అనుకుంటున్నాను. అమ్మవారే పిలుస్తున్నదనుకుంటున్నాను.

అమ్మ : అసలు అమ్మవారెట్లా వుంటుందో నీకు తెలియదు గదా! సర్వం అమ్మగా చూచే నీకు, మేము దణ్ణం పెట్టచ్చు.

తల్లి : అదేమిటమ్మా అట్లా అంటారు? మీకు చెప్పుకుందా మనుకుంటే -

అమ్మ : అందుక్కాదమ్మా నేనన్నది.

కూతురు : అందరూ నేను చెడగొడుతున్నా నంటున్నారు.

అమ్మ : చెడగొట్టే శక్తి నీలో వున్నప్పుడు, బాగుచేసే శక్తి కూడా నీలో వుండాలిగా?

అన్నీ విని వాళ్ళేం మాట్లాడకుండ తలవంచుకుని 2 ని॥ లుండి - 'నెలరోజులపాటు సేవ చేసుకుంటే - నీ దగ్గరుండి' - అన్నారు.

అమ్మ : అట్లా ఏం బెట్టుకోవద్దు. ఇక్కడున్నందువలన ప్రయోజనమేమీ వుండదు.

కూతురు : ఇక్కడుండి సేవ చేసుకుందామనీ.

అమ్మ : నాకు తెలియదు. ఉన్న వాళ్ళను పొమ్మనేదీ లేదు. పొయ్యే వాళ్ళను వద్దనేదీ లేదు.

చివరకు దెయ్యమో, భూతమో అన్న అనుమానాన్ని తల్లి వెలిబుచ్చింది.

అమ్మ : దెయ్యం లేదసలు. మన మనస్సే దెయ్యం. మన మనస్సే దైవం.

అమ్మ సమాధానాలకు జమ్ములపాలెం వాళ్ళు సంతోషంతో - నవ్వుకున్నారు.

# 68.చేతబడి - మంత్రం

29-2-69

నిన్న సాయంత్రం రామరాజు కృష్ణమూర్తిగారు, ఆయన స్నేహితుడు గుంటూర్నుంచి వచ్చారు. రాత్రి ఆ రెండో అన్నయ్య భోజనం చెయ్యలేదని తెలిసి అమ్మ, "కడుపులో నొప్పా?" అని అడిగారు.

ఆయన : నొప్పికాదమ్మా. అజీర్తివల్ల అంటున్నారు డాక్టర్లు.

వ్యవహారరీత్యా మానసికంగా చాలా బాధ పడుతున్నాను. నాకూ నా భార్యకీ ఘర్షణ వస్తూ వుంటుంది. రెండు నెలల కొకసారి పుట్టింటికి పంపిస్తూ వుంటాను. ఇప్పుడు పుట్టింట్లోనే వుంది. మా తమ్ముడు చూస్తే అట్లా వున్నాడు. పెళ్ళి చేసుకోమంటే చేసుకోడు. వ్యవహారాల చిక్కులు తీరితేగాని చేసుకోనంటాడు. డాక్టర్లు పెళ్ళి అయితే కుదుటపడు తుందన్నారు. (పిచ్చి)

అమ్మ : ఇదివరకు మీ తమ్ముడు వచ్చాడు.

ఆయన : నేనేదో మంత్రాలు చేస్తూ వుంటాను. కళ్యాణంద భారతిగారి శిష్యుడు, కరకమల సంజాతిగారి వద్ద ఉపదేశం అయ్యాను. శ్రీలక్ష్మీగణపతి, శ్రీ విద్యాప్రదలక్ష్మి, హయగ్రీవ మహామంత్రములు పూర్వాంగములుగాను, శ్రీ మేధా దక్షిణామూర్తి మంత్రం ప్రధానంగాను, శ్రీ కృష్ణ, శ్రీ పంచాక్షరీ, సౌరాష్టాక్షరీ మంత్రములు ఉత్తరాంగములుగాను నాకు శ్రీ గురువులు ఉపదేశించారు.

ఇంకో గురువుగారివద్ద ఆంజనేయ మహామంత్రం ఉపదేశం అయ్యాను. రామమంత్రం ఉపదేశం చెయ్యకుండా, ఆంజనేయ మహామంత్రం ఉపదేశం అయ్యాను. రామమంత్రం ఉపదేశం చెయ్యకుండా, ఆంజనేయ మంత్రం చెప్పారాయన. శిష్ట్లా చంద్రమౌళి శాస్త్రిగారు సనాతన భక్త సమావేశానికి ప్రెశిడెంటు. ఆయన శిష్యుడు నా స్నేహితుడు. అతనుకూడా

నాలాగే, రామమంత్రోపదేశం కాకుండానే ఆంజనేయ మంత్రం చేస్తున్నాడు. ఇట్లా చెయ్యకూడదని చాలామంది చెబుతున్నారు.

ఇదిలా ఉండగా, నా కెవరో మందుపెట్టటం జరిగింది.

అమ్మ : ఎందుకు పెడతారు? దేనికి పెడతారు?

ఆయన : ఫలానవాళ్ళు పెట్టారని అనను కానీ, నా మంచితనాన్ని పోగొట్టి నన్నొక అసమర్థుడ్ని చెయ్యటానికి పెట్టి వుండొచ్చు.

అమ్మ : మందులు లేవు. పెట్టారని నీకేమిటి నమ్మకం?

ఆయన : ఒకసారి కక్కించారు. మళ్ళీ అనుమానంగా వుంది. గోరంట్లలో కక్కించే వారున్నారు. అక్కడికి వెళ్ళా. వారు నా దగ్గర డబ్బు తీసుకుని కక్కించారు.

అమ్మ : మందు వున్నదని చెప్పింది ఎవరు?

ఆయన : నేను ఇద్దరు ముగ్గురు దగ్గరకు వెళితే అన్నారు. నల్లేరు పసరు గుండెకి రాచి చూసి, వుందని చెప్పారు.

అమ్మ : మందులంటూ వుంటే ప్రతివాళ్ళూ వశపరచుకుంటారు. అసలు కోర్టుకి ఎందుకు పోతారు? మనిషిని మందుతోనే వశపరచుకోవచ్చుగా! సంబంధంలేని వ్యవహారాల సంగతి ఎలా వున్నా, స్నేహంగా వున్నవాళ్ళని, ఏ అన్నంలోనో మందుపెట్టి వశం చేసుకోవచ్చుగదా!

ఇతర దేశాలు వున్నాయనుకో. మన దేశాభిమానం లేని వాళ్ళెవరూ లేరు. వారిని చేతబడ్డమీద, మందులమీద వశపరచుకోవచ్చు. యుద్ధాలెందు కసలు? మంత్రం అంటే ఏమిటి? మంత్రం ఎందుకు అవసరం అయింది?

ఆయన : ఏదో పొలం స్వాధీనం కాకపోతే, వ్యవహార చిక్కుల కోసం ఆంజనేయం చెప్పారు. ఆ చెప్పినవారు డబ్బు తీసుకుని 40 రోజులు అనుష్ఠానం చేశారు. మాటమాటకీ నేనిట్లా డబ్బు ఖర్చు పెట్టలేను కదా అంటే నీ కోసమే చేస్తున్నాను, ఆ మంత్రం నీకే ఇస్తాను అన్నారు.

అమ్మ : ఎవరి దగ్గర ఉపదేశం?

ఆయన : కళ్యాణంద భారతిగారి దగ్గర మా నాన్నగారు పూర్ణదీక్ష తీసుకున్నారు. శ్రీవిద్య చెప్పమంటే. అది ప్రమాదం చెప్పనన్నారు.

అమ్మ : శ్రీవిద్య అంటే బ్రహ్మవిద్య. అంటే తెలుసుకోవలసిన విద్య, దాన్ని స్త్రీ విద్యగా మార్చారు వీళ్ళు. భార్యని తల్లిలాగా చూడమంటారు. వీడికేమో ఈ వాసన వదలదు. భార్యని తల్లిలాగా చూడటం పోయి, తల్లిగా చూడవలసిన వారిని భార్యగా చూడటం మొదలెడ్తాడు. భార్యని భార్యగా చూడటం చేతయితే అంతే చాలు. మంత్రం ఎప్పుడూ కష్టాన్ని జయించటానికే గాని, కష్టాలు రాకుండా వుండటానికి కాదు. కష్టం ఎవరిచ్చారు?..... మనకి మొదట ఈ ఆస్తి ఇచ్చిన వాడే తీసుకున్నాడు. నరులిచ్చారా? ఇస్తే, తీసేసే శక్తి వుంటుంది. తీసేస్తే, ఇచ్చే శక్తీ వుంటుంది. రెండూ వుండాలి వాడికి. భూమి అక్కడే వుంటుంది. చేతులు మారుతుంది ధనమూ అంతే. డబ్బుంటే భాగ్యం, డబ్బులేకపోవటం దరిద్రం కాదు. చేతిలో డబ్బు వుందనుకో. అది వున్నా అవసరాలు తీరకపోతే! ఏది కావలసిన వాడికి అది అందకపోవటం దరిద్రం. అనుకున్నది జరగటం సంతోషం. తననుకున్నది కాకపోవటం దుఃఖం. ధనం చేతిలో వున్నప్పుడు లక్ష్మి అనుకుంటాడు. జారిపోతే దరిద్రదేవత అంటాడు. మాతృదేవత, దరిద్రదేవత, భాగ్యదేవత - అన్నీ దేవతలే.

అసలు, భగవంతుడు వున్నాడా లేదా అని ఆలోచన. ఆడో, మగో, శక్తో తెలీదు. వాడు అని పిలుస్తున్నాం. భగవంతు దున్నాడనే ఆలోచన ఎందుకొస్తుంది? మనకు తెలియ కుండానే, మన మనసుకి ఒక ఆలోచన వస్తోంది. దాన్ని స్వభావం అంటారు. పోనీ ఆ స్వభావమే భగవంతు డనుకుందాం. మనకి తెలియకుండా, మనకి ఆలోచనలు కల్పించటం.... ఆ ఆలోచనలు జరగటం, జరక్కపోవటం - దీన్నే భగవంతుడంటున్నాం. అమ్మా - అని పిలుస్తున్నావు. అమ్మని నువ్వు ఎట్లా పిల్చినా కోపం

రాదు. మంచినీళ్ళని ఏ పేరుతో అడిగినా, బిందెవంక చూపిస్తుంది కాని, నన్నిట్లా ఎందుకడిగావ్ అనదు. మనకి నచ్చనిది శిక్షగా కన్పించవచ్చు. ఈ శిక్షణ కూడా రక్షణే. అది అప్పుడు తెలియకపోవచ్చు. ఆ తర్వాత తెలుస్తుంది.

కృష్ణమూర్తి గారి వైపు చూస్తూ అమ్మ :

నువ్వీ వూరు ఎప్పటినుంచో రావాలనుకుంటున్నావు. రావాలనుకున్నప్పుడే రప్పించినట్లయితే అప్పుడు కుటుంబంలో కలతలు వచ్చి వుండేవి. ఆనాడు నీకు నేను చేసింది బాధనిపించవచ్చు. అమ్మ నన్ను, రావాలనుకుంటే రానివ్వటల్లేదని, అమ్మ నన్ను దూరం చేస్తోందని నువ్వనుకోవచ్చు. ఇప్పుడెట్లా వుంది? అట్లాగే ఈ శిక్షణలో ఏ రక్షణ వుందో అది మనకు అర్థం కాదు.

కృ.మూ. : చాలా బావుంది నువ్వు చెప్పింది.

అమ్మ : అప్పుడయితే ఎన్ని తగాదాలొచ్చేవి?

కృ.మూ. : తప్పకుండా వచ్చేవి.

అమ్మ : మనం అనుకుంటాం. శిక్ష అనీ, తల్లి మనల్ని సరిగ్గా చూడటల్లేదని. కారప్పూస అడిగినప్పుడు పెట్టను. కడుపు నొప్పి వస్తుందని. వాడికి తినాలని వుంటుంది. పెట్టలేదనే కక్ష వాడి కుంటుంది. పెట్టకుండా వుంటే వాడికి క్షేమం. ఈ సృష్టిలో ఎవరికి ఎప్పుడు ఏదికావాలో, దైవానికి తెలుసు. చేస్తాడు. తెలియక మనం బాధపడతాం. దైవాన్ని తెలుసుకున్నా మనుకుంటాము. తెలుసుకోవటం కాదు. వాడు తెలియబడతాడు. తెలుసుకోవాలనే ఈ ప్రయత్నం మనకి ఎక్కడనించి వచ్చిందీ అంటే, అది ప్రేరణే.

రెండో ఆయనతో :

నీకా భయం అక్కర్లేదు నాన్నా. మంత్రాలు, గింత్రాలు, దోషం – ఏం లేదు. చేతబడులు లేవు. మందులూ, మాకులూ లేవు.

# 69. అపవిత్రత మనకే

**24-8-68**

విజయవాడనుండి వచ్చిన కొత్త అన్నయ్యలలో

ఒక అన్నయ్య : అమ్మా! నేనేమీ అడగాలని రాలేదు. ఏం మాట్లాడాలో తెలియదు. మీరైనా మాట్లాడితే .....

అతని మాటలు పూర్తికాక ముందే

అమ్మ : మాట్లాడాల్సిన అవసరం లేదు నాన్నా.

కాసేపు ఆగి -

అన్నయ్య : మామూలుగా వ్యవహారికంలో వుండి సాధన చేయటం సాధ్యమేనా?

అమ్మ : ఇది బరువు కాదనుకుంటే చెయ్యొచ్చు.

అతని ప్రక్కతనిని చూపిస్తూ -

అన్నయ్య : మీ విషయం సరేననుకోండి ఇతని విషయమే చూడండి. వ్యవహారిక విషయాలు ఏవీ లేవు అతనికి. కాని ఏకాగ్రత కుదరటం లేదట. అతని విషయమే అట్లా ఉన్నప్పుడు మా సంగతి ఏమిటి?

అమ్మ : వారికి కుదరకపోవచ్చు. మీకు కుదరవచ్చు.

అన్నయ్య : అనుకొన్నప్పుడు కుదరదు. కాని ఒక్కొక్కప్పుడు అదే కుదురుతుంది. మన ప్రయత్నం లేకుండగనే జరుగుతుంది. నేనెక్కువ రైలు ప్రయాణాలు చేస్తుంటానమ్మా. రైల్లో కూర్చున్నప్పుడు నాలుగయిదు గంటలు నాకు తెలియకుండానే జరుగుతుంది. ఒక్కొక్క సమయంలో సాధన

ఆపివేయవలసి వస్తుందమ్మా – అపవిత్రంగా వున్నప్పుడు, అట్లాంటప్పుడు చేస్తే అపవిత్రం అవుతుందని.

అమ్మ : అపవిత్రత మనకు కాని దైవానికి కాదుగా, మనల్ని పవిత్రం చేసేది అది.

అన్నయ్య : స్నానం అదీ చెయ్యకుండా చేస్తే......

అమ్మ : స్నానం చేయటం ఎందుకంటే హాయిగా ఉంటుంది కాబట్టి. ఎప్పుడు చేసినా ఫరవాలేదు. మనం బయటికి వెళ్ళామనుకో నాన్నా, మంత్రం జ్ఞాపకం వచ్చింది. మలం పోయింది. మంత్రం వచ్చింది.

అన్నయ్య : అదే నమ్మా నేను చెప్పలేక పోయిందే మీరు చెప్పారు. నాకు 'మంత్రం' – చేయమన్నప్పుడు తప్ప మిగతా టైములోనే కుదురుతోంది. అట్లా వద్దన్నారు కదా అని ఆపవలసి వస్తోంది.

అమ్మ : అప్పుడైనా నోటితో ఉచ్చరించం గాని, మనస్సులో అదే వస్తున్నదిగా? కనుక అదేం లేదు నాన్నా. ఏ సమయంలో నైనా చేసుకోవచ్చు.

అన్న : అంతమాత్రం ధైర్యం చెప్పేవాళ్ళుంటే చాలమ్మా. అట్లా చెప్పేవాళ్ళు లేకనే.

అమ్మ : ఏ పరిస్థితులలోనైనా చేయి నాన్నా. గుర్తు వస్తున్నది కనుక చెయ్యి. ఎట్లా ఉన్నా చేసుకో. అది మైలపడదు. "అది" (మంత్రం) మనల్ని పవిత్రం చేయదానికే కానీ దాన్ని మనం 'మైల' పడెయ్యలేము.

నాలాగే, రామమంత్రోపదేశం కాకుండానే అంజనేయ మంత్రం చేస్తున్నాడు. ఇట్లా చెయ్యకూడదని చాలామంది చెబుతున్నారు.

ఇదిలా ఉండగా, నా కెవరో మందుపెట్టటం జరిగింది.

అమ్మ : ఎందుకు పెడతారు? దేనికి పెడతారు?

ఆయన : ఫలానవాళ్ళు పెట్టారని అనను కానీ, నా మంచితనాన్ని పోగొట్టి నన్నొక అసమర్థుడ్ని చెయ్యటానికి పెట్టి వుండొచ్చు.

అమ్మ : మందులు లేవు. పెట్టారని నీకేమిటి నమ్మకం?

ఆయన : ఒకసారి కక్కించారు. మళ్ళీ అనుమానంగా వుంది. గోరంట్లలో కక్కించే వారున్నారు. అక్కడికి వెళ్ళా. వారు నా దగ్గర దబ్బు తీసుకుని కక్కించారు.

అమ్మ : మందు వున్నదని చెప్పింది ఎవరు?

ఆయన : నేను ఇద్దరు ముగ్గురు దగ్గరకు వెళితే అన్నారు. నల్లేరు పసరు గుండెకి రాచి చూసి, వుందని చెప్పారు.

అమ్మ : మందులంటూ వుంటే ప్రతివాళ్ళూ వశపరచుకుంటారు. అసలు కోర్టుకి ఎందుకు పోతారు? మనిషిని మందుతోనే వశపరచుకోవచ్చుగా! సంబంధంలేని వ్యవహారాల సంగతి ఎలా వున్నా, స్నేహంగా వున్నవాళ్ళని, ఏ అన్నంలోనో మందుపెట్టి వశం చేసుకోవచ్చుగదా!

ఇతర దేశాలు వున్నాయనుకో. మన దేశాభిమానం లేని వాళ్ళెవరూ లేరు. వారిని చేతబడ్డమీద, మందులమీద వశపరచుకోవచ్చు. యుద్ధాలెందు కసలు? మంత్రం అంటే ఏమిటి? మంత్రం ఎందుకు అవసరం అయింది?

ఆయన : ఏదో పొలం స్వాధీనం కాకపోతే, వ్యవహార చిక్కుల కోసం అంజనేయం చెప్పారు. ఆ చెప్పినవారు డబ్బు తీసుకుని 40 రోజులు అనుష్ఠానం చేశారు. మాటమాటకీ నేనిట్లా డబ్బు ఖర్చు పెట్టలేను కదా అంటే నీ కోసమే చేస్తున్నాను, ఆ మంత్రం నీకే ఇస్తాను అన్నారు.

# 70. స్త్రీలకు మంత్రజపం నిషిద్ధమా?

**20-2-64**

బహిష్టుగా ఉన్న తరుణంలో మంత్రం, జపం చెయ్యకూడ దంటారు? చేస్తే ఆహుతి ఏదో కావాలట. ఏమిటమ్మా అదీ? అంటూ రేపల్లె నుండి వచ్చిన ఒక సోదరి ఈ మధ్యాహ్నం అమ్మ హాల్లో కూర్చొని ఉండగా ప్రశ్నించింది.

అమ్మ : నా దృష్టిలో అన్నివేళలా చెయ్యొచ్చమ్మా. మనస్సే ఆహుతి చేస్తే ఇంకా వేరే ఆహుతి ఎందుకూ? అన్నింటికి మనస్సేగా? మనం దూరంగా ఉన్నప్పుడు రోజూ చేసుకునే మంత్రం కాని జపంకాని ఆ మూడు రోజులు చెయ్యొద్దు అంటారు కాని పైకి ఉచ్చరించలేకపోయినంత మాత్రాన మనస్సులో జపించకుండా ఉండలేము కదా. ఇక్కడ దూరంగా ఉన్నప్పుడు అమ్మను చూడకపోయినంత మాత్రాన మనస్సులో అమ్మ రూపు ఉండకుండా ఉంటుందా? మంత్రమంటే అక్షరమాలేగా. ఉన్న అక్షరాలలో ఏరి వాక్యాలు రూపొందించి వాటికొక భావన కల్పించి చెవిలో చెప్పేసరికి మంత్రమౌతుంది. దానికొక పవిత్రత ఏర్పడుతుంది. వాడు ఇచ్చింది మాటే కాని నీ మననంతో మంత్రమైంది. మననమే మంత్రం.

# 71. బైబిలు

గోవాడ నుండి కరణంగారి భార్య ఇక్కడికి రావటం ఇదే ప్రథమం కాదు. ఇప్పటికి ఐదు ఆరుసార్లు వచ్చారు. ఈసారి వారి పెద్ద అబ్బాయిని తీసుకుని నిన్న ఉదయం **(3-2-65)** వచ్చారు.

ఈ ఉదయం ఆ అన్నయ్య (సత్యనారాయణ) అమ్మను అడిగారు.

అన్నయ్య : బైబిల్ చదివితే తప్పా అమ్మా, మా నాన్నగారు కోప్పడతారు.

అమ్మ : తప్పేముంది నాన్నా, ఏం లేదు. కాని వాళ్ళు చెప్పే అర్థం కంటే ఆ వాక్యాలు బాగుంటాయి. మనం గీతలో చెప్పింది ఎంతవరకు అర్థం చేసుకోగలుగుతున్నాము? ఏదైనా అంతే. గీత కాని బైబిల్ కాని ఖురాన్ కానీ దేనిలో చెప్పినా ఒక విషయం గురించే చెప్పారు.

ఆచరించేవాడికి ఏదైనా ఒకటే. ఆచరించలేనివాడే 'దాన్లో ఏముంది, దీన్లో ఏముంది' అని వెతుకుతుంటాడు. కాని చివరికి వెతుక్కోవడంతోనే సరిపోతుంది. ఏదీ ఆచరించలేడు. తోటి ప్రాణిని ప్రేమించమని ఒక్క బైబిల్ లోనే చెప్పలేదుగా, అన్నింట్లో చెప్పారు. జ్ఞానమంటే వేరే ఎక్కడుంది? ఉన్నది ఉన్నట్టుగా అర్థంచేసుకోవడమేగా జ్ఞానం.

అక్కయ్య : చదివినందువల్ల నష్టం ఏం లేదు కాని ఆ మతం పుచ్చు కుంటున్నారు కదమ్మా, ఉన్న మతం వదిలేసి?

అమ్మ : అదీ నిజమే నమ్మా, మనసులో లేనిది మతం తీసుకున్నంత మాత్రాన కలుగుతుందా మార్పు? వాళ్ళు చెప్పే మతం పుచ్చుకోకపోవచ్చు కాని క్రీస్తు చెప్పింది పాటించకూడదని ఎక్కడా లేదు. అది పాటించడానికి కేవలం మతమే పుచ్చుకోనవసరం లేదు.

అన్నయ్య : అవునమ్మా, ఒకరుగా ఉన్నప్పుడు ఏదీ ఉండదు. అందులో కృత్రిమము ఉండదు. ఒకరికి నలుగురై సంస్థగా ఏర్పడినప్పుడు అవన్నీ మార్పులు చెంది అసలు విషయ ప్రాధాన్యం మర్చిపోయి వాళ్ళ పదవులు గొప్పతనం కోసం, మత వ్యాప్తికోసం అనేక విధానాలు ప్రవేశపెడతారు.

అమ్మ : సంస్థ అని చేరాక చెడు ఉండకుండా ఉండదు. సంస్థ అంటే సర్వమూ జేరిందనేగా? సమస్తం అన్నప్పుడు అన్నిరకాలు ఉంటాయి. మంచీ, చెడూ అన్నీ. ఇంకా ప్రత్యేకంగా చెడు ఏముంది?

అక్కయ్య : ఇప్పుడు ఆ మత వ్యాప్తి చెయటం కేవలం బిజినెస్ తయారు అయింది.

అమ్మ : నేను ఒకటి చెబుతా నమ్మా, ఇప్పుడేది వ్యాపార పద్ధతిలో లేదు? ఏ చెప్పటమైనా అవతలి వ్యక్తిని కదిలించగలిగేదై ఉంటే మతవ్యాప్తి కోసం ఎవరూ పరుగెత్తనవసరం లేదు. వాళ్ళే వస్తారు. ఇల్లిల్లూ తిరిగి పదే పదే చెబితే మతం మార్చుకుంటారా? అసలు ఒకటి రెండు అయినప్పుడే ఈ ఘర్షణ ఉన్నది.

రాధాకృష్ణరెడ్డి ఫిడేలు వాయిస్తున్నాడు. అది చూపిస్తూ--

ఆ ఫిడేలుమీద కమాన్ కదలటం ఘర్షణ కాదూ? మాటలలో భేదం కాని అన్నీ ఒకటే. శంకరాచార్యులు హిమాలయాలనుండి కన్యాకుమారి వరకు ప్రయాణం చేశాడు కదా. అతను ఏ దేవిని స్తోత్రం చేసినా భావం ఒకటినే చూడగలిగాడు. మనం అది అర్థం చేసుకోలేము. ఎంతదూరం వెళ్ళినా మనకు ఒకటే తేలుతుంది. ఆచరించేవాడికి ఇన్ని అక్కర్లేదు – అని.

6

# 72. ఆచారం

**2-7-65**

అమ్మ హాల్లో కూర్చున్నారు. బాపట్లనుండి ఉదయమే వచ్చిన హరిదాసుగారి బంధువులు అమ్మదర్శనం చేసుకుని, పూజచేసుకుని, తీర్థప్రసాదాలు తీసుకుని కూర్చున్నారు.

అప్పుడే చీరాలనుండి ఒక అక్కయ్య, అన్నయ్య వచ్చారు. వెంటనే అమ్మదర్శనం చేసుకొని టెంకాయలు కొట్టి హారతిచ్చి తీర్థం, ప్రసాదం తీసుకుని కూర్చున్నారు. ఆ అన్నయ్య తన సందేహాలను నివృత్తి చేసుకోవాలని అమ్మను అడుగుతున్నాడు.

అన్నయ్య : అమ్మా శివకోటి చేస్తున్నాను. ఆచారం ఏమైనా వున్నదా?

అమ్మ : ఆచారమంటే... ఆచారమంటే- ఆచరించటమేనని నా ఉద్దేశం. ఆచారమంటే - నీ వుద్దేశం?

అన్నయ్య : స్నానం .... నియమం....

అమ్మ : నా దృష్టిలో ఇట్లాంటి వేమీ వుండవు. చెయ్యటం ప్రధానం గాని, ఇవన్నీ ఏం లేవు. సందేహమే - అనాచారం. శ్రద్ధాభక్తులతో పాకీదొడ్లో చేస్తేమటుకేం? నా దృష్టిలో ఎక్కడున్నా ఒకటే. చెయ్యటం ప్రధానం. పాయకానా దొడ్డి వేరైనది కాని అది మన కడుపులోదేగా? శ్రద్ధ, భక్తికంటే - ఆచార మేమున్నది? ఆచరించటమేగా- ఆచారమంటే? అది వచ్చి నెత్తి అణుస్తుందనీ, ఏదో చేస్తుందనీ- అంటారు. నా కా నమ్మకం లేదు. మంత్రం - బయటకు పోయినచోట జ్ఞాపకం రాకూడదని చెప్పారుట. అక్కడే గుర్తు వస్తుందిట. ఎట్లా అమ్మా? - అన్నారొకాయన. మలం పోతే మంత్రం గుర్తొస్తుంది. సర్వత్రా గుర్తుండాలి కాని, అంతకంటే ఏం కావాలి?

అన్నయ్య : బజారు కెళ్ళొచ్చిన గుడ్డ విప్పి స్నానమేమన్నా చెయ్యాలా?

అమ్మ : నీ ప్రవర్తన నీ మనస్సుకు తెలియదూ! దాన్నిబట్టి ఎట్లా తోస్తే అట్లా చెయ్యి.

అంతా విని సంతృప్తిగా 'వస్తానమ్మా' అని లేస్తే అమ్మ "భోంచేసి వెళ్ళండి" నాయనా అన్నారు.

# 73. సూర్యనమస్కారాలు

గోదావరి జిల్లాల నుండి వచ్చిన ఒక అక్కయ్య అమ్మ గదిలోకి వచ్చి నిలబడింది. ఆమెను అనుసరించి గర్భవతి అయిన మరొక అక్కయ్య కూడా లోపలకు ప్రవేశించింది.

ఆ అక్కయ్య లోపలకు వచ్చి అమ్మకు కొంచెం ఎడముగా నిలబడి జంకుతూ జంకుతూ అందరి ముఖాలూ చూస్తూ నిలబడింది.

ఆమె పరిస్థితి గమనించిన రామకృష్ణ అన్నయ్య అడిగాడు.

రా.కృ.అన్నయ్య : నమస్కారం చేసుకుని వెళతారా? లేకపోతే ఏమయినా అడుగుతారా?

ఆమె : అడగాలండీ.

రా.కృ.అన్నయ్య: అయితే అడగండీ.

ఆమె : ఏమీ లేదండీ దేవుడి సంగతి – సూర్యనమస్కారాలు చేస్తుంటే ఒళ్ళంతా బరువెక్కి ఒళ్ళు పెరుగుతోంది.

అమ్మ ఏమీ మాట్లాడలేదు.

రా.కృ.అ : ఎన్నాళ్ళనుండీ చేస్తున్నారు?

ఆమె : ఏడాదినుండీ చేస్తున్నాను.

రా.కృ.అ : ఇదెప్పటినుండీ?

ఆమె : నెలనాళ్ళనుండీ నండీ. ఒళ్ళు బరువెక్కుతోంది. చేతులు యిలా తిరుగుతై. (చేతులు మెలికలుగా త్రిప్పిచూపుతూ) ఒళ్ళు స్మృతి తప్పిపోతుంది.

అమ్మ : ఇదంతా నీకే తెలుస్తుందా? ఎవరయినా చెబుతారా?

ఆమె : ముందు తెలుస్తుందమ్మా. తరువాత స్మృతి తప్పిపోతుంది.

అమ్మ : అందువల్ల నీ కేదయినా బాధగా వుంటుందా?

ఆమె : లేదు. ముఖంమీది కేదో నీడ వచ్చినట్లుంటుంది.

అమ్మ : అయితే దానివల్ల బాధేం లేదుగా?

ఆమె : లేదమ్మా–

అమ్మ : అదే చెయ్యండి. సూర్యనమస్కారాలు చేస్తున్నారుగా. చెయ్యండి. అందువల్ల బాధేం లేదుగా?

# 74. సూక్ష్మ శరీర దర్శనం

అన్నయ్య : లలితా సహస్రనామాల్లో మహాగ్రంధివిభేదిన్యై నమః, రుద్రగ్రంధివిభేదిన్యై నమః అని వుంది. వాటి అర్థం ఏమిటమ్మా?

అమ్మ : అన్నింటిలో వున్నావని. ఇంకోరకంగా మనవాళ్ళు చేప్పేదేమిటంటే, ఇవన్నీ ఛేదించుకుని వస్తుందని. శ్రీచక్రం అంటే శరీరం అనేగా. నీ శరీరం ఇన్ని గ్రంధుల్తో నిండివుందని, ఆమెకి రుద్రగ్రంధి, మహాగ్రంధి, అని వేరే లేదు. అన్నీ శక్తితో నిండే వున్నాయి. అంతటా వున్న నిన్ను ఈ నామాలతో పిలుస్తున్నాం అని. అంతే.

అక్కయ్య : అగస్త్యమహర్షి సూక్ష్మశరీరంలో కనిపించారని Madam Balvatsky ఒక పుస్తకంలో రాసింది.

Annibesant కూడా రాసింది. ఆయన్ని చూసానని. అది సంభవమేనా?

అమ్మ : చూసినవాళ్ళు చెపుతున్నారు - చూసామని. మనం చూడలేదు. ఒక రాయిని ధ్యానిస్తున్నప్పుడు, అది లేచి మనిషిరూపంలో వచ్చినట్టు చూసిన వారుంటారు. అబ్బాయి ఇంకోవూర్లో వుంటే, ఆ అబ్బాయి వచ్చాడని కలగనే వాళ్ళున్నారు. కలంటే ఏమిటి? నిద్ర లేచింతర్వాత జరగనివి, జరిగినవి అనేక ఆలోచనలొస్తాయి. అందులో కొన్నే గుర్తుంటాయి. అనుభవిస్తున్న వాళ్ళు చెబుతున్నారు. వాళ్ళు వచ్చారో, లేదో..... చూసామన్న వాళ్ళకి కనపడటం మాత్రం నిజం. ఏనాడో పోయిన రాముడు, కృష్ణుడు కనిపించారని వినట్లేదా? వాళ్ళు శరీరాల్తో కొంతకాలం వున్నట్టు విన్నాం. వాళ్ళు మళ్ళీ కనిపించి మాట్లాడినట్టు వింటున్నాం. అట్లాగే..... ఇదీ.

# 75. మహత్తులు

9-12-65 ఉదయం అమ్మ స్నానంచేసి హాల్లోకి వచ్చారు. అప్పటికే ఆనాటి క్రొత్తవారు హాల్లో కూర్చుని ఉన్నారు. అమ్మ మంచంమీద కూర్చోగానే గుంటూరు నుండి వచ్చారట బాబాగారని వారు అమ్మకు నమస్కరించారు. ఆ తర్వాత వరుసగా ఆయన శిష్యబృందం నమస్కరించింది. బాబాగారు వారు తీసుకొచ్చిన పళ్ళు అమ్మకు ఇచ్చారు. అమ్మ వాటిని తాకి వాళ్ళకు తీర్థం వేశారు. ఇంతలో బాబాగారు అమ్మకు ఏదో చెప్పి వెలుపలికి వెళ్ళారు. అమ్మ గోపాలన్నయ్యతో అన్నారు.

"వాళ్ళని కాసేపు ఆగమని చెప్పరా. మొదటి హారతి ఆయన ఇస్తారట. స్నానానికి వెళ్ళారు".

కాసేపట్లో ఆయన స్నానంచేసి వచ్చారు. మోకాళ్ళ మీద కూర్చుని అమ్మకు నమస్కరించి తన కుడిచేతిని ఒకసారి పైకి ఎత్తి పై నుండి క్రిందపడుతున్న వస్తువును పట్టుకున్నట్లుగా చెయ్యి కదిలించి ఆ మూసిన గుప్పెటను అమ్మ ముందుకు తీసుకొచ్చి తెరిచారు. అరచేతిలో కర్పూరం ఉన్నది. వారు మొదట మాట్లాడుతున్నప్పుడు ఎలా వారి వంక చిరునవ్వుతో చూశారో ఇప్పుడూ అట్లాగే అమ్మ చూడసాగారు. అరచేతిలోనే ఆ కర్పూరాన్ని వెలిగించి అమ్మకు హారతి ఇవ్వబోయారు. కాని అది వెలిగించిన మరుక్షణంలో ఆరిపోయింది. రెండోసారి వెలిగించారు. అప్పుడూ అంతే. మూడోసారి వెలిగించారు. అదీ అంతే.

మరో రెండుసార్లు అలా జరిగేటప్పటికి ఆయన ఒక్కసారిగా నవ్వి అమ్మ ఒళ్లో తలపెట్టి కాసేపు అలాగే ఉండి ఆ తర్వాత నీళ్ళతో నిండిన కళ్ళతో "నీ భిక్ష తల్లి" – అంటూ కర్పూరం వెలిగించారు.

ఈ సారి అది ఆరిపోలేదు. అమ్మకు హారతి ఇచ్చి అది అందరికీ చూపించి కర్పూరం పూర్తి అవుతుండగా అరచేతిలో నుండి వ్రేళ్ళమీద పెట్టి అక్కడనుండి హారతి వెలిగించే పళ్ళెంలో వేశారు. ఐదు నిమిషాల తర్వాత నెమ్మదిగా అమ్మను ఏదో అడిగారు, అమ్మ సమాధానాన్ని బట్టి వారు అడిగిందేమిటో అర్థమైంది.

"నేను రావటమేమిటి? తీసుకెళ్ళు. (కర్పూరాన్ని ఉద్దేశించి) ఇవన్నీ వచ్చినప్పుడు నేను రావటం గురించి అడిగేదేముంది? ఒకటి సాధ్యమైతే అన్నీ సాధ్యమవుతాయి. ఇది చూపించి ఇది నా దయ అంటున్నావు కదా, అప్పుడు ఇదికూడా అడగటం దేనికి? తీసుకెళ్లు.. సృష్టిలో సాధ్యం అసాధ్యం రెండు ఉన్నాయి కదూ నాన్నా? ఇందులో ఏ ఒకటి సాధ్యమైనా సర్వం సాధ్యం కాదూ? అప్పుడు ఎందులోనూ ప్రత్యేకత ఏం లేదు. దాన్ని ఎట్లా చేతిలోకి రప్పించావో నన్నూ అట్లాగే రప్పించుకో. ఒక పావలా పెడితే కర్పూరం వస్తుంది. ఈ కర్పూరం దేనికి తియ్యటం? దానివల్ల జనం 'ఆహా వచ్చింది' అని చెప్పుకోవటానికి ఉపయోగపడేదేగానీ ఇది దేనికి పనికివచ్చేదీ?"

# 76. నాగస్వామి

అమ్మ హాల్లోకి వచ్చి కూర్చున్నారు.

బాబాగారు చెప్పటం ఆరంభించారు. వాళ్ళ ఆశ్రమంలో ఒక పుట్ట వున్నది. అక్కడికి ఒక పాము వస్తున్నది. అది సుబ్రహ్మణ్యేశ్వర స్వామి. చాలా సంవత్సరాలనుండి వస్తున్నా ఈ సంవత్సరం చాలా సార్లు వస్తున్నాడట. ఈ విషయం పబ్లిక్‌కు తెలియజేయాల్సిన అవసరం ఉన్నదా లేదా, ఆ పామువల్ల ఏ భయం లేదు కదా అని అమ్మను అడిగారు.

అమ్మ : పబ్లిక్‌కు ఎందుకు తెలియాలి?

బాబా : తెలియకపోతే ఎట్లా?

అమ్మ : నీకు తెలిసిందిగా సుబ్రహ్మణ్యేశ్వర స్వామి అని.

బాబా : ఆఁ

అమ్మ : ఇంకా ఎందుకూ? ఒక మాట చెప్తాను.

ఒక్క పాములోనే శక్తిలేదు. ఇంకో దానిలో శక్తి లేకుండా లేదు. (ఎదురుగా వాళ్ళు పళ్ళు తెచ్చిన ప్లాస్టిక్ బుట్ట ఉన్నది) ఇప్పుడు ఆ బుట్టకు ఆ ఆకారం రావాలంటే ప్రాణశక్తి లేకపోతే రాదు. మన చేతులకు చేసే శక్తీ, దానికట్లా అయ్యే శక్తీ రెండింటికి ఉన్నాయి. శక్తిలేకుండా ఉన్న వస్తువు లేదసలు. అగ్గిపెట్టెకు వెలిగించే శక్తి, కర్పూరానికి వెలిగే శక్తి, నీకు వెలిగించే ఉద్దేశం.... ఈ మూడు కలిస్తేనే అది వెలిగేది.

ఉన్న శక్తి అంతటా ఒకటేకదా!

మన యింట్లో ఎలుకలు ఉంటాయి. వాటికి వాటి ఆహారం రోజూ అలవాటుగా పెడుతుంటే వస్తుంటాయి, తిని పోతుంటాయి. ఏ జంతువైనా అంతే. సుబ్రహ్మణ్యేశ్వరస్వామి అంటే పాముని దుష్టజంతువుగా

భయంకరంగా చూస్తామని పామురూపం కూడా (దైవము) అని సుబ్రహ్మణ్యేశ్వరస్వామి అంటున్నాము. మరి పక్షుల్లో గరుత్మంతుడిని నేనే అని చెప్పుకున్నాడు. అన్నింట్లోనూ నేను ఉన్నానని చెప్పటంకోసం ఇదంతాను. ఇందులో కూడా ఏ వానపాములోనో చూడటంలేదు. వాడు – అన్నింట్లో నేను ఉన్నా – నని చెబుతున్నా చూడలేకపోతున్నాము. సాటి మానవుడినే సమానంగా చూడలేని మనం ప్రత్యేకించి ఒక దుష్టజంతువును సమానంగా చూడగల్గుతామా? అందుకని అందులో సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని నేను అన్నాడు. తతిమ్మావి కాదని కాదుగా. అలవాటుచేస్తే ఏవి తినిపోవు? అన్నీ తింటాయి. పుట్ట పెట్టింది పాముకాదు. పుట్ట పెట్టింది చెదలు. మనం మరొకరు కట్టిన ఇళ్ళల్లో కాపురం చేస్తున్నట్టు – అవి వస్తున్నాయి. వాసయోగ్యం కనుక ఉన్నాయి. ఇందులో ప్రత్యేకత ఏముంది?

బాబా : ఏం లేదు.

అమ్మ : ఇందులో విశేషం అనిపించటంలేదు. మీ ఉద్దేశం ఏమిటో చెప్పండి. దాన్ని (పుట్టను) తీయించాలని కాదుగా, ఇప్పుడూ వస్తున్నాడా?

బాబా : చాలా సంవత్సరాలనుండి వస్తున్నాడు. కాని ఈ సంవత్సరం జాస్తి.

అమ్మ : దగ్గరకు వచ్చి పడుకుంటాడా?

బాబా : ఆc. పడుకుంటాడు. ఇల్లంతా తిరుగుతాడు.

అప్పుడప్పుడు మా పిల్లవాడికి కూడా చుట్టుకుంటాడు.

అమ్మ : అలవాటు కదూ! అలవాటు చొప్పున వస్తాయి. ఇప్పుడు పాముల వాడి దగ్గర పాములు ఉన్నాయి అనుకో. అవి చూడు ఏం అన్నా చేస్తాయో, నువ్వు ఇంకా కొంచెం ప్రేమగా ఉన్నావు, కనుక అవీ ఉంటాయి. మనుష్యుల్లో ఎట్లా దుష్టత్వం గలవాళ్ళు ఉన్నారో అట్లాగే పాముల్లో సాధుత్వం గలవి ఉండకూడదూ?

బాబా : ఎందుకు ఉండకూడదు?

అమ్మ : ఏముంది విశేషం?

బాబా : జంతువుల్లో కూడా మహాత్ములు లాంటివి, భక్తితో ఉన్నవీ ఉన్నాయి.

అమ్మ : అన్నింట్లో ఉన్నదికదా! ఉన్నదంతా ఒకటే కదా! దాని తత్వం అట్లా ఉన్నది. మనకు భయంగా ఉన్నా ప్రేమగా ఉన్నా దాని స్వభావం అదే కదా! దాని గురించి ఆలోచన ఏముంది?ఎట్లా తోస్తే అట్లా చెయ్యి నాయనా, నువ్వు చేసినా, ఇంకొకరు చేసినా, ఎవరు ఏమి చేసినా - నడిపించే శక్తి ఒకటే కదా. నడిపిస్తేనేగా నువ్వైనా నడుస్తున్నది. నీదేముంది? ఏది చేసినా - గొప్పకార్యం చేసినా, కొద్ది కార్యం చేసినా - ఒకటే. నడిపించేది ఒకటైనప్పుడు నీ గొప్పతనం లేదు, నా గొప్పతనం లేదు .... అంతేనా?

బాబా : నువ్వు చెప్పావు కదా!

అమ్మ : నాకేమో గొప్పది అనిపించదు.

బాబా : గొప్ప ఏముంది?

అమ్మ : ఏదీ కొద్దిదీ అనిపించదు.

బాబా : అవును.

అమ్మ : అంతా ఒకటే. ఆ శక్తి నడిపిస్తుంది, నడుస్తున్నాము. అంతే.

బాబాగారు ఇంక ఏం ప్రశ్నించలేదు. శెలవు తీసుకుంటా మమ్మా - అన్నారు. వారికి అమ్మ ప్రసాదమిచ్చారు.

# 77. మహాత్మ్యాలు

శ్రీపాద : మహాత్మ్యాలవల్ల దైవం అనుకోవటం వేరు. ఏమీ లేని చోటా, సామాన్యంగా వున్న చోటా, సామాన్యుడు గుర్తించటం (ఇక్కడ) ఇది చాలా గొప్ప విషయమమ్మా.

అమ్మ : **1955** ఆగష్టు **18, 19** తారీకులలో కొన్ని సంఘటనల వల్ల ఇక్కడ గుర్తించినట్లున్నారు. 'ఈ కుటుంబం వల్ల నీకేమన్నా ఆటంకం కలుగుతుందా?' అన్నారు. నాకు దేనివల్లా ఆటంకం లేదు. ప్రత్యేకించి వచ్చిందీ లేదు; పొయ్యేదీ లేదు - అన్నాను.

అని లేచి వాకిట్లోకి ఇంకొక సారి వచ్చి, లోపలికి వెళ్ళి మాట్లాడారు.

వీళ్ళు - చల్లదనం, చల్లదనం - అని అంటారు. ఎప్పుడూ చల్లగా వున్నంత మాత్రాన చల్లదనమవుతుందా? కాదు. ఎప్పుడూ కావాలని పించేదే చల్లదనం.

ఎప్పుడు ఏది కావాలో అదిచ్చేదే చల్లదనం.

# 78. గురువు

**(9-6-69)**

ఈ ఉదయం కాకినాడనుంచి వచ్చిన ముగ్గురు సాయంత్రం సంధ్యావందనం జరుగుతున్న సమయంలో అమ్మతో సంభాషించాలని వచ్చారు. వారిలో ఒకాయన అన్నారు :

"దేవుణ్ణి తెలుసుకోవటానికి ఏదైనా సాధన చేద్దామను కుంటున్నాను. ఈ సంసారంలో వుంటూ కూడా చెయ్యటానికి వీలుగా ఉండేది ఏదైనా...."

అమ్మ : చాలా రకాలు చెబుతున్నారుగా - సంసారంలో వుంట్తూ కూడా చెయ్యగలిగినవి.

రెండో ఆయన : అడ్డంకులొస్తున్నాయి సాధన చెయ్యటానికి. గృహ సంబంధమైన చిక్కులవల్ల....

అమ్మ : అడ్డంకులు వస్తూనే వుంటాయి. అడ్డంకులు రాకపోతే చెయ్యాల్సిన అవసరమే వుండదు....

ఒకరు : ఏం చెయ్యమంటారు?

అమ్మ : ఫలానిది చెయ్యమని నేను చెప్పను. మీరేం చేస్తుంటారు?

ఒకరు : వ్యాపారం, సాధన విషయమైతే .... జపంచేస్తూ వుంటాను.

అమ్మ : చేస్తున్నారుగా. చేసేది మానుకోలేంగా! వ్యాపారం అంటే దానికి తగిన పన్లుంటాయి. ఇదీ వ్యాపారమేగా! అంటే మీ దృష్టి.

అమ్మ మాటలకు ఆయన మధ్యలోనే అడ్డుపడి అన్నారు.

ఒకడు : దేవుణ్ణి తెలుసుకుందామని జపం చేస్తున్నాను.

అమ్మ : చెయ్యండి. అనేక మార్గాలు చెబుతున్నారు. మీకేది సులభం అనిపిస్తే అది చెయ్యండి. సన్యాసులకే ప్రత్యేకించి సాధనలు చెప్పలేదుగా. గృహస్థులకు కూడా చెబుతున్నారు. అందులో మీకు ఏది చెయ్యాలనిపిస్తే అది చెయ్యండి.

ఒకరు : ఈ గృహసంబంధమైన అడ్డంకులు రావడంవల్ల ఇవన్నీ - కేవలం ఆధ్యాత్మికంగానే వుండిపోవాలా, లేక యిందులోనే వుంటూ.... అన్నిరకాల సాధనలు చేస్తున్నామనుకోండి....

అమ్మ : నిజమే. ఛేదించుకుపొమ్మని చెప్తున్నారు. ఛేదించుకోకుండా యిందులోనే వుండమని చెబుతున్నారనీ వున్నాయి. ఇందులో మీకు ఏది మంచిదని తోస్తే అది చెయ్యండి. వ్యాపారం వదులుకోటానికి సిద్దమేనా?

ఒకరు : వ్యాపారం వదలటానికి సిద్ధమేనండీ, కానీ దానివల్ల ఇంట్లోవాళ్ళకి బాధ కలుగుతుందనిపించి అది చెయ్యలేక పోతున్నాను.

అమ్మ : వదిలిపెట్టాలనిపిస్తున్నా వ్యాపారం ..... దానివల్ల ఇంట్లో వాళ్ళు బాధపడతారని చెబుతోంది మనస్సు. ఇప్పుడు భార్యా పిల్లల్ని వాళ్ళని పోషించడం కూడా స్వార్థం కాదా? వాళ్ళు బ్రతకటంకోసం కాదుగా మనం పోషించేది. నీకు భార్య అవసరం. వాళ్ళకి కావలసినవి చూడటం, వారిని పోషించడం నీ తృప్తి కోసమే. తృప్తిగా వుండాలనుకోవటం స్వార్థమేగా? నాకు నేను అనుకోవటమేగా స్వార్థం. అది లేకుండా మనం లేం. భార్యాపిల్లల్ని పోషించడం నాకోసం నేననే. పరమార్థం కోసం సాధన జెయ్యటం నాకోసం, నేను అనుకునే అది లేకుండా లేము.

ఒకరు : ఈ గృహం వదలిపోయి వేరే అడ్డంకులేమీ లేకుండా సాధన చేసుకుందామా, లేదూ, గృహంలోనే ఉండి సాధన చేద్దామా అని అనుకుని.... గృహస్థుగా వుండే సాధన చేద్దామని నిశ్చయించుకున్నాను.

అమ్మ : నిజమే, చెయ్యి. రెండు మార్గాలూ వున్నాయి. సన్యాసంలో ఉండి చేసే వాళ్ళకీ మార్గాలున్నాయి. శాస్త్రంలో రాశారు. సంసారంలో వుంటున్న వాళ్ళకీ మార్గాలు చెప్పారు. ఏ మార్గం సులభమో అది చెయ్యండి.

రెండో

ఆయన : అదే ఫలాని మార్గమని ఇదమిత్థంగా ఎవరైనా నిర్దేశిస్తే....

అమ్మ : ఇత మిత్థమని ఎవరో చెబుతారనుకో నాన్నా. అది చెయ్యలేం. ఆ చెప్పిన విధంగా నడుచుకోలేం కదా. మనని నడిపించినట్టు నడుస్తాం కాని, ఒకరు చెప్పిన రకంగా చెయ్యలేం. ఇప్పుడు నేను – నువ్వీరకంగా ఉండు – అని చెప్పేననుకో, ఆ రకంగా మీరు చెయ్యగలగాలిగా.

ఒకరు : ఈ జపతపాలు చెయ్యటం, పుస్తకాలు చదవటం లేకుండా, సద్గురువుని ఆశ్రయించి, వారు చెప్పినట్టు నడుచుకుందాం అని అనిపించినప్పుడు – సద్గురువు ఎవరు, అలాటి వారు ఎక్కడున్నారు... అని వెతకటం ప్రారంభమవుతుంది.

అమ్మ : ఇప్పుడు జపం చేస్తున్నారు కదా! ఇంకా ఏం చెయ్యాలని?

రెండోఆయన : అది గ్రుడ్డిగా చేస్తూ పోవటం కాకుండా సద్గురువుద్వారా అది జరిగితే 'బాగుంటుందని.

అమ్మ : నీ మనస్సు గురువే. మనస్సుకి ఆలోచన రావటం ఒక శక్తి ద్వారా వస్తోంది గనుక అది గురువే.

ఒకరు : అంటే మనసు ప్రేరేపించినట్లుగా నడుచుకోమంటారా?

అమ్మ : ఇంకొకరు చెప్పినా నడుచుకోవలసింది నువ్వే, నీ మనసే. పుస్తకం చదివి అర్థం చేసుకోవాలన్నా నీ మనసే. మనసు లేకుండా చేసేదేముంది?

రెండో ఆయన : అదే గురువుద్వారా మనసు ప్రేరేపించబడితే –

అమ్మ : గురువంటే? దగ్గర కూర్చుని నేర్పే వాడే గురువు. నేను గురువును దైవం అంటున్నాను. లేదా మీకు ఎవరైనా గురువు కనిపిస్తే – పోనీ అట్లాగైనా నడుచుకోండి.

రెండోఆయన : మీరే మాకు గురువు. మాకేదైనా దీక్ష యిస్తే –

అమ్మ : నేనిచ్చేది ఒకటే దీక్ష. ఏముంది? ఇందాకట్నించీ చదివి వచ్చారుగా. (వారు ఉదయం అమ్మ దర్శనం చేసుకున్న తర్వాత రామకృష్ణ అన్నయ్య వారికి, Publication Office లో ఉన్న Books ఇచ్చాడు చదువుకోవటానికి. మధ్యాహ్నం వారు అమ్మ దగ్గర కొచ్చినప్పుడు ఆ పుస్తకాలు చదువుతున్నట్లు అమ్మతో చెప్పారు.) క్రొత్తగా చెప్పేదేముంది?

రెండో ఆయన : ఈ యోగాసనాలు, జపతపాలు, బీజాక్షరాలు ... ఇవ్వేం కాకుండా, సద్గురువు సన్నిధిలో వుందామని తోచినప్పుడు – ఆ గురువు దగ్గర కొన్నాళ్ళుండి, మళ్ళీ యింకొక గురువు దగ్గరకు పోవడం... అట్లా తేడా అయిన గురువు కాకుండా మంచివాళ్ళని ఎన్నుకుంటే....

అమ్మ : సద్గురువు అంటే తనంతట తాను దగ్గరకు తీసుకునే వాడేగా! అటువంటి గురువుని నీవు వెతుక్కుంటూ పోయేదేముందీ? గురువును గుర్తించాలంటే ఆ తాహతు నీలో వుంటేనేగా? నీవు జ్ఞానివి అయితేనే గురువును గుర్తించ గలవు. జ్ఞానివి అయినప్పుడు యింక గురువుతో అవసరమేముంది?

మనల్ని దగ్గరకు తీసుకునేవాడు, మనకి ప్రేరణ కల్పించేవాడు, వాడు ఒక్కడే, దైవం.

ఇప్పుడొక సన్యాసి దారిన పోతున్నాడు. నామాలు పెట్టుకున్నాడు. కాషాయం కట్టుకున్నాడు. గొప్పవాడు అనుకుంటావు. ఆ తర్వాత అతను నీ మనస్సుకు నచ్చినట్టు నడుచుకోకపోతే నీ నమ్మకం పోతుంది. ఏ గురువునయినా గుర్తించటానికి మనకి వాడిని గుర్తించే తాహతు వుండొద్దూ? నీ కెదురుగా ఉన్న వస్తువుని గుర్తించాలన్నా, దాన్ని గుర్తించే తాహతు నీకు వుంటేనేగా?

నువ్వా వెతకలేవు. నిన్ను వెతుక్కుంటూ వచ్చే వాడు కావాలి. అట్లా అహర్నిశలూ, నిన్ను వెన్నంటి వుండేది ఒకటే శక్తి. ఈ వేళ ఒకరి దగ్గరికి పోయి మంత్రోపదేశం అయి కొన్ని రోజుల తర్వాత వాళ్ళని కాదనుకుని, యింకొకరి దగ్గరికి పోయి మంత్రోపదేశం అయి కొన్ని రోజుల తర్వాత వాళ్లని కాదనుకుని, యింకొకరి దగ్గరికి పోవటం.... మామూలు స్నేహాలు, పరిచయాలు, ఎట్లా వుంటాయో, ఈ గురువుల సంప్రదాయాలు కూడా అట్లానే వుంటాయి. లేదూ, సర్వం - మంచీ, చెడూ, అన్నింటికీ, వీటన్నింటికీ వాడే ఆధారం - వాడు నడిపించినట్లు నడుస్తాం అనుకుంటే - మనసుకి ప్రేరణనిచ్చి నడిపిస్తున్న శక్తి గురువు. కాదూ, మన ప్రయత్నం వుంది అనుకుంటే, ఎవరైనా గురువు కనిపిస్తే - అట్లా నడుచుకో. అట్లా కాదు శాస్త్రా లంటావా, అవీ మనుషులు రాసినవే. మాటల్లో చెప్పినా, అక్షరాల్లో రాసినా వాళ్ళ వాళ్ళ అనుభవాలే. అయితే మీరడిగేరే.... అక్షరాలు బీజాలు అని - యివి ప్రమాదం అవుతాయని, మంత్రోచ్చారణ సరిగా చేయకుండా అచరిస్తే ఆ మంత్రం

ప్రాణం తీస్తుందని అనుకోవద్దు. ప్రమాదమేమీ వుండదు. దైవాన్ని పిలవటం చేతనయినప్పుడు ఒకక్షరం తప్పు పోయినంత మాత్రంచేత – నీ పిల్లవాడు నిన్ను సరిగ్గా పిలవనంత మాత్రం చేత నువ్వు కోపగించు కుంటావా! ఇదీ అంతే.

రెండో ఆయన: ప్రాణాయామం చెయ్యడానికి గురువు అవసరమేమో నమ్మా!

అమ్మ : ప్రాణాయామం అంటే అవయవాల్తో చేస్తున్నావు కనుక సరిగ్గా చెయ్యకపోతే ఊపిరితిత్తులకు జబ్బొస్తుంది. అది ఎవరైనా చేతనయిన వాళ్ళ దగ్గరుండి చేయటం మంచిది.

మూడో ఆయన : అట్లా లేకున్నా ....

అమ్మ : ఆసనాలంటే .... వాటివల్ల శరీరం ఎట్లాపడితే అట్లా ఒంగి ఆరోగ్యంగా వుంటుంది. మనసుకీ వీటికీ సంబంధం వుందని పొరపాటు పడొద్దు. మీరు కర్మేంద్రియాలు కట్టిపెట్టినంత మాత్రం చేత మనసు నిలకడ అవుతుందా? అయితే కాసేపు అవి (కర్మేంద్రియాలు) కట్టిపెట్టినంత మాత్రంచేత మనసు నిరోధించినట్లు కాదు. వీటివల్ల శరీరానికి ఆరోగ్యం. శీర్షాసనం వేశామనుకోండి – రక్తమంతా తలకి దిగినప్పుడు, కళ్ళు బరువెక్కి కాసేపు హాయిగా వుండొచ్చు. దండేలు, బస్కీలు, ఇవన్నీ కూడ.... అంతే, ఆరోగ్యానికే. ఇవి మనసును నిలుపలేవు.

# 79. గురువులూ - ఉపదేశాలు

**11-1-65**

ఆ సోదరుడు బాపట్లలో పనిచేస్తున్నారు. పేరు కృష్ణమూర్తి. వారు ఈ ఉదయం వచ్చారు. జపం చేసుకోవటానికి ఏదైనా మంత్రోపదేశం చెయ్యమన్నారు.

అమ్మ : ఇందాక మీరు చదివింది చాలు. (వారు ఇందాక అమ్మ పాదాలు పట్టుకుని లలితా స్తోత్రం చదివారు).

అన్నయ్య : అది లలితదమ్మా. ఏదైనా మీరు మంత్రోపదేశం చేస్తారేమో నని.

అమ్మ : ఏది చేసినా ఒకటే. లలిత కానీ, ఆంజనేయం కానీ మరొకటి కానీ - ఏది చేసినా ఒకటే. అన్ని మంత్రాలూ ఒకటే. ఎందులోనయినా ఒకే శక్తి ఉన్నది. ఒకటే ఉన్నది. ఒకే అర్థం ఉన్నది. వేఱుగా ఏదీ లేదు; పేర్లూ అక్షరాల మార్పు తప్ప.

అన్న : కావొచ్చమ్మా, కాని ఏదైనా ఒకటే అనుకునే స్థిమితం లేదమ్మా. అందుకే మీరు ఏదైనా సాధన చెబితే చేద్దామని.....

అమ్మ : సాధన చెయ్యటం కూడా మన చేతిలో లేదు నాన్నా. ఒద్దున కూర్చుని కబుర్లు చెప్పటానికేం - ఇది. అది చెయ్యండి అని. ఏదీ మన చేతిలో లేదు. నేను మీరు కోరినట్లు ఏదైనా మంత్రం చెప్పినా దానిలో మనస్సు నిలపటానికి మీకు సాధ్యం కావొద్దూ! నిలపటం అనేది సాధ్యమైతే మీరు ఇంతదూరం వచ్చేవారు కాదు. ఏదీ మనవల్ల కాదు. తరుణం వచ్చినప్పుడు అదే అవుతుంది.

అన్న : ఈ గురువులూ ఉపదేశాలూ....

అమ్మ : ఇవన్నీ ఏం లేవు నాన్నా! అసలు మంత్రం అంటే ఏమిటో తెలిస్తే - ఈ సమస్యలూ సందేహాలూ ఉండవు. నేను మనస్సే మంత్రం అంటాను. మనకు మనస్సు అంటే ఏమిటో తెలియదు కనుక మంత్రం అని అక్షరాలలో పెట్టి దాని ద్వారా మన శక్తిని మనం అర్థం చేసుకుంటున్నాము. అంతకంటే ఏం లేదు. మంత్రం అంటే ఏమిటి? కొన్ని అక్షరాలను కలిపి దానికో పవిత్రతను ఇచ్చి నువ్వు మననం చేస్తే అది మంత్రమైంది. నువ్వు -

కాదు - అనుకున్నప్పుడు అన్నీ అక్షరాలేగా? దీనినంతా గుర్తిస్తున్నది ఎవరూ? నీ మనస్సు. అప్పుడు నీ మనస్సే మంత్రం కాలేదూ? అంతా నీ భావనలో ఉన్నది. ఈ మంత్రం చేస్తే నెత్తి అణుస్తుందనీ, ఆ మంత్రం చేస్తే ప్రమాదం అనీ చెబుతుంటారు. అవికూడా ఏం లేవు. ఏ మంత్రాలలోనైనా ఒకే శక్తి ఉన్నప్పుడు ఇంకా నెత్తి అణచటాలు, ప్రమాణాలు ఎక్కడనుండి వస్తాయి? ఈనాడు గురువులు అని చెప్పుకుంటున్న వాళ్ళందరు గురువులేనా? మంత్రోపదేశం చెయ్యమంటే - తాను చెప్పే మంత్రం గొప్పదని అది చెప్పి దానికి ఎన్నో నియమాలూ - నిష్ఠలూ చెబుతుంటారు. ఆ నియమాల్లోనూ వీడు ఆచరించటంలో పొరపాటుగా ఆచరిస్తే వాడి కొంపమునిగి పోయినట్లు - ప్రాణానికి ఏదో మోసం జరుగుతుందన్నట్లుగా ఏవో శాంతులు చేయించాలంటూ బయల్దేరుతారు. పైగా వీళ్ళలో పార్టీలు - వీడు గొప్పగురువంటే, వాడు గొప్ప గురువని. సరైన గురువు అయితే ఇవన్నీ ఎక్కడివి? మన మనస్సే గురువు. గుర్తే గురువు. దానికంటే మించిన గురువు ఏదీ లేదు. మీరు ఏ గురువుల దగ్గరకూ వెళ్ళనవసరం లేదు.

మీరు సాధన చెయ్యాలని ప్రయత్నించినా చెయ్యనివ్వకుండా ఏదో ఒక బలవత్తరశక్తి అడ్డువస్తుంది కదా? అంటే మీ ఉద్దేశాన్ని మన్న శక్తి కంటే కూడా ఆ అడ్డుపడే శక్తికి ఎక్కువ బలం ఉన్నదన్నమాట. ఆ బలమే దైవం. అది ఎట్లా నడిపిస్తే అట్లా నడుస్తున్నాం. అందుకే మీ గురువుల మంత్రోపదేశం అవసరం లేదు. (తప్పనిసరి కాదు) మీకు ఇష్టమైన ఆరాధ్యదేవత మంత్రం జపించండి, చాలు. ఈ సాధన చెయ్యి, ఆ సాధన చెయ్యి - అని చెప్పే ఈ గురువులు వాళ్ళు చెప్పినట్లు వాళ్ళు చెయ్యగల్గుతున్నారా? ఏదైనా అంతే నాన్నా.

వారు : సందేహం తొలగింది. ఎంతో తృప్తిగా ఉన్నదమ్మా ఇప్పుడు. ఇన్నాళ్ళు గురువులతో, వాళ్ళ మాటలతో విసిగిపోయిన మాకు మీ మాటలు అమృతంలా ఉన్నాయమ్మా!

–అంటూ ఆనందంగా అమ్మ పాదాలకు నమస్కరించి సెలవు తీసుకొని వెళ్ళారు.

# 80. ఈనాటి గురువులు

ఈనాటి (3-1-65) ధనుర్మాసపు పూజ బామ్మా - హైమా చేసుకున్నారు. ఆ పూజా సమయంలో భరద్వాజ సుమారు నెలనుండి అహర్నిశం నామం చేస్తున్న రాధాకృష్ణారెడ్డి గురించి అతని ఆశయాల గురించి అమ్మతో మాట్లాడుతూ, అమ్మని ప్రశ్నించాడు.

"ఈ నాడు ఎక్కడ చూసినా గురువులు కనిపిస్తున్నారు కదమ్మా. వీళ్ళందరివలనా ఆ శిష్యులు తరిస్తారా? నువ్వు చెప్పే పద్ధతిలో గురువు అనేవాడు ఒకడే కదా! వీళ్ళంతా గురువులెట్లా అవుతారు?

అమ్మ : నిజమే నాన్నా - ఇప్పుడు ఎక్కడ చూసినా, ఎక్కడ వింటున్నా ఇదే మాట. నలుగురికి ఉపదేశం చెయ్యగానే చాలు, వాడొక గురువై కూర్చుంటాడు. వాడిచుట్టూ పదిమంది శిష్యులు. గురువూ, శిష్యులని పైకి పటాటోపంగా కనిపించటం తప్ప ఆ గురువు చెప్పేదేమిటో, చేసేదేమిటో - యీ శిష్యులకు తెలియదు, తను చెప్పిన దాన్ని ఈ శిష్యులు ఎంతవరకు ఆచరిస్తున్నారో ఆ గురువుకు తెలియదు. పైగా వాళ్ళు చెప్పేది "ఈ దేముడు మంచివాడు కాదు - ఆ దేముడు మంచివాడు అంటే - వాడు ఒకవేళ ఏ రాముడినో ఏ ఆంజనేయస్వామినో ఎవరినో తన ఇష్టదైవాన్ని ఆ పేరుచెప్పి ఆ దేవుడి మంత్రం తప్ప మరో మంత్రం చేస్తే నెత్తి అణుస్తుందని. అది తప్ప ఇంకొకటి చేస్తే ఆ చేసేవాళ్ళకు అపకారం జరుగుతుందని ఇట్లా చెబుతుంటారు. వీళ్ళు నిజంగా భయపడి చివరకు రెండింటిలో మనస్సు నిలవక ఉభయభ్రష్టులు అవుతుంటారు.

ఇంకా ఘోరం ఏమిటంటే ఉపదేశం పొందాలని తమ దగ్గరకు వచ్చే ఆడవాళ్ళను నాశనం చెయ్యటం. ఇది అడ్డం పెట్టుకొని ఆ ఏడ్పు లెందుకు? చేసే దేదో బహిరంగంగా ఏడిస్తే ఫర్వాలేదు. ఈ ముసుగు

కప్పుకుని, కాషాయ వస్త్రాలు తగిలించుకొని వీళ్లు ఆడుతున్న ఆటలు చూస్తుంటే, మధ్య ఈ పేరు చెడగొడుతున్నారే, అన్న బాధ కలుగుతుంది. ఈ ఘోరాలు ఈ మధ్య చాలా ఎక్కువయ్యాయి. అట్లా నాశనం చెయ్యబడిన వారు నాదగ్గరకు వచ్చారుకూడా. వాళ్ళు చెప్పేవన్నీ వింటుంటే ఎంత జాలివేసిందో నాన్నా. ఇట్లా చేస్తున్నారా సరే పైగా నా పేరు చెబుతుంటారట. నేను వాళ్ళతో మాట్లాడినట్టు, వాళ్ళవల్లే నా కీ స్థితి కలిగినట్టు. నీకు తెలుసుగా చాలాచోట్ల నేనే జిల్లెళ్ళమూడి అమ్మను అంటూ చెప్పుకుంటున్న వాళ్ళ గురించి. అమ్మ అంటే చేతులనిండా గాజులు - పెద్దబొట్టు - పట్టుచీరలు కట్టడం, పూజలు చేయించుకోవటం కాదుగా.

వీళ్ళు ఎన్ని వేషాలు వేసినా నాకు సరిపోతుంది. కాని వీళ్ళను నమ్మినవాళ్ళకు ఎంత దెబ్బ? ఆ నమ్మిన వాళ్ళ విశ్వాసమైనా అచంచలమైనది అయితే బాధ లేదు. కాని అంత గట్టి మనస్సు ఉన్నవాడు అయితే ఏ గురువు దగ్గరకూ వెళ్ళాలని ప్రాకులాడడు. తను మొదట ఏ గుర్తును లక్ష్యంగా తీసుకుంటాడో దాన్నే గురువుగా చేసుకుంటాడు. అది లేని వాళ్ళేగా ఈ గురువులకోసం, ఉపదేశాలకోసం వెతుక్కోవటం? దానిద్వారానైనా మనస్సు దృఢపడుతుందేమో నని. కాని జరుగుతున్న ఈ మోసాలవలన దైవంమీద ఎవరికి విశ్వాసం కలుగుతుంది?

గురువంటే గుర్తింపు కలగచేసేవాడు. నా దృష్టిలో వాడే సరైన గురువు.



## 81. జపం తెచ్చిన బెడద

పందిళ్ళపల్లి నుండి వచ్చిన సోదరులు అమ్మతో మాట్లాడా లన్నారు. అమ్మ "మాట్లాడండి" అన్నారు. కృష్ణమూర్తి అన్న సోదరుడు వాళ్ళ కూడా వచ్చిన ఒక అమ్మాయిని చూపించి (14 ఏళ్లు ఉంటాయి)

ఆ అమ్మాయికి కొన్ని నెలల క్రిందట తను హనుమాన్ చాలీసా చెప్పి రోజూ పదకొండుసార్లు చెయ్యమన్నారట - అలాగే అమ్మాయి జపం చేస్తున్నప్పుడల్లా స్మృతి తప్పటం ఆరంభమైనది. బాహ్యస్మృతి లేని సమయంలో మూడు నాలుగు గంటలు ఉంటుందట.

స్పృహ వచ్చిన తర్వాత ఏం జరిగిందని ప్రశ్నిస్తే "తనకు స్వామి కనిపించారని తనను ఎక్కడికో తీసుకెళ్ళి ఆడుకుంటాడని" చెబుతుందట. వాళ్ళు ఎన్ని విధాల ప్రయత్నించినా స్మృతి తప్పినప్పుడు ఆ అమ్మాయి పరిగెత్తకుండా, పడిపోకుండా చూడాలంటే వాళ్ళకు సాధ్యం కావటం లేదట. ఆ అమ్మాయి భవిష్యత్తు గురించి ఆమె తండ్రి చాలా భయాందోళనకు లోనవుతున్నాడట".

ఇదంతా చెబుతూ ఆ అన్నయ్య ఇట్లా అన్నాడు.

"మానవ ప్రయత్నం చేసాము, విఫలమైంది. జపం చేస్తున్నప్పుడు ఆంజనేయ సాక్షాత్కారము జరుగుతుంది. ఇది ఇలాగే చేస్తుండమంటారా? లేక మీరు ఏదైనా సూచన లిస్తారా? సర్వం తెలిసినవారు అమ్మాయి భవిష్యత్తు ఏమిటో చెప్పండి. మాకు వినాలని కుతూహలంగా ఉన్నది."

కప్పుకుని, కాషాయ వస్త్రాలు తగిలించుకొని వీళ్లు ఆడుతున్న ఆటలు చూస్తుంటే, మధ్య ఈ పేరు చెడగొడుతున్నారే, అన్న బాధ కలుగుతుంది. ఈ ఘోరాలు ఈ మధ్య చాలా ఎక్కువయ్యాయి. అట్లా నాశనం చెయ్యబడిన వారు నాదగ్గరకు వచ్చారుకూడా. వాళ్ళు చెప్పేవన్నీ వింటుంటే ఎంత జాలివేసిందో నాన్నా. ఇట్లా చేస్తున్నారా సరే పైగా నా పేరు చెబుతుంటారట. నేను వాళ్ళతో మాట్లాడినట్టు, వాళ్ళవల్లే నా కీ స్థితి కలిగినట్టు. నీకు తెలుసుగా చాలాచోట్ల నేనే జిల్లేళ్ళమూడి అమ్మను అంటూ చెప్పుకుంటున్న వాళ్ళ గురించి. అమ్మ అంటే చేతులనిండా గాజులు - పెద్దబొట్టు - పట్టుచీరలు కట్టడం, పూజలు చేయించుకోవటం కాదుగా.

వీళ్ళు ఎన్ని వేషాలు వేసినా నాకు సరిపోతుంది. కాని వీళ్ళను నమ్మినవాళ్ళకు ఎంత దెబ్బ? ఆ నమ్మిన వాళ్ళ విశ్వాసమైనా అచంచలమైనది అయితే బాధ లేదు. కాని అంత గట్టి మనస్సు ఉన్నవాడు అయితే ఏ గురువు దగ్గరకూ వెళ్ళాలని ప్రాకులాడడు. తను మొదట ఏ గుర్తును లక్ష్యంగా తీసుకుంటాడో దాన్నే గురువుగా చేసుకుంటాడు. అది లేని వాళ్ళేగా ఈ గురువులకోసం, ఉపదేశాలకోసం వెతుక్కోవటం? దానిద్వారానైనా మనస్సు దృఢపడుతుందేమో నని. కాని జరుగుతున్న ఈ మోసాలవలన దైవంమీద ఎవరికి విశ్వాసం కలుగుతుంది?

గురువంటే గుర్తింపు కలగచేసేవాడు. నా దృష్టిలో వాడే సరైన గురువు.



# 81. జపం తెచ్చిన బెడద

పందిళ్ళపల్లి నుండి వచ్చిన సోదరులు అమ్మతో మాట్లాడా లన్నారు. అమ్మ "మాట్లాడండి" అన్నారు. కృష్ణమూర్తి అన్న సోదరుడు వాళ్ళ కూడా వచ్చిన ఒక అమ్మాయిని చూపించి (14 ఏళ్లు ఉంటాయి)

ఆ అమ్మాయికి కొన్ని నెలల క్రిందట తను హనుమాన్ చాలీసా చెప్పి రోజూ పదకొండుసార్లు చెయ్యమన్నారట - అలాగే అమ్మాయి జపం చేస్తున్నప్పుడల్లా స్మృతి తప్పటం ఆరంభమైనది. బాహ్యస్మృతి లేని సమయంలో మూడు నాలుగు గంటలు ఉంటుందట.

స్పృహ వచ్చిన తర్వాత ఏం జరిగిందని ప్రశ్నిస్తే "తనకు స్వామి కనిపించారని తనను ఎక్కడికో తీసుకెళ్ళి ఆడుకుంటాడని" చెబుతుందట. వాళ్ళు ఎన్ని విధాల ప్రయత్నించినా స్మృతి తప్పినప్పుడు ఆ అమ్మాయి పరిగెత్తకుండా, పడిపోకుండా చూడాలంటే వాళ్ళకు సాధ్యం కావటం లేదట. ఆ అమ్మాయి భవిష్యత్తు గురించి ఆమె తండ్రి చాలా భయాందోళనకు లోనవుతున్నాడట".

ఇదంతా చెబుతూ ఆ అన్నయ్య ఇట్లా అన్నాడు.

"మానవ ప్రయత్నం చేసాము, విఫలమైంది. జపం చేస్తున్నప్పుడు ఆంజనేయ సాక్షాత్కారము జరుగుతుంది. ఇది ఇలాగే చేస్తుండమంటారా? లేక మీరు ఏదైనా సూచన లిస్తారా? సర్వం తెలిసినవారు అమ్మాయి భవిష్యత్తు ఏమిటో చెప్పండి. మాకు వినాలని కుతూహలంగా ఉన్నది."

వెంటనే అమ్మ ఏం సమాధానం ఇవ్వలేదు. వాళ్ళు అమ్మ ఏం చెబుతారో అని ఆసక్తిగా ఆదుర్దాగా అమ్మవంక చూడసాగారు.

కాసేపు గడిచాక అమ్మ తన పెదవులను కదిపారు నెమ్మదిగా.

"అమ్మాయి స్వామితో ఆడుకుంటుందనీ మాట్లాడుతుందనీ, కలిసి కాలక్షేపం చేస్తుందనీ అన్నారు. ఇక మధ్యలో మన ఆలోచన దేనికి? ఆ అమ్మాయికి లభ్యమైన దాని గురించేగా మనం ప్రయత్నం చేసేది. అటువంటప్పుడు ఆ అమ్మాయికి లభ్యమైన స్థితి గురించి మనకు ఆలోచన దేనికి?"

ఈ సమాధానం విని వెంటనే ఎవరూ ఏం మాట్లాడలేదు. కాని తర్వాత ఆ అమ్మాయి తండ్రి "రాత్రి అమ్మాయికి మీరు కలలో దర్శన మిచ్చారట. నలుపు రంగు కలిసిన ఆకుపచ్చచీర ఎఱ్ఱంచు ఉన్నది కట్టుకున్నారట. ఉదయం చెప్పి మీదగ్గరకు వద్దామని అన్నది అమ్మాయి."

అమ్మ : అవును సాయంత్రం అదే చీర కట్టుకున్నాను. కాని అమ్మాయికి కనిపించిన విషయం నాకు తెలియదు.

ఆయన నవ్వి "మీరు తెలియకపోయినా మాకు కనిపించారుగా" అన్నారు.

అమ్మ : గిరిజను ప్రశ్నించారు, "ఏం చదువుతున్నావమ్మా?"

గిరిజ : మెట్రిక్

రాధాకృష్ణమూర్తి : ఆంజనేయ సాక్షాత్కారము లభించిన దగ్గరనుండి ఈ బాహ్యస్మృతి పోవటం ఆరంభమైనది. అందుకని పదకొండుసార్లు కాక మూడుసార్లు చెయ్య మన్నాను. అలా చేసినా ఈ స్మృతి తప్పటం మారలేదమ్మా.

..... ఈ కార్యక్రమం సాగించమంటారా?

కాదు - అనుకున్నప్పుడు అన్నీ అక్షరాలేగా? దీనినంతా గుర్తిస్తున్నది ఎవరూ? నీ మనస్సు. అప్పుడు నీ మనస్సే మంత్రం కాలేదూ? అంతా నీ భావనలో ఉన్నది. ఈ మంత్రం చేస్తే నెత్తి అణుస్తుందనీ, ఆ మంత్రం చేస్తే ప్రమాదం అనీ చెబుతుంటారు. అవికూడా ఏం లేవు. ఏ మంత్రాలలోనైనా ఒకే శక్తి ఉన్నప్పుడు ఇంకా నెత్తి అణచటాలు, ప్రమాణాలు ఎక్కడనుండి వస్తాయి? ఈనాడు గురువులు అని చెప్పుకుంటున్న వాళ్ళందరు గురువులేనా? మంత్రోపదేశం చెయ్యమంటే - తాను చెప్పే మంత్రం గొప్పదని అది చెప్పి దానికి ఎన్నో నియమాలూ - నిష్ఠలూ చెబుతుంటారు. ఆ నియమాల్లోనూ వీడు ఆచరించటంలో పొరపాటుగా ఆచరిస్తే వాడి కొంపమునిగి పోయినట్టు - ప్రాణానికి ఏదో మోసం జరుగుతుందన్నట్లుగా ఏవో శాంతులు చేయించాలంటూ బయల్దేరుతారు. పైగా వీళ్ళలో పార్టీలు - వీడు గొప్పగురువంటే, వాడు గొప్ప గురువని. సరైన గురువు అయితే ఇవన్నీ ఎక్కడివి? మన మనస్సే గురువు. గుర్తే గురువు. దానికంటె మించిన గురువు ఏదీ లేదు. మీరు ఏ గురువుల దగ్గరకూ వెళ్ళనవసరం లేదు.

మీరు సాధన చెయ్యాలని ప్రయత్నించినా చెయ్యనివ్వకుండా ఏదో ఒక బలవత్తరశక్తి అడ్డువస్తుంది కదా? అంటే మీ ఉద్దేశాన్ని కున్న శక్తి కంటే కూడా ఆ అడ్డుపడే శక్తికి ఎక్కువ బలం ఉన్నదన్నమాట. ఆ బలమే దైవం. అది ఎట్లా నడిపిస్తే అట్లా నడుస్తున్నాం. అందుకే మీ గురువుల మంత్రోపదేశం అవసరం లేదు. (తప్పనిసరి కాదు) మీకు ఇష్టమైన ఆరాధ్యదేవత మంత్రం జపించండి, చాలు. ఈ సాధన చెయ్యి, ఆ సాధన చెయ్యి - అని చెప్పే ఈ గురువులు వాళ్ళు చెప్పినట్లు వాళ్ళు చెయ్యగల్గుతున్నారా? ఏదైనా అంతే నాన్నా.

వారు : సందేహం తొలగింది. ఎంతో తృప్తిగా ఉన్నదమ్మా ఇప్పుడు. ఇన్నాళ్ళు గురువులతో, వాళ్ళ మాటలతో విసిగిపోయిన మాకు మీ మాటలు అమృతంలా ఉన్నాయమ్మా!

-అంటూ ఆనందంగా అమ్మ పాదాలకు నమస్కరించి సెలవు తీసుకొని వెళ్ళారు.

అమ్మ : (వెంటనే) మొదట మనం సాగించామా? ఇంతకు ముందే మీరు అన్నారుగా - మానవప్రయత్నం విఫలమైనదనీ, అది మన చేతిలో లేదనీ. అలాగే మీరు ఎంత మందికి ఈ జపం చెయ్యమని చెప్పలేదు? అందరూ అలాగే చేస్తున్నారా, చేస్తున్నవాళ్ళలో ఈ అమ్మాయికి కలిగిన స్థితి వంటిది ఎవరికైనా కలిగిందా? ఎవరిదాకా ఎందుకూ ఇన్నాళ్ళనుండి మీరు చేస్తున్నారు - మీకు కలిగిందా? వాళ్ళూ ఈ మంత్రం శ్రద్ధగా చెయ్యాలనుకుంటున్నారు కాని చెయ్యలేక పోతున్నారు. అమ్మాయి ఇప్పుడు ఆ జపం మానుకోవాలన్నా మానుకోలేక పోతున్నది. చేయాలనుకున్నా చేయలేకపోవటానికీ, మానుకోవాలన్నా మానుకోలేకపోవటానికీ కారణం మన చేతుల్లోది కాదని, వీటికి అతీతమైన శక్తిచేతిలో ఉన్నదని తెలుస్తున్నది. ఆ శక్తే అన్నీ చేయిస్తున్నది. మధ్య మనకెందుకూ? ఆ అమ్మాయికి ఎట్లా జరగాలని ఉన్నదో అట్లాగే జరుగుతుంది. ఆ శక్తికి ఎట్లా చెయ్యాలని ఉంటే అట్లా చేస్తుంది.

వాళ్ళు ఏం మాట్లాడలేదు.

# 82. మంత్రం అంటే ఏమిటి?

భ.రా.శా.: 'బీజరూపాన్ని' – (అని అంటుండగానే)

అమ్మ : రూపం బీజమైనప్పుడూ – బీజరూపం ఏమిటి?

శాస్త్రి : శక్తి మయ అక్షరం.

అమ్మ : అంటే – మీ దృష్టిలో – ఓంకారం – ఏది బీజాక్షరం?

శాస్త్రి : ఏ అధిదేవతను నీవు ఇష్టదైవంగా ఆరాధించావో, అది బీజమవుతుంది.

అమ్మ : నీకు నేను ఇష్టం. దానికి బీజమేది?

శాస్త్రి : అం ఆ.

అమ్మ : రామా అన్న దానికి బీజమేది?

శాస్త్రి : రామా అని పలికే రెండక్షరాల మధ్య వున్న సంధి శబ్దం బీజం. నారాయణంలో – రా, నమశ్శివాయలో – మ – రెండూ కలిసిన రామ.

అమ్మ : మంత్రశాస్త్రంతో ప్రపంచం చాలా బాధపడుతున్నది. నెత్తి అణుస్తుందనీ, అదనీ, ఇదనీ అదరగొట్టేస్తున్నారు. నామం, రూపం, బీజం ఒకటే అయినది గదా! నమోనారాయణ – అన్న మంత్రానికి బీజమేమిటి?

శాస్త్రి : 'రేఫ'

అమ్మ : ఎట్లా పలకాలి? దానికి అర్థమేమిటి? బీజం అంటే?

శాస్త్రి : ఏ రూపమైతే ఏర్పరచుకున్నావో దాని సంకేతనామం.

అమ్మ : ఒక్కొక్కదానికి ఒక్కో మంత్రశాస్త్ర మున్నది. దానికి అర్థం, రూపం, బీజం ఏమిటి?

శాస్త్రి : దేనిది దానికే.

అమ్మ : అయితే అన్నీ అన్ని రకాలుగా వుంటయ్యా?

శాస్త్రి : లేకపోతే ఎందుకూ?

అమ్మ : సూర్యచంద్రాదుల్నీ, తల్లిదండ్రుల్నీ ధ్యానంచేసి గాని సంధ్యావందనం చెయ్యటానికి వీల్లేదు గదా!

శాస్త్రి : లేదు.

అమ్మ : చేసి, చేసి, చివరకు సర్వం సర్వానికాధారం - ఇందులో నుంచే ఆత్మ ఏర్పడ్డది. అన్ని భూతములలోనూ నేనున్నాననేగా? ఈ మాటగా అనకుండ సంధ్యావందనం అంటున్నారు. నిత్యకర్మ వున్నదిగా? నిత్యాగ్నిహోత్రం చెయ్యాలి. చచ్చినవాడు తింటున్నాడో, లేదో మనకు తెలియదుగదా! మన పెద్దలందర్నీ తల్చుకుని ముద్ద అగ్నిహోత్రంలో వేసి తినటం.

శాస్త్రి : ధన్యుణ్ణమ్మా.

అమ్మ : ధన్యుడివే. విన్నా ధన్యుడివే, వినకపోయినా ధన్యుడివే. ఇందులో ఏముంది?

# 83. మంత్రోపదేశం

అమ్మ కూర్చుని కబుర్లు చెబుతుండగా - శ్రీపాద వారు మధ్య మధ్య అడగటం, అమ్మ సమాధానం చెప్పటం....

శ్రీపాద : **తనను తాను తెలుసుకున్నవాడు ఉపదేశం చెయ్యడని అన్నానమ్మా. అది నిజమే కదా!**

అమ్మ : ఎట్లాంటివాడికైనా అవసరమనేందుకోసం - వాటివల్ల వాళ్ళ కొచ్చేదేం లేదు.

బిడ్డ, ఒకడు ఉదకం కావాలంటాడు, మరొకడు అప్పు కావాలంటాడు. మూగవాడు మంచినీళ్ళ బిందెవైపు చూపిస్తాడు. ఉదకం అన్నవాడికే కాదుగా మంచి నీళ్ళిచ్చేది. అప్ప అన్నా మంచినీళ్ళే ఇస్తుంది. బిందెవైపు చూపించినవాడికీ మంచినీళ్ళిస్తుంది. వీరి భావం గుర్తిస్తే ఏరకంగా అడిగినా ఇస్తుంది తల్లి.

మంత్రం అంటే ఏమిటి? మనస్సేకదా! మననంచేత మంత్రం అవుతుంది. మొన్న కస్తూరి (వ్యాసపూర్ణిమ నాడు) ఉపదేశం చెయ్యమని అడిగింది. 'అం ఆ' అని చెప్పాడు. అందాకా ఎందుకూ?

అని భద్రాద్రి రామశాస్త్రిగారి వైపు చూచి,

నువ్వడగలా నీ నోటిమీదగా చెప్పమని. నువ్వు పెట్టుకున్న లక్ష్యం అమ్మ - సర్వానికీ ఆధారమని తెల్సు. అయినప్పటికీ నా నోటిమీదగానే చెప్పమన్నావుకదా! - ఆ చెప్పినందువలన అదొక గురి. గాయత్రి బ్రహ్మోపదేశం ఎవరికీ వినపడకుండ చెప్తారు. ఇతర ధ్యాసలన్నీ లేకుండ ఇతర శబ్దం లేకుండా వినవలె అనటానికి బదులు, ఎవరూ వినకుండ - అంటున్నారు.

# 84. మనస్సుని నడిపేది గురువే

**5-1-69**

అమ్మ దర్శనార్థం వచ్చిన ఒక అన్నయ్య ఈ వేళ మధ్యాహ్నం అమ్మతో, "గురువుకోసం అన్వేషిస్తున్నాను. దొరకలేదు. గురువు లేకుండా ముక్తి లేదంటారు", అంటే, అమ్మ "ఏం కావాలి? ఎందుకు గురువు?" అని ఆయనని అడిగారు.

అన్న : జ్ఞానం కోసం, సాధనకోసం, గురువుకోసం తపిస్తున్నాను.

అమ్మ : మనస్సే గురువు.

అన్న : ప్రయత్నం చేస్తున్నాను గానీ మనసు నిలవటల్లేదు. చలిస్తోంది.

అమ్మ : నిజమే, గురువు దగ్గరకూడా చంచలత్వమే వుంటుంది.

అన్న : నాకర్థం కావట్లేదు, మీరు చెప్పింది.

అమ్మ : మనస్సుని పట్టుకునే గురువు కావాలనే కదా, (మీరు అనుకుంటున్నది) మనస్సుని నడిపిస్తున్నది గురువే.

అన్న : నాక్కావలసింది ఆ గురువే. అతనికోసమే వెతుక్కుంటున్నాను.

అమ్మ : నీకర్థం కాలేదు. నీకిటువంటి ఆలోచనలు ఇస్తున్నది ఏదో, అదే నీకు గురువు. అదే నిన్ను నడిపిస్తుంది.

ఓ నిమిషం ఆలోచించి, ఆ అన్నయ్య,

"తల్లి ప్రేమని నాక్కు ప్రసాదించండి, అంతే చాలు",

అని అమ్మకు పాదాభివందనం చేసుకుని, సెలవు తీసుకున్నారు.

# 85. బాధ అంటే భేదమే

**5-10-66**

అన్నయ్య : ఈ సృష్టిలో బాధలు లేనివాళ్ళు ఉన్నారా?

అమ్మ : నాకు కనపడలేదు. నాదృష్టిలో లేరు. ఇష్టం, అయిష్టం ఎప్పుడైతే ఉన్నాయో అప్పుడే అదీ ఉన్నది. సంసారులకే కాదు అన్నీ వదిలిపెట్టామన్న సన్యాసులకూ ఉన్నాయి. మరి భిక్ష పెట్టినవాళ్ళమీద అభిమానం, పెట్టనివాళ్ళ మీద కోపం వస్తూనే ఉన్నది కదా! చెట్టు క్రింద కూర్చుంటే రాయి నునుపో, గరుకో చూసుకుంటున్నాడు కదా? పెద్ద పెద్ద స్వాముల వార్లము అనుకుంటున్న వాళ్ళకీ ఈ బాధ తప్పటం లేదు. వాళ్ళు పాలు ఇస్తేనే త్రాగుతున్నారు. కాని సారాయి ఇస్తే త్రాగుతున్నారా? ఇచ్చినవాడి మీద కోపం వస్తుంది కదా? అట్లాగే సాధకులూ, స్వాములూ, యోగులూ - ఎవరైనా సరే ఎంత దూరము పోయినా ఇది ఉంటూనే ఉన్నది. రెండు లేవు, ఒకటే - అనుకోవటమే కానీ అది అనుభవంలో రావటం లేదు. ఒకటే అనుకుని ఉందామని ప్రయత్నం ఉన్నది. కాని ఉండలేకపోతున్నారు. ద్వంద్వం కనపడ్తూనే ఉన్నది. పాలు ఇచ్చినప్పుడు ఈ చేత్తో తీసుకున్నట్టే, సారాయి ఇచ్చినప్పుడు ఆ చేత్తో అట్లాగే తీసుకుంటే వాడికి ద్వంద్వం ఎక్కడ ఉంటుంది? అప్పుడు మంచీ - చెడూ, ఇష్టమూ - అయిష్టమూ అన్నీ ఒకటేవాడికి. ఇప్పుడు ఒక మనిషి మరొక మనిషిని కొడ్తున్నాడు అనుకో నాన్నా. చూడటానికి అది కష్టంగా ఉంటుంది. బాధ ఎప్పుడూ ఉన్నది. చూచినప్పుడు కష్టం అనిపించటమూ బాధే. ఇష్టం లేనిదేగా కష్టం?

అది ఎవరికి పోతుందంటే, సృష్టి తనదైనప్పుడు తప్ప ఆ ద్వంద్వం పోదు. ఈ భేదాలన్నింటికి కారణం తెలుసు కనుక, వీటన్నింటికి మూలం తను కనుక, వాడికి ఉండదు కాని, ఎంత గొప్పవాళ్ళం అనుకున్నా మిగతా వారికి తప్పదు. భేదమే బాధకు కారణం. అంతేగా? - చావుకు పుట్టుకకు భేదం కనపడ్తుంది కనుకనే చావు దుఃఖం, భయం కలుగుతాయి.

# 86. బాధలు

**2-1-66**

ఉదయం వచ్చినవారు అమ్మను దర్శించి, పూలు పండ్లు టెంకాయలు సమర్పించి, అమ్మ ఇచ్చిన తీర్థప్రసాదాలు తీసుకుంటుండగా భోజనానికి పిలుపు వచ్చింది. అమ్మ అందర్ని భోజనంచేసి రమ్మని చెప్పి లోపలికి రాబోతుండగా గుంటూరు నుండి వచ్చిన ఒక అన్నయ్య - పేరు పిచ్చయ్యగారు, - అమ్మ పాదాలకు మళ్ళీ నమస్కరిస్తూ "నన్ను ఆశీర్వదించమ్మా" అన్నారు.

అమ్మ : అది ఎప్పుడూ ఉన్నది నాన్నా - మాటల్లో చెప్పేదేముంది?

అన్న : మీరు ఆ మాట అంటే అండగా ఉంటుంది.

అంటూ వారు చేసే వ్యాపార విషయం, అందులో లాభనష్టాలని గురించి చెప్తూ

"నా మనస్సు స్థిరంగా ఉండదమ్మా. చంచలంగా ఉంటుంది" అన్నారు.

అమ్మ : (నవ్వి) అసలు మనస్సే చంచలమైనది నాన్నా. నీకు ఒక్కడికే కాదు మనస్సే అట్లాంటిది - అట్లా ఉంటేనే అది మనస్సు అవుతుంది. మనస్సు అట్లా ఉంటేనే దాని పని అది సరిగా చేసినట్లు.

అన్న : (బాధగా) ఎంతకాలం అమ్మా ఈ బాధ?

అమ్మ : (నిశ్చయస్వరంతో) బ్రతికి ఉన్నంతకాలం.

అన్న : బ్రతికి ఉన్నంతవరకు తప్పదంటారా?

అమ్మ : తప్పదు. అసలు బ్రతకడనుంటేనే బాధ. అది లేకపోతే ఇంకా ఎందుకు నాయనా, బాధ లేకపోతే బ్రతకటం అనవసరం. అది ఏం బ్రతుకు?

అమ్మ స్వరంలో ధ్వనిస్తున్న నిశ్చలత్వం గాంభీర్యం చూచి గోపాలన్నయ్య అన్నాడు.

"కొందరు బాధలు కావాలని కొనితెచ్చుకుంటారు. ఎందుకని అమ్మా?"

అమ్మ : ఒరేయి! నువ్వు అనేది నన్నేగా, అవును. నేనే తెచ్చుకున్నాను.

గోపాల్ : అందుకే అన్నారు మరి నువ్వు బాధల భగవంతుడవని.

అమ్మ పిచ్చయ్యగారిని భోజనానికి వెళ్ళమని తను లోపలికి వస్తూ "బాధలేని బ్రతుకుకంటే చావు నయంరా, బాధ అంటే చైతన్యం, అది లేకపోతే ఏం ఉన్నదిరా?" అన్నారు.

# 87 బ్రతుకు బాధలు

**09-02-69**

ఈవేళ ఉదయం పూజకి ముందు గదిలోని అమ్మవచ్చి వెళ్లారు. మధ్యాహ్నం కొందరు దర్శనార్థులు, విదవలూరునుంచి వచ్చారు. దర్శనం ఇచ్చేందుకని మధ్యాహ్నం 2 1/2 గంటలకు అమ్మ మళ్ళీ ముందుగదిలోకి వచ్చి సోఫాలో ఆసీను లయ్యారు. కొత్తవారు అమ్మని సేవించి తీర్థప్రసాదాలు తీసుకున్న తర్వాత, బెజవాడనించి వచ్చిన రంగనాయకులుగారు ఆయన భార్యా, అమ్మకు కొంచెం దగ్గరగా జరిగి, అమ్మకు పాదాభివందనం చేసుకున్నారు. ఆ అన్నయ్య అమ్మతో, "చాలా క్లిష్ట పరిస్థితుల్లో మునిగి వున్నామమ్మా, శారీరకంగా, ఆర్థికంగా, మానసికంగా ... అన్ని విధాలా" అన్నారు.

అమ్మ : దేశమే మునిగివుంది. అందులో మనం ఒకళ్ళం.

అన్న : ఈ బాధలు పడలేక, ఓసారి ఇక్కడికొస్తేనన్నా, తగ్గుతాయని తమ దర్శనానికి వచ్చామమ్మా.

అమ్మ : ఇక్కడ లేకపోతేగా (బాధలు)? ఇక్కడా వున్నాయి. మనశ్శాంతి వుండొచ్చుగానీ, అవ్వి ఇక్కడా వున్నాయి. వచ్చిన వాడికి మనశ్శాంతేగానీ, ఇక్కడున్న వాడికి అదీ లేదు.

అన్న : కనీసం, కూచుని దైవారాధన చేసుకుందామన్నా, ఈ గొడవలవల్ల మనసుకి స్థాయి కుదరటంలేదు.

అమ్మ : కూచుని చెయ్యటానికి మనసు నిలవటంలేదు గనుక, ఏ పని చేస్తున్నా, అదే చేస్తూ వుండండి.

అన్న : ఆ పనే చేస్తున్నానమ్మా. ఏ పనిలో వున్నా నామం చెయ్యటం అలవాటు చేసుకున్నాను. అయినా ఈ బాధలు తగ్గటంలేదు.

అమ్మ : ఈ బాధలు పడటానికి ఓర్పు కోసమే నామం చెయ్యటం, బాధలు పోతాయని కాదు. బాధలు పోయేవి కాదు. ఇది కాకపోతే ఇంకోటి.

అన్న : పరిస్థితులు ఎట్లా వున్నాయి అంటే, ఇక నాకు గాలి పీల్చే ఓపిక్కూడా లేకుండా పోయింది. ఇవి భరించే ఓపిక మిగలటంలేదు. చావొకటే శరణ్య మనిపిస్తోంది.

అమ్మ : అట్లా అనుకుంటూనే బ్రతికాం గదా! ఎక్కడికి పోతున్నాం? తీరిందాకా బ్రతుకుతాం. బ్రతిమలాడినా వుండం ఆ రోజు వస్తే.

అన్న : ఇవి భరించే శక్తి లేదమ్మా, భారమంతా మీపైన వేస్తున్నాం.

అమ్మ : పూర్తిగా భారం వేసింతర్వాత, ఇంకేం లేదు. భారమంతా నాదే.

అన్న : తృప్తిగా వుండేందుకు, ఏమైనా చెప్పండమ్మా, ఈ అనారోగ్యం నించి కాపాడండి. కనీసం ఆరోగ్యం అన్నా వుంటె....

అమ్మ : ఇందాకట్నించీ డాక్టరుగారితో మాట్లాడి మందు వేసుకుని వస్తున్నా. మీకు తగ్గొచ్చుగానీ, నేను మందులు వేసుకుంటూనే వున్నాను.

అన్న : మా పిల్లవాడి సంగతి ఆలోచిస్తున్న కొద్దీ, దుఃఖం కలుగుతోంది. పిల్లలు లేనంత కాలం లేరే అని తాపత్రయపడ్డాం. వీడు కలిగిం తర్వాత, ఇతని అనారోగ్యం చూడలేకుండా వున్నాం. విరక్తి కలుగుతోంది, ఇవ్వన్నీ చూస్తుంటే.

అమ్మ : ఇందాక నే చెప్పింది అదే. ఈ తహ తహ పోతే ఇంకోటి వస్తుంది. మీకు విరక్తి కలగటానికి వాడు కారణం అయినాడు. ఏదైనా అందుకే వస్తుంది. బాధలైనా అంతే – అవి బాధల్లాగా నీకు కనిపించవచ్చు, వాటికి కారణాలు వేరే వుంటాయి.

అన్న : రాత్రింబగళ్ళు నిద్రపట్టదు. ఏణ్ణర్థంనించీ ఇది తీరటల్లేదు.

వదిన : మా జీవితంలో ఎప్పుడూ ఇలాటి కష్టాలు రాలేదమ్మా. మీ భక్తురాలే

మా గురువు. ఆవిడకూడా చాలా అనారోగ్యంతో బాధ పడ్తోంది. బెజవాడలో వున్నారు. ఆవిడనికూడా మీరే రక్షించాలి.

అమ్మ : నాకు భక్తురాలు ఎవరూ? ఎవరామె?

అన్న : రాజ్యలక్ష్మమ్మగారు.

అమ్మ : నాకు తెలీదు.

వదిన : అమ్మనే ఉపాసన చేస్తున్నానని చెప్పింది.

అన్న : ఆమె భర్తకి ఆంధ్రాబ్యాంక్‌లో ఉద్యోగం. పట్టాభి రామయ్యగారి భార్య. ఆమెకి పచ్చకామెర్లు. చాలా బాధపడ్తోంది.

ఆవిడెవరో అమ్మకి స్ఫురణలో లేదు.

రామకృష్ణ అన్నయ్యకూడా ఆవిడెవరో అంతుపట్టక "ఆవిడేమైనా ఉపదేశాలు చేస్తు వుంటుందా?" అని ఆ అన్నయ్యగార్ని అడిగాడు.

అన్న : ఉపదేశాలు చెయ్యదు కానీ, పూజలవ్వీ చేస్తూ వుంటారు.

అని రామకృష్ణ అన్నయ్యకి చెప్పి, అమ్మని, "మీరు మాకు అండగా నిలిచి, మమ్మల్ని రక్షించాలి" అని అడిగారు.

అమ్మ : కొత్తగా నిలిచేదేముంది నాయనా, అండగా వుంటేనే, ఈ బాధలన్నీ వచ్చినాయి. బాధలు కూడా అండతోనే వస్తున్నాయి, అండతోనే పోతాయి.

అన్న : ఈ బాధలు ఎప్పుడు పోతాయో, మీరు మాకు చెప్తే....

అమ్మ : బాధయినా, ఆనందమయినా, చెప్పిరాలేదు కదా, చెప్పి పోవటానికి? నే వస్తున్నానని చెప్పి, కేకేసి రాలేదు కదా, అవ్వే పోతాయి.

అన్న : మీకు చెప్పేదేముంది, మీరే మాకు అండగా నిలిచి.... ఆశీర్వదించండి.

అమ్మ మౌనం వహించారు. రెండు నిమిషాలుండి అమ్మకి నమస్కారం చేసుకుని, సెలవు తీసుకుని వారు వెళ్ళారు.

# 88. సాధ్యమైతేనే

**12-1-65**

అక్కయ్య : ఆ ఆచరించటమైనా సాధ్యం కావద్దమ్మా? ఈ మనస్సు అనే కోతి వేసే గంతులకు సాధన అనేది అవరోధం, అందుకే సాధన అన్నది పెట్టేరు.

అమ్మ : ఆ సాధన కూడా సాధ్యమైతేనేగా? సాధ్యమైనదే సాధన. ఉపన్యాసాలు చెప్పే పెద్దవాళ్లు చెప్పినంత ధైర్యంగా నేను సాధన మన చేతిలో పని అని చెప్పలేను. అసలు నేను ఏదీ మనచేతిలో లేదంటాను. మనకు ఉన్నదేదో ఎక్కడున్నా జరుగుతుంది. ఎందుకు వచ్చామో ఏఁ చెయ్యాలో తెలియదు. ఎందుకు పొద్దుగూకుతుందో తెల్లవారుతుందో అర్థం కాదు. ఈ ప్రపంచమంతా ఎందుకు ఏర్పడిందో అది జరుగుతుంది.

# 89. సాధన

**1-3-66**

అన్నయ్య : సాధన గురించి మీ అభిప్రాయం ఏమిటి?

అమ్మ : అది కూడా ఆ శక్తి కలిగిస్తే కలుగుతుందని. మీరు అనేక పుస్తకాలు చదివి ఉండొచ్చు. పండితులు చెప్పిన ఉపన్యాసాలు విని ఉండొచ్చు. అందులో మీకు నచ్చిన మార్గంలో మీరు సాధన చెయ్యాలనుకోవొచ్చు. కాని చెయ్యలేరు, కాదు చెయ్యలేక పోతున్నారు. ఎందుకూ?

ఆ చెయ్యలేని బలహీనత కూడా మీ దనను. ఒకవేళ చేసినా మీ దనను. అంతక్రితం లేని ఈ ఆలోచన మీ కెవరు ఇచ్చారో ఆ మార్గంలో సాధన చెయ్యమని ఎవరు ప్రేరేపించారో వాళ్ళే చెయ్యలేనితనం కూడా ఇస్తున్నారు. ఇక సాధనలలో కూడా ఈ సాధన గొప్పది ఆ సాధన తక్కువదీ అనీ లేదు. ఏది ఎవరికి సాధ్యమైతే అదే గొప్పసాధన అని నా అభిప్రాయం.

అన్న : అయితే గురు శిష్యులు లేరంటారా?

అమ్మ : ఉన్నారని చెప్తున్నారుగా. లేరని ఎట్లా అంటాను? కాని నా దృష్టిలో గురువు అంటే ఈ గురువే దైవము. వాడు తప్ప మరో దైవం లేడనే. అట్లా అనుకో గలిగినప్పుడే వాడు సరైన శిష్యుడౌతాడు. అసలు గురుధ్యానంలో ఆ మొదటి శ్లోకంలోనే ఉన్నది - గురువు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూప-మని. ఆ స్థానంలో ఉన్న తర్వాత వాడే సాక్షాత్తు దైవం. వాడి నోటివెంట వచ్చిన మాటే మంత్రం కాని వాడు మంత్రం ఇవ్వటం కాదు.

# 90. శరీరానికి అనుచితమైన సాధన

9-8-67

పాలకొల్లునుండి వచ్చిన ఒక యువకుడు ఉదయం నుండి అమ్మతో మాట్లాడాలని ప్రయత్నం. రాత్రికి కాని వీలుపడలేదు. ఆ సమయంలో అమ్మ గదిలో కూర్చుని ఆవరణలోని అన్నయ్య వాళ్ళతో పనిపాటల గురించి మాట్లాడుతున్నారు. తలుపులు తీసి ఉండటం చూసి ఆ యువకుడు లోపలికి వచ్చి కూర్చొని అమ్మకు నమస్కరించి తన కేవో సందేహాలున్నట్లు, అవి అమ్మ తీర్చాలని అడిగాడు. అమ్మ అడగమన్నారు.

అతను చెప్పాడు - తను ప్రాణాయామం చేస్తుంటాడట. కాని అందువలన పూర్వం ఉన్న ఆరోగ్యం కూడా పోయిందట. అంతే కాదు తను అది సరిగా చెయ్యలేక పోతున్నాడట.

చెబుతూ చెబుతూ ఉండగానే అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. అతని అవస్థకు అమ్మ జాలి పడ్డారు. అతని వంక వాత్సల్యంగా చూస్తూ అమ్మ అన్నారు.

"నీ ఆరోగ్యపరిస్థితిని బట్టి ప్రస్తుతం ఏ సాధనా చెయ్యకు నాయనా. ప్రాణాయామం కాదు ప్రాణనియమమే. దానంతట అదే ఏర్పడుతుంది. అది ఎట్లా జరుగుతుందో గమనిస్తుంటే అదే నిలబడిపోతుంది. కర్మేంద్రియాలతో మనస్సు కట్టుబడదు. మనస్సుతో కర్మేంద్రియాలు కట్టుబడుతాయి. చిన్న ఉదాహరణ చెప్తా నాన్నా నీకు ఏదో ఒక విషయం మీద ధ్యాస ఉంటుందనుకో. అప్పుడు నీ ప్రయత్నం లేకుండానే

నీ కళ్లు చూస్తున్నా ఆ చూస్తున్న దేమిటో నీకు తెలియదు. నీ ప్రక్కనుండి మనిషి పోతున్నా నీకు తెలియదు. నీ ప్రక్కనే ఎవరు మాట్లాడుతున్నా నీకు వినపడదు. నువ్వు ఏ సాధన చేస్తే ఆ స్థితి వచ్చింది? విషయం (మన వ్యవహారంలో) వేఱు కావచ్చు అనుకో నాన్నా - లౌకికం, పరమార్థికం అని. అంతకు ముందు నీలో ఈ ధ్యాస ఇంత తీవ్రంగా లేదు కదా? ఇప్పుడు కలిగింది. అట్లాగే నువ్వు కోరుకున్నది నీకు సమయం వచ్చినప్పుడు వీటిలాగే అదీ వస్తుంది. ఈ ధ్యాసే నీకు చాలు, చేతకాని ఆ సాధనలన్నీ చేసి నీ ఆరోగ్యం చెడగొట్టుకోకు.

ఇంకొకటి కూడా నాయనా. ప్రొద్దున నువ్వు చేశావే లోచూపు– లోచూపు అంటే గ్రుడ్లు తిప్పటం కాదు. నీ వెలుపల ఏది చూస్తున్నావో అదే నీ లోపల చూడటం, నీ లోపల ఏది చూస్తున్నావో అదే వెలుపల చూడటం లోచూపు.

అన్నయ్య : గాయత్రీ అంటే ఏమిటండీ?

అమ్మ : గాయత్రి అంటే పంచభూతాల సమ్మేళనం.

కనపడే ప్రతివస్తువులో ఉన్నది కనుక ఎప్పుడు ఏ వస్తువుతో పని చేస్తే అది గాయత్రి అనుకోవటమే. ప్రకృతిని ఆరాధించటం అంటే కూడా అదే.

అన్నయ్య : చాలా తృప్తిగా ఉన్నదమ్మా.

# 91. సాధనానుభవాలు

నెల్లూరునుండి వచ్చిన ఒక అన్నయ్య అమ్మతో మాట్లాడుతూ తనకు కలిగిన అనుభవాలను చెబుతున్నారు.

'సాధన చేసేటప్పుడు అనుభూతి సహస్రారం దగ్గరకు వెళుతుంది'.

అమ్మ : సహస్రారం దగ్గరకు పోతుందంటున్నావుగదా! ఉంచుకోవటం చేతనైతే ఎక్కడ ఉంచుకున్నా ఒకటే.

ఆ శక్తి అసలు ఎక్కడ్నుంచి బయల్దేరుతుంది?

అన్న : ఒక శక్తి కిందనుంచి కదిలినట్లుంటుంది.

అమ్మ : సహస్రారమంటే ఎట్లా వుంటుంది?

అన్న : ఒక జ్యోతి. ఒక వెలుతురులాగా వుంటుంది.

అమ్మ : (వెలుతురును చూపి) ఇది వెల్తురుగాదూ?

అన్న : కళ్లు మూసుకుంటే దానంతటదే కనిపిస్తుంది.

అమ్మ : నువ్వు ఏం చేశావు? దేనివల్ల కనిపిస్తున్నది?

అన్న : నే చేసిందేమీ లేదు. ఒక మూల కళ్ళు మూసుకొని కూచుండేవాడిని. దానంతట అదే వచ్చేది.

అమ్మ : ఏదొస్తే అది అనుభవించు నాయనా. నువ్వు కావాలను కొన్నప్పుడు వచ్చేది కాదు. వద్దు అనుకున్నప్పుడు రాకుండా వుండదు. నువ్వు వుంచాలనుకొన్నంతసేపు వుంచలేవుగదా! ఏదొస్తే అది అనుభవించు. 'నేను' ఎప్పుడూ వున్నదనేది నిజమేనా?

అన్న : ఆఁ. అది లేకపోతే ప్రపంచం ఏముంది వ్యవహార జ్ఞానంలో?

అమ్మ : ఆ జ్ఞానంలో నేననేది వున్నదిగా....

అన్న : జపం ఎక్కువగా చేసినప్పుడు కూడా కాంతి వస్తుంటుంది. కొంతకాలం అయిన తర్వాత ఎక్కువవుతుంటుంది.

అమ్మ : వస్తున్నై. అనుభవించండి. దాన్నీ .... శక్తి అన్నారుగా?

అన్న : కొడాలి సీతారామస్వామి సూర్యనమస్కారాలు చెప్పారు. ఇంక చాలు నాయనా – అన్నారు. నా జీవితం వరకు చేస్తా నన్నాను.

అమ్మ : నువ్వే గురువువయినావే! అది చేస్తే ఏమొస్తుంది?

అన్నయ్య : అప్పుడూ తేజస్సే.

అమ్మ : ఊరికే కూర్చున్నా అదే, పెద్దలదగ్గర కూర్చున్నా అదే, జపం చేస్తున్నా అదే, మన కే దున్నదో అది కళ్ళముందు కొచ్చి కూర్చుంటుంది.

అన్న : నాకు ఒక్కొక్కసారి ఒళ్ళు కూడ తెలియదు. ఉపన్యాసాలిచ్చేటప్పుడు కూడా తెలియదు.

అమ్మ : నేను మనింటికొచ్చానుగా. మీరు పూజచేస్తూ నాతో అన్న మాటలు గుర్తున్నాయి.

వినిపించుకోడు. ఆయన ధోరణే ఆయనది.

"ఎప్పుడూ అది (సహస్రారం) తేజోమయంగా వుంటుం దమ్మా".

అమ్మ : ఒకప్పుడు చూచిందయితేగా 'అది తేజోమయం' అని అనటానికి? (వెల్తురును చూపి) ఇప్పుడీ వెల్తురును చూస్తేగా మీరు ఇంకొకటి చూసినప్పుడు వెల్తురుగా వున్నదని చెప్పటానికి?

అన్న : ప్రశాంతంగా వుంటుంది.

అమ్మ : ప్రశాంతత అంటే ఏ ఆలోచనా లేకపోవటమా? – ఆలోచనలన్నీ పోయినై అన్న ఆలోచన వుండటమా?

అన్న : కాదమ్మా. నిశ్చలంగా వుంటుందమ్మా. జ్యోతి కన్పిస్తుంది.

అమ్మ : ఇట్లాంటిదని అక్కడ కనపడితేగాని అక్కడ జ్యోతి అనలేవుగదా? 'పెట్రోమాక్సులైటంత, వెలుతురన్నావనుకో. ఆ లైటువెలుతురును ముందు చూసుంటేగదా అట్లాంటిదీ అనదానికి.

అన్న : మనస్సు కేంద్రీకరించుతాను.

అమ్మ : మనస్సు కేంద్రీకరించటమంటే – చుట్టూ ఎంతమంది కూర్చున్నా, ఎవరేం చేస్తున్నా, వినపడక, కనపడక పోవటమా?

మళ్ళీ ఆయన ధోరణిలోకే దిగాడు.

"అందని తేజస్సు"

అమ్మ : అందని తేజస్సు కావచ్చుగాని, మనకు తెలిసినదే తేజస్సు. అనుభవించేటప్పుడేం తెలియదు; అనుభవించానన్న గుర్తున్నది కదా? నీకంత అనుభవం కలిగినప్పుడు సందేహాలకు తావెక్కడిది? నువ్వు కావాలనుకుంటే అది వస్తున్నప్పుడు ఎక్కడ ఆపాలనుకుంటే అక్కడ ఆపు. ఎక్కడ వుంచాలనుకుంటే అక్కడ వుంచు.

# 92. సాధనా తతంగము

అక్కయ్య : నేనేం చెయ్యనమ్మా, సంసారంలో వుండి అనేక తాపత్రయాల్తో సతమత మవుతున్నాను.

అమ్మ : నువ్వేం చెయ్యొద్దు వాడిచ్చింది నువ్వు చేస్తున్నావు అనుకో.

అక్క : ఏమీ చెయ్యలేక పోతున్నానని మనసుకి దిగులు.

అమ్మ : ఇది వరకున్నా, ఈ పూటతో అది మానుకో. దిగులు నువ్వు పడుతున్నావను కోవటంలో, ఈ ఆందోళన పడుతున్నావు... అందుకే ఇక్కడకు రావటం.

అత్తగా : అమ్మదర్శనం చేసుకుంటే ఒకసారి, ఇదంతాపోయి మనసుకి హాయిగా వుంటుందిగదా అని....

అమ్మ : మనం చేస్తున్నది వాడి సేవ అనుకోగలిగితే వాడిసేవ, లేకపోతే వాడిచ్చిన సేవ. ఒక బొమ్మని తయారుచేసి పంపించి, నీకిస్తే.... ఆ సేవ చేస్తున్నావు. ప్రపంచంలో నీది అంటూ వేరే ఏముంది? అంతా వాడిదేగా? ఇది వరకు ఆ జిజ్ఞాస అంతా సాధన. ఇది ఫలించిందనుకో.

అత్తగా : సాధనద్వారా ఆత్మానందాన్ని అనుభవించవచ్చునంటారు.

అమ్మ : అవున్నాయి, ఇవున్నాయి – అని చెప్పేదంతా ఒట్టిది. ఇంత సుందరమైన సృష్టిని సృష్టించి, ఇదంతా మన కళ్ళముందు కనిపిస్తోంటే, ఇది చూడటం మానేసి, ఎక్కడో, ఏదో వుందని వెతుక్కోవటం ఎందుకు? ఇంతా చూడ కూడదనుకుని, కళ్ళు మూసుకుని చూస్తున్నది మాత్రం ఏముంది?కళ్ళు మూసుకుంటే చీకటేగా? మనసుతో అందుకో మంటారు. మనసుతో చూస్తున్నది ఏమిటి?

అక్క : ప్రశాంతత.

అమ్మ : అకస్మాత్తుగా నీకొక వెల్తురు చూపించాననుకో. చూసినంతసేపూ బాగానే వుంటుంది. ఆ తర్వాత మామూలేగా? సర్వకాల సర్వావస్థలయందూ

నీలో వుండే సమానస్థితే సమాధి. మనసుకెప్పుడూ హాయిగా, తృప్తిగా వుండటమే. పోనీ, సాధన చేద్దామనుకున్నా, ఇలా చేద్దాం. నీకో జపమాల ఇచ్చి, కొన్ని అక్షరాల్నిచ్చి వాటికి అర్థాన్నిచ్చి, జపం చెయ్యమన్నారనుకో. ఆ అక్షరాల్ని మననంచేత నువ్వు మంత్రం చేస్తున్నావుగాని, నీ కిచ్చింది మంత్రం కాదు. మననం మనసుతో చేస్తున్నావ గనుక, మనసే మంత్రం. అన్ని అక్షరాలూ పలికేది శబ్దమే, కనుక శబ్దమే బీజం. ధ్వనితో గుర్తించాడుగానీ అక్షరాన్ని, దానికి వేరే వునికి లేదు.

అక్క : సందేహం విడిపోతోందమ్మా. సంసారంలో వుంటూ కూడా, సాధన చెయ్యచ్చును అని తెలిసింది.

అమ్మ : నేను బహు సంసారిని కదా, సంసారం నాకు లేదూ?

వారు మరి కొంతసేపు అమ్మతో గడిపి, మరునాడు శివరాత్రి రోజున జరగబోయే మహారుద్రాభిషేకాన్ని గురించి అడిగి తెలుసుకున్నారు. అమ్మ, న, ర, గార్ని రేపు ఉదయం భద్రాద్రి రామశాస్త్రిగారితోపాటు అభిషేకం చెయ్యమని చెప్పారు. వారు లేచి, సెలవు తీసుకుంటూ, "అమ్మా- ఈ నాటితో మా గ్రంధి విడిపోయింది," అన్నారు. ఎంతో తృప్తి, ఆనందం కన్పించాయి. వారి ముగ్గురిలో, అమ్మ పాదాలకు నమస్కారాలు చేసుకుని వారు బయటకు వెళ్లారు.

# 93. సాధనకు ప్రేరణ

అత్తగా : 'ఇంత చప్పున అందుతుందా? ఎంత సాధన చెయ్యాలి?' అంటారమ్మా.

అమ్మ : పోనీ అదే అందాం. సాధన చెయ్యాలనుకుని, చెయ్యలేకపోవటం ఎందువల్ల జరుగుతోంది? మనకి చెయ్యాలన్న ఉద్దేశ్యం ఎక్కడ్నించి వచ్చింది? మనసులోనించే కదా? ఆలోచన వచ్చేది మనసుకి. చెయ్యలేకపోతున్నదీ మనసే. ఈ మనసు ఇలా వుండటానికి ఎవరు కారణం?

మనం చెయ్యగలగటానికి, చెయ్యలేకపోవటానికి, కారణమైన శక్తి వేరే ఇంకొకటి వున్నదని తెలుస్తోంది. ఆ వున్నది దైవమా, ఇంకా ఏ దన్నానా!

అక్క : అంతా దైవమే కదమ్మా.

అమ్మ : దైవం ప్రేరణ కలిగించి చేయించటల్లేదనేగా? నువ్వు గాక, దైవం కాక వేరే ఇంకోటి లేదుగదా!

అక్క : దైవం కాకుండా వేరే ఏం లేదమ్మా.

అమ్మ : ఇక్కడికి రావాలని, అనేక రోజుల్నుండి అనుకుని రాలేకపోవటం జరుగుతోంది గదా.

న.రా : అవునమ్మా. మా వూళ్ళో స్టడీ సర్కిల్ జరిగినా వెళ్ళలేకపోయాం. అయిపోయింతర్వాత తెలిసింది.

మూడు నాలుగేళ్ళ నుండీ వద్దామనుకుంటోంటే ఈ నాటికి అవకాశం లభించింది.

అమ్మ : అంటే, రప్పించుకుంటే రావటమే.

న.రా. : ఎన్నాళ్ళనించో రాలేక పోతున్నామని, ఈసారి ఇక బయల్దేరాం.

అమ్మ : దేనికైనా తరుణం రావాలికదా నాయనా? తప్పించుకోలేనిది తరుణం. ఇక్కడికి రావాలని, రాలేకపోవటం ఎట్లానో, రావలసిన సమయం వచ్చింతర్వాత రాకుండానూ వుండలేరు.

అన్న : చాలాకాలంనుండి.

అమ్మ : వినగానే రావాలనిపించినా రాలేకపోయారు కదా. మీరు అనుకున్న కాలంలో కాక మీకున్న కాలంలో వచ్చారు. రాగానే మీకు సందేహం కలిగినా మొదటిసారి అడగలేక పోయారుకదా? ఇది రెండవసారి అనుకుంటా – మీరు రావటం. ఈసారి అడుగుతున్నారు. దీనికి దానికీ కాలవ్యవధి ఉన్నదికదా. ప్రతీదీ అంతే. ఏది మిమ్మల్ని ఇక్కడికి రప్పించిందో ఏది మీకు తేలని సమస్యలు స్ఫురింపచేస్తుందో అదే తీరుస్తుంది.

అన్న : నాకృషి లేదంటారా?

అమ్మ : నీ కృషి ఉన్నదనుకుంటే చెయ్యి నాన్నా. వద్దు అనను. లేదనే అనుకుంటున్నాను. ప్రయత్నం కనిపిస్తుంది కాని ప్రేరణ అర్థం కావటంలేదు. మన కాళ్ళు నడుస్తున్నట్టు కనిపిస్తున్నాయి కనుక మనం నడుస్తున్నామనుకుంటున్నాం. కాని వాటిని నడిపించే శక్తి గురించి ఆలోచించం. అది సహజం, తప్పదు అది. మన కృషి లేక పోయినా ఉన్నట్టే కనిపిస్తుంది అది నీకే కాదు అందరికి.

అన్న : సమయం ఉన్నదికదా అని అట్లా కూర్చోవల్సిందేనా? ఈ తాపత్రయం వద్దంటారా?

అమ్మ : (నవ్వి) ఒకటి అవునని ఒకటి కాదని నేను అనటం లేదు నాన్నా. ఆచేతులు ముదుచుకొని కూర్చోవటం కూడా నీచేతుల్లో లేదంటున్నాను. ఏదీ మనది కాదు, మనదేం లేదని తెలుస్తున్నా మనని అట్లా కూర్చోనివ్వకుండా మళ్ళీ ఈ తాపత్రయం కలిగించేది కూడా అదేనంటాను. తాపత్రయంకూడా దైవమే.

# 97. మేం రాసే దేమిటీ ?

శ్రీపాద : "ఏమిటో రాస్తున్నాము రాతలు. ఏం అందుకోగలం ఈ రత్నాలని? ఏం అర్థంచేసుకుని రాస్తున్నాము? లేదమ్మా, రాయలేను నేను రాయలేను.

అమ్మ : (ఆప్యాయంగా నవ్వి) మనదేం లేదని తెలిసినా మనదేదో ఉన్నదనుకోక పోతే కలం సాగదు నాన్నా. మీదొకరిదే కాదు ఎవరి కలమూ సాగదు. రామకృష్ణ అదే బాధపడ్తుంటే ఇదే చెప్పాను.

ఆరు రోజులలో పుస్తకాన్ని పూర్తిచేస్తానని వెళ్ళినవాడు వర్కర్స్ సెలవు పెట్టటంతో ఏం చెయ్యగలిగాడు? ఆ ఒక్క నరసింహమూర్తినే ఎంతసేపు అని బాదుతారు?

అనుకున్నది జరగదు. తనకున్నది తప్పదు – అని తెలిసినా మనం చేస్తున్నాం – అని అనుకోక తప్పదు.

ఆ తర్వాత అమ్మ స్నానానికి లేవటంతో అప్పటికి ఈ సంభాషణ ముగిసింది.

# 98. నీదేం లేదు

**1-12-67**

ఉదయం అమ్మ హాల్లోనుండి లోపలికి వెళ్ళారో లేదో అప్పుడే వచ్చారు నెల్లూరునుండి రెడ్డిగారు పత్నీ సమేతంగా.

అమ్మ స్నానంచేసి మళ్ళీ హాల్లోకి వచ్చారు. పూజా, తీర్థ ప్రసాదాలు ఇవ్వటం అయ్యాక అమ్మ వాళ్ళని భోజనాలకు వెళ్ళమన్నారు రెడ్డిగారు అన్నారు.

"అమ్మా – చిన్న సందేహం"

అమ్మ : అడుగు నాన్నా.

అన్నయ్య : మనిషి తప్పు అని తెలిసి ఎందుకు చేస్తాడు?

అమ్మ : తప్పించుకోలేక.

అన్నయ్య : దానివల్ల ఆత్మకేమన్నా దోషం ఉండదా?

అమ్మ : నాకేం ఉండదు.

అన్నయ్య : ఆ రకంగా మనిషి తృప్తిపడితే ఏం వస్తుంది?

అమ్మ : తృప్తిపడదుగా.

అన్నయ్య : నేనూ నా ప్రయత్నమూ ఉన్నదనుకున్నప్పుడు వాడు అట్లా తృప్తిపడలేదు. తను ఏదో తప్పించుకోవాలని ప్రయత్నిస్తాడుగా.

అమ్మ : ప్రయత్నించొచ్చు. ఆ ప్రయత్నం కూడా, ఆ భావం కూడా, ఇస్తే రావాల్సిందే. నీచేత ఆ తప్పు ఏ శక్తి చేయిస్తుందో అదే చెయ్యనివ్వదు.

నీ ప్రయత్నం ఉన్నట్టు నీకు కనిపిస్తుంది కాని అనుభవంలో లేదు. నీ కాళ్ళు నడుస్తున్నాయి కనుక నడుస్తున్నాను - అనుకుంటావు. కాని నీ కా ప్రయత్నం కల్పిస్తున్న శక్తే మరొకటుంది. అంతా అదే అనుకుంటే నువ్వేం చెయ్యలేవు. నీకా తృప్తి ఉండదు. ఏదైనా సమయం వచ్చేవరకు అర్థంకాదు. అంతవరకు విన్నది నమ్మనివ్వదు. కన్నది నమ్మనివ్వదు. సమయం వచ్చినప్పుడు దానంతట అదే అర్థమౌతుంది. ఒక్కొక్కసారి ఎంత పనిచేసినా అది అందకుండా పోతుంది. ఇంకోసారి అనుకోకుండా అవుతుంది. దాన్ని దైవచిత్రమంటాము. అంతే. మన ప్రయత్నం ఉన్నట్టు కనిపిస్తుందే తప్ప మనదేం లేదు.

అన్నయ్య : చివరలో నన్ను నేను బాగుపర్చుకోవటానికి వీలు లేదా అమ్మా? ఈ గుణం పోయే తరుణం రాదా?

అమ్మ : తప్పకుండా వస్తుంది. ఎందుకు ఏర్పరిచిందో ఆ గుణం నీకు, ఆ శక్తే పోగొట్టుంది.

ఆయన తృప్తిగా "చాలమ్మా" అన్నారు.

# 99. జన్మపరంపరా విముక్తి

అక్కయ్య : అమ్మా, ఈ జన్మలో అనుభూతి పొందలేకపోతే, వచ్చేజన్మ కూడా ఇలానే వుంటుంది. ఇలా జన్మల్లోపడి కొట్టుకుపోవటం అని తలుచుకుంటే మనసుకి జిజ్ఞాసగా వుంది.

అమ్మ : అట్లా అంటే భయంకాదూ! ఉద్దేశం చెప్పటంలో ఒకటేనమ్మా, మధ్యలో వీళ్ళు అర్థంచెప్పేప్పుడు తేడా వస్తుంది. ఇప్పుడు జన్మపరంపర సంగతే ఉందనుకో ....

అమ్మమాట పూర్తిగాకుండానే,

అక్కయ్య : ఈజన్మా, ఈజన్మ తర్వాత మరోజన్మ, కృషి చెయ్యలేక ఇలానే జన్మలో పడి కొట్టుకోకుండా, దీన్నించి వేరుపడటానికి - అన్నారు.

అమ్మ : రానీ, ఇస్తే వస్తున్నాయి. ఇదివరకు జన్మ వుందో లేదో తెలీదు. ఉన్నా అది మనకు గుర్తులేదు. అంతవరకెందుకు, జరిగిపోయిన కాలం పసితనమే మనకు గుర్తులేదు. ఇస్తే ఎత్తుతాం జన్మ. ఇవ్వకపోతే లేదు. జన్మ పరంపర అంటే - జన్మ ఆత్మకా, శరీరానికా అనుకుంటే - శరీరం జడం అంటున్నారు, జడం అనేదానికి జన్మేమిటి? వాళ్ళు చెప్పిన ప్రకారం చూచుకున్నా, శరీరం ఇక్కడ వదిలి, ఆత్మ ఎక్కడో లయమవుతోంది. అది మారదంటున్నారు కాబట్టి జన్మ ఒకటే.

# 100. జన్మల ప్రసక్తి

జ్ఞానమే మెట్టు అంటారు. తెలుసుకున్న జీవుడేమెట్టు అనండిగాని జ్ఞానమేమెట్టు అంటే ఎట్లా? మానవజన్మ పై మెట్టు అంటారు. వీళ్ళలోనూ అవివేకులున్నారు. కుక్కఉన్నది, అది చాలా వివేకం కలిగివున్నది. వీళ్ళు చెప్పేదాన్ని బట్టిచూస్తే దీనికేది జన్మ? వాడికే జన్మా? వాటికి మాత్రం జ్ఞానంలేదూ? తెలియదా? వాటి స్వజాతి వాటికి తెలుస్తూనేవుందిగదా! పిల్లి మరొక పిల్లి ఎదురైతే అదేజాతి అని తెల్సుకుని దగ్గరకు పోతుంది. పూర్వజన్మలో అట్లాచేశాను, వీడు నాకొడుకు, యీమె నాతల్లి అని చెప్తున్నారటకదా! చచ్చిపోయి ఈ శరీరం వచ్చేదాకా ఎక్కడ వున్నట్లు? ఆ విషయం చెప్తే జన్మల సంగతి ఆలోచిద్దాం. ఆత్మ అంటే అంతా నిండివున్నదని కదా! తేలు ఉన్నది దాన్ని నేను చంపాను. అది ఎక్కడకు పోయింది. శక్తిలోనే కలిసి పోయింది.ఈ జీవంచేత ఆజీవం చచ్చిపోయింది. శక్తి శక్తిలో కలవక ఎక్కడకు పోతుంది? ఇక్కడి దిక్కదే తేలకపోతే జన్మలను గురించి ఏమాలోచిస్తాం? నాలుగురోజులనాడు అన్నంలో ఏమేసిపెట్టామో గుర్తుండటంలేదు. అక్కడదాకా ఏంపోతాం? పూర్వజన్మ గుర్తులున్నై అని చెప్పేవాళ్ళు ఒకటి అడ్డం వెయ్యచ్చు. 'నిద్రలో ఏం తెలుస్తుంది. అంతకుముందు తెల్సు, వాళ్ళకి శరీరం వచ్చిన తర్వాత వెనకటివి గుర్తున్నై' అని, శరీరమున్నప్పుడేగా నిద్ర, ఆకలి. శరీరం లేకపోతే ఆకలిలేదు – నిద్రలేదు – (నిద్రలేనప్పుడు మరుపేమిటి?) పూర్వజన్మ అంటే – పూర్వానికి పూర్వం, దానికి పూర్వం. అట్లాపోయినా అసలుదగ్గరకే పోతుంది. ఆ జన్మలో తాను చేస్తున్నదేమీ లేదుగా ( తరువాత జన్మ ప్రారబ్ధం కావడానికి?) నీకు పూర్వజన్మ సంస్కారమన్నారొకాయన.

పూర్వజన్మలో సత్కర్మచేయటానికి అంతకు ముందు జన్మలో చేసివుండాలిగదా! అంతకు ముందుకు, అసలేదో అదే చేయించటానికీ అన్ని జన్మలకూ కూడా (కర్త) అన్నాను. తెల్సినవాడికి జన్మలులేవు. తెలియని వాడికి ఏది ఏమౌతుందో తెలియదు.

# 101. హెచ్చు తగ్గులు

**9-4-66**

ఈరోజు అమ్మ నిద్రలేచేటప్పటికి బాగా ప్రొద్దుఎక్కింది. కప్పుకున్న శాలువా తీస్తూ అమ్మ అనుకున్నారు "రాత్రి ఎంత జ్వరం వచ్చిందో ఇప్పుడు తెలుస్తుంది."

గోపాల్ : అని నెమ్మదిగా అంటావేం. ఒళ్లు ముట్టుకుంటే సెగలు కక్కుతోంది.

అమ్మ : అయితే, హాయిగా నిద్రపోయాను.

గోపాల్ : మంటలూ – చలీ రెండూ ఉన్నాయి కదమ్మా?

అమ్మ : అవును.

కోటేశ్వరావు : (నవ్వి) హెచ్చు తగ్గులు రెండు ఒకే బండికి కట్టబడి పోతున్నాయి అన్నావుగా.

అమ్మ : అదెప్పుడూ ఉన్నది. కట్టిన రెండు ఎద్దుల్లో ఒకటి ముందుకు పోయేది రెండవది నెమ్మదిగా నడిచేది. అయితే బండి సాగటానికి మొదటిదాని పగ్గం పట్టుకుని రెండోదాన్ని పొడుస్తావు. ఒకటి ముందుకూ ఒకటి వెనుకకూ అయితే నడిపించలేవు. హెచ్చు తగ్గులను చేతిలో పట్టుకునే బండి సాగిస్తున్నావు. వాటివల్ల బాధ ఉన్నా బాధకు అలవాటుపడి పోతున్నావు బాధ ఉన్నదని మానేస్తున్నావా మన నల్లది, ఎఱ్ఱది (దున్నపోతులు) చూడు. అందులో ఒకటి రెండోదాన్ని పొడుస్తుంది, మేత మేయనివ్వదు. నీళ్ళు త్రాగనివ్వదు. పోనీ వేరేకట్టేసి పెదదామా తినవు. పోట్లాడుకుంటూనైనా అవి కలసి ఉండాలి.

కోటేశ్వరావు: వాటి నడక ఎప్పుడూ సమానంగా ఉండదా?

అమ్మ : ఉంటే హెచ్చు తగ్గులు ఎట్లా అవుతుంది? సృష్టిలోనే ఉన్నాయి అవి. అసలు వ్యష్టిత్వం లేకపోతే సృష్టి ఏముంది? వాడు (దేవుడు) అట్లా పడిఉండాల్సిందే, అంతా సమంగా ఉంటే – భిన్నత్వం లేనిది సృష్టేలేదు. గారెలు చెయ్యాల్సి వచ్చినప్పుడు పప్పు అంత ఉప్పు పోస్తే రుచి ఏముంది? ఉప్పు దానికి తగినపాళ్ళలో ఉంటేనే రుచి.

గోపాల్ : అసలు ఉప్పు లేక పోయినా రుచి రాదు.

అమ్మ : అంతేగా? హెచ్చు తగ్గులేరుచి. అంటూ లేచి స్నానాల గదిలోకి వెళ్ళారు.

నీ ప్రయత్నం ఉన్నట్టు నీకు కనిపిస్తుంది కాని అనుభవంలో లేదు. నీ కాళ్ళు నడుస్తున్నాయి కనుక నడుస్తున్నాను - అనుకుంటావు. కాని నీ కా ప్రయత్నం కల్పిస్తున్న శక్తి మరొకటుంది. అంతా అదే అనుకుంటే నువ్వేం చెయ్యలేవు. నీకా తృప్తి ఉండదు. ఏదైనా సమయం వచ్చేవరకు అర్థంకాదు. అంతవరకు విన్నది నమ్మనివ్వదు. కన్నది నమ్మనివ్వదు. సమయం వచ్చినప్పుడు దానంతట అదే అర్థమౌతుంది. ఒక్కొక్కసారి ఎంత పనిచేసినా అది అందకుండా పోతుంది. ఇంకోసారి అనుకోకుండా అవుతుంది. దాన్ని దైవచిత్రమంటాము. అంతే. మన ప్రయత్నం ఉన్నట్టు కనిపిస్తుందే తప్ప మనదేం లేదు.

అన్నయ్య : చివరలో నన్ను నేను బాగుపర్చుకోవటానికి వీలు లేదా అమ్మా? ఈ గుణం పోయే తరుణం రాదా?

అమ్మ : తప్పకుండా వస్తుంది. ఎందుకు ఏర్పరిచిందో ఆ గుణం నీకు, ఆ శక్తే పోగొట్టుంది.

ఆయన తృప్తిగా "చాలమ్మా" అన్నారు.

# 102. ద్వంద్వాలు

ఆ రోజు 1965 లో అక్టోబరు నెలలో 20 తేది ఉదయం. ఆనాటి నూతనాగతులలో కొందరు సోదరులు ఇక్కడికి ఏడుమైళ్ళ దూరంలో ఉన్న బాపట్ల నుండి వచ్చారు. వారంతా హైదరాబాద్ రెవెన్యూ - డిపార్టుమెంటుకు సంబంధించిన వారు. బాపట్లలో సర్వే ట్రెయనింగ్‌కై కొద్ది నెలల క్రిందటే ఇక్కడికి వచ్చారు.

అమ్మ హాల్లోకివచ్చేటప్పటికి పదిన్నర అయింది. వాళ్ళు తాము తెచ్చిన పూలూ - పళ్లు అమ్మకు సమర్పించి అమ్మ ఇచ్చిన తీర్థ ప్రసాదాలు తీసుకున్న తర్వాత కొన్ని క్షణాలు అమ్మను చూస్తూ కూర్చున్నారు. ఆ తరువాత అందులో ఒక అన్నయ్య అమ్మతో అన్నారు "మీరేదైనా చెప్తే వినాలని ఉన్నదండీ" అని.

అమ్మ : ఏం కావాలి?

అన్నయ్య : వేదాంత విషయాలేమైనా చెప్తారేమోనని.

అమ్మ : మీరు అడగండి చెప్తాను.

అన్నయ్య : అసలు ఈ పాపపుణ్యాలకు మూలమేమిటి?

అమ్మ : అసలు ఈ ప్రపంచం, మనం, రావటానికి కారణమేదో అదే.

అన్నయ్య : కర్మలకు కారణమెవరు?

అమ్మ : కర్మలకు కర్తేగా, దాన్ని దైవం అనండి, శక్తి అనండి, ఇంకేదైనా అనండి. ఏ ఒకటి ఇన్నింటికి కారణమైనదో అదే అన్నింటికి అని నా అభిప్రాయం.

అన్నయ్య : మరి ఇందులో కర్మల ప్రకారం వాడి పుట్టు పూర్వోత్తరాలు ఉంటాయిగా. సృష్టించేవాడు అందరికి ఒకడే అయినప్పుడు వ్యక్తులను బట్టి ఇంత మార్పు ఎందుకుండాలి?

అమ్మ : అంటే ప్రపంచంలో చిన్నా - పెద్దా, హెచ్చు - తగ్గూ ఈరెండు రెండుగా లేకపోతే ఇంకా ఏం లేదు నాన్నా' వ్యష్టిత్వం లేకపోతే సృష్టికి ఆధారం లేదు. మంచి - చెడ్డలంటే హెచ్చు తగ్గులే అనుకుంటాను. ఇష్టం - అయిష్టమూ అదే. ఈ ద్వంద్వాలకు ఏపేరైనా పెట్టుకుందాము, దీనిపేరు పుణ్యపాపాలనండి. మంచి చెడ్డలనండీ. ద్వంద్వమే. అనేకమైంది కనుక అందులో అనేక రకాలుగా వస్తుంది అని, భిన్నత్వం లేకపోతే సృష్టిలేదని, భిన్నత్వం లేని మనస్తత్వం ఎక్కడుంటుందో అదే దైవత్వం అని నా ఉద్దేశం. ఇవన్నీ ఇట్లా జరగటం సహజమేనని అనిపిస్తుంటుంది."

అని ఆగి "నిజమే, పుణ్యపాపాలు లేకపోతే ఒకడు సుఖపడేవాడు, ఒకడు కష్టపడేవాడు ఎందుకుండాలి? అందరూ సుఖపడేవాళ్ళు ఉండొచ్చుగదా అన్న ప్రశ్నవస్తుంది. అసలు సుఖమంటే ఏమిటి? సుఖమంటే ధనమా? సుఖమంటే బిడ్డలా? సుఖమంటే మరి ......... మన ఇష్టప్రకారం జరగటమేమో. సుఖమనేమాటకొస్తే మేడలో వున్నవాడూ బాధపడుతున్నాడు. ఒకడొకరకంగా బాధపడ్తుంటే ఇంకొకడు ఇంకో రకంగా బాధపడ్తున్నాడు. బాధలు అందరికీ ఒకే రకంగా లేవు, బాధలో తరతమ భేదాలున్నాయి. ఇందులో సుఖం అంటే ఎవరి ఇష్టప్రకారం వాళ్లకు జరగటం. సుఖం-నిన్ను నేను చంపాలనుకున్నప్పుడు నాకు కత్తి దొరకకపోతే బాధకాదూ, ఆ జరిగేపనిచెడ్డదని సంఘం దృష్టిలో కావచ్చు, నాకు?

అన్నయ్య : మంచిది కావొచ్చు.

అమ్మ : ఇట్లాగే, ఇటువంటి మనస్తత్వాలు ... ఈ భిన్నత్వమే సృష్టికి ఆధారం అంటాను నేను.

అన్నయ్య : సృష్టికర్త అందరికీ సమానమే కదండీ. ఇప్పుడు మానవుడు తన జన్మను తీసుకున్నప్పుడు మంచి కులంలో పుడ్తాడు. చెడ్డకులంలో పుడ్తాడు. హెచ్చు తగ్గుల్లో....

ఆ మాట పూర్తికాకముందే అమ్మ అన్నారు. "కులాల్లో మంచి, చెడ్డలు ఎక్కడున్నాయిలే నాన్నా" అని.

అన్నయ్య : కులాల్లో కాదు అనుకోండి. బీద ఇంట్లో పుట్టాడు. ధనవంతులింట్లో పుట్టాడు.

అమ్మ : అదీ అంతే.

అన్నయ్య : ఆత్మలందరికీ ఒకటే కదండి. ఒకడి ఆత్మ వచ్చిందనుకోండి. వాడి పుట్టుకతో ఈ ఆత్మ ఇంతకు ముందు చేసుకున్న కర్మల బట్టి అంతస్థుల తేడాలో పుట్టొచ్చు. అసలు ఆదిగా పరమాత్మే అంతా అయినప్పుడు ఎందుకు అందరూ సమానంగా ఉండకూడదు?

అమ్మ : నా ఉద్దేశం. వీడు కర్మకు కారకుడు కాదనే - ఆ దైవం ఇట్లా ఇన్ని రకాలుగా ఎందుకు సృష్టించాలనేటప్పటికి బీద, భాగ్యం అనేది కష్టసుఖాలు కావు. అనేక రకాల బాధలున్నాయి. చెప్పుకోవటంలో బీదా భాగ్యమే తీసుకోవచ్చును. ఆరోగ్యం - అనారోగ్యమే కావచ్చు, గుణాల్లో మంచి చెడ్డలు కావచ్చు ఇవన్నీ - ఏదన్నా కానీ, ద్వంద్వం లేకపోతే సృష్టి లేదని ఆగి.....

ఎట్లా అంటే ఒకదాన్ని ఛేదించడానికి ఇంకొక వస్తువు కావద్దూ, ఇక్కడ ఈ వస్తువుంది, (పాదపీఠిని చూపిస్తూ) ఉన్నది కాని దానిని చూడటానికి నేను కావల్సి వచ్చింది. ఉన్నదని గుర్తించటానికి నేను అవసరమయ్యాను కదా. అది ఒకటిగానే ఉంటే నేను లేను. అది చూడటానికి ఎప్పుడైతే ఏర్పడిందో, నేను కావాలనేటప్పటికి రెండు కాలేదూ. వస్తువు వేరు, నేను వేరుగా ఉన్నాము కదా. ఈ వేరు అయినప్పుడే రెండు కాలేదూ, పీట వేరు, పీటను వాడుకుండే వాడు వేరు. పంచభూతాలనుకున్నప్పుడు - ఒకే భూతంగా ఉన్నప్పుడు ఇదంతా లేదు. ఒక భూతం 'అనేక'

భూతాలు ఎప్పుడైతే అయిందో ఒక దానిలోనుండి ఒకటి పంచబడి నప్పుడేగా పంచభూతాలంటున్నాం. ఈ పంచభూతాలు ఎప్పుడైతే విడి విడిగా ఉన్నాయో దానికి తగినట్టు ఒకదాని వెంబడి ఒకటి ఇంకోదాని వెంబడి ఇంకొకటి గుణాలు పుట్టు కొచ్చాయి కదా. గాలిలో మరి చల్లదనం లేదూ.

అన్నయ్య : ఉన్నది.

అమ్మ : జలతత్త్వం కలసి ఉన్నదిగదా. పృథ్విలో మరి అగ్నితత్త్వం. జలతత్త్వం ఉన్నది. ఒక దానిలో ఇంకొకటి లేకుండా ఉంటే ఇదేదీ లేదు.

అన్నయ్య : అన్నింటి మిశ్రమమే ఇది.

అమ్మ : అన్నింటి మిశ్రమమే అయింది. ఒక్క భూమిలో అన్నీ ఉన్నాయికదా. నీటిలో అగ్నితత్వం లేకపోతే నీరు వేడెక్కదు. నిప్పు పెట్టినా వేడెక్కదు. అగ్నితత్వం ఉండబట్టే కాగ గలుగుతుంది. అగ్నికి జలతత్వం ఉండబట్టే చల్లార గలుగుతుంది. ఒక దానిలో ఒకటి, ఇంకో దానిలో ఇంకొకటి ఉన్నది. ఇన్నింటికి కారణమేమిటి అసలు? నిజమే. గుణాలున్నాయి. గుణాలన్నింటికి ఆధారమేది? ఎందుకట్లా కావాల్సివచ్చింది అనేగా ప్రశ్న?

అన్నయ్య : అవును.

అమ్మ : ఈ ప్రశ్న ఎందుకు? ఇదంతా ఇట్లా జరగటం సహజమే అనిపిస్తుంటుందిగాని పుణ్యపాపాలు వీడికున్నాయని నాకు అనిపించదు. వీడు చేసుకోవటమంటూ వీడికి వచ్చేటప్పటికి వీడికి బాగు చేసుకోవాలనే ఉంటుంది కదా. పూర్వజన్మ కర్మప్రకారం వీడికి వచ్చిందనే సిద్ధాంతాన్ని తీసుకున్నా, పూర్వానికి పూర్వం ఉన్నదిగా మరి. ఆ పూర్వంగా వెళ్ళేటప్పటికి మొదటి పూర్వం ఏదో అదే ఈ పూర్వంగా వచ్చింది. కాని మొట్టమొదట వీడికి జన్మే లేనప్పుడు వీడు చేసిన పాపం ఎక్కడుంది?

మొట్టమొదట జన్మలో వీడికి పాపం లేదుగా అసలు – వీడు, ఇచ్చింది చేస్తున్నాడు. తను ఇచ్చింది వీడు చేస్తున్నాడు. ఇంకా వీడికి పాపం ఎక్కడుంది?

అన్నయ్య : మనం చేస్తున్నదంతా దేవుడు చేయిస్తున్నాడనుకున్నప్పుడు మనం ఏదైనా చెయ్యొచ్చు అనే భావం రావొచ్చు కదా?

అమ్మ : వస్తుంది తప్పకుండా వస్తుంది. ఎందుకంటే అటువంటి భావన రావటం సహజమే. ఈ హస్తిమశకాంతరం లేకపోతే జగతీ ప్రగతీ ఈ రెండూ లేవు. ఆ రెండే... చూచేదీ - చూడబడేదీ. అదే హెచ్చు తగ్గుకదా, కాని ఏదైనా వీడు చేయగలడా?

అన్నయ్య : చేయలేడు.

అమ్మ : చూచే వస్తువా. కనపడే వస్తువా రెండు ఉన్నాయి కదూ. ఒకటి ఒకటిగా ఉంటే ఏం లేదు. ఆ ఒకటి ఇంకొకటిగా ఏర్పడినప్పుడు రెండు అయింది. దేనికది సంఖ్య చూసినప్పుడు ఒకటైనది కాని రెండూ కలిపినప్పుడు ఒకటి ఒకటి రెండు అయినది. ఈ రెండు ఏర్పడాల్సి వచ్చింది కనుక భిన్నత్వం అనేది అదే. ఆ రెండే ఈ సృష్టి. ఎందుకనేటప్పటికి సహజమనిపిస్తుంది. కొంతమంది వాడి లీలని, నాటకమని, ఏ పేర్లు పెట్టుకున్నా నాకు మాత్రం ఇదంతా అదేనని, ఒకే శక్తిచే ఇదంతా ఏర్పడిందని, పుణ్యపాపాలు వీడివి కాదని, దేనిచేత జగత్తు ఏర్పడిందో అదే ఇవన్నీ ఏర్పాటు చేసిందని, పుణ్యపాపాలంటే మంచి చెడ్డలనండి, ఇష్టం అయిష్టం అనండి – దాన్నే.... అని అమ్మ చెప్పటం పూర్తిచేశారు. కొన్ని క్షణాలు గడిచాక ఆ అన్నయ్య అన్నారు.

అన్నయ్య : ఇంతమంది ఇక్కడికి ప్రతిరోజూ రావటానికి ఏదో ఆకర్షణ ఉందనుకుంటాను. దానికిఏమంటారు?

అమ్మ : (చిరునవ్వుతో) ఆకర్షణ ప్రత్యేకించి ఏముంటుంది? అమ్మ దగ్గరికి పిల్లలు రావటానికి ఏ ఆకర్షణ కావాలి?

ఆ ప్రత్యుత్తరానికి అన్నయ్య ముఖంలోనే కాదు అక్కడున్న వారందంరి ముఖాలలో నవ్వు తొంగి చూచింది.

వెంటనే అన్నయ్య అన్నారు - అమ్మ దగ్గరికి అందరూ రావాలికదా. అమ్మకు ప్రపంచ మంతా పిల్లలేగా, అందరూ ఏదో ఒక రోజు అమ్మ దగ్గరికి వస్తారా?

అమ్మ : (నవ్వి) అమ్మకు పదిమంది పిల్లలు పుడ్తే ఒకేనాడు పుట్టటం లేదు. మూడేళ్ళకు ఒకదు పుద్తున్నాడు. నాలుగేళ్ళకు ఒకదు పుద్తున్నాడు. తన సంతానం ఆమె పుట్టినప్పటి నుండి ఆమెకు కలుగుతున్నారా? ఆమె కొంతకాలం, తీసుకుంటున్నదిగా. కాలవ్యవధి అవసరమైందికదా. ఈమెకు కలగబోయే సంతానమంతా ఒకనాడే పుట్టటంలేదు. దానికి కొంత కాలపరిమితి ఎట్లా అవసరమైందో ఇక్కడా అట్లాగే అవసరమైనది.

తన సందేహం నివృత్తై, సందేశం అందుకొన్న ఆ అన్నయ్య ఇక మరేం ప్రశ్నించలేదు.

# 103. సుఖదుఃఖాలు

అమ్మ : ఎవర్నీ ఎవరూ కష్టపెట్టరు, సుఖపెట్టరు.

అన్నయ్య : కష్టపెట్టకపోతే సుఖపెట్టినట్లేగద?

అమ్మ : కష్టం సుఖం పడేవిగాని ఒకరు పెట్టేవిగాదు. ఒకరు సుఖపెడుతున్నా దాన్ని తను సక్రమంగా అర్థం చేసుకోలేకపోతే అదే కష్టం అనుకోవచ్చు.

అన్నయ్య : అనుకుంటే అవుతుందా? కష్టము కష్టమే సుఖం సుఖమే

అమ్మ : కష్టమంటే యేమిటో సుఖమంటే యేమిటో ఆ రెంటిరూపాలు యెట్లావుంటయ్యో చెప్పు

భార్యా, భర్త, పిల్లలు, యిల్లు వాకిలి, కోరినగుడ్డ తిండి అన్నీ ఉండటం సుఖం; లోకంలో అనుకుండే సుఖం. ఇందులో యేది తక్కువయినా కష్టమే.

ఒకడికి నువ్వు చెప్పినవన్నీ వున్నై. వాడికి యివన్నీ వద్దనిపిస్తాయి. యే చెట్టు క్రిందన్నా కూర్చుందామను కుంటాడు వాడు. ఆ చెట్టు దొరక్కపోతే దుఃఖపడతాడు. ఒకడికి ఆ చెట్టుగూడవద్దు, యెవ్వరూ లేనిచోటు కావాలను కుంటాడు. వాడికి అది అందకపోతే యేడుస్తాడు. ఒకడు చచ్చిపోవాలనుకుంటాడు, బ్రతికి వున్నానే అని యేడుస్తాడు, అది యేదయినా సరే, "లేనిదానికొరకు ఆశించేది దుఃఖం, వున్నది చాలనుకునేది సుఖం."

అన్నయ్య : ఎంత తేలిగ్గా చెప్పారమ్మా. ఇది నాకంత సరిపోలేదమ్మా.

అమ్మ : ఇప్పుడు నే చెప్పింది అదేగా? నేను చెప్పింది నీకు సరిపోదు. నీవు చెప్పింది ఇంకొకరికి సరిపోదు. ఈ రెండే సుఖదుఃఖాలు.

# 104. ఒడుదుడుకులు

**20-6-66**

బాపట్లలోని "మాతృశ్రీ ముద్రాక్షరశాల" కు ఈ రోజే (20-6-66) అమ్మ ప్రారంభోత్సవం చేసారు. అక్కడనుండి అమ్మ రాగానే ప్రయాణపు బడలిక తీరకముందు స్నానంచేసి కొత్తగా వచ్చిన వారికి దర్శనం ఇచ్చారు. అందులో ఒకరు వాళ్ళ కుటుంబ విషయాలేవో చెప్పి సలహా ఇవ్వమని అడిగారు.

అమ్మ : (నవ్వి) నా సలహా ఏమని ఇవ్వమంటారు? ఆపని చెయ్యమనా చెయ్యొద్దనా ఏమని చెప్పమంటారు?

వారు : మీకు తోచింది.

అమ్మ : నాకు తెలియదు.

వారు : మీరు అట్లా అంటే ఎట్టాగమ్మ, సర్వం తెలుసు మీకు, మీ దయ ఉంటే ఈ ఒడుదుడుకులు ఉండవు.

అమ్మ : (నవ్వుతూ) నా దయఉన్నా ఒడుదుడుకు లుంటాయి. నా దయ ఒడుదుడుకులే నాన్నా.

వారు : (నవ్వుతూ) మీరు అట్లా అంటారు కాని మీ దయ ఉన్నచోట ఏమీ ఉండవు.

అమ్మ : లేదు నాన్నా! దయఉన్నా ఉంటాయి ఒడుదుడుకులు. నేను ఉన్న చోట ఉంటాయి. నా పేరే ఒడుదుడుకులు.

ఇక వారేం మాట్లాడలేక 'మీ అనుగ్రహం కావాలి అంటూ ప్రక్కకు జరిగి కూర్చున్నారు.

# 105. జనక మహారాజు

అమ్మ : సర్వకాల సర్వావస్థలయందు ఒడుదుడుకులు లేకుండ వుండేదే ఆనందం. అగ్నిహోత్రంలో కాలున్నది. ఏమౌతున్నదని దీన్ని గురించి ఆలోచన లేకుండా, తను ఆనందించటం.

శ్రీపాద : ఆనందించే మనసు కొక లక్ష్యం ఉన్నదా?

అమ్మ : ప్రత్యేక లక్ష్యంలేదు. ఇది కావాలి అనేది లేకపోవటమే ఆనందం. వ్యాసులవారు చిలకను చూస్తేనే స్ఖలనమై శుకుడు పుట్టాడనీ తర్వాత శుకుణ్ణి వివాహం చేసుకోమని, జనకమహారాజు దగ్గరకు సలహాకు వెళ్ళమని చెప్పినట్లు వున్నది గదా! జనకమహారాజు తనెట్లావున్నదీ చెప్పలేదు. ఆయనిట్లా ఉన్నాడని వీళ్ళు చెప్పారు.

శ్రీపాద : పోనీయమ్మా జనకమహారాజు ఇప్పుడొచ్చాడు. అప్పుడు పురుషుడుగావున్నాడు ఇప్పుడు స్త్రీగా వున్నది. ఆమాట చెప్పటానికి వచ్చింది. జనకమహారాజును, అమ్మతో పోల్చటమేమిటని అక్కడున్న ఒకరికి సందేహం కలిగింది. వెంటనే అమ్మ అందుకుని 'ఈ మాట చెప్పటానికి వచ్చిన జనకమహారాజు అంటున్నాడు గాని అమ్మ జనకమహారాజని కాదు అబ్బాయన్నది' అని ఆ సందేహాన్ని తీర్చారు.

శ్రీపాద : అంతేనమ్మా.

అమ్మ : జన్మనిచ్చినవాడు జనకమహారాజు. సీత అంటే ప్రకృతి. ఆమెకు జన్మనిచ్చినవాడు. గృహస్థుగావుండి అన్నీ చేసి, ఏమీ అంటకుండ వున్నవాడు. సంప్రదాయ మోక్షాన్వేషణలో, చెప్పినవారేగాని చేసినవారు లేరు. ఆయన ఒక్కడున్నాడు.

పెండ్లిచేసుకున్నా - నోట్లో పటికబెల్లం వేసుకున్నాతీపి అంటనిస్థితి - సంసారంలోవుండి జయించటం.

అమ్మ చెప్పే ఈ సమాధానాలకు వాళ్ళానందిస్తుంటే -

అమ్మ : మాటలతో ఆనందం. ఇదొక ఆట-

# 106. దైవాన్ని స్థాపించడం

**4-6-65**

అమ్మ పంచలో కూర్చునుండగా పెదకళ్ళేపల్లి నుండి వచ్చిన ఒక అన్నయ్య తన ఆస్తి విషయాలను గురించి అడుగుతుంటే – అమ్మ, నాకంట్లాంటివేమి తెలియవునాయనా. మీరొచ్చి నప్పుడు బిడ్డలుగా చూచుకోవటంతప్ప నాకేం తెలియదు:

అన్నయ్య : ఏదో పెద్దలనీ – అడుగుదామనీ.

అమ్మ : నేను మామూలు అమ్మను. పెద్దనుకాను.

అన్నయ్య : దైవాన్ని స్థాపించాలనుకొంటున్నాం.

అమ్మ : దైవాన్ని స్థాపించే వాళ్లం మనం కాదుగా? స్థాపించే శక్తి మనకున్నప్పుడు మనమే దైవాలం.

అన్నయ్య : భగవంతుడు ఏం చేయిస్తే అది చేస్తాను.

అమ్మ : ఏం తోస్తే అది చెయ్యి, తోచేటట్లు చేసేది వాడేగా?

# 107. సైన్సు

ఆ సమయంలో అక్కడే ఉన్న అంబటిపూడి పురుషోత్తంగారు. "సైంటిస్ట్ నేను దైవం అనుకుంటాడు. తను చెప్పినట్టు దైవం వింటాడా?

అమ్మ : వింటాడు. చెప్పమను నేను దైవమని - గట్టిగా చెప్పమను.

అన్నయ్య : నేను దైవమనుకుని చెప్పటంకాదు. ఆత్మశక్తిని గురించి.

అమ్మ : ఆత్మ అంటే? అది అంతటా ఉన్నది. ఆవరించి అంతటా ఉండి శక్తిమయంగా ఉన్నది.

అన్నయ్య : అది తెలుసుకోవటం ఎట్లా?

అమ్మ : తెలియటం అంటూ వస్తే శక్తి రూపేణా తెలుస్తుంది. అని ఆగి శ్రీపాదతో నామరూప రహితుడంటే అక్కడ లేని ఆకారం ఒకటి ఉన్నట్టు. ఏం ఉన్నది అంటే లేని ఆకారమున్నది. మనం చెప్పిదాన్లో చేప్పేభాషలో లోపం ఉన్నది కనకే దీనికీ సైన్సుకి తేడా వచ్చింది. దృష్టిభేదం తప్ప ఉన్నదంతా ఒకటే. పదార్థంలో నుండి చూస్తున్నది సైన్సు. మనస్సునుండి చూస్తున్నది ఆధ్యాత్మికం. కాని ఆ పదార్థంలోకూడా ఈ మనస్సే చూస్తున్నది, వెతుకుతున్నది.

పురుషోత్తంగారు : వాళ్ళు స్వభావం అంటారుకదా?

అమ్మ : మిరపకాయ ఉన్నదనుకో నాన్నా. దానికి కారం స్వభావం. మిరపకాయలో కారాన్ని పెట్టాదని - దాన్ని భగవంతుడనండి, శక్తి అనండీ, మూలం అనండీ, పదార్థం అనండీ, అమ్మ అనండీ, అధ్వాన్నం అనండీ ఏదైనా సరే ఆరిజిన్‌లోవే. - అది ఇచ్చిందని, చేసింది అని అనుకుంటాము.

దాన్నే సైన్సు మిరపకాయకు కారం స్వభావం అంటుంది. ఆ స్వభావాన్నే దైవం అంటాను నేను. ఇప్పుడు నువ్వు ఉన్నావు. సర్వత్రా అమ్మ ఉన్నది. కాని నువ్వు జిల్లెళ్ళ మూడిలో ఈ పరిమితంగా కూర్చున్న అమ్మ దగ్గరికే ఆ శక్తి అనుకుని వస్తున్నావు. కాని అమ్మ సర్వత్రా ఉన్నదని అంతటా చూడటంలేదు. అట్లాగే సైన్సు పదార్థంలోని శక్తిని చూస్తున్నది. కాని ఆ శక్తిని అంతటా చూడలేదూ, ఆశక్తికి దైవం అని పేరు పెట్టలేక పోతున్నారు.

24

# 108. శాసనం

**4-7-65**

బాపట్ల తాశీల్దారుగారి వదినెగారట ఆమె మనుమరాలు రమాదేవి 3 సం॥రాల పిల్ల. ఆ పిల్లకు జబ్బు చేస్తే - తగ్గితే అమ్మ దర్శనం చేసుకుంటామని మొక్కుకున్నారట. జనరల్ హాస్పిటల్‌కు తీసుకెళ్ళామనీ ఒక్కపూటలోనే చేత్తో తీసేసి నట్లుగా పోయిందనీ చెప్పారు.

అమ్మ : దాని కాయుర్దాయముండి తగ్గింది. ఇదే నిజమైతే ఇక్కడ కొచ్చిన వాళ్ళందరికీ పోవద్దూ -

ఆమె : ప్రారబ్ధం ప్రకారం జరుగుతున్నది.

అమ్మ : అంతేనమ్మా. ఏదో వాళ్ళ మాహాత్మ్యం, వీళ్ళ మాహాత్మ్యం అంటారు.

ఆమె : ఏదో - ఆ కొండకు వెళ్తే.....

అమ్మ : ఆ కొండకు వెళ్ళటం నమస్కారం చెయ్యటం శాసనంలోవే.

ఆమె : మేము 5,6 సంవత్సరాలనుంచీ రావాలనుకుంటున్నాం. ఇప్పటికి పడ్డది తల్లీ.

ఆమె : దైవ సంకల్పం.

అమ్మ : సంకల్పం వేరూ, దైవం వేరూ, మనస్సు వేరూ, కాదుగా?

ఆమె : 'అందరూ తరించటానికి (శ్రీరామ, శ్రీకృష్ణ,) ఈ రెండూ ఈ అవతారం దాల్చి వచ్చింది. ఏ అడ్డులేకుండ ఆరోగ్యం బాగుపడేటట్లు చెయ్యమ్మా' అని నమస్కారం చేశారు. అమ్మ వింటూ వూరుకున్నారు.

# 109 నాటకం

**29-5-65**

మధ్యాహ్నం **2-35** ని॥లకు శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు. తను వ్రాసిన వ్యాసాలు అమ్మకు చదివి వినిపిస్తూండగా మధ్యమధ్య వచ్చిన సందర్భాలనుబట్టి –అమ్మ చెప్తున్నారు. "దైవాన్ని నమ్మటం అంటారుగాని, నమ్మకమే దైవమంటాను. బ్రహ్మజ్ఞానం అంటారు. జ్ఞానమే బ్రహ్మ అంటాను. స్వభావమే భగవంతుడంటాను. ఆలోచనలు బ్రెయిన్లకు స్వభావమంటాడు నాస్తికుడు. ఆ స్వభావమే నేను భగవంతుడనుకుంటాను. ఏడుస్తూ అనుభవించేవాడు నవ్వుతూ అనుభవించే వాడి దగ్గరకు వస్తాడు. సంభవామి యుగే, యుగే అంటారు; పాపభారము ఎక్కువై మార్పు చేయటానికి వస్తున్నాడంటారు; తను పెట్టుకున్న నిర్ణయమై పోయి మళ్ళీ వస్తున్నాడంటాను. నాటకం వ్రాశాడనుకో. వాడే పాత్రధారి అయినప్పుడు ఏం జరిగేదీ తనకు తెలిసి నప్పటికీ చూస్తూవూరుకుని తన పాత్రను పోషించటమే జరుగుతుంది.

శ్రీపాద : అవతార మెందుకూ?

అమ్మ : అసలు ఎప్పుడూ వున్నది. అసలును, అసలైనవాడే అర్థం చేసుకుంటాడు. అవతారం ప్రతివాడూ గుర్తించటానికి. ఇది ఎప్పుడైతే అవసరమైనదో లీల అనీ, ఆట అనీ అంటారు. రూపం వచ్చేటప్పటికి బద్ధుడౌతాడు. రూపం ఎప్పుడైతే కావలసి వచ్చిందో నిర్ణయానికి బద్ధుడు కావలసిందే. చీర, రవికె ఉత్తరీయం ధోవతి అన్నీ అవసరమే.

శ్రీపాద : అంతా రామ మయమే అన్నాడు రామదాసు.

అమ్మ : ఈ జగత్తంతా ఆ రామునిచేత ఏర్పడ్డదని. అంతా రామమయ మైనప్పుడు విలపించేదేమున్నది? అంతా రామమయం అనుకున్నప్పుడు నీవు శివుడవో రాముడవో అని నువ్వెవరన్నా గాని నేను ఆ పేరుతోనే ఆరాధిస్తానన్నాడు. గదా?

# 110. వాడి వికారమే

**14-2-69**

నిన్న రాజమండ్రి నుంచి అడ్వకేటు నరసింహారావుగారు, ఆయన భార్యా అత్తగారు అమ్మను దర్శించేందుకు వచ్చారు. వారు అమ్మవద్దకు రావటం ఇదే మొదటిసారి. ఇవ్వాళ సాయంత్రం ఆలయంవద్ద సంధ్యావందనం జరుగుతుండగా, అమ్మ ఒక్కరే తీరుబడిగా వుంటే, అమ్మతో ఏవో మాట్లాడాలని వారు అన్నపూర్ణ (అమ్మ గదిలో వుండే అమ్మాయి) ద్వారా కబురుచేసారు. అమ్మవారిని రమ్మన్నారు.

వీరు ముగ్గురూ లోపలికివచ్చి అమ్మకు నమస్కరించి కూర్చున్నారు. అమ్మ తెల్లచీర ధరించి, పమిట నిండుగా కప్పుకుని మంచంమీద కూచుని ఉన్నారు. కొంతసేపు నిశ్శబ్దం. నరసింహరావుగారి భార్య అమ్మను "తీవ్రంగా వృత్తులు బాధిస్తున్నప్పుడు, శాంతి పడటానికి తరణోపాయం ఏదైనా ఉందామ్మా?" అని అడిగారు.

అమ్మ : శాంతి ఉద్రేకమే. శాంతిగా వున్నప్పుడు నిన్ను ఉద్రేకించాలని నేను ఎంత ప్రయత్నించినా నువ్వు మారవు. ఇరవై నాలుగు గంటల్లో 23 గంటలు మామూలుగా వుండి ఓ గంట బాధపడితే, ఈ 23 గంటలూ గుర్తుండవు. ఆ ఒక గంటా గుర్తుంటుంది. ఉద్రేక పడని కాలం గుర్తుండదు. ఉద్రేకం అంటే ప్రకోపమేగా? ఉద్రేకం పనికిరాదంటున్నాం గనక బాధగా వుంటుంది. బాధా ఉద్రేకమే శాంతీ ఉద్రేకమే. ప్రేమా ఉద్రేకమే.

నిప్పు ఎంత గొప్పదైనా కట్టెలేనప్పుడు మండదుగా.

అక్కయ్య : వృత్తులు ప్రకోపించకుండా ఉండటానికి ఏదైనా మార్గం....

అమ్మ : వాడి కరుణేగాని మనదేం లేదు. ఈ సుందరమైన సృష్టిలో భాగాలన్నీ ఎలాగో ఈ ఉద్రేకాలు కూడా అంతే. ఈ జన్మ నిచ్చినవాడే ఆ ఉద్రేకాలు కూడా ఇస్తున్నాడు.

అసలు మరి ఆకారమే వికారంతో వచ్చింది. వికారం అనేది వాడి వికారమే అనుకుంటా. వాడి వికారమేగాని మన వికారం అంటూ ప్రత్యేకంగా లేదని నా ఉద్దేశం.

అక్కయ్య : అంతా వాడే కదమ్మా?

అమ్మ : తను రెండయి కూచున్నపుడు ఇంక చేసేదేముంది? అది (తనే రెండయినాడని) తోచిన మనసుకి హాయిగా వుంటుంది. తోచని మనసుకి తొట్రుపాటు కలుగుతూ వుంటుంది.

సంస్కారం అనేది వుందని వీళ్ళంటున్నారనుకో, ఆ సంస్కారమైనా వాడిచ్చిందే. సంస్కారం అంటే తొట్రుపాటు లేకుండా వుండటమే. వీళ్ళు చెప్పే పద్ధతిలో ఆలోచించినా, ఏ సంస్కారమైనా వుండాలంటే.... వీడు చేసుకోగలడా తొట్రుపాటు లేకుండా? దైవం ప్రమేయం లేంది, ఏదీ జరగదని శాస్త్రంలో వున్నట్టు అంటున్నారు గదా.

ఒక పిల్లవాడిని పద్ధతిలో పెట్టుకోవటం ఎట్లా వుంటుందో ఈ బోధలు కూడా అట్లాంటివే. ఒరేయ్. అక్కడ బూచి వుంది. పోవద్దు - అని పిల్ల వాడిని భయపెడతాం .... అక్కడ బూచి వుందని కాదు; అట్లా అంటే వీడు పోకుండా వుంటాడని. మీరిందులోంచి బయటపడాలని ప్రయత్నిస్తుంటే నేనిందులోనే వుండాలనుకుంటున్నా.

అక్కయ్య : మీరు మహానుభావులు. అంతా మీరే అయి వున్నప్పుడు ఇంక మీకేమిటి? మాబోటివాళ్ళ సంగతి ..... మామూలుగా చెప్పటం ఏమిటంటే మీరు కృషి చెయ్యాలి, లేకపోతే ఇలాగే జన్మపరంపరలోపడి కొట్టుకుంటారని అంటూ ఉంటారు.

అమ్మ : అంటున్నారు, కాదనను; కృషి చెయ్యండి అంటే, ఎంతో ఆర్తి వున్నవాడు కూడా ఏమీ చెయ్యలేక పోతున్నాడు. ఆసక్తిలేక చెయ్యకపోవటం వేరు ఆసక్తి వుండి కూడా చెయ్యలేకపోవటం వేరు.

నువ్వు చేసేదేం లేదని గీతలో చెప్తూనే వున్నాడు.

# 111. దుష్కర్మ నివారణము

**27-9-64**

ఉదయం పందిళ్ళపల్లి నుండి అచ్యుతుని రామకృష్ణ శర్మగారు, మరో ముగ్గురు అన్నయ్యలు వచ్చారు. ముగ్గురూ ఉపాధ్యాయులే. అందులో ఒకరు ప్రధానోపాధ్యాయులు కామరాజు రాధాకృష్ణమూర్తిగారని లోగడ వచ్చినవారే. తక్కిన వారు నూతనాగతులు, ఒకరు సీనియర్ తెలుగు పండిట్.

వారు భోజనాలు చేసివచ్చి హాల్లో కూర్చున్నారు. చాలాసేపు గడిచాక శర్మగారు అన్నారు వాళ్ళతో "మీకు అమ్మతో మాట్లాడాలని ఉంటే మాట్లాడండి-"

ఆ తెలుగుపండిట్‌గారు కొన్ని నిమిషాలు సందేహించి చివరకు అన్నారు. "కర్మలకు అధారమేమిటి?"

అమ్మ : కర్త.

అన్నయ్య : అయితే మానవులు చేసే దుష్కర్మ సత్కర్మలకు ప్రేరణ ఇచ్చేది కర్తే అంటారా?

అమ్మ : అవును ప్రేరణ ఇచ్చేది కర్తే.

అన్నయ్య : మరి మానవులు దుష్కర్మ చేస్తున్నప్పుడు దుష్కర్మ సత్కర్మలు రెండింటికి కర్తవైన తల్లివి మీరు ఈ బిడ్డల మనస్సులు మార్చి సన్మార్గంలో పెట్టవచ్చుకదా?

అమ్మ : నాకు దుష్కర్మ కనపడితేగా?

అన్నయ్య : (కొన్ని క్షణాల తర్వాత)

మాకు దుష్కర్మలని-సత్కర్మలని భేదం కనిపిస్తున్నది కదా? వాటివల్ల నష్టం అనుభవిస్తున్నాము. మీరు మా మనస్సులు త్రిప్పి అన్నీ సత్కర్మలే చేయిస్తే జగత్తులో యీ సంక్షోభం తప్పుతుంది కదా?

అమ్మ : అవసరమైనప్పుడు తిప్పుతాను.

## 112. ఆట ఆటే

ఆరో, ఏడో ఏళ్ళు ఉంటాయి అరుంధతికి, "దేవుడమ్మను మాట్లాడమను" అని వాళ్ళమ్మను వేధిస్తున్న ఆ అమ్మాయిని అమ్మ దగ్గరగా పిలిచారు. వెంటనే లేచి వచ్చింది.

అమ్మ : తన మంచంమీద ప్రక్కనే కూర్చోపెట్టుకుని అడిగారు "ఆడుకుందామా?"

సంతోషంగా తలూపుతూ అంగీకారం తెలియచేసింది అరుంధతి.

"ఏం ఆట ఆడుకుందాము?"

"బొమ్మలాట, మా ఇంట్లో చాలా బొమ్మలున్నాయి."

అమ్మ : (అక్కడున్న వారిని చూపించి) వీళ్ళంతా నా బొమ్మలు.

అరుంధతి: నాకు చెక్క బొమ్మలున్నాయి.

అమ్మ : ఇవి నాకు చక్కని బొమ్మలు.

అరుంధతి: ఈ బొమ్మలతో నేను ఆడను.

అమ్మ : ఈ బొమ్మలతో ఆట బాగుంటుందమ్మా.

"తెలిసిన ఆటా, తెలియని ఆటా - ఆట ఆటే."

## 113. మాయ

'ఎంత సర్వమూ నీవనుకున్నా మళ్ళీ ఆ మాయ కప్పేస్తుంటుంది.'

"ఆ మాయ వేరే లేదు, యీ మాయే."

"మాయ వేరు కాదుగాని - 'ఆ' 'యీ' అనేవి మాత్రం వేరు."

"అది శబ్దం ఒకటేగా? - ధ్వని వేరు."

'అన్నీ ఒకటే. ఆ ఒకటే అనేకమయిందని అడుగడుగునా చెపుతూనే వున్నావు. ఆ ఒకటే గుర్తుకు రాక అనేక బాధలు పడుతున్నాం.'

# 14. ఏద్దైనా మూలానికే

**6-11-66**

ఉదయం - అమ్మ స్నానం చేస్తున్నారు. అన్నపూర్ణ నీళ్ళు పోస్తూంది. గంగాళంలోని నీళ్ళవంకా వాటిలో పుట్టి అందులోనే అదృశ్యమయ్యే నీటి బుడగలవంకా కాసేపు చూసి అమ్మ అన్నారు అన్నపూర్ణతో "చూడు ఈ బుడగ పోయేటప్పటికి మరొకటి వస్తుంది. పుట్టింది నీళ్ళనుండీ. మళ్ళీ రూపాంతరం చెందేటప్పటికి మొదటిస్థితే ఏర్పడింది, నీళ్ళనుండి పుట్టిన బుడగ నీళ్ళలోనే కలిసిపోయింది. మనం కూడా అంతే నేమో, శరీరాలు పోతాయి కాని ఆ ఉన్న ఒకటీ అట్లాగే ఉంటుంది."

అన్నపూర్ణ నవ్వి చేతిలో ఉన్న వెండిబిందెలోని మిగతా నీళ్ళు అమ్మ ఒంటిమీద పోస్తూ నువ్వు ఏ విషయంలో ఏం చెప్పినా అది మూలానికి వెళ్ళాల్సిందే అన్నది.

అమ్మ : అంతేగా. ఉన్నది ఒకటేగా.

# 115. నువ్వే

ఒకరు : సుషుప్తావస్థలో నేననే భావం నశించటంలేదే?

అమ్మ : నువ్వు సుషుప్తిలో వున్నట్లు నీ కెట్లా తెలుస్తున్నది. శాస్త్ర పరిచయం కాకుండా అనుభవంతో మాట్లాడండి? సుషుప్తిలో వున్నానని జాగ్రత్తలో వుండి చెబుతున్నావు.

ప్రశ్న : అమ్మా! యిన్ని నేనులకు కారణమెవరు?

అమ్మ : ముందు నీ నేనుకు కారణ మెవరో చెప్పు –

ప్రశ్న : అయితే మీ నేనుకు కారణమెవరు?

అమ్మ : నువ్వే.

# 116. అదే కారణము

**14-2-66**

అమ్మ హాల్లో ఉండగా మధ్యాహ్నం ఊరికెళ్ళబోతూ ప్రసాదం తీసుకోవటానికి వచ్చిన అచ్యుతుని రామకృష్ణశర్మగారు హాల్లో జనం ఎక్కువగా లేనందున, అమ్మకు దగ్గరగా కూర్చునే అవకాశం లభించినందున వెంటనే ప్రసాదం అడుగలేదు. అన్నయ్య ఉద్దేశ్యం గ్రహించిన అమ్మ నవ్వుతూ "ఇట్లా కూర్చుంటే నీ బస్సు తప్పిపోతుంది. వెంటనే బయల్దేరటం మంచిది అనుకుంటాను," అన్నారు.

అన్నయ్య కూడా నవ్వుతూ "పోనీయ్ అమ్మా - ఇవ్వాళ కాకపోతే రేపు వెళ్తాను. ఇట్లా మీ దగ్గర కూర్చునే అవకాశం లభించటం నాకు అరుదు కదా-"

అమ్మ : నీ ఇష్టం.

అని ఊరుకున్నారు. కొన్ని నిమిషాల అనంతరం అన్నయ్య అడిగారు "చేయించేవాడు (నేను) చేయిస్తున్నాను అని చెప్పకుండా నువ్వు చెయ్యి అని చెప్పటం దేనికి అమ్మా?"

అమ్మ : దానిలో ఏముందీ?

'నువ్వు చెయ్యి నాన్నా' అని ఎటూ వాడు చెయ్యలేడని తెలిసే చెప్తాడంటే, 'చెయ్యలేవ' ని చెప్పటంలో కంటే చెయ్యమనటంలోనే తేలిక ఉన్నది కనుక. ఎట్లాగూ చెయ్యమన్నా, చెయ్యలేవన్నా వీడికి ఉన్నదే జరుగుతుందని తెలుసు కనుక.

అన్నయ్య : వీడు చెయ్యలేక పోవొచ్చు కాని ఊహ ఉంటుందిగా - నేను చేస్తున్నానని.

అమ్మ : ఆ ఊహ కూడా వీడిది కాదు. అది ప్రతివారికీ స్పష్ట మౌతూనే ఉన్నది. నాకు థాట్ వచ్చిందంటాడు. అది ఎక్కడనుండి వచ్చింది? - అన్న ప్రశ్న వేసుకుంటే అందులోనే అర్థమౌతుంది.

అన్నయ్య : వాంఛారహితం కావాలంటారు. అదేమిటి?

అమ్మ : వాంఛ లేనిదెక్కడ? వాంఛారహితం కావాలంటే దేనితో అవుతుంది? ముందు వాంఛారహితం కావాలన్న వాంఛ కలగాలికదా? అది వాంఛ కాదా?

అన్నయ్య : మేము దేనికీ కర్తలం కాదంటారు – మంచికికానీ చెడుకికానీ?

అమ్మ : అవును, మీరు దేనికీ కర్తలు కారు. ఏం జరిగినా వీటన్నింటికీ ఒకే కారణం కనిపిస్తుంది నాకు. అందుకే ఒక దాని గొప్పతనం, ఇంకోదాని కొద్దితనమూ అంటూ కనిపించదు. ఒక వస్తువు తయారు చేసామన్నా మరొకటి చేసామన్నా దాని మూలం భూమి గుర్తు వస్తుంది. అదే అన్ని ఇవ్వగాలేనిది మనం చెయ్యటంలో విశేషం ఏముందీ?

పదార్థాలూ, వస్తువులూ మార్పు చెయ్యటంలో మన ప్రతిభ ఉన్నదనుకున్నా – అంటే భూమిలోనుండి ఇనుము వచ్చింది కాని అది మనం చెయ్యనిదే బీర్వా కాలేదు ఇట్లాంటి మార్పులలో మన గొప్పతనం ఉన్నదనుకున్నా ఆ భూమిలోనుండి రావటానికి ఏది కారణమో – ఈ తలలో ఆ ఆలోచన కలగటానికీ అదే కారణం అనిపిస్తుంది. చెప్పానుగా కిరసనాయిలు దీపం కనిపెట్టినా విమానం కనిపెట్టినా ఆ రెండూ నాకు ఒకటేనని. నాకు రెండు అనిపించదు. * మనస్సుకే అంత శక్తి ఉన్నది. దాని పని అది చేసుకుపోతూంది. ఆ శక్తికి ఇంత సృష్టి కాగాలేనిది ఇవ్వన్నీ ఏమిటీ? మీరే కర్తలు అనిపిస్తే ఏదీ నేను ఇంతకాలం ఇట్లా ఓపిక పట్టలేను. ఒక్క పారమార్థిక విషయమనే కాదు. అన్ని రంగాల్లోనూ ఓపిక పట్టలేనితనం వస్తుంది – మీరు కర్తలు అనుకుంటే.

ఆ అన్నయ్య "ఇక వెళ్తానమ్మా" అంటూ సెలవు తీసుకున్నారు.

* మనస్సు అంటే ఆలోచన చేయించేది.

# 117. కాలం

అమ్మ హాల్లోకొచ్చి కూర్చున్నారు. లక్ష్మీనారాయణన్నయ్య, రవి, కాత్యాయని, – మేమంతా చుట్టూ కూర్చున్నాం. రాజు వచ్చి కాళ్ళవైపు కూర్చున్నాడు. ఉదయం వచ్చిన కొత్తన్నయ్యలు కూడ వచ్చి కూర్చున్నారు. జనం హాలునిండేరు. కొత్తన్నయ్య తన సందేహాలను అమ్మనడిగి నివృత్తి చేసుకోవాలని అమ్మనడుగుతున్నారు.

కొ.అ. : భగవంతుడివల్లనే మంచీ, చెడూ అనే ఈ రెండు ఏమిటి? అంతా మంచిగా ఎందుకుండకూడదు?

అమ్మ : ఆ భగవంతుడే రెండూను. రెండుగా మనకు కనపడుతున్నై. ఒకటి ఏర్పడటానికి ఏదో, రెండింటికీ అదే.

అన్నయ్య : రెండూ ఒకటేనని తెల్సుకున్నవాడే జ్ఞానా?

అమ్మ : (మౌనం)

అన్నయ్య : అభ్యాసం సాధ్యమయ్యే పద్ధతి ఏమిటి?

అమ్మ : సాధ్యం కావటానికి కాలమే కారణం. దానికేగాదు, అన్నింటికీ. జిల్లెళ్ళ మూడి రావాలని ఇదివరకు ఎన్నిసార్లు అనుకున్నారు? ఇప్పటికి రాగలిగారుగదా! మనం భూమిమీదకు రావటానికి ఏది కారణమో ఆ శక్తే అన్నీ చేయిస్తుంది.

అన్నయ్య : మనస్సు అస్వతంత్రురాలుగా?

అమ్మ : మనస్సు దైవమైనప్పుడు అస్వతంత్రు రాలెట్లా అవుతుంది? ఒకటే చూచే మనస్సు అస్వతంత్రురాలు. రెండుగా లేకపోతే సృష్టి లేదుగా నాన్నా. వ్యష్టిత్వం లేనిదే సృష్టి కాదు....

అన్నయ్య : మనోనాశనం అంటే?

అమ్మ : ఆత్మచేతనే మనస్సు ఏర్పడ్డది. వినాశం లేదు నాన్నా. (జన్మను గురించి ప్రశ్నిస్తుంటే చెప్పారు) తెల్సిన వాడికి జన్మలు లేవు. తెలియనివాడికి ఏది ఏమోతుందో తెలియదు. అసలు జన్మకేది కారణమో అన్ని జన్మలకూ అదే కారణం. దేనికైనా కాలం రావాలి.

అన్నయ్య : కాలం అంటే?

అమ్మ : కాలం అంటే అర్థంకానిది. ఇంతా అంతా అని తెలియనిది, గర్భితం..... అంటూ లోపలికివచ్చేశారు.

నడుస్తుంటే నడక తెలుస్తుందిగాని వెనక్కు ఎంతదూరం పోయినామని తెలియదు. వర్తమానం భవిష్యత్తును గురించి వున్న ఆలోచన భూతకాలాన్ని గురించి వుండదు. ఏదైనా చెయ్యబోయేముందు భయం వుంటుంది. చేసిన తర్వాత భయముండదు. బాధ వుండచ్చూ, సుఖముండచ్చు. సాధనకు నిత్యకృత్యం కంటే కావలసిందేం లేదు. పురాణం వివరిస్తుంది. అది అనుభవం కాదుగా. ఫలానావాడు ఇట్లా అన్నాడు అని, వాడిట్లా అనాలి, అని. మేష్టరే వున్నాడు. ఆయనకు అక్షరజ్ఞానం వున్నది గనుక చెప్పాడు. మీకు లాభం వున్నది అనుకుంటున్నారు గనుక నేర్చుకుంటున్నారు. అంతేగాని, నువ్వనుభవించావా అని మేష్టరుని ప్రశ్నిస్తే ఎట్లా? అనుభవంమీద తెలిసింది నిలుస్తుంది. ఎవరన్నా చెప్తే విన్నదాన్ని బట్టి నమ్మింది ఆ కాసేపే వుంటుంది.

# 118. తరుణం

**19–7–66**

బాపట్లనుండి వచ్చిన వారిలో ఒక వృద్ధురాలు అమ్మను అడిగింది.

"నాకు ఏదన్నా జ్ఞానోపదేశం చెయ్యండమ్మా, చిన్నప్పటినుండి కష్టాలు తప్ప మరేం ఎరగను.

ఏదో అనుభవిద్దామని ఈ సంసారమనే రొంపిలో పడ్డాను కాని అది రొంపి తప్ప అందులో ఏం లేదు. అడుగు తీసి బయటకు వెయ్యటానికి వీలులేకపోతోంది. ఇందులోనుండి బయటకు రావటానికి మీరేదైనా జ్ఞానోపదేశం చెయ్యండి."

అమ్మ : కాలమే చేస్తుంది.

ఆమె : అంతవరకు ఎదురుచూడటమేనా?

అమ్మ : అని అనుకుంటాము కాని చేసేది అదే. నిన్ను ఏ శక్తి ఈ రొంపిలో పడవేసిందో అదే పైకి లాగుతుంది. ఆ సమయం వచ్చేంతవరకు ఇందులో ఉండక తప్పదు.

# 119. అకర్మ, కర్మ

ఆ తర్వాత రాధాకృష్ణమూర్తిగారు ప్రశ్నించారు. "కర్మ - అకర్మ - వికర్మ - అంటే ఏమిటి?"

అమ్మ : నాకు అకర్మ - కర్మ తప్ప మూడోది కనిపించటంలేదు. నాకు సరిగా తెలియదు.

కర్మ కనిపిస్తున్నది. అకర్మ కనిపించదు. ఈ కర్మకు కారణం అకర్మ అనుకుంటాను. ఒక పనిని చెయ్యాలనుకుంటే చెయ్యలేక పోవచ్చు. చెయ్యలేము అనుకుంటే సాధ్యమవచ్చు. అంటే మనని ప్రేరేపించేది కనిపించని శక్తి అనేగా? అది అకర్మ. ప్రేరణను మీరు ఏదైనా అనండి. ప్రారబ్ధం అని కాని భగవంతుడు అని కాని మరేదైనా సరే. లేకపోతే వీటన్నింటికి కారణం మనమే అనండి. అంతా నేనే చేస్తున్నానని కాని, లేదు అంతా మనది కాదు ఏదో ఒక శక్తి చేయిస్తుంది అని కాని అనండి. కొంత మనం, కొంత కాదని అనుకోవటం చిక్కే. ఇందులో ఏదో ఒకటి అనుకుంటే ఫర్వాలేదు.

సంతృప్త మనస్కులైన వాళ్లు ఇంకా మరేం ప్రశ్నించలేదు.

# 120. ప్రేరణ అర్థం కాదు

**19-6-1967**

రాత్రి 8 అవుతూంది. అమ్మ స్నానంచేసి వచ్చి వరండాలో కూర్చున్నారు. శ్రీపాద, భరద్వాజ, రామచంద్రరావుగారు వారి సతీమణి సీతమ్మ గారు అక్కడ ఉన్నారు. సంధ్యావందనం ముగిసి, అక్కయ్యలూ, అన్నయ్యలూ వచ్చి ఒక్కొక్కరే నమస్కరించి అన్నపూర్ణాలయానికి వెళ్తున్నారు.

ఏవో విషయాలమీద సంభాషణ జరుగుతూంది. మధ్యలో రామచంద్రరావుగారు అన్నారు "అంతా ఒకే శక్తి చేయిస్తుంది అనుకుంటున్నా, నేను చేస్తున్నానని ఆ ఆలోచన వస్తుంది కదమ్మా?"

అమ్మ : నీ ప్రశ్నలోనే ఉన్నది సమాధానం. ఆలోచన వస్తుంది అంటున్నావు కాని అది నీది అనటంలేదు. నాకు ఆలోచన కలిగిందంటే అది ఎక్కడనుండో వచ్చినట్లేగా? నేను ఆలోచననే దైవం అంటాను, లేదా శక్తి అంటాను.

శక్తి అంటే - కాదు దైవమంటే - ఇట్లా విడిగా మంచం మీద కూర్చున్నది అని కాదుగా. దైవమనే శక్తి అంతటా ఉన్నది, నాకు థాట్ వచ్చిందంటాడు ఉన్నట్టుండి! ఎక్కడనుండి వచ్చింది? తను మెచ్చుకోలేదు కదా?.... (నువ్వన్న) ఆ భావం తప్పదు నాన్నా. ఉన్నదంతా ఒకటే అనుకున్నా ఆ భావం తప్పదు. ప్రయత్నం కనిపిస్తున్నప్పుడు ప్రేరణ అర్థంకాదు. ఎప్పుడు పూర్ణంగా అనిపిస్తుందంటే రెండు ఉన్నా అది ఒకటే అని తోచినప్పుడు. ఆ భావం ఎప్పుడు కలుగుతుంది? - అంటే ఆ సమయం వచ్చినప్పుడు, మనకు తెలియకుండా వచ్చే పరిణామాలు అనేకం ఉంటాయి నాన్నా.

26

# 121. అదీ ఇదీ అమ్మ దయే

**26-6-65**

అమ్మ స్నానం చేసి తెల్లచీర కట్టుకుని సందు వైపు వాకిట్లో మంచం వేస్తే వచ్చి కూర్చున్నారు. లక్ష్మీనరసమ్మగారూ వర్ధు ప్రసాద్ దగ్గర కూర్చున్నారు. నేను అమ్మదగ్గరకు వెళ్ళేటప్పటికి మధ్యాహ్నం వచ్చిన కొత్త అన్నయ్యలిద్దరు అమ్మదగ్గర కెళ్ళారు. అందులో ఒక అన్నయ్య అమ్మతో – "అమ్మా తృప్తి తీరలేదమ్మా నీ దర్శనం".

అమ్మ : అందుకేగా నాయనా ఉండమంటున్నాను.

అన్నయ్య : నీ దయ తల్లీ ! నీవిచ్చిన అనుజ్ఞ. జపం సవ్యంగా సాగటంలేదమ్మా.

అమ్మ : నీవిదివరకు వచ్చినప్పుడు నెత్తి అణుస్తుందన్నారని చెప్పావు. నీవన్నదానికి నేనన్నాను; అంతే. అమ్మ ఎప్పుడూ నెత్తి అణచదు. అది పిచ్చి అనుమానం. నిన్ను నమ్మినవాడు బాగుపడ్డాడుకదా! నువ్వనుమానాలు పెట్టుకున్నావు.

మరొక అన్నయ్య :నువ్వు తల్లివి. నువ్వు చెప్పకపోతే ఎట్లామ్మా? ఏదో దారి నువ్వే చూపించాలమ్మా.

అమ్మ : తొలే తల్లి. నిన్ను భూమిమీదకు పంపించేటప్పుడే నిర్ణయించి పంపింది. ప్రత్యేకించి దారి చూపించేదేమున్నది?

అన్నయ్య : తల్లీ! నీ దయ. ఎట్లా చేసినా సరే.

అమ్మ : జపం చేస్తే ఏ తల్లి రక్షిస్తుందో, ఆ శక్తే చేయిస్తుంది. అయినప్పుడు ఉన్న అమ్మదయ, కానప్పుడు మాత్రం లేదూ, అయినా, కాకపోయినా అమ్మ దయే.

# 122. అన్నీ అమ్మ ఇచ్చినవే

**9-1-65**

....క్రొత్తగా వచ్చినవాళ్లు అమ్మ దగ్గర ప్రసాదం తీసుకుంటూ ఉండగా అందులో ఒకరు అమ్మతో అన్నారు. "అమ్మా నేను చెప్పలేని ఇబ్బందుల్లో ఉన్నాను."

అమ్మ : నాకేం తెలియదు నాన్నా.

అన్నయ్య : మీకు అన్నీ తెలుసునమ్మా, సర్వం మీరే.

అమ్మ : మీరు అనుకోవటం తప్ప నిజంగా నాకు తెలియదు.

అన్నయ్య : (అమ్మ పాదాలకు నమస్కరిస్తూ) అనుగ్రహమున్నా చాలమ్మా.

అమ్మ : అది ఎప్పుడూ ఉంటుంది నాన్నా. సర్వం ఒకటే అనుకుంటున్నప్పుడు ఈ ఇబ్బందులుకూడా అమ్మ ఇచ్చినవేగా నాన్నా. ఇది అందులోది కాకుండా పోతుందా? పది రూపాయలు చేతిలోకి వచ్చినప్పుడు అమ్మ ఇచ్చింది అనుకుంటున్నప్పుడు ఆ పది రూపాయలు తీసేసినప్పుడు అమ్మ కాదూ?

# 123. అన్నీనాదయవల్లే

అమ్మ మళ్ళీ హాలులోకి వచ్చారు.

ఒక అక్కయ్య : అమ్మా - మీతో మాట్లాడాలమ్మా-

అమ్మ : చెప్పమ్మా. నేనేమీ చేసేది ఉండదు.

అక్కయ్య : ఇంట్లో పరిస్థితులు సరిగాలేవు. కోడలికి వంట్లో సుస్తి.

అమ్మ : నాకివేవీ తెలియవు. చెప్పటం తెలియదు.

అక్కయ్య : మీ దయ ఉంచండి. మీకు తెలియక పోవటమేమిటి?

అమ్మ : ఇవన్నీ నా దయ వల్లే. ఈ ఇబ్బందులూ కష్టాలూ అన్నీ నా దయవల్లే.

అక్కయ్య : అయ్యో - అయ్యో - తొలగించమ్మా.....

అమ్మ : నాకవసరమని తోచిననాడు తొలగిస్తా.

# 124. ఇచ్చేది నేనే

బాలయ్య: దేవతాస్వరూపం అనుకుంటూ ఆవును పూజచెయ్యరనుకో. ఆవులో దేవుడు కనపడదుగా. ఆవును దేవతని ఎట్లా అనుకుంటారు?

అమ్మ : ఎందుకనుకోవటంలా? గో సంరక్షణచేసేవాళ్ళు గోవును దేవత అనుకోకపోతే ఎట్లా చేస్తున్నారు? వ్యవసాయం చేసేవాళ్ళు భూమిని దేవత అనుకోవటం లేదూ? దేనిలో వాళ్లు దానినే ప్రేమిస్తారు.

బాలయ్య: అయితే నువ్వు చెప్పేది మేము అందుకోలేక పోతున్నాము. వాటిలో నిన్ను చూడలేకపోతున్నాం.

అమ్మ : నువ్వు దేనిని పూర్తిగా ప్రేమిస్తున్నావ్?

బాలయ్య: నిన్నే.

అమ్మ : అదీ పూర్తిగా లేదంటున్నాను. ఇచ్చేది నేనే కనుక

బాలయ్య: అంత మాత్రం చాలమ్మా. (ఆనందంగా నమస్కరించాడు).

# 125. జగత్తే మాత

**18-3-64**

మధ్యాహ్నం స్నానంచేసి అమ్మ హాల్లోకి వచ్చి కూర్చున్నారు. గుంటూరునుండి, అమరావతి నుండి వచ్చారు కొంతమంది. అందులో అమరావతినుండి వచ్చిన ఒక సోదరుడు అమ్మవంక కొన్ని క్షణాలుచూసి అన్నారు.

"అమ్మ అనే పదానికి డెఫినిషన్ ఏమిటమ్మా?"

అమ్మ : నా ఉద్దేశం అంతులేనిది.

అన్నయ్య : జగన్మాత అంటారు. అంటే జగత్తుకు తల్లి అనా?

అమ్మ : జగత్తుకు తల్లికాదు జగత్తే తల్లి. ఆధారమైనది. అంతులేనిది అన్నాను అంటే నాన్నా ఇప్పుడు పూలు ఉన్నాయి. వాటిని మాలగ్రుచ్చటానికి దారము ఆధారం. ఆ పూలకు కొమ్మ, ఆ కొమ్మకు చెట్టు, ఆ చెట్టుకు భూమి ఆధారం. దీనికి అంతు ఏముంది? సర్వానికి సర్వమూ ఆధారం. ఎక్కడికక్కడే అన్నిటికీ అన్నీ ఆధారమే.

అన్నయ్య : జగన్మాతని వర్షిప్ చెయ్యాలంటే అచంచలమైన మనస్సు ఉండాలి కదమ్మా. అది ఎట్లా సాధ్యమౌతుంది?

అమ్మ : ముందు ఈ వర్షిప్ చెయ్యటానికి ప్రేరణ ఏది కలిగించిందో అదే చేస్తుంది.

అన్నయ్య : మానవులు చంచల స్వభావులు కదమ్మా!

అమ్మ : ఈ చంచల స్వభావంకూడా.... .... అందులోదే కదా. జగన్మాత అమ్మే.అన్నీ అమ్మే అనుకుంటున్నప్పుడు ఇక ఇందులో నీ ప్రమేయము ఏముంది? చంచల స్వరూపంగా ఉన్న అమ్మ ఎప్పుడో అచంచలంగా చేసుకుంటుంది. మామూలు ఈ నామాల్లో కూడా అన్నారే చపలాయై నమః, చంచలాయై నమః.

# 126. ఎవరు అనిపించారు?

అమ్మ వెనుక గదిలో పడుకుని వుండగా సుబ్బయ్య వచ్చి బయటనుంచుని - అమ్మా, నిన్ను చూడాలమ్మా అని అడిగాడు.

అమ్మ : కిటికీలోనుంచి చూడు.

సుబ్బయ్య: చూడకూడదు గదమ్మా.

అమ్మ : నే రమ్మన్నాను గనకరా.

"ఆర్డరు" అన్నాడు రామకృష్ణన్నయ్య.

గోపాలన్నయ్య అందుకొని 'ఎవరు?' అన్నారు.

రామకృష్ణ: సుబ్బయ్య.

గోపాల్ : సుబ్బయ్యగారా?

రామకృష్ణ: అంతకంటే ఎవరూ ఆర్డరు పాలించేది?

అంతలో అమ్మ అందుకుని 'ఆర్డరు ఎవరు' అన్నారు.

సుబ్బయ్య: నరుడే నారాయణుడు, నారాయణుడే నరుడు.

అమ్మ : అబ్బో, ఎవరు?

సుబ్బయ్య: నరులలో వున్నవాడే.

అమ్మ : దానికి సాక్ష్యమో!

సుబ్బయ్య: ఇంతకంటే సాక్ష్యం ఏం కావాలి? (అని అమ్మను చూపించారు).

రామకృష్ణ: ఈ మాట సుబ్బయ్య అన్నదిగా లేదు.

అమ్మ : నవ్వుతూ ఎవరో అనిపించిందిగా వున్నదా?

రామ : ఆс ...... ....

# 127. నేను

రాత్రిపూట అమ్మ స్నానంచేసి వచ్చి వరండాలో మంచం వేస్తే వచ్చి పడుకున్నారు. సింగుపాలెం చంద్రమ్మక్కయ్య, గజేంద్రమ్మక్కయ్య, నేనూ అక్కడ కూర్చున్నాం.

"నేనైన నేను అనే ఒక ఫొటో వున్నది చూశారా?" అన్నారు.

"నేనైన నేను. నీవైన నేను, తెలుసుకుంటున్న నేను, అంటారే - అదేమిటమ్మా?' అని వారు అడిగితే -

అమ్మ : 'నీవైన నేను' అంటే - (నన్ను - చూస్తూ) నన్ను ఆరాధనగా పెట్టుకున్నావు. నాలో కలవటం - నీవైన నేను. అదే జ్ఞానం.

నేనైన నేను : ఆ ధ్యానంలో పెట్టుకొన్న మూర్తిని తనలో చూచి అంతటా చూడటం. అంతా నేనుగా కనిపించటం.

తెలుసుకుంటున్న నేను : నీలో కలవటానికి సాధనం చెయ్యటం. సాధన చెయ్యటం - తెలుసుకుంటున్న నేను. ఆ సాధన సిద్ధించింది జ్ఞానం.

నేనైన నేను - భగవంతుడు.

అని గోడవైపు తిరిగి పడుకున్నారు.

# 128. జ్ఞానమూ భక్తీ

**27-9-64**

అన్నయ్య : అశేషమైన జ్ఞానం పఠన శ్రవణాదులవలన కలుగుతుందా? భక్తివలన కలుగుతుందా?

అమ్మ : ఇందులో ఏది చెయ్యాలన్నా అవకాశం ఉండాలి కదా. మనము చెయ్యాలనుకుంటే చెయ్యగలమా? ఉద్దేశం ఉండి అవకాశాలు లేక చెయ్యలేకపోవొచ్చు. అన్ని అవకాశాలూ కలిగి ఉన్నా మనస్సు ఉండకపోవొచ్చు. సమయం వస్తే ఇవేవీ లేకపోయినా కలగవచ్చు. వేమన ఏం చేసి ఆవిధంగా అయ్యాడు?

అసలు అశేషమైన జ్ఞానమంటే మీ అభిప్రాయం ఏమిటీ?

అన్నయ్య : అశేషమైన జ్ఞానమంటే భగవంతుడిని తెలుసుకోవటము. ఆ సన్నిధి చేరటము అని నా అభిప్రాయము.

అమ్మ : తెలుసుకున్న తర్వాత ఇంకా ఏముంది? జ్ఞానము పొందటమే కాని జ్ఞానం వలన పొందేది ఏమీ లేదు.

అన్నయ్య : ఆ జ్ఞానం పొందడం పఠన శ్రవణాదులవలననా? లేక భక్తివలననా? ఈ రెండింటిలో సుగమమైన మార్గమేది?

అమ్మ : ఇందులో ఏది సాధ్యమైనా ఒకటే. పఠనమంటే నేను జపమనుకుంటాను.

అన్నయ్య : అది కాదు. శాస్త్రగ్రంథాదుల పఠనమని నా ఉద్దేశం.

అమ్మ : శాస్త్రగ్రంథాదుల పఠనమైనా అనేకమయిన నామాలను మనసులో ఉంచుకుని చదవటం, జపమంటే ఒక నామాన్ని పదే పదే చదవటం. ఇందులో ఉద్దేశం ఒకటే కాని ఆ గ్రంథాదుల పఠనమయినా పూర్తిగా చెయ్యగలమా - అని.

అన్నయ్య : అవును, చెయ్యలేము. దానికి మన జీవిత ఆయుస్సు పరిమితి సరిపోదు. మీరు చెప్పిన తర్వాత నాకు అదే అనిపిస్తుంది - ఏదీ మనం చెయ్యలేమని.

అమ్మ : అన్నీ చేయించే శక్తి చేయించేవరకూ అంతే.

27

మీకు ఉద్దేశం ఉండొచ్చు. కాని బడి - ఉద్యోగం కనుక అవకాశం ఉండదు. ఆయనకు (రామకృష్ణ శర్మగారికి) అవకాశమున్నది. అది పారాయణ చెయ్యటానికీ, నలుగురికి పురాణం చెప్పటానికీ, మీకు, పిల్లలకు చదువు చెప్పటమే ఇవన్నీ. ఇది మీరు మానవ సంబంధమైనది కాని దైవ సంబంధమైనది కాదు అనుకుంటున్నారు కనుక ఈ బాధంతా.

శర్మగారు : అయితే చేస్తున్నదంతా దైవానిదే అనుకోమంటారు?

అమ్మ : అనుకుంటే ఇంకా ఏముందీ? అనుకోవటం లేదు కనుకే. రాముడు భగవంతుడు, సర్వవ్యాపి అనుకుంటాము కాని నమస్కరించే సమయానికి రాముడు ఒక్కడికే పెడ్తున్నాము. వాడే అన్నీ అనుకుని - ప్రక్కనున్న వసిష్ఠులవారికి, లక్ష్మణ - శత్రుఘ్నులకు పెట్టటంలేదు. ఎందుకూ?

శర్మగారు : వాడు ఆకర్షిస్తున్నాడు. అంతేకాక వాడికి ప్రత్యేకత ఉన్నది.

అమ్మ : అయినా వాడు ఆకర్షిస్తున్నాడని మనం అనుకుంటున్నామా అదీ అనుకోవటం లేదు. నేను వాడ్ని ధ్యానం చేస్తున్నాను అని అనుకుంటాము కాని నా చేతులు వాడు లాక్కుంటున్నాడని అనుకుంటామా?

రాఘవయ్యగారు : పూర్ణభక్తికి జ్ఞానానికి తేడా ఏమిటమ్మా?

అమ్మ : పూర్ణభక్తి అంటే ఏమిటీ?

రాఘవయ్యగారు : ప్రతిదీ అమ్మ అనుగ్రహముచే జరుగుతుంది. సర్వభారాలు అమ్మమీద ఉంచి నడవటమే. ఇది మనోవాక్కాయ కర్మలతో జరిగిన రోజు అని నా అభిప్రాయం.

అమ్మ : వడ్లగింజ ఒకటున్నది నాన్నా. అది చూడగానే అన్నము అనుకుంటు న్నామా? ఎన్ని చేస్తే ఆ రూపము అన్నం రూపములోకి పరిణామం చెందుతుంది? వడ్లను విసరాలి - అందులో పొట్టూ - చిట్టూ అన్నీ వేరు చెయ్యాలి. బియ్యం రాగానే పూర్తికాదుగా? అవి వండటానికి పొయ్యి కావాలి, దాన్లోకి కట్టెలు కావాలి, పాత్రలు కావాలి, వండేవాళ్ళు కావాలి, ఇవన్నీ సమకూడితేకాని అన్నం కాదు. అప్పుడు కదా మనం అన్నం అనుకుంటాము? అలాగే పూర్ణభక్తి. ఆ విధంగా కలిగినరోజున పూర్ణభక్తికి జ్ఞానానికి తేడా ఏమిటో నాకు తెలియదు.

# 129. వేదాంతము సంగతి

4-9-1963

గతరాత్రి వచ్చారు ఒంగోలు దగ్గరున్న ఒక పల్లెటూరునుండి ఒక యోగిని, ఆమె శిష్య బృందం. వారు ఈ ఉదయం అమ్మకు పూజచేసి తీర్థప్రసాదాలు తీసుకున్నాక వారిని అమ్మ భోజనానికి వెళ్ళమన్నారు. రాత్రి వారేం తినలేదు. అందుకని ఈ పూటైనా త్వరగా భోజనం చెయ్యమని ఒకటికి రెండుసార్లు అన్నారు.

అందులో ఒకరు "ఇప్పుడేం తొందరలెండి, మీరేదైనా చెప్తే వినాలని ఉన్నదండి" అన్నారు.

అమ్మ : (నవ్వి) నేనేం చెప్తాను నాయనా, మీకు ఇది ముఖ్యమైతే నాకు అది ముఖ్యం. భోజనం చేసి వచ్చి ఎంతసేపైనా మాటాడండి.

కాని వారు వెళ్ళలేదు, కాసేపు గడిచాక,

అమ్మ : సరే మీ ఇష్టం, మాట్లాడితే మాట్లాడండి.

ఆవిధంగానైనా త్వరగా వారు భోజనానికి వెళ్తారని. ఈ సారి యోగిని ప్రశ్నించింది.

యోగిని : నువ్వూ – నేనూ అనే భేదం ఉన్నది కదూ?

అమ్మ : అవును.

యోగిని : జ్ఞానప్రాప్తి ఏవిధంగా కలుగుతుంది?

అమ్మ : నాకు తెలియదమ్మా.

యోగిని : మీరు అట్లా అంటే ఎట్లా? మావంటి అజ్ఞానులకు అన్నీ తెలిసిన మీరు చెప్పాలికదా. మేము ఇదే యదార్థ మనుకుంటున్నాము. కాని దీనికి అతీతము ఏదో ఉన్నదంటున్నారు. వేదాంతంలో ఉన్నది అదేకదా!

అమ్మ : (చిరునవ్వుతో) మీరు అద్వైనా అనుకుంటున్నారు. నేను అదీ అనుకోవటంలేదు. ఇదే నేను యదార్థము అనుకుంటున్నాను. ఇందాకటినుండి నా ఆలోచన, నా తాపత్రయం మీరు భోజనం చేస్తే బాగుండును అని. నేను మాట్లాడితే బాగుండును అని మీ తాపత్రయం. ఏమిటో! కనీసం దీనికి (ప్రపంచానికి) అతీతము ఉన్నదను కుంటున్నారు. నేను అదీ అనుకోవటం లేదు. వేదాంతమంటే చెప్పేవాడికి - వినేవాడికి అర్థంగాదు. నాకు వ్యక్తపరచే భాష లేదు. మీకు అనుభవించే శక్తి లేదు.

ఇక వారు ఏం ప్రశ్నించలేదు, వారిని అమ్మ భోజనానికి వెళ్ళమనగానే వెళ్ళారు.

# 130. వేదాంతమంటే?

**6-3-64**

వారంరోజుల క్రిందట అడుసుమిల్లి నుండి ఒక పదేళ్ళకుర్రాడు ఇంట్లో చెప్పకుండా అమ్మ దగ్గరకు వచ్చాడు. అమ్మ లాలనగా ఆ అబ్బాయి నుండి ఆ విషయం తెలుసుకుని వాళ్ళ పెద్దవాళ్ళు కంగారుపడ్తారని నెమ్మదిగా బుజ్జగించి పంపించారు. ఆ తరువాత ఆ అబ్బాయి తండ్రి, మేనమామ వచ్చారు.

అందులో ఒక అన్నయ్య అమ్మని అడిగారు "అమ్మా, వేదాంత సంబంధమైన మంచి విషయాలు ఏవైనా చెప్పండి. జ్ఞానామృతము గురించి కాని భక్తీ, యోగం గురించికాని. అన్నీ తెలిసినవారు మీరు, మేము పామరులము."

అమ్మ : నాకు మీరు పామరులు అనిపించడం లేదు నాన్నా.

అన్నయ్య : కాదు తల్లీ చాలా అవివేకులము. అన్ని విషయాలు మీరే మాకు తెలియచెప్పాలి.

అమ్మ : అవివేకులు అని కూడా అనిపించరు నాన్నా. ఎటూ అవివేకులకు చెప్పినా అర్థంగాదు. వివేకులకు చెప్పేది లేదు. అవసరంలేదు కూడా. వేదాంతము గురించి ఎన్నో పుస్తకాలు చదువుతున్నాము, ఎన్నో వింటున్నాము.

అన్నయ్య : ఆ విన్నదాన్ని ఆచరించాలని.

అమ్మ : ఆచరించటము మన చేతుల్లో ఉన్నదా ఎప్పుడు ఏది తోస్తే అది చెయ్యడమే. మనకు అర్థంకాని శక్తి ఏదో ఒకటి ఉన్నదిగా? కాని మనకు అర్థంకాని శక్తి ఏదో ఉండి పని చేయిస్తున్నా మనం చేస్తున్నాము కనుక నేను అనుకోక తప్పదు. మనని నడిపించేది వేతే ఏదో ఉన్నా మన కాళ్ళు నడుస్తున్నాయి. కనుక మనం నడుస్తున్నాము అనుకోక తప్పదు.

అన్నయ్య : ఆ అర్థంకానిది కలిమాయ.

అమ్మ : మీ ఇష్టం. కలిమాయ అనండి, ప్రకృతి అనండి, భగవంతుడు అనండి. పేర్లు వేరైనా ఉన్నది ఒకటే. చూడు నాయనా, వాడు (వాళ్ళబ్బాయి) ఆ రోజు ఎవరు చెప్తే అట్లా వచ్చాడు? నన్ను చూస్తూనే చాలా సేపు పెద్దగా ఏడ్చాడు. ఇక్కడ మామూలు అమ్మే కాని ఇంకా విశేషం ఏం లేదు కదా? "నిన్ను వదిలి పెట్టి వెళ్ళాలనిపించడము లేదమ్మా, ఇక్కడే ఉంటాను, అన్నాడు. ఇక్కడ ఏం విశేషం చూసి అన్నాడు? ఏ బోధనలు విని ఏ సాధనలు చేసి వాడు ఇక్కడకు వచ్చాడు? అంతే; ఎవరి సంస్కారం వాళ్ళది. వాడి సంస్కారం అది.

అన్నయ్య : వేదాంతం అంటే ఏమిటమ్మా.

అమ్మ : ఇటు చెప్పేవాడికి, అటు వినేవాడికి తెలియనిదే వేదాంతం.

అన్నయ్య : అది ఎట్లా తెలుసుకోవటము?

అమ్మ : అదే తెలియబడుతుంది. ఒక వస్తువున్నది. అది చూస్తే చెప్పే అవసరము లేదనుకో. లేకపోతే పోల్చి చెప్పినా దాన్ని చూసినట్టుగా అనుభవింప చెయ్యలేముకదా. ఆ చూసినదాన్ని భాషతో చిత్రీకరించి మీకు చెప్పాలి. అది మీమీ స్థాయినిబట్టి అర్థం చేసుకుంటారు. ఉన్నది ఉన్నట్టు ఎవరూ అర్థం చేసుకోలేరు. శాస్త్రాలు చదివిచెప్పినా అప్పుడు ప్రకరణం చెప్పటము. ప్రకరణం అంటే యోగము. యోగమంటే ఒక పద్ధతిలో నడుచుకోవటమనేగా. అయినా నాకు చెప్పటం రాదు నాన్నా, ఏదో పిల్లలు వస్తే పలకరించటము – భోంచేశారా – అని అడగటం తప్ప మరేమీ తెలియదు నాకు. వేదాంతం అంతటా ఉన్నది. ఎక్కడదాకో వెళ్ళ నవసరం లేదు. మీరు చేస్తున్న పనిలో, సేవలోనే ఉన్నది.

(వారు అంతకుముందే మీరు ఏం చేస్తుంటారు అన్న అమ్మ ప్రశ్నకు ఆయుర్వేద వైద్యం చేస్తుంటామని చెప్పారు.)

రోగి వ్యాధి నయమైంది అని తను అనుకోవటం కంటే మీకు ఆ వ్యాధికి మూలకారణమేమిటో తెలుసు కనుక అది నిశ్శేషంగా నివారణ చెయ్యటమే వేదాంతము. ఇది వేదాంతం కాదా? ఇందులో మన ధర్మం ఇమిడి లేదా?

# మామాట

దేశకాలాలకు అతీతమైన మహాతేజస్విని అమ్మ. ప్రేమయొక్క సర్వాంగసౌందర్యం అమ్మ మాటల్లో, చేతల్లో ప్రకాశిస్తున్నది. లోకానికి ప్రేమఫలాన్ని పంచిపెట్టిన వాత్సల్య మూర్తి అమ్మ. ఆ పండు రుచికొత్తది. ఆ పంచేతీరు మరీ కొత్తది. అమ్మను చూడడమే ఒక లోకోత్తరమైన అనుభవం. ఆ అమ్మమాటలు వింటే, ఆ మాటల్లోని భావాన్ని గ్రహిస్తే ఆనందం అనే పదానికి అర్థం అనుభవంలో తెలిసినట్లే.

విజ్ఞానఖని అమ్మ అలవోకగా పలికే పలుకులు అద్వైత భావానికి పరాకాష్ఠ. అమ్మకు అన్ని మతాలు సరిపోతాయి. జడచేతన భేదమే అమ్మకు లేదు. "అనుభవిస్తున్న దంతా సుఖమే. కాలమే అన్నింటికి కర్త. అన్నీ అంతా దైవమే – శక్తే. సుఖదుఃఖాలు రెండూ కరుణవల్లనే. ఈ కనబడుతున్న విశ్వం అనేకంగా కనిపించినా, ఒకటిగా అనిపించడమే "ఆత్మసాక్షాత్కారం". నామం చేసినా, జపం చేసినా, యోగమైనా, తపస్సైనా తృప్తికోసమే చేస్తాడు. సర్వత్రానిండిన స్వార్థమే పరమార్థం. అదే రమణమహర్షి చెప్పిన "నేను"ను తెలుసుకోవడం. దైవానికి ప్రత్యేకంగా రూపం లేదు. ఎంత వెతికినా కనిపించనివాడు దైవం. ఆ వెతకటం కోసం చేసేసాధన, ఆత్మపడే తపనవల్లనే ఆత్మావలోకన అనుభవంలోకి వస్తుంది. ఎవరిష్టదైవాన్ని వారికిష్టమైన చోట చూసుకోవడంలో తప్పులేదు. జగత్తు సత్యమే. నాకు అందరూ బిడ్డలే ఇదీ స్థూలంగా అమ్మ బోధ.

శ్రీ వీరమాచనేని ప్రసాదరావుగారు, కీ॥శే॥ డాక్టరు శ్రీపాదగోపాలకృష్ణమూర్తిగారు, అమ్మతో సంభాషించి, దానిని "టేప్" చేసి సోదరీ సోదరుల ఉపయోగం కోసం ప్రచురణకు సిద్ధం చేసారు. వారికినీ, ఈ సంభాషణలను అతిశ్రమతో టేపులనుండి అక్షరాకృతిని కల్పించిన శ్రీ గరుడాద్రి సుబ్రహ్మణ్యం గారికినీ మా కృతజ్ఞతలు.

ఈ అపూర్వమైన సంభాషణలు చదివి, అమ్మసన్నిధి సుఖాన్ని అమ్మ బిడ్డలందరూ పొందగలరని ఆకాంక్ష.

– ప్రకాశకులు

# విషయసూచిక - రెండవ భాగము





# అమ్మతో సంభాషణలు

## రెండవ భాగము

డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు, శ్రీ వీరమాచనేని ప్రసాదరావు గారు **6-7-76** న అమ్మతో సంభాషించారు.

అమ్మ : ఈ చెప్పేది ముందు నమ్ముతారా! నమ్మరా? ఎవరైనా ఆచరిస్తారా? - ఆచరించరా? ఈ సిద్ధాంతం ప్రపంచవ్యాప్తి అవుతుందా? కాదా? అనేటటువంటి అభిప్రాయం లేనేలేదు. తోచిందీ, అనిపించిందీ, దృఢ పడ్డదీ, సందేహంలేనిదీ అనుమానాలు రానిదీ, అనుభవమంటే. అటు వంటివారి సందేశమే సందేశం. మళ్ళీ వాళ్ళకు ఆలోచన - వేరే ఆలోచన - రానిది. సందేహాలు నివృత్తి అయినటువంటి మాట ఏదైతే వుందో అదే సందేశం.

వీ.ప్ర : కాని, అమ్మ చెప్పేది పరమసత్యం, తాత్త్విక చింతనకు పరాకాష్ఠ అని మేము అనుకొని వ్రాస్తున్నాం. అయితే ఈ వ్రాసేటప్పుడు సమకాలీన పరిస్థితులనూ, ఉన్నటువంటి మిగతా సూత్రాల్నీ తెగనాడాలని ఉద్దేశ్యం కాదు. వాటిని పరిశీలించవలసిన అవసరం మాత్రం కలుగుతుంది. తెగనాడాలనీ కాదు. అవి తక్కువనీ కాదు. సాపేక్షంగా అవి సత్యమేకాని అవి చెప్పేటప్పుడు మరియు ఇతరరకాలైన అభిప్రాయాలకు తావిస్తుందా అంటే ఏమీ లేనటువంటి పలకమీద వ్రాయడం కాదు.

కొన్ని సిద్ధాంతాలు వ్యాప్తిలో ఉన్నాయి. వానికి భిన్నంగా ఇది కన్పిస్తుంది. వ్రాసేటప్పుడు సమాధానం చెప్పు కోవలసిన అవసరం కూడ ఉంటుంది. ఎందుకంటే, మేము ఏదయితే పూర్తి సత్యమనుకుంటున్నామో - దాన్ని చెప్పేటప్పుడు మిగతా వాటిని - ఇదిగో వాటి పరిస్థితి ఇది అని ఎత్తి చూపించ వలసిన అవసరం ఉంటుంది. వాళ్ళు నమ్ముతారా లేదా అని లేదు. మాకు సత్యమని తోచినదానిని వ్రాసే టప్పుడుకూడ దానిని ఇతరులు

ఏమనుకుంటారో అనే భావన ఏమీ లేదు. ఒకరు ఘాటుగా చెప్పవచ్చు. ఇంకొకరు మెత్తగా చెప్పవచ్చు. మరొకరు ఇంకామెత్తగా చెప్పవచ్చు... కాని, ఒక నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించినపుడు ఖండన మండనలు తప్పవు.

శ్రీపాద : మాట వారు అంటారా దానికి సమాధానం చెప్పాలి.

వీ.ప్ర : ఎందుకంటే, క్రొత్తగా సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నారు కాబట్టి ఇదివరకు ఇలాంటిది లేదనుకుంటున్నారు కాబట్టి దానిని ఎత్తి చూపించవలసిన అవసరముంది. మార్క్స్ తన సిద్ధాంతాన్ని ప్రతిపాదించేటప్పుడు - అప్పటిదాకా ఉన్నటువంటి వాటిని - వానిలో ఉన్న మంచిచెడ్డలను తన దృష్టితో విమర్శించడం జరిగింది. విమర్శించాలనే దృష్టి కాదు. దీనియొక్క సత్యాన్ని నిరూపించాలంటే తారతమ్యంగా పోల్చి చూపడం అవసరం. అది చేయడం తప్పు కాదను కుంటాను. ఊరకే - మంచి విను - మంచి ఆచరించు - మంచిగా పలుకు - మంచిగా వుండు అని ఎంత కాలం చెప్పినా ఈ మంచినుంచి వచ్చే మంచి మాత్రం కనిపించడం లేదు, చెప్పే మంచి తప్ప.

అమ్మ : ఎప్పుడైనా ఆ రెండూ మంచేను. మంచీ చెడూ వాడేను - అని చెప్పే ఈ అమ్మ ప్రతిపాదన వాళ్ళకు సందేహాన్ని కల్పించవచ్చు.

వీ.ప్ర : కన్పించింది కాబట్టి తప్పుగా చెబుతున్నటువంటి భావన మాత్రం రాకూడదు.

అమ్మ : అందుకే ఒకరు ఏమనుకుంటారో అని లేదు. వారు చెప్పింది అంతా మనమెంత ఆచరించగలిగామో? జనం ఎంత ఆచరిస్తున్నారో? నేను నిన్న రాత్రి అడిగే వున్నాను.

ఈ సిద్ధాంతంగాని, ఈ చరిత్రగాని ఇదంతా బయటికి తీసుకొచ్చి నందువల్ల ప్రయోజన మేమైనా వుందా?

వీ.ప్ర : ఉన్నది.

అమ్మ : ఉందా అని అడిగాను. ఉన్నది అన్నారు మీరు. వుంటే, వాళ్ళను ఎత్తి చూపుతున్నారు అనేది మీదృష్టిలో అనిపిస్తుంది కాని, నాకు మీరు వాళ్ళ నెట్లా తీసుకున్నా – వాళ్ళు చెప్పేది నాకు సరిపోవచ్చు. ఒకడికి కందిపచ్చడి ఇష్టం. ఇంకొకడికి అల్లంపచ్చడి ఇష్టం. వాడికది ఇష్టం. వీడికిది ఇష్టం – అని నేను తృప్తిపడవచ్చు. అందరికి తలొకటి ఇష్టం. ఇన్ని ఇష్టాలు దేనికీ అంటే ఆ ఒక్క అన్నం కోసమే. పదార్థంలో కలిసి పోవడానికేగదా. మీకు వాడికంటే, ఈ ప్రతిపాదనలో – ఆనందం, సత్యం కనపడుతున్నాయి.

శ్రీపాద : ఆనందం మాట అటుంచండి. సత్యం కన్పిస్తున్నది. అందుకే దిగాము.

వీ.ప్ర : మంచీ, చెడూ అదే – అనగలగటం వల్లనే.

శ్రీపాద : బాగుండడం అఖ్ఖర్లే. సత్యం కన్పిస్తే చాలు.

వీ.ప్ర : చెడుకూడ అదే అనేటటువంటి విషయం చెప్పేటప్పుడు – చెడుకూడ అదే ఎలా అవుతుంది? అని పహజంగా వాళ్ళు భ్రమపడడమో ఆశ్చర్యపడడమో జరుగుతుంది.

అమ్మ : చెడు అంటే ఒకటి రెండుగా ఉండడ మనేగా.

వీ.ప్ర : వాళ్ళ వుద్దేశ్యం చెడు అన్నది, ప్రత్యేకంగా మంచి నుంచి భిన్నంగా ఉందని.

అమ్మ : వాళ్ళనుకున్న కట్టుబాట్లకు భిన్నంగా ఉన్నది చెడు.

శ్రీపాద : అంతే నమ్మా – అంతే.

అమ్మ : మనం కొన్ని కట్టుబాట్లను పెట్టుకున్నాం. దానికి భిన్నంగా నడిచింది – చెడు. అంతే కాని రెండు లేవు గదా! అందుకే రాత్రి చెప్పాను – ఒక్క పోగుగా ఉన్న ఒక దారాన్ని మధ్యలో పట్టుకుంటే రెండుగా కనిపిస్తాయి. ఆ రెండూ కలిపి చివరలో ముడివేస్తే ఒకటిగా కనిపిస్తాయి. కాని ఆముడి వేయకపోతే అటువంటిదే ఈ రెండుగా కనిపించడం. ఈ రెండూ ఆ ఒక వస్తువే అని చెప్పాను.

వీ.ప్ర : ఆ పెద్ద మనుషులే ఇంకొకటికూడ అడిగారు – అంతా అదే అయినప్పుడు, అంతా చరిత్రబద్ధమైనప్పుడు అంతా నిర్ణయబద్ధమైనప్పుడు మీరు ఎందుకు

దానిని గురించి ప్రచారం చెయ్యటం? అని - ఈ ప్రచారంకూడ నిర్ణయ బద్ధమే. మీరిలా కత్తికట్టి ఎందుకు చెబుతున్నారు? ఈ కత్తి పట్టడంకూడ అందులోదే. అంటే చరిత్రబద్ధమే - నియతిలో భాగమే ఇది. (వారికి) వీరు నోరు మూసుకుని వుండటమే చెయ్యాలి.

శ్రీపాద : వారి ఉద్దేశ మేమి టంటే వారి ఇష్ట మొచ్చినట్లు వారు చెబుతూ ఉండవచ్చు. వారు మాకిచ్చేది మినహాయింపు. అతనికి తోచిన అభిప్రాయం వ్రాస్తున్నాడు చెప్పేదేమిటో చూడరేమి అని? దాన్ని ముక్కలు క్రింద కొట్టండి. వీడెవడు మధ్యని? వీడు కలం పారేస్తే నష్ట మేముంది? ఒక గోపాల కృష్ణమూర్తిని తగుల్కొండి మీరు. ఏమిటి ఇలా అన్నావు? ఏమిటి పెద్దమనిషి? నీకు ఎలా అర్థమైంది? ఎందుకంటు న్నావు? ఎన్ని గుండెలతో అంటున్నావు? - అని అడగండి. అట్లా రారేమి? ఇట్లాగా కాబట్టి చెప్పేది ఇదంతా నిజం. కాబట్టి బుర్రకు కన్నంపెట్టి పోసేందుకు ప్రయత్నంచెయ్యలా. ఇదిగో ఈ కారణంచేత ఇది కన్పిస్తున్నది. ఇట్లా అమ్మ చెబుతున్నారు అంటున్నాను.

అమ్మ : భయంలేదు. వ్రాసెయ్యొచ్చు.
అమ్మ చెప్పిందని నాదగ్గరకు వస్తారుగా.

శ్రీపాద : అంతే. వాళ్ళు అడిగారుగదా. ఆయన జన్మలు లేవని అంటా రండీ. దంచిపారేస్తున్నారు. ఆయనకు మీరేమైనా చెప్పారా? సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, నరసింహయోగిగారు, మరొకరు మరొకరు ఇలా అడుగు తుంటారు.

అమ్మ : నేనే చెప్పానన్నాను.

శ్రీపాద : అవునమ్మా. ఆయన - గోపాలకృష్ణమూర్తి ఏమో - జన్మలు లేవని దంచిపారేస్తున్నారు. నిజమా? ఆయన సొంత మంటున్నారా? ఆ ముక్క మీరంటున్నారా? అని. అందు కమ్మన్నారూ 'నే జెప్పిందే అంటాడు. వేరే ముక్కలు ఏమీ అనడు నాన్నా' అని. ఒకటిలెండి. అక్కడ తగాదాకి

రారు. అంటే ఆపద్ధతి వేరు. ఆమె బాగా లౌక్యంగా ఉంటుంది. నేను సమాన స్థాయిలో మాట్లాడుతాను. వాడు కోప్పడితే నేనూ కోప్పడుతాను. ఇక్కడ (అమ్మ దగ్గర) కోపం, గీపం ఏమీ లేవు. నరాలకు ఇంజక్షను ఇచ్చి వేస్తారమ్మ. ఇక వాడొప్పుకోవలసిందే. ఇది అందరికీ చేతనవు తుందా?

వీ.ప్ర : చేతకాకనే ఈ బాధ.

అమ్మ : రాత్రి ఆమె (భాగ్యమ్మగారు) – రెడ్డిపాలెం కాంతయ్యగారి ఆశ్రమవాసిని అన్నారుగా "నీవు చెప్పిన రీతిలో సమిష్ఠికర్మ తప్ప వ్యష్ఠికర్మలే" దని.

శ్రీపాద : ఆ! ఆ! చాలా గొప్ప మాట. అటువంటప్పుడు వ్యక్తిలేదు.

వీ.ప్ర : వ్యక్తి ఏమిటి? జీవాత్మే లేదు.

శ్రీపాద : ఒక బుర్రలో ఉన్న మనస్సే లేదు – లోకమంతా ఉన్నదే.

వీ.ప్ర : సమష్టిగా ఉన్న ఆత్మే చిన్న ముక్కగా ఇక్కడ ప్రతిబింబించింది తప్ప వేరే ప్రత్యేకంగా దీనికి అస్తిత్వం లేదు – వ్యష్టిత్వం లేదు.

శ్రీపాద : ప్రతిబింబం అన్నారు. అదే ఇక్కడ పని చేస్తుంది. చెర్లోని నీళ్లేనా మొత్తం!

అమ్మ : కాని – మాటలుగా మనము ఎన్నన్నా – దేనికీ దడవకుండా వ్రాయడం మంచిది. హస్తమస్తకం ....మస్తకం ... పుస్తకం...పుస్తకం మస్తకం మనసులో కెక్కేకంటే పుస్తకమ్మీద ఎక్కించడమే ఉత్తమం.

వీ.ప్ర : పుస్తకంద్వారా స్తోత్ర రూపంలో వ్రాసిన రాధాకృష్ణశర్మగారు వాటిని గురించి....

అమ్మ : ఆయన ఎక్కడా జన్మల గురించి ఎత్తలేదు.

వీ.ప్ర : అవిద్యాయై నమః అని వ్రాశారు.

అమ్మ : వ్రాశారు.

వీ.ప్ర : అవిద్యకూడ అదే అనేటువంటిదిగా వ్రాయలేదు. ఏదో వ్రాశామని కాదు. ఆచరణలో నమ్మినటువంటిది, తన కనుభవమైనటువంటిది వ్రాయాలి. వాస్తవంగా తనకు గోచరించేవి వ్రాయాలి.

అమ్మ : కాలాన్ని ....

శ్రీపాద : జన్మరూప నిజస్తనాంచిత చారుజీవపయస్వినీం, మృత్యురూప కుచాంత రామృత నిత్యశాంతి విధాయినీం - అంటే జన్మ ఉందనా? లేదనా? ఎట్లా వ్రాశాడూ?

వీ.ప్ర : అలా వ్రాస్తే ఉపయోగం లేదు.

అమ్మ : జన్మరూప నిజస్తనాంచిత చారుజీవపయస్వినీం, మృత్యురూప కుచాంత రామృత నిత్యశాంతి విధాయినీం-వాడి ఏడుపు రెండింటికీ మధ్యనే. ఏ ఒకటి తెలిసినా ఏడుపులేదు. రెండూ రెండుగా కనబడితే ఏడుపు. ఇవి రెండూ ఒకటిగా కనబడటం జరుగుతుందనీ జరిగినపుడు తృప్తి వస్తుందనీ తృప్తి కోసం రకరకాలుగా ప్రయత్నం చేస్తాడు. రెండుగా కనిపిస్తుందిగాని అసలు ఒకటే అని తెలుసుకోవడం కన్న తృప్తికి మరో మార్గంలేదు. అది తృప్తికన్న ఎక్కువదని అది నిశ్రేయసమని అంటారు.

శ్రీపాద : ఇది ఏదారైనా తృప్తికి దారి చేస్తుంది గనక మంచిదే.

అమ్మ : నామం చెయ్యి, జపం చెయ్యి, యోగం చెయ్యి, తపస్సు చెయ్యి నీఇష్టమొచ్చినది చెయ్యి.

శ్రీపాద : నీకు తృప్తి నిచ్చేది.

వీ.ప్ర : వారు చెప్పారని చేస్తే వచ్చే దేమీలేదు. - తనకు కలిగితేనే.

శ్రీపాద : తనకు శాంతి నిచ్చేది.

వీ.ప్ర : అందుకని సాధన అని చెప్పబడేదాని మూలంగా, డ్రిల్లు చేయడం మూలంగా వచ్చే దేమీలేదు.

అమ్మ : అయితే నేను సారాయి త్రాగుతాను. రోజూ ఇది చాలునా అని అడుగుతారు.

శ్రీపాద : సారాయి త్రాగితే ఆనందం పొందలేదు.

అమ్మ : ఇరువది నాలుగు గంటలు సారాయి త్రాగితే ఆనందం మరచిపోతాడు. లేవలేని స్థితి వస్తుంది. కాని హాయిగా ఉందని చేస్తే అది చేయవచ్చు.

శ్రీపాద : చేయగలిగితే.

అమ్మ : పుణ్యం పాపం లేదంటారు. ఖూనీలు చేయమంటారా? ఎవరినైనా చంపి రమ్మంటారా? తప్పకుండా. కత్తి నేనే ఇస్తా – చంపి రండి.

శ్రీపాద : చెప్పబడినటువంటిది సాధన.

వీ.ప్ర : చెప్పారు కాబట్టి చేస్తే దానివల్ల వచ్చే ఫలితం లేదు. డ్రిల్లు చేసినందువల్ల వచ్చే ఫలితమేమీ లేదు.

శ్రీపాద : నోరు తీపి అవాలంటే పంచదారరవ్వలు ఒకటి తరువాత ఒకటి వేసుకోవాలి. ఇన్ని వేసుకున్నా తీపిఅవడమే. శాంతి ఇస్తేనే వాడికి సాధన.

వీ.ప్ర : అందువల్లే అమ్మ ఈ సాధన చెయ్యి అని చెప్పక పోవడం

అమ్మ : ఏమార్గాన నడిచినా వాడే నడిపిస్తున్నాడను కోవడమే సన్మార్గం

శ్రీపాద : ఉత్తమ మార్గమని

అమ్మ : నేనే నడుస్తున్నాను అనుకొనటమూ సన్మార్గమే. అన్ని వేళల్లో నీవుతప్ప ఇంకొకటి లేదు–అనుకోవటం కూడా సన్మార్గమే.

శ్రీపాద : చివరకు వాడు అటు తిరుగుతాడు. ఏదో నడుపు తున్నది – అన్న దగ్గరకు వస్తాడు.

అమ్మ : అంతా నేనైనపుడు బాగానే ఉంటుంది. అంతా స్వార్థం కావాలిగదా! నే చెప్పిన సర్వత్రా స్వార్థమే పరమార్థం. అంతా స్వార్థమైనపుడు పరమార్థమే.

శ్రీపాద : వ్యతిరేకమైనాకానీ, అది స్వార్థంలోకి అన్వయించుకోవాలి.

వీ.ప్ర : నాఅవసరం కోసమే. ఈకష్టాలు నాబాగుకోసమే వచ్చాయేమో – అనే భావం అనిపించాలి.

అమ్మ : అన్ని వేళల్లో.

శ్రీపాద : ఆ చర్చలు పత్రికల్లో ఒకటి రెండు బాగా పడాలి. ప్రతిసారీ రెండైనా పట్టికెళ్ళితే బాగుంటుంది.

అమ్మ : (ప్రక్కన వున్న సోదరునితో) పత్రికకు వ్యాసమిచ్చావా?

శ్రీపాద : .... .... నరసింహం ఇక్కడికి రాలేదన్న మాట.

వీ.ప్ర : దారిలోనే ఉన్నాడు.

శ్రీపాద : రమ్మనండి.

వీడేమో ఆవిడ చెప్పిన మాటలు వాటికేమో మసిపూసి చెబుతున్నాడు, వాళ్లేమో దానికి రంగు పూసి వజ్రలేపనం చేసి చెబుదామని రావచ్చుగదా! మేము బాగుచేస్తాం. అతను మార్పు చేస్తున్నాడు. అతను సైన్సు చదువుకున్నాడు. నేను సంప్రదాయ మెరిగినవాణ్ణి – నేను చేస్తాను, అని తాను రావచ్చుగదా?

వీ.ప్ర : నాలుగు మాటలు చదువుకున్న ప్రతివాడూ సాంప్రదాయకుడా?

అమ్మ : సంప్రదాయమనే పేరు దాని కెందుకు పెట్టారు?

శ్రీపాద : పదిమంది చెప్పి చేశారు. ఇలా చెయ్యి ఇలా చెయ్యి - అని.

వీ.ప్ర : పరంపరగా వస్తున్నటువంటిదాన్ని సంప్రదాయ మంటారు.

అమ్మ : సంప్రదాయమంటే పరంపరా?

శ్రీపాద : పరంపరగా వచ్చిన ఆచారమని. కేవలం పదిమంది చెయ్యటం వల్ల మాత్రమే బలం కూర్చుకున్నది సంప్రదాయమేమో!

వీ.ప్ర : మనం సంప్రదాయమనేది హిందీలో పరంపర అంటారు. ఇదే – మార్పు అవసరం లేదు – అనేంత వరకు చెప్పబడేది సంప్రదాయం. ఈనాడు తోస్తున్న అర్థమిది.

శ్రీపాద : మాట్లాడుతుంటే ఈ వెర్రిగోల. ఇటునుంచీ వస్తారు, అటునుంచీ వస్తారు. ఎక్కడ వీళ్ళకు శాంతి వస్తుంది? శాంతి ఎట్లా వస్తుంది? ఒకదారిలో పోరే! ఏమిటి వీళ్ళది అనిపించిందమ్మా నాకు. భాగ్యమ్మ గారు మాట్లాడుతుంటే–

అమ్మ : ఆమె వచ్చిన తర్వాత ఇవన్నీ కూర్చి మాట్లాడాను కదూ. తేలు, గేదె, పాము ఈ సంభాషణ ఇట్లా అనుకున్నాను, అట్లా అనుకున్నాను – ఎవరి కర్మ ఇది? ఈ వివరణలో సమష్టికర్మ తప్ప వ్యక్తి కర్మ లేదని ఆమె తేల్చుకుంది. అది నిలవటం కష్టం నాన్నా! ఈ సమయానికి ఇది ఆనంద పరచిందే కాని నిలవదు.

శ్రీపాద : ఉన్నదంతా అదే. అనుకోవటం లేదు గాని అటు వైపు జరగాలనే ప్రయత్నం. ఈ వేళ కాకపోతే రేపయినా మారి తీరుతుందని, మారగలదని అనుకొంటున్నాను.

వీ.ప్ర : సత్యం బహుముఖాలుగ ఉంటుందని వారి కర్థం కావటం లేదమ్మా. మీరెంతయినా చెప్పండి. ఆ ద్వంద్వాలతో కూడినదే ఈ సత్యం. ద్వంద్వాతీతమైన దంటారే తప్ప ఇది తెలుసు కోలేరు.

శ్రీపాద : అతీతం అతీతం. ఒకటో, రెండో దానిలో ఉదాహరణలు చెప్తారు. (అతీతమనే పదానికి) తెలియనివాడు, తెలిసినవాడు, తెలియదని తెలుసుకున్న వాడు, తెలుసునని తెలుసుకున్న వాడు - ఒకడున్నాడు కాబట్టి వాడు ద్వంద్వాతీతుడు అని.... తెలియనివాడు ద్వంద్వాతీతుడు అని పేర్లు పెడుతున్నారు.

తెలియదనికూడా తెలుసుకుంటున్నాడుగా!

అమ్మ : తెలియని స్థితి- అని పేరు పెట్టారు వారు.

శ్రీపాద : రెండు అయిన స్థితిని - అది మాత్రమే కాదు - ఇది మాత్రమే కాదు.

వీ.ప్ర : రెండింటినీ అధిగమించిన స్థితిని అతీతస్థితి అని శాస్త్రకారులు అర్థం చెబుతున్నారు.

శ్రీపాద : రూఢిగా అర్థం చెబుతున్నారు.

వీ.ప్ర : రెండు అయిన స్థితిని (అతీతం) మనం అనుకుంటున్నాం. కాని వాళ్ళు చెప్పే రూఢమైన అర్థ మేమిటండీ – రెండింటినీ అధిగమించిన స్థితిని -

అమ్మ : వాక్యాల్లో ఒకదాని కొకటి సంబంధం లేకుండ ఉన్నవి ఏమైనా ఉంటే - తీసెయ్యి.

వీ.ప్ర : బయటికి విరుద్ధంగా కనిపించినా - వివిధ సందర్భాలలో, వివిధ రూపాలలో చెప్పారు తప్ప.

శ్రీపాద : దానికి వ్యతిరేకంగా ఉన్నట్లుంటే ఉంచడం లేదు.

అమ్మ : అనుమానముంటే నా దగ్గరకొచ్చి అడగండి.

శ్రీపాద : అలాగే, పరిశీలన చేసిపెట్టుకోవచ్చు.

వీ.ప్ర : ఇందాకన్నది జిడ్డు కృష్ణమూర్తిగారు. అదమ్మా అనేది 'ఏ రకమైనటువంటి అభిప్రాయాన్ని ఎత్తుకొని వెతికితే, అభిప్రాయ మంటే గతమే. కాల బద్ధమే. కాలాన్ని అనుసరించ నటువంటిది ఏదీ సత్యాన్ని చూడలేదు. కాబట్టి ఏ రకమైన అభిప్రాయం పెట్టుకోకుండ అమ్మను చూదాం. ఈ అభిప్రాయం, ఆ అభిప్రాయమని కాదు. అప్పుడు పూర్తిగా ఏదైతే ఆకళించుకుంటుందో అదే. ఒక అభిప్రాయం పెట్టుకొని మాత్రం దేనినీ పరిశీలించకు. సంప్రదాయాన్ని కాని ఇంకొకదాన్ని కాని, ఏరకమైన అభిప్రాయం పెట్టుకున్నా సత్యం గోచరం కాదు. సత్యాన్ని చూడలేవు అని చెప్తాడాయన. అది ఒకటి. రెండవది ' ఆ రకమైన వీక్షణ ఏది అయితే వుందోఅదిAction అంటాడు. చెడుకూడ ఉందని గుర్తించడమే చెడును పోగొట్టుకోవడం-చెడును పోగొట్టు కోవాలని దానికి ప్రతిక్రియగా ఏది వచ్చినా, వచ్చినటువంటిది ఏదీ కూడ చెడును పోగొట్టలేదు. ఇంకొకదాన్ని తీసుకొస్తుంది?

అమ్మ : ఆయన అభిప్రాయం అక్కడట్లా అనడానికి చెడు ఉన్నదని తెలుసు కోవటమంటే జ్ఞానోదయమయి నట్లేను అని - సూర్యుడు వస్తేచీకటి లేనట్టు - అట్లాగే అజ్ఞానం ఉన్నదని అర్థమైతే జ్ఞానమే గోచరిస్తుందని. జ్ఞానమే ఉంటుందని మనమేమంటున్నా మంటే చీకటే వెలుతురుకు ఆధారమని. వెలుగువస్తే చీకటి లేదనుకుంటున్నారు మీరు. జ్ఞానా జ్ఞానాలు రెండూ అదే అంటున్నాను నేను. నిన్న భాగ్యమ్మ గారు అధ్యాత్మిక రామాయణంలో ఒక కీర్తన చెప్పింది. అందులో సత్యవాణి, శార్వాణి, అలివేణి, నీరజపాణి అని ఒక పాట ఉంది. అందులో వస్తుందేమో అనుకుంటా. ఎన్ని ఆమెకు పేర్లు!

శ్రీపాద : చాలా పేర్లు పెట్టారు.

## 27-4-76

అమ్మ : నేను ఈ జన్మలో వాడికి చేసింది తెలియదుగదా పూర్వజన్మలో చేసింది గుర్తులేదు. అందువల్లనే చేసింది అనుభవాని కొస్తున్నది. ఎవరూ కారణం కాదు. చెప్పడానికి సులభ మార్గం. తీసివేయ వలసింది కాదది.

వీ.ప్ర : ఓదార్పుకోసం చెప్పిందేనమ్మా.

అమ్మ : అంటే కర్తవ్యం, వ్యక్తిత్వం రెండూలేవు గనక చెప్పారేమోనని నా అభిప్రాయం.

శ్రీపాద : కర్తవ్యం ఇస్తున్నారుగదా! నీవు చేసుకున్నదే నీ వనుభవిస్తున్నా వని కర్తవ్యమిస్తున్నారు.

అమ్మ : కర్మ దగ్గర, అనుభవం దగ్గర ఏడ్చేవాడికి చెప్పేమాట.

శ్రీపాద : అవునమ్మా!

అమ్మ : మంచిపనిచేస్తూ, ఆ మనుష్యుని మనసు మరల్చి-వచ్చే జన్మలో మంచిపని చేయించడం కోసం చెప్పినమాట.

శ్రీపాద : Russel అని ఇంగ్లీషు Philosopher ఉన్నాడమ్మా! ఆయనంటాడూ, 'ప్రకృతి సూత్రాలంటూ కాని ఒక నియమమంటూ కాని ఒక పద్ధతంటూ కాని లేవు. ఊరికే నాలుగు మామిడిచెట్లు ఈ దారిలో ఉన్నాయని - మీరు ఎట్లా, ఉన్నా యేమో అనుకొవడం తప్ప Law లేదని - దానిమీద ఏవో ఘటనలు వింటుంటే, దానిమీద ఏవో కనుక్కొంటున్నారు. ప్రకృతిలో ఒక పద్ధతి, ఒక క్రమము ఏమీలేదా అని మాకు సందేహం.

అమ్మ : జరుగుతున్నదే క్రమం. క్రమమంటే ప్రత్యేకించి క్రమ మేముంది చెట్లు, చేమలు, తెల్లవారటం, ప్రొద్దుగూకటం, ఈసృష్టి అంతా, ఇవన్నీ క్రమమే కదా. క్రమంగానే జరుగు తున్నాయి. జరిగేదే చెబుతున్నా.

శ్రీపాద : భౌతిక సూత్రాల ప్రకారం జరగవచ్చు. వేరేఒక పెద్ద తెలివి ఉండి నడపనక్కర్లా - నడుపుకుంటూ ఉండనక్కర్లేదని Russel అంటాడు.

అమ్మ : అన్నీ తను అనుకున్నట్లు జరిగితే ఆమాట అనడానికి అవకాశముంది. చంద్రుణ్ణి రాత్రిపూట రాకుండా జేసి, పౌర్ణమినాడు చంద్రుణ్ణి రాకుండా జేసి, అమావాస్యనాడు చీకటి లేకుండాజేసి, కొండలు, కోనలు చెట్లూ చేమలు లేకుండాచేసి తననుకున్నది జరుపగలిగితే....

శ్రీపాద : ఇప్పుడు చేయలేదుగాని ముందు ముందు చేయగలుగుతాము. Atom Bomb ఉంది. Hydrogen Bomb ఉంది. Hydrogen Bomb తో కొడితే జవజవలాడి పోతుంది. చంద్రుడు పున్నమినాడు అక్కడికిరాడు. రావాలనుకుంటే ముక్కలవుతాడు. గతిమాలి కొంచెం ఆలస్యంగా వస్తాడు. లెక్కవేస్తే అంతకంటె త్వరగానూ వస్తాడు.

అమ్మ : ఒక మనిషి పుట్టాడు. తుపాకితో కాలిస్తే చస్తాడు. చచ్చినంత మాత్రం చేతనే క్రమం లేదా! ఒక చోట ఉన్నవాడు ముక్కలవు తున్నాడు. ఒకదాని చేత మరొకటి భిన్నం అవడమనేది ఏర్పడేవుంది. అదేసృష్టి. అదే క్రమపద్ధతి. పుట్టినవాడు గిట్టటం క్రమమేకదా! ఈ పుట్టిన మనిషిని చంపకుండా ఉండేది ఏదయినా ఉందా? అంటే లేదు. వాడి సమయం వస్తే వాడు పోతూనేవున్నాడు.

శ్రీపాద : ఇప్పటికిలేదు. ముందు ముందు....

అమ్మ : ఉంటుందేమో తెలియదు.

శ్రీపాద : చేయగలుగుతామేమో అన్న ఉద్దేశ్యం తోటి డాక్టర్లం పని చేస్తున్నాం.

అమ్మ : నేననుకోవటం మనచేతుల్లో లేదు అని, నాఅనుభవాల రీత్యా నాకు తెలియని శక్తి ఉన్నట్లు తెలుస్తున్నది. ఆ atom చేత ఆ చంద్రుని ముక్కలు చేయగలిగిన శక్తి ఏదయితే ఉందో, ఆ atom కనిపెట్టిన శక్తి ఏదయితే ఉందో అదియే క్రమ పద్ధతిగా నడుస్తున్నదని నానమ్మకం.

శ్రీపాద : ఆపద్ధతిలో క్రమం ఏది ఉన్నట్లుగా చూపించాలి? Russel విధానం చదివిన వారికి చూపించాలి క్రమమని ఆసక్తిగా. ఉంది.

అమ్మ : ఏ క్రమం లేదని అక్కడ ఆమాటఅని ఊరుకున్నారా? క్రియా రూపేణా ...Authority గా చూపించారా.

శ్రీపాద : లేదు అనడానికి క్రియా రూపేణా ఉన్నది. ఉన్నది అనడానికి క్రియా రూపేణా చూపించాలి తప్ప... ఉంటే చూపించండి అంటున్నాడు.

అమ్మ : ఉంటే చూపించడానికి ఇది క్రమమే అనుకుంటున్నాను.

వీ.ప్ర : ఆయన చెప్పిందీ సౌరమండలం దృష్ట్యా ఇదిగో ఇన్ని రోజులకు, ఇన్ని గంటలకు భూమి తన చుట్టూ పరిభ్రమణం చేస్తున్నది. ఒక సంవత్సరానికి తనచుట్టూ తాను తిరుగుతున్నది. ఇది క్రమంగానే కనిపిస్తుంది. ఉన్నదానినే మీరు క్రమముంటున్నారు తప్ప నియమమనేది లేదు. ప్రకృతిలో లేదు కేవలం దాన్ని మీరు క్రమమంటున్నారు. అంతేకాని, ప్రకృతిలో యాదృచ్ఛికత తప్ప, దీన్ని నడిపించేటటువంటి క్రమమున్నట్టుగా – ఉన్నదాన్నే, లేకపోతే క్రమమంటున్నారు తప్ప క్రమమనేది లేదేమోనని ఆయన సందేహం. డాక్టరు గారన్నట్లు అడవి వుంది అడవిలో చెట్లున్నాయి. చెట్లనుచూచి ఒక విధమైన క్రమము ఏర్పరచు కున్నారు తప్ప ప్రకృతి సహజం కాదు. యాదృచ్ఛికమే. ఘటనలు ఎక్కడికక్కడ యాదృచ్ఛికంగానే ఉన్నాయి.

అమ్మ : మార్పు ఉండవచ్చు. మార్పుకూడ క్రమములో భాగమేనని నేననుకుంటాను.

శ్రీపాద : నేనొకటనుకుంటున్నా నమ్మా. నీరు గడ్డకట్టినప్పుడు నీరు మంచైనప్పుడు మంచుగడ్డ నీటికంటె తేలిక గనక నీటిమీద తేలిపోతుంది. అలాగే ఈ ప్రాణి సముదాయం వచ్చింది. కనుక ముందు రాబోయే ప్రాణి సముదాయం మునిగిపోతే చచ్చిపోతుంది. కనుక తేలి – తీరాలి అని నీటిని ఘనీభవించి నప్పుడు తేలేటట్లు చేసేదొకటి ఉందని – అంతా ఏర్పాటు చేసిన Tonic లాంటిది ఒకటి ఉందేమోనని నేననుకుంటున్నా.

వీ.ప్ర : అది నిలవదు. ఎందుకంటే అనేక గ్రహాలలో ఈ రకమైన పరిస్థితులు లేవు. ఉన్న పరిస్థితినే క్రమమని మీరంటున్నారు. ఉన్న పరిస్థితికి వెనకాల

ఏదో మహాశక్తి ఉందని వారంటున్నారు. దీనిని క్రమమని వారొప్పుకోక పోవడానికి సావకాశం లేదు. ఎందుకంటే ఇతర అనేక రకాలైన గ్రహాలలో ఈ రకమైన పరిణామం చెందదానికి వీలైన జీవులులేవ్? ఉన్నదనడానికి మీవూహ అని చెప్పవచ్చు.

అమ్మ : ఊహించటానికి ఒక శక్తి కావలసివచ్చింది ఆశక్తినే మనస్సు అంటాను. మనసంటే ఏశక్తి అని అడిగితే, ఆలోచించే శక్తి, ఒకడికి కాదు అనిపించే శక్తి, ఒకడిదగ్గర అవును అనిపించే శక్తి ఆ మనస్సే ఒకరి దగ్గర ఉన్న మనసు క్రమ పద్ధతిగా నడుస్తున్నది అనిపించింది - ఇంకొకరి దగ్గర ఉన్న మనస్సు ఇంకొక విధంగా అనిపించింది. ఈ అందరికీ ఊహించ టానికి, ఆలోచించదానికి - ఏర్పరచిన ఏ మనస్సైతే ఉందో అలా ఆలోచించగల శక్తి క్రమము అని నేననుకుంటున్నా.

శ్రీపాద : ఏశక్తిఅయితే ఉందో, ఆశక్తేఇవన్నీ అయి ఉన్నది అంటున్నారు అమ్మ. అయితే ఆశక్తే ఇవన్నీ అయి ఉన్నది అని అమ్మ ఎందుకంటున్నారు? ఏ ఆధారంవల్ల అంటున్నారు? ఏమి కల్పించడంవల్ల ఇవన్నీ ఆశక్తేఅని దేనికనిపిస్తున్నది?

అమ్మ : చెబుతాను. ఒకప్పుడు ఒక ఆలోచన వచ్చింది మరొకప్పుడు ఇంకొక ఆలోచన వచ్చింది. ఆలోచనలకు సమాధానాలు ఆలోచనలు వచ్చినవే చెబుతున్నవి. ఇక్కడ ఏశక్తి ఉన్నదో నేను చెబుతున్న సమాధానాలన్నీ - ఏమి చెబుతున్నా - వచ్చే ప్రశ్నలన్నింటికీ సమాధానాలు చెప్పే ఆ మనస్సుకే శక్తి తప్ప రూపం కన్పించటంలేదు. ఈ మనస్సనేది అందరి దగ్గర ఉన్నది. అందరూ తలోరకమైన పనిచేస్తున్నారు. ఏ శాస్త్రాలు కాదన్నామన్నా, ఏభౌతిక శాస్త్రజ్ఞానమైనా మనసు పైనే ఆధారపడి వున్నారు. ఆ మనసు సర్వశక్తి సంపన్నురాలు అని అనుకుంటున్నాను నేను.

శ్రీపాద : మనసు Matter వేరే ఉన్నాయి. కనుక Mind and Matter రెండూ ఉన్నట్టు కనిపిస్తున్నాయి.

అమ్మ : రెండు ఉన్నట్టు గమనిస్తున్నా మనసుచేత Matter ను గుర్తిస్తున్నారు. ఆ Matter ఉపయోగపడేది, మనసుద్వారానే ఉపయోగించుకోగలుగు తున్నాము. Matter తక్కువది అని అనను. Matter ఉంటేనే మనసుకు వచ్చిన ఆలోచన ఉపయోగపడుతుంది - భౌతికంగా.

శ్రీపాద : Mind, Matter ఒకటే అని ఎట్లాగా Question

అమ్మ : Mind - Matter ఒకటేనని నేననుకోవచ్చు. నీకు కనపడదు.

శ్రీపాద : ఎందుకనుకుంటున్నారు అని?

అమ్మ : Mind లేని Matter ని అర్థం చేసుకోలేము. Matter లేని Mind ఆ పని చేయ్యలేదు.

శ్రీపాద : నిజమే, దానివల్ల ఏం తెలుస్తున్నది? Mind and Matter Co-existent అవుతున్నాయని తెలుస్తున్నది. అయితే ఇప్పుడు ఆశక్తే సర్వమూ అయిఉన్నది అన్నప్పుడు, Mind Matter ఆశక్తే అని మాకు ధ్వనిస్తున్నది. అది ఎందుకని అంటారు అని ఆలోచిస్తే మాకు అంతు పట్టలా - ఈ రెండూ ఒకటేనూ; ఆశక్తే Mind Matter అని అమ్మ ఎందుకని వుంటారు - అని ఆలోచిస్తే మాకు తట్టలా - అమ్మ ఆలోచననుకూడా ఏదో చూచి అను కుంటారు గదా!

అమ్మ : మనసు ధృఢపడడమే గాని ప్రత్యేకమైన కారణం... ఇంకొక సారి రావచ్చు.

శ్రీపాద : మొన్న ఒకటి చెప్పారుగదమ్మా-

అమ్మ : రెండు కలసి....ఒకటి రెండై, రెండు అనేక మవుతుంది అనుకోవడానికి ఇదే ఆధారం. ఒక గింజ తెచ్చి భూమిలో పెట్టాం. ఆభూమిలో నీరుంది. అగ్ని ఉంది. అగ్నితత్వ ముంది, పృధ్వీ తత్వముంది, వాయు తత్వముంది వీటిచేత ఒకగింజ - నాలుగు రోజులు గడచిన తర్వాత, రెండుగా విభజింప బడుతున్నది. అందులో, ఇంత మొలక ఉంటుంది. ఆ మొలకే తర్వాత వృక్షమవుతున్నది. ఆ వృక్షాలు అనేక పనులు చేస్తున్నవి, కాయలు కాస్తున్నవి. ఈ చెట్టులో ఏగుణమున్నదో, అవిత్తనములో - ఇంత

విత్తనములో అదే గుణం వచ్చింది. మహా వృక్షములో ఏశక్తి అయితే ఉన్నదో అంత చిన్న గింజలో కూడ అదే శక్తి ఏర్పడ్డది. అంతలావు చెట్టు, అంతపొడవుచెట్టు, అన్ని కాయలు కాసిన చెట్టుకి - ఒక గింజకు - అన్నింటికి, సమానమైన శక్తి ఉన్నట్టుగా నేను గుర్తించాను - అదేశక్తి ఇన్ని కాగలిగింది అనుకోవ దానికి, ఇటువంటివి ఆధారం. మర్రిచెట్టు ఊడలు క్రింది నించి పైకొస్తున్నాయి. పైనుంచి క్రింది కొస్తున్నాయి. కాయలు కాస్తున్నాయి. కాయలో ఒక గింజకున్న గుణం ఇంతచెట్టుకూ ఉన్నది. రూపం వేరుగాని శక్తి అనంత మవదానికి కారణం, ఇట్లా ప్రతి దానిని వివరించుకొస్తే .... ఆచెట్టుని, ఆగింజని, ఆ కాయని గుర్తించింది మనస్సు. భౌతికంగా శక్తే - అక్కడ, ఇక్కడ.

శ్రీపాద : అయితే శక్తి ఇన్నిగా అయినది అంటారా? ఒకప్పుడు శక్తి ఉండి - ఆశక్తే ఇన్నిగా అయింది అంటారా?

అమ్మ : ఎప్పుడూ ఉన్నదంటాను. ఒకప్పుడూ అనను. అనేక రూపాలలో ఉండవచ్చు.

శ్రీపాద : అదేమో వృక్షమైంది, వృక్షానికి బీజాలు వచ్చాయి అను కొంటున్నాను.

అమ్మ : బీజమనేది అర్థం కావడానికి చెట్టుగా చెప్పానుగాని, శక్తి అనేక రూపాల్లో అనేకంగా ఉంది అంటా. ఇది ఆధారం అర్థం కావడానికి.

శ్రీపాద : శక్తి అనేకరూపాల్లో ఉందని మాకు తెలుస్తున్నది. కాని ఆశక్తి ఒకటిగా ఉండి ఇన్ని రూపాలయిందా?

అమ్మ : ఒకటిగా ఉండి ఇన్ని రూపాలయింది గనుకనే.

శ్రీపాద : ఎప్పుడైనా ఆశక్తి ఒకటిగా ఉండినదా?

అమ్మ : ఒకటిగానే ఉన్నది అంటే నీవు తను ఉన్నావు చెట్టును గుర్తించే వాడువేరుగా ఉన్నాడు. శక్తి వేరుగా ఉన్నది. శక్తే శక్తిని గుర్తిస్తున్నది. ఇక్కడ గుర్తించే శక్తి ఉన్నది-ఇక్కడ గుర్తింపబడే శక్తి ఉన్నది. గుర్తింప బడదానికి వీలైన శక్తి కనబడితేనే- అక్కడుంటేనే, గుర్తించే శక్తి ఇక్కడ ఉన్నది.

వీ.ప్ర : శక్తి వైవిధ్యంకాకుండా ఏకసమానంగా ఉండి, వైవిధ్యం తర్వాత వచ్చిందా?

అమ్మ : వైవిధ్యం వచ్చిన తర్వాతనే గుర్తుపట్టడానికి వీలైంది, ఏకంగా ఉన్నకాలం ఉన్నదేమో!

శ్రీపాద : అది గుర్తు పట్టడానికి తెలియదు. ఏ మంటారంటే కొన్ని రేఖలను పొడిగిస్తే అవి కలిసేటట్లుంటాయి కనుక ఆ రేఖల యొక్క క్రమాన్ని బట్టి ఇవి ఎప్పుడో ఒక బిందువు దగ్గర నుండి బయలు దేరుతాయని చెప్పడానికి వీలు – ఈ నాటి వైవిధ్యాన్ని బట్టి చూస్తే రోజు రోజుకుగాని, శతాబ్దానికి శతాబ్దానికి గాని వైవిధ్యం పెరుగుతున్నది. వెనక్కు వెళితే ఈ వైవిధ్యం అసలే లేకుండ – ఏక సమానత్వం ఉండినటు వంటి – ఉండిన కాలం ఒకటి ఉండినదని మనసుకు అనుమానమొస్తున్నది. ఏక సమానంగా ఎప్పుడైనా ఉండినదా అది. మొదటి నుండి వైవిధ్యంగానే ఉండినదా.

అమ్మ : వైవిధ్యమని నా అభిప్రాయం

శ్రీపాద : వైవిధ్యంగానే ఉండినది అని అమ్మ ఎందుకని ఉంటారు అని ఆలోచిస్తే ఒకటి ఉండి పదయింది అనుకోవడం కనిపిస్తున్నది. అది సులువుగా అనిపిస్తున్నది. ఒక కలకండ ముక్క నాలుగు పంచదార రవ్వలైందని.

అమ్మ : వైవిధ్యమన్నా అంతే.

శ్రీపాద : ఈ వైవిధ్యం వెనక్కు పొడిగించినట్లయితే ఏక సమానత్వం వస్తుంది మాకు ఒక Stage లో

అమ్మ : మీకు ఏక సమానత్వం వస్తుంది. ఏక సమానత్వం రావడానికి నీవు వేరుగా ఉండాలి. ఏకసమానత్వమైన గుర్తు నీవు గుర్తించలేవు. వైవిధ్యం ఉంటే గాని నీవు గుర్తించలేవు.

శ్రీపాద : ఆశక్తి ఇప్పుడూ ఉంది.

అమ్మ : ఉన్న శక్తి ఉంది.

శ్రీపాద : నేను గుర్తించలేక పోవచ్చు. అయినా ఉ–నికి ఉంది.

అమ్మ : ఉనికి – శక్తి రెండూ అదే.

శ్రీపాద : ఉనికి, శక్తి రెండూ అదే కాని ఏక సమానత్వంగా, బహు ముఖంగా పంచభూతాలు ఈ రకంగా విడిపోయి ఉండవచ్చు గదమ్మా!

అమ్మ : విడిపోయి ఉండవచ్చు. నిద్రపోయినప్పుడు నీవు లేనట్లుగా. అంతేకాని భౌతికంగా తీసుకుంటే ఎప్పుడూ భిన్నంగానే ఉంటుంది.

శ్రీపాద : గుర్తింప బడినపుడు భిన్నంగానే ఉన్నది.

అమ్మ : గుర్తింపబడని కాలమంటూ ఉన్నదా?

శ్రీపాద : అది ఊహకందదు గాని ఒకటి ఉన్నదనీ ఊహించడానికి వీలుగా ఉంది.

అమ్మ : ఊహే అవుతుందా? లేక నిజమవుతుందా?

శ్రీపాద : నిజమైనట్టు నిరూపణ లేదు. అదే అడుగుతున్నాను. ఒకటి గానే ఉండి బహుగా అవటానికి అవకాశమున్నట్టుగా కనిపిస్తుంది గనుక లేక ఎప్పుడూ వైవిధ్యంగానే అంటూ ఆ వైవిధ్యం పెరుగుతూనే ఉందా?

అమ్మ : ఉండటం నుండి వస్తున్నది. ఆమట్టిని గుర్తిస్తే అక్కడ బంగారమున్నట్టు వాడి Research లోనో, వాడు చేసిన కృషిలోనో, పరిశోధనలోనో తేలింది. కాని బంగారానికి ఉనికి ప్రత్యేకించి లేదు.

వీ.ప్ర : మొదట ఒక....

అమ్మ : మట్టిగా ఉంది. మట్టిలోలేదు. ఆమట్టిని గూర్చి కొంతశక్తి, కొంతజ్ఞానం కలిగిన తర్వాత ఈ మట్టి బంగారమైందని, ఈమట్టి అభ్రకమయిందని, ఈమట్టికి ఈ గుణముందని, ఆమట్టికి అగుణముందని – అన్నీ భూమిలో పుట్టినవే అయినప్పటికినీ – ఆనాడే ఉన్నా – నీవు గుర్తించే కాల మంటూ ఒకటి ఏర్పడ్డది. ఏర్పడ్డ కాలం దగ్గర నుండి మాట్లాడు కొంటున్నాం మనం.

శ్రీపాద : అంతకు ముందుండిన కాలానికి ఊహామాత్రం గానే తప్ప, ప్రయోజనం లేదంటారా?

అమ్మ : ప్రయోజనము లేదనలేదు. నేను వస్తున్నది ఏర్పడ్డ దగ్గర నుండి మాట్లాడు తున్నాను.

సోదరుడు: ఏకత్వం ఏర్పడ్డనుంచా? నానాత్వము ఏర్పడ్డ దగ్గర నుంచా?

అమ్మ : భిన్నత్వం ఉన్నదని నేను గుర్తించినప్పటినుంచి మాట్లాడు తున్నాను. నేను శక్తిని - శక్తీ నేనూ ఒకటే కావచ్చు - శక్తి నేనుగా ఉంటున్నాననుకొన్న నేనుగా మాట్లాడుతున్నా,

సోదరుడు: ఆ శక్తికి నానాత్వము లేని స్థితి అంటూ ఒకటి ఉన్నదా?

అమ్మ : శక్తి, నానాత్వం లేని స్థితి ఒకటి ఉన్నదని, లేదని గుర్తించ దానికి నానాత్వ మేర్పడితే గాని గుర్తించలేవు.

వీ.ప్ర : నానాత్వం లేని స్థితి ఒకటి ఉన్నదా?

అమ్మ : ఆ స్థితిని గురించి నేను....

శక్తిని గురించి ఏర్పడ్డ తర్వాతనే మాట్లాడుతున్నానుగా! ఏర్పడకముందు మాట్లాడటం లేదు. కారణాలు చెబుతాను. ఏర్పడ్డస్థితి తర్వాత గుర్తించినవే మాట్లాడుతున్నాను గాని, ఏర్పడకముందు స్థితిని గురించి మాట్లాడటం లేదు. ఆధారం లేనిది మాట్లాడటం నాకిష్టం లేదు.

సోదరుడు: ఏర్పడడానికి పూర్వం దానిస్థితి ఒకటిగా ఉంటుందా?

అమ్మ : నేను గుర్తించినంత వరకు నేనూ తనూ - నేనే అది - అదే నేనైనాను అనే స్ఫురణ వుందిగానీ, నేనూ అది ఒకటైన కాలంలో ఎట్లా ఉన్నానో తెలీదు. "రెండూ" నేను అనుభవించలేదు ఏ పరిస్థితుల్లో.

శ్రీపాద : గుర్తులేని స్థితిలో ఎట్లా ఉంటారో ఆలోచించలా.

అమ్మ : ఆలోచించలేదు, అనుభవించలేదు. ఎరుకలేని స్థితి ఇంత వరకు నా అనుభవంలోకి రాలేదు.

వీ.ప్ర : అంటే నేనిలా అర్థం చేసుకుంటున్నాను. అర్థం కాకుండా, ఏకసమానత్వంగ ఉండినస్థితి ఇప్పటి దాకా ఊహే తప్ప అనుభవంలోకి లేదు. కేవలం ఊహే.

అమ్మ : అని నేనను కుంటున్నాను. రజ్జు సర్పభ్రాంతి అనేది కూడ పాము, తాడు, రెండూ తెలిసిన వాడికి గదా. ఏదో ఒకటి తెలిస్తే భ్రాంతిలేదు. భ్రమాలేదు అక్కడ – రెండూ ఉన్నప్పుడే రెండు విషయాలు తెలిసీ కనబడేది అవినాభావ సంబంధ మన్న కనబడేది, చూచేవాడు. ఒకదాని కొకటి సంబంధం ఉందనుకున్నప్పుడు కూడ కనబడేది చూచేవాడు రెండూ ఉంటేనే అవినాభావ సంబంధం. నేనుదాని అర్థాన్ని వేరుగా చెబుతున్నానని అనుకొంటున్నారు. ఒకదాని కొకటి సంబంధమని వాళ్ళన్నారు. కనబడేదీ, చూచేవాడిని బట్టి అని నేనంటున్నాను.

శ్రీపాద : చూచేవాడిని బట్టి కనపడేది అంటే తెలియడం లేదు.

అమ్మ : అంటే, అక్కడ ఒక వస్తువున్నది. నాకళ్ళు పచ్చగా ఉన్నప్పుడు, అది పచ్చగా కనపడవచ్చు అంతమాత్రం చేత ఆ వస్తువు పచ్చబడలేదు.

శ్రీపాద : అంటే చూపులోనే చూచేవాడి Influence ఉంటుందా?

అమ్మ : అంటే, ఆ కనబడేది ఎప్పుడూ కూడా నా భావానికి సంబంధించినట్టే కనబడుతుంది. చీకటి మనిషిగా కనపడుతుంది. మేఘం కోతిలా కనబడుతుంది. ఒకడికది సింహం లాగా కనబడుతుంది. ఆమేఘం. అయితే అది మేఘమేగాని పులికాదు – మేకాగాదు – మన ఊహలు మాత్రం కావు అవి – అది మేఘమే. ఇవన్నీ మనం చూచాం కనక పోల్చు కుంటున్నాం – అదంతా ఊహ.

శ్రీపాద : అయితే, మనం చూచింది ప్రతిదీ మన ఊహే. ఆవస్తుతత్వం మన ఊహవల్ల తెలుస్తుందనేది తప్ప సత్యం కాకపోవచ్చు... అంతేగదమ్మా–?

అమ్మ : మేఘమే అవుతుందిగాని కోతి, పులిమాత్రం కాదు.

సో. : నాకెలా తెలియటం? మేఘం కాదని? కోతిలా కన్పిస్తుంది. కాదని ఎలా తెలియటం?

అమ్మ : కోతిలాగా అన్నావుగాని, కోతి ఉన్నది అని చెప్పడం లేదునీవు కూడా, అనుభవించిన వాడివి కోతిలాగ మేఘముంది అనవు.

శ్రీపాద : కోతే ఉన్నది.

అమ్మ : కోతే ఉన్నదిఅంటే నీకు తెలియదంటాను. తెలియలేదను కుంటాను.

వీ.ప్ర : మేఘమే - కోతిలాగా అని మీరనుకుంటున్నారు.

అమ్మ : కోతే అని నీవన గలిగితే నీకు భ్రమేలేదు. మేఘమెందుకు? కోతే-

సో. : పాము కన్పించినంతసేపు తాడు అని తెలియడం లేదు.

అమ్మ : తెలియడం లేదు.

సో. : తెలిసిన వాడికి పాము కన్పించడం లేదు.

అమ్మ : కాని ఒకదాన్ని చూచి మరొకటనుకునే భావం తెలియనప్పుడు ఊహ, భ్రమ, అభిప్రాయమన్నా రెండూ తెలిసినవాడికి కలుగుతుంది. పిల్లవాడు పాముతో ఆడుకుంటాడు - నేను పాముతో ఆడుకోను. పిల్లవాడు తాడుతోనూ ఆడుకుంటాడు. తల్లితీస్తుంది, ఒరే నాయనా కరుస్తుందిరా అని - పిల్లవాడు భయపడడు - వీడికి తెలియదు వాడు కుక్క నోట్లోనూ చెయ్యి పెడతాడు, పాము నోట్లోనూ చెయ్యిపెడతాడు.

శ్రీపాద : తెలియనివాడు గనక.

అమ్మ : ద్వంద్వమే దీనికి కారణం. తెలుసుకోవడానికి ఆధారం ద్వంద్వమే. భయానికి కారణం ద్వంద్వమే ప్రతిదీ ఇది రెండవదిగా మారినప్పుడే గుర్తించడం, అనుకోవడం, గుర్తించలేక పోవడం - భ్రమ అనండి, దైవమనండి, దయ్యమనండి, మరొకటనండి - రెండోది ఏర్పడ్డాకే.

సో. : అంతా అదేనని ఎందు కంటావు?

అమ్మ : అదే ద్వంద్వమైంది గనక.

సో. : ఈ రెండూ కాని తత్వం - అది-ఒకటిగా ఉందా?

అమ్మ : ఉన్నదేమో, నేను చూడలేదు.

సో. : చూడలేనిదాన్ని అంతా అదేనని ఎట్లా అంటావు?

అమ్మ : ఈ ఆధారాల చేతనే అంటున్నా.

వీ.ప్ర : పాక్షికంగానే చూస్తున్నాం మేము. మేఘం కోతిలాగా ఉందేమో అనటంలో పూర్ణసత్యం కాదు. పాక్షిక సత్యం మాత్రమే చూస్తున్నాం. అక్కడ ఉన్నది

మేఘమే. కోతిలాగా అనడం పాక్షిక సత్యం. చూస్తున్నాం పూర్తిగా ఇది మేఘమే అనడం పూర్ణం.

అమ్మ : ఒకటే ఇన్నయిందని చెప్పడానికి అనేక భౌతిక ఆధారా లున్నాయి.భౌతికం తీసివేసినా మనస్సనేది ఒకటుంది. నీకూ మనసుందనే అనుకుంటున్నాను. అది అందరూ ఒప్పుకుంటారు. కాళ్లు, చేతులు – ఆకృతులు వేరైనా అవయవాలు నీకూ నాకూ ఉన్నాయి. మనసనేది నీకూ ఉంది, నాకూ ఉంది. నా ఆలోచనా రీతి వేరుగా ఉంది, నీ ఆలోచనా రీతి వేరుగా ఉంది. మనసనేది అందరికీ ఉంది గదా! ఇన్ని రకాలుగా ఉండదానికి కారణం ఏమిటి? ఇంత మంది మనసులుగా ఉండడానికి కారణమేమిటి? ఈ ఊహలకు కారణమేమిటి? పనులలో అందరమూ ఏకత్వం పొందుతున్నాం. ఏకసమానమైన స్థితిని పొందుతున్నాం. Quantity తగ్గవచ్చుగాని, నీకూ ఆహారం కావాలి – ఆయనకూ ఆహారం కావాలి. ఈ ఆహారం నిద్ర సమంగా ఉన్నాయి. వీళ్లకు కలిగే కోరికలు, ఉత్పత్తి అందరికీ సమానంగా ఉన్నాయి. ఒకడు అంకేసుకోవచ్చూ, ఒకడు ఓర్చు కోవచ్చు, ఒకడు తీసేసుకోవచ్చు, ఒకడు నాకు లేదు అనుకోవచ్చు. ఈకలిగే అభిప్రాయాలు అందరికీ సమానంగానే ఉన్నాయి. ఉన్నది కాబట్టి వాళ్ళు జయించా రంటున్నాం. కోరికే లేక పోతే జయించలేదు. ఈ మనసు ద్వారా పొందేది చాలా వరకు కలుస్తున్నాయి. భౌతికంగా మనసు గుర్తించేదయింది. మనసెట్లా ఉంటుందీ అంటే, అది ఇన్ని కార్యాలు చేస్తూ అంతు పట్టకుండా ఉన్నది, అర్థం కాకుండా ఉన్నది, రూపం లేకుండా ఉన్నది అందుకే మనసుకు శక్తి అని పేరు పెట్టి – శక్తి ఇన్నయింది అనుకొంటున్నా. చెట్లను ఎట్లా అనుకొంటున్నానో, మనుష్యులనూ అట్లాగే అనుకొంటున్నాను అని–అనుకొంటున్నా.

శ్రీపాద : త్రిప్పి చెప్పవలసి వస్తున్నది. మనస్సులో వస్తువు రెండుగా ఉండి, అదే ఇదంతా అయి వుండవచ్చు గదా? మనసు – వస్తువు....

అమ్మ : శరీరం వస్తువు .... మనసు - శరీరం ద్వారా కలిగే ఆలోచనలు ....శరీరంతో కూడినవే ఆలోచన లొస్తున్నాయి గాని శరీరమునకు వేరైన ఆలోచన మనకర్థం కావటం లేదుగా! శరీరమునకు లేవు - శరీరము వేరై పోయిన తర్వాత - ఆ మనసు కొచ్చే ఆలోచనలు ఏమిటో మనకు తెలియవు. ఆ మనసు ఏమవుతుందో తెలియదు. భౌతికంగా కనపడుతుంది. గనక చెట్టుతో పోల్చుకుందాం. దీనికి వచ్చే ఆలోచనలు మాత్రం భౌతికం కాలేదు. కారణం? కనిపించడం లేదు గనుక. భౌతికంగా ఆలోచిద్దాం. అది క్రియా రూపేణా భౌతికం అవుతున్నది. ఇప్పుడైనా భౌతికం అవుతున్నది.

శ్రీపాద : క్రియారూపేణా మనసే భౌతికం అయిందంటారు.

అమ్మ : క్రియారూపేణా అంటే - కాగితంమీద రాద్దాం - ఒక అక్షరం అనుకున్నా - అనుకున్నది ఊహే. అది నాకు అర్థంకావడం లేదు. Idea అర్థం కాదు. Practical అర్థ మవుతుంది.

వీ.ప్ర : అది ఆచరణలో కనిపించినపుడు భౌతికంగా మారుతుంది. అయితే అమ్మా! మనకు - శరీరం మీద, ఇతర ప్రకృతిమీద అధికారం - అంటే దానిసత్తా, దీనిమీద వ్యక్తీకరించడం, దానిమీద చూస్తున్నాం. వాళ్లు చెప్పేది దేనిలోనుండి అయితే ఏ శక్తి పుడుతుందో - మనసు భౌతికంగా వ్యక్తమవుతున్నప్పుడు మనసు తెలుస్తుంది. ఇది భౌతికం కాదు - భిన్నమని చెప్పే ప్రకరణ గ్రంథాలు, తదితరం చెప్తున్నాయి. దానికి కారణమేం చెప్తున్నారు? అంటే, దేనిలో నుండి ఏదైతే పుట్టిందో, అది అధికారం చెలాయించడం లేదు కాబట్టి - ఇది ఇంతకంటె భిన్నమైనటు వంటిదని చెబుతున్నారు. మనసు - ప్రకృతిమీద, శరీరం మీద అధికారం చెలాయించడం చూస్తున్నాం. స్థూలంగా మనకు కన్పిస్తుంది. అమ్మ ఏమిచేస్తుందో మాకు తెలియదు. కాని అమ్మ ప్రభావం మాకు కన్పిస్తుంది. అమ్మ మనసే పనిచేస్తుందని అనుకుంటున్నాం. అమ్మ మాత్రం పని

చేయడంలా ఈ మనసు ఈ శరీరాన్ని ఆజ్ఞాపించినట్లుగా కన్పిస్తుంది. వాళ్ళు చెప్పేది ఏమిటంటే అమ్మా! దేనిలోనుండి ఏదైతే పుడుతుందో, దానిమీద అధికారం చెలాయించ లేదంటున్నారు. దీనికి కారణ మేమైయుంటుంది.

అమ్మ : ప్రశ్నలోనే వుందిగదా సమాధానం

వీ.ప్ర : వాళ్ళు అలా సమాధానం చెప్పడం లేదమ్మా.

అమ్మ : అంటే మనసు ఏదైనా చేయగలుగుతున్నది. భౌతికాన్ని గుర్తిస్తున్నది, సృష్టించుకొంటున్నది, చెలాయిస్తున్నది - దానికి తిరుగులేదు. ఆ చెలాయించేదంతా మనసేగదా ఇదంతా? మనసు గాకుండ దానిమీద ఇది పనిచేయడం లేదు. అనే వాళ్లు ఏదైనా ఆధారం చూపిస్తే....

వీ.ప్ర : వాళ్లు చెప్పేది ఒకటే, ఈ రెండూ ఒకటికాదు మనసు - ఇంతకంటె భిన్నమైన దానితో చేయబడినటువంటిది - పరమాత్మ అనో, ఆత్మఅనో చెబుతున్నారువారు. ఈ రెండూ ఒకటి కానేరదు. అని చెబుతున్నారు. కాబట్టి దీనిపై అధికారం చెలాయించ గలదని చెబుతున్నారు.

అమ్మ : ఈ రెండూ ఒకటి కానేరదు అంటే ఈభిన్నమైన శరీరం కాకుండ భిన్నంగా ఉన్న మనసు శరీరం లేనప్పుడు అర్థం కావడంలేదు. శక్తిగానే మిగులుతున్నది. అపుడు మనసు అనే పేరుతో లేదు. శక్తిగానే ఉంటుంది. నాఅభిప్రాయమే గాని గుర్తుగా, అనుభవంగా నిరూపణ లేదు. ఇదంతా శక్తి అయిందనేది నాఅనుభవం. చెప్పగలగడమే గాని, నిరూపించ డానికి ఆధారాలు చిన్న చిన్నవే కనబడుతున్నాయి. శరీరం లేని మనసు ఎక్కడా కనిపించడం లేదు నాకు. అదేమిటంటే దయ్యాలు గానో, భూతాలుగానో ఉన్నదని చెబుతున్నారు.

వీ.ప్ర : మనసు ఊహించుకున్న సృష్టేగా!

అమ్మ : అదికూడ దయ్యము, భూతము, దేవుడు.... దేవుడనేది కూడ మనసే. కాని దేవుడనేది భావమే కాని దేవుడిట్లా అయినాడు, దేవుడిట్లా ఉంటాడు

అని చెప్పడానికి నాకెక్కడా అందుబాటులో లేదు. ఆభగవంతుడే వాడు ఇట్లా ఉంటాడని చెప్పడానికి నాకెక్కడా అందుబాటులో లేదు. ఎన్నో గొప్ప పనులు చేసిపోయి నటువంటి వారిని అవతారమనో భగవంతుడనో దేవుడనో అనుకొంటున్నాము. మనమనుకొనే ఆత్మ - మనసు - శరీరం, సంకల్పాలు ఈ నాల్గింటిమీద భావమే మిగుల్తున్నది.

వీ.ప్ర : ఆశక్తే శరీరంగ, ఆశక్తే మనసుగ, ఆశక్తే భావంగ వ్యక్త మవుతున్నది. అని మన మనుకుంటున్నాం. కాని వాళ్ళది వేరు ఇది వేరు అని అంటున్నారు.

అమ్మ : ఒకకాయ ఉన్నదినాన్నా! గుమ్మడికాయ ఉంది. అందులో గింజలన్నీ తీసివేసి, ఆచెక్కుతీసివేసి, మధ్యలో ఏర్పడినకండను వండుకు తింటు న్నాము. అయితే ఉత్పత్తి కావాలి అన్నప్పుడు గింజలు వెతుక్కుంటాం. కూర వండుకుందా మన్నప్పుడు చెక్కుతీసివేస్తాం. కాయలు కావాలను కున్నప్పుడు సమూలంగా దాచుకుంటాం. ఇందులో ఏది తక్కువ? ఏది ఎక్కువ? ఏది ముఖ్యం? ఏది అముఖ్యం? అంటే ఏది అవసరమైనపుడు, ఏపనిచేద్దామనుకున్నప్పుడు ఆ వస్తువుకు విలువ ఇచ్చి దాన్ని ఉపయోగించుకుంటున్నాం. నేను వీటన్నింటినీ ఆధారం చేసుకొని మాట్లాడుతున్నాను. ఒకటికాదు. అశుద్ధం మొదలు కొని అన్నం దాకా!

సో. : బాగుందమ్మా.

వీ.ప్ర : మనసులో వేరు పరచి - మనం కండను ఎలా ఉపయోగించుకుంటు న్నామో అలా అంతా ఒకటేనని మీరు చెబుతున్నారు. అధికారం చెలాయించేది - చెలాయించతగ్గది...

అమ్మ : ఎండిపోయి మళ్ళీ విత్తనాలుగా ఉపయోగిస్తుంది. లేతకాయ తినడానికి రుచిగా ఉంది గదా అని విత్తనాలు భూమిలో వేస్తే మొలకరాదు. ఒక వస్తువులో ఇన్ని రకాలున్నాయి. మనిషిలోనూ ఉన్నాయి. పసివాడుగా ఉన్నప్పుడు వాడిచ్చే ముద్దులు వేరు, పెరిగే కొద్ది వాడిలోని గుణాలు

మన కర్థమయ్యేది వేరు. వృద్ధాప్యం వచ్చిన తర్వాత వాడి లక్షణాలు వేరు. మనిషికే పరిణామం ఉంది. వస్తువుకూ పరిణామం ఉంది. శక్తే పరిణామం పొందు తున్నది. మనసుకూ పరిణామం ఉంది. వృద్ధులుగా ఉన్న మనసువేరు. ఆలోచనా రీతివేరు. బాల్యంగా ఉన్నప్పుడు ఆలోచనా రీతివేరు. నవయౌవనంలో వాడి ఆలోచనాతీరు వేరు. అంతమాత్రం చేత మనసుకు ఆకారం కనిపించక పోవచ్చు శరీరంతో పాటు వాడి మనసుకూడ పెరుగుతున్నట్లు భౌతికంగ ఋజువవుతున్నది. మనసుకు రూపం వేరుకాబట్టి మారదో, మారుతుందో - లేదో చెప్పలేక దానికి పరిణామంలేదు అంటున్నావు. అనడానికి నీకు కొన్ని ఆధారాలుండవచ్చు. ఎట్లా ఉన్నాయంటే చిన్న పిల్లలకు పెద్ద ఆలోచనలూ పెద్దపిల్లలకు చిన్న ఆలోచనలూ వస్తున్నాయి. ఎంతో వయసు వచ్చినవాడికి పనికిమాలిన ఆలోచనలు చేసే బుర్రా ఉంది. ఒకడు చిన్న తనంలోనే మంచి ఆలోచనలు చేసేవాడూ ఉన్నాడు. అవి కనిపించేవికావు. సామాన్యంగా,సమూలంగా ఆలోచిస్తే వయస్సునుబట్టి మనసులో కూడ అభిప్రాయాలు ఉన్నవే జరుగుతాయి. ఆహైమ ఉన్నది- మూడు నెలల పిల్లకు రూపాయి చేతిలో పెడితే దాచుకోవడం తెలీదు.ఇప్పుడు తెలుసు.తాతయ్య రూపాయ ఇచ్చాడు అంటుంది. అప్పుడూ ఇప్పుడూ మనసుంది.

శ్రీపాద : మేము ఇంటి దగ్గర బయలుదేరి జిల్లెళ్ళమూడికి వచ్చామని, వచ్చి అమ్మ నడుగుతున్నామని. మే మే చేస్తున్నామని అనుకొంటున్నాం. మేమే చేస్తున్నాం అనుకునే వాళ్ళకి వాళ్లు చేయవలసిన పని ఏమిటి? ఏదో ఒక శక్తి చేయిస్తుంది అని మేమింకా అనుకోవటంలా. కనుక మేమే చేస్తున్నామని అనుకొంటున్నాం. కాబట్టి మేము చేయవలసిన పని ఏమిటి? మాకు గమ్యమేమిటి?

అమ్మ : నేను కాదు అనుకొనేవాడికి, నేను చేస్తున్నాను అనుకున్నవాడికి, ఈ పనులన్నీ నేను కాదు చేస్తున్నది అనుకున్నవాడికి, పనులన్నీ మేమే చేస్తున్నాం

అనుకున్నవాడికీ, ఒకటేనని అనుకొంటున్నాం కనుక ఏం చేయగలిగినా సరే. ఏమీలేదు. ఏది తోస్తే అదే చేస్తావు.

శ్రీపాద : మిమ్మల్ని మేమడుగుతున్నాం. ఏం చేయమంటారు అని?

అమ్మ : ఏది మీకు తోస్తే అదే చెయ్యండి.

శ్రీపాద : మాకంటే ఇలాగే చేస్తున్నాం అనుకొనేవాళ్ళకు గమ్యమంటూ వేరేలేదూ?

అమ్మ : గమ్యమంటూ ఉందను కొనేవాడు వాడాలోచించు కొంటు న్నాడు. వాడి గమ్యం ఏదో ఉందని చేస్తాడు. ఏమీ చేయనివాడి సంగతి, నేనే చేస్తున్నాను అనే వాడి సంగతి – గమ్యాన్ని గురించి ఆలోచించాడు. ఒకడు తినడం, పడుకోవడం గమ్యమను కున్నాడు. వాడికి ఏదైతే భౌతిక సుఖాలు కనబడు తున్నాయో అదే గమ్య మనుకున్నాడు. తనకు తోచింది చేస్తున్నాడు. తప్పు ఒప్పు అని ఆలోచించలేదు వాడు. ఏది తోస్తే అదే చేస్తున్నాడు. వాడందుకే ఏర్పడ్డాడు – ఆపని చేస్తున్నాడు అనుకుంటున్నాను నేను. ఆ అంతా అయిన శక్తిలో నుండి వాడట్లా విభజింపబడి వచ్చాడు. ప్రత్యేకంగా గోపాలకృష్ణమూర్తిగా, ప్రసాద్‌గా, విభజింపబడి అంటే – వీళ్ళులేరనిగాదు నా అభిప్రాయం అట్లా కనబడుతున్నారుగా! మట్టిచెట్లు, తుమ్మచెట్టు – అన్నీ చెట్లే కావచ్చు. ఆచెట్టుగుణం వేరు – ఈ చెట్టుగుణంవేరు.

× × × × ×

సోదరుడు: తను మూలం మిదం జగత్ అని ఒక వాక్యం చెప్పేటప్పుడు అంతటిలోనూ స్వార్థాన్ని చూడడమే తన్ను తాను తెలుసు కోవటం – నేనని తెలుసు అన్నమాట

అమ్మ : ఇది నేనెందుకు చేస్తున్నానీపని? ఒకరికి ఉపయోగించే పనయినా సరే, కాని పనయినా సరే, తనకోసరం చేస్తున్నట్టుగా ఉంటుంది నాకేమో. పెట్టుకోవటం, తిట్టుకోవటం రెండూ తనకోసమే .విమర్శించు కోవటం, హర్షించుకోవటం రెండూ తన కోసమే. ఏ పని దగ్గరకు వెళ్లినా నాకోసం చేసుకొన్నట్లని పిస్తుందేగాని ఒకరి కోసమని అనిపించలా. నేను చేసే పని ఇతరుల కుపయోగపడితే చూచేవాడి దృష్టిలో త్యాగం కావచ్చు.

ఒకడు చలివేంద్రం పెట్టి తృప్తి పడవచ్చు. దానంలో భాగం కాదు నామాట. అన్నంపెట్టు కోవటమే. పెట్టుకోవటం కనుక నాకొఱకే, మీకు నీళ్లు పోయడం నాకొరకే, మీరీపూట భోజనం చేయండి అనటం నాకొరకే – ఏది చేసినా నేను గాకుండ, నాతృప్తి కోసం గాకుండ చేస్తున్న పని ఏమిటి? అని నేనాలోచించాను. ఇదే కాదు. ఎవరన్నా తిడితే పడదా మనేదీ నాకొరకే, పడదామనుకోవటం అనేదీ నాతృప్తే, ఎవరైనా కొడితే పడటం నాతృప్తే, ఎవరైనా ఏపనైనా చెబితే, అది ఏపని అన్న ఆలోచన లేకుండ తృప్తి అనేమాటను మిగుల్చుకుని అన్నీ పనులు చేశాను. జీవితంలో కూడ అన్ని రకాలు జరిగినవి. ఎటు చూచినా – నా కొరకే అనేదే మిగిలింది.

సోదరులు: ఇలా నా కొరకే అనుకుంటే తననుతాను తెలుసుకొన్నట్లా?

అమ్మ : ఆమాట ద్వారా అన్వేషణ బయలుదేరింది. మిగిలింది నేనుగానే మిగిలింది. అన్నింటికీ ఇది, అది అని విచక్షణ లేదు. నీవు వచ్చి.... నీ వంటే నీవు కాదు. ఎవరన్నా వచ్చి బిడ్డను చంపితే నాకు తృప్తి, చంపుతావా? చంపవా? అని అడిగాడనుకో! చంపుతా, నీవు తింటే నాకు తృప్తి అన్నాడనుకో, అది ఏమిటి అన్న విచక్షణ లేదు.

సోదరుడు: అప్పుడది వాడికి తృప్తి అవుతుందిగాని నీ తృస్తి ఎలా అవుతుంది?

అమ్మ : వాడి తృప్తే నాతృప్తి అయింది.

సోదరుడు: అంటే మొదట నీతృప్తియా? వాడి తృప్తియా?

అమ్మ : నేను అనేది బయలు దేరింది. ముందు వాడు కనబడు తున్నాడు – అడిగేవాడు – వాడయినాడు. ఆచరించడం నాతృప్తి అయినది. అడిగేవాడు అడిగేవాని కొరకే. అది వాని కొరకే. అది వాడి తృప్తి కొరకే. అడిగేవాళ్ళు అడిగేవాళ్ళ తృప్తి కొరకే అడుగుతారు. చేసేవాళ్ళు చేసే వాళ్ళ తృప్తి కొరకే చేస్తారు.

సోదరుడు: అతని తృప్తి నా తృప్తి అనుకోవచ్చు.

అమ్మ : నే చేసేపని అపుడు ఇద్దరికీ తృప్తి కలగవచ్చు. ఇద్దరిలోనూ నేనును తెలుసుకోవడానికి భావం మార్పుతో ఉంది. ఇక్కడ నేనును తెలుసుకున్నాను. అక్కడ నేనును తెలుసుకోలేదు. భావం మార్పు. నే చేసేపని ఇతరులకు ఉపయోగపడేది ఇతరులదృష్టిలో త్యాగం. నాదృష్టిలో స్వార్థమే - అదే పరమార్థమని అనుకొంటున్నాను.

సోదరుడు: ఇక అప్పుడు నేనే మిగిలింది.

అమ్మ : ఈ అన్వేషణలో ఏపని చేసినా, ఏం చేస్తున్నా, ఎక్కడ కూర్చున్నా, ఎక్కడ నిల్చున్నా ఏదో గొప్పపని చేసింది అమ్మ అని మీరనుకుంటున్నారు. ఎవరికోసం ఏమీ చేసింది లేదని నాకనిపిస్తున్నది. నేనే మిగిలాను. ఇదే నేనును తెలుసు కోవడమేమో? ఈ రూపంగా కూడ తెలుసుకోవచ్చు. ఇదే కారణం కాదు. నేనును తెలుసుకోవడానికి ఒకే పద్ధతికాదు. ఇదీ ఒక కారణం అని చెప్పాను.

వీ.ప్ర : సృష్టి అంటే భిన్నత్వమని చెప్పారు. సృష్టి సహజం కాబట్టి వైవిధ్యం సహజమన్నారు. శ్రీపాద వారడిగినప్పుడు భిన్నత్వంలో ఒక్క అమ్మ కన్పిస్తున్నదిగదా అయితే మనసుకు వ్యత్యాసాలు రావడం కాకుండ - ఏదన్నా క్రమాన్ని బట్టి ఏర్పడుతుందా అమ్మా ఇది?

అమ్మ : నా అభిప్రాయం ఇంతకుముందు చెప్పినదానికి, శ్రీపాద అడిగితే చెప్పినదానికి తేడా ఏమీలేదు. భిన్నత్వమే దాని క్రమపద్ధతి. క్రమంగా నడవడంలో భిన్నత్వంకూడ ఇమిడే యున్నది.

వీ.ప్ర : అయితే ఈ భిన్నత్వం వ్యక్తమైనప్పుదు కొన్ని పద్ధతులను బట్టి భిన్నత్వం వ్యక్తమవుతుందా? లేకపోతే యాదృచ్ఛికమైన పద్ధతిలోనే భిన్నత్వం ఏదైనా ఉందా? పొడుగు పొట్టి ఉన్నాయి. నీదృష్టిలో పొడుగు పొట్టి కాకపోవచ్చు. మాదృష్టిలో పొడుగు పొట్టి వ్యత్యాసాలు కనిపిస్తున్నాయి. మీకు కూడ పొడుగు పొట్టి తెలుస్తుంది. కాని అంతా అయిన శక్తి పొడుగుగా, పొట్టిగా, మురికి నీరుగా, గంగగా అయిందని తెలుస్తున్నది కాని

భిన్నత్వం, వైవిధ్య మేర్పడడానికి ఏమైనా కొన్ని సూత్రాలున్నాయా? వాళ్ళు చెబుతున్నారు ఏమని? ఇదిగో ఇలా ఏర్పడడానికి కారణం మీరు చేసుకున్న కర్మో ప్రారబ్ధమో, సుకృతమో - ఏదో ఒకటి అంటున్నారు. కర్మ సమిష్టిది తప్ప వ్యక్తిది గాదని మీరు స్పష్టం చేశారు. అయినప్పుడు ఈ వైవిధ్యం యాదృచ్ఛికంగా ఏర్పడిందని అనుకొవడమేనా?

అమ్మ : నా ఉద్దేశ్యం ఏ శక్తయితో ఉందో - అర్థం కానటువంటిది - అదే భిన్నత్వంగ ఉంది. దాన్ని మీరు సత్తా అనండి, బ్రహ్మ అనండి, శక్తి అనండి - ఏ పేర్లైనా పెట్టండి. యాదృచ్ఛికంగ ఏర్పడిందని, దానిలో నుండి వచ్చిందనే - అదే అయిందనే తప్ప - వీడి కర్మ ప్రకారం జరుగుతున్నదని తోచడంలేదు. నాకు కర్మనేది ఎటువంటిదంటే - సమిష్టి కర్మే కనబడుతున్నది.

శ్రీపాద : అంటే ఏమిటమ్మా!

అమ్మ : సమిష్టి కర్మంటే కర్తృత్వం వీడికి లేక పోవడం. వ్యష్టి కర్మంటే, వ్యక్తికి కలిగిన బాధో, సుఖమో, మంచో, చెడో ఏదో జరుగుతుందనుకో! ఎందు కొచ్చిందో అని వాడు చింత పడుతుంటాడు. ఎందుకో బాధ పడుతుంటాడు. ఆ బాధ పడ్డప్పుడు నాయనా పూర్వజన్మ సుకృతమురా! అంటే కొంతహాయిగా ఉంటుంది. ఈ జన్మలో చేశావంటే వాడి మనసుకూడ బాధపడుతుంది, నీవు మొన్న నన్ను కొట్టావు గనుక, ఈవేళ ఎదురు దెబ్బ తగిలింది అంటే సహించలేడు. తెలిసీ నేనేమీ పాపం చేయలేదే అనుకుంటాడు. పోనీ, ఏదన్నా చేసి ఉన్నవాడు - ఇందువల్ల వచ్చిందని తృప్తి పడతాడేమో తెలియదు. ఆ చేసే వాడు నాకర్మ అనుకోడు. చేసేటప్పుడు నాకర్మ, నావిధి ఇదే నా ఫలితానికి వస్తుందని ఆలోచించడు. ఇది ఎవరికి అంటే వాడికి తెలియని బాధలు వచ్చినప్పుడు బుజ్జగించే

మార్గంగా నా కనిపిస్తుంది. అమ్మ చిన్న పిల్లవాడికి ఏదన్నా పెట్టి అలించి, పాలించి లాలించడమెలా ఉంటుందో అటువంటిది ఈకర్మ అనిపించింది గాని కర్మ సిద్ధాంతం తప్పుఅనిపించలేదు. ఇందుకు ఉపయోగ పడుతుంది గనక ఓపికలేని వాడుకర్రను పట్టు కున్నట్లుగా, చేయూత అయినట్లుగ అట్లాచెప్తారేమో అనిపిస్తుంది.

వీ.ప్ర : ఒక క్రమమంటూ లేదు. కేవలం యాదృచ్ఛికమని నాఅభిప్రాయం అంటే వాడిదేమీ లేదని - అయితే అంతా తెలుసుకొన్న వాళ్ళకు భిన్నత్వం కనిపించదు. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు డాక్టరేటు చదువుకున్నా, ఇంకో ఆయన వ్యవసాయం చేసుకున్నా, ఇంకొకడు ఏమీ చదువుకోక పోయినా అందరిలోనూ ఒకే సత్త. వీడిలో ఇంకొక గుణం వ్యక్తమవు తుందేమో.

అమ్మ : అదేసత్తా అక్కడ చదువుగాను ఉంది, ఇక్కడ చదువు లేకుండాను ఉంది. ఒకచోట సంగీతం గాను ఉంది. ఇంకొకచోట కట్టెలు కొట్టేవాడుగాను ఉంది.

వీ.ప్ర : అయితే ఏ మానవుడిని కూడినా వందవస్తుంది. అంటే అందరిలో గుణాలు మొత్తం సంపుటీక రించినా ఒక దగ్గరకే అవుతుందా? ఈయనలో చదువు కన్పిస్తుంది. ఆయనకృషి పండితుడు. అది ఆ రూపంలో వ్యక్తమయినది. తెలిసినా తెలియక పోయినా. ఎందుకంటే? ఆ సత్తాలోనుండి వచ్చింది గనుక శక్తియొక్క స్వరూపాలే అన్నీకూడ. అందుకని మనిషి తను గుర్తించినా, గుర్తించక పోయినా అందరిలోనూ ఒక రకమైనపూర్ణత్వముందా.... అయితే?

అమ్మ : నాకు కనబడుతున్నది.

## 27-4-76

వీ.ప్ర : భక్తుల చరిత్ర చూస్తే కార్యాచరణ సంబంధం.... అంతా అయినశక్తి చేయించిందని, చేయించుకొంటుందని, చేసుకొంటున్నదని మీరు చెప్తున్నట్లుగా అర్థం చేసు కొంటున్నాము. తరుణం వచ్చింది – జరగవలసి వుంది, జరిగింది. అయితే అది యాదృచ్ఛికం. ఈ తరుణానికి, వాడను కోవడానికి కార్యకారణ సంబంధం ఉందా?

అమ్మ : అంతా అయిన శక్తే మనంగా, విడిగా, వేరు వేరుగా ఎట్లా మారిందో – ఆతరుణమనేది కూడ ఆశక్తే.... కాల రూపాణా ఏర్పడి ఆయా పనులు వాళ్ళ చేత జరిపించు కొనుచున్నది.

వీ.ప్ర : భక్తి ఇచ్చి – వారి చేత ప్రార్థన చేసేటట్లు చేసింది. తర్వాత, ఆ జరుగవలసిన కర్తవ్యమేదో జరిగింది. అయితే, ఈ రెండింటిని ఇచ్చింది అదేశక్తి. జరిగే పని జరుగుతుంది. ఈ జరగడానికి వైయుక్తికంగా అక్కడక్కడా ఫోటో తీసినట్లు వీడు చేయడానికి – ఆ పని జరగడానికి, గల సంబంధము కన్పిస్తుంది.

అమ్మ : ఆపని చేయనివానికి కూడా అనుభవం వచ్చిందనుకోండి ఆభక్తిలేని వాడికి ఒక అనుభవం కలిగింది. అనుభవం కలిగిన తర్వాత....

వీ.ప్ర : కాని, దానికి కారణ మనుకోవటంలా వాళ్ళు. అది ఈ శక్తి కారణ మనుకోడు వాడు. అమ్మను ప్రార్థిస్తే ఒకడికి లాటరీ వచ్చింది లేకపోతే ఒకపని జరిగింది. అమ్మను ప్రార్థించడం మూలంగా ఇది జరిగింది అనుకొంటున్నాడు ఒకడు. భక్తుల చరిత్ర అంతా అదే ఋజువు చేస్తుంది.

అమ్మ : ఎవరినో నమ్ముకున్న వాడికి – వాడి ద్వారా జరిగింది అని అనుకుంటాడు. నమ్ముకోని వాడు తన తెలివి తేటలను కుంటాడు.

వీ. ప్ర : అట్లా నమ్మకం లేనివాడు యాదృచ్ఛిక మనుకుంటాడు.

అమ్మ : యాదృచ్ఛికమన్నా ...

వీ. ప్ర : యాదృచ్ఛికమంటే దానికీ, దీనికీ సంబంధంలేదు. హఠాత్తుగా దానంతట అది జరిగిందనే.

అమ్మ : ఇక్కడ యాదృచ్ఛిక మనేది ఏమీలేదు. ఒక శక్తిని నిర్ణయించాం. శక్తి అంటున్నాం. ఇంకా అక్కడ యాదృచ్ఛిక మేముంది?

వీ.ప్ర : అంతా అయినటువంటి శక్తి ఇట్లా చేయటంకోసం, ఆ తరుణం రప్పించడం కోసం, ఏమైనా దాని వెనక క్రమము, కార్యకారణ సంబంధమూ ఉందా?

అమ్మ : ఈ జరిగేపనే కార్యకారణ సంబంధము అంటాను. వేరే కార్యకారణ సంబంధాలు ఏమీలేవు.

వీ.ప్ర : అమ్మా ఈ పనిచేయి అని నీదగ్గరకు వచ్చి నాయన, నీపాదాల దగ్గరో, హైమాలయం దగ్గరో పూజలు, లేదా ధ్యానం చేశారు. ఆయనకు ఒకపని జరిగింది. ఒకటి జరిగింది అంటే వాడి భావనే నంటారు మీరు. నాకేం సంబంధం లేదంటారు మీరు. ఎప్పుడూ చెబుతున్నారుగా! కర్తృత్వం మీరెప్పుడూ పెట్టుకోరు. కాన వాడికాపని జరిగింది. ఒకడికి జరగడం కాదు. పదిమందికి, యాభైమందికి జరిగింది, వందమందికి జరిగింది.

అమ్మ : కాని రెండువందల మందికి జరగలా.

శ్రీపాద : అందరికీ జరగలా – ఇదిగో దీనికి....

వీ.ప్ర : దానిని చూచి వందమందికి జరగక పోవడానికి కార్యకారణ సంబంధం ఉందా?

అమ్మ : జరగడానికి, లేదా జరగక పోవడానికి – లేదు.

వీ.ప్ర : నాకర్థంకాలా

సో : జరగడానికెలా కన్పించలేదో, జరగక పోవడానికీ అలా కన్పించలేదు. అది వాడి భావనే అంటుంది.

వీ.ప్ర : అది జరగవలసి వుంది.

అమ్మ : అయితే అది ఎందుకు జరగదు? అంటే వాడి భక్తి చాలలేదు అని నాకన్పిస్తుందా?

వీ.ప్ర : ఏమో అదిమాకేంతెలుస్తుంది? అదే అడుగుతున్నాం.

అమ్మ : నా మనసులో వీడికంటే వాడి భక్తి ఎక్కువుంది - వాడికంటె, వీడిభక్తి తక్కువుంది కనుక ఈ పని జరగాలనో, జరగ కూడదనో అని నాకుంటుందా?

వీ.ప్ర : నీవంటె నీవని కాదమ్మా!

అమ్మ : దేవుడైనా సరే - నాకనిపించదు కనుక, అందరికీ అనిపించదు. నాకు లేదు, ఏదన్నా అనేవాడు, బాధపడేవాడు, వాడ్ని చూస్తే - వాడు దగ్గరకు రావడంకోసం ముందిట్లా ప్రారంభించాడు అనుకుంటా, ఏదో ఒకరకంగ మొదలైంది గదా! జిల్లెళ్ళమూడి అమ్మ మంచిదికాదని, అమ్మప్రచారం చేసుకొంటున్నదని, అమ్మనోట్లు వేస్తున్నదని - ఆవిడకెందుకు? ఈపిచ్చి వేషాలు? అనేవాడు కూడ ఇన్నిమాటలు, ఇంతకాలం - నాకోసం ఉపయోగించడం అనేది వాడిసమయంలో ఏదో ఒకమార్పు రావడానికని అనుకుంటాను. అక్కడాఉన్నది స్మరణే. ఇన్ని పనులు చేసిందని, ఇన్ని రూపాలిచ్చిందనే దెటువంటిదో - ఆవిడ మంచిదనో, చెడ్డదనో అనేదికూడ అందులో భాగమే.

× × × ×

వీ.ప్ర : నే చూచినవాడే ఇక్కడికి వస్తాడని మీరు చెప్పడంలో ఉద్దేశ్యమేమై వుంటుంది?

అమ్మ : ఎట్లా అర్థం చేసుకోవాలంటే--

వీ.ప్ర : నే చూచినవాడే అంటే ఇదివరకే నిర్ణయించబడినట్టుగా ఉంది.

అమ్మ : వాడి చేత నేనే అనిపించు కొంటున్నాననుకుంటున్నా

వీ.ప్ర : మీరు ఇదివరకే నిర్ణయమై పోయింది అని చెబుతున్నారు. నిర్ణయమై పోయినవారే ఇక్కడికి వస్తున్నారనా?

అమ్మ : శక్తితప్ప ఇంకేమీలేదని నేనేచెప్పింది. కర్తృత్వం లేదని, మీకెట్లాలేదో - నాకూ అట్లాలేదని - కర్తృత్వంలేదని నేనే చెప్పింది.

వీ.ప్ర : నేనంటే అక్కడ "అంతా అయిననేను" అని.

అమ్మ : అంతాఅయిన నేనుచూస్తేనే వస్తారని....

సో : అంతా అయిన నేను చూస్తే, ఇక్కడికి ఎందుకు వస్తారు?

శ్రీపాద : నీదృష్టిలో, చూడటం అని అంటున్నారు కాబట్టి చూస్తేనే వస్తారు.

అమ్మ : అసలు తరుణమే కారణం. తరుణమునే కాలమన్నాను. ఆకాలాన్నే ....పరిమితిగల నన్ను చూస్తే అనలేదు. అంతా అయిన శక్తిని గురించే చెప్పాను. అంతా అయిన నేను అనే అర్థం. మీరనుకుంటే అనుకోండి. మీరనుకోవడానికి నాబాధ్యతలేదు. westerlund నన్ను చూడలేదు. అయినా ఉత్తరాలు వ్రాస్తున్నాడు. ఒకడు ఆనందమాయి దగ్గర పొందుతున్నాడు. ఒకడు సత్యసాయి బాబా దగ్గర పొందుతున్నాడు. ఒకడు బషీర్‌బాబా దగ్గర పొందుతున్నాడు.

వీ.ప్ర : ఒకడు విగ్రహం దగ్గర పొందుతున్నాడు.

అమ్మ : తరుణమన్నప్పుడు అంతే.

శ్రీపాద : తరుణానికి కర్తృత్వమెవ్వరిది?

అమ్మ : తరుణానిదే.

శ్రీపాద : తరుణమంటే

అమ్మ : కాలం, బ్రహ్మస్వరూపం అన్న సిద్ధాంతరీత్యా -

సో : మరి - దానికి కాలమే లేదుగా?

అమ్మ : దేనికి?

వీ.ప్ర : అంతా అయిన శక్తికి

అమ్మ : నేనట్లాఅనుకోవడం లేదు. దీనికి కాలం వర్తమానం లేకపోతే మీకు కర్తృత్వం -

ఎప్పుడైతే దానికి కాలంగాని, పరిమితిగాని, ఏమీ లేకుండ, నిమిత్త మాత్రంగ జడంగ ఉన్నదనుకుంటే మీకు కర్తృత్వం బోధించేదాన్ని.

వీ.ప్ర : అంతా అయిన శక్తికి కూడ కాలం, పరిమితి ఉన్నాయి.

అమ్మ : కాలంగానూ ఉంది, పరిమితిగానూ ఉంది, అతీతంగానూ ఉంది.

సో : అదే అయివుంటే ఇంక అతీతమేమిటి?

అమ్మ : అతీతమంటే వీటన్నింటికి అంటనిదని వారు చెబుతున్నారు. అర్థంకాని స్థితిని అంటనిదంటున్నారని నేను చెబుతున్నాను. వీటన్నింటికీ అంటనిదని వారు చెబుతున్నారు. అంటనిదని వీరికేం తెలుసు? అర్థమైతే గదా, అంటలేదని వీళ్ళకు తెలియాలి? అది దేనికి అంటనిదని చెప్పడానికి వాడికర్థమైతే గదా – ఆమాట వాళ్ళు వాడేది? ఆపరమాత్మ స్వరూపం దేనికీ అంటదు అని చెప్పడానికి వాడి కర్థమైతే గదా? అది ఎట్లా ఉంటుందో వాడికి తెలిస్తే అంటకుండ ఉంది అని చెబుతాడు. అది కనిపించినపుడెల్లా వీడికంటినట్టే. కనిపించ నపుడు – దాన్ని గురించి మాట్లాడడానికి, వీడి కర్తృత లేదు.

శ్రీపాద : కనిపిస్తే అంటినట్టే.

## 25-3-76

శ్రీపాద : సృష్టిలోని వ్యష్టిత్వమంటే అది హఠాత్సంభవమా? ఒక ఉద్దేశ్యంతో ఏర్పడిందా? అన్న ప్రశ్న నిలుస్తున్నది. అది హఠాత్తుగా అయింది అన్నప్పుడు – గొప్ప తెలివైన వాడు ఉన్నాడు, లెఖ్ఖల్లో తెలివైనవాడూ ఉన్నాడు. ఒక గొప్ప సంగీత విద్వాంసుడూ ఉన్నాడు. మూడేళ్ళప్పుడే విక్టోరియా ఆల్బర్ట్ హాలులో ఒకమ్మాయి ఫిడేలు వాయించింది. ఆ అమ్మాయి ఫిడేలంత ఎత్తులేదు. కాని, ఫిడేలు పట్టుకొని, అందరూ పట్టుకొన్నట్టుగానే దాని తంత్రువులను పట్టుకొని, చక్కగా పాడి ప్రేక్షకులను రంజింపజేసింది. ఆమెకున్నటువంటి వయస్సు – ఆవిద్వత్తు సంపాదించడానికి చాలదు. ఎప్పుడో వచ్చింది అనుకొంటే అదో రకమైన సంతుష్టి వస్తుంది. ఇది వరకు నేర్చుకున్నాడు – అది వచ్చింది. వివేకానందస్వామికి తెలివి తేటలు ఎలా వచ్చాయి అంటే, సంస్కార

మంతా పూర్వజన్మల్లో అయిపోయి ఉంటుంది అన్నారు మహర్షి. మామూలుగ ఉన్నదొకటే ఆత్మ అని చెప్పేవాడికీనూ. కనుక ఏదో ఒకరకమైన సంతుష్టికోసంవారు చెప్పినట్టు కన్పిస్తుంది. ఒక్కొక్కప్పుడు వారూ జారారు. కాబట్టి ప్రతివాడికీ సంతుష్టి మార్గంలో ఎందుకు తేడాలున్నాయి? ఒకడు Genius గా ఎలా వచ్చాడు? గభాలున పుట్టుకొచ్చాడా? కారణం లేకుండా జరుగుతుందా?

అమ్మ : ఏకర్మచేత భూమికి పంపించాడో...

శ్రీపాద : ఆయనకు భూభారం తగ్గించాలనో, మనుష్యుల గురించి చేయాలనో ఉద్దేశ్యం పుట్టింది. Adam తప్పు చేశాడు. వాళ్ళనేమో తొక్కేశాడు. తన కుమారుని పంపి వాని తప్పులకు పరిహారం చేస్తే వారిని క్షమించడానికి, ఈయన స్వర్గమార్గం అనువు చేయడానికి పంపించాడు అంటారు.

అమ్మ : యెహోవా అంటే రూపంలేని వాడని వాళ్ళ అభిప్రాయం.

శ్రీపాద : ఎక్కడో ఒకచోట ఉన్నాడు అంటారు. మళ్ళీ అదోఘోష.

అమ్మ : దైవానికి రూపంలేదు. అయితే రూపంతో వచ్చినవాడు, మరియా కడుపున ఆమెకు పదేళ్ళప్పుడు పుట్టాడు. పుడతా ననో, పుట్టిస్తాననో చెప్పినట్టు బైబిలుకూడ ఉంది. ఎట్లా ఉపనిషత్తులు తీసుకుంటామో అట్లానే బైబిలు తీసుకుందాం. ఖురాను తీసుకొందాం. అన్నీ తీసుకొని, అన్నిటిలో సారం తీసుకొని – అదేమిటి? ఇదేమిటి? అని పరిశీలిద్దాం. మతభేదమవసరం లేదు. ఎట్లా సాయిబాబాను తీసుకొన్నామో, ఎట్లా రమణమహర్షిని తీసుకున్నామో అందరినీ, అన్నింటినీ తీసుకుందాం. వాళ్లు యేహోవా అనేది మనం సత్త అంటున్నాము. సత్తా అన్నా, ఆత్మఅన్నా ఒకటే. ఆత్మ చలించనిది. నిండి ఉన్నది. కదలని దాని నుండి కదిలే జీవి ఎలా పుట్టింది?

శ్రీపాద : వారు ఎవరూ చెప్పలేదమ్మా. ఎక్కడా చెప్పలేదు. ఎట్లా? ఎందుకు? ఎప్పుడు? అన్న ప్రశ్నలు మిగిలే ఉంటున్నాయి.

అమ్మ : జగత్తు ఎప్పుడూ ఉన్నదంటున్నాం. ఒకప్పుడు పుట్టింది కాదు. సత్తా ఎప్పుడూ ఉన్నదే. జగత్తు ఎప్పుడూ ఉన్నదే. ఈ మనుషులు ఎప్పటి నుండి ఏరోజు నుండి ప్రారంభమైనారు అనే లెఖ్ఖ ఎమైనా ఉన్నదా?

శ్రీపాద : పుస్తకములో లేదు. వాళ్ళు అనాదులే.

అమ్మ : కృతయుగం, త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం యుగాలపేర్లు చెప్పుకొస్తున్నారే, ఈనాలుగు యుగాల పేర్లివ్వటంలో ప్రపంచంలో ఈ నాలుగు యుగాలే మళ్లీ మళ్లీ వస్తున్నాయనా?

శ్రీపాద : వస్తున్నాయని వాళ్ళంటున్నారు.

అమ్మ : మళ్ళీ మళ్ళీ రాముడు, మళ్ళీ మళ్ళీ కృష్ణుడు, మళ్ళీ మళ్ళీ ఏసు వస్తారని అంటున్నారా?

శ్రీపాద : అని కూడ అంటున్నారు కొందరు.

అమ్మ : అన్నీ నమ్ముతున్నాం అనుకుందాం. అసలు మొదట ఆ సత్తాకు సంకల్పమా? కర్మతోనే జన్మ వచ్చిందనుకున్నప్పుడు కర్మ ఎవరు చేశారు. ఎక్కడ నుండి ప్రారంభమైంది. కర్మలేకుండ, సంచితం లేకుండ పుస్తకాలు లేవు.

శ్రీపాద : అవును

అమ్మ : నాకు అలాంటి కర్మ పెట్టి నన్నెందుకు ముందు పుట్టించాలి? అని అడుగుతున్నాను. శ్రీపాదకు విద్యవచ్చే కర్మ ఎందుకు పెట్టాలి? నాకేమి చదువురాని మొద్దుగా కర్మ పెట్టి నన్నెందుకు పుట్టించాలి? అని అడిగినపుడు ఆసత్తాకు పక్షపాతం ఉంది. కదలిక ఉంది. ఆలోచన ఉంది. కావాలనే కోరిక ఉంది. కనుక మీరు చెప్పే ఆత్మ కోరిక లేనిది కాదేమో అనిపిస్తుంది.

శ్రీపాద : ఈ సృష్టించిన సత్తా – మీరు చెప్పే సత్తా! కారణం కాజాలదు.

అమ్మ : మరి ఈ మనుష్యులు అనాది అనుకున్నప్పుడు రకరకాలుగా వస్తున్నారు. వీళ్ళకు లెఖ్ఖలేదు. ఏన్నేళ్ళ నుండి ఆసత్తా, కదిలింది అని లెఖ్ఖలేదు.

సంచితమైనా ఏరోజు పుట్టింది, అనేది లేదు. నాకది తెలియక, ఆత్మంటే ఏమిటో తెలియక సృష్టి ఎప్పుడూ ఉందనిపించి, వస్తువును వెతుక్కొని చూస్తుంటే - ఒక వస్తువులోని పంచభూతాలలోనే వ్యష్టిత్వం కన్పించింది. నేను అనుకొనదానికి కారణం పంచభూతాలలోనే ఒక భూతం - దానిలో ఇంకొక భూతం - ఒక దానిలో ఒకటి కలుస్తుంది. ఈ పంచభూత సమ్మేళనమే సృష్టి అని అనుకొన్నాను. ఎప్పుడు పుట్టినవి? అంటే ఎప్పుడన్నా పుట్టనీ! ఎప్పుడు పుట్టాయో నాకు తెలియదు. నేను పుట్టిన తర్వాత ఈ 54 సంవత్సరాలూ చూచుకుంటే పంచభూతాల వ్యత్యాసమే నాకు కన్పడుతున్నది. ఈవ్యష్టిత్వమే సృష్టిలో సహజం అనుకున్నాను. ఆలోచించి ఆలోచించి సహజం అనుకున్నాను. ఒక గింజను భూమిలో పెడితే - పెట్టేటప్పుడు ఒకటిగా ఉంది-

శ్రీపాద : రెండుడిప్పలై పోయి భూమి నుండి మొక్క వస్తుంది.

అమ్మ : ఆ ఒకటి రెండు కావడం చూచి - ఈ ఒకటి రెండు కావడం కన్పడుతున్నది. రెండింటి మధ్య బీజం కన్పడుతున్నది. ఈగుణం భూమికి ఉన్నదా? నీటికి ఉన్నదా? గాలికి ఉన్నదా? వెచ్చదనానికి ఉన్నదా? అని ఆలోచించుకున్నాను. భూమిలో నీరు, గాలి, వేడి ఉన్నది. అన్నింటిలో అన్నీ ఉన్నాయి. పంచభూతాలలో మీరు చెప్పే అన్ని తత్వాలు ఉన్నవి. చెట్టు దగ్గర నుండి కొండదాకా, రాయి రప్పదాకా - ప్రతి దానిలో చైతన్యమే కనబడుతున్నది. కదిలిస్తే కదిలేశక్తీ కదిలించకుండానే కదిలేశక్తీ రెండూ కనపడుతున్నది. కదిలించితే కదిలేశక్తికి కూడ నేను జీవత్వమిస్తున్నా. జీవం ఉంది అనుకొంటున్నా. చెక్కకొన్నాళ్ళకు పుచ్చిపోవడం కూడా పరిణామదశే. కొయ్య అంటే ఎక్కడిది? ఒక చెట్టు చెక్కే. నాయింటిలో ఉన్న బీరువా ఎక్కడిదీ అంటే ఏతోటలోనో టేకు తెచ్చి బీరువా చేయించుకున్నది. అక్కడ చెట్టుగా ఉన్నది. ఇక్కడ బీరువాగా ఉన్నది. ఈ బీరువా కొన్నాళ్ళయిన తర్వాత పుచ్చిపోయింది. అందులో

పుచ్చి పోయినదానికి తొలిచే పురుగు ఒకటి కన్పడ్డది. అది తినే పురుగు. దాన్ని తినే పురుగు ఇంకొకటి బయలు దేరింది. దేనికేర్పడ్డది ఆచెదలు అంటే ఎటువంటి వస్తువునైనా తినగలదు. పురుగు ఆకారం ఎంత అందమైనదంటే గాజు పూసలా ఉంటుంది. ఇంత చిన్న - పురుగు అంత పెద్ద దూలాన్ని తినేస్తుంది. దీని పొట్ట ఎక్కడ? పెద్దదా? దీనికి ఆహారమేమిటి? ఈ పుస్తకాల్లో ఉండే పొడే ఆహారమా? గుద్దలు కొట్టేస్తేదానిలో ఉండే సారమే ఆహారమా? ఇదే తిని బ్రతుకు తున్నదేమో అన్పిస్తుంది.

శ్రీపాద : చెదలు దానిలోనే ఉన్నది కనుక.

అమ్మ : నారింజ పండు క్రుళ్లి పోయింది. అందులో నాకు పనికి రాలేదని అవతలపారేస్తే, ఇతర పురుగులువచ్చి తిన్నాయి. ఈ ద్వంద్వమనేది రకరకాలుగా అన్నింటిలోనూ కనబడు తున్నది. చీరను చూస్తే పత్తిగింజే గుర్తుకొస్తుంది గాని ఇంకొకటి గుర్తుకు రాదు. అట్లాగే గింజ దగ్గర కెళితే పంచభూతాలే గుర్తుకొస్తాయి.

శ్రీపాద : అవి దేనికి సముచ్చయమో అవి జ్ఞాపక మొస్తాయి.

అమ్మ : ఏది లేదో? ఏదికాదో? అని ఆలోచిస్తే గొడ్లకు వేసిన చెత్త అంతా ఒక చోట చూశాను. గొడ్లముందర పేడ. దానికి సమీపాన మేత. అక్కడే దిబ్బలాగా పనికి రాని గడ్డి అంతా వేసి ఉంది. గొడ్డు ముందర మేత, వెనక పేడ, ఎదురుగాపనికి రాని మేతవేసి ఉంది. అదే ఆకారంతో అక్కడే వామి ఉన్నది ఇంకా దృష్టి పోనిచ్చి చూస్తే నారు మడిగా ఉన్నది. నా గోనెలో విత్తనంగా ఉంది. డబ్బాలో బియ్యంగాఉంది. ఆగిన్నెలో అన్నంగా ఉన్నది. నాకడుపులో ఆహారంగా ఉన్నది, ఏది చూచిన ఏదో ఒకటి, ఇన్నిగా మారినట్లు అనిపిస్తున్నది. అన్నింటిని గురించి ఆలోచించేది ఏది అని ఆలోచన ఈ ఆలోచించేది ఏమిటి అని ఆలోచన. ఇన్నింటిని ఆలోచించే మనస్సుకు ఆకారంగా అందరూ,

ఇన్ని ఆకారాలు గుర్తించే ఆ మహాశక్తి ఆకారంలా కన్పడలా, ఆకన్పించక పోవడంలో దీని పేరు ఏమిటంటే శక్తి అనుకున్నాం. అంటే దానికి రూపం లేదు అన్పించింది. రూపంలేదు గాని గ్రహించే స్వభావం అన్పించింది. ఆస్వభావమేమని పించిందంటే ఇన్ని కాగలిగిన స్వభావం ఏర్పడింది కాబోలు అన్పించింది. ఆశక్తే అన్నీ అన్పించింది. శుక్ల శోణితాలుగా ఆలోచించినా జీవ కణములోనే తొమ్మిది నెలలు నిండేటప్పటికే వాడి ఆకార మంతా తయారవుతున్నది. దేనివల్ల ఇట్లా తయారవుతుంది? ఏనెలలలో పని చేస్తుంది? ఎందుకున్నది అంటే చెప్పగల సమాధానం లేదు. ఆశక్తి దానికి ఎందు కున్నది. అంటే చెప్పలేం. చెప్పగలిగిన సమాధానం నాకు దొరకక, ఈశక్తికే దేవుడు అని పేరు పెట్టుకొన్నా, దేవుడు అంటే అర్థ మేమిటో తెలియదు. అందరూ వాడుతున్నారు నేనూ వాడుతున్నాను. ఆశక్తికి ఏదనుకుంటే అట్లా కనపడగల శక్తి ఉంది. ఏ రూపాన్ని గురించి నాలుగు రోజులు ఆలోచిస్తే అదె భాసిస్తుంది కనిపిస్తుంది.

శ్రీపాద : ఆ రూపం కన్పిస్తుంది.

అమ్మ : ఈశక్తే అక్కడ ఆరాధించింది. ఈశక్తే చిత్రించుకున్నది. ఇదే కనుక దానిని చూస్తున్నది. రవివర్మ వేసిన రాముడి బొమ్మను నేచిత్రించుకున్నా. రామాయణంలోగల దానిని చిత్రించుకొని బొమ్మ అల్లుతాడు. సరస్వతి వీణమీటు తున్నట్లు వేస్తాడు. చేతిలో, వీణ, తంబుర ఉండగా సరస్వతి అని పిస్తుంది సరస్వతే అనుకున్నా ఆబొమ్మను నేను ధ్యానం చేసి నపుడు ఇక్కడ ఉన్నశక్తే చిత్రించుకుంది కనుక దానినే చూస్తుంది.

శ్రీపాద : చిత్రించుకున్నదాన్నే చూస్తుందంటారా? లేక తననే చూస్తుం దంటారా?

అమ్మ : తను దానిని చూస్తుంది. చిత్రించుకున్నదే చూస్తుంది. చూచి నప్పుడు ప్రత్యక్షమైంది. ఇది సాకారము.

శ్రీపాద : అక్కడ ప్రత్యక్ష మవడానికి వేరే ఆధారం లేదు.

అమ్మ : ముక్కుకు, చెవుకు ఆకృతి ఉన్నదికాని మనసుకు ఆకృతిలేదు. లేనప్పుడు ఈశక్తిని ఎట్లా పోల్చుకుందామంటే, దేన్నిగూర్చి ఆలోచించేటప్పుడు, అదిగా ఉంటుందని చెప్పగలిగిన వాళ్ళం మాత్రమే మనం – రంగుటద్దాల లాగా ఉన్నదే శక్తి. అయితే ఈశక్తి దేనిని తెలుసుకోవాడాన్కి ప్రయత్నిస్తున్నది?

శక్తే శక్తిని తెలుసుకోవాలి. శక్తి తెలుసుకోవాలంటే ఇంకొకటి ఆధారం కావలసి వచ్చింది. ఓపిక లేనివాడు నడవాలంటే కఱ్ఱఆధారమై నట్లుగా. కాని ఆ కఱ్ఱ ఆధారంగా ఉన్నది, నేను గట్టిగా పట్టుకొంటేనే ఆధారం కాని వంకరగా పట్టుకుంటే పడేస్తుంది. ఆబొమ్మకూడ నేను నిలుపుకొంటే నిలిచేదే కాని నేను కాదనుకుంటే పోతున్నది. చేతలు నీ చేతుల్లో లేవని ఎందుకన్నానంటే, మనస్సు – దానికి ఒకచోట నిలిచే స్వభావం లేదుగనక పరుగెత్తే స్వభావం. ఆలోచనే దాని స్వభావం గనక మనసును స్వాధీనం చేసుకుందాం అనుకుంటాడు మానవుడు. పరుగెత్తే స్వభావముంది గనుకనే పట్టుకుందామను కుంటాడు – పట్టుపడదు: దానిలీల అది. దాని స్వభావమది. కట్టుబడితే కనబడతాడని చెప్పటంలో ఉద్దేశ్యమేమిటంటే – వీడికి నిలవదు – వాడికి కనబడదు. నిలవదు. కనబడదు. అక్కడకూడ నీ జన్మవల్ల, నీకర్మఫలంవల్ల – నీమనసు నీకు స్వాధీనం కాలేదు అంటారు ప్రారబ్ధమడ్డు వస్తున్నది అంటారు.

శ్రీపాద : ఎందుకు అంటే తెలియదంటారు.

అమ్మ : ప్రారబ్ధమంటే ఏమిటి? చెప్పేవాడిప్రారబ్ధము, వినేవాడి ప్రారబ్ధము రెండున్నాయట. చెప్పేవాడికి ప్రారబ్ధం ఉందనే చెప్తాదుగా! వీడికి చెప్పే ప్రారబ్ధం పట్టింది. వాడికి వినే ప్రారబ్ధం పట్టింది. ఇద్దరికి ప్రారబ్ధంపోదు అంటున్నది శాస్త్రం. ప్రారబ్ధమంటే పరమాత్మ అంటున్నా.

శ్రీపాద : ఉన్నదానిలో ఒక భాగమే.

అమ్మ : నిండిఉన్న సత్తలోగదా ఇదంతా? నిండి ఉన్న సత్తలోనుంచి వచ్చిన ఇవన్నీ సత్తేగాక ఇవన్నీ ఏమవుతాయి? సత్తకు, నాకు మధ్య ఎవరూలేరు. ఆలోచించాను - ఎవరన్నా ఏర్పడితే సత్తయే కారణమై ఉండాలి.

శ్రీపాద : నిండి ఉన్నదదే గనుక సత్తయే కారణమవాలి. ఏర్పడదానికి సత్తాయే కారణం. ఉన్నదే సత్తకారణం? అదిమారేది....

అమ్మ : ఒకవేళ మీరు చెప్పినట్లుగా ఎవరన్నా ....పాలల్లో అనేక రకాల పురుగులు ఏర్పడ్డట్టు, రక్తంలో అనేక పురుగులు (జీవాలు) ఏర్పడ్డట్టు ఒక చిన్నవస్తువు ఒకజీవుడుగాని, బొమ్మగా, తల్లి దగ్గరబిడ్డగా, ఒకభాగంగా దేవుడు ఉన్నాడని అంటారా?

శ్రీపాద : అంటున్నారు. లింగశరీరం అంటున్నారు.

అమ్మ : లింగశరీరమని, కారణశరీరమని ఏమో చెప్తారు. ఆలింగ శరీరమనేది వెళ్లేటప్పుడు కనిపించాలి. చుట్టూ డాక్టర్లం కనిపెట్టుకొని కూర్చున్నాం, లింగశరీరమే అయితే కనపడి తీరాలి. శరీరమంటే కనపడని శరీరం లేదు. కనపడితేనే శరీరం. కనపడుతున్నది గనుక శరీరం. పోయింది కనపట్టం లేదు. శరీరం కనబడుతున్నది. సూక్ష్మశరీరమంటే కనిపించ కుండా పోయేదా?

శ్రీపాద : అనే అనుకోవాలి. సూక్ష్మం అన్నారు గనక.

అమ్మ : సూక్ష్మం అంటేచిన్నది స్వల్పమనేగదా! ఆచిన్నది చిన్నదానికి తెలియాలి. సూక్ష్మశరీరానికి....దీనికి ఒకలోకం ఏర్పరచి - సూక్ష్మశరీరాలన్నీ పోగానే, పోయి కొంతకాల మక్కడ ఆగివస్తాయని ఒక భాగం. అవతలి శరీరాన్ని చూచుకొని లేచిపోతాడనేది ఇంకొక సిద్ధాంతం.

శ్రీపాద : గొంగళిపురుగు లాగానా?

అమ్మ : అవతల శరీరం చూచుకొని లేస్తుందనంటే గర్భం దాల్చి నప్పుడు ఇందులోనుంచి లేవాలి. పరిమితి గల సంచి అయివుండాలి. శరీరాన్ని చూచుకొని శరీరం వదలి పెట్టేట్లయితే పరిమితి గలవే అయివుండాలి.

అయితే కాకి మనిషి జన్మకే వచ్చి, కుక్కా మనిషి జన్మకే వచ్చి ఎనభైనాలుగు లక్షల జీవరాసులు మనిషి జన్మకే రావాలని వస్తాయా? అవి ఏకర్మచేసి ఈజన్మకొచ్చాయి? ఏకర్మ చేసివీడు ఈజన్మకొచ్చాడు? ఇది మరోభాగం. ఒక అకతాయి ఉన్నాడు. చేయకూడని పనులు చేశాడు. వాడు పందో, కుక్కో, గొంగళి పురుగో, గాజు పురుగుగానో రావడానికి వీలుంది. వాడు మళ్ళీ ఒక జ్ఞానిచేతిలో నీళ్ళుపడి – ఆపురుగు వాడి మీదపడో – కుట్టో, ఆ రక్తంతాగో మరోజన్మ కొచ్చింది. అది కుట్టి నప్పుడు ఈ జ్ఞానికి సంస్కారలోపం వల్ల అది కుట్టిందా?లేక ఇది ఏ సంస్కారంతో వాణ్ణి కుట్టింది? ఒక తేలు నాకు కుట్టింది కాని జ్ఞానికి సంస్కారం తీరటంవల్ల బాధ పెట్టిందాలేక అది జ్ఞానం సంపాదిందు కోవడానికి వీణ్ణి కుట్టిందా? తేలు జన్మమారి ఇంకొక కప్ప జన్మరావాలి. కప్ప జన్మ మారి ఇంకొక జన్మ రావాలి. ఒక జంతువుకు ఇంకొక జంతువును తినేగుణముంది. హింస అని వీళ్లను కున్నట్టయితే వాటిల్లో వాటికే పాపం పెరుగుతున్నది.

శ్రీపాద : అందుకే సంధ్యావందనంలో రాత్రిచేసిన పాపం ఇప్పుడు పోవుగాక అని అనడం.

అమ్మ : మనుష్యుల్లో కూడ ఏరకంగాచూచినా చైతన్యమే కనబడు తుందని పెద్దలుకూడ అంటున్నారు.అంతా జీవత్వంగా కన్పడుతున్నది. నీళ్ళలో పురుగులు కన్పడుతున్నాయి. త్రాగుతున్నాం. గాలిలోనూ ఉన్నాయి. నీ సందునా నా సందునా ఉన్నాయి. నాలో ఉన్నాయి. కనుక ఎప్పుడూ హత్య చేస్తూనే ఉంటా. జీవహింస అన్నది ఎప్పుడూచేస్తా. జన్మలో అనేక పురుగులు శ్వాసలో గుండా పోతాయి. అవన్నీ దగ్ధమైలోపలికి పోయి, జ్ఞానాన్ని సంపాదించుకొని – ఇవి కూడ జ్ఞానులుగా బయటికి వస్తున్నాయా?

శ్రీపాద : అనే మరి వాళ్ళ ఉద్దేశం.

అమ్మ : రకరకాలుగా చెప్పుకొస్తున్నారు. ఏదీ అందక, ఏదీ తోచక, ఏమీ తెలియక – ఆసత్త అనేదే ఈ శక్తి, ఆశక్తి యిన్ని అయింది. శక్తిగా ఉంది. అంతే, శక్తికి చైతన్యం లేదు అనడానికి వీల్లేదు. శక్తి యిన్ని అయింది. శక్తి శక్తిలో కలసిపోతున్నది. శక్తే చైతన్యం. ఇందులో శ్రీపాద కల్పించిం దేమీలేదు. నాకు తోచిన అభిప్రాయం చెప్పాను. శ్రీపాద మొదట్లోనే అమ్మ ఇట్లు చెప్తుంది అని ఊహించి వచ్చిన శ్రీపాద కాదు. దారి దొరక్క, మనసుకు అందక వచ్చారు. ప్రత్యేకమైన ఆత్మ సాక్షాత్కారం నేను పొందలేదు. ఈ కనపడుతున్నదే ఈ విశ్వమే నాకు ఆత్మ సాక్షాత్కారం. కనపడు తున్నదంతా చైతన్యమే అనుకుంటున్నా. ఆ చైతన్యమే ఆశక్తి అనుకున్నా. ఆశక్తే ఈశక్తి అనుకున్నా ఆశక్తి అంటే ఒకటే కాదని మీరు నేను ఒకటే అని అనిపిస్తుంది.

శ్రీపాద : అంతలో మీరు కొంత భాగమనిపిస్తుందా? మీరే అంతా అనిపిస్తుందా? లేక తక్కినవి మీభాగా లనిపిస్తుందా?

అమ్మ : మీరంతా నాఅవయవాలు అని అన్నా నొక చోట. ఇదంతా నేనే. ఉన్నదంతా నేనే. అయితే జడత్వం నాకు ఎక్కడా కనపడదు. సత్తా అని మీరంటున్నారే – ఆసత్తా ఈ శరీరం అనిపిస్తున్నది అందుకే శరీరం ఆత్మకాకపోలేదు అన్నాను.

శ్రీపాద : మీరు చూస్తున్నదంతా సత్తే.

అమ్మ : విచ్చిన పువ్వూ, వాడిన పువ్వూ సత్తే, విచ్చుడానికేర్పడిన మొగ్గా సత్తే, మొగ్గవెయ్యడానికి మొలచిన చెట్టూసత్తే, దానిని పోషించ దానికి పోసిన నీరూసత్తే, పాదివేసిన భూమీసత్తే, బీజమూ సత్తే, బీజము రెండుగాజేసి పైకిపంపిన భూదేవతా సత్తే – అని నా ఆలోచనకు వచ్చిన సమాధానం సత్త అనేకమైందని ఎందుకంటున్నా నంటే – అడిగేది చెప్పేది ఏర్పడ్డది గనుక.

శ్రీపాద : సత్త కానిది లేదంటారు.

అమ్మ : వాళ్ళు చెప్పినదాన్ని బట్టి అన్ని రకాలుగా ఆలోచించాను. నాకందింది. నాకు కనబడిందీ కనబడందీ దైవమే. సత్త దైవమనే – పేరేముంది?

శ్రీపాద : కనబడకుండా ఉన్నది...

అమ్మ : లండనుంది, న్యూయార్కుంది మరొకటుంది. వసుంధర అంటేనే వసుంధర పలుకుతున్నది. దగ్గరగా ఉన్నది పలుకు తున్నది. దూరంగా ఉన్నది పలకటంలా, అదీ సత్తే. దీనికంటె అది బలం గలదో దానికంటె ఇది బలము గలదో కాదు. దూరంగా ఉండగలగటమూ సత్తే. దగ్గరగా ఉండగలగటమూ సత్తే, ఉన్నదే అది. ఒక గజములోనే ప్రత్తి చెట్టయింది, మెట్టతామర చెట్టయింది. గులాబి చెట్టయింది. సంపెంగ చెట్టయింది కొన్ని చెట్ల నీడన కొన్ని చెట్లు చచ్చి పోతాయని నిన్న అమ్మాయి అన్నది గదా – నీడ కారణమని ఎట్లా అంటావు. తీసుకొనదానికి దానికి కావలసిన ఆహారం అక్కడ దొరకలేదు. ఒక గజములోనో నాలుగురకాల మొక్కలు మొలిచినవి ఉన్నాయి. రోడ్డున మర్రిచెట్టు, తాడిచెట్టు, వేపచెట్టు వేస్తున్నారు. పెద్దపెద్ద వృక్షాలవుతున్నాయి. ఆకాస్త దూరంలో దీనివేరు, దానివేరు అల్లుకొని పోతున్నాయి. గర్భములో నాలుగు గజాల లోతుకు పోయేటప్పుడు నాలుగువ్రేళ్ళు అల్లుకొని పోయివున్నాయి.

శ్రీపాద : దానికి కావలసిన ఆహారమది తీసుకుంది. దీనికి కావలసిన ఆహారం ఇది తీసుకుంది.

అమ్మ : ఒక చెట్టునే అంటున్నాం ఆమాట. పొట్ల చెట్టుంది దీని నీడ పడితే ఇంకొక మొక్క బ్రతకదు. ఒకదానికెండ కావాలి. దానినీడ పడితే మరొకటి బ్రతకదు. దీనికి నీడ కావాలి. అదే భిన్నత్వం. జిల్లేడుగింజలు మొలిస్తే శక్తిలేదని గాదు. ఒకటి ఒకచోట-మరొకటి మరొకచోట. వెరైటి. ఒకనెలలో కొన్ని మొలుస్తాయి. మరొక నెలలో కొన్ని మొలుస్తాయి.

శ్రీపాద : వైవిధ్యమే.

అమ్మ : ఆవైవిధ్యమేసృష్టి. మనుష్యుల్లో మన స్తత్వాల్లో – తినటం, నిద్ర శరీరానికి కావలసినవన్నీ తెలుస్తున్నాయి. కాని ఒకే మనిషిలో అభిప్రాయాలు

రకరకాలుగా మారిపోతున్నై. ఒకడి మనస్సు లోనే ఎల్లప్పుడూ అభిప్రాయాలు ఒకటిగా వుండవు. అందరి మనస్సులు ఒకటైతే అందరి ఆలోచనలు ఒకటిగా వుండవద్దా అని ప్రశ్నిస్తాడు - ఒకడి మనసే ఎప్పుడూ ఒకటిగా వుండదు.

శ్రీపాద : మారుతూ వుంటుంది.

అమ్మ : దాని స్వభావమది. స్వభావమని ఎందుకంటున్నానంటే, నాకు చెప్పడానికి అంతకంటె పదం దొరకలేదు. చేతకాలేదు. పాండిత్యం లేదు. స్వభావ మంటే అదే.

శ్రీపాద : దానినైజం.

అమ్మ : అయితే సాధన విషయంవస్తుంది. ఒకడు కర్మను తీసుకొని అనుభ విస్తున్నాడు. చప్పట్లు చరుస్తూచేస్తే భజనఅన్నాం. అందరం కలిసి చేస్తే ఏకాహమనో, సప్తాహమనో పేరు పెట్టుకొన్నాం. ఆమాటే లోపల్లోప లనుకుంటే జపమను కున్నాం. ఆ మాటనుకొంటూ కూర్చుంటే ధ్యాన మన్నాం. యోగమంటే ఒక పద్ధతి, లేక ప్రకారం అని అర్థం. యోగము లో శ్వాస బిగించికూర్చోవడం ఒకపద్ధతి. ఉచ్ఛ్వాస నిశ్వాసము లను గమనించడం మరొక పద్ధతి. ఈ రెండూ కదలకుండ ఆపి శరీరాన్ని గమనిస్తూ ఏమీ జరుగుతుందో అని కదలకుండ కూర్చుంటాడు. కదిలించేది లోపల ఉన్నది గనుక, కదిలేదే కదులుతున్నప్పుడు వాడు చేస్తున్నదాని వల్ల - కదలిక వల్ల లోపల ఏదో కదులుతుంది అనుకుంటాడు ఒకడు. నడుస్తున్నప్పుడు గుర్తించలేం. కూర్చున్నపుడు గుర్తిస్తాం.

శ్రీపాద : దాని కదలిక

అమ్మ : నడుస్తుంటే గమనించేంతగా ఉండదది. భూమి గుండ్రంగా ఉంది. భూమి తిరుగుతున్నది అనరు. భూమితిరుగు తున్నట్లు గా అర్థమవుతున్నదా? చంద్రుడు తిరుగుతున్నట్టు అర్థమౌ తున్నాదా? అటువంటి కదలిక మనలో ఉంది.

శ్రీపాద : కదలిక కదులుతున్నప్పుడు తెలియదంటారు.

అమ్మ : భూమి కదలినప్పుడు తెలియదు. కాని కదులుతున్నదని చెబుతున్నాం. చంద్రుడు తిరుగుతున్నట్టు తెలుస్తున్నది. సూర్యుడు తిరుగుతున్నట్టా కన్పిస్తుంది. భూకంపం లాంటిది?

శ్రీపాద : కూర్చున్నప్పుడు కంపం లాంటిది జరిగేది.

అమ్మ : ఆ పదం యోగాభ్యాసానికి పెట్టారు. పంచభూతాలు– పంచ భూతాల్లో కలసినట్టే, సత్త సత్తలో కలుస్తుంది అన్నా, అటలనే మరచెంబులో నీళ్లు, బిందెలో నీళ్ళు, చెరువులో నీళ్ళు – నీళ్లే గనుక, ఇన్ని కలిపి ఒకదానిలో పోస్తే, ఆరూపంగానే ఉంటుంది. అన్ని రకాల నీళ్ళు, వేరు వేరుగా ఉన్నవన్నీ ఒక దానిలో పోస్తే ఒకే ఆకార మెట్లాఉందో, సత్తలో సత్త కలిస్తే అట్లా ఉంది. అందుకే అర్థం కాదు. గోచరించదు, గోచరించదు అనే పదం అందుకు వాడారు వారు.

శ్రీపాద : సత్త సత్తలో కలిస్తే కనపడదు గనక.

అమ్మ : ఏ వస్తువు ఆవస్తువులో కలిస్తే కనపడదు. అట్లాగే సత్త సత్తలో కలిస్తే కనపడదు. అందుకే అర్థం కానిదని, మనసుకు అందేది కాదని అన్నారు, కలసిన తర్వాత కనపడేదేముంది? గోచరించేదేముంది? నాల్గుబిందెల్లో గల నీళ్ళు – ఒక బిందెలో పోసినట్టు.

అమ్మ : అన్ని జన్మలకన్న మానవునిది ఉత్తమ జన్మ అంటున్నారు గదా!

సో : కాదా?

అమ్మ : జ్ఞానము ఏ జంతువైనా సాధించుకో వచ్చుగా!

సో : వీని కంటె బహుశః మనకే ఎక్కువ అవకాశముంది. మనిషికి శ్రమించ దానికి లేక జ్ఞానం పొందదానికి శక్తి ఉంది. ఈ అన్వేషణ జంతువులు చేయగలవా?

అమ్మ : చేస్తాయి.

సో : నీవు చెప్పేవి అన్ని జంతువులకూ అర్థమౌతుందా?

అమ్మ : మనుష్యుల కందరకూ అర్థమౌతుందా?

సో : అయిన వాళ్ళ కవుతుంది.

అమ్మ : కుక్కలకు కూడ అయిన వాటికి అర్థమౌతుంది.

సో : అవుతుందా?

శ్రీపాద : వాటికి వాటి భాషలో చెపుతుంది.

అమ్మ : అర్థం కావడం కాదు భాష అన్నాం. భావం చేత భాష పుట్టింది. శబ్దం చేత ధ్వనిచేత అక్షరాలు పుట్టినాయి. భావం ప్రధానమైంది. ఎందుకైనా, భాషకు మూలం భావం. భావం - కుక్కలో ఉండవచ్చు, నక్కలో ఉండవచ్చు, తేలులో ఉండవచ్చు. దొంగను చూస్తే మనిషి కెంత భయమో (యజమానికి) యజమానిని చూస్తే దొంగకూ అంతే భయం. తేలు కుడుతుందని మన మెంత భయ పడుతామో, చంపుతారు అని అదీ అంత భయపడుతుంది. మనం చేసే ఆహారం ఉత్పత్తి వాటిలోనూ ఉంది. మన మీనాడు సైన్సులో కని పెట్టడానికికాధారం జంతువులే అవుతున్నవి. కోశాలన్నీ కోసి చూస్తే మనకెట్లా ఉన్నాయో గర్భకోశం వాటికీ ఉన్నవి. మనిషిని అర్థం చేసుకున్నంతగా జంతువునర్థం చేసుకునే శక్తి మనలోనూ లేదు. ఒక రెండు రోజులు కోతిని కొడితే ఆ మనిషి ఉండగా అది ఇంటికిరాదు. కుక్కను రెండు రోజులు కొడితే, ఆ మనిషిని చూస్తే బెదిరి పోతుంది - దగ్గరకు తీసేవాడిని చూస్తే దగ్గర కొస్తుంది. ఇటువంటి తెలివితేట లున్నాయి. ఒక కుక్కను కావాలని చంపించారు. మూడు కుక్కలను చంపేస్తే, అందులో ఒకటి చావబోయి నెత్తురు కక్కుకుంటూ ఆపిచ్చికుక్క నేను చల్లచేస్తుంటే, ఆచల్ల చిందులు నాకి పాదాల మీదపడి చచ్చిపోయింది. ఇక్కడే పూరింట్లో ఉండగా.

సోదరులు: ఎక్కడమ్మా! ఇక్కడేనా?

అమ్మ : రోజూ నన్ను చూస్తున్నది. ఇక్కడ అమ్మ ఉన్నదని దానికి తెలుసు. అమ్మను నేనని చివరకది గ్రహించింది. ఒక గుడ్డి గేదె ఉంది. నేను ఒంటరిగా

వెళితే, నాతోకూడ వచ్చి దించివెళ్ళేది. రాత్రిపూట ఎవరూలేకపోతే ఎద్దులువచ్చినవిరా అని అరిచేది. నన్ను రమ్మని అరిచేది. నన్ను రమ్మని పిలుస్తున్నదనే నేననుకునేదాన్ని. ఒక పిల్లిఉంది. నాన్నగారు ఊరినుండి రాగానే నా కాలు గీరేది. వచ్చినట్లు గుర్తుచెప్పేది. ఇంట్లో జంతువులతో నాకు పరిచయముంది.

పందికొక్కులుండేవి. మన యింటినిండా యాభై అరవైకన్నాలు చాలా ఉండేవి. ఒక రోజున రెండు పందికొక్కులకు జబ్బుచేసింది. సామాన్యంగా జబ్బుచేస్తే వాటిస్వస్థానం వదలిపెట్టి బయటికిరావు. ఇంట్లోనే ఉంటాయి. బయటికి వచ్చినాయంటే జబ్బు చేసినట్లే గుర్తు. సాధారణంగా మనుష్యుల మధ్యలోకిరావు. ఆనాడు ఒకదానిని సుబ్బయ్య ఇటుకరాయి తీసుకొని కొట్టాడు. ఆ దెబ్బకు తట్టుకొని కొంచెం తప్పుకొంది. నాన్నగారికి అన్నం పెడదామని కంచంపెట్టాను. ఆదెబ్బతిన్న పందికొక్కువచ్చి నాన్నగారుతినే వెండికంచంలో పడుకొని అందులో ప్రాణం విడిచింది. నేను కాఫీపొడి కొడుతున్నాను. గబగబావచ్చి నావెనక అనుకొంది ఇంకొక పందికొక్కు. అదిపోయిందని చెప్పడానికిది వచ్చింది. ఆహారం దాచుకొని రేపు తిందాములే అనే ఊహ ఉందో లేదో నేను వాటిని గూర్చి ఎక్కువ గ్రహించలేదు. అన్నం నేను పెడుతున్నాను గనుక రేపెందుకులే దాచుకోవటం అనుకున్నాయో, అవసరం లేదనుకున్నాయో!

నేనున్న కాసేపు పిల్లి, ఎలుక వైరం లేకుండ తిరిగేవి. నా పమిటలో ఒకచోట ఎలుక, ఒకచోట పిల్లి కూర్చునేవి. ఒకనాడు కొమ్మూరు డాక్టరుగారు రాగా నేనాయనతో మాట్లాడుతున్నాను. ఎలుకతోక పొడవుగా వుంటుంది. పిల్లి ఇట్లా కూర్చుంది. ఆయన ఒక్కసారి "ఆ! పాము" అన్నాడు. కాదు నాయనా ఎలుక, పిల్లిలే అన్నాను. చూశాడు రెండూ కనబడుతున్నవి. ఆసంఘటనను చూచిన కొమ్మూరు డాక్టరు గారు కుర్చీదిగి క్రింద కూర్చున్నారు. అదే ఆయన నమస్కారం చెయ్యటం.

కుక్క పిల్లికి పాలిచ్చింది. ఆఫోటోకూడ ఉండాలి. తల్లి ప్రేమంటావా! ఒక కుక్కను, ఇంకొక మగకుక్క ఏంచేసిందంటే పసిబిడ్డలుగా ఉన్నప్పుడు - బిడ్డలను పోషించుకోవాలనిపిస్తుంది కాని, ఇంకొక కోర్కెకలగదు వాటికి. బిడ్డల ముందు భర్తకూడ కనబడదు మామూలుగా! అటువంటి స్థితిలో ఆకుక్కను-ఒక కుక్క చీల్చి పారేసింది. ఆపాలిచ్చే భాగమంతా తోలు వేళ్ళాడుతూ దానితోపాటే పరుగెత్తింది. దానితోపాటు దాని చీరిన భాగాన్ని పట్టుకొని పిల్లలుపాలు త్రాగుతుండేవి. తాగుతుంటే నెత్తురొస్తుండేది. ఆనెత్తురే ఇవి పీలుస్తుండేవి ఆ నెత్తురు పీలుస్తున్నా అది అలాగే సహించి పడుకునేది - తన బిడ్డలకు పాలిస్తున్నానన్న ఆనందం పొందుతూ - ఆభావంతో వాటిలో సహనం, ప్రేమ, వాత్సల్యం-ఇన్ని చూశాను. అదే మనిషిలోనూ చూడలేకపోయినాను. జంతువులలో లేనివి మనుష్యుల్లో ఉండవచ్చు. ఒక మనిషిలో ఉన్న గుణం ఇంకొక మనిషిలో లేకపోవచ్చు. హస్తిమశకాంతరం సహజం. ఇందువల్ల మనిషి జన్మే ఉత్తమజన్మ అని నేననను.

సో : సాధన చేయకపోవచ్చు.

అమ్మ : సాధనంటే ముక్కు మూసుకోవటమా? ఇరవై నాలుగుగంటలు నాదగ్గరకు వచ్చి నన్ను చూస్తూకూర్చునేవి. అమ్మదగ్గరే పడుకునేవి. ఏభావంతో సాధన చేస్తున్నవో మనకు తెలియదు. మనకే లేదా ఆలోచన. సాటిమనిషిని గుర్తించగలమా? కుక్కలదాకా పోయావేం.

సో : లేదు.

అమ్మ : అట్లాగే, సాటి మనుష్యుల మనస్తత్వాలనే గ్రహించలేని మనం భిన్నమైన జంతువులను వాటి ఉద్దేశ్యాలను, అభిరుచులను, వాటి ఆలోచనలను, మనసులను, క్రియలను ఏమర్థం చేసు కుంటాం? ఎన్నో జీవరాసు లున్నాయి. మరెన్నొ క్రిమి కీటకాదులున్నాయి. ఎన్నో జాతులు! వాళ్ళు చెప్పినన్ని ఉన్నాయో, లేదో తెలియదు. ఎనభై నాలుగు లక్షల జీవరాసులని

లెఖ్ఖపెట్టేరంటే అదికూడ అబద్ధమని నేనను కుంటా. ఎక్కువ ఉండవచ్చు. మన మనస్సునే మన మర్థం చేసుకోలేం. ఈ పూట ఉన్న అభిప్రాయం రేపు ప్రొద్దున మారిపోతు న్నది. అటువంటిది, వాటినేం అర్థం చేసుకోగలం?

సో : జంతువులు, మనుష్యులు ఒకటే Level అంటా మన్నమాట.

అమ్మ : వాటికీ ఉన్నది అన్నాను. నేను higher, lower ఎవరిలో చూడను. గొడ్డులోనూ చూడను. వాటికీ స్వభావం, మనసు, ఆలోచన, అవగాహన, జ్ఞానం ఉంది. మనకూ ఉన్నదను కుంటాను కాని, మన కంటె ఎక్కువా తక్కువా అనే కొలత కొలవ లేను. వాటిలోనూ విషయం తెలుసుకొనేవీ ఉన్నవి. నాకు అనుభవమైనంత వరకే చెప్తాను కాని అందరినీ కలిసి చెప్పాలని గాని – ఒకరి దానిని కాదనాలని కాని, అభిప్రాయం లేదసలు. వాళ్లు నాచేత అనుభవంతో ఒప్పిస్తే కాదనను. నా అనుభవాన్ని వదలుకోను. ఇంకొకరి అనుభవాన్ని చెప్తే కాదనను. వాళ్ళు చెప్పిన దానిలో మాధుర్యం లేక పోలేదు. భాగం చేశారు – పాక్షికంగా

సోదరుడు: అదే అన్నారు.

అమ్మ : ఏమన్నారు?

సోదరులు: అదే ఆమాటే అన్నారు. ఏది చూస్తే అదే అన్నారు.

అమ్మ : నేను మొత్తం చూస్తున్నాను గనక మొత్తం చెప్తున్నా – ఇంత కంటె తేడా ఏమీ లేదు?

సో : అక్కడ వారిది సిద్ధం?

అమ్మ : సిద్ధం వాళ్ళదే అయినా, మనకు విరుద్ధం లేదు. ఎవరన్నా అడిగినప్పుడు ఇన్ని రకాలుగా ఎందుకు చెప్పారు అంటే అనేక మంది మనుష్యులం – అనేక రకాల మనస్తత్వాలు ఉన్నాయి గనుక ఇన్ని రకాలుగ చెప్పారేమో అంటాను. చెప్పారేమో అనడానికీ, చెప్పారు అనడానికీ తేడా ఉంది.

శ్రీపాద : సత్యం చెప్ప లేదు వాళ్లు. ఆ పీఠం చూడడం మళ్ళీ కూర్చోటం. సర్వాంతర్యామి అన్నపీఠం మీదే కూర్చున్నారు. అమ్మ సర్వం ఖల్విదం బ్రహ్మ అనే పీఠం మీద కూర్చొని చెప్పారు అన్ని మాటలు. కాబట్టి వారు చెప్పిన దీనికి, అమ్మ చెప్పిన దానికి బాగా తేడా ఉంది. అట్లాగని వారిది కాదు అనడం కాదు. వారు చెప్పింది కొంచెం కొంచెం మెట్లుగాఉంది. అమ్మచెప్పింది పైన ఉంది. ఈమెట్ల మీద వెళితే దానికి వెళ్ళవచ్చు. ఏమైనా వారు చెప్పే దానితో - నాకు విరోధం లేదని మీరంటారు.

వీ.ప్ర : వారు చెప్పింది ఒక భాగం. రెండూ ఒకటని చెప్పటం మాభావం కాదు వైరుధ్యం లేదు-రెండూ ఒకటేనని చెప్పడం మాత్రం వాస్తవం కాదు. అన్ని మెట్లద్వారా కూడావెళ్ళ వచ్చునని వారు చెప్పుగాక! అంత కంటే ఉన్నతమైనది మీరు చెప్పారు.

అమ్మ : శ్రీపాద వారికి - వారి పైన, లేక వారిపైన ప్రత్యేకఅభిప్రాయ మంటూ ఏమీ లేదు. తర్కానికి అలవాటు పడిపోయినాడు. ఇంకొకరు మాట్లాడితే ఆయన మనస్సు తర్కానికి పరుగెత్తుతున్నది. ఆయన చెప్పిందే, అదే మనమంటే ఇంకొకటి మాట్లాడడం అలవాటయింది గనక పోట్లాదుతాదు. సత్యాన్వేషణ ఉంటే సత్యమనేది మిగిలిపోయింది. రాసిలో నుంచి అన్నం వడ్డిస్తున్నాం. ఎవడిపొట్ట పట్టినంత వాడు తింటున్నాడు. తినేదంతా భోజనమే. Quantity తక్కువ తినవచ్చు - ఎక్కువ తినొచ్చు

వీ.ప్ర : మొత్తాన్ని దృష్టిలో పెట్టుకుంటే వైరుధ్య ముండదు.

అమ్మ : ఇంకా నాలుగడుగులు ముందుకు వేస్తే అంతా స్వార్థం తప్ప త్యాగం లేదు. త్యాగమంతరిస్తుంది. ఏదైనా తన కిష్టమైతేనే చేస్తాడు. ఆ త్యాగం కూడా తనకు కావాలను కుంటేనే చేయ గలుగుతాడు. చేసేవాడి దృష్టిలో స్వార్థం - చూసేవాడి దృష్టిలో త్యాగం - పదిమంది కుపయోగించేపని. ఇట్లా ఎంతదూరం పోయినా తను మూలం మిదం జగత్ నిలుస్తుంది.

తనే మిగులుతున్నది అన్ని విషయాల్లో సహనమన్నాం - తన ఇష్టాన్ని మరుగున బెట్టి, మరొకరిష్టాన్ని ఆచరించటం సహన మనుకుంటాను. అప్పుడుకూడ తనకిష్టమైతేనే ఆచరిస్తాడు. అక్కడకూడ స్వార్థమే. స్వార్థం లేకుండ ఉన్న పదమంటూ లేదు. ఎన్ని సూక్తులన్నాగాని, ఎన్నిరకాలైనా గాని - పదాలకు తర తమ భేదాలుగ అర్థాలొస్తుంటాయి. కొంచెం మూలానికి వెళితే అంతా తనే. నేను నేనైన నేను ఎట్లాగో - ఎక్కడికి పోయినా తాను తప్ప రెండవది లేదు.

సో : తనే నేను అనుకునే భక్తులనుకో....

వీ.ప్ర : ఎన్ని విన్నా, ఎన్ని సూక్తులు చదివినా, ఏది చేసినా - త్యాగమనే చేస్తాడు. ఇది స్వార్థమే. అన్నీ దారులే.

శ్రీపాద : ఇది దారేనా అని?

వీ.ప్ర : అన్నీ దారులేగా!

అమ్మ : అమ్మ వాక్యాలు అన్నాం. వాక్యాలన్నీ వివరించుకుంటూ పోతే ఒకే అర్థం మిగులుతుంది. ఇష్టం లేనిది కష్టమన్నా స్వార్థమేగదా!

వీ.ప్ర : సూక్తుల అంతటికీ సారాంశమదే. తను మూలం. అదే స్వార్థం - ఏపని చేసినా తన కోసమే.

శ్రీపాద : కనక-

అమ్మ : అసలు నీవు లేకుండ లేవు. తనను తాను తెలుసుకోవడం అనేదెలాంటిదో -స్వార్థాన్ని విస్తృతపరచుకొని, సర్వత్రా స్వార్థాన్ని అవగాహన చేసుకోవటం అలాంటిదే. జీవిత చరిత్రంతా స్వార్థమే. కావాలనుకొన్నాను గనుకనే, వాక్యా ల్లోనూ అదే ఉంది. చరిత్రా అదే చెబుతుంది - స్వార్థమే. త్యాగం కలగాలని, మోక్షం పొందాలని పరమార్థ జ్ఞానం కలగాలని, దేనికైనా స్వార్థం ఉండకూడదు - ఆ పదమే కూడదు అంటారు గాని - పదం లేదు గాని, ఉన్నది స్వార్థమే. తనను తాను తెలుసు కోవాలంటున్నారుగా! నిన్ను తెలుసుకో అంటున్నారు. అంటే అంతా తన కోసమే. రమణ

మహర్షి మాట "నిన్ను నీవు తెలుసుకో" అనే మాటలో కూడ స్వార్థమే చూస్తున్నా.

వీ.ప్ర : తన చేసే పని అంతా స్వార్థమని తెలుసుకోవడం– తనను తాను తెలుసుకోవడమా అమ్మా?

అమ్మ : అది తెలిసిన నాడే త్యాగం. అన్ని రకాలుగా, అన్ని వేళలా ఎప్పుడూ తనను తాను తెలుసుకున్నట్టే.

సోదరుడు: Awareness కి, దీనికి – వ్యత్యాసమేమిటి?

శ్రీపాద : Awareness is objective

సో : ఇక్కడ సబ్జక్టివ్ (Subjective)

వీ.ప్ర : ఏమీ మనసులో భావం లేకుండ, అంతటా అంతటినీ స్పష్టంగ చూడగలిగితే....అదే చెయ్యటం. పూర్తి అవలోకనతో కార్యం నిర్దుష్టంగ ఏరకమైన భావం లేకుండ అవలోకించటం. నేను తప్పుచేస్తున్నాను అనుకోవటం – తప్పును తెలుసుకోవటమే తప్పు దిద్దుకోవటం. అమ్మ చెప్పింది కనిపిస్తూనే వుంది గదా! మీకేది సరిపోతే అది తీసుకోండి! మామిడికాయ, జామకాయ రెండూ చేతుల్లో పెట్టారు.

శ్రీపాద : స్వార్థం లేకుండ awaranessలేదు.

అమ్మ : ఎందులో వెదకినా నేను తప్ప ఇంకొకటి లేదు. నేనే ఉన్నది.

శ్రీపాద : Objective Awareness లేదు.

అమ్మ : వాక్యాలద్వారా అదే. చరిత్రద్వారా అదే. బోధన ద్వారా అదే. ఉన్నదే అది. స్వార్థం నశించాలని చెబుతున్నారు గాని స్వార్థమే మిగులు తున్నది. స్వార్థం నశించాలనేది మంత్రం. స్వార్థం నశించాలి అనే మంత్రం తీసుకొని, తిరిగి తిరిగి, జపించీ జపించీ – స్వార్థంలో ఉంటాం. అదే నేనును తెలుసుకోవటం. స్వార్థం నశించాలి అనేమంత్రంచేత స్వార్థ మవుతుంది. రాగద్వేషాలు రెండూ తన కొరకే, ఆ రెండు మాటలు చేతపట్టుకొని జపించగా, తర్కించగా, అన్వేషించగా మిగిలేదేమిటంటే అంతానేనే, స్వార్థంలో నేను అనే అర్థం మిగుల్తుంది.

వీ.ప్ర : కాబట్టి తను మూల మిదం జగత్ అన్నది - మహావాక్యం.

అమ్మ : నిన్ను నీవు తెలుసుకో అని రమణ మహర్షి వదిలి వేశారు. నన్ను నేను తెలుసు కోవడానికి దారి ఏమిటంటే ఇట్లా కూడ ఆలోచించి తెలుసు కోవచ్చు. తక్కువ చెప్పలేదాయన. గొప్ప గానే చెప్పారు. వారు చెప్పింది నేను పై విధంగా అన్వయించు కున్నాను. అందరూ గొప్పవాళ్లే నాదృష్టిలో అని చెప్పడానికి చెప్పినమాట. మనసంటే ఇది అని సైన్సు చెప్పలేక పోతున్నది. మనసంటే ఇది అని ఆధ్యాత్మిక శక్తి కూడ నిరూపించ లేక పోతున్నది.

సో : పూర్ణత్వము ఎవరికీ తెలియదేమో!

అమ్మ : నేను పుట్టి యాభై నాలుగు సంవత్సరాలు. నీవు నాదగ్గరకు రావడం మొదలు పెట్టి కొద్ది సంవత్సరాలు. ఇది ఈనాడే ఏర్పడ్డది కాదుగా! తరుణమనేది అందుకే వాడాను.

సో : ఇంతవరకూ నువ్వు చెప్పిన విధంగా ఎవరూ ఇట్లా చెప్పి ఉండలేదా?

అమ్మ : అని నేననడం లేదు.

సో : అయితే అమ్మ చెపుతున్నది కొత్తదారి అనడంలో ఉద్దేశ్యమేమి?

అమ్మ : అది వారి కర్థమైన పద్ధతిలో కొత్తదారి, ఆయన చదువు కొన్నవాటిలో, ఆయన విన్నవాటిలో ఇంత వరకూలేదు గనుక ఆయన దృష్టిలో అమ్మ చెప్పేదే కొత్తదారి.

సో : మీ దృష్టిలో?

అమ్మ : నాకు మామూలుగా ఉంది.

సో : ఇంత వరకు ఎవరైనా ఇట్లా చెప్పారా? లేదా?

అమ్మ : ఇంతవరకు ఎవరన్నా చెప్పారా?లేదా? అని నేనాలోచించను. నేనేమీ చదవలేదుగదా! అందరు చెప్పినవి. నాకు సరిపోతాయి.

వీ.ప్ర : ఏదైనా ఎవరో ఒకరు ముందు చెప్పిఉండాలి గదా!

సో : దానిపూర్ణత్వం మేము తెలుసుకోవాలి.

అమ్మ : ఒకడు పంచదార చిలుక ముక్కుతిని తియ్యగాఉంది అని తృప్తిపడ్డాడు. ఒకడు తోకనుచూచి తృప్తిపడ్డాడు. ఇట్లా ఎందరో, వారి వారి పరిధులలో అందినంత చూశారు. చూసిందంతా కలిసిచెప్పుతున్నాను. ఇంకెవరన్నా ఉన్నారాలేదా అని పరిశీలించలేదు నేను.

సో. : చిలుకంతా చెబుతున్నావా నీవు?

అమ్మ : చిలుకంతా కలిపితేనే సంపూర్ణత్వం.

సో : తనకు సంపూర్ణత్వం అని తెలియదా అమ్మా?

అమ్మ : నేను ఇంత అని పరిమితిగా చెప్పలేక పోవచ్చు. అపరిమితములో చెప్పుకోలేను. అవధులుంటేనే చెప్పగలవు. అవధులు లేకపోతే ఏం చెప్పగలవు? చెప్పలేవు.

సో : కాని తనశక్తి తనకు తెలుసు.

అమ్మ : ఫలానా జిల్లాకు ఇవి ఎల్లలు అని చెప్పగలవు. విశ్వానికి ఎల్లలు నీవు చెప్పలేవు. మహా సముద్రమిట్లా ఉంటుందని చెప్పగలవుగాని విశ్వానికంతా ఏవి ఎల్లలు అంటే ఏం చెప్తావు?

శ్రీపాద : ఎల్లలు అన్న *Concept* అప్లై అవదు.

అమ్మ : ఒక దేశానికి, ఒక జిల్లాకు, ఒక తాలూకాకు ఒక ఊరికి - ఇది ఏడవమైలని, ఇది పూండ్లకాలువ అని సరిహద్దులు చెప్పగలవు. విశ్వానికి సరిహద్దు లేమిటో తెలియదు. అని నేననుకుంటున్నా. నా భావాన్ని నీకు వ్యక్తం చేస్తున్నాను.

ఒకదానిమీద నిలువలేదు. సైన్సుకు సంపూర్ణత్వం లేదంటున్నారు. ఆధ్యాత్మిక చింతనలో ఉన్న వాళ్ళకు నిన్ను నీవు తెలుసుకోవటమే సంపూర్ణత్వం అంటున్నారు. సాయుజ్య మంటున్నారు, ఆత్మావలోకన మంటున్నారు. జన్మరాహిత్య మంటున్నారు. కాని సైన్సుకు సంపూర్ణత్వం చెప్పలా- ఎక్కడి కక్కడే....

సో : సైన్సుకు ఎగ్జాంపులా?

అమ్మ : దైవం, బ్రహ్మ అనే పదాలు ఎప్పుడూ మనసుకే చెప్తాను నేను. సైన్సుతోనే సైన్సు కనిపెట్టాడని అంటున్నా. కాబట్టి సంపూర్ణత్వం కాగలిగింది అంటున్నా. కనబడుతున్న వస్తువులో నుంచి చెప్పేది సైన్సు. ఊహలో - భావంచేత పొందుతున్నావు అని చెప్పేది అధ్యాత్మికం. పొందుతున్నామనే దానికి ఋజువులేదు. సైన్సుకు ఋజువుంది, ఆధారముంది. ఆధ్యాత్మిక చింతనకు ఆధారంలేదు. ఒకడువచ్చి పెద్దవెలుగు చూచాను అంటాడు. నమస్కారం అంటాం. వాడిది వాడికే. అదే స్వార్థం. అదే నన్ను తెలుసుకోవటం. ఇతరులకు కనిపించేది సైన్సు. అందులో త్యాగం కనపడవచ్చు. అదీ తనకోసమే చేస్తాడు. గ్లాసుతోనే తాగుతాడు లేకపోతే దోసిలితోనో, నోరుపెట్టో - పరిమితిగానే తాగగలడు. ఎంత తలపగుల గొట్టుకున్నా కొన్ని గుర్తు వచ్చినంతగా మరికొన్ని గుర్తు రావడం లేదు అంటాడు. ఇక దాన్ని గురించి ఆలోచనే రాదు. జారిపోయింది అనేది గుర్తులేదు. జారిపోయి వెతుక్కో వడం మరపుకాదు - దొరక్కపోవడం అవుతుంది. ఆ జారి పోయి గుర్తులేకుండ ఉన్నవి కొన్ని ఉన్నాయి మరపులు, ఆ మరపు అలాంటిది. అంటే మరణంలాంటిది. మరపే మరణం మరణంలో ఏముందో వీడికి తెలియదు. మరపులో మరణ ముంది.

పొటాషియం సైనైడ్ తిన్నవాడు బ్రతుకుతానని వేసుకోడు. చచ్చిపోతున్నాను, వాళ్ళుకావాలి అనుకుంటాడువాడు. నమ్మకంలేని వాడు కూడ ఎవడికీ తెలియకుండ ఇందులోనే పెట్టి ఉంచాడు. ఏపూర్ణంలోనో ఏలడ్డులోనో పెట్టి ఉంటాడను కుందాం. అప్పుడుకూడ వాడు రుచి చూశాడు. అపస్మారకం వస్తుంది. నేనిందాక ఎట్లా ఫీలయ్యాను - నిజంగా చచ్చాపోతాననుకున్నానండి అంటాడు. ఆ చచ్చిపోతా ననుకున్నవాడు కూడ బ్రతకవచ్చు గాక. ఆ భావం వచ్చిన తర్వాత, చచ్చిపోతా ననుకున్నప్పుడు. భయం కలిగినప్పుడు ఎంత నమ్మకం లేనివాడు కూడ

నాస్తికుడుగా ఉండేవాడు కూడ ఆక్షణంలో రక్షణ కోరుతాడు. ఆ క్షణంలో ఏదో ఒకటి ఉన్నదనో, రక్షణఅనో, అన్నింటిలో కలవాలనో – ఆభావం రాకుండ ఉండేవాడు ఎవడూ లేడు. దొంగ, దొరికిన క్షణములో తప్పించుకోవాలని వాడూ ప్రార్థిస్తాడు.

వీ.ప్ర : మొత్తమంతా అదే గనుక ఎవరైనా Surrender అవవలసిందే.

అమ్మ : నాకు దొంగను చూస్తేభయం. దొంగకు నన్ను చూస్తేభయం. నేనువీడి చేతిలో చిక్కకుండ ఉండాలనే ప్రార్థన నాకొస్తుంది. నాచేతిలో చిక్కకుండ ఉండాలనే ప్రార్థన వాడికొస్తుంది. నేను తాళంవేసి పడుకునేటప్పుడు దొంగలు పడకుండ కనిపెట్టి ఉండు నాయనా అనినేను దండం పెడతాను. పోగానే ఏదో ఒక వస్తువు దొరికేట్టు చెయ్యినాయనా అని వాడుదండం పెడతాడు. ఒకనాస్తికుడున్నాడు. నీవు, నేను తప్ప మనిద్దరి మధ్యలో ఇంకొకడు లేడు అనుకుంటాడు. నేనే నాకంటే భిన్నత్వం లేదు అనే దృఢత్వం ఉన్నా – ఒకడిని చంపి మూతి, ముక్కు విరగగొట్టి వేళ్ళాడగట్టి వాడు నేనే చంపాను అనుకుంటాడు. పోతున్న వాడనుకుంటాడు – నన్ను వాడిచేతిలో నాకీవిధంగ ఉన్నదని ఈ క్షణంలోనన్నా రక్షించ మని కోరుకుంటాడు. రక్షింపబడాలి అనే ఆరాటం – ఏదో దైవముంది రక్షించాలి అనేభావం ప్రతివాడిలోనూ ఉంటుంది.

సో : చచ్చిపోతున్నానని అనటం, నీలోకి తీసుకోమని అనటం రెండింటిలోకి తేడా లేదా అమ్మా?

అమ్మ : నేనే, అనుకొనే వాడుకూడ, ఆపద కాలంలో రక్షించమని కోరతాడు. భయంవల్లకూడ రక్షణ కోరతాడు.

సో : జ్ఞాని అవుతాడని చెప్పావుగదమ్మా?

అమ్మ : జ్ఞాని అంటే – వాడుగా ఉన్నాడనుకున్నా ఒకటే నేనుగా ఉన్నాననుకున్నా ఒకటే.

సో : అప్పుడు Complete Surrender అవుతాడా? భయంతోనైనా.

అమ్మ : జ్ఞానికే ఇంకా ఆలోచనలుంటాయి నాన్నా! ఇది నేను అనే ఆలోచనలు పుడతవి. భక్తికి, రక్షించుమని కోరేదానికి అసలు ఆలోచనేరాదు. మాటలబేధం తప్ప - స్థితుల బేధంలేదు.

సో : స్థితి ఒకటేనా?

అమ్మ : తల్లి పిల్లవాడికోసం ఏడుస్తుంటే ఒకరకం. బిడ్డతల్లికోసం ఏడుస్తుంటే ఒకరకం కాని ఏడుపొకటే. ఇంతా ఏమిటి? అంటే కావాలనుకోవడమే. జ్ఞానమైనా తెలుసు కోవాలను కోవడమే. భక్తిఅయినా వాడు కావాలి అనుకోవడమే. జ్ఞానమనే పదానికర్థం తెలుసుకోవడమనే కాని పొందేస్థితి ఒకటేగా! తెలుసుకోవటమంటే - ఏమిటి తెలుసుకుంటాడు? ఉన్న దంతా బ్రహ్మతప్ప రెండవది లేదు అనుకుంటాడు - భగ వంతుడు తప్ప రెండోది లేదు అనుకుంటాడు భక్తుడు.

సో : ఆ స్థితివస్తే.......

అమ్మ : మాటలు పట్టుకొని చెప్పేవాడొకడు. ఆ పాండిత్యానికి నమస్కారమన్నాం. పంచదారచిలుకకు..... ఒకదునోరు, ఒకదు ముక్కు, ఒకరు కండ్లుచూచి వచ్చారు. ఇదంతా కలిపి అమ్మ చెబుతున్నది. వాళ్ళనుభవించింది. రుచి కాదని నేననటంలేదు. అందుకనే ఎవరు చెప్పినా సరిపోక పోవటమంటూ ఉండదు-నాకన్నీ సరిపోతాయనే అన్నాను.

సో : వారు ఒక భాగమే చెప్పారనా?

శ్రీపాద : వారిది సత్యంలోభాగమే. కాని పూర్ణసత్యం కాదు.

అమ్మ : పూర్ణసత్యంలో అసత్యం కనిపించదుగా! అందరూ ఒకసత్యం ఒకసత్యం రెండూ చెబుతున్నారుగనక.....సత్యంలో కొంతనుభవించారు.

శ్రీపాద : అదే పూర్తనుకోవడం అసత్యం. కనుక్కొన్నది సత్యం. తిన్నంతవరకు సత్యం. అదే పూర్ణత్వమనుకోవటం అసత్యం.

అమ్మ : ఇంకా అవతల ఉంది అనుకోలేదు.

సో : జ్ఞానానికి పరిణామ ముంటుందా? ప్రకృతిలో పరిణామ ముందిగాని.

అమ్మ : జ్ఞానములో పరిణామముందా? జ్ఞానమంటే తెలుసుకోవటం. ఎంత వరకు తెలుసు కొన్నాడో అది నిజమేగా! రూపాయకు బొమ్మ బొరుసు ఉంది. దాన్ని వారు త్రిప్పిచూడలేదు. కాని బొమ్మను చూచింది ఒట్టిమాట కాదు. పరిణామమున్నా లేకపోయినా రెండుగా కనబడుతున్నవి గదా! ఒక వైపు సత్యం కనబడుతున్నది గదా! ఒకసత్యమనే మాటేలేదు సత్యమనే అనిపిస్తుంది. రెండింటికీ ఒకటే ఆధారం. అక్కడే వాళ్ళు రెండు భాగాలు వేస్తున్నారు.

సో : ఆలోచిస్తే రెండులేవు.

అమ్మ : కొంచెం ఎత్తుగా నిలుచుండి చూస్తే అంతా ఒకటిగా కనపడుతున్నది. L.I.C.Building ఎక్కితే మద్రాసంతా కనపడుతుంది.

× × × × ×

సో : మంత్రాలన్నీ ఒకటేనా?

అమ్మ : ఏ మంత్రానికైన ఒకే శక్తి.

సో : ఒకడు హనుమంతుణ్ణి, ఇంకొకడు బాలను, మరొకడు లక్ష్మిని అనేకం చేస్తుంటారు.

అమ్మ : ఒకరు విద్య ఇస్తారు, ఇంకొకరు వైద్య మిస్తారని ఈ విధంగా.

సో : కొందరు ఒక మంత్రాన్ని నూటయాభై చేసి, ఇంకొక మంత్రాన్ని మరోరెండు వందలు చేస్తారు.

అమ్మ : నీవు ఏ అభిప్రాయంతో చేస్తున్నా, అది ఏ ఒక్క మంత్రమైనా, అన్నీ ఇస్తుంది.

సో : బాబాగారి విషయంలో మీ ఉద్దేశ్య మేమిటి? ఆయన సిద్ధ పురుషుడేనా? వారి మహిమలు నమ్మేవేనా?దైవమా?జ్ఞానా? రెండింటికీ తేడా ఉందా? ఇలా కొందరడుగుతారు. నీ విషయంలోనూ కొందరిలాగే అడుగుతారు. అందుకు నేనన్నాను - ఏ దశలోనైనా సరే. ఎట్టి క్లిష్ట పరిస్థితిలోనైనా సరే, ఏవేళలో - ఎంతటి బాధాకరమైన సమయంలో నైనసరే. దేనితోనూ

ఏ మాత్రమూ సంబంధము లేని దానిలా నిశ్చలంగా ఆ మహోన్నత స్థిర శిఖరము నుండి తొలగినట్లు ఎప్పుడూ ఉండదు. ఆమె దెప్పుడూ సమతా పూర్వకమైన ఒకే దృష్టి. ఇంతకు మించినది మరే ముంది? అన్నాను. మితి మించిన కష్టంలోనైనా బాధలోనైనా, సుఖంలోనైనా ఎప్పుడు అడిగినా ఒకే తీరులో, ఒకే రీతిలో అంతా ఇదంతా అదేనన్నది ఆమె బోధ - ఆదేశం - సందేశం.

మా మేనల్లునికి ఇరవై ఎనిమిదేళ్ళున్నాయి. నడవడానికి కాళ్ళురావు. వాడికి చాలా ప్రయత్నాలు చేశారు. ఏవో మంత్రాలు, ఎన్నో పారాయణలు చెప్పారు. ఏం చేయ మంటారని నన్ను సలహా అడిగాడు. ఏది చేసినా అన్నీ ఒక్కదే అన్న నీ మూల సూత్రాన్ని వాడి కుపదేశించాను.

అమ్మ : ఇవన్నీ ఒకటే. మంత్ర శాస్త్రాని కర్థం చెప్ప గలిగితే, ప్రతి దానికి అర్థం ఒకటే. ఏమూర్తికి ఏ లక్షణాలుంటాయో అందులో తాదాత్మ్యం పొందినప్పుడేం జరుగుతుందంటే నీ మనస్సు చిత్రించుకున్నది - మనస్సు ద్వారా నీవు చూచింది దాని ద్వారా పొందగలుగుతావు. నమ్మకం కలగ వలసింది వీడికే. ఆ అక్షరాలను మంత్రంగా భావించ వలసిన వాడూ వీడే. ప్రతి ఫలం వీడిదే. ఉన్నది వీడే. ఉన్నదను కున్నదీ వీడే. - వీడు ఏది చేస్తే, దేనితో తాత్మ్యం పొందితే అదే అవుతాడు. అట్లా ప్రతి మంత్రానికి అర్థం అదే. కవిత్వ రూపంతో వచ్చాదనుకో. కవిత్వం గూడ మనసు ద్వారానే గదా వచ్చేది? వాడు దేవుడు అనుకునేది నా మనస్సేగదా! లక్ష్య సిద్ధి కలిగేది నాకే గదా! ఆ మంత్రం మీద లక్ష్య సిద్ధి గలిగితే గాని చేయలేదు. అటువంటి విశ్వాసం కలిగిన తర్వాత - ఒక చోట కలిగితే, ఎన్నో మంత్రాల మీదకు మనసు పరుగెత్తదే! దేని యందూ కుదరనప్పుడే మనసు పరిపరి విధాల పోతుంది. ఇన్ని మంత్రాలు చేయకూడదని నెత్తి అణుస్తుందని కొందరంటున్నారు. అట్లా చెప్పే వారూ ఉన్నారు. కాళిని కొలిస్తేమింగుతుందని చాలా ఆహుతి

పెట్టాలని అనే వారున్నారు. లక్ష్మీదేవిని దబ్బుగా తీసుకున్నారు. సరస్వతిని విద్యగా తీసుకొన్నారు. పార్వతిని శక్తిగా తీసుకున్నారు. చండిని శాసించేదిగా తీసుకున్నారు. ఉన్నది ఒకే శక్తి. ఇట్లా రకరకాలుగా తీసుకొన్నారు. ఉన్న ఒకే శక్తికి వాటి వాటి స్థానాలను బట్టి పేర్లు మారవచ్చు. పేర్లు మారినప్పుడు వచ్చే అర్థం వేరుగా వుండవచ్చు. వాటి గుణంమారదు–మన భావం మారుతుంది. లక్ష్మిని విష్ణువు భార్య అన్నారు. పార్వతిని ఈశ్వరుని భార్య అన్నారు. సరస్వతిని బ్రహ్మకు భార్య అన్నారు. త్రిమూర్తులకు ముగ్గురికీ భార్యలను ఏర్పరచారు. ఉన్నారా? లేదా? అంటే – సరస్వతి ఉన్నట్లుగా, అంటే విద్య అన్నాం – సరస్వతి అంటే ధ్వని. అందుకే శబ్ద పూర్వకమైన వీణ, తంబుర అటువంటివి పెడతారు. విద్యంటే ధ్వనితో కూడిందనేగా! – శబ్దంతో కూడింది గనక ఆరకాలైన చిహ్నాలిచ్చారు. అపారమైన శక్తిని పార్వతి అన్నారు. పారం లేనిది. ఇవన్నీ మనకోసం మనకే మనమేర్పరచుకొన్నాం. సృష్టే దైవమనుకున్నప్పుడు కాదనదానికి ఎవరికీ నోరురాదు. జ్ఞానానికి పరిణామ మున్నదా అంటే నిన్న తెలుసు కొన్న దానికంటె ఈనాడెక్కువ తెలుసుకొన్నామనుకో–అది పరిణామమే అంటాను. పరిణామ మంటే జరగటంకాదు. మార్పు చెందటం. నిన్న తెలిసిన విషయాలకంటే ఈ రోజు ఎక్కువవిషయాలు తెలిసినవి అనుకోవటం. వాడిలో పరిణామ మొచ్చిందండీ అంటాం. కానీ, అక్కడపరిణామం లేదు.

సో : ప్రకృతికి సంబంధించి విజ్ఞానంలో పరిణామ ముండవచ్చు గానీ అధ్యాత్మికతకు సంబంధించిన జ్ఞానమునకు పరిణామ ముందా?

అమ్మ : అందుకే సైన్సు ఆగదు. ఆధ్యాత్మికం ఆగిపోయింది. దీనికి పరిణామం లేదు. తెలుసుకొనే తీరులలో మార్పు. చెప్పడంలో మాటల మార్పేగాని దీనికి పరిణామంలేదు. గనుక ప్రకృతియే దైవమన్నవాడికి పరిణామం కనబడుతుంది. పరిణామం చైతన్యంగా తీసుకొని, అది దైవమే

అంటాము. దైవమనేది ఊహ, లేక భావం. ఆ భావంలో వీడుపొందేది స్థిమితం. ఏమిటి అనుభవమంటే - స్థిమితం. ఇది నా ధృఢమైన అభిప్రాయం.

తేజస్సా? తేజస్సుకాదు. వాయువు కాదు. కనబడేది కాదు. వినబడేది కాదు. ఏదీకాని దాన్ని గురించి నేననుభవించాను. అనిచెప్పడం అంటే ఏమిటి? భావం స్థిరపడటమే. భావం స్థిరపడటమంటే అనుమానం రాకుండ ఏదిచూచినా ఎన్ని జరుగుతున్నా ఆ ఒకటే గుర్తుకు వచ్చే స్థితి -- స్థిమితమనండి, అనుభవమనండి ఇదే. దైవమనుకున్న తర్వాత వాడికి అనుభవ మొచ్చినట్లా!

సో : బ్రహ్మానందమనుకున్నా అది పాక్షికమవుతున్నది.

వీ. ప్ర : భావం స్థిరపడితే అనుభవమే అవుతుందా?

అమ్మ : ఏ సమయంలోనూ చెదరకుండ ఆ అనుభవం నిలిచినప్పుడు.

సో : కాబట్టి ఆధ్యాత్మిక జ్ఞానమునకు పరిణామంలేదు.

అమ్మ : పరిణామమనే దేముంది. లేదు. పరిణామాన్ని ఆధ్యాత్మిక మని చెప్పుకోవచ్చు. కాదని అనాల్సిన అవసరం లేదు. భాగమే అనకుండ ఆ పరిణామ దశకూడ అదే నాయనా అనవచ్చు.

× × ×

సో : మరుపే మరణమంటే?

అమ్మ : చావులో మరుపు లేదుగాని, మరుపులో చావుంది. జీవిత మన్నప్పుడు గుర్తుకురాని విషయాలకు మరుపొచ్చింది అంటాం.

వీ.ప్ర : ఆధ్యాత్మికంగా పరిణామమంటే ఇప్పటిదాకా చూస్తున్నది పాక్షికమే. మొదట పాక్షికంగా చూచి తర్వాత పూర్ణత్వం దగ్గరకు వెడితే అది పరిణామం. ఎందుకంటే వైయక్తిక దృష్టితో చూస్తే అది పరిణామం.

అమ్మ : దృఢ పడితే.....పరిణామం బ్రహ్మే.

వీ.ప్ర : పూర్ణత్వానికి ఆ తర్వాత లేక పోవచ్చు.

అమ్మ : పరిణామదశ దీనికుంది. పరిణామం కాదు అనిపించదు. స్థిరత్వం, అస్థిరత్వం అనవలసిన పనిలేదు.

వీ.ప్ర : చివరకు స్థిరత్వం పొందటమే పరాకాష్ఠ. పాక్షికదృక్పథం నుండి పూర్ణతత్త్వానికి ఎదగటమే....ఇది పరిణామం.

అమ్మ : (శాస్త్రకారులు) వారు తప్పు చెప్పారని, వారనుభవం లేకుండ చెప్పారని నాకనిపించదు. నేనెక్కువగా చెప్తున్నాననో వాళ్ళు తక్కువ చెప్పారనో అనిపించదు.

సో : వాళ్ళు అంతవరకే చెప్పారు అన్నప్పుడు వారిది పాక్షిక సత్యమవుతున్నది. ఆధ్యాత్మిక జ్ఞానంలో పరిణామముంటుందా అంటే లేదన్నావు. కాని ప్రసాదరావుగారు చెప్పినదాని ప్రకారం దానికి పరిణామమున్నదని అంగీకరిం చాల్సి వస్తున్నది గదా.

అమ్మ : సంపూర్ణత్వం వచ్చేవరకు అన్నాడు. సంపూర్ణత్వం దృఢపడే వరకు పరిణామం.

సో : ఇంతవరకు సంపూర్ణత్వం రాలేదని, ఇప్పుడే సంపూర్ణత్వం వచ్చిందని మన మంగీకరించాలి.

వీ.ప్ర : సందేహం లేకుండా నిర్ద్వంద్వంగా అంగీకరించాల్సిందే.

అమ్మ : భావం ఒకటే కావచ్చు. ఒక చిలుకను తయారు చేశాం. అవయవాలన్నీ అమర్చాం. ఒకదు ముక్కు కొరికాదు అది అబద్ధంకాదు.

సో : అంటే ముక్కే కొరకలేదు మొత్తం కొరికారు అంటున్నాను మన ఋషులు మొత్తమనుభవించారనే నాఉద్దేశ్యం.

వీ.ప్ర : కాని ముక్కు వరకే వర్ణించారు.

అమ్మ : వర్ణించిందాన్ని బట్టే అర్థం చేసుకోవటం....

వీ.ప్ర : వారి మాటలేగా మనకు ఆధారం.

అమ్మ : వారు చెప్పిన సత్యాలు నమ్మితే అట్లా అనిపించింది. ఇక్కడ ఈ విధంగా సత్యం కనబడుతున్నది. వారిలో అతనికి అట్లా కనపడుతున్నది.

స్రో : ఒకసారి ఇంతలావు చిలుకను తినలేం మనం. ఏదో ఒక మూలనుండి ప్రారంభం చేయాలి. ఏది మొదలు ఏది చివర అంటే ఏముంది? ఎక్కడో ఒకచోటనుండి ప్రారంభం చేయాలి గనక అక్కడ నుండి ప్రారంభం చేశారు. సౌలభ్యం కోసం అనుకోవచ్చు గాని, పాక్షికమని మనం ఎందుకనుకోవాలి?

వీ.ప్ర : మొత్తం చెప్పింది పూర్ణం కావాలిగా?

స్రో : వాదంకోసం కాదు.

వీ.ప్ర : అర్థం చేసుకోవడం కోసమే.

## 17-4-76

వీ.ప్ర : నేను అబద్ధము, చరిత్రబద్ధము అనిచెప్పినప్పుడు ఈ నేనును చరిత్ర తన్ను తాను వ్యక్తీకరించడంలో పరిమితులు ఏర్పరచ గలుగుతుందా?

అమ్మ : నేనన్న కారణం-నేనబద్ధ మంటే

వీ.ప్ర : బద్ధంకాను అని.

అమ్మ : చరిత్రబద్ధం. చరిత్రనిలుస్తుంది. ఈనేను నిలవక పోవచ్చు. మీకు కనిపించదు. శాశ్వతంగా నిలిచేది చరిత్రే. తరతరాల మిగిలేది చరిత్రేగాని – నేను మిగలను.

వీ.ప్ర : బద్ధం కానటువంటి, ఆ నేను నశించి పోవడమనేది లేదు. అంతటితో తాదాత్మ్యం పొందినటువంటి నేను అబద్ధం. ఈసృష్టి అనాది. నాది అన్న నేను – అన్ని నేనులు నేనైన నేను అంటే శక్తిగానే వున్నటువంటి నేను.

అమ్మ : శక్తిగానూ వుంటుంది. వ్యక్తిగతంగా కనిపించదు గాబట్టి అబద్ధమని చెప్పాల్సి వచ్చింది. వ్యక్తి గతంగా కనబడుతున్న ఈనేనును నిలుపుతుందీ చరిత్ర. ఈ నేనును ప్రపంచానికి తెలియపరుస్తుంది శాశ్వతంగా ఎల్లకాలం. ఈ నేను మాత్రం అన్న నేనులు నేనైన నేనులో శాశ్వత శక్తిలో కలిసి పోవచ్చు గాని చరిత్ర కలవదు. చరిత్రవేరుగా కనిపిస్తుంది.

బద్ధమై వుంటుంది, పెరగదు తరగదు. ఏమి జరిగిందో అదే వుంటుంది ఏవిజరిగినవో అవేవ్యక్త మవు తుంటాయి.

వీ.ప్ర : ఇంకా నిర్దిష్టంగా వేస్తాను ప్రశ్నలు. ఈ అబద్ధమైనటు వంటి నేను, ఆ నేనుకు అబద్ధమని తెలుసు. సర్వంతో తాదాత్మ్యం అని తెలుసు. సృష్టి అనాదేకాదు, నాది అన్నటువంటి నేనును?....

అమ్మ : నా - ఆది, నేనున్నప్పుడే లేదది- అనాదిగా వుంది. ఆది అంటే మొదలెప్పుడు అనా? సృష్టి ఎప్పుడూ ఉంటుంది అని చెప్పడానికి ఆది అనే మాట పదసౌలభ్యం కోసం వాడిన మాటే గాని - అది నాది- అది అనాది-ఎప్పుడూ ఉండేది అని.

వీ.ప్ర : ఆ నేనుకు, తాదాత్మ్యం పొందిన నేనుకు పరిమితు లుంటాయా.

అమ్మ : లేవు.

వీ.ప్ర : ఆ నేను అని గుర్తించిన తర్వాత, ఎప్పుడూ అస్పృహతోనే వున్నటువంటి, ఈ అపరిమితమై నటు వంటి నేను బద్ధమై వుంటుందా?

అమ్మ : అస్పృహలోనే వుంటుంది. ఈ కనబడుతున్న వాటికి బద్ధంగా వున్నట్లు, పరిమితిగా వున్నట్లు కనపడుతుంది.

శ్రీపాద : ఇంకా ఇతర నేనులుకూడా అట్లా కాగలవా? కావటం ఉన్నదా?

అమ్మ : వారి వారి అనుభవమది. ఆనేను అనుభవమది. నేను చెబుతున్నది ఈ అనుభవమే.

శ్రీపాద : ఇంకా మూడు నాలుగు నేనులు కలసి ఆ నేను కాగలదా? కాగలదా? Possibility ....

అమ్మ : ఇంకొకటెందుకు కాదు. కావచ్చును. ఇదయినప్పుడు తతిమ్మా వెందుకు కాకూడదు? ఇదయింది కనుక అవి కావచ్చునేమో.

శ్రీపాద : అవి అంటే మనవి చేస్తాను. ఇదయినప్పుడు అవి కూడ ఎందుకు కాకూడదు, అన్నప్పుడు - అది ఆవిర్భావం తోటే అయింది. అవి ఏవో కొన్ని తంటాలు పడుతున్నాయి. అవి మొదట రావడంలో అట్లా లేవు. అట్లాంటివి కూడ అక్కడ కాగలవా? కావడానికి Possibility.... ఉన్నదా?

వీ.ప్ర : ఇది అపూర్వ మనుకుంటున్నాం. చరిత్ర బద్ధం ముందు ఇది వరకెవరికీ లేదు. ఇక్కడ ఒకటయింది కాబట్టి భవిష్యత్తులో సావకాశమున్నదా?

అమ్మ : భవిష్యత్తులో దెట్లా ఉన్నా ....

శ్రీపాద : ఇతర నేనులకు .... అని వ్యవహారంలో అంటున్నా.

అమ్మ : వాటిని తీసుకోవటం మన మెందుకు అని.

శ్రీపాద : అంటే అది ఇదవడానికి వీలున్నదా? లేదా? అని.

వీ.ప్ర : ఎందుకంటే ఇదంతా బ్రహ్మ అనిచెప్పే వ్యక్తులు. నీవే బ్రహ్మవు అని తెలుసుకుంటే నీవు బ్రహ్మవవుతావని చెబుతున్నారు, ఈఅంతటితో తాదాత్మ్యం అవుతున్నటువంటిస్థితి ఏదయితే ఉన్నదో – ఇది పుట్టుకతోనే వచ్చింది. అపూర్వమని చెబుతున్నాం. అయితే, అంతటితో తాదాత్మ్యం పొంది అంతా నేనే అని చెప్ప గలిగిన స్థితి ఇంకొక నేనుకి భవిష్యత్తులో ఎప్పుడైనా సావకాశమున్నదా?

శ్రీపాద : ఇతర నేనులకు.

అమ్మ : ఇక్కడ ఒకచిన్న గీటు గీసివున్నది. ముందిక్కడ ఇంకొక గీటు గీసివుంది. నీవు ఒక గీటు పెద్దది చూపిస్తున్నావు. అప్పుడు ఇది అవునా? కాదా? అని ప్రశ్న అఖ్ఖర్లేదు. ఇది రాయడంతో సరిపోతుంది.

వీ.ప్ర : తతిమ్మావి అవుతాయా అని?

శ్రీపాద : ఇప్పుడు అయి వున్నాయని కాదు. ఈచిన్నగీటు ఆపెద్ద గీటులా కాగలదా? Possibility ఉన్నదా?

అమ్మ : మనం భవిష్యత్తుకు వెళ్ళ వద్దు అంటున్నా.

సో : అది (Possible) పాజిబులా అని అడుగుతున్నారు.

అమ్మ : పాజిబులే అన్నా – ఇది ఇట్లాగే అయినప్పుడు కావచ్చు గదా!

శ్రీపాద : ఈ నేను కాలేదు వచ్చి వున్నది.

అమ్మ : నేను నేనైన నేనుగానే వచ్చి వున్నది.

శ్రీపాద : తక్కిన చిన్న నేనులు, నేను నేనైన నేను అన్న స్థితికి రావడానికి Possibility ఉన్నదా?

అమ్మ : లోగడ వచ్చినట్లు తెలుస్తున్నాయిగా!

శ్రీపాద : నాకు తెలియదు. మాఅమ్మ దగ్గర నుండి కావాలి. లోగడ ఉన్న వాళ్ళకు ఏమిటో వాళ్లకే తెలియదు.

అమ్మ : అమ్మ భూతంచెప్పదు. భవిష్యత్తు చెప్పదు వర్తమానమే.

వీ.ప్ర : భూతం, భవిష్యత్తు చెప్పమనటం లేదు. అవకాశ మున్నదా అని అడుగుతున్నాం.

అమ్మ : అవకాశమున్నదా అంటే ఉందంటున్నాను గదా!

శ్రీపాద : ఇప్పుడు పోనీ....

అమ్మ : దీన్నిబట్టి ఉండవచ్చు అంటున్నాను.

శ్రీపాద : ఇప్పుడు భూమ్మీద అట్లాంటి వారున్నారా?

అమ్మ : ఏమో! నాకట్లాగే అందరు అనిపించవచ్చు. నాకన్నీ సరిపోతున్నట్లే ఇదికూడ అనిపించవచ్చు.

శ్రీపాద : వర్తమానం చెబుతున్నావు గనుక అడుగుతున్నాను.

అమ్మ : ఒకడు ఇరవై ఏళ్లు వచ్చిన తర్వాత మెట్రిక్‌పాసయి ప్రయివేటు గా ఇంటర్, బి.ఎ, ఎమ్.ఏ, పాసయిన వాడున్నాడు. వాడు హైస్కూలులోనే చదివాడా అంటే చదవలా, కాలేజీలో అన్ని సబ్జక్టులు చదివాడా అంటే చదవలా. ప్రయివేటుగా పాసయ్యే వాడు. ఏమీ తెలియని ఎమ్.ఏ డిగ్రీ ఉంది.

శ్రీపాద : ఎమ్.ఏ డిగ్రీ పొందుతాడా?

అమ్మ : ఎమ్.ఎ డిగ్రీ పొందటం వేరు. అన్ని విషయాలు తెలియటం వేరు.

వీ.ప్ర : సర్వంతో కృషిచేసి తాదాత్మ్యం పొందటమనేది జరగవచ్చు గాని, పుట్టుక తోనే ఈస్థితి రావడమనేది జరుగు తుందా? లేక సర్వంతో తాదాత్మ్యం పొందటం జరుగుతుందా?

అమ్మ : ఎన్నిసార్లడిగినా అదే. ఏరూపంలో అడిగినా అదే....

వీ.ప్ర : బ్రహ్మను తెలుసుకుంటే, నీవే బ్రహ్మ మవుతావు అంటున్నారు వాళ్లు.

అమ్మ : జ్ఞానేబ్రహ్మని చెబుతున్నారు. జ్ఞాని అంటే తెలుసుకోవడమనేగా అర్థం. ఏం తెలుసుకున్నా కాదు. బ్రహ్మను తెలుసుకుంటేనే బ్రహ్మంటున్నారు. తెలుసుకుండే తెలివే బ్రహ్మనుకో నాన్నా! చాలుగదా! ఒకడు పులిజూదం తెలుసుకోవచ్చు. ఒకడికి Chess తెలియవచ్చు. ఒకడికి పేకాట తెలియవచ్చు. ఈ తెలివి కాదుగదా? బ్రహ్మను తెలుసుకొన్న తెలివేనని గదా? అన్నీ తానైన – ఏ తెలివైతే ఉంటుందో అదే బ్రహ్మ. బ్రహ్మ యిన తర్వాత వాడికి జన్మ లేదు. అంతవరకే చెప్తున్నాయి. బ్రహ్మయిన తర్వాతనే జన్మలేదని చెబు తున్నాయి–కాని, వాడు పుట్టుక తోనే –నేనై వస్తానని చెప్పడంలేదు.

శ్రీపాద : నేనై వస్తాడా?

అమ్మ : నేనై వస్తాడనిలేదు. నేను నేనైన నేనుగా పుడతాడనేది లేదు.

శ్రీపాద : పుడతాడా అని కాదు. అవుతాడా అని?

అమ్మ : ఇంకొక రకంగా తిప్పినా మళ్ళీ అదేప్రశ్న. షిర్డిసాయి ఉన్నాడు. ఆయన మాదిరిగా ఈయన (సత్యసాయి) వచ్చాడని చెప్పు కొంటున్నారు. ఆయన పోతూ పోతూ నేను ఫలానాచోట పుడతానని చెప్పలేదు.

శ్రీపాద : వీళ్ళు కల్పిస్తున్నారు. వారు మరణించిన తర్వాత ఎనిమిదేళ్ళకు వస్తానన్నారు.

అమ్మ : లలితానంద పోతూ పోతూ, కొమ్మూరి Side న వస్తానని చెప్పారని నే కనిపించిన కొత్తల్లో చీరాలవాళ్లు చెప్పుకుండే వాళ్ళు. పసుమలై స్వాములవారు పోయేటప్పుడు కొమ్మూరి వైపున ఈదిక్కుగా వస్తానని, చెప్పాడని చెప్పుకొనేవారు. నే కనిపించిన తర్వాతే – పసుమలై స్వాములవారికి – ఆయన శిష్యులే – ఆయన కిష్టమైన వారే, ఆయనంటే ఇష్టమైన వారు – అమ్మే పసుమలై స్వాములవారు అనేవారు. వాళ్లభావమది. అయితే ఎవరిష్ట దైవాన్ని వారికిష్టమైన చోట చూచు

కోవటంలో తప్పులేదు. నేనవునా? కాదా? అనేది వాళ్లకనవసరమైంది. నేను పసుమలై స్వాముల వారినని ఎలా అంటారు; నేను పుట్టాక, నేను చూశాక, పోయిన వాడాయన. నేను జిల్లెళ్ళమూడి వచ్చేంత వరకు, పసుమలై స్వాములవారిని నేను చూశాను.

నేను ముప్పైఏడులో ఆయన ఆశ్రమానికి వెళ్ళాను. **1937, 1938** రెండు సంవత్సరాలు బేయర్ హాస్పిటల్‌లో ఉన్నట్లే, ఆ రెండు సంవత్సరాలలో అక్కడి డాక్టర్లతో నేను వాడరేవుకు వెళ్ళి వాళ్ళను చూశాను. స్వాములవారు డాక్టర్లను కాదనుకొని లోపలికి రానిచ్చారేగాని డాక్టర్లని తెలిసి ఉంటే లోపలికి రానివ్వరు. సరే వెళ్ళి చూచి వచ్చాను. మరి నేను కొమ్మూరి Side లో పుడతాను అనడానికి, పోయిన తర్వాత అదే అనడానికి నేనుండగా ఆయన పొయ్యారు గదా! ఆయన దయ్యంకాదు గనక ఆవేశించి ఆశీర్వదిస్తున్నా దేమో!

శ్రీపాద : మాట్లాడడానికేముంది!

అమ్మ : మాఅత్తగారు, నాకు మా మామగారు పట్టారను కునేది కొన్నాళ్ళు. ఆయన కనపడి మీ అందరినీ రక్షిస్తున్నారు అనేది. ఓరుగంటి నరసింహయోగి వచ్చి, అమ్మకు ఆధ్యాత్మిక దయ్యం పట్టింది. అని చెప్పినప్పుడు - తాననుకున్నది నిజమే నను కున్నదామె. నన్ను శ్రీరంగపురమునకు పిడుగు లక్ష్మీ నారాయణ బాలనాథ్ తీసుకెళ్ళాడు బాగు చేయించడానికి. తీసుకెళ్ళితే, సరే ఆయన రుద్రాక్షమాల తీసుకొని భూమి మీద కొట్టాడు-దయ్యాన్ని పలికిస్తానని. మూడు దెబ్బలు వేశాడు, పలకలా. దయ్యం బయటికి రాలా. దయ్యం నామీదకి రానప్పుడు దయ్యం ఎలా బయటికి వస్తుందో ఋజువు చేయడానికి, వేరే వాళ్ళను తీసుకొని వచ్చి ఒక్కసారి అట్లా అనగానే వారు బయటపడ్డారు. నాపేరిది, నాపేరిది అని. కాని నేను మాత్రం నేనుగానే ఉన్నా. కనుక కొందరికి దైవం మీద ఎట్లా విశ్వాసమో - మరి కొంతమందికి దయ్యం మీద అట్లాంటి విశ్వాసం- అట్లా రకరకాల వాళ్లూ ఉన్నారు.

వీ.ప్ర : సహనదేవతవు

అమ్మ : రమణమహర్షిని భగవాన: అన్నారనుకో నాన్నా! ఆయన కొంతకాలం పోయిన తర్వాత రమణేశ్వరుడిని ధ్యానిస్తూ, అక్కడ కూర్చుందామని వెళ్ళాడు గాని-ఆయన వెళ్ళి కూర్చోవటం వల్ల క్షేత్రంకాలేదది. క్షేత్రానికి ఆయన వెళ్ళి తపస్సు చేశారు.

వీ.ప్ర : తిరువణ్ణామలై క్షేత్రమే.

అమ్మ : ఆయన వెళ్ళిన తర్వాత క్షేత్రం కాలే అది. అంతక్రితమే క్షేత్రమది. అట్లాగే షిర్డి ఉంది. షిర్డిక్షేత్రమని మనకు తెలియదు. సాయిబాబా ఉండటాన క్షేత్రమయింది. ఈ జిల్లేళ్ళమూడి ఉంది. ఒకప్పుడేమిటో మనకు తెలియదు. ఒక అడవి. అరణ్యమయినంత మాత్రాన క్షేత్రం కాదు అనడానికి వీల్లేదు. ఇదేమిటో! మనకు తెలియని ఊరికివచ్చాం. మన ఉద్యోగ రీత్యా ఈఊరొచ్చాం. పుట్టిన ఊరు మామూలు గ్రామం. అదివరకే పండితులు పెద్దలు ఉన్న ఊరు. ఆఊళ్ళో పుట్టాం. ఈఊరి కొచ్చాం. ఇది క్షేత్రమని అనిపించుకుంటుందా. ఫలానా కారణం వల్ల క్షేత్రమవుతుంది. పుట్టినప్పటి నుండి ఉన్న ఊరుక్షేత్రం కాలేదు. మరి పుట్టినప్పటి నుండి నేను, నేనైన నేనే, కాని అది క్షేత్రం కాలా. అవుతుందేమో తెలియదు.

సో : ఇప్పుడెందుకు కాలేదు.

శ్రీపాద : ప్రతిదీ ఎందుకు కాలేదో అది అందుకు కాలేదు.

అమ్మ : కావచ్చేమో.

సో : "మీ recognition లో లోపంగాని నేనేమీ మారలేదు" అంటారు అమ్మ – "ఎప్పుడూ ఇట్లాగే ఉన్నాను" అంటారమ్మ. జిల్లేళ్ళమూడేమో క్షేత్రమయింది. మరి మన్నవెందుకు కాలేదు.

ఈరోజున మన్నవక్షేత్రం కాకపోతే ఈనాడు కాకపోయినా, మరోనాడు అదీ క్షేత్రమన్పించే రోజూ ఉన్నది.

సోదరుడు: అది పుట్టిన ఊరు గదా. క్షేత్రమెందుకు కాకుండా ఉండాలి.

అమ్మ : నేను ఊళ్ళోలేనినాడు ఇది (జిల్లేళ్ళమూడి) క్షేత్రం అనుకొని వస్తున్నారా. ఫలానా కరణంగారి భార్యది జిల్లేళ్ళమూడి అనేవారు. క్షేత్రమని ఎంత మందికన్పిస్తుంది? తదనంతరం....

వీ.ప్ర : జన్మస్థలానికి కూడా ఈ రకమైన ప్రాముఖ్యం రావాలి.

అమ్మ : మనిషి చాటయిన తర్వాత అనిపిస్తుంది.

వీ.ప్ర : మక్కా అలాంటిది.

అమ్మ : అయోధ్య రాముడుండగా కాలేదు. బృందావనం కృష్ణ దుండగా కాలేదు. భర్త ఎక్కడ ఉంటే అక్కడ ఉండాలి గనక మేము ఉద్యోగరీత్యా ఈఊరొచ్చాం (జిల్లేళ్ళమూడి). దీన్ని క్షేత్రం చెయ్యాలనో, ఫలానాపని చెయ్యాలనో ఇది ఇట్లా ఉంది, అది అట్లా ఉందనో అనిలేదు. పుట్టిన ఊరు క్షేత్రం చెయ్యాలి అని ప్రశ్నించడానికి ముందుగా నా దగ్గరనుండి తొలగితే, ఈ ఆవరణ దాటితే మార్పు కనబడుతుంది మీకు.

వీ.ప్ర : భవిష్యత్తరాలకు అమ్మతో సంబంధించిన ప్రతి ప్రాంతమూ క్షేత్రమే.

అమ్మ : ఇదిగో ఇక్కడ సీతమ్మ నిలుచుంది. ఇక్కడ సీతాదేవి కూర్చున్నది. అన్న విధంగా ఇది అమ్మ నడచిన ఊరు అను కుంటారు. మనిషి ఎరుకకూడ ఎదురుగుండా కనబడుతుంటే దాని Value తెలియదు. రోజూ Pleader లు కోర్టుకు వెళ్ళే వేళ, ఇంట్లో పెద్దలందరు నిద్రపొయ్యేవేళ భామనే సత్యభామనే యశోదమ్మ తల్లివే అంటూ పాటలు పాడుతుండే వాళ్ళు. తాతయ్యగారింట్లో మానెడు పట్టే కుండ ఉంది. నేను, మా లోకనాథం (బాబాయి) ఇద్దరం చెరో సోలెడు బియ్యం పెట్టేవాళ్ళం. ఇంట్లో ఎవరుంటారు? కనుక్కోవడానికి పెద్దఇల్లు. అందరూ నిద్రపోతుంటారు. తర్వాత ఏం చెయ్యాలో లోకనాథం చెప్పేవాడు. వంట యింటినుండి అన్నం తీసుకెళ్ళి పెడుతుండేవాళ్ళం. ఆముసలివాడు (భిక్షకుడు) కొన్నాళ్ళు రావడం మానేశాడు. ఇల్లెక్కడో కనుక్కుందామంటే వెతుక్కుంటూ ఇద్దరం వెళ్లాం. చివరకు ఇల్లెక్కడో తెలుసుకున్నాం.

అట్లాగే మౌలాలి అని ఒకడుండేవాడు. దేవాలయాని కెదురుగుండా బహ్మాండం వారి సత్రముంది. అక్కడ తానుంటుండేవాడు. ఈగుడ్డివాడే మౌలాలీ. ఒకనాడు ఈ మౌలాలీ నాకు శివాలయం ముందర ఎదురు పడ్డాడు. ముందే వణుక్కుంటూ వస్తున్నాడు. నాచేతిలో కానో, అర్ధణో వుంది. అదిచ్చాను. నేనెక్కడికి పోతే అక్కడి కొచ్చేవాడు. నాపెళ్ళప్పుడు కూడ వచ్చాడతడు. తెల్లని తెలుపుతో అతని శరీరం ముడతలు పడి ఉండేది. గ్రుడ్డివాడైనా ఎంతో అర్థం చేసుకొన్నట్టుండే వాడు. ఈనాడు మీరెట్లా అర్థం చేసుకొంటున్నారో, ఆనాడే అతడు అర్థం చేసుకొన్నట్లు మాట్లాడేవాడు. వీడికేమున్నది? చీకటే. కళ్ళులేని వాడికి, ఏదో కనబడుతున్నట్లనిపించేది. ఇప్పుడు నీవు వేసిన ప్రశ్నే అతను ఆనాడే అడిగాడు. "నీఅంత వాళ్ళు మళ్ళీ పుడతారా" అని. ఏం తెలుసుకున్నాడో నాకు తెలియదు. నేను తెనాలిపోతే అతనక్కడి కొచ్చాడు. తెనాలిలో తాతగారింటి కెదురుగా ఒక స్కూలుండేది. ఆస్కూలులో అతనిని కూర్చోబెట్టి నేనన్నం పెడుతుంటే మా అమ్మమ్మ నాతో పోట్లాడు తుండేది.

తెలుసుకోడానికీ, జ్ఞానానికీ ఏరోజు నుండి తెలుసు కుంటాడు, వ్యక్తిని ఎలా అర్థం చేసుకొంటాడంటే.... ఏం చెప్పను? నేనర్థమైనానా? వాడర్థం చేసుకున్నాడా? అంటే .... వాడా గ్రుడ్డివాడు. నావయసు పదేళ్లుండేవి. అందుకే దేనికైనా తరుణమే కారణమంటాను.

శ్రీపాద : ఇక్కడ వైవిధ్యం సహజమైయున్నది. అవడమనే మాట ఏమిటి? ఆమాటను తరచు శాస్త్రముదాహరిస్తుంది.

వీ.ప్ర : అందుకోలేనంత ఎత్తుగా ఒక శిఖరం ఉండటం సహజం. మిగతావి ఆదరిదాపుల్లోకి రాలేకపోవటం సహజం.

అమ్మ : ఇంతమంది ఒక తాజమహల్‌నే చెప్పుకొంటున్నాం. నన్నిలా అడిగారు. నిన్ను గురించి సహనం సహనం అని వ్రాస్తారు. గదా. సహన మంటే ఏమిటి అని ప్రశ్నించారు. సహనం మంటే ఏమిటో తెలియదు. తన ఇష్టాన్ని ఆచరించటమే సహనము అన్నాను.

వీ.ప్ర : సహజ సహనమంటే?

అమ్మ : బాధే కనిపించక పోవటం సహజ సహనం.

శ్రీపాద : కలవటమంటే సమీకరణం కాదు.

అమ్మ : కలిసిన తర్వాత రెండుగా కనిపించవు.

వీ.ప్ర : సమీకరణము అంటే దగ్గరకు చేర్చడం అని అర్థం. మూస కట్టుగా కలవటం కాదు.

అమ్మ : మైనంతో సింహం అచ్చు పోశాం. సింహం ఆకృతి కన్పడు తుందిగాని మైనమని తెలియదు. సింహమే కనబడు తున్నది. మైనంతో బొమ్మను చేశాం. బొమ్మేకనబడుతున్నది. ఆలోచించిన తర్వాత దేనితో తయారు చేశారు అని ఆలోచన వచ్చింది. మైనంతో ఒక ఆకృతి నేర్పరచి దానిని చూపి అదుగో శ్రీపాద అంటాం. అదిగో బొమ్మఅంటాం. దేనితో తయారు చేశారు. అన్నది తర్వాత ప్రశ్న. ఎట్లా తయారయింది? ఏమయింది? ఎందుకయింది? అన్నవి తర్వాత ప్రశ్నలు

వీ.ప్ర : పంచదార నీళ్ళలో పోస్తే కలిసిపోయింది.

శ్రీపాద : ప్రత్యేకతను కోల్పోయి అంతలో కలవటం. కలవటమంటే సింహం, నక్క – నక్క సింహంగా కావడం కాదు.

అమ్మ : పంచదారలో పంచదార పోసినట్లు అన్నారనుకో! నాలుగు కుండల్లో నీళ్ళు కలిపి ఒక తొట్లో పోశాం. చెరువులో నుండి తెచ్చేటప్పుడు బిందెతో ఒకరు తెచ్చారు. చెంగుతో ఒకరు తెచ్చారు. కుండతో ఒకరు తెచ్చారు. కాని నాలుగూ తెచ్చి ఒక దానిలో పోస్తే....

వీ.ప్ర : పోసినట్టు....

అమ్మ : దీనికి మన వాళ్ళు ఉపమానం లోగడ ఇచ్చి ఉన్నారు నాన్నా! ఒక సూర్యుడు నాలుగు కుండలలో నీరు నింపగా అందులో ప్రకాశించినట్టు అట్లా ఇచ్చారు కుండల్లో అనేగాదు వాడు ఏదిక్కు తిరిగితే అటు సూర్యుడు ప్రకాశిస్తూనే ఉన్నాడు.ఒక జీవుడు సమస్త జీవులకు .... ఈ ఉపమానం

కూడ అంతగా చాలదు, నీకు సమీకరణగా కనబడుతున్నదా! అరటి గెల ఒకటున్నది సమీకరణగా కనబడుతున్నది.

శ్రీపాద : సమంకావడానికి ఆమాటవాడారు.

అమ్మ : సమంకావటమంటే సమమై వేరుగా కనబడక పోవటమా? అట్లా అయితే నీటిలో నీరు – పంచదారలో పంచదార

శ్రీపాద : అదే. అసలు essence ఒకటి అవటం.

అమ్మ : సముద్రము – అల, చక్కగా సరిపోతుంది.

శ్రీపాద : సముద్రము వేరు కాదేమో కాని–ఆ అల కాదు అంటున్నారు.

అమ్మ : వాయువు చేత అలలొస్తున్నాయని గదా మన మనుకున్నది.

శ్రీపాద : సముద్రములో వచ్చే అలలు వాయువు వల్లనే

అమ్మ : ఏ రకమైన చలనమయినా వాయువే అనవచ్చునా?

శ్రీపాద : అలా కాదు. వాయువు ఒక కారణం, నీళ్ళలోగడ్డ వేస్తే అలవస్తుంది గదా!

అమ్మ : ఆ కదలిక వాయువు కాదన్నమాట.

వీ.ప్ర : అల రావటానికి బయటనుండి వచ్చే defeets కారణం.

శ్రీపాద : నీటి మీద రబ్బరుపొరలాగా రాయిపడగానే చెరగిపోతుంది. ఆపొర కలసిపోయి ఇలా ఇలా అవుతుంది. గాలి తేలినప్పుడు గొయ్యిలా అవుతుంది.

వీ.ప్ర : తబలామీద ఇలా కొడితే ఆకంపనమే ధ్వని. కంపనం ధ్వనిలా వినిపిస్తున్నది.

శ్రీపాద : చంద్రుని మీదికి మనుష్యులు వెళ్ళారు. నేను చంద్రునిమీదికి వెళ్ళి చూచినట్టు ....అది ఎదిగిపోయి ఎత్తు అందుకోవడ మన్నది లేదు.

వీ.ప్ర : ప్రత్యక్షభాసురం.

అమ్మ : అలా ఉండటమే చాలు. జ్ఞాని కూడ కొంతకాలముండి మళ్ళీ రావడమేనా? జ్ఞానులుకూడ మళ్ళీజీవుడుగా వస్తారనా?

శ్రీపాద : వస్తారని దయానందవారు వ్రాశారు.

అమ్మ : పంచదారలో పంచదార కలిసిన తర్వాత, ఆపలుకే విడదీసి చూపిస్తున్నాడా? పంచదార నీళ్ళల్లో పోస్తే పాకమవుతుంది గాని పలుకు కూడ తీయడానికి వీల్లేదు. ఉన్నది బ్రహ్మే. బ్రహ్మలో బ్రహ్మకలిస్తే విడిగా, వేరే ఎట్లా వస్తాడు?

శ్రీపాద : ఒక్క దయానంద సరస్వతే అట్లా చెప్పారు. ఆర్య సమాజం తప్ప తతిమ్మా వాళ్ళు అలా అనలా.

అమ్మ : ఆర్య సమాజం వారందరు దేవుడు కొంతకాలం పైనుండి క్రిందనున్న మానవుడిని ఆశీర్వదిస్తుంటాడని అన్నారు. జ్ఞానిగా పైనుండి కొంతమంది మీద...కొన్ని సమయాల్లో తిరిగి వస్తారన్నారు. కొన్ని శరీరాలుపయోగించి, కొన్ని ఉపయోగాలు చేస్తారట.

సో : వాళ్ళు పైన దేవతలా?

వీ.ప్ర : యోగానంద అదే చెప్పాడు.

అమ్మ : తన ప్రాణం పోయిన తర్వాత ఒక ఇంటి మీద అతనే తన శరీరాన్ని గూర్చి ఇతరులు ఎట్లా ఏడుస్తున్నారో చూస్తాడట. జీవుడు కనబడతాడని కొన్ని పుస్తకాల్లో వ్రాశారు వాళ్ళు. ఆర్య సమాజమన్నా, దివ్యజ్ఞాన సమాజమన్నా రెండూ ఒకటేనా? నేను చెప్తున్నది దివ్యజ్ఞాన సమాజం వాళ్ళది ఇందాకటి విషయం.

శ్రీపాద : ముక్తి పొందిన తర్వాత జ్ఞాని కూడ మళ్ళీ వస్తాడని చెప్తున్నారు.

వీ.ప్ర : దివ్యజ్ఞాన సమాజం వారు ఊహ ఎటు పోతే అంత ఊహించారు. ఒక లోకంకాదు, అటు ఇటు చాలా లోకాలు చెప్పారు.

అమ్మ : నాకే మనిపిస్తున్నదంటే పూర్తిగా వీడు ప్రాణం పోయిన తర్వాతలేదు అని అనుకుంటే తృప్తిలేక ఏదో ఒక కార్యక్రమం ఉన్నదనుకుంటే, ధైర్యం కోసమేమో! మరిభగవంతుని పెట్టుకోడమెందుకు? ఎందుకొచ్చామో తెలియదు. ఎందుకు పుట్టామో తెలియదు. వచ్చాము, మన పనులు

మనం చేసు కొంటున్నాము మధ్యలో భగవంతు దెవరు? ఎందుకు తెలుసు కోవాలి?అని ఆలోచిస్తే అంతగా వాదు కనపడితే వీదు కోరు కున్నదేమిటంటే భాగ్యం కోరుకోకూడదు. కోరికలుండ కూడదు. మోక్షం కావాలని కోరుకోకూడదు. ఏం కావాలయ్యా అంటే జన్మరాహిత్యం రావాలి. జన్మరాహిత్యం కావాలి అనే కోరిక ఉండకూడదు అని వ్రాస్తున్నారు.

శ్రీపాద : అదీ కోరికే అవుతుంది.

అమ్మ : ఎందుకు వీడిని ప్రార్థించాలి. అంటే పుట్టకుండా పోవటానికి అన్నారు. మీరు పుట్టరు. పుట్టకుండ నాది బాధ్యత అని నేనన్నాననుకో! కాదు శాస్త్రాలు చెబుతున్నాయి గనక పుడతాను.నేను చేసుకోవాలి ఆకృషి. ఎట్లా చేసుకోవాలయ్యా? ఇది చేసి, అది చేసి సాయుజ్య పదవిపొంది మళ్ళావస్తా దంటున్నారు. కొన్నాళ్ళు వైకుంఠంలో విష్ణుమూర్తి దగ్గర కూర్చున్నా, మళ్ళీ వస్తానని చెబుతున్నారు గదా వాళ్ళు! వీళ్ళు పోయి కొంత కాలం తర్వాత వచ్చేటప్పుడు – ఈ క్రిమికీట కాదులన్నీ పుణ్యం చేసుకొని ఏజ్ఞాని మంచి నీళ్ళు త్రాగేటప్పుడో, లేక ఆనీళ్ళలో చచ్చిపోయో – వచ్చే జన్మలో కాకియై ఆ తర్వాత మృగమై తర్వాత గోవై, తర్వాత మనిషై – మనిషి జన్మలో కూడ సన్యాసియైసాగి పోవాలట. తర్వాత జ్ఞానికావాలి. యెనభై నాలుగు లక్షల జీవరాసుల వరకే మిగిలివుండాలి. ఇంత పెరగడానికి వీల్లేదు. ఆ యెనభై నాలుగు లక్షల జీవరాసులే మళ్ళీ మళ్ళీ వస్తుంటే ఈ జనాభా పెరగటానికి వీల్లేదు. ఒకజన్మలో భార్యాభర్త ఉన్నారు. జన్మజన్మలకు వారే భార్యాభర్త అయి వస్తుంటారని చెబుతున్నారు. ఆవిడముందు పోతే ఆయన కనిపెట్టుకొని ఉంటారు. ఆయన ముందు పోతే ఆవిడ కనిపెట్టుకొని వుంటుంది. పదేళ్ళ ముందు ఆయనను పంపించి ఆ తర్వాత ఆవిడ పుడుతుంది కాబోలు.

ఒకచెట్టు ఉన్నది. ఆ చెట్టు వాడిపోయింది. ఆచెట్టుకు కొన్ని కాయలు కాశాయి. ఆకాయలు కొన్ని చెట్లయినాయి. కాని ఆచెట్టే మొలవాలని లేదుగదూ.

శ్రీపాద : సరైనమాటే. ఆచెట్టు మొలవడ మేమిటి?

అమ్మ : గులాబిపూవుంది. ఒక్కొక్కచెట్టు ఒక్కొక్కపువ్వు ఆధారంగ కొన్ని చెట్లయితాయి. అంట్లు ఆధారంగ కొన్ని వస్తాయి. అనుకరణ వుందిగాని, అదే రావాలని లేదు.

శ్రీపాద : అవును.

అమ్మ : ఏవిధంగాచూచినా ఆధారం కనిపించడం లేదు. ఆసముద్రం లోఎన్ని నీళ్ళున్నాయో, ఎంత లోతుందో కొలవలేము. ఆ అలలేవస్తున్నవని అనడానికి వీల్లేదు. బావిలోనీరు ఊట అనుకుంటాం కాని, జలంలేదు అనుకుంటామా?బకెట్లకొద్దీ నీరు తోడేస్తుంటే నీరు ఊరుతున్నది. (క్రిందటి) ఆ బకెట్టులో నీళ్ళే మళ్ళీ బుంగలోకి రావటంలా. భూమిలోనుండి పుట్టిన నీటిలో బురద లేదు-వారు చెప్పే ప్రకారం సర్వత్రా నిండిఉన్న బ్రహ్మ, అంతాతానైన బ్రహ్మ - మట్టినుండి నీరు అంటని విధంగ ఉంటుందని - దానినే జీవుడన్నారు.

అదే జీవుడుగా మారిందన్నా - ఆజీవుడే వస్తున్నాడన దానికి సరిపోదు.

శ్రీపాద : ఒకటిగానే ఉండటమంటూ లేదు. రెండు అయ్యేవుంది. వుండటమే రెండుగా వుంది.

అమ్మ : వైవిధ్యం కనిపిస్తున్నది. కనబడుతున్నది సైన్సు. ఊహించేది దైవం.

వీ.ప్ర : జగత్సత్యం, బహ్మఊహ.

అమ్మ : జగత్తు సత్యమన్నంత మాత్రాన బ్రహ్మకాదని కాదు.

వీ.ప్ర : ఇదిగాక వేరేబ్రహ్మ ఉందనేది ఊహ.

అమ్మ : కనిపించినదల్లా బ్రహ్మే. కనిపించనిది ఊహ. నే చూసిందల్లా బ్రహ్మ. నేచూడనిది ఊహ.

శ్రీపాద : There is only Being - No Becoming

అమ్మ : సముద్రంలో తరంగం పుట్టింది. మళ్ళీ వెనక్కుపోతున్నది. అన్ని నేనులు....

శ్రీపాద : జలగా, ప్రవాహంగ అన్నింటిగా అదేఉంది. అలా Ice Berg అవడం లేదు. కాదు Ice కొండలున్నవి. ఈ నీళ్ళు కొండ అవడంకాదు.

అమ్మ : సముద్రంలో కొండలున్నాయి.
సముద్రంలో కొండలున్నాయా? కొండల మధ్యన సముద్ర మొచ్చిందా?

శ్రీపాద : కొండ ఉన్నచోటనే సముద్ర మొచ్చిందమ్మా. ముందు కొండలే. తర్వాతే సముద్రం. నీరు Steam Temperature కంటె తగ్గితే నీరై సముద్ర మవుతుంది. ముందు కొండలే. తర్వాతే నీరు. సముద్రంలో అగ్నిపర్వతం పుట్టి ఇది వరకులేని దీవిని ఏర్పాటు చేసింది.

× × × × ×

అమ్మ : జీవితానికేదైనా లక్ష్యముందా?

శ్రీపాద : లేదు.

అమ్మ : తృప్తే ముక్తి అన్నాను. మనిషికి ఏదో ఒకటి తోస్తుంది గనుక ఏదో ఒక లక్ష్యం ఉన్నదని అనుకోవచ్చుగా!

శ్రీపాద : తృప్తికన్న ఇంక లక్ష్యమేమున్నది?

అమ్మ : తృప్తంటే ఎటువంటిది? ఎందులో?

వీ.ప్ర : ఇంతకంటె ఇంకొకటి లేదు అనిపించటం.

అమ్మ : ఆకలైతే, అన్నం తింటే తృప్తి కలుగుతుంది. అటువంటి తృప్తేనా ఇది? జీవితంలో అనేకం జరుగుతున్నాయి.

శ్రీపాద : అహర్నిశం తింటూనే ఉండలేదు గదా!

వీ.ప్ర : మామూలుగా తృప్తిపడటానికి, జీవితం మొత్తం మీద తృప్తి పడదానికి తేడా ఉంది.

అమ్మ : సహనానికి, సహజ సహనానికి తేడా ఉంది. సాధారణంగా ఏర్పడే తృప్తికీ, జీవితం మొత్తం మీద కలిగే సంతృప్తికీ, భేదమున్నది. ప్రతి

పనిలోనూ తృప్తి ఉన్నది. జీవితం మొత్తంలో తృప్తి ఉన్నది. జీవితం మొత్తంలో తృప్తి పడలేక మిగిలిందంటే...

మానవుడు చేయవలసి ఉన్నదనటం నాకు కుదరటం లేదు. ఎందుకు చేత కావటంలేదో నాకు తెలియటంలేదు.

వీ.ప్ర : లేదు కాబట్టే

శ్రీపాద : ఎందుకు చేస్తాడో అనేది తెలియటంలేదా? బాగుంది.

వీ.ప్ర : చెప్పటానికంటూ ఉంటే, చేతకాక పోవడమనేది వేరే విషయం.

అమ్మ : ఉన్నదని శాస్త్రాల ద్వారా చెప్తున్నారు గదా! వాడిని తెలుసు కోవాలని, తరించాలని, పుట్టించే అందుకని. నేను పుట్టించే అందుకయితే నేనే కనుక్కొంటాను వాళ్ళ సిద్ధాంత రీత్యా కర్మతోనే జన్మ వచ్చినప్పుడు కర్మ ప్రకారమే నాజన్మ నడు స్తుంది.

బుద్ధిఃకర్మాను సారిణి అన్నప్పుడు....అప్పుడు బుద్ధికి విలువ లేదు. బుద్ధి కర్మాను సారిణి అయింది గదా!

శ్రీపాద : కర్మే ప్రముఖమైనదట. జీవితం కర్మానుసారిణి అన్నారే గాని బుద్ధికి అంతటి ప్రశస్తిలేదు.

అమ్మ : మనయేవమనుష్యాణాం కారణం బంధ మోక్షయోః
అనే వాళ్ళ దృష్టి ప్రకారంగా మనసు దాని మీద లేదు.

వీ.ప్ర : ఆ మనసు కర్మాను సారిణే.

అమ్మ : జాయసే కర్మన స్యామతా బుద్ధి జనార్దనా అనే దాని ప్రకారం ఆ విధంగా కూడ వీల్లేదు.

నీవు పుట్టడమే కర్మ చేత పుట్టావు. ఆకర్మ ప్రకారమే నీవున్నావు. ఏరకంగా చూచినా మనిషికి స్వతంత్రత లేదు. గనక వీల్లేదు, దాన్ని గురించి తెలియటం లేదు.

వీ.ప్ర : లేనిది తెలియటం లేదు.

అమ్మ : ఆపంచ కోశములలో .... దానిలో ఉంటే అలా చేస్తావు. అన్నమయ కోశములో ఉంటే ఆ పని చేశావు. ప్రాణమయ కోశంలో ఉంటే ఆ పని చేశావు. సూక్ష్మ శరీరంలో ప్రవేశిస్తావని చెబుతున్నారు అదీ మూడు భాగాలు చేశారు గదా. శిక్షావల్లి, భృగువల్లి, ఆనందవల్లి తైత్తరీయం. మాండూక్యం అనువాదం గౌడపాదులు అంటున్నారు.

శ్రీపాద : కోరికలు, సరే, అసలు ఉపనిషత్తే గౌడపాదులు వ్రాశారు అనేవాదం ఒకటుంది.

అమ్మ : (వారి వాదంలో) పుట్టలేదు గాబట్టి నేనాలోంచించాల్సిన పనిలేదు. పుట్టలేదు గాబట్టిలేరు. చేసినపనో? ఒప్పుకుంటారా?

శ్రీపాద : లేదు అంటే ఈ శరీరం పుట్టలేదు అనరు.

అమ్మ : జగత్తులేదన్నారు గదా? జగత్తులో నేనులేనా?

శ్రీపాద : జగత్తుకాదమ్మా. ఆ నేననుకునేది?

అమ్మ : ఆ నేననుకున్న గౌడపాదులేడి? పుట్టలేదు అని చెప్పదానికి గౌడపాదులు ఏమైనారు?

శ్రీపాద : వారు వారిలోనే....

అమ్మ : ఏమైయుంటాడో చెప్పాడా?

## 17-4-76

అమ్మ : నాకు జగత్తు సత్యమనే అనిపిస్తుంది. ఎప్పుడూ ఉందనే అనిపిస్తున్నది. జగత్తంటే మనిషేకాదు. ఎఱ్ఱమట్టే భూమి, నల్లమట్టి కాదనగలవా? ఇసక మట్టేభూమి పాటిమట్టి కాదనగలవా?

శ్రీపాద : జగత్తంటే నక్షత్రమండలమని కూడాను.

అమ్మ : భూమి కాదనగలవా? ఆకాశం కాదనగలవా? చంద్ర మండలం కూడ సైన్సు వాళ్లు జగత్తే అంటున్నారుగా!

శ్రీపాద : సూర్యుడు, చంద్రుడు జగత్తులోని వారే.

వీ.ప్ర : సౌరమండలం జగత్తులో చాలా చిన్న విషయం.

అమ్మ : మండలమనే దానికర్థం?

వీ.ప్ర : అంటే?

**అమ్మ : కూడలిఅన్నా, మండలమన్నా రెండింటికీ ఒకే అర్థం. అంతా సరిపోతున్నట్లే నాకనిపిస్తుంది. ప్రతివాడిదీ సరిపోతుంది. ఎవరికందినంత వారు చెప్పారని, ఎవరూ తక్కువ చెప్పలేదని నాకనిపిస్తుంది. వాళ్ళు అసత్యం చెప్పారని నేననటం లేదు.**

**వారిది సాపేక్ష సత్యం.**

శ్రీపాద : **అవడమేమిటి? ఆమాటతో ఎగిరిపోయింది వారి వాదం. ఉండటమే. అవడమనేదే లేదు.**

అమ్మ : రమణమహర్షి చెప్పినదానిలో పొరపాటు లేదు. నిన్నునీవు తెలుసుకో అన్నాడనుకో! నిన్ను నీవు తెలుసుకోవడానికి మార్గమేమిటి అని చెప్పలేదు. నిన్ను నీవు తెలుసుకొన్ననాడు ఆప్రశ్న పుట్టదు అన్నారాయన.

శ్రీపాద : సందేహాలేవీ పుట్టవన్నారాయన.

అమ్మ : తన్ను తాను తెలుసుకుంటే సందేహాలే లేవు. దానికి ఎన్ని రకాలుగా రావటానికి వీలుంటుందో. ఆయన చెప్పింది నేను సమన్వయం చేసుకొన్నాను. తను మూలమిదం జగత్ అన్న వాక్యాన్ని ఆధారం చేసుకొని, చెప్పుకొచ్చిన దంతా ఆయన చెప్పిన దానికి సరిపోతుంది.

వీ.ప్ర : నేను అనేది ఎవరు? దానిని తెలుసుకోవడానికి ఒక మార్గం చెప్పలేదు.

అమ్మ : త్యాగం, రాగం, ద్వేషం-సర్వం తనకోసమే. భౌతికంగా ఆలోచిస్తే-ద్వేషం నాకు, ప్రేమనాకు, త్యాగంనాకు. తను చేసేపని పదిమందికీ ఉపయోగపడితే త్యాగమన్నారు. తనవరకే ఉపయోగపడితే రాగం అన్నారు. స్వార్థం లేకుండా ఎక్కడన్నా ఉన్నదా? అంటే ఈస్వార్థం సర్వత్రా ఉపయోగ పడ్డప్పుడు పరమార్థ మయింది. ఈ స్వార్థమే సర్వత్రా ఉపయోగ పడ్డప్పుడు, రకరకాలుగా వీడాలోచిస్తూ, అన్వేషించుకుంటూ పోతే,

పరమార్థ మయింది. నేను ఆయన చెప్పిన మాటను ఆవిధంగాకూడా అన్వయించు కొంటు న్నాను.

శ్రీపాద : ఆయన చెప్పింది దీనిలో Fraction కూడా కాదు. దీనిలో భిన్నాంకముకూడా కాదు. మీరు అన్నీ అనుభవించు కొంటున్నారు. సరే మంత్రం కోసం, అనుకొన్న విధంగా చెప్తున్నారు.

అమ్మ : నేను సరే అన్నాననుకో! అన్నింటికీ!
కీర్తి లేదనడానికి లేదు, కీర్తికోసం అనడానికి లేదు-తనకు తృప్తిఅయినపని చేస్తాడు, ఏపని చేసినా.

శ్రీపాద : పదిమంది గొప్పగా అనుకుంటే వీడికి తృప్తి. కీర్తీ తృప్తే.

అమ్మ : అన్నీ వీడికోసం చేసుకోవటమే. సర్వత్రాస్వార్థం ఎప్పుడైతే వస్తుందో, అప్పుడు పరమార్థంగా మారిపోతుంది.

వీ.ప్ర : ప్రతిచోటా, ప్రతిక్షణం తన స్వార్థాన్ని స్పష్టంగా చూడగలిగితే, అది తనను తాను చూడటమే అవుతుంది.

అమ్మ : తనను తాను చూచుకోమంటాడు, తనను తాను తెలుసుకో మంటాడు. అది ఎక్కడో మనసుతో లోపలికిపోయి. నెత్తురు మాంసమూ కాకుండా పరమార్థాన్నో, పరబ్రహ్మానో చూడటం కాదు. భౌతికంగా ఆలోచించినా త్యాగమనేది లేదు. రాగ ద్వేషాలు కూడా తనకోసమే. అందుకే తనమూల మిదం జగత్ అన్నాను.

వీ.ప్ర : మొదట పరమార్థమే చేస్తున్నాననుకుంటాడు. చివర కొచ్చే టప్పటికి స్వార్థమే పరమార్థమనుకుంటాడు.

అమ్మ : ఒకడిని చంపటమూ స్వార్థమే, ఒకడికి పెట్టడమూ స్వార్థమే. ఒకడిని ద్వేషించడమూ స్వార్థమే,ఒకడిని ప్రేమించడమూ స్వార్థమే. ఒకరి ఇష్టం కోసం తనకిష్టం లేకపోయినా-ఇంకొక వ్యక్తిని హింసపెట్టడం అదీ స్వార్థమే. ఒకరికోసం ఇంకొక మనిషిని చంపాలనుకోవటం అదీ స్వార్థమే. ఒకరి కోసం ఇంకొకరిని ప్రేమించటమూ అదీ స్వార్థమే - స్వార్థం లేని పనంటూ

లేదు. కనుక అంతా స్వార్ధమని సర్వత్రా ఉపయో గించినపుడు నేనే మిగులుతా. ఇంకొకడు లేదు.

శ్రీపాద : దీన్ని మరికాస్త వివరించండి.

అమ్మ : ఒకడిని కత్తితో పొడవనీ, ఒకడిని పూలతో పూజించనీ స్వార్ధమే. దీని అర్థమేమిటంటే నేను తప్ప ఇంకొకటి లేను. భౌతికంగా పోయి పోయి.... ఇదంతా ఎందుకు చేశాను అని ఆలోచించుకుంటే.... ఈనేను భౌతికంగాకూడ నేనే అయినప్పుడు తనను తాను తెలుసుకోవటం రమణ మహర్షి చెప్పింది ఎట్లా అన్వయమవుతుంది అని ప్రశ్నించుకుంటే.... లోపల ఉన్నది నేను అని తెలుసుకోవాలంటే – బైట ఉన్నది నేను అని తెలియవద్దూ? నేను అన్నది ఆధారం కాదు. నేను అన్నది ఒకగుర్తే. గుర్తుతో గుర్తించి గుర్తు నశించాలి అని చెప్పాను గదా!

ఉన్నదే నేను. అంతటా చూస్తున్నది నేను, నేనును తెలుసుకొన్నది నేను. ఉన్నది నేను, ఆ అనుకున్నది నేను, అయింది నేను–నేను నేనైన నేను.

శ్రీపాద : నేచేసిందల్లా నాతృప్తి కోసమే చేశాను. ప్రతి పనిలోనూ నేనే ఉన్నాను.

అమ్మ : ఆధ్యాత్మికంగ కళ్లు మూసుకొని నేనెవరు? ఇది నేనా? అదినేనా? నేను అని జపం చేయటంలో అర్థ మేమిటంటే అక్కడ–

మనసంటే ఏమిటి? మనసుకు రూపంలేదు. నీరు కనుక ఏపాత్రలో పోస్తే ఆ ఆకృతి ధరించినట్లుగ మనసు దేనిని చూచి గుర్తిస్తున్నదో – దాని పోలిక అదే. అదే ఆకారం దానికి, వేరే ఆకారం లేదు. అట్లాగే ఆయన నేనైన నేను అనుకోవడానికి కూడ – అది నేను, ఇది నేను అలాపోయి పోయి అన్నీ నేనే అనుకున్నాడు – అప్పుడు నేనైన నేను ఇదంతా నేను ధృఢ పడిన తర్వాత సందేహం రాదు అన్నారాయన. ఆస్థితికి వెళ్ళాను అన్నారు, అక్కడ ఉన్నాను అన్నారు ఉన్నదే నేను అని ధృఢమైపోయింది.

శ్రీపాద : మీరనుభవిస్తున్నారు. ఇదికాదు ఇదికాదు అనిపోయి, చివరకు అన్నీ అదే అన్నాడని

అమ్మ : ఇదే అని చెప్తున్నాను. ఇది కాదు, ఇదికాదు అని ఆయన వెళ్ళారు.

వీ.ప్ర : ఇది కాదను కోకపోతే కష్టం. వ్యామోహంలో పడిపోతావు, చేరలేవు" అని కూడా చెప్పారు. ఇదికాదు ఇదికాదనుకుంటే కాని అక్కడకు చేరలేవు అన్నారు.

అమ్మ : షిర్డిసాయి చెప్పింది,ఆభావాన్ని ఇంకొకరకంగ అన్వయం చేసుకుంటా. నాకందరు చెప్పినవీ సరిపోతున్నాయి.

వీ.ప్ర : అందుకే "సర్వసమన్వయి" అన్నది.

అమ్మ : సత్యం ఒకటయినప్పుడు ఆ సత్యం తనైనప్పుడు అన్నీ సరిపోతై.

వీ.ప్ర : వల్లకాని మిట్ట ప్రదేశంలో ఉన్నావు కనుకనే అన్నీ స్పష్టంగ కన్పిస్తాయి. లేకుంటే ఇవన్నీ కన్పించవు.

అమ్మ : క్రిందరోడ్డు మీద ఉండి మద్రాసంతా ఎట్లా చూస్తావు? L.I.C, Building పై కెక్కితేనేగా.

శ్రీపాద : మాకు తెలియనిది, ఇంత సులువుగా తెలియలేదు అని చెప్పలేం.

వీ.ప్ర : తెలిసింది చెప్పలేక తెలియనిది కూడ ఇమడ్చదానికి ప్రయత్నం చేస్తాం. వైవిధ్యమే సృష్టి. ఏరెండూ ఏక సమానంగ ఉండవు. కాని సామాన్యంగా గుణాలు-మానవ గుణాలు సమానంగా ఉంటాయి. మానవులందరికీ పోలికలుండటం కూడ సహజతే. ఆరడుగులు దాటిన వాళ్ళు ఒక్కళ్ళే కాదు చాల మంది వుండవచ్చు. ఏడడుగుల ఆరంగుళాలవారు ఒకరే ఉండవచ్చు ప్రపంచంలో, ఆరడుగుల వాళ్ళు సామాన్యుల లక్షణం. అలాగే, ఆధ్యాత్మిక స్థితిలో పూర్ణత్వం ఉందన్నారు. సృష్టిలో పూర్ణత్వం లేదు, సాపేక్షమే తప్ప. సైన్సుకు అందే దానికి ఎప్పుడూ సాపేక్షమే తప్ప పూర్ణత్వం లేదు. వెతుక్కుం టూనే పోతుంది. అలాగే, ఆధ్యాత్మిక చింతనలో అంతా అదే అని తెలుసుకోవటం అనే స్థితి, ఒక వ్యక్తి కాకుండ -

ఇంకా ఇతర వ్యక్తులు పొందటానికి సాధ్యమవుతుందిగా! అయ్యేటటువంటి అవకాశాలు ఊహించవచ్చుగా! ప్రసాద రావు పొందక పోవచ్చు, అది వేరే సంగతి. కొంత మందికైనా ఈ రకమైన స్థితి, కనీసం సామాన్య స్థితిని పొందటం సాధ్యమవుతుందా, కాదా?

అమ్మ : చెప్పిన వాళ్లందరు అనుభవించే గదా చెప్పింది.

వీ.ప్ర : వారి అనుభవమేమిటో తెలియదు. వారు చెప్పిన మాటలను బట్టి చూస్తే సాపేక్షంగఉంది అనిపిస్తుంది.

అమ్మ : వారు ఒక భాగమును భావించినట్లేనా? పాక్షికంగా ఉన్నా.

వీ.ప్ర : ఆ.

అమ్మ : మనకు సంపూర్ణంగ కన్పించవచ్చు. ఎవరికి ఎంత తెలుసునో అదివాడికి సంపూర్ణం. అవతల ఉన్న వాడికది సగమైంది కాని అనుభవించిన వాడికి, రెండోది తెలియని వాడికి – తెలియనంత వరకు సంపూర్ణమే. ఫస్ట్‌క్లాస్ వచ్చిన వాడికి ఫస్టన పాసయ్యానని సంతోషిస్తాడు. అట్లాగే University first వచ్చినవాడు సంతోషపడతాడు. వీడి సంతోషం వీడిది. వాడి సంతోషం వాడిది. ఈరెండింటి సంగతి తెలిసిన వాడికి బాధగా వుంటుంది. వీడిది వీడి కెక్కువ. వాడిది వాడికెక్కువ. ఈ చదువు లేంది వాడంత వరకు పోలేదు. దీన్ని వదిలేసి వాడంత దూరం వెళ్ళలేదు. నేను సంపూర్ణంగ ఉన్నానని మీరంటున్నారు గాని, నేను సంపూర్ణమని నా కనిపించడం లేదు.

శ్రీపాద : పోనీ, అసంపూర్ణమనిపిస్తుందా?

అమ్మ : అసంపూర్ణ మనిపించటం లేదు. వారిది కాదు అనిపించటం లేదు.

వీ.ప్ర : వారంతా చేరినది, మీస్థితే అని అనిపించిందా?

అమ్మ : నాస్థితి ఏమిటో ఫలానా అని నాకు తెలియడం లేదు. నా స్థితి ఇది అని నాకు తెలిస్తేగదా! ఒకటే తెలుస్తున్నది. మీరు పిల్లలని, నేను తల్లినని, అక్కడా మీకు ద్వైతమే కన్పిస్తున్నది.

వీ.ప్ర : పిల్లలంతా ఒకటిగా కన్పిస్తున్నారా?

అమ్మ : పిల్లలంతా ఒకటిగానే కన్పిస్తున్నారు. ఒక పిల్లలే అనిపించటం లేదు. ఏపిల్ల వాడికా పిల్లవాడు కన్పిస్తున్నాడు. వైవిధ్యం కన్పిస్తున్నది. ఇందులో తరతమ భేదాలు గుర్తిస్తు న్నాను. అన్ని గుణాలు గుర్తిస్తున్నాను. అన్నీ తెలుస్తున్నవి. భేదాలు తెలుస్తున్నవి. సమానత్వం తెలుస్తున్నది. వస్తువు రంగుభేదం తెలుస్తున్నది. రుచి తెలుస్తున్నది. పులుపు తెలుస్తున్నది, కారం తెలుస్తున్నది, తీపి తెలుస్తున్నది. అంతా ఒకటిగా నాకు గోచరించటంలా. అయితే ఇవన్నీ ఏదో ఒకటి....ఏదో ఒకటి దానినుండే బయలుదేరినవని అన్పిస్తు న్నది. కుక్కను చూచినా, నక్కను చూచినా - అన్నాన్ని చూచినా, అశుద్ధాన్ని చూచినా ఒకేశక్తి విభిన్న రూపాలలో వ్యక్తమవుతున్నదని అహర్నిశం నా కన్పిస్తున్నది. ఒక్కక్షణ మనిపించి, ఇంకొక క్షణమనిపించ కుండా ఉండటంలేదు. సర్వకాల సర్వావస్థల యందు అంతా అదేనని సర్వశక్తిమయమని ఎల్ల వేళలా స్ఫురిస్తూనే ఉంది.

వీ.ప్ర : నిద్ర అనబడే దానిలోనూ అనిపిస్తుంది కదూ?

అమ్మ : నిద్రలోనూ అన్పిస్తున్నది. ఒక గొబ్బెమ్మను చేసి దీన్ని పూజ చేసేటప్పుడూ, అన్నం పెడుతూ - వెంటనే బర్రె పేడకడి వేస్తే దాన్ని తొక్కేటప్పుడూ–ఈపేడే ఆగౌరమ్మ కదా అన్పిస్తు న్నది గాని అప్పుడుకూడ ఇదిపేడ, అది గౌరమ్మ అని అనిపించడం లేదు.

సోదరుడు: మా గుణాలలో భేదం లేకుండ ఏకత్వమే తోస్తున్నదా?

అమ్మ : మీరు పిల్లలు అని అనిపిస్తుంది. నీకు ఆకలి అవుతుందనుకో. ఆకలి ముఖం గ్రహించ గలుగుతున్నాను. వీడికి పెట్టాలి వాడికి పెట్టవద్దు అనిపించదు. ఆకలి అయిన వాడెవడో వాడు తింటాడు అని అనిపిస్తుంది. వీడు దొంగ వాడు దొర అనిపించదు. వీడు దొంగ అనితెలుసు, వీడొకసారి చేశాడనీ తెలుసు, అయినప్పటికీ వాడిమీద కోపం రావడం లేదు. తెలుస్తున్నది. ప్రతిదీ తెలుస్తున్నది. తెలియకుండా ఉండటం లేదు.

నాన్నగారని తెలియటంలా? నమస్కారం అక్కడ చేస్తున్నా. మీరు పిల్లలనుకుంటున్నా స్థాన భేదం తెలుస్తున్నది. మీచేత చేయించు కొంటున్నాను (నమస్కారం) – అక్కడ నాన్న గారికి చేస్తున్నాను. అక్కడ ఆ స్థితి ఏమిటి అన్నది నాకనవసరం. స్థానానికి నమస్కారం. అమ్మమ్మ ఉన్నది, నాన్న పక్కన ఉన్నప్పుడు అమ్మమ్మకు తప్పకుండ నమస్కారం చేసేదాన్ని. మామగార్లున్నారు వారువస్తే వారికి నమస్కారం చేసేదాన్ని. పులిపాక తాతయ్యగారు ఇలా అన్నారు. నీవు నమస్కారం చేసేటట్లయితే నేను తట్టుకోలేను ఈవూరు రాను అన్నాడు. నన్ను బిడ్డగా చూచుకుంటే వస్తాగాని మామ గారిలా చూస్తే నేను రాను అన్నాడు.

నా పరిస్థితి మీరన్వయం చేసుకోవలిసిందే గాని నాకేమీ తెలియదు.

వీ.ప్ర : నాకు నేనేమీ చెప్పను. మీరు మీకై ఏదైనా అన్వయం చేసుకోండి అనా?

అమ్మ : నే చెప్పినదానికి!నానడవడికీ తేడా మీకు కన్పిస్తే చెప్పండి.

వీ.ప్ర : ఏకత్వం కన్పిస్తున్నది కాబట్టి....

అమ్మ : ఎప్పుడూ నాకిది కావాలి అది అక్ఖర్లేదు అన్నదేలేదు. ఏది అనుభవానికి వచ్చినప్పుడు అది హాయిగా అనుభవించడంలో అభ్యంతరం లేదు. మనసులో బాధలేదు. పెట్టుకోవడాని కవకాశమున్నప్పుడు పెట్టుకొన్నాను. పెట్టుకోవటమేమిటి అనుకున్నపుడు పెట్టుకోలా. దానికి కాలం.... నాకు 54 సంవత్సరాలు అయితే నాకు 33వ సంవత్సరం నుండే జనం ప్రారంభమైనారు. అంతకుముందు మీరు నాకు బిడ్డలు కాక పోలా. ఏ మౌలాలీయో నాకు పిల్లవాడయ్యే నాటికి నాకు పది సంవత్సరాలే ఉన్నాయి. దొంగ తనంగా పెట్టినా, దొర తనంగా పెట్టినా, అందరికీ తెలిసేటట్టు పెట్టినా, తెలియనట్టు పెట్టినా, ఎట్లాపెట్టినా నేను పుట్టినప్పటినుండి నా దృష్టిలో మీరు పిల్లలనే అనిపించింది. ఇన్నాళ్లు ఇట్లా ఎందుకుంది? కాలానికి బద్ధులమందరం. అందుకే చరిత్ర బద్ధమని చెప్పాను. మనిషిని మనిషి అర్థం చేసుకోవడానికి కేవలం సన్నిహితత్వమే కారణం కాదని

అనిపిస్తుంది. ఎన్నిరోజులున్నా మనిషిని మనిషి అర్థంచేసుకోలేక పోవచ్చు. కొందరు కొన్ని కొన్ని సందర్భాలలో నాలుగు రోజులలోనే చేసుకోవచ్చు. దీనికి కాలమే. తరుణం మహాగొప్పది అనిపిస్తుంది. నిన్నటి వరకూ కొట్టితిట్టినవాడు నేడు గౌరవిస్తాడు. కాలమే ప్రధాన మనుకుంటాను గానీ వారిగుణం నేను తీసుకోను. తీసుకో లేను. కర్తృత్వం ఎవరికీ అంటగట్టను.

శ్రీపాద : కర్తృత్వం ఎవరిది?

అమ్మ : శక్తిదే. ఆశక్తి కర్తృత్వం క్రింద ఆడబడే వాళ్లమే. ఒకవిధమైన బొమ్మలమే. దానిలో తేడాలెలావస్తాయి? ఈ మర చిన్నది కావచ్చు, ఆ చక్రం పెద్దది కావచ్చు. పెద్దాచిన్న పైకి కనిపించడమే తప్ప అందరూ, అన్నీ అంతాఅయిన శక్తి నడిపిస్తే నడిచేవే.

ఈగ, దోమ అన్ని కూడా ఆత్మస్వరూపమని చెప్తున్న వీళ్లు - అన్నింటిలో ఆత్మ ఉందనుకున్న వీళ్లు మరి భేదంగా చూస్తున్నారు గదా! శాస్త్రాల్లో ....పురుగును పురుగుగానే చూస్తున్నాం. తేలును తేలుగానే చూస్తున్నాం. పామును పాముగానే చూస్తున్నాం. పాముకు విషమే పెట్టాడా? ఆత్మ విషంగా ఉందా? విషం ఆత్మకాదు. అందులో ఆత్మ ఉందంటున్నాడు. విషంగానే ఉందంటున్నాను నేను.

శక్తినే ఆత్మ అంటున్నారా? కాదా? శక్తికి గుణముంది. వస్తువుగా మారితేనే గాని గుణం గ్రహించలేక పోతున్నాం మనం. రూపంలేని దానిని ఏరూపం పెట్టుకోలేక పోతున్నాం. ఊహిస్తున్నాం. అది ఆత్మ అంటున్నారు. ఆత్మ అవునో కాదో ఇప్పటికీ అర్థంకాలేదు. బెదరనిదీ, చూడనిదీ, వినబడందీ, ఏమీ చెయ్యనిదీ అంటున్నారు. మరి ఏమిటి ఆత్మ అంటున్నారు. మరి ఏమిటి ఆత్మ అంటే? జడమా? జడంగా ఉన్నా ఒక పదార్థంగా ఉండవలసిందే. కంటికి గోచరించనిదని మనసుకు అందనిది అని....

శ్రీపాద : మారకుండా ఉన్నది....

అమ్మ : మనసుకు రూపం ఉందా? మనసుకు రూపంలేదు. మనసుకు రూపం లేనప్పుడు మనసుచేతనే ఊహించుకుంటాడు ప్రతిదీ. కంటితో చూస్తాడు. మనసుద్వారా కంటితో చూస్తాడు. మనసుద్వారా చెవితో వింటాడు. ఈచెవికి రూపముందిగాని మనసుకు రూపంలేదు. ఏది చూస్తున్నాడో ఆ రూపంగా మనసుంది అందాం. ఆత్మకూడ అట్లా ఉందనుకుందామా? మనసు ఆత్మంటే ఒప్పుకోరుగదా!

వి.ప్ర : వాళ్ళొప్పుకోరు

శ్రీపాద : ఎప్పటినుండీ మారకుండాఉండి ఇంకా ముందు ఉండేది ఆత్మ అన్నారు.

అమ్మ : ఆత్మంటే అర్థముందా? ఇవన్నీ కానిదానిని ఆత్మ అని పేరు పెట్టారు. దేనికీ అందనటువంటిది. అటు వంటి దానిపేరు ఆత్మఅన్నారు. విడదీస్తే ఆ రెండక్షరాలకు అర్థం ఏం చెప్తారో! ప్రత్యగాత్మ, జీవాత్మ. ఆత్మ ప్రత్యగాత్మ అయింది. జీవాత్మ అయింది. పరమాత్మ అయింది. ఆత్మకానిది లేదు. జీవుడుగా ఆత్మే వచ్చింది. ప్రత్యేకంగా, వ్యక్తి గతంగా ఉండే....ఒక రూపం ఆత్మగానే వచ్చింది. పరమాత్మ పరమాత్మగానే వచ్చింది. కృష్ణుడికి పరమాత్మ అని పేరుపెట్టాం. వాడూ నానాచైతన్యంగా తిరిగిన కృష్ణుణ్ణి పరమాత్మ అన్నాం. కృష్ణుడ్ని పరమాత్మ స్వరూపమంటే వాడికి చైతన్యం లేదా? ఎందుకు పేరు పెట్టారు. కృష్ణుడికి పరమాత్మ స్వరూపమని? పరమాత్మే కృష్ణుడిగా వచ్చాడనా?

శ్రీపాద : అంతే పరమాత్మే కృష్ణుడిగా వచ్చాడని.

అమ్మ : అందనటువంటి దానిని పరమాత్మేమోనని నేననుకుంటున్నాను. అందనిది పరమాత్మ. అందేవస్తువుకాదు. ఊహించేది, ఊహించడాని కందనిది, ఊహించడానికి రూపంతో వచ్చాడు. కనుక పరమాత్మ అన్నారేమో, నాకేం తెలుస్తుంది! శాస్త్రపరిజ్ఞానమూ లేదు. ఏం చేస్తాను. అంతే. అంతా ఒకటే నంటూ.

వీ.ప్ర : మొద్దంకెగా అందరూ బిడ్డలనుకోవటం చాలు మాకు, అంతా ఒకటే అనుకోవాలనే తపన....

అమ్మ : అంతా ఒకటే అని అనిపిస్తుంది. బాధ్యత అనుకోను.

వీ.ప్ర : నీవు కాదమ్మా....కొందరికి మిగతా వాళ్ళనుకోవాలనే తపన - మేం కూడ అలా అనుకోవాలనే తపన.

అమ్మ : తపించండి, అనిపిస్తుంది.

వీ.ప్ర : తపిస్తే అనిపిస్తుందా?

అమ్మ : నేను దేనికోసమో తపించలేదు. ఇదివద్దు, అదికావాలి అని తపించిన విషయం జీవితంలో లేనే లేదు.

సో : మేం కావాలని అనుకొంటున్నావు గదా.

అమ్మ : మీరు వద్దనీ అనుకోవటం లేదుగా. అన్నీ కావాలను కొంటున్నాను. మీరు కావాలను కోవటమెంతో మీరు దూరంగా వెళితే ఉండటం కూడా అంతే. మీరు కావాలనే అనిపిస్తున్నది. వద్దు అనుకొన్న విషయం లేదు. వచ్చారు కావాలని అనిపిస్తున్నది. వెళుతున్నారు.... అదీ అంతే. మాతృత్వమున్నపుడు బిడ్డలపై ప్రేమలేకుండా ఎలా వుంటుంది? సర్వత్రా అనురాగమని చెప్పానుగదా! ఏసూక్తిని మీరు వివరించి వ్రాసినా ఒకటే అర్థంవస్తుంది. అన్ని రకాల వాక్యాలను తరిస్తే చివరకు ఒకటే అర్థం వస్తుంది.

శ్రీపాద : జీవం వచ్చిన దగ్గరనుండి మారకుండా ఉన్న ఆత్మ ఉన్నదా అమ్మా?

అమ్మ : అసలు ఆత్మఏమిటని? మారకుండా ఉన్న ఆత్మఅంటారు? పోనీ....ఏమిటనుకొని? ఫలానిదనుకొని మారకుండా ఉన్న ఆత్మ ఉందా అని అడగాలి. నీవు ముందనుకోవాలి గదా. ఆత్మంటే ఇది అని.

శ్రీపాద : చైతన్యం గలది. ఎరుక గలది ఎరుగగలట్టిది.

అమ్మ : ఎరుక అంటే నాదృష్టిలో తెలుసుకోవటమే.

శ్రీపాద : ఒకటి ఉంటే తెలుసుకొంటున్నాం. ఆ తెలుసుకోనిది ఆత్మే.

అమ్మ : ఆత్మకు తెలుసుకొందేది కూడా లేదని చెప్తున్నారా

శ్రీపాద : తెలుసుకొందేది-మారకుండా నాటినుండీ నేటిదాకా కొంత ఉందని. అది పదార్థములో వ్యాపించి ఉందని అంటున్నారు.

అమ్మ : అనవచ్చు. పదార్థములో వ్యాపించి ఉన్నది అంటున్నారు గనక దానికి తిరుగేమున్నది?

వీ.ప్ర : పదార్థం మారినప్పటికీ అది మారకుండా ఉంది అని అంటున్నారు.

అమ్మ : అది మారకుండా ఉండదానికి, ఈ చైతన్యానికి శక్తెక్కడిది? శరీరంలో ఆత్మ ఎట్లాఉంది అంటే అంతటా వ్యాపించి ఉంది అని నా అభిప్రాయం.

శ్రీపాద : ఎరుగ గలట్టిదిగా....అది ఎరుగగలదు.

సో : తెలుసుకొనేదిగా ఉంటుంది.

శ్రీపాద : తెలుసుకో గలట్టిది. ఇలా ముట్టుకుంటే తెలుసుకోగలదు.

వీ.ప్ర : గ్రహించేదనా?

శ్రీపాద : గ్రహించగలట్టిది.

అమ్మ : మనస్సని అంటున్నారుగా. మనసుకు ఎట్లా రూపం లేదో ఆత్మకూ రూపం లేదని అంటారా?

శ్రీపాద : ఆత్మకు రూపం లేదనే అంటారు.

అమ్మ : మనస్సుకు వేరే రూపం లేదుగా.

సో : మనస్సువేరు, ఆత్మవేరు అంటారు.

అమ్మ : అని నాకనిపించదు.

సో : అవస్థలను బట్టే ఆ పేర్లొచ్చాయా?

అమ్మ : సరైనమాటది.

వీ.ప్ర : నిశ్చలంగా ఉన్నప్పుడు దాన్ని ఆత్మ అన్నారు. ఆలోచన ఉన్నప్పుడు మనసు అన్నారు.

శ్రీపాద : ఆలోచనలు ఏమీలేని మనసును ఆత్మ అన్నారు.

వీ.ప్ర : మనసుయొక్క వృత్తిని బట్టి పేర్లిచ్చారు.

అమ్మ : మనయేవమనుష్యానాం కారణం బంధమోక్షయోః అని వారే అన్నారుగా! బంధమూ అదే, మోక్షమూ అదే అని చెప్తున్నారు గదా! బంధానికి కారణం మనసే. మోక్షానికి కారణం మనస్సే.

శ్రీపాద : బంధముంది అనుకుంటే ఉంది, లేదనుకుంటే లేదు అని చెప్తున్నారు దానికి వ్యాఖ్యానం.

అమ్మ : ఉంది అనుకుంటే ఉందంటే, ఉన్నప్పుడు ఉంది అనుకున్నా - అనుకోకపోయినా ఉన్నట్టే. బంధముంచుకొని (ఉన్నప్పుడు) లేదనేటటు వంటిమాట అంటె ఎట్లా అనుకున్నప్పుదు, అనుకో నప్పుడు తోచేదే వాడికిలేదని-

శ్రీపాద : అనుకొని అనడం కపటంక్రిందకే వస్తుందమ్మా.

అమ్మ : ఆస్థితి వచ్చేటప్పటికి నాకులేదు అని తెలియదు. బంధము లేనివాడికి - నాకు బంధములేదు అని తెలియదు. లేకుండా ఉంటాడుకాని లేకుండా ఉన్నదని తెలియదు. బంధము లేనప్పుడు బంధములేదని నేననవలసిన అవసరం రాదు. ఆఊహకూడా మనసుకురాదు. బంధమున్నదని, లేదని అభావమేరాదు. లేకుండా ఉంటాడంతే.

నాకు కోరికలేదు అన్నవాడికి కోరికలేదు అని చెప్పుకో వలసిన అవసరమెందుకు కలుగుతుంది? (మనసుకు) నాకు కోరికలేదని తడుతుంటుందా? నిద్రపోయేవాడు నేను నిద్ర పోతున్నాననుకుంటాడా?

వీ.ప్ర : ముక్తుడు-నేను ముక్తుడను అని గుర్తించడు.

అమ్మ : వాడికి తెలియదు. నిద్రపోయేవాడు నేనునిద్రపోతున్నాను అని ఎట్లా అనుకుంటాడు?

శ్రీపాద : ముక్తుడుగా ఉన్నాననుకోడు.

వీ.ప్ర : కోరిక ఉండకూడదు అనుకోవటం కోరిక.

అమ్మ : కుర్తాళం స్వాములవారు 'మోక్షంకోరటంకూడ కోరికే' అని ఉపన్యాస మిచ్చారట.

వీ.ప్ర : సత్సాంగత్యంవల్ల సంగత్వంపోతుంది. అదికోరిక కాకపోవటం కాదు. ఈ ప్రవృత్తికి ఉన్ముఖంగా చేసేమాటలవి. వారు కూడ ఇక్కడికివస్తే ఇవి కాదనలేనిమాటలు.

సో : వారివి Plat form మీద చెప్పేమాటలివి.

అమ్మ : (ఉపమానం) నిద్రపోయేవాడు నిద్రపోతున్నానని ఎట్లా గుర్తించాడో- నిద్రే అనిపిస్తుంది వాడికి తెలియదు.

సో : (అన్నీ అయినవాడికి) ముక్తునకు భేదం కన్పిస్తుందా?

అమ్మ : అసలు భేదం కన్పించకపోవచ్చు గాని, తనేదో గొప్పగా ఉన్నానని అనిపించదేమో?

మీతోపాటు అన్నీ చేస్తున్నాడుగా! తనన్నీ చేస్తున్నాడు. అన్ని పనులూ చేస్తున్నాడు - అట్లాఅనిపించదేమో అను కుంటా

శ్రీపాద : నేనేదో సారాత్రాగే వాడిననుకోండి. అట్లాగే వాడికి అనిపించవచ్చు.

అమ్మ : నాకట్లా అనిపించటం లేదు. మీరిట్లా మమకారంలో ఉన్నారనో, మీరు త్రాగుబోతు అయినారనో, అయ్యో వీరిలా చెడిపోతున్నారనో.... అట్లా అయినారనో, ఇట్లా అయినారనో నాకనిపించదు.

సో : మేము మమకారంలో ఉన్నామని, నీవులేవని ఉండదా నీకు?

అమ్మ : ఉండదు.

వి.ప్ర : ఏమీ అనిపించదా?

అమ్మ : అనిపించేదేముంది? దేనికి సమయమొస్తే అది చేయటమే.

వీ.ప్ర : కనిపెంచటమే

అమ్మ : కని-పెంచటమే

శ్రీపాద : కనిపించటమే కనిపెంచటం

అమ్మ : తను కంటేనే బిడ్డలుకాదు. చూచిన బిడ్డలు కూడా. రక్త మాంసాలు పంచుకున్న వాళ్లెంతో-హృదయాన్ని పంచుకున్న వాళ్ళూ అంతే.

సో : రక్తమాంసాలు పంచుకున్న దాని కంటే హృదయం పంచు కున్న వాళ్లే ఎక్కువ.

అమ్మ : రక్తమాంసాలు పంచుకున్నవారు హక్కులకు ముఖ్యు లవుతారే గాని- హృదయ స్థానానికి భిన్నం. శిష్యులు అంటే బిడ్డలు అని ఉపయోగించారు కొన్నిచోట్ల. శిష్యుల్ని బిడ్డలుగా ఉపయోగించినప్పుడు, హృదయం పంచుకున్న బిడ్డలేగా. హక్కులకు కాకపోవచ్చు. ఆస్థులకు కాకపోవచ్చు.

సో : రక్తమాంసాలు పంచుకున్న వాళ్ళు బిడ్డలు. హృదయం పంచుకోవడమంటే కావ్యపరి భాషలో భార్యాభర్త సంబంధము - అలాంటి సందర్భాలలో....

అమ్మ : గురుశిష్యన్యాయానికి ఏం చెప్తావు?

సో : వాడి విద్య వీడికిస్తున్నాడు.

అమ్మ : మధ్యలో ఆధారమే విద్య. ఇచ్చేది మనసేగా.

సో : అట్లయితే అన్ని మనసులు.

అమ్మ : మనసేగా

నేను కన్నాను. తీసికెళ్లి ఎక్కడో పారేశాను. నాదారిన నేనెక్కడో తిరుగుతున్నాను. వాడికి నేనెవరో తెలియదు. కొంతకాలం పెరిగి పెద్దవాడై వచ్చాడు. వాడికి మీ అమ్మ అని గుర్తు చెప్పారు. అప్పుడు వాడికి ప్రేమపుట్టుకొస్తుంది. కాని అంతకు ముందు నేనెవరో వాడికి తెలియదు.

శ్రీపాద : అదీ మనసే.

అమ్మ : అదీ మనసేగా! రక్త సంబంధము ఎక్కువైతే దగ్గరపెరగని కారణం చేత నన్ను అమ్మా అని పిలవలేక పోతున్నాడుగా. ఇక్కడ మనసే ప్రధానం కాలా?

సో : మనసు ప్రధానమే.

అమ్మ : అన్నింటికీ మనసే. నేనే కన్నా. నేనే తీసికెళ్లి ఒక అడవిలో వదలి పెట్టాననుకో! నాదారిన నేను పోయాను. కొంతకాలం ఎక్కడో పెరిగాడు. ఏ కారణాలతోనో మీఅమ్మరా అని ఎవరో తెలియపరిచారు. నేను మీఅమ్మనే. నిన్ను కన్ననేనే అని చెప్పాను. అదుగో మీనాన్న అని గుర్తుచూపించాను. అప్పుడు వాడికి ప్రేమ పుట్టుకొస్తున్నది. ఈలోగా

నేనింకొక పిల్లవాడిని పెంచాను. వాడమ్మా అని దగ్గర కొస్తున్నాడు. ఈకన్నవాడు దగ్గరకు రాడు. తెలిసిన తర్వాత వస్తున్నాడు. ఇక్కడ రక్తమాంసాలద్దు వస్తున్నాయా? మనసద్దు వస్తున్నదా?

సో : మనసే.

అమ్మ : హృదయం పంచుకొన్న బిడ్డ అంటే, నేనొక పిల్లవాడిని పెంచాననుకో నాన్నా! హరిదాసుగారు ఊరికిపోతే నీకొడుకు రోజంతా ఏడ్చాడు. మానాన్న దగ్గరకు పోను, మాఅమ్మ దగ్గరకు పోను, తాతయ్య దగ్గరే ఉంటాను అన్నాడు. పెంచడం వల్ల, దగ్గరకు తీయటంవల్ల, ఆ మమకారం వల్లనే గదా! దగ్గరకు తీయటం వల్లనేగదా? నీవు నాన్నారని తెలుసు. హరిదాసు తెలుసు. దగ్గరకు తీయటం ఎక్కువైన తర్వాత ఆయన ప్రక్కలో పడుకోవటం, ఆయన దగ్గర తినటం, ఆయన కనపడకపోతే ఏడవటం, ఎంత పెంపకమది. అంతా మనసే గదా! మనసే ప్రధానమాయె. మనసు, మనసు అంటున్నాం గాని, ఆ మనసంటే ఏమిటో తెలియటం లేదు.

సో : మనసు దేనిని ఆలోచిస్తే దాని రూపం ధరిస్తుంది.

అమ్మ : అట్లాగే ఆత్మకు ప్రత్యేకమైన రూపం లేదంటున్నారు కాబట్టి....

సో : మనసు దీనిని ఆలోచిస్తున్నది గనక ఈ రూపంగా ఉంది అనుకోవాలి.

అమ్మ : అందుకే చెరువులో నీళ్ళు బిందెడుతీస్తే ఆనీళ్ళు బింద ఆధారంగానే ఉంటాయి. కుండతో తీస్తే కుండ ఆధారంగానే ఉంటాయి ఆనీళ్ళు. అట్లాగే మనసుకు కూడ ఉంటుందంటే, ఆత్మసాక్షాత్కారమయిందంటే ... ఫలానా రూపం ధ్యానిస్తే - సాక్షాత్కారమయితే - ఆత్మసాక్షాత్కార మయింది. నశించేది కాదు. పోయేది కాదు చూచేదికాదు. అనదానికి తగిన అవసరమేమి లేదు. నీవన్నట్టు ఆలోచనలేని మనసుకూడ ఆత్మే అనుకుంటున్నా.

వీ.ప్ర : ఆత్మకూడ మనసే.

అమ్మ : ఒకచోట శరీరము ఆత్మకాకపోలేదు అని చెప్పాను.

స్తో : అంతా ఆత్మ స్వరూప మన్నప్పుడు, ఒకటి అయి ఇంకొకటి కాకపోవడమేమిటి!

అమ్మ : ఇదికాదు, ఇదికాదు అని వాళ్ళు పడ్డ బాధకూడ బయలు దేరడానికి చెప్పారేమో అనిపిస్తుంది.

ఇదేకాదు అని చెప్పడం కోసం బయలుదేరి ఇదికాదు, ఇదికాదు అంటూ ముందుకుపోయి అంతా అదేనని....

వాళ్ళ మాటలను బట్టి చూస్తే అట్లా అనిపించదు. ఇది కాకుండ ఎక్కడో ఉందని చెప్పడానికి యత్నించినట్లు వాళ్ళ Driving అట్లా కనపడుతుంది.

శ్రీపాద : తన కన్పిస్తుంది.

అమ్మ : న ఇతి, న ఇతి అంటే ఏమిటయ్యా?

శ్రీపాద : ఇది నేను అంటున్నారు. అహం భోజనం నైవభోజ్యం నభోక్తా చిదానందరూపః శివోహం శివోహం. ఇది కాదు అని చెప్తున్నాను.

వీ.ప్ర : Positive చెప్తున్నారు. ఇదికాదు అని చెప్తున్నారు. ఇది మాత్రమే కాదు అంటే వేరే సరిపోతుంది.దానికి అమ్మ భాష్యం చెప్తేసరే.

శ్రీపాద : అట్లా ఉందా? మనం రాద్దామా? అన్ని రూపాలు అయిన వాడు, ప్రత్యేకరూపం లేనివాడు అని రాస్తున్నాం గదా?

అమ్మ : అన్ని గుణాలు అయినవాడు గనక ప్రత్యేకించి ఏగుణం కానివాడు, సర్వసకల గుణాభిరాముడు అంటేనే నామనసుకు సంపూర్ణంగా ఉంటుంది రామాయణం సరిగా చదివితే సకలగుణాభిరాముడు కాదనటానికి ఋజువులేదు. రాముని దగ్గర సద్గుణాలే దొరుకుతున్నాయా? దుర్గుణాలు దొరకటం లేదా? సీతాదేవిని అనుమానించడమేమిటి? సకల కళ్యాణ గుణాభిరాముడికి (వైదేహిపై) తప్పు తోచడమేమిటి?

స్తో : మర్యాదా పురుషోత్తముడికి ఇవన్నీ ఉన్నా లేనట్టే అర్థం. ప్రపంచంలో ఉండే అన్ని లక్షణాలు చూపించాడు. మానవ బలహీనతను చూపించాడు.

అమ్మ : అందుకే సకల గుణాభిరాముడు అని నేనంటాను. వాడిలో ఉండే శోభ మీకంటే నేనెక్కువ గుర్తించా. ఎందుకంటే, అందరి బాధా తన బాధనుకున్నాడు. అందరి కష్టమూ తన కష్టమనుకున్నాడు, ఆబాధపడేవాడు మరచినా తను మరచేవాడు కాదట. ఇతరులకోసం కన్నీరు కార్చిన రోజులున్నాయి. కష్టం సుఖం రెండూ తెలుసు.

శ్రీపాద : రామాయణంలో ఉన్నదా అమ్మా?

అమ్మ : ఉన్నది.

శ్రీపాద : సంఘటనలున్నాయా?

సో : శ్లోకాలకు ఆరకంగా వ్యాఖ్యానాలు చేశారు.

శ్రీపాద : దానిలో లేనిది వ్యాఖ్యానం చేస్తే లాభమేమిటి?

అమ్మ : అందరి జీవితాలూ ఒకే తీరులో జరుగలేదు. సంఘటనలు ఉన్న జీవితాలు ఉన్నాయి, లేని జీవితాలు ఉన్నాయి సంఘటనలు విషాదంగా ఉండి తేలికగా నడిచిన జీవితాలు చాలా ఉన్నాయి.

సో : వ్యసనేషు మనుష్యాణాం ప్రసంధేతి దుఃఖితః శ్లోకం చెప్పినదే.

అమ్మ : కాలాంతరములో కొన్ని సంఘటనలు – కవి రాసేదేమో అనిపించేలా కొందరి జీవితాలు నడుస్తాయి.

సో : సమకాలీనమైన వాటిని ఆధారం చేసుకొని అది కాదు అనటం జరుగుతూనే ఉంటుంది.

అమ్మ : ప్రపంచములో నమ్మటానికి వీలులేనివి జరిగాయి. జరుగుతాయి.

వీ.ప్ర : అమ్మ సంగతే తీసుకుందాం. కొంత మందికి చెప్తే నమ్మ టానికి వీల్లేదు అంటారు. ఇప్పటి సంగతే. కాలాంతరము సంగతి విడిచి పెట్టు. గతంలో కూడా జరిగినవి – ఈవేళ నమ్మశక్యం గానివి ఉండటంలో ఆశ్చర్యం లేదు.

అమ్మ : ఇక్కడికి జనం వస్తూ పోతూవున్న కొత్తల్లో మాలోనే మాకు ఏం చూసి వస్తున్నారు? ఎందుకొస్తున్నారు? ఏమి తెలుసు అని వస్తున్నారు? చదువా

రాదు. వచ్చిన వాళ్ళతో ఏం మాట్లాడుతుంది? ఏ హెచ్చు తగ్గులొస్తాయో? ఎగతాళి చేస్తారోనని భయపడ్డ వాళ్లు కూడ ఉన్నారు.

బ్రహ్మానంద సరస్వతి మాట్లాడదానికి వచ్చినప్పుడు మానాన్నగారు బాధపడ్డారు. దీనిమొహం. దీనికేం తెలుసు. వీళ్ళంతా వస్తున్నారు? ఊరంతా వస్తున్నారే. ఏం మాట్లాడు తుంది? అని మాపిన్నిగారితో ఆయన అన్నారు.

అయినా చూద్దాం. అని ప్రశ్న వేసి తేల్చుకున్నారనుకో! ఎవడికి తెలిసింది వాడికి గొప్ప. అంతవరకే సంపూర్ణమను కొని నేను నవ రాత్రులకు (మన్నవ) వెళ్ళినప్పుడు ఏం మాట్లాడుతుందోనని మాఅన్నగారు వచ్చి కూర్చున్నారు.

అనసూయ కోసం ఇంత మంది వెళుతున్నారంటే మరిదమ్మ గారి బోధలు విన్నది కాబోలు, అకార ఇకార ఉకారమకారాలు మాట్లాడు తున్నదని ఆక్షేపించారు.

సో : ఎవరు?

అమ్మ : మా అన్నయ్య, మరి (నామరిది) లోకనాథం నాకు సలహా చెప్పాడు. నీవు ఎవరినీ నమ్మించదానికి ప్రయత్నించ వద్దు -నమ్మకుండా ఉండటానికి ప్రయత్నించవద్దు. ఉన్నది ఉన్నట్టుగా ఉండమన్నారు. అయిన వాళ్ళలో తెలియని వాళ్లు ఉన్నారు. అయినవాళ్ళలో తెలిసిన వాళ్లు ఉన్నారు. ఏం తెలుసో తెలియదు. నాకేం తెలుసో తెలియదు. నాచుట్టూ సాలీదు గూదు అల్లుకుంది గాని నేనేమీ ప్రచారాలు చేసుకొని, ఆశ్రమం పెట్టుకొని నాకోసం రండి అని ఊరేగింది కాదిది. మనింట్లో మనం వంట చేసుకొని కూర్చుండగా నాచుట్టూ ఇదంతా సాలీదు గూదులా అల్లుకుంది.

చిన్నతనం తీసి అవతలపెట్టు. అది ఎవరికీ తెలియదు. ఈనాటి విషయమేమిటంటే మధ్యల్లో **1955-56** నుండి మొదట నాదగ్గర కొచ్చినది ఎవరు అంటే గోదాడ్ అని ఒక రేటూరావిద. వాళ్ళబ్బాయికి పిచ్చెక్కితే

నేను బాపట్లలో జబ్బుచేసి ఉండగా నాదగ్గరకు ఆమె ఆ అబ్బాయిని తీసుకొని వచ్చింది. వాళ్లు నాన్నగార్కి పరిచయమే.... ఆ పిచ్చిపిల్ల వాడిని తీసుకొని చిదంబరరావు గారింటికి వచ్చింది. నాకోసమని వచ్చిందంటే భారతమ్మగారు వికారంగా నవ్వింది. ఆ ఇంట్లోనే ఉన్నాను. ఇంటివారే నవ్వారు. ఆనాదు అక్కడికి ఎక్కడి నుండి వచ్చానంటే వేటపాలెం రంగారావు దగ్గర నుండి నాదెళ్ళ రంగయ్య దగ్గర వైద్యం చేయించుకొని వచ్చి భారతమ్మ ఇంట్లో పడుకున్నా, చిదంబరరావు తాతయ్య తీసుకువచ్చి నన్ను అట్టే పెట్టుకున్నాడు. తర్వాత నాదగ్గరకు పూండ్లవారు వస్తుండేవారు. ఎవరైనా దేనికైనా వస్తే వారితో మాట్లాడడం, చేయడం ఉండేది. అది వరకు నాకు ఎవరితో పరిచయం, మాట్లాడటం లేదు. ఈ ఊళ్లో (జిల్లెళ్లమూడి) పార్టీ అంటూ ఏర్పడ్డ తర్వాత వాళ్లు వచ్చి నాతో చెప్పడం ....ముందు మంత్రాయితో, తర్వాత రెడ్డి సుబ్బయ్య తో, తర్వాత వెంకయ్యతో మాట్లాడటం అలవాటు. తర్వాత రాజమ్మగార్ధి దగ్గరకు మా పినమామగారి భార్య అనసూయమ్మ నన్ను తీసుకెళ్లితే – ఆమె ఏం చేసిందంటే, నేను నమస్కారం పెద్దలకు చెయ్యటంలో తప్పులేదు. అందరికీ నమస్కారం చెయ్యాలనేది ఒప్పుకుంటా. చేయించుకున్న వాడికంటె చేసినవాడే గొప్పవాడని నాఉద్దేశ్యం. నేనా దృష్టిలో రాజమ్మగార్కి నమస్కారం చేయబోయాను. చేయబోతే ఏమన్నదంటే – తాకవద్దు. ఒళ్లు మంటలు. తాకితే నీలో ఉన్న పాపం నాకంటుకొంటుంది తాకవద్దు అన్నది. నాలో ఉన్న పాపమేనా? పుణ్యం కూడా అంటుకొంటుందా? అని అడిగాను. అంటే–పాపం ఉన్నప్పుడు పుణ్యం ఉంటుంది గదా! పుణ్యం కూడా అంటుతుంది అన్నది. మూడవ రోజున నిన్ను నన్ను కూర్చోబెట్టి ఒకఫోటో తీయించవా అని అడిగింది. అప్పుడు నాన్నగార్కి చెప్పి భాస్కరరావు అనేఆయనతో ఫోటో తీయించింది. చాలా గొప్పది.క్రిందటి జన్మలో నేను చిలుకను చంపానని, ఎవరినో చంపానని కొన్ని కొన్ని చెప్తుండేది.

శ్రీపాద : ఆమేనా? మీరా?

అమ్మ : నేను కూడ కొన్ని చంపానని. సరే, చంపితే నేనీ జన్మలో తెలిసి చంపానని చెప్పాను. నాకాళ్ల క్రింద అనేకం చస్తుంటాయి. ఒక రోజు తోటకూర తరుగుతుంటే సగమై చచ్చింది, బ్రతికింది. రెండు ముక్కలై బ్రతికింది. అది వానపాము.

వీ.ప్ర : ఎవరికో ఆపరేసన్ జరిగిన మాట వాస్తవం

అమ్మ : ఆ. ఆపరేషన్ జరగాల్సొచ్చింది.

## 17-4-76

రాజమ్మగారి వేడికోలును మన్నించిన అమ్మ. ఆమె కోరినట్టుగా ఒక పర్యాయం మాఘ పౌర్ణమి రోజున దాదాపు వెయ్యి మందికి అమ్మ మంత్రోపదేశం చేశారు. ఆనాటి సంఘటనకు అమ్మచే కాలం ఆపబడింది. దేనికీ కర్తృత్వాన్ని తనపైని వేసుకోని అమ్మ స్పష్టంగా, వాచ్యంగా ఒప్పుకోక పోయినా ధ్వని ప్రధానంగా ఈ మాటను అమ్మ మన్నించింది. విశ్వసించడానికీ మనసే ప్రధానం. నాటిసందర్భాన్ని ఈ సంభాషణలో అమ్మ గుర్తు చేస్తున్నారు.

అమ్మ : ఇంకా ఎక్కువమందే వచ్చారు. ఇంతమందికి ఇన్ని చెప్పి ఇంటికి తిరిగి వచ్చేవరకు ఆరు గంటలయింది.

వీ.ప్ర : ప్రతి ఒక్కరికీ శ్లోకం చెప్పాలి. దాని అర్థం కూడ చెప్పాలి. ఎంతో సమయం పట్టి ఉంటుంది. కాలాన్ని కుదించడం నీకే చెల్లింది.

అమ్మ : మంత్రమేదైనా గానీ;మంత్రముల కన్నింటికీ స్థాయి ఒకటే. ఆనాడు వారికి చెప్పినది. రహస్యమేముంది? అప్పుడేం చెప్పానో ఇప్పుడూ చెప్తాను.

గురుబ్రహ్మో గురుఃవిష్ణుః గురుఃదేవో మహేశ్వరః
గురుఃసాక్షాత్ పరబ్రహ్మో తస్మై శ్రీగురవేనమః

ఇది చెప్పి దీనర్థం చెప్పి సోహం చెప్పాను.

సః బ్రహ్మో–అహం అంటే నేను–నేను బ్రహ్మ.

అది ఎట్లా చెయ్యాలంటే ఉచ్ఛ్వాస నిశ్వాసాల ద్వారా; పైకి పోయినప్పుడు బ్రహ్మానుకో, క్రిందకి వచ్చినప్పుడు నేను అనుకో ఇదే పైకి పోయింది, ఇదే క్రిందకి వస్తుంది నీవు బ్రహ్మావు, నీవే మనిషివి.

వీ.ప్ర : ఈ చెప్పడానికి ఎనభై అయిదు సెకండ్లు పట్టింది. దాదాపు నిముష మున్నరన్నమాట. వెయ్యిమంది అయ్యారన్నారు.

అమ్మ : ఇంకా ఎక్కువే ఉన్నారు.

వీ.ప్ర : ఇంకాస్త ఎక్కువ వేసుకున్నా పదహైదు వందల నిముషాలకు పైగా పట్టి ఉండాలి.

అమ్మ : ఆరుగంటల కెల్లా ఇంటికి తిరిగి రాగానే కాంతయ్యగారు కూర్చొని ఉన్నారు. ఇంటి దగ్గరే ఉన్నారు. నేనొక్కర్తినే. వెళ్ళివచ్చాను. ఆరోజు ఫిబ్రవరి రెండవ తారీఖు. మాఘ పౌర్ణమి. నన్ను చూడగానే వారు 'ఏరా నాయనా' అని చెయ్యి చాపి వళ్ళో పడుకో బెట్టుకొన్నాడు. కాసేపు ఉపన్యాసం వేశాడు. 'ఓం అందరికీ చెప్పి వచ్చావా' అన్నాడు. ఆయనకు అలవాటేమో ననుకున్నాను. నే చెప్పింది గ్రహించడమే అయితే ఆమాట అనడుగదా! "నాయనా" ఈకాసేపులోనే శివోహం బోధించావా అని పెద్దగా అన్నాడు. సోహం మంత్రమేనని నాఅభిప్రాయం చెప్పాను. నాఉద్దేశం మంత్రానికి పీఠిక అఆ, ఇఈ, ఉఊ, అంఅః ఇంతకంటె మంత్రం లేదు. ఇందులో అన్నీ కలిసినవి. అఆ, ఇఈ, ఉఊ, అంఅః ఇదే మంత్రం. ఎన్ని అక్షరాలైనా మీరు మధ్యలో కలుపుకోండి. శబ్దమే ఆధారం. ఈ మాటలు విని లక్ష్మీకాంతయ్యగారు తలకాయ పగుల

గొట్టుకొనేలా ఆలోచించుకున్నాడు. నీ మంత్ర శాస్త్రానికి పీఠిక ఏమిటి? అని వారడగగా పై విధంగా చెప్పాను.

శ్రీపాద : పీఠిక అంటేనో?

అమ్మ : Introduction అంటారా; ఉపోద్ఘాతమనేగా!

శ్రీపాద : పుస్తకాల్లో పీఠిక అని వ్రాస్తారు. దీనికి మరే విధమైన సాంకేతిక అర్థం ఉన్నదేమోనని అడిగా ఆపీఠికే నన్నమాట.

అమ్మ : ఈ ధ్వనులు పలుకకుండ ఉంటే అక్షరాలు లేవని అర్థం ఎన్నిరకాల అక్షరాలు పలికినా.

'క' అని పలికాడనుకో! కకు దీర్ఘమిస్తే కా అని పలికినప్పుడు దానిలో ఆకారముందిగదా! మొత్తంమీద చూచుకుంటే ఆరు అక్షరాలలో అన్ని ధ్వనులు పలుకుతాయి.

శ్రీపాద : 'ఉ' ఉందిగా

అమ్మ : ఊ అంటే కొమ్ము

హు పలికినప్పుడు ఉ – శబ్దంపలుకుతున్నది గదా! నాదృష్టిలో చంద్రుడాగినట్లనిపించలా – వాళ్ళకు చంద్రుడాగినట్టనిపించింది.

శ్రీపాద : జనాంతికముగానేదో అనుకొంటున్నాం.

నాన్న : నేనుకూడ అనుకున్నాను. తొలినాటి రోజుల్లో 'ఈవిడ ఏం చెప్తుంది అని భయపడుతుండేవాడిని నేను.

అమ్మ : ఒక సందర్భంలో గురుశెట్టి శీతారామయ్యగారు ఇంకా ఎవరో స్వాములవారు వచ్చారు. ఆస్వామి నేను యోగవాశిష్టం పంపిస్తాను. చదువుకో అమ్మా అన్నారు. అద్వైతానికి, ద్వైతానికి తేడా చెప్పమని నన్నడిగారు. అరటిపండు పూర్తిగా చూపించి ఇది అద్వైతము అని అన్నాను. పండు వలిచి చూపించి ద్వైతమని చెప్పాను. ఈవిషయం **1957** అక్టోబరు **11**న జరిగింది.

వీ.ప్ర : అన్నపూర్ణాలయం తెరచిన తర్వాతనా?

అమ్మ : కాదు. అది **1958** ఆగష్టు **15.**

**1957**లో – చీరాలవాళ్ళు రావడం అదే. నేను బయట పడడం అదే. నేనింకొకరితో మాట్లాడటం అదే. మీనాన్నగారు (నాగేశ్వరరావుగారు) అటు మానాన్నగారు (సీతాపతి తాతగారు) వినేటట్లుగా నేను మాట్లాడటం అదేరోజున బ్రహ్మానంద సరస్వతితో....

వీ.ప్ర : కళ్యాణానంద భారతి స్వామి వారితో జరిగినది?

అమ్మ : అది వీళ్లెవరికీ తెలియదు. అయితే వీళ్ళిక్కడ ఉంటున్నది నాకు తెలుసుగాని నేను ఫలానా స్వాములవారి దగ్గరకు పోతున్నానని వారికి తెలియదు. నేను గుంటూరులో ఉండగా యాభై ఆరు అక్టోబరులో కల్యాణానంద భారతి స్వాములవారు చనిపోయారు.

నాన్నగారు: మరిడమ్మ తాతమ్మగారు రాలేదా?

అమ్మ : వెంట రాలేదు. తెనాలిలో కోటంరాజు కృష్ణారావు గారింట్లో ఆమె చూచింది.

నేను వెళ్లింది మీరు (నాన్నగారు) ఇంటర్మీడియట్ చదువు తున్నప్పుడు. మీతో ప్రభాకరరావు ఉన్నప్పుడు, చింతలపల్లి రామచంద్రరావుగారి ఇంటిప్రక్కన మేదాటి గురువయ్య గారు – సుబ్బమ్మ అనే ఆవిడ Hotel ఉండేది. మీరక్కడ భోజనం చేస్తుండేవారు. చింతలపల్లి రామచంద్రరావు ఇంటి ఎదురుగా వారు ఉండేవారు. అప్పాజీ గారికి ఒక Medical Shop ఉండేది. ఆరోజుల్లో ఆయనకు ఒక కొడుకు పుట్టి చనిపోయాడు.

రెండవ పర్యాయం నేను గుంటూరు వెళ్ళినది రాజమ్మగారి సత్రములో భారతిపిన్ని జయను కనడానికి పోయినప్పుడు, అప్పుడునేను Kuglar Hospital లో చేరా. **1956**లో మెహర్ బాబాను చూశాను. అరండల్ పేటలోని సీతారామస్వాముల వారింట్లో గుడ్డలు వేసి నడిపించుకొంటూ
41 వచ్చారాయన్ని. అప్పుడు చూశాను వారిని.

వీ.ప్ర : మంత్రోపదేశానికి ఒక్కొక్కరికి ఒకటిన్నర నిముషమే పట్టినా వేయిమందికి ఉపదేశం చెయటం – అది తలచుకుంటే చాలా ఆశ్చర్యంగా ఉంటుంది మాకు.

నాన్నగారు: రాత్రి మూడు గంటలకు బయల్దేరి ఆరు గంటలలోపే తిరిగి వచ్చారు.

శ్రీపాద : ఆరు గంటలకే ఇంటికి వచ్చారని మీకెట్లా తెలుసు?

అమ్మ : అరుణోదయం కూడా కాలేదు.

వీ.ప్ర : అరుణోదయం కాకమునుపే అనుకొందాం. తక్కువ వేసుకొని 300 మంది అనుకున్నా 300 నిముషములనుకొన్నా అయిదు గంటలవుతుంది.

అమ్మ : శ్లోకం చెప్పాను. దాన్ని వివరించికూడ చెప్పాను. గురువే బ్రహ్మని, కనపడే గురువేబ్రహ్మని, కనపడే గురువు సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపమని. మంత్రమిచ్చినవాడే దగ్గరకు తీసుకుంటాడు. గురువుకంటే వేరేదైవం ఎక్కడో ఉన్నాడను కోవద్దు అని చెప్పాను.

వీ.ప్ర : ఈ వివరణకే పదిహేడు సెకండ్లు పట్టింది.

అమ్మ : కొంచెం బురద ఉన్నది. వర్షం కురిసిందేమో!

వీ.ప్ర : 3 గంటలకు బయల్దేరారు. ఇంటి దగ్గరనుండి కాలవదాకా నడిచే వెళ్ళారు. ఉపదేశించిన వారిని కుదించి 300 మాత్రమే అనుకున్నా అయిదుగంటల కాలం కావాలి. ఏం జరిగి ఉంటుంది? దీన్ని దృష్టిలో పెట్టుకొని కాలం వ్యాకోచిస్తుందా అని ఒకమారడిగాను.

అమ్మ : అవును అడిగావు.
నన్ను గురించి చెప్పాలంటే నాస్థితి నాకేమీ అర్థం కాదు. ఇందులో కూడ కాలం నిలపాలని నేననుకోలేదు.

వీ.ప్ర : కాని కాలం నిలిచినమాట వాస్తవం.

అమ్మ : కాలం నిలపాలని ఊహించలేదు. కాలం నిలిపానని అనుకోలేదు. నాకు తెలిసి జరగలేదేమో! ఈ విషయం ఎందుకొచ్చిందంటే దీనికి కారణం ఈనాటి మాట మరోనాటికి బాట అవుతుంది అని ఉన్నాను.

ఈరోజుల్లో తెలిసినవి, ఆ రోజుల్లో తెలియనివి. మనవాళ్లే, చూచినవాళ్ళే, దగ్గరవారే కాదనుకొనేవీ ఉన్నవి. పరాయివాళ్ళు నమ్మేవీ ఉన్నవి. కాలాంతరములో ఇవన్నీ నిజమేనా అనేవీ ఉంటాయి. ఇట్లాచేసి ఉంటుందా? అనుకొనేవీ ఉంటాయి.

సో : రామాయణములో ఇలా జరిగి ఉంటుందా? అనే దానిమీద అమ్మ వరుసగా చెప్పుకొస్తున్నారు.

అమ్మ : ఒకప్పుడు నాన్నగారు ఇలా అన్నారు. (నాగేశ్వరరావుగారు). ఇవన్నీ నమ్మనుగాని రాఘవరావు (అమ్మకు అన్నయ్య) లోకనాథం (అమ్మకు మరది) నమ్మితే నాకు తృప్తి అన్నారు.

నాన్నగారు: నాకు తెలియదు. వాళ్లు నమ్మితే నాకు తృప్తి అన్నాను. మా Brother Communist, వీడి మాటలు విని మాబావ మరిది కమ్యూనిస్టుగా మారాడు ఆటైములో.

అమ్మ : ఒక పర్యాయం మా అన్నయ్య కబురు పెట్టాడు. ఏమనంటే ఈపిచ్చి పిచ్చి వేదాంతాలు మానుకోమని. మరిదమ్మగారి వేదాంతం అకార ఉకార మకారములు మాట్లాడుతుందే మోనని – అలాంటిపని అఖ్ఖర్లేదని గంగరాజు శ్రీహరితో కబురుపెట్టారు. ఆయన కల్పించలేదీ మాటలు.

నాన్నగారు: ఎందుకు కల్పిస్తారు?

అమ్మ : ఆయన ఈనాడు రాకపోవచ్చు. అది వేరే సంగతి. నేను మన్నవకు బయల్దేరి వస్తున్నానని తెలిసికూడా ఆ ఊళ్లోనుండి వెళ్లిపోయారు మా అన్నయ్య. వచ్చిన జనప్రవాహాన్ని చూచి విస్మితయైన మా వదినగారు మన్నవకు నేను వచ్చానని తెలియజేస్తూ రమ్మని కబురుచేస్తే వచ్చారు. **1958** అక్టోబరు **21**న వచ్చారు గుంటూరు నుండి మా అన్నయ్య. **1958** అక్టోబరు **17**న నేను మన్నవ వెళ్లాను. ప్రతివాళ్లు మామయ్య ఏరి అని అడుగుతున్నారని మావదినగారు కొడుకుతో ఉత్తరం వ్రాసి పంపిస్తే ఆయనొచ్చారు. ఆమెకు అంతకు ముందు కొంత మార్పు వచ్చేకబురు చేసింది. వస్తూ వస్తూ ఒకచీర తెమ్మంది.

నేను ఆలయానికి వెళ్లాను. అక్కడ పూజ చేశాను లలితా సహస్ర నామములతో. బీజాక్షరములు మైకులేకుండానే ఊరంతా వినబడ్డది. అలా వినపడినప్పుడు ఆశ్చర్య మానసయైన మా వదిన గారు ఒక్కసారి నేను బయటికి రాగానే ఆమె నన్ను కౌగలించుకుంది. ఆ రంగు వేరు. ఇంత నలుపుతో ఈవిధంగ ఉండేదికాదు శరీరం.

నాన్నగారు: ఆ Complexion కి, ఈవేళ Complexion కు పోలిక కన బడదు..

అమ్మ : విగ్రహంక్రింద ఉన్న యంత్రం లాగాలంటే వారికెవ్వరికీ సాధ్యంకాలా పూజచేస్తున్న నాచేయి ఇంత పొడవుగా ఉన్నట్టు ఆమెకు కనపడ్డది. జనాన్ని కొద్దిగా ప్రక్కకు తప్పుకోమని నే తీస్తానని చెప్పి అడుగున ఉన్న యంత్రం లాగిచూస్తే అది రాజరాజేశ్వరి యంత్రం. దానికి తగిన బీజాక్షరాలు ఏవైతే వున్నవో, అవే వున్నవి. బయటకు రాగానే ఇన్నీ గమనించిన మావదిన కౌగలించుకుంది.

చరిత్ర అన్నీ రావాలంటే ఏనాటికైనా సమూలంగ వచ్చేవే గనక-ఏవీ దాగవుగదా! నేను చెప్పకపోయినా నన్ను చూచినవాళ్ళయినా చెప్తారుగదా! మనవాళ్ళకు అవమానమని నేను మానుకోవచ్చునుకో!

తొలిసారిగా నేను కాపురానికొచ్చే రోజున బొట్టు పెట్టమని కుంకుమ భరిణె తీసికెళ్ళితే మావదిన పెట్టనంది. నేను మండిగానికి మొహం అద్దుకొని వచ్చాను. కనకమ్మ బామ్మగారు (మాఅత్తగారు) ఏడ్చింది.

మా కెవరికీ తల్లిలేనిస్థితి ఉందిగాని-ఈ దుస్థితి లేదంది. మండిగానికి మొహం అద్దుకొని నేను వచ్చాను. అద్దుకొన్నానో లేదో ఆక్షణంలోనే దత్తుతల్లి నన్ను పిలవకూడదా అంది. అంటే నీవు రానన్నావుగా, తీరికి లేదన్నావుగా అన్నాను. అటువంటి మావదిన వాకిట్లోకి రాగానే కౌగలించుకొని దేవతవు పుట్టావని అంటూపూజ చేసుకుంటా నంది.

ఆలయంలోకి లోపలికి ప్రవేశిస్తుండగానే ఒక నక్షత్రం రాలింది. రమ్మని లోపలికి పిలచినట్టుగా విగ్రహం చేతిలోనుండి పూవు క్రిందపడ్డది. అక్కడ అట్లా నిల్చుంటావే? లోపలికిరా! అన్నట్టు నాకనిపించింది. జడత్వం చూడటం లేదు. సర్వత్రా చైతన్యం చూస్తున్నాను గనక విగ్రహంకూడ నన్ను రమ్మన్నదని నేననుకున్నా. లోపలికి పోగానే నే తీసుకెళ్ళిన చీరకట్టాను అమ్మవారికి. నేను పూజచేశాను. ఆ బీజాక్షరములు వినబడని వాడులేడు. చుట్టుప్రక్కల వారంతా ఇవివిని ఆ రాత్రి అక్కడకు చేరారు.

వీ.ప్ర : లోపల గర్భగుడిలో బీజాక్షరాలు చదువుతుంటే.

అమ్మ : ఊరంతా వినబడ్డది. నన్ను మోసిందంతా చీరాల వాళ్ళే. మేనామీద మోసుకెళ్ళారు. డాక్టరుగారు, జిడ్డుప్రసాద్ మొదలైన వారు. ఒక రామాయణమే కాదు నమ్మరు అంటున్నా. ఇవేకాదు. ఏదీ నమ్మరు. నేనొక పొరపాటు చేశాననుకో! ఇంత పెద్దమనిషిగా ఉండిన నేను ఒక పొరపాటు చేశానంటే ఎవరైనా నమ్ముతారా? లేదూ. ఒకగొప్ప పని చేశాననుకో నమ్ముతారూ? కనపడుతున్నదే నమ్ముతాం మనం.

వీ.ప్ర : కనబడినా నమ్మలేకుండా ఉన్నాం.

అమ్మ : మండిగానికి మొహమద్దుకున్నది కొంత మంది మనసులను కదలిస్తున్నది. నీకక్కడ నచ్చక పోవచ్చు. సహజమేలే అనుకుంటాం. నాకు రాగం లేదు. ద్వేషంలేదు. పెద్ద నరసింహాయి పోయినప్పుడు సీతాపతితాతగారు నన్ను పంపనంటాడు. పులిపాక చెల్లమ్మగారిని ఆమెకు తీసుకొని ఒక పెద్ద ఎఱ్ఱపెట్టె మీద బ్రహ్మాండం నాగేశ్వరరావు అని వ్రాసి ఉండేది. ఆపెట్టె నెత్తిన పెట్టుకొని పొన్నూరు నుంచి బాపట్లకు నడిచాను. చార్జీలు ఇవ్వనన్నారు మానాన్నగారు. సీతాపతితాతగార్కి వీరు వచ్చితీసుకు వెళ్ళలేదని చాలాకోపం. పొన్నూరు హాస్పిటల్లో చనిపోయినాడువాడు. రేపు పోతాడనంగ మీరు (నాన్నగారు) వచ్చి వెళ్లారు. నేను మన్నవ నుండి బాపట్లదాకా నడచి వెళ్ళానంటే ఎవరు నమ్ముతారు? ఆ పులిపాక

చెల్లమ్మలేదు.పంపిన సీతాపతితాతగారు లేరు. సీతాపతితాతగార్కి నామీద కోపంలేదు. కోపం చెల్లెలి మీద అల్లుడి మీదనే. కాని చూపించింది నామీదనే. చిన్న చిన్నవే పెద్దవిగా కనిపించేవీ ఉన్నవి. తేలికగా అనిపించేవి ఉన్నవి. ఆయన కడుపుమంటలో ఆయన ఉన్నాడు. వాళ్ళు వచ్చి చూడలేదనే బాధలోనే పంపను – వాళ్ళే వచ్చి తీసుకెళ్ళా లన్నాడు. మా పినతండ్రికి జబ్బుచేసింది. ఆయనకు నేను సేవచేయ్యాలి. ఉంటుంటాయి – ఇవన్నీ స్వల్పమైనవి. ఈ చిన్నవే నమ్మశక్యం కానప్పుడు పెద్దవేమి నమ్ముతాం మనం? జీవితంలో చాలా సామాన్యమైన విషయాలు. చాలా అల్పము. అల్పమైనవి నమ్ముతామా?

సో : ఇప్పుడైనా ఒప్పుకొన్నారా?

అమ్మ : నన్నొప్పుకున్నాడా? లేదా? అని ఆలోచించలా. అన్నయ్య కూడా ఒప్పుకొన్నాడా లేదా అని నేనాలోచించను. ఒకరి ఒప్పుదల మీద ఆధారపడలేదు. ఉన్నదేదో ఉంది. వెంటనే అన్నయ్య లలితా అష్టోత్తర నామాలు వ్రాశాడు. ఏకాహానికి నామం వ్రాశాడు. మన్నవ రాఘవేంద్ర సోదరాయై నమోనమః అని వ్రాశాడు. నెహ్రూవారి ప్రక్కననే ఉన్నాను. అనేట్లుగా ఉంటాయి ఇవన్నీ. నే పెంచానంటే – నే పెంచానంటారు నన్ను అందరూ పెంచారనే చెప్తా.

ఎదురుగానే ఉన్న నాన్నగారితో ఇలా అన్నారమ్మ.

మీతోనే, భారతత్తయ్య మా ఇంట్లో బ్రతికిందే గదా అన్నది. రెండవసారి దేవతవు అన్నది. మార్పు చాలా సహజం. ఇప్పుడు మా ఇంట్లో బతికిందే గదా అని అనరు. నే పెంచానంటుంది.

నాన్న : అమ్మగా జనానికి తెలిసిన తర్వాతనే వీరంతా రాసాగింది.

అమ్మ : నేను మాఆడబిడ్డ పెళ్ళికి వెళ్ళాను. నాన్నగార్కి తెలిసినవీ ఉండవచ్చు. తెలియనివీ ఉండవచ్చు అసలేం తెలియపరచం, చెప్పం. ఈ పెళ్లంటేనే నాన్న తాతమ్మల వైపు ఇష్టం లేదు. అటు వాళ్ళకూ ఇష్టంలేదు. ఏదో

ఇంకొక రకంగాజరిగింది. Party ల వల్ల వాళ్ళవైపు ఇష్టంలేదు. ఆవైపు వీళ్ళ బీదతనం మూలంగ ఇష్టంలేదు. కారణమది. సరే. మానాన్న ఉపో ద్ఘాతంతో ఇచ్చాడు. అనుకున్న మూడు సంవత్సరాలకు పెళ్ళయింది మాకు.

ఒకనాడు రామకృష్ణ నాతో అన్నాడు. నీవు చెప్పిన తారీఖు చాలాతప్పు అన్నాడు. అష్టమినాడు పెళ్ళవడానికి వీల్లేదన్నాడు. అష్టమి, వర్జ్యం ఇన్ని ఉన్నాయంటే మొదటవ్రాసిన కాగితం కావాలని తాతయ్యకు కార్డు వ్రాశాడు. సరిపెట్టుకోనట్లయితే ఏం పేచీలు వస్తాయోనని చించేసి ఇదే పెళ్ళనుకున్నాం. అప్పుడు నేనన్నాను తాతయ్య కూడ రాలేదురా పెళ్ళికి. అబద్ధం చెప్పాల్సిన పనిలేదు. తారీఖుల ప్రకారం జరిగింది. పెళ్లి అన్ననాడు జరగలేదు అని వాడికి చెప్పాను. ఈ పెళ్ళి, తగాదాల పెళ్ళిగదా! అదొక గాథ.

దాని పెళ్ళికి వెళ్ళితే మా భూషితండ్రి అరిసెలు వత్తడం చూచి - అరిసెలు నేను తింటానికేనా వర్ధనమ్మా అని అడిగాడు. అంటే నే పనికిరానని. ఆయన దృష్టిలో నేను చెడ్డదాన్ని. చెడ్డదాన్ని అనికూడ ఆయన అన్నాడు. చెడ్డదాన్ని అనే భావం ఉంది ఆయనకు. తర్వాత ఆయనే నా దగ్గర ఉపదేశమైనాడు. చరిత్రరావడం అవసరమే. ఎందు కవసర మంటే - ఎవరు తిట్టారో, ఎవరు అన్నారో, ఎవరు ఇంకొకరకంగ భావించారో వాళ్లే నమస్కారాలు చేసి, వాళ్లే ఉపదేశాలయినారు. కాబట్టి సంపూర్ణంగ చరిత్రవస్తే బాగానే ఉంటుంది. రాయగలిగితే. (అరిసెలు) ఇవి తింటానికేనా అంటే మా అత్తయ్యకు కోపం వచ్చింది. పాప వాళ్ళ నాయనమ్మ భాగ్యమ్మగారని ఒకామె ఉంది. ఎప్పుడూ ఒకటే మనసు. ఆనాడుకాని, ఈనాడుకాని, ఏనాడైనా సరే. ఆమెకు మారుపేరే అది. అందరియందు ఒకటే.

శ్రీపాద : వర్ధనమ్మంటే?

అమ్మ : ఆయన పినతండ్రిగారి భార్య

నేతాకిన అరిసెలు తినను అని, తిననేలేదు. బండి దిగగానే మడిగుడ్డలు ఇచ్చారు. మడిగుడ్డ కట్టుకొని అరిసెలు వత్తుతున్నా. ఆవంటింట్లో నేనడిస్తే భోజనం చేయను అన్నంతగా మాట్లాడారాయన. మళ్ళీ ఆయనే మాలవాళ్ళు కూడ ఇంట్లోకి రావటానికిష్టపడి, నేవస్తేనే చాలని, నమస్కారం చేసి, పరిపూర్ణ మంత్రమిప్పించుకున్నాడు నాదగ్గర. ఆయన పేరు మన్నవ క్రిష్ణశర్మగారు. నాదగ్గర మంత్రం పుచ్చుకోమని కలలో ఆయనకు మౌనస్వామివారు చెప్పారని ఉపదేశమైనాడు. బంధువులందరిలో లోకనాథం పెళ్ళి దగ్గర నుండి కొంత మార్పు వచ్చింది. లోకనాథం పెళ్ళిలో మన సుబ్బారావును తీసుకెళ్లి పులిపాక మామయ్యకు చూపిస్తే 'నాకు పిల్లల్నెత్తుకోవటం అలవాటు లేదు' అన్నాడు. ఇవతలికి వచ్చి ఇట్లా అన్నాడు అట్లా అన్నాడు అని బాధపడేది. ఇటు బంధువులు కాని, అటు బంధువులుగాని, వీళ్ళు కాని, వాళ్లుకాని, పెళ్ళిళ్ళయితే శుభలేఖలు కూడ నన్ను గురించి.... అమ్మాయికి పసుపు రాస్తుంటే 'ఈఅమ్మాయి ఎవరు పసుపు రాయడానికి తీసుకొచ్చారా' అంటే, కాదు అనలేక పోయింది మా వరాల పిన్ని.

నా మెడలో ఒక్కనల్లపూసలే ఉండేవి. మాఅమ్మ చెల్లెలు - ఈ అమ్మాయి పసుపు రాయడానికి వచ్చిన పిల్లకాదు అని అనడానికి బుద్ధిపుట్టలా - మెదలకుండ ఊరుకొంది. నాకు భద్రిరాజు కృష్ణమూర్తిగారంటే ఎంతమంచి అభిప్రాయమంటే అన్నపూర్ణాలయంలో వంటచేసేది మాఅక్కగారండి అంటారాయన. ఆయనకు నమస్కారం చెయ్యాలనిపిస్తుంది నాకు. ఆదిశేషయ్యగారి తమ్ముడు తాసిల్దారు గారున్నారు. ఆయన వంటశేషయ్య ఉన్నాడా అంటాడు. మా అన్నయ్య అని అనడు ఆయన. ఒక స్థాయిలో ఉన్నప్పుడు మావాళ్లు అనిపిస్తుంది. ఒకస్థానం తక్కువగా ఉంటే మావాళ్ళుకాదు అనిపిస్తుంది. అంటే ఇప్పుడు

నేను చెప్పేది సామాన్యమైన విషయాలు. నేను పెద్దగా మాట్లాడటంగానీ, మాటగానీ ఎప్పుడూ నా కలవాటులేదు.

1947 September 17న ఈఊరి వాళ్ళతో నేను మాట్లాడడం ప్రారంభమైంది. (Party) వచ్చింది. మహిళా సంఘం ఏర్పాటు చేయాలనే ఆలోచన వచ్చింది. దానితో మంత్రాయి కొన్ని సలహాలడిగాడు. అదే మొదలు ఈ ఊరివాళ్ళతో మాట్లాడటం. మంత్రాయితో మాట్లాడుతుంటే, మహా పెద్దవాడు, వేదాల తిరువెంగళాచార్యుల వారు – మంత్రాయిని గురించి, ఊరివారు, అనేక అపోహలు పడ్డవి ఉన్నవి. నాన్నగారు వాడిని ప్రేమగా చూడమంటేనూ, ఇట్లా అనుమానపడుతున్నారని చెప్పాను నేను. చెప్తే, ఒకరనుకుంటే నీకేం, పెట్టమన్నారు. పిల్లవాడుగా చూచుకొంటున్న మంత్రాయికి ఈరెడ్డి సుబ్బయ్య కాపలా వున్నాడు. ఇప్పటికీ చెబుతాడే.

ఈ వూరికి బ్రహ్మాండం బాలకృష్ణమూర్తి అని తాసిల్దారు వచ్చారు. నాన్నగారు రేపుప్రొద్దున ఉప్మా అదీ చెయ్యమని కబురు చేశారు. అప్పుడు చెరువుకు వెళ్ళి నీళ్ల మేమే తెచ్చుకొనేవారం. పాప – పసిబిడ్డతల్లి. అత్తయ్య ఊళ్లోలేదు, చెరువుకు నీళ్ళకు వెళ్ళివచ్చాను. గోధుమరవ్వ జల్లెడ పడుతున్నాను. మంత్రాయి మొక్క జొన్నల కండెలు దంచు తున్నాడు. కండెలు మనం పైకి తోస్తుంటే వాడు దంచుతుంటాడు. వాడు ఏదో అడుగుతున్నాడు. నేనేదో చెబుతున్నాను. గాజుచాటున నిల్చున్నాడు రెడ్డి సుబ్బయ్య. మంత్రాయి ఎందుకో ఏడుస్తున్నాడు. వాడు ఏడుస్తున్న కారణం లేదు. వాడు ఏడుస్తుంటే జాలిగా, నాకూ కన్నీరొచ్చింది. తర్వాత ఆచాటున ఉన్న రెడ్డి సుబ్బయ్యను కందిరీగ కుట్టింది. అక్కడ నుండి, ఈయన అభిప్రాయం చెప్పనా – పెద్దగా నా తత్వం గ్రహించింది; బజారులో నుంచుంటే కాఫీ వెచ్చబెట్టాను. ఇట్లారమ్మని మంత్రాయికి సంజ్ఞచేశాను. అదీ తప్పు. ఆ రకమైన విషయాల్లో ఈఊరు అంతగా

బూజు పట్టిందన్న మాట. మనిషితో మనిషి మాట్లాడితే - అది తప్ప రెండోది లేదు. రెడ్డి సుబ్బయ్య పోయి ఊరంతా చెప్పాడు. నిజమే నే గ్రహించానన్నాడు. కరణంగారి భార్య సంగతి నే గ్రహించానని చెప్పుకొన్నాడు. అంతకంటె ఒడి కట్టుకొని కూర్చున్నవారు కొంతమంది ఉన్నారు. ఎవరైతే అన్నారో అందరూ దెబ్బ తిన్నారు. నాబాధ ఏమిటంటే, వాళ్లు తినాలని కోరిక లేక పోయినా తిన్నారు. వాళ్లు దెబ్బతినాలనే కోరిక ఆనాడు లేదు, ఈనాడు లేదు. ఎట్లా తిన్నారు అంటే చెప్పలేను. బంతి గనుక విసరి గోడకేసి కొడితే, అంత వేగంగా బయటి కొచ్చినట్లుగా అట్లాదెబ్బతిన్నారు. నాకు బాధనిపిస్తుంది. లక్ష్మమ్మ మొగుడు చినకోటయ్య అనేవాడు ఒకడుండేవాడు. రెడ్డి సుబ్బయ్య మాఇంట్లో తోడు ఉండడాన్ని గురించి - నన్ను వచ్చి స్పష్టంగ అడిగాడు. ఏమిటి? నీవిట్లా చేయుట మేమిటని? నేనేమీ మాట్లాడలేదు. అవిందులో ఏదన్నాభాగం నే పంచుకొంటేనే గదా! సమాధానానికి - పంచుకోనప్పుడు దెందుకు? ఈ ఊరులంక. లంకలో మనమున్నట్లుగా కాలం గడిపాను కొన్నాళ్లు. ఒంటరిగా ఉండటం తరుచుగా జరుగుతుండేది. జరుగుతున్నప్పుడు, కొన్నాళ్లు మంత్రాయి, కొన్నాళ్లు రెడ్డి సుబ్బయ్య ఎక్కువగా వస్తూ పోతూ ఉండేవారు. వస్తూ పోతూ ఉన్నప్పుడు ఇటువంటి అభిప్రాయాలొస్తుండేవి. వాళ్ళందరికంటె మన్నవ బ్రాహ్మణులు విద్యావంతులు, విద్యాసంపన్నులు, ధనసంపన్నులు, శాస్త్రవేత్తలు - వాళ్ళకేవస్తే, వాళ్ళకేతోస్తే - నామీద - వీళ్లకు తోచడంలో పెద్ద విశేషమేమున్నది? అనిపించేదిగాని వీళ్ళ మీద నాకెప్పుడూ కోపం రాలేదు.

సో : మాకు వినడానికే కష్టంగా ఉన్నాయి.

అమ్మ : చిన్నవేగా!

వీ.ప్ర : ఎంతో రావలసిన చరిత్ర ఉంది

అమ్మ : రేపునమ్ముతారా? ఎందుకంటున్నానంటే....

శ్రీపాద : రామాయణం నమ్మనివాడు నమ్మలేదు

అమ్మ : నమ్మినవాడు నమ్ముతాడు

అంతే. ఎవరేం చేసిందీ - ఎట్లా చేసిందీ - ఏమన్నది - అన్నా మనం వ్రాస్తే, నమ్మకపోవచ్చు.

తాతయ్య అలా అంటాడా అని నాకనిపించేది.

నాన్న : మన్నవలో ఉన్నకక్షలు అలాంటివి....

అమ్మ : నాజీవితంలో 18 సంవత్సరాలు ఒక రకంగా జరిగింది తమాషాగా. ఈ మార్పు 33వ సంవత్సరం వచ్చిన తర్వాతే.

వీ.ప్ర : రాజమ్మగారితో చెప్పినప్పుడు 33వ సంవత్సరం వచ్చిన దగ్గర నుండే జరుగుతుందని చెప్పారు గదా!

అమ్మ : 1942 నుండి కొద్దిగా మార్పు నాన్నా. కడుపులో పిల్లవాడు పోయి నేను బ్రతక ననుకొని, ఇంటికొచ్చిన తర్వాత నాన్నగారికి తెలియని సంగతులు, అద్దె ఇళ్ళలో జరిగిన అనేక సంగతులు ఉన్నవి. అట్లాంటివెన్నో ఉన్నాయి. అయితే నేనిప్పుడు వ్రాయించితే ఎట్లా ఉంటుందంటే వాళ్ళకు బాధకలగవచ్చు, ఉన్నవాళ్ళకు బాధకలగవచ్చు. ఇట్లా మనం చేశామా అనవచ్చు. మేం ఎరగము అనవచ్చు. ఎరుగము అన్న తర్వాత చరిత్రకు విలువపోతుంది. అదే నమ్ముతారు. ఇది నమ్మకపోవచ్చు. పీసపాటి సుబ్రమణ్యం అని - అతనికి సంబంధించిన ఒక incident వ్రాస్తే అతను నేనెరగనన్నాడు. కారణమేమిటని నేను మనిషిని పంపించాను. "నీవు నాదగ్గర కొచ్చినా సరే, నేను నీదగ్గర కొచ్చినా సరే" అని నేను కబురు చేస్తే "అమ్మ రావద్దు - అమ్మనే అనుకొంటున్నాను - నాపరువుకు నష్టం కాబట్టి కొట్టేసెయ్యమన్నాడు. ఎవరి పొరపాట్లో చెప్పటంకోసం చెప్పం. మన పాత్ర అక్కడ ఉన్నప్పుడే చెప్తాం. నవంబరు 24న అనసూయ ఎక్కడ ఉంది అంటే, ఫలానా చోట ఉందని చెప్పవలసి వచ్చినప్పుడు అవతల పాత్ర కూడ అవసరమౌతుంది. అటువంటిది చెప్పినప్పుడు

అవతలి వాడి మనసు బాధపడవచ్చు. అట్లాంటివి వ్రాసినందువల్ల బాధేగా మరి.

నాన్న : ఒకరికి బాధ కలిగించేవి ఎందుకు వ్రాయాలి?

శ్రీపాద : ప్రయోజనమేమైనా ఉంటే

అమ్మ : నన్ను అన్నవి వ్రాయాలనిగాని, నాకు చేసినవి వ్రాయాలని గాని లేదు. కథ అయితే దిద్దవచ్చు. చరిత్ర అన్నప్పుడు అందరూ–అన్ని రకాల పాత్రలూ అవసరమౌతాయి. తాతయ్య ప్రేమావస్తుంది. జానకమ్మ గారి కోపమూ వస్తుంది. ఏం? జానకమ్మగారి కోపం ఎందుకు వ్రాయాలి అంటే ఏం చెప్తాం?

విస్తట్లో అన్నం పెట్టి కూర వడ్డిస్తూ ఎంతహీనంగా మాట్లాడిందంటే (జానకమ్మ) ఒక రోజున ఈ సంబంధం ఆమెకు ఇష్టం లేక "నీకు నాగా ఇష్టమా? మాగా ఇష్టమా?" అని అడిగింది. రెండూ ఇష్టమే అని చెప్పా. దానికెన్నో కల్పించి "సీతాపతీ! నీమాట వింటుందా? పెడుతుందా?" అని వారితో అంది.

హాస్యంగా ఉన్నదని ఒప్పుకుంటాను. ఇతరుల మనస్సును కోసేసంఘటనలు ఉంటాయి కొన్ని?

వ్రాయటమా, వ్రాయకపోవటమా అన్నదానిమీద చరిత్ర ఆధారపడి ఉన్నది. చరిత్రంటే అన్ని విషయాలు యధాతథంగ, సంపూర్ణంగ రావలసిందే.

వీ.ప్ర : ఉన్న దానిని మరుగు పరచినా అబద్ధమే అవుతుంది.

శ్రీపాద : ఉన్న దానిని మరుగుపరిస్తే సంపూర్ణంకాదు.

అమ్మ : యదార్థం వ్రాస్తే కొందరి మనసులు గాయపడవచ్చు. రాయాలి అనే భావం మనం అందరం ఏకీ భావించి అనుకున్నప్పుడు – అవసరమైనవే చెప్పుకొని, పవిత్రమైనవే చెప్పుకొని – అపవిత్రం ఇది ఎందుకు చెప్పావు అని అనుకొన్నప్పుడు చరిత్ర యొక్క సంపూర్ణత్వం పోతుంది.

శ్రీపాద : వీటివల్లే మనిషి యొక్క చరిత్ర తెలిసేది.

అమ్మ : ఒక బాధలో నేననుకొన్నాననుకోనాన్నా! చెట్టు ఎండలో ఉంటూ, ఇతరులకు నీడఇస్తున్నదని నేను అన్నాను. అది ఒక Incident. అప్పుడీ మాట అన్నాననుకో-ఫలానా కారణం చేత ఇట్లా అన్నాను అనేది వస్తుందక్కడ. కొవ్వొత్తి కాలిపోతూ ఇతరులకు వెలుగు నిస్తుంది. అప్పుడు దానికేం చెప్తావు?ఒక సందర్భంలో ఆమాట అనుకొన్నా, పాదరక్షలు ఎంత తొక్కుతున్నా తొక్కేవాడి కోసం ఎదురుచూస్తుంటాయి అన్నాను ఒక సందర్భంలో. ఎందుకంటే, పాదరక్షలేర్పడ్డదే అందుకు. ఆ వివరణ చెప్పాలి అంటే ఎందుకు నేననుకున్నాను – ఆ సంఘటన చెప్పాలి గదా! నేను చచ్చి పోతానని దాక్టర్లంతా అనుకొన్నప్పుడు "ఏమిటమ్మా మీకోరిక" అని వారంటే "నాకు బ్రతకాలనే" కోరిక అన్నాను. ఫల్లున నవ్వారందరు. తర్వాతనాన్నగార్కి కబురు పంపారు వాళ్ళు. ఇట్లాంటివి ఏమన్నా ఉన్నప్పుడు....

బొట్టుపెట్టను అన్నప్పుడు, బాధకలుగవచ్చుగా. తాతగారు, మరిదమ్మగారు, ఇక్కడ కనకమ్మగారు అందరూ బాగాచూశారు. చేసిందామే గదా! ఈ వేళ గదా వీళ్ళంతా! ఏజబ్బు వచ్చినా ఆమే-ఏ పురుడుపోసినా ఆమే. ఆమె కాక తదితరులు ఎవరూ వచ్చి చూడలేదు. ఆమె చూసిందిగదా! తల్లి, తండ్రి, అత్తగారు – సర్వం తనే అయి చేసింది. చేసినప్పుడు ఆభావం మన మనుకుంటామనుకో! ఇప్పుడున్న వారికి కోపం రావచ్చు మేం చేయలేదా అని

మాపిన్ని (మారుతల్లి) ఆమె నన్నేమీ అనలేదు. నన్నొక మాట అనడం గానీ, చేయటంగానీ చేయలా. మాఅత్తగారు నన్ను సరిగా చూసింది అనుకొంటే ఆ రెండెకరాలు, డబ్బు చూసి చేసింది. అవి మేమిచ్చామని వారనుకోవచ్చు. అట్లాగే కొన్ని కొన్ని మనసులు బాధపడవచ్చు. మానుకుందామా? కావా లని వ్రాసుకుందామా?

శ్రీపాద : లేకపోతే అసలు వ్యక్తే లేరంటే ఏం చేస్తాం? Christ అనే వ్యక్తే లేరంటున్నారు.

అమ్మ : సహనానిక్కూడా అంతులేదు అని నేననను. తన ఇష్టాన్ని చంపుకొని ఒకరిష్టప్రకారం నడచుకోవటమే సహనమని అనుకుంటాను. సహజ సహన మంటే కష్టమే తోచకపోవటం ఏ స్థితిలో కూడా.

సో : ఎక్కడ నిర్వచనాలమ్మా!

ఇది ఎందుకంటే తరచుగా, అనిపిస్తుంది. నేను రెండోసారి గర్భిణిగా ఉన్నాను. చీరాలలో జరిగిన సంఘటనే ఇది. "ఎవరివి నీవు? మనిషి వేనా?" అని అడిగారు వాళ్లు. అప్పటికి మూడు రోజులయింది ఆనాటికి – శిశువులోపల పోయి. "ఎట్లా బ్రతికున్నావు?" అని అడిగారు. తర్వాత ఒకరోజు గడిచింది. ఆశిశువుకు చర్మమంతా లేచిపోయింది. ఇంత వీపయింది. వాళ్ళవల్ల కాలేదు. కారిచ్చారు వెళ్లిపొమ్మన్నారు అంతా సిద్ధంచేసి. చిదంబరరావుగారు వచ్చారు. "మీ అమ్మాయి బ్రతకదు" అని చెప్పారు. మాకు కారు ఇచ్చి ఎక్కడి వాళ్ళక్కడ పొయ్యారు.

నడిపించారు ...నడిపించారు. ఎన్నోచేశారు. నిప్పులు పోసి చేతులు కాల్చారు. ఎన్నోతంటాలు పడ్డారు. కాలేదు. ఎవరి దారిన వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత దానంతట అదే అయింది. కాని ఈ సన్నగా బాధలు పడుతున్నా, మూడు రోజుల్లో అత్తయ్యతో చెబుతుంటే "నీకు ఎనిమిదవనెలే, ఎందుకని నొప్పులొస్తున్నాయి – నీకు నొప్పులు కాదం"టుంది ఆమె. చివరకు ఇది ఏమిటో అంత వరకు శిరస్సు వచ్చినట్లు అనిపిస్తుంది. దాంతోనే నడుస్తూ, తిరుగుతూ తంటాలు పడ్డది. అట్లా అసహజంకాదు.

జబ్బులే సహనం కాదు. మామూలు విషయాలు కూడ సహనం కావచ్చు. ఇష్టంలేని పని జరగటం, దాన్ని సహించడం – అది సహనమే కావచ్చు. మాటలు పడటం సహనమే కావచ్చు. ఆకలి అవుతున్నది.

నీకు ఆహారమందదు. సహనమేకావచ్చు: ఆకలే అనిపించక పోవటం సహజ సహనం. ఆకలి అనిపించి భరించటం.....

ఎవరూ పట్టించుకోని పరిస్థితులు లేవా? నేను రెండేళ్ళు (చీరాల హాస్పిటల్లో) అక్కడ ఉన్నానంటే, మా లోకనాథం ఒకటి రెండు నెలలు ఉన్నాడు. వయసు మా ఇద్దరిదీ దాదాపు ఒకటే. కొన్నాళ్ళు నాదగ్గరే ఉద్యోగం లేకుండా ఉన్నాడు. నూనె పానకాలు పోయిన రోజు వాడక్కడే ఉన్నాడు. కాఫీ తెచ్చిపెట్టేవాడు. కొన్నాళ్లు నాదగ్గర వాడొచ్చి ఉన్నాడు. తర్వాత మరిదమ్మగారొచ్చారు. అక్కడ డాక్టర్లు చేసిన సహాయం ఇంతా అంతా కాదు. నేనన్నాళ్ళుంటే వారు ఫీజు తీసుకోలేదు. పుస్తకాల ద్వారా చదివి, వాళ్ళతో పాటే Nurse training పరీక్షకు కూర్చున్నాను. మంచి మార్కు లొచ్చినవి. నేను Pass అయ్యాను. వాళ్లకు ఆరునెలల కొకపరీక్షయితే నాకు రెండు నెలలకొక పరీక్ష.

ఈమె నెక్కడో చూశానని Solomon దగ్గర ఉండే ఒక నర్సు చెప్పింది. నన్ను మీరు (నాన్నగారు) చీరాల వచ్చి తీసుకొచ్చారు. అమ్మన్నత్తయ్య పోయిననాడు కరణం రంగారావు 1955 మే 16న వైద్యం చేశాడు. ఆరోజున నేను, బహుశా ఇటువంటి బాధ ఇంకొకగంట ఉంటే ఏం జరుగుతుందో చెప్పలేం - మీరు మాట పడటం నాకు మాట రావటం బాగుండదు అని చెప్పాను. ఆదెబ్బ శరీరం మీద చాలా దెబ్బ తీసింది. Kidneys దెబ్బ తినడానికి కారణం కూడ అదే. ఆరోజున ఆయనే అన్నాడు. మొదటిసారిగా నీకే ఇవ్వడమిది. మళ్ళీ పుస్తకం చదివి అన్నాడు. ఈ ఓర్పు ఏమనుకోవాలో నాకు తెలియదు అన్నాడు. మీరు బ్రతికిస్తారా? చదవకుండా వైద్యమెలా చేస్తున్నారు? మానవుడి పాలిట డాక్టరు దైవమనిగాదా అనుకోవటం. ఈమాటంటే చాలాబాధ పడ్డాడాయన. ఇవన్నీ నాకు మితిమించిన కష్టాలు కాదు. నాకు మితిమించిన బాధలూ కాదు. ఈవూళ్లో జరిగినవి ఎంతో, చిన్నప్పటి

నుండి జరిగినవి అంతే. నామనసెక్కడా సడలలేదు వీటికి. ఏదీ తప్పించుకోవాలనే ఉద్దేశ్యం లేదు నాకు. అదీసహజ సహనమంటే.

వీ.ప్ర : ఇదివరకే చెప్పావుగదమ్మా! ఏదీ కావాలనిలేదు, ఏదీ వద్దని లేదు.

అమ్మ : సాధువుగారు వచ్చారు. అందరూ వినదానికి వీలైనవి, ఎవరి మనసూ కష్టపడనిది చెప్తున్నాను. సాధువొచ్చాదు. ఉన్నాదు. ఎన్నిరకాలుగా పెట్టేవాదంటే వంటయితే మూతతీసి ఉమ్మివేసి వచ్చేవాదు. ఆ అన్నం ఎవరికి పెట్టేది? అమ్మ ఓర్పు గలది అనేమాట విన్నాదు. ఎంతవరకు ఓర్చుకొంటుందో చూద్దామని చేశాదని నేననుకుంటాను. అంతకంటె నామీద వాడికి కోపానికి కారణం లేదు. వాడి కొదుక్కు నాపిల్లనివ్వలా. వాడి పిల్లను నాకొదుక్కివ్వలేదు. వాడి ఆస్తి నే పంచుకోలేదు. నాఆస్తిని వాదు పంచుకోలేదు. ఆయన గురుత్వానికి నేనడ్డు రాలేదు. నాగురుత్వానికి ఆయన అడ్డురాలేదు. వెనుక, ముందు మాకు తగాదా అంటూ ఏమీలేదు. ఎక్కడొచ్చిందీ అంటే సహనం అనే పాటలు వ్రాశాదు రాజు. 'ఎంతమంచి దానవో అమ్మా' అని వ్రాసి అనసూయ అమ్మవే – సహనంబే నీసొంతసొమ్మా అని వ్రాశాదు. సొంతసొమ్ము అంటున్నాదని వాడికి ఆలోచన వచ్చిందా. అన్నంలో, మంచి నీళ్లలో, ఎక్కద పడితే అక్కద ఉమ్మేవాదు. సిగరెట్లు కాల్చి ఆవరణంతా విసరివేశాదు. అన్నం పెదుతూ, మానెదునెయ్యి పోయించుకుని కుక్కకు పెట్టేవాదు. పంచదార కుక్కకు పెట్టేవాదు. కొమ్మూరు దాక్టరుగారు సాధువులన్నా, స్వాములన్నా, గురువులన్నా, పీఠాధిపతులన్నా నమ్మదు. ఆయనకు తిరుపతి వెంకటేశ్వరస్వామి, అమ్మ ఈరెండే. ఇక్కడికి వచ్చిన తర్వాత వెంకటేశ్వర స్వామినికూడా మరచిపోయాదు. దాక్టరుగారు కూర్చున్నప్పుడో, లేదా పదుకున్నప్పుడో నాకాళ్ళు రాస్తుండే వాదు. ఆయన వచ్చిన తర్వాత ఒక పసిబిడ్డగా చూచాదు నన్ను. నేనొక విధంగా ఆయననే అమ్మనుకోవచ్చు. అట్లా చూశాదు నాన్నా నన్ను.

ఒక సందర్భంలో నేను ఇటు తిరిగి కూర్చుంటే డాక్టరుగారిని - ఈ సాధువు కాలెత్తి తన్నబోయాడు. అది నేను చూస్తుండేదాన్ని, కాని డాక్టరుగార్కి చేప్పేదాన్ని గాదు. తంతాడా? తంతే తెలుస్తుందిగదా? కాలెత్తితే కనబడదు గాని చర్యయితే తెలుస్తుంది లెమ్మని - నేచెప్పడ మెందుకులే మధ్యలో అని ఊరుకుండేదాన్ని. పిచ్చిపిచ్చిగా తిడుతూ ఉంటే హైమ అన్నది. 'నువ్వు ఓర్చుకో గాని, మేం ఓర్చుకోలేం' 'నీకిష్టమైతే పడు, లేకుంటే లేదు; ఆయనన్నాన్నా పంపు. లేదా మమ్మల్నైనా ఎటన్నా పంపు' అన్నది. సామాన్యంగా అనదు, అటువంటి దన్నది. ఏదో "పిచ్చివాడు. వీడికేం తెలియదు లేమ్మా" అన్నాను. పిడకలతో పూజచేశాడు. విసరివేస్తూ (పూలువేసినట్లుగా) ఊరుకొన్నా. ఎందాకా చేస్తాడు? బాధపెట్టేవాడికి కూడా కొన్నాళ్ళకు విసుగొస్తుంది. ఇటునుంచి Reaction లేకపోతే ఏముంది? విసుగుపుట్టి చేతులు నొప్పులు పుట్టి - ఒక పలుగెత్తామనుకో, ఆ పలుగుతో ఏ వేలో నొప్పిపుట్టి వదిలెయ్యరూ? ఎత్తలేని బరువు ఎంతసేపెత్తుతారు? చివరకు విసుగుపుట్టి ఎక్కడికొచ్చాడండే నాన్నగారితో అమ్మ ఎనభై రూపాయలు కాజేసిందని చెప్పి వెళ్లిపోయారు.

సో : తన డబ్బులా?

అమ్మ : సరే. నాన్నగారొచ్చారు. 'వెధవల్నందర్ని దగ్గరకు తీయడ మేమిటి? ఈ సిగరెట్లేమిటి?

కానీ నెత్తిన పెట్టుకొన్నందుకు. చేసినపని నిజమేగదా. నేజేసిన పొరపాట్లన్నీ నిజమే. వాడు నన్నన్నాడనే గదా నాన్నగారు బాధపడుతున్నది. ఏమీ మాట్లాడలేదు. ఆతర్వాత వాడు ఇంటికెళ్ళి ఏడ్చాడు. రాజు వ్రాసిన పాటలు నిజమేనని ఫొటోముందర కూర్చుని ఏడ్చాడు. అట్లా మూడు
43 నెలలు పడ్డాను వాడితో-

తర్వాత బాపట్ల పోతే (సాధువు) వాడక్కడ కొచ్చాడు అక్కడకూడా ఏమన్నా చేస్తారేమోనని పడుకోవడానికి పోయినట్టు పోయి నాన్నగారు మళ్లీవచ్చారు. అప్పుడు దేవాలయం సందులో ఉన్నాం మేం. వాడు గనక ఈసారివస్తే వాడితో నీవు మాట్లాడవద్దని, నాన్నగారు ఆదేశించారు. 'మళ్ళీ ఏం కల్పిస్తాడో' 'వాడితో నీవెందుకు మాట్లాడటం?' అన్నారు నాన్నగారు.

(సాధువు) వాడు మామిడిపండు తెచ్చి వాడి తలను నాపాదాల మీదపెట్టి ఏడ్చాడు. వాడిని ఏడ్పించింది ఓర్పే – మంచితనమే ఏడ్పిస్తుంది అంటా. నేనుకొట్టితిట్టి ఏడ్పించలేదు. మంచితనమే ఏడ్పిస్తుంది. ఎంత బాధల్లోనూ ఏడుపురాదు. రోషంవస్తుంది. ఇంకాచూద్దాం అనే పట్టుదల పెరుగుతుంది.

కొన్నాళ్ళకు చీరాల వాళ్ళొచ్చిన తర్వాత ఈవూరొచ్చాడు మళ్ళీ సాధువు. ఈవూరొచ్చిన తర్వాతకూడ అట్లాగే చేయటం ప్రారంభించాడు. చివరకు విసుగుపుట్టి వెళ్ళిపోయాడు. బాధపెట్టే వాడికికూడా కొంత కాలపరిమితి ఉంది. వాడికీ పరిమితి ఉంది. కాలముంది. ఎంతపెట్టాడు, అంత బాధ మానసికంగా పడతాడు. మానసికంగా, పడ్డవానికంటే – పెట్టినవాడే ఎక్కువబాధ పడతాడని నాఅభిప్రాయం అది. మీకు ఎంతవరకు నిజమనిపిస్తుందో!

వీ.ప్ర : కాదనేదేముందీ? అనుభవసారమైతే....

**17-4-76**

వీ.ప్ర : సత్తాలో భాగమే.

అమ్మ : మనిషి ప్రత్యేకంగా విడి విడిగా కనబడుతున్నపుడు వాడి సంకల్పమని అనిపించక తప్పదు. వాడిలోనే వాడికి తెలియ కుండా వచ్చే సంకల్పాన్ని గురించి, వాడాలోచించుకుంటే, తనెవరో, సంకల్పమెవరో – విడిగా ఆలోచిస్తేతోచదు – ఎవరైనదీ తెలియదు. చేయకూడనివి చేయా

లనిపిస్తుంది. చేయవలసినవి వద్దనిపిస్తుంది. చేయాలనుకున్నవి, బాగున్నవి చేయలేక పోతాడు. ఈ రెండింటి సంధిలో తాను కానిది ఇంకొకటి ఉన్నదని పిస్తుంది. తాను కానిది ఇంకొకటి ఉందనిపించినప్పుడు – దాని పేరు దైవమనో, సంకల్పమనో, మనకృషి అనో, మనకృషి – దైవసంకల్పమనో, సత్తాఅనో, శక్తి అనో, బ్రహ్మాఅనో ఈపేర్లు పెట్టు కుంటాడు. తను అనుకున్నది జరిగిన వాడికి సంకల్పాన్ని గురించి, సత్తాను గురించి ఆలోచనరాదు. తాననుకున్న సంకల్పానికి భిన్నంగా జరిగినవాడే ఆలోచన వస్తుంది. అప్పుడేం తోచక శక్తిఅనో, సత్తాఅనో అంటాడు. ఇది జరగటం అందరకీ సహజమే. అనుకున్నవి జరగకపోవటం, తన ఇష్టానికి అయిష్టమైన విషయాలు జరగటం....తనకు ఉద్యోగం కావాలను కుంటే దొరక్క పోవటం, తను చేద్దామన్నది ఏపని జరగక పోయినా – తప్పని తోచినా మనసుకు తప్పించుకోలేక తప్పుచేసినా – ఇటువంటి విషయాలలో ఈ సంకల్ప మెవరిది? అని మానవుడు ఆలోచించక తప్పదు. ఆ ఆలోచన వచ్చినప్పుడు దైవం, లేదా ఇంకొకటి ఏదో మన కతీతమైన శక్తి – ఆశక్తిపేరు దైవమనండి, సత్తా అనండి, మరొకటనండి – ఆసత్తాకు కృష్ణుడని పేరు పెట్టి లేదా రాముడని పేరు పెట్టి లేక ఇంకొకపేరు పెట్టి; ఏ విధంగా అనుకున్నా నీ ఇష్టం మీద ఆధారపడి వుంది. ఇక్కడ నీఇష్టమేమిటి? అంటే వాడికి అనుభవం పొందిన రూపం మీద ఆధారం – నా సంకల్పా లన్నింటికి మాఅమ్మేనని నీ వనుకోవచ్చు. నా సంకల్పా లన్నిటికీ ఆధారం ఆకృష్ణ పరమాత్ముడని ఇంకొకడను కోవచ్చు. శక్తికే ఇన్ని పేర్లిచ్చుకొని అనుకుంటాం. అనుకున్నవి జరుగుతుంటే సంకల్పాన్ని గురించి ఆలోచనే లేదు.

వీ.ప్ర : తనదే అనుకుంటాడు. సమస్య ఏమిటంటే ఈ సంకల్పంతనలో ఉంటుంది కాబట్టి తనదే అనుకుంటాడు.

అమ్మ : ప్రత్యేకంగా శరీరంలో పుట్టేఆలోచనలను తన సంకల్పం అనుకొంటు న్నాడు.

వీ.ప్ర : కాని ఎక్కడ నుండి వస్తాయో తనకు తెలియదు.

అమ్మ : ఎక్కడ నుండి వస్తున్నాయో తెలియదు గనుక. ఆ శరీరంలోనే ఏభాగం నుండి ఆలోచన వస్తుందో తెలియక దాన్ని BRAIN అనుకొంటున్నాం - దానికి అతీతంగా ఉందను కుంటున్నాం. అన్నింటికి BRAIN ఆధారమని నమ్మలేక పోతున్నాం. తెలివికి - తెలుసుకొందే దానికి; జరిగే దానికి, భిన్నంగా జరిగే దానికీ - ఆ BRAIN రెండు రకాల ఆలోచిస్తుందా? ఇప్పుడు అవునన్నది మళ్ళీ కాదంటుంది ఆ శరీరంలో ఆలోచనే.

వీ.ప్ర : అయితే ఇది చెప్పేటప్పుడు కర్తృత్వం నీది కాదనుకున్నప్పుడు, అంటే సంకల్పం నీది కాదనుకుంటే.

నీకు ఏదైనా పని చేయాలను కుంటే ముందు ఆలోచన రావాలి. ఎక్కడి నుండి వస్తున్నాయో తెలియదు. కనుక వాడు చేస్తున్నాడని అనిపించటంలా. అయితే ఎక్కడి నుండి వస్తున్నాయో తెలియదు కాబట్టి ఏదో పేరు పెట్టుకొన్నా రన్నారు. రావడ మెక్కడి నుండి?

అమ్మ : రావడ మెక్కడి నుంచో అనేది సత్తా సత్తాగానే ఉంది. దానికి చలనం లేదు, చైతన్యం లేదని మీరంటున్నారే - ఆ చైతన్యం లేని సత్తే ఈ మనిషిగా రావడానికి ఆధారమైనది గనుక, ఆ ఆలోచన కూడా - ఆ మనిషి ఎట్లా వచ్చాడు, వాడి ద్వారా ఆ సత్తాలో నుండే వస్తున్నది అంటాను.

వీ.ప్ర : మనిషిద్వారా కాకుండా శరీరంలో వ్యక్తం కాకుండా సంకల్పం లేదా?

అమ్మ : సత్తా అసలు కన్పించటం లేదు. ఉన్నదని అనుకుంటున్నాం.

వీ.ప్ర : సంకల్పం కనిపించదు. ఆలోచన వచ్చింది గదా!

అమ్మ : ఆలోచనా రూపంగా తప్ప - వస్తురూపంగా కన్పించదు.

వీ.ప్ర : అయితే ఈసత్తా దేహరూపం ధరించిన తర్వాత, ఆలోచనా రూపంతో, వచ్చిన సంకల్పం కన్పిస్తున్నది. వేరే సంకల్పానికి ఒక స్థాయి లేదా?

అమ్మ : తావు ఉన్నదని నేనుశక్తిద్వారా ఊహిస్తున్నాను. శక్తిద్వారా ఎందుకంటే, కనబడుతున్నది రూపం. కనబడింది ఊహ. ఏదో ఒక శక్తి ఉండితీరాలి. వ్యక్తం కాకపోతే శక్తి అని కూడా నేననుకోను. మనిషి అనుకున్నవన్నీ అవుతుంటే మనిషే కారణమని అనుకునేదాన్ని. ఈ మనిషిలో పుట్టే ఆలోచనకు, భిన్నంగా మరొక ఆలోచన వస్తున్నది గనుక, ఏదో తెలియక సత్తా అనేది ఒకటుందిరా అనుకొంటున్నాం. ఏదో తెలియక, ఏదో ఉందని పిస్తున్నది. సత్తా కంటికి కనబడటంలా - మనసుకు అందుతున్నది.

వీ.ప్ర : ఆసత్తాకు సంకల్పం ఉంటుందనే, వ్యక్తమవుతుంది కాబట్టి ఆసత్తాకు - సంకల్పం ఉండి తీరాలి.

అమ్మ : సర్వం కాగలుగుతున్నది. ఒక గజంలో అనేక రకాల చెట్లు పుడుతున్నాయి గదా! ఆభూమికి సత్తా ఉన్నదన్నట్లు ఎట్లా అర్థమౌతున్నదో - ఎక్కడ నుండి కనబడున్నదో మనకు తెలియటం లేదు. మహా మహా గొప్ప శాస్త్రవేత్తలకు కూడా - చెట్టు ముందా విత్తు ముందా? అంటే-నేను చెట్టుముందు అంటాను. వ్యక్తమౌతున్నదే ముందు అంటాను. వ్యక్తంకానిది నమ్మను నేను.

వీ.ప్ర : ఆలోచనా రూపంతో సంకల్పం వ్యక్తమవుతున్నది. కాబట్టి సంకల్పం సత్తాలో నుండి వచ్చి ఉండాలని-

శ్రీపాద : శరీరంకూడా సత్తాలో నుండి వచ్చింది గనక-మరొకటేం కనిపించడంలా,

అమ్మ : ఇంకొకటి ఆధారం నాకు దొరకడంలేదు గనక.

వీ.ప్ర : ముందుగా సంకల్పం పుట్టింది.

అమ్మ : ఒకణ్ణి చంపాలనే సంకల్పం నాలో పుట్టింది. ఒకణ్ణి చంపాలనే ఆలోచన నాలోపుట్టింది. మళ్ళీ వెంటనే పాపం వాడేం చెయ్యలేదనే ఆలోచన నాలోనే పుట్టింది. ఎందుకు వదలి పెడతావు? ఆ కత్తి అక్కడ ఉంది తీసుకో అని నాకే అనిపించింది. పొడిస్తే ఎవరన్నా చూస్తారేమోనని నాకే అనిపించింది. చాటుగా పొడుద్దాం అని నాకే అనిపించింది.

పొడుస్తే పాపమేమో అని నాకే అనిపించింది - ఇన్ని నాలోనే పుట్టినవి. ఒక దానికొకటి సంబంధం లేని విరుద్ధమైన ఆలోచనలన్నీ నాలోనే పుట్టినవి. ఈ విరుద్ధానికి ఆధార మేమిటి? అని ఎవరు? అని ఆలోచించాను, ఎంత అన్వేషించినా, నాకు మరొకటి కన్పించడం లేదు.

వీ.ప్ర : దీనికి కారణమేమిటి?

అమ్మ : జగత్తు, సత్తా, శాశ్వతంగా ఎప్పుడూ ఉంది అనుకొంటు న్నాను. ఈజగత్తే శాశ్వతంగా మనుష్యులు లేక పోయినా - గోళాలుగానో, భూమిగానో, ఇంకొక రకంగానో ఎప్పుడూ వుంది ఆ ఉన్నదే సత్తా. దానిలోదే సంకల్పం అను కొంటు న్నాను.

వీ.ప్ర : వాళ్లు చెప్పినటువంటి ఆలోచనలేని స్థితిలేదు. ఎప్పుడూ ఆలోచనలున్నాయి. ప్రతిక్షణం ఆలోచించడమే ఆలోచనకు స్వభావం. అయితే వాళ్ళు యోగం ద్వారానో, ఇంకొక రకంగానో - ఆలోచన లేనటువంటి స్థితి ఉంటుంది అని చెప్తున్నారు. శాస్త్రం చెప్తుంది. ఆలోచనలు ఆలోచనలుగా ఆగిపోయినప్పుడు మనసు మనసుగానే ఉంటుంది. ఆ ఎరుక కలుగుతుంది. ఆలోచనకూడా సత్తా యొక్క వెలుగుతోనే తెలుసుకోవటం. అదివేరుకాదు-ఆలోచన సత్తా యొక్క ప్రతిబింబం తప్ప మరొకటికాదు. వైరుధ్యమైన ఆలోచనలు కూడా, ఆలోచనయొక్క ప్రతి బింబమే అని తెలుసుకోవడం మనసును గుర్తించటమౌతుందా? ఆలోచనలు లేని స్థితి వారు చెప్పేదానికి ఇది సరిసమానమేనా?

అమ్మ : ఆలోచన లేని స్థితిలేదు. ఆలోచనలేని స్థితి ఉన్నదని ఊహిస్తున్నారు. మాట్లాడక పోవచ్చుగాని ఆలోచన ఉన్నదే. దాని గురించి ఆలో చించవచ్చు. గాని వాళ్ళనుకున్న నాడీ చలనం, ఇంద్రియాలను బిగించినంత మాత్రాన ఆలోచన లేని స్థితి, నేను చెబుతున్నది దానికి సమానం - ఏపని చేస్తున్నా ఏమి మాట్లాడుతున్నా ఆ సత్తే - అదే అని

గుర్తించిన స్థితి. సత్తా అదీ అని గుర్తించిన స్థితి. ఎరుకతప్ప ఏమీలేని స్థితి, రెండూ ఒకటే ఎందుకంటే ఆ ఎరుకను కాదనటం నాకిష్టంలేదు. ఎరుక తప్ప ఏమీ మిగలదు, సంకల్పమేమీలేదు అనటం నాకిష్టంలేదు గనక - ఆస్థితి ఈ స్థితి ఒకటేనంటా. ఒకరన్న దాన్ని కాదనాలని నాకులేదు.

వీ.ప్ర : ఆస్థితి అంటూ ఉంటే........

అమ్మ : అది ఇదే, ఒకరన్నదాన్ని కాదనాలనినాకు లేదు.

శ్రీపాద : దాన్ని గుర్తించిన స్థితిని సత్తాయే అంటున్నారు. రెండూ ఒకటే అన్న మీ మాటను ఒకదాన్ని రెండు ముఖాలు చేస్తున్నారు ప్రసాదుగారు.

అమ్మ : మాయావాదం, అజాతవాదం రకరకాలుగా ఎన్ని పుట్టు కొచ్చినా సంకల్పరహితం అన్నదాని దగ్గర కలుస్తారందరూ. అందరూ సంకల్పము లేని స్థితిఉన్నదనేది - అన్ని సంకల్పాలు అదే అనేస్థితి ఒకటే. అంతా ఆ సత్తాదే అనేస్థితీ ఒకటే. అన్ని సంకల్పాలు ఆ సత్తావే అని గుర్తించటం. వీడి ఆలోచన లేని స్థితి, అంతా ఆసత్తాదే. వీడి ఆలోచన ఏంలేదు.

వీ.ప్ర : వీడికొచ్చిన ప్రతి ఆలోచనా ఆసత్తాయే తీసుకొస్తుందని గుర్తించడం.

అమ్మ : అన్ని వేళల్లో ఉండాలి,

వీ.ప్ర : కాసేపు ముక్కుమూసుకొని కూర్చున్నాడు. వేరే ఆలోచన లొస్తున్నాయి. అవి సత్తాలోనుండి వచ్చినవే అని అనుకుంటే అప్పుడు ఎరుక మాత్రం గుర్తించిన స్థితేనా అది?

అమ్మ : అంతేగాదు. కాసేపు ముక్కు మూసుకోమన్నది సత్తా. కాసేపు బయటికి పదమన్నది కూడా ఆసత్తాలోదే.

శ్రీపాద : సత్తాయేగాని తన ఆలోచనలేదు. ఆలోచన లేని స్థితి ఏది?

అమ్మ : ఆలోచనలేని స్థితిలేదు. ఉన్నదనుకునే వాడికి ఆలోచన లేని స్థితిని నిర్వికల్ప మంటున్నారుగా! ఆనిర్వికల్ప సమాధిలో ఏస్థితిని పొందు తున్నాడో నాకు తెలియదు.

శ్రీపాద : మీరు నిర్వికల్ప సమాధిని పొందలేదా?

అమ్మ : నేను పొందలేదు. అన్ని సంకల్పాలూ ఆసంకల్పమే అనుకున్నాను గాని వేరే నిర్వికల్పం పొందలా. నీ సంకల్పమే నాసంకల్పమనుకోవటం శాశ్వతంగా ఇరవైనాలుగు గంటలూ అనుకున్నాను గానీ నిర్వికల్పం పొందలేదు. నీసంకల్పమే మిగిలిందిగానీ నిర్వికల్పం పొందలేదు.

శ్రీపాద : నీ సంకల్పమే నాసంకల్పమనుకోటం సంకల్పరాహిత్య మన్నారు గదా!

అమ్మ : నావి కావు అనుకోవటం, ఈ సంకల్పాన్ని వాడివి అనుకోవటం సంకల్ప రాహిత్యం.

అనుకోవటమే అనుభవం గానీ నిర్వికల్ప సమాధని పేరుపెట్టి వారు దాన్ని వివరించిన వివరణ నా కనుభవం లేదు.

వీ.ప్ర : మత్తుమందిచ్చారు. ఏ ఆలోచనాలేదు. మనసు పనిచేయ లేదు. ఎరుకకూడా లేదు.

అమ్మ : మనస్సు ఏం పనిచేసిందో ఎరుకలోకి వచ్చిన తర్వాత ఆపని గుర్తులేదు. గుర్తు వచ్చినప్పుడు కూడా మత్తు ఇచ్చినప్పుడు కూడా అటూఇటూ పొర్లాను. పొర్లానని గుర్తులేదు.

వీ.ప్ర : అప్పుడుకూడ మనసున్నదా? ఆలోచన ఉన్నదా?

అమ్మ : అక్కడకూడ ఆలోచన ఉన్నది. ఆలోచించాను అని నాకు తెలియదు గాని ఆలోచన ఉన్నది. మీకు చెప్పేటట్లుగా తెలియలేదు నాకు.

వీ.ప్ర : వాడికి ఎరుక అవుతుందా?

అమ్మ : వీడికి వాడు కూడ ఎరుక కాదప్పుడు.

వీ.ప్ర : ఏమిటో ఆస్థితి.

అమ్మ : ఏదో ఒక స్థితి.

వీ.ప్ర : నిద్రలేచిన తర్వాత నిద్రపోయాననితెలుసు. కాని మత్తులో....

అమ్మ : కాళ్ళు తిమ్మిరెక్కితే నీవు నాకు పిసుకుతున్నా తెలియని స్థితి ఒక బండ బారువంటి ఇంజక్షను ఇచ్చారు శరీరానికి. అంతవరకు మొద్దుబారి

పోయింది శరీరం. ఆపరేషన్ చేస్తున్నారు. ఆపరేషన్ చేస్తున్నారు అని తెలుసు. నొప్పి తెలియదు. చేస్తున్నారని తెలుసు. మత్తు ఇచ్చినప్పుడు మనసుకు కూడ అదే స్థితివచ్చింది. ఇక్కడ బండబారి పోయినట్లు అక్కడా బండబారిపోయింది.

వీ.ప్ర : ఆ స్థితిలో కూడ ఆలోచనలున్నాయా అప్పుడు?

అమ్మ : అనుభవించిన వాడికి తెలియాలి ఎట్లా ఉంటుందో. నాకటువంటి స్థితి ఎప్పుడూ రాలేదు.

వీ.ప్ర : మత్తు మందిచ్చినా రాలా?

అమ్మ : రాలేదు.

వీ.ప్ర : నీస్థితి కాదమ్మా. మాస్థితిలో మత్తు మందిచ్చినప్పుడు ఆలోచనలు వచ్చినట్లుగ కూడ నాకు తెలియదు.

అమ్మ : నాకు తెలియని ఒకస్థితి ఉండవచ్చు. ఎట్లా అంటే మొన్న నెల్లూరిలో బెడ్‌పై పడుకున్నాను. Blood పెరిగిందన్నారు. మత్తుగాఉందన్నాను. పడుకున్నాను. నేను మత్తుగా ఉన్నాననుకున్నప్పుడు మాట్లాడడం ఇష్టంలేదు గానీ ఎవరెవరు వచ్చి కూర్చున్నారో తెలుసు. ఉమామహేశ్వరరావు గారొచ్చారు ఆరోజునే చూశా. వచ్చారనుకున్నాను. ఎప్పుడొచ్చారని నేను పలకరించలేదు. నన్ను చూడటానికి వీళ్ళొచ్చారని తెలుస్తున్నది.

వీ.ప్ర : నాన్నగారొకటి చెప్పారమ్మా. మూడురోజులు మీ అమ్మగారలా పడుకొన్నారనీ, శరీరం నల్లబడి పోయిందని వారన్నారు. ఆస్థితిలో ఆలోచనలున్నాయా?

అమ్మ : నాకు ఉండే ఆలోచన నాకు ఉంది. నాకున్నది ఆలోచన. నల్లబడవచ్చు కదలకుండా పడుకున్న మాట వాస్తవం. మాట్లాడక పోవచ్చు.

వీ.ప్ర : ఉచ్ఛ్వాసనిశ్వాసలున్నాయా? ఉచ్ఛ్వాసనిశ్వాసలు లేక పోయినట్టయితే, మెదడుకు రక్తప్రసరణం లేక పోయినట్లయితే ఆలోచనలు ఉండవు అని చెప్తారు శారీరక శాస్త్రవేత్తలు. ఆ పరిస్థితులలో, శ్వాసలేని కాలంలో ఆలోచనలుండవని ఇదనుభవమని యోగులు చెప్తారు.

44

అమ్మ : యోగాభ్యాసం చేసేవాడు ప్రాణాయామం చేసేవాడు ఉచ్ఛ్వాస నిశ్వాసాలను ఆపి బిగించి కూర్చుంటాడు. కర్మేంద్రియాలను కట్టుబడేస్తాడు. గాని ఆలోచనలుంటాయి. ఎరుక కూడ ఆలోచనే. ఆలోచన అంటే ఎక్కడికో పరుగెత్తాలని, ఏదో పని చెయ్యాలని - ఆలోచన లేకపోవచ్చు - నేనిట్లా కూర్చున్నాను. అనే ఎరుక ఆలోచనే. నేనున్నాను అనేదది ఆలోచనే. రామక్రిష్ణ అన్నాడు నాకు చాలా ఎక్కువగా దండలు వేసేవారు ఇది వరకు. 'శ్వాస ఉందా లేదాఅని గమనించ డానికి వీలులేకుండా ఉండేదని' నేనేం బిగించే దాన్నిగాదు

(అమ్మశ్వాస బిగబట్టారు, నాడి ఉందో లేదో చూచుకో మన్నారు. అట్లా పది నిముషాలు గడచింది)

వీ.ప్ర : కాలం మీద అధికారం గల వారికి - శ్వాసమీద అధికారం ఉంటుందా అని అనుకోవలసిన పనిలేదు. ఆ దృష్టిలో కూడ నేనున్నాను. అనే ఎరుక ఉంటుంది. యోగులు చెప్పే ఎరుక అనే స్థితిలో కూడ నేనున్నాను అనే ఆలోచన ఉంటుంది.

అమ్మ : ఆనందం అనుభవిస్తున్నా మంటున్నారే, ఆ ఎరుకే లేకపోతే ఆనంద మెవరికి? నిర్వికల్ప సమాధిలో ఆనందం పొందుతున్నాను అన్నాడు. ఆనందం తానై ఉన్నాడా? ఎవరికి తాను ఆనందమై ఉన్నాడు? కనబడేదీ, చూచేదీ - రెండుంటేనే గదాఆనందం. చూచేది లేదు. తనలోనే ఆనందపడుతున్నాడు తను ఎరుకలేని ఆనందమేముంది? శాస్త్రప్రకారం, ఉపనిషత్తు వాక్యప్రకారమైనా.

వీ.ప్ర : రెండులేని స్థితి ఆనందమేముంది?

అమ్మ : ఆనందమంటే నవ్వటమా? సుఖమా? ఏడవటమా? తపించటమా? ఏవీకాదు. ఎరుక లేకపోతే ఆనందమేముంది? సహజసమాధిలో ఆనందముంది.

అన్నివేళల్లో, ఏం జరుగుతున్నా నవ్వుతున్నాడు, గనుక ఆనందముంది.

కళ్ళు మూసుక్కూచుని, ప్రాణవాయువు బిగపట్టు క్కూచుని నిర్వకల్పసమాధిలో ఆనందం మిగిలి ఉందన్నప్పుడు - ఎరుకలేనప్పుడు - ఆనందం పొందేదెవరు - ఆనందం తానై ఉండే దెవరు? ఆనంద మెవరికి?

సో : నిర్వికల్ప సమాధి లేదంటావా నీవు?

అమ్మ : నేననలేదు. ఉన్నదేమో నాకు తెలియదు. నేను పొందలేదన్నా. ఎరుకలేని నిర్వికల్ప సమాధి ఉంటే. ఆనందం ఎవరికి? అంటున్నా.

సో : తనకే

అమ్మ : తనకే అంటే తనెవరు? ఎరుకకూడాలేదా? ఎరుకంటే గుర్తు. గుర్తు కూడా లేదా? గుర్తులేని ఆనందం ఎవరికి?

సో : నిద్రపోతున్నాను. ఆ సమయంలో తెలియదు. నిద్రపోయి లేచిన తర్వాత హాయిగా నిద్రపోయాను అని తెలుస్తుంది.

అమ్మ : నాన్నగారు భయపడటం తర్వాత నాన్నగారు ఊరినుంచి వచ్చేటప్పటికి బొమ్మ బాధపడుతూ వుండటం - నామంచం చుట్టూ సాంబ్రాణికడ్డీలు వెలిగించటం ఇలాంటివన్నీ చెప్పారు. తర్వాత నిర్వికల్ప సమాధి - దాన్నిగూర్చి మాట్లాడుకొంటు న్నాం. వారు చెప్తున్నా నిర్వికల్ప సమాధిలోని ఆనందమూ - అన్నివేళల్లో, అన్ని సంకల్పాలు ఆ ఎరుకవే, ఆ సత్తాలోనివే అన్న స్ఫురణ నిరంతరం ఉన్న స్థితి ఒకటేనా అని అడిగారు. నా దృష్టిలో ఒకటేను అన్నా. వచ్చిన ప్రతి ఆలోచనను ఆ సత్తాలోదే అనుకోవటం, నిర్వికల్ప సమాధిలో పొందే ఆనందం రెండూ ఒకటేనా అని అడిగారు. నాదృష్టిలో ఒకటేను అన్నా.

వీ.ప్ర : ఆ స్థితి లేదను కుంటున్నానని, దానిసంగతి నాకు తెలియదని మీరన్నారు.

అమ్మ : ఎరుకలేని ఆనందం లేదు అన్నారు. నిన్ను చూచి ఆనంద పడాలి, దృశ్యం చూచి ఆనందపడాలి. నాలో నాకానందం కలగాలి - నేను ఆనందపడ్డాను అని నాకు తెలియాలంటే సంతోషమూ, దుఃఖమూ -

నవ్వూ, ఏడుపూ ఇవేవీ కారణం కాదు, దృశ్యమూ కాదు, మరేదీకాదు. ఏదికాని ఆనందానికి ఎరుకైనా అయివుండాలి గదా! ఆ ఎరుకే నేననే భావం కలిగిన తర్వాత ఆనందపడతాడా? ఆనందో బ్రహ్మాప్రజానాత్ అని పెద్దవాళ్ళు చదువుతుంటారు. దాని అర్థమేమిటో తెలియదు నాకు. అంటే ఏమిటి?

సో : ఆనందమే బ్రహ్మని తెలుసుకోవటం

అమ్మ : ఆనందమే బ్రహ్మ ఎప్పుడని తెలుసుకుంటాడు? ఏ పరిస్థితి లోనూ, ఆనందము – అన్నీ వాడివే అన్న నా స్థితి – ఎరుక తానైన స్థితి ఒకటే అని నేను చెప్పాను. కళ్లు మూసుక్కూర్చుని ఎరుక ఒకటే మిగిలి, ఆ ఎరుకలో ఆనందం పొందిన స్థితి ఎప్పుడూ పొందలేదు. అన్ని ఎరుకలూ ఆ సత్తానే అదే ఇదంతా అనేస్థితి ఎప్పుడూ ఉన్నది. అది పొందలేదు గాబట్టి ఇది, అది ఒకటే అనుకొంటున్నాను. ఏవేళలోనైనా ఏం జరిగినా, తిట్టినా, కొట్టినా–చచ్చినా,బ్రతికినా సత్తా ఏడిపిస్తున్నది అనుకున్నా. సత్తా ఈ పని చేయించింది అనుకున్నా. సత్తా అనండి, శక్తి అనండి, బ్రహ్మ అనండి అన్ని వేళల్లో అదే అనిపించిందే సంకల్ప రహితం.

వీ.ప్ర : సాధన చేస్తున్న స్థితి తప్ప, పరిణతి పొందిన స్థితి కాదు అనేది స్పష్టమౌతున్నది. యోగసాధన చేస్తూ ఆ ఎరుకలోనే ఉంటున్నాను అనే స్థితి, దేన్నో సాధించటం కోసం చేసుకొంటున్న స్థితే తప్ప – అది పూర్తి అయిన స్థితి మాత్రం కాదుగా

అమ్మ : నిర్వికల్ప సమాధిని నిద్రా సమాధిస్థితి అంటే నేనొప్పు కుంటాను. అందులో ఏం లేదు. అట్లా ఉన్నది. నేకాదనను నిద్రసమాధి స్థితి కాదుగదా!

ఎరుకతానై ఉన్నాడనుకునే గుర్తే ఆనందమా? ఎరుక కూడాలేని ఆనందమున్నదా?

సో : ఎరుకకూడా తానే అయివున్నాను అన్న గుర్తే ఆనందం.

అమ్మ : వాడి కొచ్చే ఆలోచన - వాడికి వచ్చిన తర్వాత - నాకే ఆలోచన వచ్చింది అని తెలుస్తున్నది కాని ఆలోచన లేక ముందు ఈ ఆలోచన వచ్చింది అని తెలియదు. ఎవరి దాకానో అక్కర్లేదు మనం దాన్ని Thought అంటాం. ఈ Thought యే వస్తుందని ముందుగా వీడికి Thought రాదు. అటువంటప్పుడు ఏదో మనకు తెలియనిది, అతీతమైనది ఒకటి ఉందని పిస్తుంది. అది ఏది అనుకుంటే-శక్తనుకోండి, సత్తా అనండి, శాశ్వతమైనదనండి, దైవమనండి. ఏదో మనకు తెలియని అతీతమైన శక్తి ఆలోచన ఇస్తున్నది. మన మనుకున్నదే జరిగితే ఏశక్తిఅనో, ఆసత్తాఅనో (పదాలను) ఉపయోగించాల్సిన అవసరం కలిగేది కాదు. ఈశరీరంలోనే భిన్నమైన ఆలోచనలు రావదానికి కారణమిట్లా ఉంది.

సత్తా అంటే ఏమిటి? సత్తకు ఆలోచన ఏమిటి?సత్తాకు సంకల్పమేమిటి?

సత్తా నశించేది కాదు - మాట్లాడేదీ కాదు - వినేదికాదు - చేసేది కాదు - చైతన్యము లేనిది - అది అపారమైన శక్తి కలదేకాని దాని కాలోచన లేమిటి? దానికి సంకల్పమేమిటి? మనుష్యుల్లోవచ్చే ఆలోచన లే స్థానము నుండి బయలుదేరు తున్నవో తెలియక BRAIN అని ఆలోచనలు వచ్చే దానికి ఏదో పేరు పెట్టుకున్నాం. ఆ BRAIN కూడ వీడికి స్వాధీనం కాదు.

అయితే మత్తిచ్చినప్పుడు వీడికాలోచనలు వుంటున్నాయా? అప్పుడే మవుతుంది? అది నాకనుభవంలేదు. అని నేనన్నా ఒకటి మాత్రం చెప్తాను. మత్తులో ఏం తెలియదు. కొన్ని ఆలోచనలు పుట్టుకొస్తున్నాయన్నారు. అమ్మ మూడురోజులు అట్లా పడుకున్నారని, శరీరం రంగు మారిందని, ఉచ్ఛ్వాస నిశ్వాసలు లేవని, ఆస్థితి ఏమిటి అని అడిగారు. జరిగిందే చెప్పాను. నాకు ఎరుక ఉన్నది అంటున్నాను.

వీ.ప్ర : ఆలోచనలు ఉన్నాయి అని చెప్పారమ్మా మీరు.

అమ్మ : ఎరుక చెప్పిన తర్వాత ఆలోచన అన్నాను అదే ఎరుకంటారా అని మీరన్నారు. అవును అని నేనన్నా. అట్లా పడుకోవడానికి కారణం నాన్నగారు వివరించారు. ధర్మయ్యగారు రావటం - నాకు భృకుటిలో నుండి రక్తం రావటం - వివేకానందుని లాంటి వాళ్లుకూడా ఇటువంటి స్థితిలో ఎక్కువ రోజులుండరని నాన్నగారికి ఆయన చెప్పడం-

అమ్మ : ఎందుక్కాదు? అంటే-

ఈలోకం కాదు. మరోలోకం ఉందనుకుంటున్నాడు వాడు. మరోలోకం కంటికి కనిపించడంలేదు. ఏదో దైవమున్నాడు. వాడిని చూద్దాం అని ముక్కుమూసుకుని కూర్చున్నాడు. ఈలోకం కాని మరోలోకముందని, వాణ్ణి చూస్తే - ఆ లోకానికి తీసుకు వెళతాడని కూర్చునేవాడు ఒకడు - వాడంటూ కనబడితే చిటికెనవ్రేలు పట్టుకొని కొండకు ప్రాకిస్తాడు అనేవాడు ఇంకొకడు. దైవాన్ని తన బిడ్డగా ఆరాధిస్తే తొందరగా అందుతాడని ఒకడు, భర్తగా ఆరాధిస్తే పొందగలుగుతానని ఒకడు - ఇన్ని రకాలుగా చేసి చివరకు వాడిలో తానైపోదామని చేసేవాడు ఒకడు - లోకం వైపు చూడడు. లోకంతో పనిలేదు వాడికి. వానితోనే పనిఉంది వాడికి. కృష్ణుని తల్లిగా ఆరాధించిన వారున్నారు. కృష్ణుని బిడ్డగా ఆరాధించిన వారున్నారు. రకరకాలుగా ఉన్నారు. వీరందరూ లోకంతో పనిలేకుండా, విగ్రహమే సర్వమనుకుని తతిమ్మావన్నీ వీడు నిగ్రహించుకుని - ఏం చూస్తాడు? విగ్రహములో నుండే ఈ ప్రపంచమంతా తాను చూద్దామని లేదు. వాడే తనైపోదామనుకుంటాడు. తాదాత్మ్యం పొందు తాడు.అంటే ఎక్కడ చూచినా వాడే కనబడుతున్నాడు. ఎక్కడ చూచినా వాడే కనిపించాలని చేస్తున్నాడు. వాడు చేయట మందుకు.

వీ.ప్ర : ఎక్కడ చూచినా ఆబ్రహ్మాన్ని చూడలేని స్థితి సాధనస్థితే కదా? కళ్లు మూసుకున్నా, కళ్ళుతెరిచినా, ఏదిచూచినా బ్రహ్మమే అనిపించేవరకూ అది సాధనా స్థితే.

అమ్మ : శంకరాచార్యుల వారు ఏవూరుపోతే ఏ దేవుడి దగ్గరకు వెళితే అన్నింటిలోనూ శక్తి చూశాడు. తులసీదళం మొదలు కొని, సర్వత్రా ఆశక్తినే చూచాడు. ఎక్కడి కక్కడ ఎన్నో స్తోత్రాలను చదివాడు. ఆ ఒకటే చూచాడు గనక అద్వైతి అయినాడేమో ననుకుంటాను. అన్నింటిలోనూ శక్తిని చూచాడు. కనపడింది దైవం. చూచింది భక్తుడు. ద్వైతం లేకపోతే స్తోత్రం లేదప్పుడు. చూచేటప్పుడు రెండుగా ఉన్నాయి అనుభవించేటపుడు ఆ ఒకటిగా అనుకున్నాడు. అయితే ఆ ద్వైతం మాత్రం రెండుగా కనిపించదు. దృష్టితో చూచేంతవరకు రెండుగా చూడక తప్పదు ఎవరికైనా. భావం ఒకటే అనిపించేది. ఈ ద్వైతాలూ ఆ ద్వైతాలూ భేదం వీళ్ళకేగాని, చూచేవాడికి లేదు. భగవంతుడికి తాను వేరుగా ఉండి, ఆ పంచదార తిందామనుకున్న ద్వైతి, అన్నింటిలో ఆ ఒకటే చూచేటువంటి అద్వైతి - అంతా అయిందీ అర్థం కానిదీ అన్నదందుకే, అద్వైతమంటే అర్థం కానిదీ అంతా అయినదీ అన్నదెందుకు? ఫలానా అని అర్థంకాదు.

వీ.ప్ర : ఒకటిగా చూడగలిగి నటువంటివాడు అంతటా తీపినికూడ చూస్తాడు. చూస్తేనే అంతటా చూడగలుగుతాడు తప్ప, ఆభక్తి పరిణతి లేకపోతే ఈ రకమైనటువంటి స్తోత్రాలు చేయటం సాధ్యమయ్యేదిగాదు.

అమ్మ : ఎవరేం చెప్పినా సరిపోతుంది అనేనాకు ఎన్ని దిక్కులు చూచినా తీపిగానే ఉంటుంది. వాళ్లు చెప్పింది ఆకాస్త తీపితిన్నారు గదా అనుకుంటాను వీళ్లు చూశారు అనిపిస్తుంది. వీళ్లు రుచి చూడలేదనిగాని, వీళ్ళకేం తెలియదని గాని నాకని పించదు.

వీ.ప్ర : అలాగే పరమహంస....

అమ్మ : పరమహంస అమ్మను చూశాడు అమ్మనాలో ప్రవేశించింది అన్నాడు. ఇంతవరకు కంఠగతమైంది ఇకనేను చెప్పలేను అన్నాడు. ఎందుకు మాట్లాడలేవు? ఎందుకు చెప్పలేవు? ఏది నిండింది? అంటే ఆకనబడేది

నాలోపలికి ప్రవేశించింది అన్నాడు. బయట ఉన్నది ఇప్పుడు లోపల ప్రవేశించినది. సాధన సమయంలో బయట ఉన్నది. ఇప్పుడు లోపల ప్రవేశించినది. నిండిపోయింది. ఇప్పుడు మాటరాదు అన్నాడు, సాకారసిద్ధి.

సాకార, నిర్వికారమని కబుర్లు చెప్పుకుంటారే అట్లాంటివాటిల్లో ఆయన సాకారసిద్ధి పొందినట్టుగా, సిద్ధి పొందటమంటే పోవటం కాదుగా? సిద్ధించినట్టే.

వీ.ప్ర : అంతకంటే గొప్పవాళ్ళు మాత్రమే అందరిలోనూ గొప్పతనం చూడగలుగుతారు.

అమ్మ : అజాతవాదం కూడా నాకు కాదనిపించదు ఎప్పుడూ ఉన్నదే (విశ్వం) కాబట్టి పుట్టలేదన్నాడు.

శ్రీపాద : మార్పేలేదన్నాడు.

అమ్మ : మార్పులేకుండా చూశాడేమో!

శ్రీపాద : ఉన్నదన్నా! అయితే వాడు దయ్యాన్ని చూసుంటాడు.

అమ్మ : దయ్యాన్ని కూడ దైవంగా చూశాడేమో మరి.

శ్రీపాద : చూడలేదేమో?

అమ్మ : ఎందుకంటే గౌడపాదులు ఒకతల్లి గర్భవాసంలో పుట్టినవాడే. ఒకప్పుడు లేనివాడు, పుట్టినవాడు. నాకు 54 సం॥లు అంటే అంతకు ముందు నేనులేనిదాన్ని. గౌడపాదులకు అటువంటి వయస్సు ఒకటి అంటూ వచ్చిఉండాలి. అంతకు ముందు లేనివాడు ఒకతల్లి గర్భవాసాన పుట్టినటువంటి కాల మొకటుంది. తానుపుట్టినప్పుడైనా జగత్తు పుట్టిందిగా! జగత్తు తను పుట్టినప్పుడేవుంది. తను లేకపోతే జగత్తులేదు. జగత్తంటే వేరుకాదు. తానే జగత్తు. అందువల్ల, జగత్తు పుట్టలేదన్నాడు గనుక రైటుకాలా?

నేను పుట్టినప్పటి నుండి జగత్తుఉంది అనంటే బాగుండేది. స్వప్నవత్ అన్నాడు. నేను పోతే నీకు స్వప్నం. ఇంకొకటి పుడుతున్నప్పుడు

వాడికి స్వప్నం. నీకు జగత్తు సత్యమేకదా! ఆయనకూ ఒకప్పుడు పుట్టడం, ఒకప్పుడు చావటం జరిగింది. ఎక్కడ పుట్టావూ? జగత్తులోనే పుట్టావు. స్వప్నంలో పుట్టలా. నీకు అమ్మ అంటూ ఉంది అమ్మ కలా? నీవు పాలుత్రాగటం కలా? నీవన్నం తినటం కలా? నిద్ర పోవడం కలా? నేను పుట్టలేదు అనటంకలా? పుట్టలేదు అనేదికూడ కలేఅయితే - జగత్తు పుట్టలేదు అనేదికల. జగత్తు కలా? నేనుపుట్టలేదు అనేదికలా? అజాతమనేది కలా?

వీ.ప్ర : ఈ సిద్ధాంతంకూడ లేనిదే. గౌడపాదుల సిద్ధాంతమే లేదు.

అమ్మ : సిద్ధాంతం ఉందని నీవు చెప్పడానికొచ్చావు.

## 17-4-76

అమ్మ : అన్నీ సరిపోతున్నాయంటే సరిపెట్టుకోగలనా. అన్నీ సరిపెట్టుకోగలను.

శ్రీపాద : అన్నింటికీ సరే గనుక దీనికి సరే.

అమ్మ : వాసుదాసుగారి నామసంకీర్తన బాగుంటుంది. భజగోవిందం శ్లోకాలు అంతకంటే బాగుంటాయి. శంకరాచార్యుల స్తవాలు ఏదీ తీసివేయడానికి వీలుండదు. అన్నీ బాగానే ఉంటాయి. ఆపేరుపెట్టి అన్నింటిలో ఒకటే చూచాడు అని అనుకుంటున్నాను. పేర్లు మార్పులో ఒకటేచూచాడు అని అనుకుంటున్నా, శంకారాచార్యులేగాదు ఎవరైనా సరే దృష్టి ఉన్నంతవరకు రెండుగా కనుపించక తప్పదు. భావం ఒకటిగా తోచక తప్పదు. అనుభవంగలవాడి విధానమది. దక్షిణామూర్తి, ప్రసాదు రెండుగా కనపడు తున్నారు. ఈరెండూ ఆ ఒకటేనని అనిపిస్తుంది. అ ఒకటేఅంటే ఏమిటంటే మీరు ఆస్థితికి వస్తేనేగాని అర్థం కాదు అన్నారు. వాళ్ళు చెప్పింది అవాఙ్మానస గోచరం అన్నారనుకో! నే చెప్పింది దగ్గర దారిగాఉన్నట్టు ఉంటుంది. యదార్థ మేమిటంటే "నీవు కృషి చెయ్యి" అన్నారనుకో. వారు కాదు చేసేది అని నేనన్నా - జన్మ కర్మతో వస్తుంది. - అనుకున్నవాళ్ళు కర్మకు కర్త ఉన్నాడు అనేది మర్చిపోయి

మాట్లాడుతున్నారు. అవసర మొచ్చినప్పుడు తీసివేస్తున్నారు. వాడిని. ఒక్కొక్కసారి కలుపుకుంటున్నారు ఆకర్తను. ఆకర్త అంటే శక్తే. శక్తిని కర్త అనుకుంటున్నాం.దైవాన్నే శక్తి అనుకుంటున్నాం. దైవమనే మాటకు అర్థమేమిటి? దైవ మంటే ఏమిటి–ఈ మాటకు నాకర్థం ఎవరూ చెప్పలేదు. చెప్పలేక, నాకు తోచక నేను శక్తినే దైవమంటున్నాను. శక్తి అంటే రకరకాలుగా ఉండవచ్చు. గుడ్డలో ఒక రకంగా ఉండవచ్చు. మనిషిలో ఒక రకంగా ఉండవచ్చు – Battery light ఒక రకంగా ఉండవచ్చు. పచ్చడిలో ఒక రకంగా అన్నంలో ఒకరకంగా, అశుద్ధంలో ఒకరకంగా రకరకాలుగా మారవచ్చు. ఒకే అన్నం రక్తంకావచ్చు, మాంసం కావచ్చు, ఎముకకుపుష్టి ఇవ్వచ్చు, కండరాలు కావచ్చు, గుబిలి కావచ్చు, పుసి కావచ్చు, చీమిడి కావచ్చు, లాలాజలం కావచ్చు, నాలుకమీద పాచికావచ్చు. ఈఆహారమే ఇన్ని రకాలుగా అయింది. ఈగుణ భేదంలో ఉన్నశక్తి ఒకటే అనుకుంటున్నాను. వస్తువుగా మారేటప్పటికి గుణభేద మొచ్చింది. వస్తువు శక్తి గదా అంటే శక్తే. ఉన్నటువంటి యథార్థంగా కనబడుతున్న వస్తువునుశక్తిగా నమ్మదానికి ఇష్టం లేదు. ఇదంతా ఊహ. ఏదో ఉన్నదనుకున్న ఆత్మనశించేది కాదు, పోయేది కాదు శాశ్వతమైంది – అనే మాట నిలిచింది గాని – అశాశ్వతమైంది ఏది అంటే నిరూపించి, ఇట్లా ఉంటుంది అని చెప్పలేనిది అన్నారు. దానినే నేను శక్తి అంటున్నాను. వాళ్ళు ఆత్మ అన్నదే నేను శక్తి అంటున్నాను. శక్తికిరూపమిస్తున్నాను నేను. ఏర్పడే వుంది శక్తి. ఇటుకరాయిలో ఒకరకంగా ఉంది, సున్నంలో ఒక రకంగా ఉంది, Cement లో ఒక రకంగా ఉంది. చేసే వాడిలో ఒక రకంగా ఉంది. దీన్ని Science అంటున్నారు వాళ్ళు. కనపడే వస్తువులో గమనించేది సైన్సు అంటున్నారు వాళ్ళు.

## 15-4-76

అమ్మ : గౌడపాదులు లేరుకాని, గౌడపాదుల మాట నిలిచిందిగా!

వీ.ప్ర : పురమే లేకపోతే అంతఃపురం ఎక్కడి నుండి వస్తుంది.

అమ్మ : గౌడపాదులులేరు. గౌడపాదుల మాట నిలిచింది గాబట్టి జగత్తు సత్యం. అందర్నీ సమన్వయం చేసుకోవచ్చు. మనసుకు adjust చేసుకొనేవి కొన్ని కొన్ని వుంటాయా? మనస్తత్వం..... ఇప్పుడాయన ఉన్నారు. adjustment అన్నారు. ఒక్కొక్కరు ఏదీ సరిపెట్టుకోలేరు.

వీ.ప్ర : ప్రతి ఒక్క మనసూ సరిపెట్టుకొంటుందమ్మా.

అమ్మ : అమ్మ చెప్పితే వింటాను అంటాడు. అమ్మ చెప్పేది వాడిష్ట ప్రకారం చెబితేవింటాడు.

వీ.ప్ర : అన్నీ ఇష్టమైనప్పుడు, అమ్మ చెప్పిన మాటలు ఇష్టం కావచ్చు.

అమ్మ : అన్ని వేళలా కాకపోవచ్చు

వీ.ప్ర : అమ్మే అంతా అనుకొనేవాడికి, అమ్మ ఏం చెప్పినా ఇష్టం కావచ్చు.

అమ్మ : నాకందరు చెప్పేది సరిపోతుంది నాన్నా. ఈ మేడమీద నిల్చుంటే ఏ దిక్కున ఏ చెట్లున్నాయో కనిపిస్తున్నాయి. బహుశా వాడి దొడ్లో ఇది వేసుకున్నాడు అనిపిస్తుంది. ఇది నీడ కోసమని, అది ఇంకొక దాని కోసమని అనుకుంటున్నా. అట్లాగే వీడందుకు అని వుంటాడులే, వృధాగా ఎందుకు అని వుంటాడు అని అనిపిస్తుంది. దొంగ వచ్చాడు. వాడికింట్లో ఏమీ లేదు. సోలెడు బియ్యం తీసుకెళ్ళాడు. వాడికా సోలెడు లేనందువల్ల తీసుకెళ్ళాడులే అనుకుంటాను. వాడికది అలవాటు కావచ్చు, మరేమైనా కావచ్చు. ఎందుకైనా గానీ ఆకలివల్ల, అబాధవల్ల ఈసోలెడు బియ్యంతీసుకెళ్లాడని సరిపెట్టుకుంటా. నాది సరే తత్వం. దేనికైనా సరిపెట్టుకునే తత్వం నాకొకటుందిగా మరి. ఈ సరే అనేది అన్నింటికీ సరే. అది ఎంతపనైనా చేయిస్తుంది. అది జీవితాన్ని ఎంత దూరమైనా నడిపిస్తుంది.

వీ.ప్ర : అది నీకే తగు.

అమ్మ : మన ఇంట్లో అంత ఎత్తు పిల్లులు 14 ఉండేవి. కుక్కలు సరేసరి. ఇన్ని లేవు. ఇట్లా వుండేవికావు. ఆ కాలానికి తగి నట్లుగా పరిమితిగా ఒకటో రెండో ఉండేవి. ఒక కుక్క గాలివానకు కొట్టుకు వచ్చిన దానిని నేపెంచాను. ఆకుక్క సంతతి 10 లేక 15 కుక్కలను కనింది. దాని వాటిలో ఒక దానికి పిచ్చెక్కింది. దాని పిల్లలు మూడో నాలుగో ఉంటే అన్నింటినీ చంపేస్తాయట-అప్పుడు వెంకటేశ్వర్లు అని Driver ఒకడుండేవాడు. అతను కొట్టిచంపించే యత్నం చేశాడు. అందులో ఒక కుక్క తప్పించుకొని నేను చల్లచేస్తూ వుంటే వచ్చి మజ్జిగ చుక్కలు నాకి నాకాళ్ళ దగ్గర చచ్చిపోయింది. దానికి గలిగిన కుక్క ఒక పిల్లికి పాలిచ్చింది. ఆకుక్కకు - కొన్ని కుక్కలు కలిసి పాలిచ్చేస్థానాన్ని చీల్చిపెట్టాయి. చర్మాన్ని తోకతో రాచుకుంటూ తిరుగుతుంటే ఆతోకను పట్టుకుని, ఆకుక్కపిల్లలు పాలు త్రాగుతుంటే మధ్య మధ్యన పిల్లులు త్రాగుతుండేవి. దానిని పిల్లులు నాకుతుండేవి.

ఒక రోజున నాన్నగారు అన్నారన్నమాట. ఆవరణానికి Symbol గా ఉంది ఈ కుక్క అని.

సో : నీ దగ్గర జంతువులు జ్ఞానులుగా ఉండేవా?

అమ్మ : నాదగ్గరవి నాకు తెలిసేవుంటాయి అంటాను. నాదగ్గరి జంతువులే జ్ఞానులని నేననను. నా కర్థమై ఉంటాయంటాను.

సో : వాటిలో జ్ఞానులు ఉంటాయా? ఉండవా?

అమ్మ : వాటిలో జ్ఞానులున్నాయని నేననుకుంటున్నాను. నాన్నగారు ఊరి నుండిరాగానే ఒక పిల్లివచ్చిగీరుతూ సంజ్ఞచేసేది, నాన్నగారు వచ్చినట్లుగా. ఒకరోజు నేను పడుకుంటే 14 పిల్లులు వచ్చి మీద పడుకున్నాయి. పూండ్ల నుండి మాణిక్యమ్మగారు వచ్చి ఆ దృశ్యాన్ని చూసి, నే కనిపించకుండ ఉన్నాననుకుని 'అమ్మలేదు' 'కొండచిలువలాంటి పాము

ఉంది' అని తలుపుచాటుగా చూచి వెళ్ళబోతున్నది. ఆమె తలుపు దగ్గరకు రావటంతో పిల్లులు చూచి లేచినవి. ఇస్తళ్ళ మీద పడేవికావు. అక్కడొకపాక ఉండేది. అందులో రాముడి ఫోటో ఉండేది. నాన్నగారు తెల్లవారు ఝామున కొంతసేపు, కాసేపు దిబ్బమీద జపం చేసుకొనేవారు. నన్ను వచ్చి కూర్చోమంటే వెళ్ళి కూర్చునేదాన్ని 'నిన్ను మనసులో పెట్టుకొని కూర్చుని చేస్తే తప్పా? అని' అడిగారు చేయవచ్చు అన్నాను. నాకు దేవుడయినప్పుడు - వీళ్ళు వారికి కావటంలో తప్పులేదని నాఅభిప్రాయం. ఏదైనా పొరపాటు జరిగితే నెత్తి అణుస్తుందని, పనికిరాదని-

గంగరాజు శ్రీహరిగారు, బొమ్మపనికి రాదన్నారు (నాన్నగారు) అష్టాక్షరీ మంత్రం చెప్పించుకున్నారు.

నాన్న : చీరాలవాళ్ళు వచ్చినతర్వాతనే పూజలు ప్రారంభించారు.

అమ్మ : అంతకుముందు బ్రహ్మయ్యగారు పూజ చేశారు. ముందు పూజ ఎక్కడ అని అడిగితే, తెనాలిలో నారపరాజు సుబ్బారావు అని ఉండేవాడు. వారి ఇంట్లో, వారి బంధువులమ్మాయి శ్యామల ఉంది. ఆ అమ్మాయిదే మొట్టమొదటి పూజ.

తాతగారికి కురుపు లేచినపుడు (నాన్నగారు) మీరు చూడటానికి వచ్చారు. చంద్రమౌళి సత్యనారాయణ ఇంటికి మందుకని వెళ్ళాం. మీరు, నేను కలసి వస్తుండగా ఆ రోజు ఆ అమ్మాయి నన్ను చూస్తూ చూస్తూ ఎందుకో పడిపోయింది. ఎందుకిట్లా పడిపోయావంటే 'నీలో నాకేమిటో కనిపించింది' అని తనింటికి తీసుకెళ్ళింది. అందువల్ల నారపరాజు సుబ్బారావింట మొదటి పూజ. తర్వాత ఆ అమ్మాయి నాతో వస్తుంటే మీరు చూశారు. చీరాలలో అందరి కంటేముందు చేసినవాడు బ్రహ్మయ్య. బ్రహ్మయ్య తర్వాత డాక్టరుగారు, డాక్టరు గారి తర్వాత గోపాలరావుగారు (గజేంద్రమ్మ అన్న).

ఒక ముక్కోటినాడు కొబ్బరికాయ కొట్టుకోవాలనుకొని – నీవేకూర్చో, ఇంకెవరికీ కొట్టను ఇక్కడే కొట్టాలి, అని పూజచేసుకున్నాడు గోపాలరావు. "నీవుండగా ఈ పటాలకు, ఈ దేవుళ్ళకు నేనెందుకు కొట్టాలి? నీవు కనబడుతుంటే ఇంకొక దేవుడికి కొబ్బరికాయలు కొట్టడమేమిటి" అని ఆరోజు వారు పూజ చేసుకొన్నారు.

నాన్న : చీరాల వారంతా పసుమలైస్వాములవారి పద్ధతి ఏదో ఉన్నదండి. ఆపద్ధతి ప్రకారంగా మీ అమ్మగారిని కూర్చోబెట్టి పూజలు చేస్తుండేవారు. కొన్నాళ్ళు నన్ను కూడ కూర్చోబెట్టే వారు. వారు మంత్రాలు ప్రారంభించగానే నేలేచి వెళ్ళిపోయే వాడ్ని. తర్వాత తర్వాత నేను మానుకున్నాననుకోండి. పూజలను గురించి ఎందుకడగవలసి వచ్చిందంటే పూజ మొదలు పెట్టేటప్పటికల్లా మీ అమ్మగారికి కళ్ళు మూసుకు పోయేవి. శరీరమంతా కూడా క్రమంగా బిగుసుకు పోయినట్లుండేది. రకరకాల ముద్రలు వాటంతట అవే వస్తుండేవి. రకరకాల కాంప్లెక్షన్స్ వచ్చేవి. ఒకసారి ఎర్రగా, ఒకసారి తెల్లగా, ఒకసారి గంధపు రంగుగా ఇన్ని రకాలరంగుల్లో వస్తుండేవి. అనేకముద్రలు వస్తుండేవి చేతులు automatic గా ఉండేవి. ఇన్ని అనుకుంటున్నాము గనుక అడుగుతున్నాను.

అమ్మ : ఆరాధించేవాళ్ళకు – ఏ దేవతకు ఏ ముద్రల ముఖమను కుంటున్నారో అలాంటివి వాటంతట అవే వచ్చేవి.

నాన్న : మీఅమ్మగారు ముద్రలతో ఉన్నప్పుడు – మనం ప్రయత్నం చేసి గట్టిగా లాగినా అవిచెదిరేవికావు. యధారీతిగా అంత సులభంగా వచ్చేవి కావు. క్రమంగా సామాన్యస్థితి వాటంతట అవే వచ్చేవి. పూజయిపోయిన అర్ధగంటకు కాని అతిశ్రమ మీద కళ్ళు తెరవటం జరిగేదిగాదు.

అమ్మ : కళ్ళు మూసుకున్న తర్వాత అంతేకదా?

నాన్న : ఆ రోజు ముక్కోటి ఏకాదశి. డాక్టరుగారు తదితరులు అందరిదీ పూజ అయిపోయిన తర్వాత ఎవరో ఒకరు పూజకు పళ్ళు చేతిలో

పెట్టబోయారు. ఇంతలోనే దజను ముద్రలు ఒక్కుమ్మడిగా, ఒక దానివెంట ఒకటి వచ్చేవి. మురళీకృష్ణుడు లాంటి ముద్రలు, తదితరమైనవి. ఎన్నో – బహుశా అనాడు తీసిన ఫోటోలు కూడ ఉండాలనుకుంటాను. ఆ ముద్రలు రావటమనేది ఏమిటి? వారు మనసులో ఏమి కోరు కుంటున్నారో అదే ఇక్కడ ప్రస్ఫుటమౌతున్నదా?

అమ్మ : ఆ చోట నిల్చున్నవాడికి అదిక్కడే అవుతుంది. వచ్చిందల్లా, నడచిందల్లా ఇక్కడే. బాపట్లకు నడుస్తున్నాను. ఇక్కడ వుంటే, బాపట్ల అక్కడయింది. కాని నడుస్తున్నప్పుడు ఎక్కడుంటే అదిక్కడే అవుతుంది. అనుభవించిందల్లా అదే ఇదవుతున్నది. అది అనేది పోతున్నది. ఇదే అవుతున్నది. ఇదికూడా లేని స్థితి భారం అవుతున్నది. మనసుకందేదవుతుంది. కంటికి కనిపించేదాకా అదికూడ పోవాలిగదా!

సందేహానికి తావు లేనిదని ఎందుకంటున్నానంటే మనసుకు సందేహంరాదు. ఇది కాదు, ఇది అవును అనే సందేహంరాదు. ఆ దృఢత్వం ఏర్పడటమే.

సో : ఉన్నదే ఇదని మొదలు పెట్టాలా?

అమ్మ : లేనిది ఇది అని మొదలు పెట్టినాసరే. భగవంతుడు పూర్తిగా లేడనుకున్నవాడు, ఏ సందేహం లేకుండా, ఏ పరిస్థితుల్లోనూ, అన్ని వేళల్లో లేడనుకున్నవాడూ – అన్ని వేళల్లో ఉన్నదే ఇది అనుకునే వాడికి తేడాలేదు. మళ్ళీదానిలో తొట్రుపాటుండ రాదు. ఏ పరిస్థితుల్లోనూ లేదు అని నిశ్చయించుకున్నవాడు, వేరే ఏం లేదు, నేను తప్ప ఇంకొకటి లేదు అని నిశ్చయించుకున్న వాడున్నాడనుకో! అంతకంటె కావలిసింది లేదు.

సో : కమ్యూనిష్టులు భగంతుడు లేడు అంటున్నారుగా!

వీ.ప్ర : మానవుడే ప్రతిదీ నిర్ణయిస్తాడు అనే సిద్ధాంతంకాదు. సృష్టిలో బలమైన శక్తులున్నాయి. ఆ శక్తుల గతిని గమనించి పనిచెయ్యాల్సిందే తప్ప –

మానవుడే అన్నీ చేయగలుగుతాడని కాదు. Natural force అంటారే గాని, Supernatural అనరు దాన్ని. అధి భౌతికశక్తి కాదు, భౌతికశక్తే. మానవశక్తికి మించిన శక్తి. భౌతికం, అధి భౌతికం అనేది భావనే.

అమ్మ : పూర్తి కమ్యూనిజానికీ, అద్వైతానికీ తేడా లేదు.

వీ.ప్ర : జడం నుండి పుట్టినదే చైతన్య మంటారు.

అమ్మ : ఊరక జెండా పట్టుకున్న వాడుకాకుండా........

వీ.ప్ర : నేనసలు లేననుకున్నా - అంతా అదే అనుకున్నా చివరకదే. నేను అనేది లేనే లేదు - అంతా నేనే అనుకున్నా ఒకటే.

అమ్మ : జ్ఞానమంటే అంతా తాను కావటం. స్వర్గముంది, మోక్ష ముంది, సాయుజ్యపథముంది. కొంతకాలమక్కడ ఉండి భూమ్మీదకు వస్తాదు అనుకున్న పద్ధతిలో కాదు. ఎవరో! అంటే మళ్లీ పుడతాడను కున్నవాళ్లకును జీవుడుగా ప్రత్యేకించి లేదు. ఒక చోటు అంటూ లేదు. కొంత కాల ముండటం లేదు. పోయిన తర్వాత ఇద్దరికీ పొందే స్థితి నీటి బుడగలాంటి స్థితి.

సో : అందరికీ?

అమ్మ : బుడగలంటున్నారుగా? బుడగలు కూడ నీరే అవుతుంది.

శ్రీపాద : పోకముందు నేను అంతలో ఉన్నవాణ్ణి అని అనుకుంటాడా? తెలుసుకుని పోతాడా? తెలుసుకోకుండా అంతలో అయి పోతాడా?

అమ్మ : తెలుసుకుంటాడు. ఒకడు అకస్మాత్తుగా యాక్సిడెంటులో పోయాడు. వాడికాక్షణంలో కూడా తెలివుంటుంది. వాడికి తెలుసునని మనకు తెలియదు.

శ్రీపాద : తెలివి ఉండి అంతలో భాగమే. తెలుసుకొనే చచ్చిపోతాడు. తెలుసుకోకుండా ఎవడూ చచ్చిపోడు.

అమ్మ : సుగతి అని ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే పుణ్యమైన పనులు చేసినవాడు మంచిజన్మ ఎత్తుతాడని అంటున్నారు గనక, చెడ్డపని చేసినంత మాత్రాన

నీకు నరకం లేదు అని చెప్పటం. ముసలివాడికి ఇంత జ్ఞానమిచ్చావమ్మ నిన్ను తెలుసుకున్నాడు, నాగతేమిటి? అనడిగినప్పుడు వాడి గతే నీగతే - అందరికీ సుగతే' అన్నాను. ప్రపంచంలో అనుభవించే అనుభవాల్ని గురించి డబ్బు, ఆరోగ్యం, మంచి ఉద్యోగం, మంచి ఇల్లు వాకిలీ ఇన్నింటి పూర్వజన్మలో మంచిపనులు చేశాడు గనక ఇటువంటివి లభ్యమైనాయని అనుకొంటున్నాం. కోరే కోరికలన్నీ ఇక్కడ ఉండేవి లౌకికమైనవే కోరుతున్నాం. ప్రాణం విడిచిన తర్వాత సంగతేమిటని ఆలోచిస్తే అందరి ఒకటే గతి. ఏ మార్గమన్నా కానీ చేరేది ఒకచోటకే. సముద్రంలో అలలొస్తున్నవి అని నా అభిప్రాయం వచ్చే అలలన్నీ చిన్నవి రావచ్చు పెద్దవి రావచ్చు. వచ్చే అలలన్నీ ఒక కారణంతోనే వస్తున్నాయి-వెనక్కి పోతున్నాయి.

సో : కానీ చివరి క్షణంలో జ్ఞాని ఔతాడంటావు.

అమ్మ : అందరికీ గమ్యం ఒకటే. ఇన్ని లేవు.

## 20-4-76

అమ్మ : మీరు పడే బాధ ఏదోపడండి. సరిపోతుంది. నన్నడిగింది నే చెప్తాను

వీ.ప్ర : మీరు గతసంగతి చెబుతూ మానేశారు. ఆయన సకల కల్యాణ గుణ ప్రపూర్ణుడైనటువంటి వాసుదేవ స్వరూపమే. వాసుదేవుడే ఉన్నాడని చెప్పే అనేక జన్మలు ఎత్తేవాడు, తనకర్మ పరిపాకం చేత అది గుర్తిస్తాడు వాసుదేవుడి దగ్గర చేరడంకోసం ఇది మార్గమని చెప్పే - దానికి సంబంధ మాకు ఎటు వెదికినా దొరకలా. వాసుదేవః సర్వమితి అంటే సకల కల్యాణ గుణ ప్రపూర్ణుడనే అర్థం ఎక్కడాలేదు.

శ్రీపాద : మధ్య ఫిలాసఫీ వాళ్ళ గొడవేవేరు.

వీ.ప్ర : వస్తు గుణంగా ఉన్నటువంటి, వేరుగా ఉన్నటువంటి, వాసుదేవుని గుర్తించిన వాడు అనేక కర్మల పరిపాకం చెందటం మూలంగా వా దగ్గరకు చేరతాడు.

శ్రీపాద : అందుకనే నేను చెప్పినవే విను. నీవు సంస్కృతం చదవద్దు అన్నారు.

అమ్మ : జీవులు ఉండవచ్చు. వీళ్లే అని కాదుగా.

వి.ప్ర : జీవులు అన్నది సృష్టించాయండి. మనుష్యులు అనా? జీవమునా?

అమ్మ : అనాదిగా మనుషులు లేని కాలముందా? మనుషులున్న కాలమేనా? లేనికాలం లేదు. అన్నీ ఎప్పుడూ ఉన్నవే. జీవ మంటే నేననేది అంతా సజీవమను కున్నప్పుడు.

శ్రీపాద : నేనొకవ్యక్తి అని అనుకుంటున్నాను. వ్యవహరిస్తున్నాను. ఇలాగే వ్యవహరించేవాళ్ళు జీవులు అని పేరు పెట్టుకున్నారు. ఇలా అనుకునేవారు అనాదులుగా వుండగలరా? క్రిములూ జీవులే. Bacteria జీవులే.

అమ్మ : సజీవంగా అనుకుంటే ఎప్పుడూ జీవం ఉంది.

శ్రీపాద : జీవం ఉంది. ఈ రూపంగా ఉందనదానికి వీళ్ళేదు.

అమ్మ : మీరుచెప్పే 'ఏమీబా'కు కూడ జీవమున్నప్పుడు, మనస్సున్నప్పుడు - ఎప్పుడూ జీవం ఉంది.

వీ.ప్ర : భూమి పుట్టిన తర్వాత Amoeba version రాలేదమ్మా.

అమ్మ : సంఘటనల వల్ల నీవు గుర్తించిన తర్వాత కాదు – అది ఇంకొక రూపంలో వుంది.

వీ.ప్ర : Amoeba గా మారగలిగిన వస్తువున్నది.

అమ్మ : అది జీవమే.

వీ.ప్ర : ఆ రెండూ సంశ్లేషణ జరిగిన తర్వాతే Amoeba ఏర్పడింది.

అమ్మ : అది జీవమే. దానికి జీవం లేకపోతే ఇది ఇట్లా రావటానికి వీల్లేదు.

శ్రీపాద : అది తన్ను తాను Reproduce చేసుకోలేదు. Amoeba Reproduce చేసుకుంటుంది.

అమ్మ : చేసుకోలేక పోవచ్చు. జీవంగా ఉంది. అట్లా గుర్తించగలిగిన మనిషివలే నేను ఈ పనిచేస్తాను అని అనుకోకపోవచ్చుకాని లేనికాలం లేదు.

శ్రీపాద : ఇలా వుండి వుండకపోవచ్చు.

అమ్మ : ఆ!

వీ.ప్ర : Amoeba గా మారగలిగినది ఒకటివుంది. ప్రాణవాయు వుంది. కార్బనం వుంది. రసాయనికంగ విశ్లేషిస్తే ఇవి మిగలవచ్చు. ఇవన్నీ హఠాత్సం ఘటనగానో, ఇంకొక రకంగానో అన్నీ కలసి Amoeba గా మారింది అంటున్నాం. Amoeba మారగలిగిన వస్తుసముదాయ ముండవచ్చు గాని వాటికి జీవం ఉందంటారా?

అమ్మ : అంతకుముందు కూడ వుందని చెప్తాను.

శ్రీపాద : వాటిలో శకలాలుగా కూడ ఉంది. ఏశకలాలు కలియడం వల్ల మొట్టమొదట ఏర్పడినదో....

వీ.ప్ర : ఏకకణజీవిలో జీవం ఉందని అందరూ చెప్తున్నారు.

శ్రీపాద : ఏకకణజీవి ఏర్పడటానికి అవసరమై నటువంటి వస్తు సమృద్ధిలో కూడ జీవం వున్నది. ఆ రూపాన్నే లేదు.

వీ.ప్ర : ఏకకణ జీవిగానే మొదలు పెట్టలేదు. దానికి కావలసిన వస్తువులో కూడ Potential గా ఉందని

శ్రీపాద : Elementary గా ఉంది.

వీ.ప్ర : కనక elements ఉన్నాయి. కాని ఏ ఒకటికాదు. దీనిలో జీవముంది – దానిలో జీవముంది. రెండూ కలిస్తే ప్రాణం ఏర్పడుతుంది.

అమ్మ : సముద్రములో అలలు రావడానికి వాయువని ఎట్లా తెలిసిందో, అట్లే కొంతకాలానికి ఇదీ తేలుతుంది. మట్టిలో కూడా జీవముంది.

శ్రీపాద : కనుక జీవమెప్పుడూ ఉన్నది. ఏ శకలముల సముచ్ఛయము వల్ల ఏకకణజీవి ఏర్పడిందని అనుకొంటున్నామో శకలములలో భాగాలుగా అనుకున్నప్పటికీ జీవమున్నది.

వీ.ప్ర : రూపాంతరాలలో జీవమనేది ఎప్పుడూ ఉన్నది.

అమ్మ : జీవంలేని కాలంలేదు. రూపాంతరాలతో ఎప్పుడూ ఉన్నది.

శ్రీపాద : సృష్టి అనాది – సృష్టి సంకల్పం యొక్క ఫలం కనక సంకల్ప మనాలి.

సంకల్పము లేని కాలమేలేదు. సంకల్పము లేకుండా కేవలం ఉనికి మాత్రమే ఉన్న బ్రహ్మము లేదు ఎప్పుడూనూ.

అమ్మ : శాశ్వతంగా గుర్తుంది.. అదే శాశ్వతం అని అనంగాని, శాశ్వతానంద మంటే జడమై కూర్చున్నానని చెప్పినవాడు లేదు. ఒక శూన్యంలోకో, నిర్వికల్పమో - నిర్వికల్ప మనుకున్నా, ఏదో ఒక ఆనంద మనుకున్నా - ఆనందం పొందాడు. నేనై యున్నాడనుకున్నా తానై యున్నాడనుకున్నా, ఆత్మను చూచాడనుకున్నా, సత్తాను చూచాననుకున్నా, తానుగా ఉన్నాడనుకున్నా, ఎన్ని పేర్లు చెప్పుకున్నా - అక్కడ పొందేటప్పుడు ఒక భావం ఉన్నది. పోనీ అప్పుడులేదు. తర్వాతయినా పొందానన్న భావం మిగిలింది. అభావం ఆ పొందినస్థితి ఎప్పుడూ శాశ్వతంగా గుర్తుండటమే శాశ్వతా నందం. శాశ్వతానందంలో ఉన్నవాడు ఏదో యోగాన్ని చేస్తున్నాడని మనమనుకుంటాం గదా! శాశ్వతానందంలో ఉన్నవాడు ఎట్లా వ్యవహరిస్తాడు? కళ్ళు మూసుకుని కూర్చోలేదుగా! శాశ్వతానందమంటే - యోగికొన్ని పనులు చేస్తున్నాడు. స్నానం చేసి వెళ్ళి యోగాభ్యాసం చేసుకుంటున్నాడు. ఆత్మ సాక్షాత్కారమనుకున్నా అదే శాశ్వతానందమేమో, శాశ్వతానందములో ఉన్నవాడు పనులు చేస్తున్నాడుగా! ఎట్లా చేయగలుతున్నాడంటే ఆ గుర్తు శాశ్వతంగా ఉండటమే. శాశ్వతానందమా అని నేను అనుకొంటున్నాను. చేస్తున్నాడు అన్నవాడు కూడ చేశాడు. ఆ భావం మిగలటం, ఆ దృశ్యం గుర్తు ఉండటం అని నేను అనుకొంటున్నాను. పోనీ - నిర్వికల్ప సమాధిలో ఏభావం లేదు. ఆనందముంది. సంతోషం కాదు.దుఃఖం కాదు. ఏదీ కాదు. ఆనందమే తానై ఉన్నాడు అన్నారు. ఆనందమంటే నవ్వుకాదు. అక్కడ భావమే. భావరహితమైన ఆనందంలేదు. చెప్పటానికి వీల్లేదు తనుతానుగా ఉన్నాడన్నా-

రామక్రిష్ణ: ఆనందం అంటే నిర్వచన మేమిటి?

అమ్మ : తను తానుగా ఉంటున్నాడు.

రా.క్రి : శాశ్వతానంద మంటే, అశాశ్వతమైన ఆనందం ఒకటుందనేగా! ఆనంద మంటే?

అమ్మ : ఆనందమంటే సంతోషం కానిది. తానుగా ఉండేది అన్నప్పుడు - ఎరుక ఉంటుందంటున్నాను నేను.

నేను నిర్వికల్ప సమాధిని గురించి వారు చెప్తున్న దానికి, వాళ్ళు చూచామనుకున్న దానికి - నేను పొందానని చెప్పటం లేదు. ఇదై ఉంటుందని నేననుకుంటున్న భావమిది. భావంలేని ఆనందం లేదు. ఎరుక ఉందిగా! ఎరుక భావమే నాన్నా. ఆనందమంటే తానుగా మిగిలిందే నంటున్నారుగా! నేనెప్పుడూ ఎరుకతోనే ఉన్నా. నేనే పరిస్థితుల్లోనూ గుర్తు లేకుండా లేను. ఎరుక లేకుండా లేను. ఏ పరిస్థితుల్లోను కూడ.. ఉచ్ఛ్వాస నిశ్వాసలు ఆగిపోయినపుడు కూడ నాకు ఎరుక ఉంది. భావముంది.

సో : ఎరుకగా ఉండటం ఆనందమా?

అమ్మ : ఆనందం పొందానని కాదు. ఎప్పుడూ గుర్తుతోనే ఉన్నా.

సో : ఆనందమంటే ఎమిటో?

అమ్మ : వారు చెప్తున్న దానికి ఒక రూపం లేదు, నామం లేదు, మనస్సు లేదు, గుర్తులేదు, శూన్యమంటున్నారే - శూన్యం మాత్రం కాదు అని చెప్తున్నా. తప్పకుండా ఎరుకే అయి ఉండాలి అంటున్నా. (ఆనందం అంటే) - ఏది చూచి అతను ఆనంద పడ్డాడో - ఆ ఎరుక ఉండటమే ఆనందం కాని - కేవలం శూన్యం కాదు. శూన్యాన్ని గుర్తించినప్పుడు భావముంది. వారు చెబుతున్నది శూన్యమే. ఏమీ లేదంటున్నారు గదా! ఏమీలేని స్థితి శూన్యమన్నప్పుడు శూన్యంలో ఎరుక ఉన్నదంటున్నా. నేను శూన్యంలోకి చూస్తున్నాను గదా! అంటే ఆ శూన్యంలో ఎరుకైనా ఉన్నది గదా!

వీ.ప్ర : నిర్వికల్పం....ఎరుక, ఆనందం వదలెయ్యి. అమ్మనాకు భోజనం పెట్టింది. చాలా ఆనందంగా ఉంది. అమ్మ చేత్తో అన్నం పెట్టింది. అది ఆనందమను కోవటం శాశ్వతానంద మవుతుందా?

అమ్మ : లోకం చెప్పిన నిర్వికల్పం మీద దండెత్తుతున్నారు మీరు. కనుకవారు శూన్యంగా ఉన్నదే అన్నారు. శూన్యంగా ఉన్నాను అని అందులో గుర్తించింది – నేను లేకుండా పోయినాను అనే గుర్తు. నిద్రలో చెప్పలేవు గదా నీవు అంటారు. నిద్ర కాని స్థితి. శూన్యములో – శూన్యమై ఉన్నాను అనే ఎరుక మిగిలి ఉన్నదక్కడ. అది కూడ లేని స్థితి లేదు.

శ్రీపాద : మెలకువా? ఎరుకా....

అమ్మ : రెండూఉన్నాయి. అందుకు వారు ఏం చెప్పారంటే బెల్లం రుచి మీకేం తెలుస్తుంది. మనసుతో చెప్పలేక, వ్యక్తంచెయ్యలేక, నాలుకమీద వేసుకున్న వాడికి తెలుస్తుందని వారు చెప్పారు. ఎరుక మాత్రం ఎప్పుడూ ఉన్నది. ఎరుకలేని స్థితిలేదు.

వీ.ప్ర : ఎరుక ఎరుకగా మాత్రమే ఉన్నప్పుడు?

అమ్మ : ఆ మాట వాళ్ళు అనటం లేదుగా. శూన్యం అంటున్నారు, ఎరుకంటున్నారు. ఆనందమై ఉంటాడంటున్నారు. ఆనందం గానే ఉన్నానన్నాడు. తానానందమై ఉన్నానన్నాడు. తానానందమై ఉన్నప్పుడు కనబడేదీ, చూచేదీ ఒకటుందా? ఆనందం ఉన్నప్పుడు చూచేది ఉంది ఇంకొకటి. తానుగా ఉండే ఆనందమనే ఎరుక మిగిలింది. ఆ గుర్తు నిలవటమే శాశ్వతానందమా – ఎప్పుడు కావాలను కుంటే అప్పుడు చూస్తుంటారా?

వీ.ప్ర : అవసరమైతే తేల్చుకోగలరు. దానినే శాశ్వతానందమని వారన్నారు. అంత్యాయకమైన ఆనందం కాదు.

శ్రీపాద : అది గమ్యంకాదు.

అమ్మ : ఏది గమ్యమో మీరు చెప్పగలిగి ఉండండి.

శ్రీపాద : అది చెప్పగల్గుతాము.

అమ్మ : దాన్ని పోల్చుకోండి. అది కాదు అనవలసిన అవసరం లేదు.

రామక్రిష్ణ: ఆనందమంటే ఏమిటో చెప్పమ్మా అర్థమయ్యేటట్లు

వీ.ప్ర : తృప్తి, ఆనందం పర్యాయ పదాలేనా?

అమ్మ : నా దృష్టిలో అంతే

రామక్రిష్ణ: అస్థితి ఎట్లా ఉంటుంది? దాన్ని పొందటమెట్లా?

అమ్మ : తానే ఇన్ని అనుకునేది, కాసేపానందపడ్డాడు. అటువంటిది ఆనందం అయినా కాక పోయినా – శాశ్వతంగా, స్థిరంగా ఏకాల పరిస్థితుల్లోనూ తృప్తిపడ గలిగిన సంతృప్తి ఏదయితే ఉందో అదే ఆనందం.

ఒక పని అనుకున్నాం. కాగానే మనిషి ఆనంద పడుతున్నాడు అట్లా అయినా – కాకపోయినా అన్ని వేళల్లో అన్ని పరిస్థితులలో ఆ రకమైన తృప్తి ఏదయితే మిగిలివుందో అదే ఆనందం. మనమందరం కొన్ని విషయాల్లో, కొన్ని గంటల్లో కొన్ని నిముషాల్లో, రోజుల్లో, నెలల్లో ఆనంద పడుతూనే వున్నాం. కొన్ని సందర్భాలలో వచ్చిపోతున్నది. రుచిచూస్తునే వున్నాం. పంచదార చిలుకను ముక్కు నాలుకకు రాచుకుని ముక్కు తీయగా వుంది అనుకున్నట్లుగా రుచి చూస్తున్నాం. పూర్ణమైన పంచదార చిలుకను తిన్నస్థితి ఏది అంటే అయినా కాక పోయినా – ఉన్నా లేకపోయినా శాశ్వతంగా అన్ని వేళల్లోనూ మిగిలి ఉన్న తృప్తి ఎవరికైతే ఉంటుందో వాళ్ళది; అదే శాశ్వతానందం. అని నేనను కుంటున్నా. ఈతృప్తే అటువంటి ఆనందం.

వీ.ప్ర : ప్రతివాడూ ఎప్పుడో ఒకప్పుడు ఎంతో కొంత ఏదో ఒకవేళ ఆనందం అనుభవిస్తూనే వున్నాడు.

అమ్మ : ఆ రుచిచూస్తున్నాడనే నా అభిప్రాయం, నవ్వులోనూ ఏడుపులోనూ – సుఖంలోనూ దుఃఖంలోనూ అన్నివేళల్లోఆ తృప్తి వుండాలి.

సో : ఏడుపుకూడా ఆనందమెలా అవుతుందమ్మా?

అమ్మ : గాయం కూడా వాడిచ్చిందే అనే వాడు భక్తుడు. గాయంగా ఉన్నాడనుకునే వాడు జ్ఞాని. భక్తిలో జ్ఞానం-జ్ఞానంలో భక్తి ఉన్నవి. ఆ రెండూ వేరని నేననుకోలేను.

రామక్రిష్ణ: రెండు స్థితులూ ఒకటే.

అమ్మ : వారు మృత్యుదేవత, భాగ్యదేవత, దరిద్రదేవత అని చెప్పి ఉన్నారు గదా! దేవత అంటే శక్తి అనే కాబట్టి స్త్రీ పర్యాయంగా పేరు పెట్టారు. ఆ స్థిమితం రానిదే ఇన్ని ఎట్లా చెప్పి ఉంటారు అనుకుంటాను నేను.

వీ.ప్ర : వారెట్లా చెప్పినా నీ సమన్వయం బాగుంది.

శ్రీపాద : స్త్రీరూపం శక్తి అనే

అమ్మ : స్వరూపం విడిగా లేదు అని నా అభిప్రాయం.

వీ.ప్ర : నయమవటం భగవంతుడే, నయంకాక పోవటం భగవంతుడే అనుకుంటే.

అమ్మ : కోడలికి నయంకావటం అమ్మే. కూతుర్ని చంపిందీ అమ్మే అనుకొనే స్థితి ఏదైతే ఉందో అదే.

రామక్రిష్ణ: పడటానికీ, పడకుండా ఉండటానికీ ఒకే శక్తి కారణమని అన్నావుగదమ్మా

అమ్మ : శూన్యమనుకున్న దానికి ఆకృతి ఉంది. గుర్తు పట్టినప్పుడు ఆకృతి ఉన్నది. ఏమీ లేనిస్థితిలేదు. భావం ఉంది. శూన్యానికి అక్కడ రూపం లేదంటావా? శూన్యమనే భావమైనా ఉంది. గుర్తు - భావమూ ఒకటే. భావరహితంగా ఎప్పుడూ లేదు. గుర్తు కూడా భావమే. జీవుడికీ దేవుడికీ భావమే తేడా. అద్వైతానికీ విశిష్టాద్వైతానికీ తేడా కనిపించదు. శంకరుడు భక్తుడు కాడు అని నేననుకోవటం లేదు. అద్వైతంలో భక్తిలేదని నేనను కోవటం లేదు. భక్తుడుగా ఉన్నస్థితికి - జ్ఞానిగా ఉన్న స్థితికి తేడా లేదు.

గీతలో చెప్పిన పండితుడికి ఏదీ తుచ్ఛమని తోచదుగదా.

సో : నాకు పని కాలేదనుకో! కానపుడు దుఃఖమున్నది. దానిలో ఆనంద మెట్లా ఉన్నది? నాకిది అనుభవ విరుద్ధమైన మాటగా తోస్తుంది. ఏడుపు ఆనందమెలా అవుతుంది?

అమ్మ : ఆ పని కానప్పుడు అని కూడా అన్నాను.

సో : రెండూ అదే అనుకో గలిగినప్పుడు కాలేదనే బాధపడం. అపుడు బాధాలేదు, దుఃఖమూ లేదు.

వీ.ప్ర : దుఃఖమూ ఉండదు – సుఖమూ ఉండదు.

సో : దుఃఖం లేదు, సుఖమూ లేదు, రెండింటికీ అతీతమైన స్థితి.

శ్రీపాద : రెండూ కానివా?

అమ్మ : రెండూకానిది, రెండూ అయింది. ఆభావం వాడికి మిగుల్తుంది. రెండూ అయింది, రెండూ కానిది అనే భావం శాశ్వతంగ మిగుల్తుంది.

సో : అది కలిగినప్పుడు ఆనందం.

రామక్రిష్ణ: గాయం పోదు, గాయముంటుంది.

అమ్మ : గాయముంటుంది, నొప్పిపోదు

రామక్రిష్ణ: గాయం కనబడుతున్నది, నొప్పి కనుపిస్తున్నది.

అమ్మ : గాయం కనబడుతున్నది నెత్తురు కారుతున్నది. నొప్పిగావున్నా వాడిచ్చాడు అనుకునేవాడు ఒకడు – నొప్పిగానే ఉన్నాడిక్కడ అనుకునే వాడింకొకడు.

రామక్రిష్ణ: మారువా ఒకరోజు భయపడితే ఆమెకు సమాధానంగా అమ్మ ఇలా అంది. దైవమే భయం రూపంతో నీ దగ్గరకు వచ్చారమ్మా అని.

అమ్మ : కొత్తగా నే చెప్పేదేముంది? వారు చెప్పేవున్నారు.

25-4-76

# కాలమే కారణం

అమ్మ : పిలిస్తే పలకటంలేదు. ఇంతలోపలికి పోయింది లాగాలంటే ఇంతలోపల చొచ్చుకు పోయింది. మనసొప్పదుగదా! ఎట్లా లాగుతారు? నేనే ఈ కాలుతో అదిమి పట్టేసి చాకు పట్టుకొని లాక్కున్నా ఇంకొకరు చూడలేరు గదా! సహించగలరా పాపం! సరే, నెత్తురు వచ్చిందా అంటే నెత్తురుకూడా రాలేదు. నెత్తురు రాకపోవటంలో చిక్కుపడుతుందేమో. ఇది ధనుర్వాతమని డాక్టరుగారు భయపడ్డారు, కంఠం అంతా ఇట్లాపోయేది.

ఒకసారి డాక్టరుగారు చెప్పారు. ధనుర్వాతం వచ్చిందని.

అమ్మ : గడ్డ పలుగు ఒకసారి గుచ్చుకుంది. పడ్డది కాలిమీద (తాడిచెట్లు కొట్టేది) ఎవరు చేశారు?

నాన్న : సుబ్బయ్య వల్లనేమో

అమ్మ : ఎందుకు తగిలింది అన్న ఆలోచన లేదు. ఎవరు అన్నది ఆలోచనలేదు. ఏదో ఒకరకంగ జరిగేది. జరగవలసిన time కు జరిగింది. అందుకు ఎవరూ కారణం కాదు.

డాక్టరు : అట్లా ఎవరనుకోగలరమ్మా.

అమ్మ : సుబ్బయ్యకు కళ్లు లేవనుకుందేదా! నాకు చెయ్యి తీసుకోవటం చేతకాదనుకుందేదా! నామీద ప్రేమలేక కొట్టాదనుకుందేదా! ప్రేమలేకపోతే అవతలకు పంపించివేయవచ్చుగా! నీకొద్దు లేమ్మా నే తోస్తాను నీవు అవతలికివెళ్లు అనేవాడు. అట్లాకాదు ఎదురుగుండా ఉండాల్సిందే, నే తోయాల్సిందే అదట్లా జరగాల్సిందే. జరగాల్సి జరిగినవే గాని....మోత మోగింది, వేలు పగిలిపోయినట్టు....ఎవరూ కోపంతో చేశారని అను కోను.

నాన్న : అప్పుడవన్నీ ఒకలెఖ్ఖలోవికావు.

అమ్మ : అవట్లా జరిగాయి. రోజూ రెండు తేళ్ళు కుట్టినా – పిడకల్లో ఉండి కుట్టేవి, చెక్కలమీద ఉండి కుట్టేవి. నేనే వాటిని మెల్లిగా తీసి వేస్తుండేదాన్ని. అవి ఎక్కడ నొచ్చుకుంటాయోనని.

నాన్న : ఏ దాలిగుంటలోనో చెయ్యిపెడితే అవికుట్టేవి.

డాక్టరు : అట్లాగే వంట చేసేదానివా అమ్మా.

అమ్మ : చేసేదాన్ని. జ్వరం విడిచి జ్వరంవచ్చే రోజుల్లో కూడా, టైము ప్రకారం అన్నీ సిద్ధంచేసి, వంటచేసి అక్కడ పెట్టి – మళ్ళీ చలివచ్చేలోగా పడుకునేదాన్ని.

గాలిబ్‌సాహెబ్ ఉన్నాడిక్కడ. ఆవపిండికొట్టుకొన్నాను. అది కలుపుదామనుకొంటుండగా ఒక్కకాయే వదలిపెట్టి పోయాడనుకో, మస్తాను ఊళ్ళో ఉన్నాడు. అతనువచ్చి ఏం చేశాడు. 'నేకొడతా నీవూరుకో' అన్నాడు. కాయకు తగిలేదెబ్బ నాచేతికి తగిలింది. అతనిట్లా చేయాలని వచ్చాడా? ఎవరూ చేయాలని చేయలా. జరగాల్సినవే జరిగినవి. అంతే.

నాన్న : భ్రుకుటి నుండి రక్తం చిమ్మింది దానంతటదే.

సో : ఎంతసేపో?

నాన్న : మీఅమ్మగారు అట్లే కళ్ళు మూసుకుని ఉంది.

వీ.ప్ర : అదేగా భస్మమయింది? సువాసనగా వుందని మీరు చెప్పింది.

నాన్న : అవును.

డాక్టరుగారు: క్రిందపడ్డ నెత్తురు భస్మమైందా నాన్నగారూ?

నాన్న : తెల్లగా అయింది

వీ.ప్ర : అది నీళ్ళలో కలిపి తీర్థంగా తీసుకుంటే మంచి సువాసనగా వుండేదట.

అమ్మ : (డాక్టరుగారితో) నీవు ఇంజక్షను చేస్తే నెత్తురెంత కారిందో, ఆనాడు నెత్తురు భ్రుకుటి నుండి అంత వచ్చింది.

నాన్న : (తలను రాస్తే) ఇట్లా అంటే చేతికయ్యేది. ఆగేది కాదు నెత్తురు.

డా॥ : గణపతిముని చాలా బాధపడ్డారట.

అమ్మ : తనంతతాను పగలగొట్టు కోవాలను కున్నాడు కాబట్టా.

డా॥ : లేదమ్మా

అప్పుడు కూడా బాధ పడలేదానాన్నగారూ?

అమ్మ : నే నెప్పుడూ బాధపడలేదు.

నాన్న : (బాధపడినట్టు) నాకెప్పుడూ కనిపించలేదు.

సో : ఇలా కొన్ని రోజులా?

నాన్న : ఒకసారో, రెండుసార్లోచూశాను. ఎప్పుడూచూసే పనేముంది 1956,57 ప్రాంతాలలో

అమ్మ : నడకకూడ చాలవేగంగా వుండేది. పామునడక అనేవాళ్లు. అంటే అంత తొందరగా, చప్పుడు కాకుండా.

డా॥ : ఇప్పుడు నీవు పచారు చేస్తుంటే, నీతో నడవాలంటే కష్టమే.

అమ్మ : ఇప్పుడు అంతా ప్రచారమే కాని, పచారం లేదు.

నాన్న : నడకచాలా వేగంగా వుండేది గదా.

డాక్టరు : భూమి మీద పాదం తాకకుండా నడిచేదా?

అమ్మ : లేదు శబ్దంలేకుండా నడవటమేకాని, అదిలేదు. నాది తొందర నడక. బాపట్లదాకా నడచినరోజులున్నై. నడచినా, పెద్ద ఆలస్యంగా నడిచానని నేననుకోను. ఒకటి రెండు, మూడు సార్లన్నా – బాపట్లకు నడకంటూ జరిగింది గదా! ఆ నడకలో కూడ ఆయాసంరాలా – ఆవేశంరాలా. నడవాల్సి వచ్చెనే అని ఆవేశం రాలేదు. నడవలేక ఆయాసమూ రాలేదు. సుబ్బారావుకు జ్వరం వచ్చింది. మూడు ఇరవైలు అరవై రోజు లొచ్చింది. మళ్ళీ మళ్ళీ తిరగబెట్టింది. తడపర పోసింది. మళ్ళీ typhoid వచ్చింది, వాడికి వయస్సు 7 సంవత్సరాలున్నాయి. బేరన్‌లో పొగాకు కాలుస్తున్నారు. వాడికి చాలా జబ్బుగా వుంది. వాడిని వదలిపెట్టి, ఇక్కడ వుండాలని లేదు. వెడదామనుకున్నాను. బామ్మ, నీవిక్కడుండమ్మా, ఈ డ్రైవర్లకు, ఈ బేరన్‌లో జనాలకు జీతగాళ్ళకు నావల్లకాదు. నీవైతే మైలతోవండి

పెడుతుంటావు. నేనుపెడితే మడికట్టు కోవాలి, వాడిని నేను కనిపెట్టు కుంటాను- నీవే వందు ఉన్నది. అప్పుడెక్కువగా ఉందన్నప్పుడు బండి కట్టుకొని వెళ్ళాను. తర్వాత వెళ్ళి అక్కడ ఉన్నాననుకో! అప్పటికి బస్సులు లేవేమో! ఎందుకు నడవవలసివచ్చేదో నాకర్థం కాలా. బస్సులులేవేమో అనుకుంటా. (నాన్నగారితో) మనం వచ్చిన కొత్తల్లోబస్సులు లేవుగదా! బాపట్లకు నడకే.

నాన్న : లేకపోతే గుర్రపుబండ్లు

అమ్మ : ఒకసారి నేను, రెడ్డి సుబ్బయ్య, దగ్గర దారిని జమ్ములపాలెం మీదిగా తీసుకు వెళ్లేవాడు. ఎట్టటి ఎండ. అక్కడ కూర్చొనివుంటే, ఇవన్నీ బొబ్బలు పుట్టాయి. పాపారావు భార్య అని ఎవరో ఒకావిడ రెడ్డి సుబ్బయ్యకు తెలుసు. అతన్ని బాగా తిట్టింది. ఎట్లా తీసుకు వచ్చావు, నీదుంపతెగ- ఆమెకు కాళ్లు బొబ్బలు పోసాయి. ఇక్కడ ఉంటే మళ్ళీ ఎట్లా నడుస్తుంది? అని

వీటిన్నింటి కంటే ఆశ్చర్యకరమైనదేమిటంటే బాధ రావటానికి కాలమే ప్రధానం. వ్యక్తులు కారణం కాదు. సుబ్బారావుకు న్యుమోనియా వస్తే చాలా ఎక్కువగా వచ్చింది నాన్నా. 13 నెలలవాడు వాడు. ఎన్నో ఆయుర్వేదం మందులు వాడారు. అంతా పుండ్లు పడ్డాయి.

బాపట్లనుండి ముప్పనూరు మాణిక్యరావుని, ఆయన భార్య తెల్లవార్లు నేనొక్కదాన్నే వాడి దగ్గర కూర్చోటం చూసి "ఎంతైనా చిన్నపిల్ల తల్లిగదా! ఆ అబ్బాయి బ్రతికేటట్లుగా లేదు ఇప్పటికైనా ఆసుపత్రికి తీసుకు వెళ్ళండని" కూడా వచ్చింది. అక్కడికి వెళ్ళాను. నన్ను దించేసి నాన్నగారు వచ్చేశారు. తర్వాత బామ్మను పంపారు. దగ్గరిదారి అని బేయర్ హాస్పిటల్ నుండి నూనె పానకాలు తోటలోకి. వేసవికాలం మే నెల అది. బయలుదేరాం. నాకు చెప్పుల్లేవు. నాకు మొట్టమొదట చెప్పులు కొనుక్కొచ్చిన వాడు షేక్‌సాహెబ్. చేతిలో మరచెంబు, సుబ్బారావు నెత్తుకుని

ఇసుక కాలడమంటే ఎట్ల ఉంటుందో రుచి చూద్దామని వైశాఖమాసం మధ్యాహ్నం ఒంటిగంట సమయంలో .... రిక్షాలేం దొరకవు దగ్గరదారి అని ఇలారమ్మని బొమ్మ కబురుచేసింది. తొందరగా అందుకుందామని తను వద్దామని వచ్చాను. వీడ్ని క్రిందికి దించుదామంటే పల్లేరుకాయలు – ఎత్తుకుంటే కాళ్లేమో లోపలికి పోతున్నై. నిప్పుల బాటంటే అదే. అంతకంటే నిప్పులబాట ఉండదేమో అసలు. ఎక్కువసేపు నడిస్తే కాళ్లుబొబ్బలు పోతాయి. ఆమెకంతా అయోమయమయి పోయింది. గబగబ నడుస్తున్నాను. అట్లాగే కాలుకుంటూ నడచి వచ్చాను. ఆ తోటలో మౌనస్వామికోసం కట్టిన ఇల్లుంది అక్కడ. అక్కడికి రాగానే గబగబా రెండుబిందెలు నీళ్ళు తీసుకు వచ్చింది. ఏం తోచలా ఆమెకు. తెచ్చిపాదాల మీద పోసింది. ఆ మంటలకు హాయిగా ఉన్నై. చూస్తే మొత్తం తొడుపు ఊడింది. అట్లాగే నడిచాను. ఊడిన సమయాలున్నాయి. ఊడని సమయాలూ ఉన్నాయి. మండే నీళ్లలో చెయ్యిపెడితే కాలలేదనేది ఎట్లాఉందో, కాలిన సమయాలూ ఉన్నాయి. దానికి, దీనికి రెండింటికి తేడా అనిపించలేదు అంటున్నా.

దాక్టరు : అప్పుడు కాలటానికి, తర్వాత కాలకపోవటానికి కారణ మేమిటమ్మా?

అమ్మ : కాలమే అనుకుంటున్నా. ఎవర్నీ అనేదేముంది? ఎండను అనను.

సో : నీ శరీరం ఒకసారి కాలడానికి ఇంకొకసారి కాలక పోవటానికి కారణమేమిటి?

అమ్మ : దీని Time కు, దాని Time కు తేడా ఉందనిపిస్తుంది నాకు.

దాక్టరు : చేతి చర్మంకన్న, కాలి చర్మం చాలా మందంగా ఉంటుంది ఎవరికైనా. ఎంతకాలినా ఇసుకనూరు డిగ్రీలకు మించి ఉండదు.

అమ్మ : అసలు బాధంటే వేడి నీళ్ళలో కంటే అదే బాధ. నేను గంట, గంటన్నర నడిచాను.

దాక్టరు : ఎట్లైనా (చేయికూడ) ఇదికూడా చర్మం ఊడిపోయి ఉండాల్సిందే గదా!

అమ్మ : ఇది కొన్ని నిముషాలు కావచ్చు.

డాక్టరు : ఎన్ని నిముషాలైనా కాగే నీరు కాలి మీద పడితే బొబ్బ వేస్తుంది.

అమ్మ : అప్పటిశక్తి అప్పుడు తగ్గిపోయి వుండవచ్చు.

డా : నీవు కావాలనుకుంటే అవుతుంది, వద్దు అనుకుంటే అవదేమో.

అమ్మ : ఏమో మరి కాలకపోయినప్పుడు అక్కడ ఒర్పేమీ లేదు. కాలకుండానే ఉన్నప్పుడు ఓర్పేముంది? తాట ఊడినప్పుడు దానిమీద నడవటంలోనే ఉంది.

డా : ఇక్కడకూడ బాధలేదు అని అనటం లేదు మేము కూడ! మరిగే నీళ్ళల్లో చెయ్యిపెట్టినప్పుడు బాధలేదని ఎవరంటారు? ఓర్చుకున్నావంటారు గాని. అప్పుడు చర్మం ఊడింది. ఇప్పు డెందుకు ఊడలేదు అనిగాని, బాధ ఉందా, లేదా అనికాదు. తర్వాత సహనం ఉందా లేదా అనికాదు.

అమ్మ : సహనం లేదు, ఓర్పులేదు, బాధే లేకపోతే సహనమేముంది? సహజ సహనం.

మనసుకు ఇష్టం, ఇష్టం కాకపోవటం అనే దగ్గర కూడ ప్రపంచంలో సామాన్యంగా అందరు కష్టమనేవి, నాకు అయిష్టంగా ఉండేవికావు.అంత మాత్రాన కొన్ని అయిష్టతలు లేనిదాన్ని కాదునేను. కొన్ని విషయాల్లో అయిష్టంగా ఉండవచ్చు. ఇష్టంగానూ ఉండవచ్చు. అందరూ అనుకునే అయిష్టత కారణాలవల్ల నాకులేదు. సామాన్యంగా అందరు పడేవి అవిమాత్రం నాకు వద్దని ఉండేవి కావు. కొన్ని కొన్ని ఉంటాయి కొంతమందికి. నాకవి కష్టమని అనిపించవు. అంత మాత్రంచేత అయిష్టత లేని విషయాలు నా మనసులో ఉండవని, అయిష్టత లేనే లేదని కాని అనుకోను. హైమకు చక్కగా తొట్టి స్నానం చేయించాలని జబ్బు నయంచేయించు కోవాలని కోరిక ఉండవచ్చు - జరగక పోతే బాధ ఉండవచ్చు. అది వేరు. సామాన్యంగా కుటుంబాలలో కాని, ఇంకేదైనా గాని, ఇట్లా జరిగితే బాగుంటుంది అనుకున్న వాటికి - దానికి వ్యతిరేకంగా జరుగుతుందనుకో! వాటికి మాత్రం బాధ లేదు. కాదని నేననటంలేదు.

ఉన్న సత్యం ఏదైతే ఉన్నదో ఆ సత్యం తెలిసిన వాడికి తదితరులకు తేడా వుంది. సత్యం ఇన్ని రకాలుగా లేదు. సత్యం దృఢపడ్డవాడికి రెండు రకాలుగా గోచరించదసలు. ఇప్పుడు నాకన్నీ సరిపోతున్నాయినాన్నా! ఎందుకు సరి పోతున్నాయి? వాళ్ళల్లో వాళ్ళకే అభిప్రాయ భేదం ఉందేమో గాని నాకన్నీ సరిపోతాయి.

సో : అద్వైత సిద్ధాంతమే పరమోత్కృష్టమని నమ్మేమాకు సరి పోతున్నది.

అమ్మ : ద్వైతం సరిపోతున్నది గదా!

సో : నీకు సరిపోయిందా, లేదా అని కాదు. ద్వైతం కాని, కేవలం పరమేశ్వరునిలో చేరటమే వాడికి ముఖ్యం. ఎప్పుడూ వాడట్లాగే ఉంటాడు. నేనిట్లాగే ఉంటానను కుంటాడు. ఎందుకంటే మనం భావాద్వైతమే అంగీకరిస్తున్నాం. యదార్థమైన అద్వైతం లేనే లేదు మనకు కూడ. ఆ పట్టు మీదనే అతనున్నాడు.

అమ్మ : బుద్ధునిది భావమే గదా! దైవమనేది భావమే గదా!

సో : భిన్నంగానే ఉన్నది గాని ఏకసమానంగా ఎప్పుడూ లేదనేగా!

అమ్మ : సృష్టే భిన్నత్వం. అట్లాగే కర్మ సిద్ధాంతం దగ్గరకు వచ్చినప్పుడు కూడ రెండుగా తోచని స్థితి - ఈ రెండుగా కనపడని స్థితి లేదు గాని ఈ రెండూ ఒకటేనని తోచే స్థితి ఉన్నది.

సో : రెండూ ఒకటేనను కోవటం దేనికి. అది అదిగానే ఉంటుంది మనం మనంగానే ఉందాం. అని అంటాడు.

అమ్మ : అనుకునే స్థితి ఇంకొకటి. కాని ఈ రెండు స్థితులకు భేదం లేదు, దాని మీదే నిల్చోలేదు అంటున్నాం మనం. ఒకటి చెప్పి దాని మీదే నిల్చోలేదు అంటున్నాం మనం. ఒకటి చెప్పి దాని మీదే నిల్చుంటే సరిపోయేది. ఇన్ని పుట్టేవి కావుగా!

సో : సృష్టే భిన్నంగా ఉన్నప్పుడు ఒక దాని మీద ఎట్లా ఉంటాడు? ఇప్పుడూ ఉండదు, ఎప్పుడూ ఉండదు. ఎప్పుడు కూడా ఏది సత్యమంటే, ఇదొకటే

సత్యం అనటానికి అవకాశంలేదు. ఎందుకంటే సత్యం బహుముఖాలుగ ఉంటుంది కాబట్టి.

అమ్మ : బహుముఖంగా ఉన్నప్పుడు.

శ్రీపాద : సత్యమే బహుముఖం అంటే ఎట్లా? ఉన్నది ఒకటే అంటాము కాదు పెక్కులు అంటే.

అమ్మ : అదే చెప్తాడు. సత్యమొకటేనంటాడు. తలోరకంగా వచ్చా రంటాడు ఎవరి కందినది వీళ్ళకది రైటు అని నేననడం లేదా! వాడిల్లు పొట్టిగా ఉంది, వీడిల్లు పొడవుగా వుంది.

సో : పైకి వెళ్ళిన తర్వాత అంతా ఒకటిగానే ఉంటుంది భేదమే కనపడదు. హిమాలయం మీద వెళ్ళి నిలబడితే క్రిందంతా ఒకటిగా కనపడుతుంది.

శ్రీపాద : పెక్కులుగా కనపడతాయిగానీ ఒకటే అని తెలుస్తుంది.

వీ.ప్ర : పై కెక్కినా కనిపిస్తాయి. కానీ పొడుగూ పొట్టి సహజమే. ఇవన్నీ ఒకటే అనిపిస్తుంది.

అమ్మ : విశిష్టాద్వైతమని, రామానుజాచార్యులు చెప్పినది ద్వైతమని మధ్వా చార్యులు ఇవన్నీ వేరుగా నాకు కనిపించటం లేదు. ఈ దారులలో వారంత వరకు వచ్చి పట్టుకున్నారు అని నాకనిపిస్తుంది. మీకు ఒకరు చెప్పినది ఒకరు చెప్పక పోవటం వల్ల, మీరన్ని పుస్తకాలు చదవటం వల్ల, సాధకులకు బాధకలుగుతున్నది. నమ్మితే లేదు.

సో : సాధకుడు కూడా ఒకటేననుకొని ఆ మార్గములో వెళ్ళిన వాడికి ఏమీ ఉండదు. అన్నీ చూచి ఏది నిజమా అనుకుంటే రెండుగా కనపడుతుంది, రెండు పడవలలో కాలుపెట్టినట్టు. కానీ ఒకటేనమ్ముకున్న వాడికి ఏం లేదు. ద్వైతం నమ్ముకున్నా, విశిష్టాద్వైతం నమ్ముకున్నా, అద్వైతం నమ్ముకున్నా ఫరవా లేదు.

వీ.ప్ర : నాస్తికత్వం నమ్ముకున్నా ఫరవాలేదు. దాని మీద గట్టిగా నిలబడితే.

అమ్మ : ఏదైనా సరే అంటున్నాడు.

సో : సంపూర్ణమైన నాస్తికత్వంలో కూడా ఉండటంలా.

వీ.ప్ర : సంపూర్ణమైన ద్వైతులు లేనట్టుగా, సంపూర్ణమైన నాస్తికులు లేకుండా ఉండవచ్చు అది వేరేసంగతి. సంపూర్ణమైన ద్వైతులు కూడ ఒకదశలో సంపూర్ణమైన అద్వైతులు అవుతారని నా ఉద్దేశ్యం.

అమ్మ : ఇప్పుడు అభిప్రాయ భేదాలు ఎవరికీ లేవు. సత్యం తెలుసు కున్న ప్రతి వ్యక్తికీ జన్మలేదు అని వారొప్పుకున్నట్లుగా, దేనికి లేదు అని నేనన గలుగుతున్నానంటే, నాకు మీ దగ్గర సత్యమే గోచరిస్తున్నది. సత్యమేమిటో నాకుతెలుసు. మీరంతా ఏమిటో నాకు అర్థమౌతున్నది. అందువల్ల మీకు జన్మలేదని నేననగలుగుతున్నాను. నీవు నాకు కూడలేదని అనలేవు. నీకా స్థితి లేదుగా మరి. నాకు లేదని కూడా నీకు ధైర్యంలేదు. కాని మీకు లేదని నాకు తెలుసు - నాకు లేదని మీకు తెలియదు. నన్ను కూడా సంపూర్ణంగా మీరనుకోలేరు. ఒక నమ్మక మేర్పడబట్టి ఇక్కడ కూర్చున్నావు. నమ్మిక ఉండబట్టి వినగలుగు తున్నావు. నమ్మక మున్నందువల్ల వ్రాయగలుగు తున్నావు. తొలిసారి నమస్కారం చేసినప్పుడు నీకీ అభిప్రాయం లేదు. నీవింత పని చేస్తావని అనుకోలేదు.

శ్రీపాద : నేనా? వ్రాయటమా? వ్యాసం పట్టుకు వచ్చి ఇప్పుడేం చెయ్యను అని అడిగాను "ఇప్పుడేమయింది. ఇంకెంత వ్రాయాలో" అన్నారు. నా కొక రాతా, ఈ విషయం గురించా అనుకున్నాను.

అమ్మ : నాకివన్నీ పట్టవన్నావు. ఆపట్టిన వాడికి పట్టింది. కాబట్టి ఉన్నాయా? లేవా? అని నీవు కాదుగా చెప్పాల్సింది.

సో : మాకా స్వాతంత్ర్యం లేదు.

అమ్మ : తెలియదు మీకు. నిన్న అబ్బాయి ఒక విషయం చెప్పారు. బుద్ధిః కర్మాను సారిణీ అన్నప్పుడు, వేదాలు అపౌరుషేయాలు అన్నప్పుడు మనమేమీ బాధపడ నక్కర్లేదు. వ్రాసిన పరమ పురుషుడ అర్థం కావటం లేదు. అపౌరుషేయం అంటే క్రింద సంతకం చేయలేదుగదావాడు. క్రింద

నాపేరిది అని వ్రాయలేదు గనుక అ పౌరుషేయం. అందులో తప్పులేదు. ఆ మాటకు అర్థం కూడా అదే.

శ్రీపాద : ఋషులందరికి ఉన్న గుణాలతోటి ఈ పరిస్థితుల్లో కూర్చొని వ్రాయలేదు. దాటిపోయి, ఎక్కడో....

వీ.ప్ర : అభౌతికస్థితిలో వ్రాశారు.

అమ్మ : అయితే....వారింత వరకు చెప్పారు. అమ్మ ఇట్లా చెప్తుంది అంటే దానికెవరూ కాదనడానికి వీల్లేదు.

నాదగ్గరకు వచ్చి కూర్చుంటే వారితో నేను మాట్లాదు తాను ఇవే మాటలు, ఇవే పదాలు ఈ మూసలోనే పట్టుకొస్తే అనే వారెవరున్నారు? తతిమా సిద్ధాంతాల కంటె శ్రీపాద భిన్నంగా చెప్పాడని రాధాకృష్ణశర్మ ఎట్లా అనగలుగుతాడు? అనలేదు. మీరెంత వరకు ఉన్నారంటే ఆయన ఒక భాగంలో, మీరు ఒక భాగంలో.

సో : శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి అభిప్రాయం వేరు, చంద్రశేఖరశాస్త్రి గారి అభిప్రాయం ప్రకారం ఇవన్నీ కూడా నాకంగీకారమే. ఎట్లా అంగీకారమంటే ఆయన ఆరకంగ అమ్మనుచూశారు. ఈయన ఈరకంగ చూశారు. చూడటం తేడాలు తప్ప వస్తుతత్త్వమొకటే. చూడటంలో తేడా ఉండక తప్పదు. ఏది అంటే దేనికదే మంచిది. ఒకడు చూచింది అంతా, ఒకడు చూచింది ఇంత అంగీకారం కాదు. ఎట్లా చూచినా చూచే వస్తువొకటే కాబట్టి ఇంత అంతనా అనేదిలేదు. అక్కద మార్గాల భేదమే తప్ప వస్తు తత్త్వంలో, దర్శనంలో భేదం లేదు.

అమ్మ : ఆమార్గంలో భిన్నత్వం తెలియపరుస్తున్నారు వారు. మార్గ భేదమంటే చెప్పు నాన్నా! అక్కడే మీరు పడిపోతున్నారు మార్గభేదమని ఎప్పుడయితే అన్నారో.... కోణాలు వేరు. ఆయన చూచిన కోణం వేరు. ఈయన చూచినకోణంవేరు. చంద్రశేఖరశాస్త్రి గారికి సాక్షాత్తూ దైవం అని అనుకునేభావం ఆయనకు కలిగింది. ఆయన ఏ కోణంలో చూచి అను కున్నాడో ఈయనకు తెలుసుగా!

సో : ఆయన నాతో చెప్పిన మాటలబట్టి 'నాకమ్మ చెప్పినవన్నీ కూడ విద్యారణ్యులు చెప్పినట్టు, వేదములు చెప్పినట్టు, శంకరులు చెప్పినట్టు ఉపనిషత్తు వాణిలో గోచరిస్తుంది' అన్నారు. ఆయన చదువులయొక్క సారమంతా ఒకమాటలో కనపడుతుంది అన్నారు. ఆయన అమ్మదగ్గర మనం మాట్లాడవలసిన అవసరం లేదు అన్నారు. కూర్చుంటే చాలన్నాడు. అన్ని శాస్త్రాల సారం ఇక్కడ ఉన్నదన్నాడు. తాను చదువుకున్న సారమంతా అమ్మ మాటల్లో కనపడుతుంది అన్నాడు.అమ్మ మాటల్లో శాస్త్రీయమైన, ఆ రకమైన అర్థమొచ్చేదట. వారు కేవలం శంకరాద్వైతాన్ని అట్లా అవుపోసన పట్టాడు. ప్రస్థాన త్రయం చెప్పడంలో సామాన్యమైన వాడిక్కూడ అంతబాగా అర్థమయ్యేటట్లు చెప్పగలిగినవాణ్ణి నేను చూడలేదు. జగద్గురు శంకరాచార్యుల వారిపట్ల ప్రత్యేకమైన అభిమానం. అందువల్ల కేవలం వేదాల్లో చెప్పిన మాటలు, ఉపనిషత్తుల్లో చెప్పిన మాటలు - అమ్మ మాటల్లోఅర్థం ఆ విధంగా వారికి తోస్తుందట. అందువల్ల అమ్మను సాక్షాత్ పరాత్పరి అని వారన్నారట. ఆయన నిర్ణయమునకు కారణమిది. ఆయన అభిప్రాయమది. మీరే విధంగ ఋజువు చేసుకున్నారో నాకు తెలియదు. ఆయన చెప్పిన మాటలవి. అట్లా పంచరత్నాలు, రాజరాజేశ్వరీస్తవం వ్రాశారు. తర్వాత చనిపోయారు.

అమ్మ : కర్మ సిద్ధాంతాన్ని కూడా తీసుకోమన్నాను ఇప్పుడు. ఎందుకు తీసుకోమన్నానంటే నిన్న నీతో మాట్లాడాను. కర్మఅనేదాని దగ్గరకు వెళ్ళినప్పుడుకూడ, ఆదరణకు ప్రత్యక్ష ప్రమాణంగ ఉపయోగిస్తుంది ఎక్కడో రహస్యంగ లేదు. ఇప్పుడు నీవు పాక విప్పించటం కూడ కర్మే. వాడు వ్రాయటం కూడా కర్మే. కర్మ అనే అర్థానికయితే........

సో : అమ్మ దాంట్లో ఎట్లా ప్రత్యేకతను చూస్తున్నారంటే--అందరూ అనేక రకాలుగా చూచారు. చూచి దాన్నిట్లా భరించారు కాని అన్నిటియొక్క గమ్యం ఒకటే. ఏ ఒకటి ఏకాగ్రతతో చేసినప్పటిక్కూడ గమ్యాన్ని చేరుతుంది

అని ఘంటాపథంగా చెప్పిందమ్మే. తతిమ్మావాళ్ళు ఇట్లాపొండి అని చెప్పారు. కాని, దాంట్లోవారు Perfection పొందిన వాళ్లేకావచ్చు కాక! కానీ అన్నింటినీ సమన్వయం చేసి – ప్రపంచంలో ఏదైనాసరే – ఇస్లాం, క్రైస్తవమతం కూడా, అఖండసత్యములో ఒక భాగంగానే చెబుతుంది అమ్మ. అట్లా వారెవ్వరూ చెప్పలేక పోయారు.

వీ.ప్ర : రెండభిప్రాయాలు లేవు.

సో : అందువల్ల అమ్మ దాంట్లో అప్పుడు, ఇప్పుడు ప్రత్యేకత ఉంది అంటానునేను. అంత మాత్రాన అవి తక్కువ అని నేననుకోను. వాటి పరిధిలో వాటి దృక్పథంలో అవి పరిపూర్ణ మైనవేననే నాఅభిప్రాయం.

శ్రీపాద : మీరనింది, మేముకాదనిందేమిటి?

వీ.ప్ర : అమ్మ విశిష్టత ఏ మార్గాన వచ్చినా అక్కడికే చేరతారని చెప్పారు. అందులో మా కెలాంటి భిన్నాభిప్రాయం లేదు. అమ్మ పూర్ణత్వం చెబుతుందంటేనే, వాళ్ళది సాపేక్షం అవుతుం దనే మేమర్థం చేసుకుంటున్నాం. అది పాక్షికంగాదు, అదీ పూర్ణమే ఇదీ పూర్ణమే అంటే ఇదంపూర్ణం అదంః పూర్ణం – పూర్ణములో నుండి పూర్ణం తీసివేసినా పూర్ణమే మిగిలేది.

అమ్మ : ఇంకొకటి రావటానికి వీల్లేదు అని ఒప్పుకొంటున్నట్టే

వీ.ప్ర : రెండు పూర్ణాలుండవు అని మాఅభిప్రాయం.

శ్రీపాద : పూర్ణం ఒకటే.

అమ్మ : ఏం భేదం లేదు.

సో : అయితే ఒక దీపంలో నుండి ఇంకొక దీపం వస్తుంది కనుక దానికి, దీనికి వ్యత్యాసం కనపట్టంలేదు.

అమ్మ : కోటి కోటి దీపికలకు వెలుగునీవే అని రాజన్నాడు.

సో : బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి దాన్ని బట్టి చూచికూడ అది సత్యమే అనిపిస్తుంది నాకు. ఏది పూర్ణమంటే అన్ని పూర్ణాలే.

శ్రీపాద : దీపంలో నుండి దీపంతీస్తే ఏదివస్తే అదీ పూర్ణమే. ఇదీ పూర్ణమే అంటే అది ఎక్కువకాంతి గలది ఇది దీపమే. రెండూ సమానమే అంటే ఎవరికీ అభ్యంతరం లేదు. కాని ఈ వెలుగుదూరం వెడుతుంది. అది దగ్గర ఆగిపోతుంది.

సో : అగ్గిపుల్ల వెలుగుకు పెట్రోమాక్సులైటు వెలుగుకు తేడాలేదూ?

శ్రీపాద : ఇంత రవ్వతో దూదికొండ మండిపోతుంది రవ్వ వెలుగు దూదికొండ వెలుగు ఒకటే అని ఎట్లా అనగలవు?

అమ్మ : మాబోటి వాళ్ళకు మాట్లాడటానికి అవకాశమెక్కడ కలిగిందంటే కర్మ సిద్ధాంతం మీద కొంత మీరు, కొంత నేను అని చెప్పటంవల్ల మాకవకాశమొచ్చింది. లేకపోతే మాబోటి వాళ్ళకు అవకాశం లేదు. కొంతమీరు కొంతనేను అని చెప్పిన దాని దగ్గర వచ్చింది. కొంత స్వతంత్రత ఇచ్చారు మానవుడికి, కొంత నాచేతిలో పెట్టుకున్నాను అన్నారు. అనికూడ అన్నప్పుడు బుద్ధిః కర్మాను సారిణి అన్నప్పుడు ఆకర్మ .... తనే అన్నీ అని చెప్పుకొన్న చోట్లు ఉన్నాయి.

శ్రీపాద : కర్మ బ్రహ్మవిత్....

అమ్మ : మనం దాన్ని వదిలేసి ఇట్లా చెప్తాడేమిటి అని ప్రశ్న వేసు కుంటాం. నీవు బ్రహ్మలోనుంచే బ్రహ్మపుట్టింది అంటావు. బ్రహ్మలోనుంచే బ్రహ్మను చూస్తాడు అంటాం. నాస్తికులకు, ఆస్తికులకు భేదమెక్కడ కన్పడుతున్నది?

సో : అంతర్యామిత్వం - సర్వత్వము అన్న మాటలకు నాకు తేడా కనపడదు. వాడు సర్వంగానూ ఉన్నాడు, అంతర్యామిగాను ఉన్నాడు. ఒక దాని కొకటి విరుద్ధమని అనుకోనక్ఖర్లా.

శ్రీపాద : సర్వంవేరు, అంతర్యామిత్వం వేరు. వాడుదాంట్లో దూరాడు అనిపిస్తుంది నాకు. సర్వమూ అయినప్పుడు, దానిలో దూరి నప్పుడు వీడు సర్వం ఎట్లా అవుతాడు? సర్వంలో దూరిన వాడవుతాడు.

అమ్మ : పెట్టెగా అయినాడు దూదిగా అయినాడు.

శ్రీపాద : పెట్టెలో ఉన్నాడు అనటంలో.

సో : వ్యవహారంలో తప్పదంటున్నాను నేను. దిండులో ఇదిఉన్నది. ఇది, అది ఒకటే అన్న భావం. అది ప్రమాణమే కాని వ్యవహారంలో భేదం తప్పదు.

సో : దిండులో దూది ఉన్నదని అంటాం. దూది లేకుండ దిండు లేనిమాట నిజమే.

శ్రీపాద : చిలుకలో పంచదారంటారా?

సో : పంచదారచిలుక అనే అంటాం.

శ్రీపాద : పంచదార చిలుక. చిలుకలో పంచదార అనటానికి ఇక్కడ తేడా ఉంది.

అమ్మ : కర్మ సిద్ధాంతాన్ని కూడ వివరించండి. చేతలు చేతుల్లో లేవు అంటే కూడ కర్మ సిద్ధాంతమే. వీడి చేతిలోలేదు అని ఎందుకన్నానంటే ఆ వివర మిచ్చాను.

సో : పంచదార చిలుక అంటే పంచదార అనే అర్థం. చిలుకను నమిలితే పంచదార రుచి వస్తుందని మనం అంటున్నామా లేదా! రుచి వేరే వుందా?అంతా వ్యాప్తంగానే ఉంది. వ్యవహారం దృష్ట్యా అది ఉన్నది అంటాం. తప్పదు మరి ప్రతిదాంట్లోనూ కనపడుతుంది కాబట్టి.

అమ్మ : మాకు కనిపించిదే దృఢంగానీ అనటంకాదు. నాస్తికత్వానికి ఇచ్చిన నిర్వచనం కూడా భావం తప్ప మార్పులేదు. ఏదో ఒకటి అనుకొని, భావించి వీడు కనిపించలేదు కాబట్టి లేదు అంటున్నావు. సర్వం ఒక శక్తి అనుకొంటున్నాను కాబట్టి, నాకంతా దైవంగానే గోచరిస్తున్నది. నీనాస్తికత్వానికి, నాకు ఏం తేడాలేదు. నీదీ భావమే, నాదీ భావమే. ఏదో అనుకుని లేదనే భావంనీకు - ఒక శక్తే ఇదంతా అయిందనే భావంనాకు. సర్వంపూర్తిగా లేదు అనుకునేస్థితి – అంతావాడు అనుకునే స్థితికీ ఒకటే కారణం అవుతుంది. అందుకే నేనేం చెప్పానంటే 'మన ఏవమనుష్యాణాం' అన్నది తీసుకోండి, వదలివేయకండి గీతలో

ఉపమానం తీసుకోండి, కర్మసిద్ధాంతాన్ని వదలకండి, బుద్ధిఃకర్మానుసారిణీ అనేదితీసుకోండి, దీనికి గట్టిగా సమాధానమివ్వండి. వీటికి పైన నిల్చొని వాళ్ళుకూడ తొంగి చూస్తారు. ఒక్కసారిగా ద్వంద్వం పోతుందా వాళ్ళకు? ఎందుకు కాసేపట్లాచెప్తాడు? నీవు వేస్తున్న ప్రశ్నలున్నాయే వాళ్ళకర్థమౌతుంది. బుద్ధిఃకర్మానుసారిణీ అన్నప్పుడు వీడు కర్తకాదు. బుద్ధి కర్మను బట్టినడుస్తుంది. ఈ కర్మ పూర్వజన్మది అని చెప్తున్నారు. పూర్వానికి పూర్వం పోదాం. అపూర్వం అవుతుంది. అక్కడ వాడే మిగులుతాడు. ఇంకొకటి మిగలటానికి వీల్లేదు. అసలు ఏరకంగా చూచినా ఉన్నదదే. బ్రహ్మలోనుండి బ్రహ్మ వచ్చాడంటున్నారుగా! ఉన్నది సత్తా అంటున్నారు గౌడపాదులు. ఉన్నది కాబట్టే జగత్తు పుట్టలేదు అంటున్నాడు. తప్పేమీలేదు.

సో : మనలకొట్టడానికి, తిట్టడానికి వచ్చినవాడు కూడా కొంచెం సేపాలోచిస్తే........

అమ్మ : రాత్రి ఒకబ్బాయి చాలా ప్రశ్నలు వేయడానికి వచ్చాడు. నీమూర్తిని చూస్తోంటే ఆకలికూడ చచ్చిపోయింది అన్నాడు. చాలా తృప్తిపడ్డాడు.

సో : వీరయ్యచౌదరిగారు నన్ను కూర్చోబెట్టి ఇక్కడి ప్రశ్నలు ఏవో నేను వినలేదు మీరు చెప్పండి అంటే కాసేపు మాట్లాడాను.

శ్రీపాద : ఉన్నాడా అబ్బాయి?

అమ్మ : ఉంటాడు.

శ్రీపాద : ప్రొద్దున్నే వెళతానన్నాడు.

అమ్మ : మళ్ళీ రావాలని వెళ్ళాడేమో, తల్లి లేదట. 'చక్కదనం కాదు. తెలియనిది ఏదో నీలో వుంది. నిన్ను చూస్తే నాకు కడుపు నిండుతోంది'. అన్నాడా అబ్బాయి.

డా॥ : అంతా ఒకటి అయినది అన్నప్పుడు-

అమ్మ : నాకంతా ఒకటి గనక మీకు నేనట్లా కన్పిస్తున్నా. నాకంతా ఒకటయింది గనక నాముఖం మీకట్లా కన్పిస్తున్నది. నాలో కూడా భిన్నత్వం ఉంటే, నాముఖం మీకట్లా కనిపించదు.

సో : అమ్మ మాటలు మననం చేసుకుంటే చాలనిపిస్తుంది నాకు. శ్రీపాదవారు, వీరమాచనేని ప్రసాదరావుగారు– పూర్వపు మహర్షులలాగా అనిపిస్తుంది నాకు. కారణ జన్మలే అనిపిస్తుంది నాకు.వాళ్ళెంత గొప్పవాళ్ళో, వీళ్ళూ అంత గొప్పవాళ్ళుగా అనిపిస్తుంది నాకు.

వీ.ప్ర : అది మీగొప్పతనమౌతుంది తప్ప....

శ్రీపాద : కనపడే అందరు....

సో : కొత్తకోణంలో తరచి చూస్తున్నారు–సామాన్యమైన పనా?

అమ్మ : తరచడమేగా!

శ్రీపాద : తరచడం మీరూ చేస్తున్నారు, మేమూచేస్తున్నాం.

సో : క్రిందటి జన్మలో మీకు పూర్ణత్వం రాక ఈజన్మలో పూర్ణత్వము నకై....

వీ.ప్ర : ఒకనాటి పండగరోజు అమ్మను సిద్ధాంత సంబంధంగా అడిగితే....

అమ్మ : ఏదైనా తనకోసమే చేసుకుంటాడు. తను తప్ప ఇంకొకటిలేదు. ఇదెక్కడికి వెళుతుందంటే నేనును తెలుసుకోవడానికి మార్గం. ఈ అన్వేషణలో, దీంతో తెలుసు కోవచ్చునా? ఇది సరిపో తుందా అంటే – తప్పకుండ. త్యాగమంతరించి, రాగం మిగులుతుంది. ఈరాగమెక్కడికి తీసు కెళ్ళుతుంది? సర్వత్రా అనురాగం దగ్గరకు తీసుకెళుతుంది. ఈ తను మూలం మిదం జగత్ అనేది. మీరు కొంచెం అడుగులు ముందుకు వేసుకుని దీన్ని, దాన్ని కలిపి జోడించుకుని విచారించి నట్లయితే సర్వత్రా అనురాగమన్నానే....ఒకచోట ఉంటే రాగమయింది– సర్వత్రా అనురాగముంటే విరాగమయింది. అట్లాగే తను మూలం మిదం జగత్‌కు అదే అర్థమొస్తుంది. ప్రతివాక్యం మీరు వివరించుకొంటూ పోతే, మీరక్కడే ఆగిపో కుండ వెళ్ళితే అదే అర్థమొస్తుంది.

డా॥ : కాని జగత్తంతా నీవేకాబట్టి జరిగిందంతా స్వార్థమే. నీ ఆర్డరు ప్రకారమే జరుగుతుంది కాబట్టి స్వార్థం కాకేముంది? స్వార్థంలో, తను మూలం మిదం జగత్ అన్నీ వస్తాయిగదా!

అమ్మ : అందుకే ఇందాక జన్మలులేవని నేనెందుకుంటున్నానంటే ఏ సత్యమైతే ఉన్నదో ఆసత్యం తెలిసిన వాడికి జన్మల్లేవు. నాకు లేవు - మీకు లేవు అని వాడికన్పిస్తుంది. కొంచెం తెలిసి, తెలియనపుడు ఆ భేదం కన్పిస్తుంది. ఎందుకంటే నాకు లేవు మీకున్నాయని చెప్పటం లేదు. మీకూ లేవు, నాకూలేవు అని అన్పిస్తున్నది. ఉన్న సత్యం అదని నాకన్పిస్తున్నది. నాకనిపించటం తప్పుకాదు. వాళ్ళదీ తప్పుకాదు. వాళ్ళు జన్మలున్నాయని అనటం వాళ్ళొచ్చిన రీతిలో, వారి స్థానంలో తప్పుకాదు.

శ్రీపాద : తప్పనగా ఏమిటి?

అమ్మ : ఆ స్థితి వ్యత్యాసమే, సకారణంగ....

వి.ప్ర : తెలుసుకోలేక పోవటమే-

అమ్మ : ఇప్పుడు నీ వన్నావుగదా! ద్వంద్వాలున్నాయి అన్నాడు. మీకు అనిపించడం, నాకనిపించకపోవటం కారణమడిగావు. మీరందరూ ఒకటే అని నాకనిపించింది. కాబట్టి నాముఖంలో ప్రత్యేకత నీవు చూడ గలుగుతున్నావు. మీరందరూ ఒకటేనని నా కనిపిస్తున్నది.

డాక్టరు : మీ కనిపించడానికి సరే. మా కనిపించక పోవడానికి కారణ మేమిటి?

అమ్మ : అదేగా కారణం.

డా॥ : దాన్నే దైవత్వమంటున్నాం మేం.

అమ్మ : ఆ దైవత్వం సరే, సృష్టి భిన్నమనుకున్నాం గదా! అక్కడ అట్లా ఉన్నాడు అని నేననుకుంటున్నాను అక్కడా ఉన్నదివాడే, సుబ్బారావుగా డాక్టరుగా కూర్చొని దైవముంటున్నదీ వాడే. వాడే రెండైనాడనుకుంటున్నా.

డాక్టరు : అనేవాడు వాడే, అనిపించుకునేవాడు వాడే.

అమ్మ : రెండూ వాడే. గుర్తు ఉంటే మీరు చూడండి అంటున్నాను, గీతలో నేను చేయిస్తున్నాను ఇదంతా అన్నట్లుగా....

దాక్టరు : గీతలో కూడ కృష్ణుడు చెప్పాడమ్మా.

వి.ప్ర : ఖురానులోనూ ఉంది.

అమ్మ : అంతా రామమయం అన్న రఘువరదాసుగారు – స్వర్ణోత్స వాలప్పుడు బాబాని, రమాదేవిని, ఆనందమయిని పెద్దలను తీసుకు వచ్చి నా వేదిక మీద కూర్చో బెట్టాలని ప్రయత్నిం చారు. ఈ విషయం రామకృష్ణ నన్ను అడిగాడు. నేను చాల సంతోషంతో ఒప్పుకున్నాను. వాడి అభిప్రాయ మేమిటంటే పెద్ద వాళ్ళందరిని ఒక వేదిక మీదకు తీసుకువచ్చి కూర్చోబెడితే ఎట్లా ఉంటుంది అని – నాకిష్టమే నాపిల్లలు చుట్టూ కూర్చుంటే...

ఇది ~~అచ్యుత్ నడిగితే (బాబా) ఆయనట్లా~~రారు లాభం లేదన్నాడు. రఘువరదాసు గారన్నారట రామకృష్ణతో, నువ్వు ఏంతమాత్రం ఆపని చేయవద్దు. చేస్తే పొరపాటవుతుంది. ఎందువల్లనంటే అమ్మ మాదిరి ఎవరూకారు. నేనానందమయిని చూశాను. అందర్ని చూశాను. ఇండియా అంతా తిరిగాను. ఎక్కడ చూచినా ఇంత కంటె ఎక్కువయిన వస్తువు నాకు కనిపించలేదు. నీవట్లా చేర్చవద్దు. వచ్చిన వాళ్ళను కాదనవద్దు. రానివాళ్ళను రమ్మని పిలవవద్దు. అంతా రామమయం ఈ జగమంతా రామమయం అనుకున్న రఘువరదాసుగారికి కూడా వీళ్ళ స్థానాలు తేడాగా కన్పించలా? రాముడిలాగా చూడగలిగాడు. కన్పించా డనటంలా. చూడగలిగాడు అంటున్నా.

ఈ శరీరం వదలి పెట్టిన తర్వాత కూడ, అంటే పితృకర్మల దగ్గర్నుంచి మాట్లాడుకున్నాం. వాడి మనసు తృప్తి పడలేదు. అందుకని వాడు దయ్యమయినాడనో, ఇంకొక టయినాడనో ఏదో చెప్పుకుంటున్నారు. వీడి మనసు వేరుగా ఉండి మనసుతో ఉంటున్నాడు వాడు అని చెప్తున్నారు శరీరంలో ఉన్న మనసే శరీరం వదిలేస్తే వాడిని జీవుడని, ఆత్మ అని నీ సంకల్పమేది నాయనా, నీ అంతరాత్మలో ఉంది చెప్పు నాయనా అని సంబోధించి నీ అంతరాత్మ ఏమిటి? అంటున్నాం మనం. వీడి శరీరంలో

అంతరంగంలో ఉన్న ఒక ఆలోచనని, అంతటా నిండి ఉన్నది. ఒక మనిషిలో కూడ ఉన్నట్టు మనం చూస్తున్నాం. శాస్త్రాలు చెప్తున్నాయి. నీ సంకల్ప మేమిటి నాన్నా అంటున్నాం. సంకల్పమే వాడు అంటూ నీ సంకల్ప మేమిటి అని అంటున్నాం. ఎందుకొస్తున్న దంటే ప్రత్యేకమైన మనిషి కనపడుతున్నాడు కాబట్టి ప్రత్యేక మైంది అంటున్నాం. దీన్నే కొన్ని చోట్ల ప్రత్యగాత్మ అని, అంతరాత్మ అని జీవాత్మ అని చెప్తూ ప్రత్యగాత్మకు స్వతంత్రత ఇస్తున్నారు. ఎట్లాంటి స్వతంత్రత అంటే అమ్మ మాట్లాడు తున్నది గనక రికార్డు చేద్దాం అనే స్వతంత్రత కలిగింది అంటాం. నేనే మంటున్నానంటే ప్రేరణ కలిగితేనే గాని ఏదీ చేయలేదు అంటున్నాను. లేచి నడుద్దామన్నా, లేచి నడవలేని పరిస్థితులు ఏర్పడ్డవి. రికార్డు చేద్దామన్నా ఆలస్యమవు తున్నది. వాళ్ళు తక్కువని చెప్పవలసిన అవసరం లేదు. అమ్మ ఎక్కువని చెప్పవలసిన అవసరం లేదు. ఎవరెంత వరకొచ్చారో, ఎవరెందుకు వచ్చారో ఆపనే చేస్తున్నారు కాబట్టి వాళ్ళను గురించి అన్నీ నాకు సరిపోతాయంటాను.

శ్రీపాద : వాళ్లు అంతవరకే వచ్చారు, వీరు మరో అడుగు వేశారు అనడం తక్కువ చేయడమౌతుందా?

అమ్మ : తక్కువ చేయడంకాదు. అట్లా అర్థం చేసుకోవద్దు అంటున్నాను నేను. శ్రీపాద దగ్గర కూర్చొని నీవు సైన్సు మాట్లాడుతావా అన్నారు. అంటే శ్రీపాదను పెంచటం కాదు. ఎవరికెంత తెలుసో అది చెప్పారు.

సో : నేనన్నింటిలో ఉన్నాను అన్నది ఒక వ్యక్తికి చెప్పిందా? లేక సమిష్టికి చెప్పింది?

అమ్మ : అందరికీ వర్తిస్తుంది.

# మామాట

దేశకాలాలకు అతీతమైన మహాతేజస్విని అమ్మ. ప్రేమయొక్క సర్వాంగసౌందర్యం అమ్మ మాటల్లో, చేతల్లో ప్రకాశిస్తున్నది. లోకానికి ప్రేమఫలాన్ని పంచిపెట్టిన వాత్సల్య మూర్తి అమ్మ. ఆ పండు రుచికొత్తది. ఆ పంచేతీరు మరీ కొత్తది. అమ్మను చూడడమే ఒక లోకోత్తరమైన అనుభవం. ఆ అమ్మమాటలు వింటే, ఆ మాటల్లోని భావాన్ని గ్రహిస్తే ఆనందం అనే పదానికి అర్థం అనుభవంలో తెలిసినట్లే.

విజ్ఞానఖని అమ్మ అలవోకగా పలికే పలుకులు అద్వైత భావానికి పరాకాష్ఠ. అమ్మకు అన్ని మతాలు సరిపోతాయి. జడచేతన భేదమే అమ్మకు లేదు. "అనుభవిస్తున్న దంతా సుఖమే. కాలమే అన్నింటికి కర్త. అన్నీ అంతా దైవమే – శక్తే. సుఖదుఃఖాలు రెండూ కరుణవల్లనే. ఈ కనబడుతున్న విశ్వం అనేకంగా కనిపించినా, ఒకటిగా అనిపించడమే "ఆత్మసాక్షాత్కారం". నామం చేసినా, జపం చేసినా, యోగమైనా, తపస్సైనా తృప్తికోసమే చేస్తాడు. సర్వత్రానిండిన స్వార్థమే పరమార్థం. అదే రమణమహర్షి చెప్పిన "నేను"ను తెలుసుకోవడం. దైవానికి ప్రత్యేకంగా రూపం లేదు. ఎంత వెతికినా కనిపించనివాడు దైవం. ఆ వెతకటం కోసం చేసేసాధన, ఆత్మపడే తపనవల్లనే ఆత్మావలోకన అనుభవంలోకి వస్తుంది. ఎవరిష్టదైవాన్ని వారికిష్టమైన చోట చూసుకోవడంలో తప్పులేదు. జగత్తు సత్యమే. నాకు అందరూ బిడ్డలే ఇదీ స్థూలంగా అమ్మ బోధ.

శ్రీ వీరమాచనేని ప్రసాదరావుగారు, కీ॥శే॥ డాక్టరు శ్రీపాదగోపాలకృష్ణమూర్తిగారు, అమ్మతో సంభాషించి, దానిని "టేప్" చేసి సోదరీ సోదరుల ఉపయోగం కోసం ప్రచురణకు సిద్ధం చేసారు. వారికినీ, ఈ సంభాషణలను అతిశ్రమతో టేపులనుండి అక్షరాకృతిని కల్పించిన శ్రీ గరుడాద్రి సుబ్రహ్మణ్యం గారికినీ మా కృతజ్ఞతలు.

అమ్మ చాలా బాగా మాట్లాడతారు. ఎంత జటిలమైన విషయాన్నయినా అత్యంత సరళంగా చెబుతారు. అమ్మ సంభాషణా చాతుర్యాన్ని మనం వర్ణించలేము. అమ్మ వాగీశ్వరి!

మనం యీ సంభాషణలు చదువుతుంటే - ఎవరోచేసిన సంభాషణలు మనం చదువుతున్నట్లుండదు. మనమే అమ్మకు ఎదురుగా కూర్చుని మాట్లాడుతున్నట్లుంటుంది.

సవరణలు అవసరం లేని వివరణలు, అతి నూతన ప్రవచనాలూ, అధునాతన నిర్వచనాలూ అమ్మ పలుకుతుంటే మన మేధలకు పదును బెట్టుకుంటున్నట్లుంటుంది.

అమ్మ మన తలపై చెయ్యివేసి నిమురుతూ, మన చేత గోరుముద్దలు తినిపిస్తు న్నట్లుంటుంది.

ఈ అపూర్వమైన సంభాషణలు చదివి, అమ్మసన్నిధి సుఖాన్ని అమ్మ బిడ్డలందరూ పొందగలరని ఆకాంక్ష.

-ప్రకాశకులు

# విషయసూచిక - మూడవ భాగము

# 1. మనస్సు - పరిణామము

**10-9-1974** ఉదయం **10-30** గం॥ల సమయం, దర్శనం హాలులో మైనంపాటి నరసింహారావుగారు, అచ్యుతుని రామకృష్ణశర్మ, వారి సతీమణిగార్లతో అమ్మ అభిభాషణ. జిజ్ఞాసువులై ప్రశ్నించే మరికొందరు సోదరులుకూడ ఈ సమావేశంలో పాల్గొన్నారు.

శివకామసుందరి : తెలియబడకుండా వుంది.

అమ్మ : తెలిస్తే జిజ్ఞాస కాదుగా!

అ.రా.కృ: జిజ్ఞాస అంటే?

అమ్మ : సాధారణంగా 'దిగులు' అని అర్థం. దానినే పరమాత్మునికై అన్వయించినపుడు 'జిజ్ఞాస' అంటున్నాం. 'కావాలి' అనిపించడం 'ప్రారంభదశ'. ఇంతకంటే లేదు అనే తపన నుండి విచారణ వుత్పన్న మవుతుంది. భక్తిలో తనను మరచిపోతాడు. ధ్యాసలో భక్తి వున్నది. ధ్యాసను, భక్తిని కొద్దితేడాతో ఉపయోగిస్తాం. 'వాడు' తప్ప యింకొకటి లేదనేది విచారణే. ఇదేమిటి? అని పోయి పోయి 'ఇదియే అది' అని తెలిసికొనడం విచారణే. చివరకు విచారణలోకూడ ధ్యాసవున్నది. ధ్యాస, ధ్యానం కలుస్తాయి. ధ్యాసలేని ధ్యానం లేదు. ఈ రెండూలేనిది విచారణ లేదు. ఇంతకంటే (మరొకటి) లేదు అనేది నామం చేసినా రావచ్చు. 'వాడు' అనేది అందుకోలేవు. నీవు చేస్తున్నది మానుకోలేవు. అన్నీ ధ్యాసతోనే చేస్తావు. ఎందుకు చేయాలి? నాకు తెలియకుండా భూమిమీదకు వచ్చి చదువు, ఉద్యోగం, భార్యపిల్లలతో ఇట్లా వుంటూ 'వాడిని ' ఏదో తెలుసుకోవాలనిపించింది. ఏమిటో తెలుసుకోవాలని ప్రశ్నించుకొండి. ఎవరో చెప్పింది, వినేది, అర్థం చేసుకునేది-తనే. బాగున్నదన్నా, బాగు లేదనుకున్నా నీవే. నీ మనస్సులో కొలతబద్ద పెట్టుకొని తృప్తిపడతావు. నీ అభిప్రాయం నీకు తెలుసు. కాని ఈ అభిప్రాయాలు ఎక్కడివో నీకు తెలియదు. ఆలోచనలను వినేది, కనేది – మనస్సు అనిపేరు. మనస్సు

ఎలా వుంటుంది? ఏమిటి రూపం? గ్రహించేది మనస్సు. కళ్ళద్వారా చూచేది ఆశక్తే. కళ్లు, ముక్కు, కాదు. మనస్సు కాకుండా వుందా ఈ శరీరం? దీనికి సంబంధించిన కర్మలను, ఉన్నతమైన ఆలోచనలతో కూడిన జిజ్ఞాస అని– అటువంటి వానిని 'జ్ఞాని' అని పేరు పెడుతున్నాం. ఆలోచన వచ్చింది. మనస్సు శరీరం కాకుండా మూడోది లేదు. ఆత్మ అనేది ఏమిటి? అని ప్రశ్న? శక్తి అని సమాధానం. ఆశక్తి లేక ఆత్మ ఫలానా రూపంగా లేదు. ఆత్మ మృతిచెందేది కాదని, నశించేది కాదని, గోచరించేది కాదని చెబుతున్నారు. శరీరంతోనే మనస్సు కనబడుతున్నది. **శరీరాన్ని నడిపించేది శక్తి.** పరిమితంగా వున్న దానిని మనస్సు అంటున్నాం. శరీరంలో వున్న ఆ శక్తిని అది చేసే పనులను 'మనస్సు' అన్నాం. ఆమనస్సు అనేకం చూస్తున్నది? అనేకం గ్రహిస్తున్నది. అంతటా నిండివున్న శక్తిని 'ఆత్మ' అన్నాం. పంచభూతాలు ఏపనులను చేస్తున్నాయో, పరిమిత శక్తి (మనస్సు)గల యీ శరీరం ఆపనులే చేస్తున్నది. పంచ భూతాలతో నిర్మించబడ్డది గనుకనే పాంచభౌతిక శరీరం అన్నాం. అపరిమితంగా నిండి నిబిడీకృతమైన దానిని 'ఆత్మ' అన్నాం. పరిమితంగా వుండి శరీరంలో వున్నశక్తిని 'మనస్సు' అని పేరు పెట్టాం. పరిణామమేమో అవుతున్నది. చచ్చినదని ఎవరికి తెలుసు? ఆత్మ రూపరహితమైనదని అంటున్నాం. రూపంతోవున్న అగ్నికి పేరు వున్నది. రూపరహితమైన దనేదికాదు. అది కానిదిలేదు గనుక, అదే అన్ని రూపాలూ గనుక ఆపేరు వచ్చింది దానికి, 'జీవుడు' అనే పేరు ఎందుకో? ఆత్మకు నామరూపాలు లేవంటున్నారు. శరీరంలో ఆలోచన గల మనస్సును 'జడం' అంటున్నారు. ఆలోచన జీవవిధానం. జీవుడంటే ప్రాణమనే. ఈ అర్థంలో దానికా పేరు సరిపోవచ్చు. ప్రాణమంటే – శరీరమా? మనస్సా? శక్తియా? ఈమూడింటి కలయిక వల్లనే. ఈ శరీరం శక్తిచేతనే ఏర్పడ్డది. రక్తం, ఎముకలు, కండరాలు; అన్నీ....పనులు వేరు. ఆలోచన

ఒక చోటునుండి అయినా (పనులు) ఏభాగానికా భాగం నిర్వర్తిస్తుంది. సృష్టికంటే మించిన దైవం ఎక్కడుంది? సృష్టియే దైవం. దైవం అంటే - అసలు - కేవలం - ఉన్నదే. ఇంతకంటే ఆ పదానికి వేరే అర్థం దొరకలా నాకు. నా వరకు తోచలా. నీవూ కేవలం లోదే! ఏం వున్నది? ఉన్నదే. ఈ మాటకు అర్థం. భావం దొరికితే అన్నీ దొరికినట్లే. ఇన్ని అవయవాలతో ఏపనికాపని చేస్తున్నా ఆశక్తి గొప్పదనాన్ని, దాని పరిణామాన్ని ఏమి చెప్పగలం? 'ప్రాణమం'టే అర్థం కాలేదు గనుక ప్రాణమునకే 'జీవుడు' అని పేరు పెట్టారు. మీరనే విధంగా ప్రాణం పోయిన పిదప జీవుడు ఎక్కడికి వెళ్ళడం? ప్రాణమూ శక్తే. ఆలోచనలిచ్చేదాన్ని మనస్సు అని మనమంటే బ్రెయిన్ అని యింకొకరు అంటున్నారు. 'బ్రెయిన్'కు రూప ముందంటే - వచ్చే ఆలోచనలనా?

ప్రత్యేక రూపంగావుండి 'గుర్తు' చూపించుకోడానికి, చెప్పుకోడానికి, 'నేను' అనేది గుర్తు. అంతటా నిండివున్న ఆ నేను 'బ్రహ్మ' అన్నారు. **శరీరంలో వున్న శక్తిని మనస్సు** అన్నాం. అన్నీ నేనైన నేను - అన్నీ తానైన నేను....తలుపు, తుమ్మ, బొమ్మ - ఎవరో అడుగగా ఎవరో చెప్పుకోడానికి వాటికి పేరు - ఆత్మ, మనస్సు - వేరుగా లేవు.

మై.లక్ష్మీనరసింహారావుగారు: అమనస్క మంటే ఏమిటి?

అమ్మ : తారకమంటే మంత్రం, సాంఖ్యమంటే గుర్తు. 'తారకమంటే' గ్రహించేది. 'అమనస్కము' పొందేది.

సోదరుడు: స్వాధీనమవటం అంటే?

అమ్మ : తెలియటమే స్వాధీనమవటం. సాంఖ్యమంటే గుర్తు. తారకము చేసేది. 'అమనస్కము' పొందేది. ఇది అని అర్థము చేసుకొనేది, రెండు తానైనదే అమనస్కము. త్రిపుటి అన్నా, అమనస్కమన్నా, అన్నీ ఒకటే. ఉన్న విషయం, ఔనన్న, కాదన్న, ఇదే. ఆచార్యులు, మతాలు, సిద్ధాంతాలుగాక మనిషి - మనసు - ఈ వివరణలనుగూర్చి మాట్లాడుకుందాము. నాకన్నీ

ఇష్టమే. కొద్ది గొప్ప లేదు. ఎట్లా వచ్చినా ఇష్టమే. దైవము లేదనేవాడూ నాకు సరిపోతాడు. ఎందుకని? వాడు చూడలేదు గనుక. దైవశక్తి యున్నదని మానవశక్తితో గ్రహించాలని ఒకడు - వాడిని అర్థము చేసుకొవాలనేవాడు ఒకడు. ఇది కాదనుకొని కైవల్యము పొందాలనుకొని, ఆ లోకములో నుందామనుకొనే వాడొకడు, పరమాత్మ స్వరూపమైన రాముడనో, కృష్ణుడనో, అమ్మనో పిలుస్తున్నాననుకొని, వాడిని ధ్యానించు తున్నానని అనుకునేది ఒకడు. వాడు వేరని తాను వేరనుకొని సంతోషపడు వాడొకడు, తాను తినే ప్రతివస్తువు వాడికి పెట్టి, వాడిచ్చా దనుకొంటూ - తృప్తిపడే వాడొకడు, వాడిని కీర్తించడమే ప్రధానమనుకొను వాడొకడు. తానమృతమై పోదామని లేక విడిగావుండి అమృతాన్ని రుచి చూడాలనుకునే వాడొకడు - ఇన్ని రకాలు. ఒకడు దైవమెక్కడో లేదనుకొని కనబడుచున్న ఈ సృష్టియే దైవమనుకునేవాడు మరొకడు. వాడిని భూషించడమో, కీర్తించడమో, జపించడమో, ప్రధానలక్షణము గలవాడు మరొకడు. ఎన్ని చేసినా ఇవన్నీ సృష్టిలోనివే, అన్నీ ఆ విధానము లోనివే.

నే సాధన వద్దనలా! సాధ్యమైతేనే! దైవం సాధ్యపరంగా వున్నా డిక్కడ. వాడికంటే భిన్నంగా లేదు. నామం చేసినవాడూ సరిపోతాడు. నాదృష్టిలో తులసీ, సంపెంగ వానిలోని శక్తి ఒకటే. సాధనసాధ్యములు కావు. సాధ్యసాధనమే.

అవసరమే విలువైనది. ఇందరువున్నా, ఇపుడు మాట్లాడుతున్నా, నాకు మంచినీళ్ళు అవసరం.

దైవం అన్ని రూపాల మనిషికి వుపయోగపడతాడు. దైవమే మనిషిగా వున్నాడనుకుంటాను.

అన్ని సిద్ధాంతాలు, మతాలు సరిపోతాయి నాకు.

(కొంతసేపు నిశ్శబ్దం) అమ్మనించి గంగానిర్ఝరిలా సాగిన వాగమృత ప్రవాహంలో తలమున్కలైరి.

అ.రా.కృ : (అమ్మను మరేమీ ప్రశ్నించటానికి తోచక పృచ్ఛకులు మౌనులైయుండగా, ఆయన తన భార్య నుద్దేశిస్తూ) సందేహమేమైనావున్నా అమ్మను అడుగవచ్చు.

అమ్మ : (చమత్కారముగా) ఆ సందేహం నీ కెందుకు?

–ఈ మాటతో అందరి మోమున ఆనందపు పూవులు.

అమ్మ : సందేహం తీరడమూ ఒక స్థితే. ఇతరులు చెప్పిన దానికంటే తనలో కలిగిన అనుభవం స్థిరపడిపోతుంది.

ఎన్నో ప్రశ్నలడగాలనుకొని అమ్మను చూచినంతనే మైమఱచి శ్రోతగా మారిన నరసింహారావుగారిని చూస్తూ "నీ ప్రశ్నలు నేను చదవలా. నీ మనసు నాకు తెలుసు. నీ మనస్సుకు యీ బాధ అయివుంటుందని నేననుకున్నాను. ఆలోచనలు, బాధలు - రకరకాల వ్యధలు. ఉన్న దాని స్వభావం యిన్నిరకాల మారిందీ వేదాంత రహస్యం యిన్ని రకాలుగా రూపొందింది. మారనిదంతా ఒకటే అని చెప్పుకోదానికే ప్రకృతినే జయించటం ప్రారంభించి, ప్రకృతియే దైవమని తెలుసుకోవడం - ఇదే ఆత్మానాత్మ విచారణ.

సో : జ్ఞాని అనగా ఎవరు? అజ్ఞాని అనగా ఎవరు?

అమ్మ : అక్కడ ఒక సంచీ వున్నది. దానిని యింకొకటిగా అనుకునే వాడు అజ్ఞాని. సంచిని సంచిగా గుర్తించినవాడు జ్ఞాని. అంటే–ఉన్నది వున్నట్లుగా గుర్తించినవాడు జ్ఞాని. ఉన్నదాన్ని మరోరకంగా అర్థంచేసుకునే వాడు అజ్ఞాని.

సో : చైతన్యము అవగాహనకాదు.

అమ్మ : గాలివల్ల కొమ్మలు వూగినట్లు కన్పిస్తుంది. కాని మ్రాను ఊగినట్లు కన్పడదు. గాలి స్వభావం కదలించడం. దాని తీవ్రతవల్ల మ్రాను, భూమి కదలవచ్చు. శక్తీ, సృష్టీ వేరుకాదు. ఒకటే.

సో : జీవుడు బీజరూప మంటారే?

అమ్మ : మనిషి – మనస్సు – శక్తి; వీటి మధ్య చూడటమే బీజ మనుకోవడానికి కారణం. వడ్లగింజ వున్నది. దానిని భూమిలో మొలకెత్తించవచ్చు. బియ్యపుగింజ మొలకెత్తలేదు. ఆధారమైనది బీజం. గింజను భూమిలో పెట్టాను. అది రెండు దిప్పలుగా విడివడి, ఆ పలుకునుండి మొక్క ఉద్భ విస్తుంది. కాని ఆ బీజము మళ్లీ మళ్లీ రావటం లేదు. సముద్రమదే. తరంగాలు దాని రూపాంతరాలు. వెనకాముందు నీరు రావచ్చుగాని, అదే అల రాదు.

సో : ప్రారబ్ధానుభవం అంటారే!

అమ్మ : ఇప్పటికి పూర్వం అక్కడ కూర్చున్నారు. మీరు వచ్చింది దానికి పూర్వం. దానికి పూర్వం తెలుసుకుందామనే అభిప్రాయం. శక్తి రకరకాలుగా, రూపాంతరాలుగా మారటం దాని స్వభావం. ఉన్నది అదే అయితే ఏది ప్రారబ్ధం? ఎక్కడిది యీ ప్రారబ్ధం? అన్యథా లేదు. ఉన్నదే అది. 'ఆగామి' అంటే మూలం;

సో : సంచితం వచ్చిన తర్వాత చేసేది; ప్రారబ్ధం అనుభవించేది.

అమ్మ : జీవుడు తెలియదు. మనస్సూ అర్థం కాదు. గ్రహించేది మనస్సు. ఒక యింటిలోనే మనిషి ఒక భాగం హాలు అనీ, ఒక భాగం పడక గది అనీ, ఎట్లా పెట్టుకున్నాడో – మనస్సు ఒకటే అయినా ఒక్కొక్క దశలో చిత్తమనీ, మరొకటి అనీ పేర్లు పెట్టారు. ఉత్కృష్టమైన ఆలోచనలు గలవాడిని జ్ఞాని అంటున్నాం. కొన్ని ఆలోచనలు గల వాడిని క్రూరుడు అంటున్నాం. ఒకడిని చంపుదామనుకున్నా, రక్షించాలనుకున్నా మనస్సే మూలమైనది. ఒకటిగావున్న ఆలోచనకు జ్ఞాని అనీ, రెండుగా వచ్చే ఆలోచనకు అజ్ఞాని అని పేరు పెట్టారు. పూజ్యభావం గలిగిన ఆమనస్సే దైవం. ఆ మనస్సే ఒక దశలో రాక్షసి, కొన్ని ఆలోచనలు హాయిని కలిగిస్తాయి. ఈ ఆలోచనా రీతికే, అది చేసే పనులకే జ్ఞాని అంటున్నాం. మనస్సుకు కాదు యీ పేరు. ఎవడికివాడు 'నా మనస్సు' అంటున్నా

నిలుకడ Base మనస్సు పైనే. మనస్సు వేరా? గీతలో కూడా పూర్ణమైన మనస్సుగల మానవుడినే దైవమంటున్నది. అన్నింటికీ మనస్సే ప్రమాణం. అవతలవాడిని గ్రహించటానికి, గుర్తించటానికి మనస్సే ప్రధానం. ప్రారబ్ధం మనస్సుకు కాకుండా ఎక్కడన్నా మిగిలి వున్నదా? మనస్సుకు తోచిన ప్రకారం చేస్తున్నాడు. పూర్వజన్మలో దాగిన కర్మ విజృంభిస్తుం దనటానికి ఆధారం దొరకలా! మనస్సులో ఎక్కడ దాస్తాడు? ఒకడిని ఒకడు కత్తిపెట్టి పొడిచాడు. ఈ కర్మ ఎక్కడ దాగివున్నది? పాయసములోని తీపి గరిటె కంటదంటున్నారు. పరిమిత శక్తి మనస్సు. అపరిమిత శక్తి ఆత్మ. ఇందుకు భిన్నంగా తోచలా నాకు. మనస్సుకు చావు లేదు. అంటే చచ్చేది ఎవరు? భయపడే మనస్సుకు 'సైతాను' అని పేరు. హాయిగా నిద్రపోతున్న నాకు వాంతి చేసుకున్నట్లుగా కలగన్నాను.లేచి చూస్తే ఏమీ లేదు. అట్లా అనుభవమంటాడు యీ ప్రపంచాన్ని. నిద్రకాలంలో కూడా యీ శక్తి అనేకం భావిస్తుంది. జగత్తులో ఏం చూస్తున్నామో, కలలో వున్నదే కంటున్నాం. అనుభవించేవాడి కలవరం చూచేవాడికి వింత. మనస్సు వికలమైన వాడిని పిచ్చివాడు అంటున్నాం. అదీ బ్రహ్మ స్వరూపమైతే ఎందుకు రావాలి? మనస్సుకు వ్యష్టిత్వం వుంది. ఇప్పుడు నీకున్నటువంటి శక్తి గర్భంలో నున్న ఆ శిశువు మనస్సుకు వుందా?

సో : ఆ....వుంది.

అమ్మ : ఆ మనస్సు యీ శరీరంలో ప్రవేశిస్తేనే అట్లా తరతమభేదాలు వచ్చేది.

సో : పుట్టుకలోనే మూగ, కుంటి, గ్రుడ్డి....ఎందుకున్నవి?

అమ్మ : నేనాయింట్లోకి వెడుతున్నాను. గడపలో ఎదురు దెబ్బ తగిలింది. వాతపిత్త దోషాలతో ... శరీరమార్పుల వల్ల, ఓపిక లేక పోవటంవల్ల.... ఆహారమందరికీ అవసరమే. ఒకడు గిద్దెడు తింటే, ఇంకొకడు సోలెడు తింటాడు. అవీ అట్లాగే వచ్చాయి. ఈ క్షణానికి జరిగిన క్షణం ప్రారబ్ధం అంటే ఒప్పుకుంటాను.

సో : 'భోగతోనశ్యతి' అంటే?

అమ్మ : అనుభవించినకాలం తిరిగిరాదు. ఈ మాట్లాదేదంతా భోగతోనశ్యతే తిరిగి చూపించలేనిది.

సో : నడకలు ముందే నిర్ణయించబడ్డాయంటారా?

అమ్మ : పుట్టడమే నిర్ణయించడం. నిర్ణయం మాట పనిలా నిర్ణయం చూశావా - అనవచ్చు. జరగబోయే దానికి, జరిగిపోయిన కాలమంతా ప్రారబ్ధం. అది తిరిగి వస్తుందా? అనవచ్చు. పొట్లకాయలు వుడక బెట్టావు. ఆ పచ్చిదనం లేదు రాదు.

సో : ఆ 'గామి' అంటే?

అమ్మ : ఉన్నదే - దైవమనే.

సో : పుణ్య పాపసముచ్చయమే ఆగామి.

సో : మరణాంతరమేమిటి?

అమ్మ : పుట్టుకకు వెనుక ఏమిటో, మరణాంతరమూ అదే. ఈ రెండు స్థితులు ఒకటేనని నా అభిప్రాయం. జననానికి వెనుక ఏమిటో తెలియదు మరణం తర్వాత ఏమిటో తెలియదు.

సో : శరీరముండగానే దీనిని తెలుసుకోమని చెబుతున్నారు.

అమ్మ : వస్తువులేని గుణం చెప్పగలవుగాని గుణములేని వస్తువును చెప్పలేవు. లేదు, నేను ఎదురుగా పెట్టుకొని ఆత్మను చూడగలనా? వస్తువుగా లేదు - తెలిసేదిగాదు - తెలియబడేదిగాదు - యిట్టిదానికై ఆత్మ సాక్షాత్కారం అన్నారు. సాక్షాత్కారం అన్నప్పుడు దర్శించటంకదా? రూపంలేనిదానిని ఎలాచూడటం? సాక్షాత్కారమని వ్రాస్తున్నారు. జగత్తు ఆత్మకంటే భిన్నంకాదు. నేతి నేతి అనేదిపోయి ఉన్నదే యిది 'జగత్తు' అని.

స్తో : మోక్షమంటే?

అమ్మ : ముముక్షుత్వమే మోక్షం - తృప్తేముక్తి

స్తో : ఒకసారి కలిగితే పోదా అది?

అమ్మ : సర్వకాల సర్వావస్థలయందు వున్న తృప్తే ముక్తి

స్తో : నిర్వికల్పసమాధి అంటే?

అమ్మ : లేదు. వట్టిదే. నిర్వికల్ప మంటే ఏమీలేని స్థితి. తను తనుగా వున్నపుడు తనుగాదు. ఆనందముందీ అంటే వృత్తి వున్నది. నిర్వికల్పమును ఆనందస్థితి అనడానికి లేదు. నీవు కానిది లేదు అనేది - అన్ని వేళల్లో నీకు తోచేస్థితిని, నిర్వికల్పము అనవచ్చు. తెలియని స్థితిలో ఆనందంలేదు. తెలిసిఅనుభవించేదే ఆనందం. గాఢసుషుప్తిలో కూడ మనస్సువుంది. సుషుప్తిస్థితిలో అమ్మా! అనికేక వినపడ్డది. ఏది విన్నది? నిద్రలో, మెళకువలో వుండే యింద్రియం వున్నది. అదివరకే వృత్తి లేకుండా వృత్తితో ఉందేమో! కలగాని నిద్రఅంతా గాఢ సుషుప్తి. సుషుప్తిలో నుండి జాగ్రత్తలోకి తీసుకొని రాగలిగినది (యింద్రియం) వున్నది. వృత్తితోనూ వుంది. వృత్తి లేకుండానూ వుంది. సంకల్పమంటే దైవం. సర్వసంకల్పాలూ తానైన సంకల్పమే సంకల్పరహితమైన సంకల్పం.

అం అ

# అమ్మతో సంభాషణ

సో : ఇవన్నీ నిర్ణయంలోనిదే నంటారా?

## మనస్సు

అమ్మ : వాదులేకుండా ఏదీలేదు. ఉన్నది (వాడే) మనస్సే. ఆమనస్సుకే జ్ఞానమని, జీవుడని, దేవుడని, ప్రాణమని – అన్నీ అన్నారు. ఏదైనా తెలియడమే కాని ఎవరిద్వారానైనా తెలియబడడంకాదు. తెలియనప్పుడు తెలిసికోలేదని పిస్తుంది. తెలియకపోడమే కాని తెలిసికోకపోవడం కాదు. అది ఎందుకు తెలుస్తుందో తెలీదు, ఎందుకు తెలీదో తెలీదు అని "వాడు" అంటే ఎక్కడో – ఏదో కాదు – అందరు చెప్పుకొనే ఆత్మఅనే. ఐతే అది ( మనము) చూచేదికాదు, (మనకు) తెలిసేదికాదు, (మనము) వినేదికాదు. (దానికి) రూపం, నామం లేదనిచెప్తూ, నశించేదికాదనిచెప్తూ, స్థిరమైనదంటూ, కదిలేదానితో (కదలి) మెదలని దానిని తెలుసు కోవడం ఏ విధంగా? మనస్సుకు చైతన్యమున్నది, రూపమున్నది. నేను మనస్సునే ఆత్మ అంటున్నాను. అయినాదాన్ని గురించి మనం మాట్లాడదానికి వీలులేదు. ఎందుకంటే నిజానికి చూచేదంతాకాదని, అర్థమైనదంతా కాదనీ అంటున్నారు గనుక. అయినా ఆత్మను గురించి సంభాషణ చేస్తాం. ఇంకొకటి చెప్పుకొని (దాన్ని) ఆత్మఅంటాం. ఆత్మ విచారణంటే అందిన దంతా కాదని తెలుసుకోవడమా? పొందడమంటారుకదా! ఏమిటి పొందుతాడు? వారి దృష్టిలో కనపడేదంతా కాదనేగదా?

# నిర్గుణము - నిర్వికల్పము

సో : (ఆలోచనలు) ఏమీ తోచకుండా ఉండటం. పొందటం దానిని గురించి ఏమీ తెలియక పోవటం .. అప్పుడది నిర్గుణం అని....

అమ్మ : నీవుచూస్తే గుణముంది (ఉన్నట్టేకదా?)

సో : చూడకుండా ఉన్నదే నిర్గుణం

అమ్మ : నిర్గుణం పొందటమంటే ఏమిటి?

కొం : ఏమీకాదని

అమ్మ : లేనిస్థితి--ఇవన్నీకానిది ఆత్మ అంటారా? నిద్రలో కూడా అనుభవిస్తున్నాడు (కదా?)

కొం : ఎవరు?

అమ్మ : ఏమీలేని స్థితి అంటున్నారు. జాగ్రత్తలో ఉండగా పోల్చుకొని నిర్వికల్ప సమాధి అని పేరు పెట్టుకొన్నారు. సంకల్పము లేని ఒక క్షణాన్ని నిర్వికల్ప మన్నారు. లేని స్థితిని గురించే సంకల్పముంది

కొం : ఔను

అమ్మ : వీడుగుర్తించని స్థితిలో వీడి అనుభవ మనగాఏమిటి?

కొం : నిర్వికల్పమును గూర్చి మీరు క్రొత్తవివరణ రూపొందించటం జరిగిందని నా అభిప్రాయం.

అమ్మ : ఇందులో కొత్త ఏముంది? ఉన్నదేగా! ఇంకొక్కటి లేదు. రాత్రి అమ్మకు శాస్త్రం ప్రమాణంకాదనీ (నేనన్నానని) అన్నావు. శాస్త్రం అది చదివిన వాడికి ప్రమాణం. నేను చదువలేదు కనుక నాకుకాదు. నా అనుభవాన్ని, నాకు తోచింది నే చెప్తాను. అవి శాస్త్రంలో ఉండవచ్చు, శాస్త్రమునకు అతీతంగా ఉండవచ్చు, శాస్త్రం కావచ్చు. నా అనుభవాన్ని వివరిస్తున్నాను గనుక ఫలానా పేజీలోనిది అనవలసినపనిలేదు. ఇది చెరిపేది కాదు. నా స్థిరమైన అభిప్రాయాన్ని మీకు చెప్తున్నాను. శాస్త్రంలో ఏముందో చదివి చెప్పే అలవాటులేదు.

# జన్మలు

జన్మలులేవని చెప్పి నలుగురిని నమ్మించాలనిలేదు. ఎందుకంటే ఒకరు చెప్పింది నమ్మినవి నన్ను ఆనందింపచేయలేవు గనుక. జన్మలులేవని నాకుతోస్తుంది. ఉన్నాయనడానికి నాకు ఆధారం దొరకలా! జీవుడెవరు?

కొం : ప్రత్యేకంగా జీవుడున్నాడని అద్వైతం చెప్పలేదు. తెలిసికోనితనమే అజ్ఞానం. అజ్ఞానం పోతే మిగిలింది ప్రజ్ఞానమే. తనలో ఉన్న ప్రత్యగాత్మనే జీవుడను కొంటున్నాడు. ఎందుకంటే – భ్రాంతిచేత. అవిద్యతొలగినట్లయితే ప్రతి బింబాలు పోతాయి. శాస్త్రసారాన్ని మీరు కూలంకషంగా వివరిస్తున్నారు. కాని శాస్త్రంమాత్రం అవిద్యాప్రతిబింబితమగు ప్రత్యగాత్మనే జీవుడం టుంది.

అమ్మ : శాస్త్రంలోని పడికట్టుపదాలను నేను వాడను. ఉన్నవస్తువు అదితప్ప ఇంకొకటి లేదు.

కొం : వాడు సృష్టి అయినాడన్నప్పుడు కర్త ఉన్నాడని తోస్తుంది. మీరు సృష్టియేకర్త అని అంటారు ఇదే సహజరూపమా?

అమ్మ : ఏది ఉన్నదో అదే. దేవుడున్నాడా అనిమీరు అంటే వాడు సృష్టిగా అయినాడంటాను. వస్తువేది? అంటే ఉన్నదే. మీరు చెప్పినట్లుగా దేవుడెట్లా ఉన్నాడు? వాడికి సహజరూపమేమిటి?

కొం : ఇదంతా–

# భ్రాంతి

అమ్మ : అదినామాట

కొం : "సర్వం ఖల్విదం బ్రహ్మ" నీ భ్రాంతిచేత నీవు వేరను కొంటున్నావు.

అమ్మ : "సర్వంఖల్విదంబ్రహ్మ" అన్నప్పుడు అన్నీవాడే, ఎవరుచేయగలరు యీరూపం? ఆ సహజంలోనే, వికారాలు, వినాశము అన్నీ ఉన్నాయి. సమిష్టిగా గుర్తిస్తే వాడు - వికారాలు చూస్తే మానవుడు. వ్యష్టిత్వమే వికారాలు. ఒకేధారం మడతవేస్తే రెండుగా కనిపిస్తుంది. రెండుగా కనిపిస్తుంది గనుక భ్రాంతి అన్నారు. రజ్జుసర్పభ్రాంతి. రెండూ తెలిసినవాడు భ్రాంతిపడుతున్నాడు. రెండుగా ఉన్నది గాబట్టే యీభ్రమ. అచ్చుగా యే ఒక్కటో తెలిస్తేలేదు.

కొం : పెద్దలు - సందెచీకటిని ఉదహరిస్తారు.

అమ్మ : దాని అర్థంమార్పు అనే. సంధి అంటే రెండింటి మధ్య పగలు, రాత్రి.

కొం : వాడే అన్నీ అయితే సాధన ఎందుకు?

అమ్మ : చేయాలని సంకల్పం వస్తేనే చేస్తాడు.

కొం : చేస్తే పొందేదేమిటి?

అమ్మ : చేయాలనిపిస్తేనే చేస్తాడు. పురాణానికి పదిమంది కలిసివెళ్ళామనుకో నాన్నా.రాముని చరిత్రను అందరంవిన్నాం. రాముడిగా అంతమంది అవ్వాలనుకొన్నాం. ఈ చెయ్యాలని అనిపించిన వాడికి అది కారణం కావచ్చు. ఎందుకు చెయ్యాలని అనుకోడమెట్లో, చెయ్యాలని అనిపించిన దానిని మానుకోక పోవడం అంతే.

కొం : ఈ అన్వేషణ స్వతస్సిద్ధంగా వచ్చిందా? ప్రేరణ చేసేవాడు ఒకడున్నాడని తోచిందేమో!

# శక్తి

అమ్మ : అన్ని పనులకు ప్రేరణే)

కొం : ఆ ఆసక్తి ఎవరికి?

అమ్మ : ఆ శక్తికే :

కొం : బాధలుపడుతున్నది ఎవరు?

అమ్మ : ఆ శక్తే పడుతున్నది. ఆశక్తికే ఆసక్తికలిగింది. అది నీవుగా ఉందిగా!

కొం : జగత్తు సహజ మంటారా?

అమ్మ : అవును.

కొం : ఆశక్తి వ్యవహారములలోనికి మనలను ఎందుకు దింపుతున్నది?

అమ్మ : అది అదేది గాదు. ఇదే అయిఉన్నది.

కొం : శాస్త్రం తారుమారుగా చెప్పియున్నది – అందుకే దిక్కుతోచకుండా మా పరిస్థితి అఘోరించినట్లయింది. శాస్త్రమును నమ్మి అవధూతలు, తాపసులు ఎన్ని బాధలుపడుతున్నారు?

# అవధూతలు

అమ్మ : అవధూత అయితే యిలకేమి నాయనా!

సో : అవధూత లక్షణాలు ఏమిటి?

అమ్మ : యమ, నియమాలకు అతీతంగా ఉంటాడు.

కొం : ఒక రిటైర్డ్ జడ్జి అన్నారట. దేవుడులేదని మీరు ఋజువు చేస్తే, నేను దేవుడున్నాడని ఋజువు చేస్తానన్నాడట. దీని భావమేమిటి?

అమ్మ : ఉన్నదానినే దేవుడంటున్నాడు.

కొం : అప్పుడు మరి లేదని ఋజువు చేయలేము.

# సాధన

కొం : అవకాశాన్ని గమనించడమే సాధన అన్నారు గదా - ఈ వాక్యాన్ని వివరించి చెప్పండి.

అమ్మ : నా దగ్గరకు ఒక వ్యక్తి వచ్చాడు. జపం, తపం - చేసుకొనేందుకు అవకాశంలేదని బాధపడుతూ వాపోయాడు. కాని సాధన చేసుకొందామనే ఆలోచన వచ్చింది. చేద్దామని గుర్తుకు వచ్చింది గనుక అదే సాధన. ముక్కుమూసుకొని ఒక చోట కూర్చున్నదే గాదు. సాధన చేయాలనే మనస్సు ఉండి, పరిస్థితులు అనుకూలంగా లేనందున చేయలేక పోతున్నాడు. చేయాలనే ధ్యాసపోలేదు. ఆ అవకాశాన్ని గుర్తించటమే సాధన. ఎవరు యే పదాలతో ప్రశ్నిస్తే, ఆ మాటలతోనే సమాధానం చెప్పటం నాకలవాటు.

# మఱుగు

కొం : మఱుగే నా విధాన మన్నారు. ఈ వాక్యాన్ని వివరించండి.

అమ్మ : అమ్మ ఏమితెలిసి చెప్తుంది అని వాడుక ఉంది.

ఒం : నేనట్లా అనుకోను,

అమ్మ : తప్పు, ఒప్పులనన్నింటిని, అందరిని కడుపులో పెట్టుకోవటమే నావిధానం. మఱుగనేది ప్రతి మానవుడికీ అన్ని విషయాలలో అవసరమే. మఱుగంటే హద్దు - చెప్పకూడదని కాదు. ఆత్మను గురించి ఏమి చెప్తున్నా చెప్పకలిగింది కాదంటున్నాయి. నీ అనుభవం నీవు చెప్పటంలో కూడా అనేక విషయాలు మఱుగున పడిపోక తప్పదు. అంతటా నిండి యున్న శక్తికే ఆత్మ అనిపేరు పెట్టాం. శక్తి ఎట్లా అర్థమౌతుంది? కలానికి వ్రాసే శక్తి, కాగితానికి అక్షరాలను ధరించే శక్తి - ఒక్కొక్క దానిలో ఒక రకంగా ఉంది. శక్తి అనేకంగా ఉంది. ఈయిమిడి యున్న శక్తిని ఎట్లా చెప్తావ్? ఉన్నదంతా శక్తే. శక్తి ఏదంటే? అనేక రూపాలలో ఉంది. శక్తి మఱుగు పడి ఉంది. (అమ్మ వ్రేళ్ళు ముడిచి) - నా గుప్పిటలో శక్తి ఉంది. పట్టుకొనే వాడు లేదు. ఏదైతే మఱుగుపడివున్న శక్తో దానిని అమ్మ అనుకోవచ్చు. ఏదైతే ఉన్నదనుకున్నారో - అదే నా విధానం.

# దైవం

కొం : ఏ దేమైనా దైవం అర్థంకాదు.

అమ్మ : దైవము అంటున్నారు. ఎవరికి ఆ పేరు?

కొం : మీరు చెప్పిన ఆశక్తికే.

అమ్మ : దేవుడంటే ఏమిటి? ఎందుకు, ఎవరికి?

కొం : ఆ అతీత శక్తికే.

అమ్మ : నాకు అందుబాటులో లేనిది - అతీతమైన శక్తి, అందుబాటైనదల్లా కదా? దేవుడనే మూడక్షరాలకు అర్థం ఏమిటి?

కొం : క్రీడించువాడు దేవుడు.

అమ్మ : దేవుడంటే అసలు, కేవలం, ఉన్నదే, మూలం అంతే.

నో : పై చెప్పిన వాని కంటే దేవులాడినా దొరకని వాడు దైవం అన్న మీనిర్వచనం నాకెంతో ఇష్టం.

అమ్మ : అందినదల్లా కాదన్నారు. కనబడినదల్లా కాదన్నారు. అది ఏది? అందనిదల్లా ఇదే అయివున్నది. అందుకే దేవులాడినా దొరుకని వాడు దైవమన్నాను.

కొం : మీకేమీ లేదు. మీరు చెప్తున్న విప్లవాత్మక, విశిష్ట సందేశాలను ఎట్లా వ్యాప్తి చెయ్యాలా అని అనుక్షణం ఆరాటమే మాకు

అమ్మ : తెలియబడటమే కాని తెలుసుకోవట మన్నదిలేదు. నాకోసం ఇంత దూరం నీలెండ్ వచ్చాడు. తాను ఇంత కావాలనే ప్రయత్నం ఉంది. అమ్మా-అమ్మా అంటున్నాడట.

# నేను

అమ్మ : ఆ శక్తి అనేక రూపాలైంది. మనస్సయింది. ఎవరికివారం నేను అంటున్నాం. నేనంటే ఏమిటి? పరిమితిగల రూపమే నేను. ఎవడికివాడు నేను అని గుర్తు చెప్పుకోడానికి. సర్వదేవ నమస్కార మంటాం. ఆమాటకు వాడు సర్వంగా ఉన్నాడనేగా!

కొండప్ప : రూపం వస్తే చిక్కు.

అమ్మ : (నవ్వుతూ) రూపం రాబట్టేగా నీకింత తాపత్రయం. యత్నముందను కోవటమే తాపత్రయం.

# జన్మలు

అమ్మ : మీరు జన్మలను గురించి తరచు అడుగుతారు. జీవుడంటున్నారు. పరలోకముందని చెప్తున్నారు. శేషకర్మకారణ మంటున్నారు. ఒక మనిషి పుట్టాడు. కొంత కాలం జీవించాడు. తదుపరి మరణించాడు. కర్మానుభావమునకు ఏదో లోకమునకు పోవలెనంటారు. కర్మానుభవము సమసిన మరలా జన్మ కలుగునా?

కొండప్ప : శాస్త్రంలో దీనిని తృణ, జలూక న్యాయమన్నారు. అంటే మనిషి ఒక అడుగు తీసి మరొక అడుగు ముందుకు వేసినట్లుగా ఇక్కడ ప్రాణం వీడటం, ఇంకో తల్లి గర్భవాసమున చేరటము రెండు కార్యములు ఏక కాలములో జరుగును - అని....

అమ్మ : మీరు ప్రాణ శక్తినే జీవుడంటున్నది. పరలోకమున ఇక్కడికంటే కాలభేద మున్నదందురుగదా! ఇంకో శరీరంలో చేరి యీ శరీరం వదులుతుందా? (కాలభేదం రావే?)

కొండప్ప : శాస్త్రం ఆ విధంగా చెప్తుంది.

అమ్మ : ఆ అవస్థ చెప్పలేనిది, ఊహించ లేనిది.

కొండప్ప : నీరు నిండిన కుండ పగలటం, నీరు వొలకటం లాంటిది. (ఒకేసారి జరుగునని)

అమ్మ : ఫలానా తల్లి కడుపున పుట్టాలనుకొంటాడా?

కొండప్ప : సంస్కారంవల్ల పుడతాడు.

అమ్మ : పశువులు మనలాగే పుట్టాల్సిందేనా? (వానికీ జన్మ, కర్మ లున్నాయా?)

కొండప్ప : వానికి లేదు. పశుపక్ష్యాదులకు, క్రిమికీటకాదులకు ఒకే జన్మే. మనిషి దగ్గర నుండే జన్మ చక్రం ప్రారంభమౌతుంది.

అమ్మ : ఒకవిధంగా గొడ్డు జీవితానికి ఎగుడుదిగుడు లేదు. వేసిన మేత తిని వీడికి పాలిస్తుంది. వీటికి సంస్కారము లేదంటున్నారు. వీడి సంస్కారమును

బట్టి దాన్ని చూస్తాడు. వానికి నీ సంస్కార మేమౌతుంది? దుష్ట సంస్కారము కల్గినవాడు పైకెలా వస్తాడు? వీడు శాస్త్రములో చేయగూడదని చెప్పిన ఆకతాయి పనులన్నీ చేశాడు. వీడి జీవితమంతా తప్పే. మురికి గుంటలో ఉన్నాడు. వీడు దిగజారి పంది, కుక్క అవుతాడా? మళ్ళీ మానవుడుగా పుట్టాడా? ఎవరి సంస్కారం చేత ఉద్ధరింపబడతాడు?

సోదరుడు: వితండవాదం నచ్చుతుందా నీకు?

అమ్మ : వితండ మేముంది - నాదృష్టిలో అందరూ కోదండపాణులు.

(ఒక సందర్భంలో నాన్నగారన్నారట - మీ అమ్మగారు సుఖమన్నది ఎరుగదని)

కాస్సేపాగి మరలా అమ్మ అన్నారు. అధరం మధురం (తన పొట్టను తడుముతూ) ఉదరం మధురం, సర్వం మధురం, బృహత్ స్తోత్రరత్నావళిలో ఉంది. అది మూడు భాగాలు.

ఇప్పుడు మీకు తలపై చమురు రాస్తున్నాను. వెనక ఒక రోజున ఎనభై మందికి తలంటి పోశాను.

సో : నీకు ఏపాట లొచ్చమ్మా?

అమ్మ : నాకు అన్ని పాట్లూవచ్చు. వావిల కొలను సుబ్బారావుగారిని వాసుదాసు గారంటారు. ఆయన రఘు మహారాజుకు జై జై అనేవాడు. ఆ అనటంలో ఆర్తీ, ఆనందమూ వెల్లడయ్యేది.

సో : నిన్ను ప్రచ్ఛన్నంగా బాధపెట్టే జబ్బులపై నీకు మమకార మెందుకమ్మా?

అమ్మ : బాధపెట్టేవాళ్ళ మీద కోపమున్నట్లయితే మీ మధ్య ఉండలేను.

## 3-10-1974

### మధ్యాహ్న సమయం - దర్శనపు హాలులో-

కొం : (అలవాటుగా) అన్నీ ఒకటేగా!

అమ్మ : దేనికది వేరు వేరుగా అనిపిస్తున్నది గనుకనే యీ సంభాషణ. అన్నీ తెలిసిన అమ్మతో అంతా ఒకటను కొంటున్న అమ్మతో సంభాషణచేస్తున్నావు కదా! అందుకే అడగటం - చెప్పటం. నే మాట్లాదేమాటలు ముందు మీకర్థమైతే అచ్చగానామాటలుగా కాకపోయినా ఈభావాన్ని మీ మాటలలో పెట్టుకొని మాట్లాడు కొనవచ్చును.

కొం : నీభావం మహోన్నతమైనది మాకదిసాధ్యంకాదు. ఎంతో పరిపక్వమైతేనే గాని అమ్మ మాటలర్థంకావని ప్రభాకర ఉమామహేశ్వర పండితుల వారు అన్నారు.

అమ్మ : ఉన్నది అదే అయినా చెప్పటంలో రీతి ఉన్నది. బ్రహ్మను పొందూ అని చెప్తారే - చూడటమా? బ్రహ్మకావటమా?

కొం : కావటం

అమ్మ : కావటమెట్లా?

లడ్డు అవటంలో కంటె తినటంలోనే రుచిఉన్నది.

కొం : తినే దెవడు?

అమ్మ : కావాలనుకొనేవాడే.

కొం : మీరుచెప్తున్నది ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతములకంటె **అతీతంగా ఉన్నది**

అ : అమ్మకు సిద్ధాంతమేమిటి? నేను చెప్తున్నదానిని అద్వైతమని ఎందుకు అనుకోవాలి?

ఉన్నది అదే. ఆరాధన వాడిని వేరుగా ఉండిచేస్తే బాగుంటుంది. నేను తల్లిని కావాలనుకొంటే పిల్లలు కావాలి. నేను భక్తుణ్ణి కావాలనుకొంటే దైవముందాలి? అట్లాచేసుకోమంటారు. నాకు సిద్ధాంతమో, మతమో, ఉందనుకోను. పూజించుకోవాలంటే ఇంకొక బొమ్మ ఎదురుగా ఉంటే వీడు భక్తుడని......

కనపడినదంతా అదే అనుకొనేవాడు అద్వైతియేమో. పిల్లలను కూడా భగవత్స్వరూపములుగా భావించి నీళ్ళు పోస్తూ అభిషేకమని, అన్నం పెడ్తూ నివేదనచేస్తున్నామని అనుకోవచ్చు. త్యాగరాజుకూడా చేతు లారా సింగారము చేతునంటాడు. ఒక తల్లి, బిడ్డకలంకారము చేసి ముద్దు పెట్టుకొంటుంది. త్యాగరాజు నీకు శృంగారముచేసి ఆనంద పడతా నంటాడు. వేరుగా రాముడుంటే కదా అలంకారముచేసేది!

సో : వేరుగా ఉన్నాడనుకోటం తప్పుగాదు.

అ : అంతా అదే ఎట్లాచూస్తున్నాడో అట్లా ఇదీ అంతే!

కొం : మీరు ఎవరిదారిని వారిని పొమ్మంటారు. లోకం ఎవరిదారిన వారు నడిస్తే సత్యపథాన్నించి తొలగిపోతున్నట్లు మాకనిపిస్తుంది.

# సాధన

అ : ఎవ్వరు ఎటువైపుపోయినా ఫరవాలేదు. తప్పుదుదోవలేదు. ఈ సృష్టిలో ఒక్కటి విడిగాలేదు. ఒకదానితో ఇంకొకటి – ఒక వస్తువుతో ఇంకొకవస్తువు కలిసియేఉన్నది. అనేకమై, అనేక విధాలుగా ఉంది కనుకనే, అడగటమూ, చెప్పటమూ.

గుణములకు మూలముఒకటే. అయినా గుణాలు వేరువేరుగా ఉన్నాయి. నాకు తెలిసి నేనడచే తీరులో చెపుతాను. సాధన చేస్తేసాధ్యమని మీరు – సాధ్యమైనదేసాధన అని నేను. మాల(త్రిప్పు అన్నారు. ఏపూసకాపూస త్రిప్పటంసాధ్యం – అప్పుడది సాధన అయింది – సాధ్యము, సాధన విడివడిలేదు. ఒకపని ఒకదశలో సాధనాసాధ్యము అయింది.

ఈసాధన అనే క్రియసాధ్యమూ అయింది. సాధనా అయింది. క్రియలోసాధ్యం – చెప్పటానికి సాధన.

కొం : తరుణమువచ్చినప్పుడే ఒకమార్గమునెన్నుకొని, జపము, తపమూ చేయునని మీరంటున్నట్లుగానేను భావిస్తున్నాను. ఇది దారికాదని, ఇదిసరియైనత్రోవ అని చెప్పకపోతేయెట్లా!

అమ్మ : నీఅభిప్రాయం – ఇదివరకు ఇంకొకమార్గం కొన్ని నియమాలు పెట్టుకొని, బ్రహ్మనిష్ఠవరకే హద్దుపెట్టుకొన్నావు. ఉదయమే లేవటం, దృష్టినిలపటం, ఆనాటికార్యములు. ఇప్పుడు ఈమార్గములో మీభావములు నడుస్తున్నవి. శాస్త్రమును వదలి కూర్చున్నావు.

కొం : మనస్సునిల్చిపోవాలంటారు. బ్రహ్మనిష్ఠకంటే ఉత్తమమైన మార్గము లేదంటారు. కొందరు నీవు యెప్పుడూ – వాడుకావు అంటారు. సర్వజ్ఞుడట వీడు అల్పజ్ఞుడట. సేవాధ్యానమూచేసుకోమంటారు. ఉపనిషత్తులు ద్వైతాన్ని, విశిష్టాద్వైతాన్ని ప్రతిపాదించలేవు. ద్వైతమునకు మధ్వా చార్యులు భాష్యకారుడు. దేవునితో నిమిత్తము లేదన్నబుద్ధుని ఆపది సూత్రాలే ప్రచారము పొందుతున్నవేళ శంకరుడు అవతరించి అద్వైత మును ప్రతిష్ఠచేశాడు.

# విచారణ

అమ్మ : అద్వైతమంటేయేమిటి? దానిని గురించివారేమి చెప్తారు?

కొం : భ్రాంతిచేతనీవు వేరనుకొంటున్నావుగాని, ఉన్నది ఒక్కటే. బ్రహ్మనిష్ఠ అనుభవించి, ఆ ఒకటి తెలుసుకోవటమే కర్తవ్య మంటారు.

శుద్ధబ్రహ్మము ఏమీచేసేదికాదు. జడమునకు దానికీభేదము లేదు. మాయతో కలిస్తే శబలబ్రహ్మము. అదియే జగత్తు - ఈశ్వరసృష్టి అన బడటం. నీవు, నేను ఇదంతా, జగత్తు యావత్తూ ఈ యీశ్వరసృష్టి స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణములన్నీ ఈశ్వరసృష్టే.

జీవత్వమంటే ఉన్నాడని - పుట్టాడనికాదు.

(జీవత్వమునకు, ఈశ్వరత్వమునకు - రెండింటికీ మధ్య ప్రత్యగాత్మ స్వరూపమునకు అవిద్య. అవిద్యలోని తోపికతా (ఉన్నవి,) ప్రత్యగాత్మ, అవిద్య - బ్రహ్మములోని ప్రతిబింబము,)

ప్రత్యగాత్మ నీలో ఉన్న ఆత్మ

పరమాత్మ అంతటాఉన్న ఆత్మ,

అమ్మ : అంతటా ఉన్న పరమాత్మకు రూపములేదన్నారుగా!

కొం : సర్వ వ్యాపకమైన చైతన్యం నీలో ఉన్నది. దానికి ప్రత్యగాత్మ అనిపేరు. అనంతంగాఉన్న చైతన్యం పరమాత్మ. ప్రత్యగాత్మ మాయతోకలిసి జీవుడయ్యాడు. బ్రహ్మనిష్ఠలో కూర్చోమన్నారు. నీలోఉన్న ప్రత్యగాత్మ స్వరూపందేవుడే. నేను ఫలానా అని గుర్తించటం మోక్షం. అజ్ఞాననాశనమే మహాప్రళయం అంటే వ్యావహారిక సత్తా నశించాలి అన్నమాట-

అమ్మ : మీరు చెప్తున్న అద్వైత సిద్ధాంతంలో జీవుడు లేదుకదా!

కొం : అవును. అద్వైతం జీవుడులేదనుచున్నది. అవిద్యకు విషయశరీరమని పేరు. శంకరుడు కారణశరీరమన్నాడు. జన్మకు హేతువు సంస్కారము.

53 స్థానవిచారమును గూర్చి మాగురువుగారు కొంత చెప్పియున్నారు.

శంకరాద్వైతములో బ్రహ్మనిష్ఠ చెప్పలేదు. నీవే దైవమయితే ఇంకా పొందటమేమిటి? సర్వము నిషేధించగా మిగిలినదానికే దైవమని పేరు.

అమ్మ : "ఏమి" నిషేధించాలి?

కొం : అన్నింటికీమూలం జీవసృష్టి అన్నారు. నీలో జీవసృష్టి తొలగించుకోవటమే బ్రహ్మనిష్ఠ అన్నారు.

అమ్మ : బ్రహ్మనిష్ఠ అనగా ఏమిటి?

కొం : కుండలిని, శ్వాస, ప్రాణము, మనస్సు...........

అమ్మ : ఇన్నీ శరీరములోనివే.

కొం : ఈశ్వరుడు రచించిన వేదం ఈ శరీరమన్నారు. ఈసృష్టితొలగించు కోమనలా, నీలో జీవసృష్టిని తొలగించుకోమన్నారు. జీవసృష్టి తొలగించు కోవటమే బ్రహ్మనిష్ఠ. మాస్వామి బ్రహ్మనిష్ఠ కూడా అజ్ఞాన కార్యమన్నారు. మీబోధవల్ల పొందదగినది యేదీ లేదని తేలిపోయిందని నాఅభిప్రా యము.

అమ్మ : నేను పొందినదిలేదు. ప్రత్యేకించి చూచినది లేదు. మీరనే దైవమునకు అర్థం ఉన్నది, అసలు, కేవలం అనుకొంటున్నాను. ఏదో ఉన్నదని, పొందాలని అనిపించదు. నాకు ఇంకోరకంగాతోచదు. మీరనే అది ఇదియే అని స్థిరమైన భావమున్నది. మీరుగా కాక ఇంకొకటిచూడలా.

కొం : అందరిని పిల్లలుగా భావించే భావం మీకు ఉంది.

అమ్మ : ఒకబాట వేసుకొని నడచాను. పిల్లలుగా అనిపించకపోతే తల్లి అనేపేరు లేదు. ఉన్నదే ఇది. ఆత్మకు రూపం, నామం లేదంటారుకదా! శక్తి అనేకమయింది. (మరి రూపం లేదని ఎట్లు?)

మొగ్గ, పువ్వు, పిందె, కాయ, పండు – అదే అనేకమైంది రూపభేదంతో. ఇలా అవటం దాని స్వభావమే అయింది. నే చేసి ఉంటే మీకిట్లు అని చెప్పవచ్చు... ఆలోచనవస్తే చేస్తాడు. ఆలోచన ఎక్కడిదో తెలియదు.

అనిపిస్తేనే అనుకోవటం. నేను సాధనచేసి, సంపాదించాననటానికి ఏదీ చెయ్యలేదు.

సోద : భ్రాంతిచేతనే భ్రాంతిపోతుందా?

అమ్మ : భ్రమపడ్డాను అనుకోవటం భ్రమేగా. పువ్వుగాచూశాను. పువ్వుకాదను కొన్నాను; అవునేమో అనుకొన్నాను, కాకపోయింది.

☆ ☆ ☆

కొం : అసలు సంగతి అసలుకే తెలుసు. అంటే....

అమ్మ : అసలు అంటే దైవమని.

కొం : అనుభవం మాటలలో పెడితే యధార్థం మరుగున పడుతుంది అన్నారు. అంటే ఏమని?

అమ్మ : అనుభవమే కలిగింది. చెప్పాలంటే వస్తువుతో పోల్చటం ప్రారంభిస్తాను. ఎట్లా ఉందో చెప్పను. మబ్బుపట్టిందే, గాలికొట్టిందే.

సోద : అనుభవం వ్యక్తిగతమైంది.

అమ్మ : వ్యవహారం చెప్పేవాడికి తెలుసు, వినేవాడికి తెలియదు. వేదాంతం చెప్పేవాడికి, వినేవాడికి అర్థంకాదు.

కొం : ఏమీ అనుభవంలేకపోతే యివన్నీ ఎట్లా చెప్తున్నావు?

అమ్మ : నాకిది తెలుసు అనిచెప్పటానికి నాకు తెలిసిందేదీ కనిపించలా. నాతలే పృథ్వీతత్వం.

ఎక్కడ ఖాళీ ఉంటే అక్కడ ఆకాశం.

శరీరము లేని మనసు లేదు.

వస్తువులేని గుణములేదు.

ఏఒక్కటీ ఒక్కటిగా ఉండదు. ఇంకొకదానితో కలిసియే ఉన్నది.

జీవుడంటే ప్రాణమా, చిన్నశరీరమా? మనస్సా? వస్తువా? ఏదిజీవుడు?

సోద : పరకాయప్రవేశం చేయవలసిందే.

అమ్మ : ప్రాణం పోవటమంటే ఈశక్తి ఇట్లాగే పోతుందా?

కొం : పంచభూతాలు పోయాయనటం.

అమ్మ : పంచభూతాలలో మనసుకు ఉపయోగపడే శక్తి పోయింది.
(అమ్మ ఒక బత్తాయిపండు పట్టుకొనిచూచి) ఈపండు రసంపిండేము, కాయలోనిసారం గ్లాసులోనికి వచ్చింది. డిప్పకు గుణముంది. కాని రసము వచ్చేగుణములేదు. పిందెగా, కాయగా, పండుగా గుణము మారింది. రూపాంతర మవుతుంది. (త్రాగంగానే) లోపలికి పోగానే దానితత్వమే మారిపోయింది. శక్తి రూపంగానూఉంది - రూపము లేకుండానూ ఉంది.

సోద : శక్తిపురాణములో ఉందా?

అమ్మ : ఆసక్తిలేదు.

కొం : మీమార్గం ప్రపంచములో ఎక్కడా కనిపించదు. (ప్రిన్సిపాల్ గారు) నాకు చాలావరకు సమన్వయం కనబడుతున్నది.

అమ్మ : సర్వదేవనమస్కారమంటే సర్వం అయిన దేవతకని. నాదృష్టిలో - దేవతలంటే మీరంతా.

కొం : శంకరులవారు నేను చావలేదు. నేనుపుట్టలేదు అన్నాడు.

అమ్మ : వారు అన్నిట ఒకటేచూచారు.

సోద : అదే సహజాద్వైతం.

అమ్మ : సహజమే అద్వైతం.
అన్నీ అయిఎప్పుడూ ఉండేది ఏదో అదే అవతారం.
అద్వైతమంటే అవతారం.
అన్నీకానిది ఏదైతే ఉన్నదనుకొంటున్నామో అదే అన్నీ అయి ఉన్నది.
ఆదిశక్తి అంటే అద్యంతములు లేనిదని.

సోద : నీభాష మాకందని భాష.

అమ్మ : మీకు అందనిభాషనా? మీరు కందులు గనుక-

సోద : పసికందులుగానే అట్లాగే ఉంచుతల్లీ.

4-10-74

ఉదయం 9 గం॥ల లోపు

## ఆనందము

సోద : ఆనందమనగా ఎట్టిది?

అమ్మ : ఆనందమంటే దుఃఖము, సంతోషము రెండింటికి సంబంధించినది. రెండింటికలయికే. దుఃఖముకాని, సంతోషముకాని వద్దని ప్రయత్నము చేయక, ఏదివచ్చినా స్వీకరించి అనుభవించుస్థితియే ఆనందము.

# తృప్తి

కొం : తృప్తి అనగా ఏమి?

అమ్మ : ఇంతకంటే మరియొకటి లేదని

కొం : వివరించండి?

అమ్మ : భోజనంచేస్తే అప్పటి కప్పుడు తృప్తిగా ఉంటుంది. మళ్ళీ కొంతసేపటికి ఆ తృప్తి కనిపించదు. చాలు అనేది ఎందులోనూ కనిపించదు. విషయం వేరుకావచ్చుకాని, ఏదోపొందుతామనుకొన్నది అందుకోలేక బాధపడ తాము. అసంతృప్తి ఉందికదా! పొందటమంటే కంటికి కనపడేది కాదు. ఆరూఢత రావాలి. అంటే మానసికంగా దృఢత్వం ఏర్పడాలి...ఇంకొకటి ఏదో ఉందంటే నాకునమ్మకం కలగటంలేదు. ఇదే అంటే మీకు నమ్మకం కుదరటంలేదు.

కొం : ఆ అనుభవం దృఢపడితేచాలు. ఎట్లాకలుగుతుంది? ఎప్పుడు కలుగు తుంది?

అమ్మ : నాకెట్లాతోచిందో – మీకూ అట్లాగేతోస్తుంది. తోచినప్పుడు నీవూ నేనూ ఒకటే. ఆ సమయం వస్తుంది. వచ్చినప్పుడు తోస్తుంది. నీమనసుకు అటువంటిస్థితి వస్తుంది. వస్తుంది అనటమంటే ఇవ్వటమే. నీకు స్తిమితం కలిగితే, నీవేవచ్చి చెప్పుదువుగాని. వస్తే, నీవు ఆ స్థితి రెండుగా ఉండదు – వచ్చిందని తెలియదు.

కొం : అదేగా! వస్తేతెలిసేది కాదన్నారు మీరు. అసంతృప్తి లేకపోతే ఇంకేం కావాలి?

# దుఃఖ నివృత్తి

శాస్త్రము దుఃఖనివృత్తి చెప్పింది.

అమ్మ : దుఃఖంవచ్చినప్పుడు, దుఃఖంపోవాలి అని ప్రయత్నంలేక పోవటమే. (నివృత్తి) ఏదివచ్చినప్పుడు అది అనుభవించటమే ఆనందపుస్థితి. ఏదికూడావద్దనుకోకుండా అనుభవించటమే ఆనందపుస్థితి.

# సహజము - స్వభావము

కొం : సహజమునకును స్వభావమునకును తేడాఏమిటి?

అమ్మ : సహజమంటే దానిపుట్టుకే అది. స్వభావమన్నా అదేభావం తనతోనే పుట్టింది. పుట్టినదానితోనే ఉందాగుణం.
స్వభావమంటే నాభావం.
తన భావాన్ని స్వభావంగా చెప్పవచ్చు.

కొం : ఎంతబాగా విడదీసి చెప్పారు!
ఆభావం మారుతుంది గదా?

అమ్మ : పుట్టిన ప్రతిదీమారుతుంది. మారటమే స్వభావము. దానివృత్తి సహజ స్వభావమన వచ్చును.

కొం : భావంమారునని – స్వభావం మారదని మీరుచెప్పారే?

అమ్మ : తనలోకలిగిన భావం మారదు. ఇతరులు చెప్పింది మారుతుంది. ఉన్నది ఉన్నట్లుగా ఉన్నదానిని – స్వభావమనవచ్చు

చలపతి : ఎంతచక్కటి విచారణ!

అమ్మ : దీనిని జిజ్ఞాస అన్నాం, విచారణ అన్నాం, మామూలు విషయం విచార మంటాం. దీనిని విచారణ అంటాం

కొం : ప్రపంచములో ఏ ప్రముఖులు, ప్రబోధకులు ఇట్లా విడదీసి చెప్పలేదు. ఈ పాండిత్యం ఎట్లావచ్చిందో?

అమ్మ : నాకేం తెలుసు. తెలియదు. మీరడిగితే సమాధానాలు వస్తున్నాయి. నాకేదీ తెలియదు. అడిగిందాన్నిబట్టి తోచింది చెప్తాను. మీరు ప్రశ్నవేయటంలోనే, నాకు తెలియచెప్పటం అవుతుందేమో, నాసంగతి నాకు తెలియాలంటే, మీప్రశ్న లవసరమే. మీకు చెప్పటంకాదు నాకు నేను చెప్పుకోవటమే. స్వబోధ.

# తరుణం

చల : ఏస్థితైనా ఎప్పుడుకలుగుతోంది?

కొం : అన్నిటికీ తరుణమే.

అమ్మ : తరుణమంటే నీకు తెలియకుండా జరిగేది. అంతబలమైనది.

# నిర్ణయం

కొం : నిర్ణయించినవాడు, నిర్ణయానికి బద్ధుడా?

అమ్మ : నిర్ణయం చేయటమంటూఉంటే వీడుదానికి బద్ధుడే.

నాటకములో విభిన్నపాత్రలు కల్పించిన రచయిత తానొక పాత్రధారి. అలాగేదైవం ఈజగన్నాటకమును ఇన్ని పాత్రలు కలిసి కూర్చిసూత్రధారి. ఈ మార్పుకు కట్టుబడ్డాడు.

కొం : నిర్ణయం నిర్ణయింప బడినదా?

అమ్మ : ఆద్యంతములు లేనిదీ జగత్తు.

ఒకచెట్టుకు మొదలు - చివర ఉంది. కానిసృష్టికిలేదు. నీవు ఎందుకు వచ్చావో, అదేచేస్తున్నావు. అనుకున్నది చేయలేదు కనుక నిర్ణయించిందే చేస్తాడు.

కొం : ఇట్లా జరగాలి అనేదిఉందా?

అమ్మ : వీడనుకొంటున్నాడు.

# పూర్వజన్మకు ఆధారమా? ఇది

సంకల్పం దైవమయినప్పుడు జరిగే సంకల్పమే ఎందుకు రాకూడదు? సంకల్పం దైవంకాదా? నాసంకల్పం, దైవసంకల్పం వేరా? తెలుసు కొందామని, తరిద్దామని ఆలోచనవచ్చింది - అంతాదైవ సంకల్పమయి నప్పుడు అందరికీ ఒకే సంకల్పాలు రావాలికదా? ఒకడు ఒక రకమైన జీవితాన్ని, మరొకడు మరొక రకమైన జీవితాన్ని ఎందుకు గడుపుతున్నాడు? అనుకున్నవి చేయలేని బలహీనతలో సమాధానం దొరకక ప్రారబ్ధమని పేరు పెట్టుకొన్నాడు. మనసుకు, ప్రవృత్తికి, ఫలితాలకు పొంతన కుదరక ప్రారబ్ధమనుకొన్నాడు. ప్రారబ్ధమంటే ఏమిటని ప్రశ్నించుకొన్నాడు. ఇక్కడా సమాధానములేదు. సమాధానపడేందుకు పూర్వంది అనుకొన్నాడు. జరిగిపోయినది గుర్తుతెలియదు. కనుక నేను ఇంకొకసారివచ్చి ఉంటానను కొన్నాడు. కార్యకారణములకు హేతువు తెలియకపోవటం వలన వెనుక ఏవో లోపాలుచేసి ఉంటానని ఊహించాడు. ఇదియే పూర్వజన్మకు ఆధారం... ఇప్పటి జీవితంలో ఏతప్పూచేయలేదు. కాని తనకు కళ్ళూ, కాళ్ళూ లేవు, సంతృప్తిపడటానికి వెనక ఏమిచేసియున్నానని సమాధానము కుదుర్చుకొంటాడు. క్రితం జన్మలోచేసిన లోపంవలన ఇప్పుడనుభవిస్తున్నా ననుకొంటాడు. కూరలు తరిగిన కత్తిపీట హాలులో ఉన్నది. వెళ్ళుతున్న ఒకడికి హఠాత్తుగా తగిలి శరీరం ఛేదించుకొన్నది. తగులుటకు ఇప్పటి అజాగ్రత్త కారణమనుకోడు. క్రితం జన్మలో ఏమిచేశానో అనుకొంటాడు. ఇలా అనుకోటంకూడా ఒక విధమైనతృప్తే. గాజుపెంకు ఎవరో విసరగా - సరాసరి నాకాలులో గ్రుచ్చుకొంది. అప్పుడు వాడికి క్రితం జన్మలో

ఏదో అపకారం చేసివుంటావంటారు. నేను చేసింది నే ననుభవిస్తున్నా ననుకొన్నప్పుడు లేదు. సీసా ఎందుకు పగలాల్సివచ్చింది? అంతకుముందు ఏదోచేసి ఉంటావంటారు. వాడికివీడు – వీడికివాడు పరంపరగా చేసు కొంటూ పోవాలికదా!

దారినపొతే రూపాయి దొరికింది. ఇదంతా నా అదృష్టమనుకొంటాడు. అదృష్టమంటే కనపడనిది. ఏనాడో పెట్టిపుట్టాను. అందువల్లే ఇది దొరికింది అనుకుంటాడు. ఈ గొలుసు ఎక్కడ నుండి బయలుదేరేదో తెలియదు. జన్మలు ఇస్తే ఉన్నవి. ఎవరిస్తే? శక్తిఇస్తే – దాని ప్రభావమే ఇదంతా. మొదటిజన్మకు వీడు కారణంకాదు. పుణ్యాపాపములకు వీడు కర్తకాదు. ఆశక్తి యీ గొలుసుకు కారణమని దృఢమైంది.

# అందరికీ సుగతి

కొం : అందరికీ సుగతన్నారే?

అమ్మ : గతికివీడు కారణం కాదుగనక.

అన్నింటికి ఏదికారణమున్నదో, ఈగతులన్నింటికీ ఆధారం ఏది అని గుర్తించినదో, అది సుగతి.

నాదృష్టిలో తెలిసినవాడికీ, తెలియనివాడికీ సుగతే.

ఈ సుగతి విచారణచేసేవాడికి, బ్రహ్మజ్ఞానికేనా?

కుంటివాడికి, గ్రుడ్డివాడికి – వీరిమాటేమిటి?

(శరీరం) పోయినతరువాత పొందేస్థితి అందరికీ ఒకటే, ఆస్థితిలో అందరికీ ఒకటే సుగతి. శక్తి అనేకమైంది అన్నప్పుడు గ్రుడ్డికుంటి – అన్నీ అయింది. వాడు ఉండి సృష్టించాడు అనేది (ముక్కే) ఒకభాగం "ప్రారబ్ధంఉంటే చెప్పండీ" దానికి ప్రత్యామ్నాయంగా మీరేమైనాచెప్తే చేసుకొని పోగొట్టుకొంటామంటారు. అమాయకమైన యీలోకాన్ని నీవు మేల్కొలుపమ్మా అంటారు. ఆశక్తి అనేకమైయున్నదనేదివారి కర్థంగాదు. వాళ్ళది ద్వైతం. నీది అద్వైతం. ద్వైతంలో అద్వైతం, అద్వైతంలో ద్వైతం ఉంది.

కొం : బ్రహ్మతత్వమే 'నేను'

అమ్మ : బ్రహ్మనని తెలుసుకొన్నావుగదా! ఇంక అడిగేదే లేదు.

కొం : అమ్మ బ్రహ్మజ్ఞాని కాదని ఆలోచన.

అమ్మ : బ్రహ్మంటే ఏమిటో తెలియదు. నాకుమాత్రం మీరంతా నాపిల్లలు అనే.

కొం : ఆశక్తినే బ్రహ్మ అంటున్నాం.

"చింతలున్నబాటలో నేను నడుస్తున్నానా! నేనడచినబాటలో చింతలుంటున్నాయా." అని అనుకొన్నారటమీరు.

అమ్మ : బాధలున్నాయనుకో, బాధలు ఉండేవైపుపోతున్నానా? బాధనేను పడ్తున్నానా? బాధనాకువస్తున్నదా?

నే అనుకోటం కాక బాధఅనేది ఉన్నదా? నెప్పేమిటి? ఇష్టంలేనిది వచ్చింది. ఆ నెప్పికి కణతలు నొక్కుకోవటం వలన బాధసమసినట్లు, సుఖంగా ఉన్నట్టుతోస్తుంది. బాధ సుఖానికి దారితీసింది. సుఖం బాధకు దారితీస్తుంది. ఉన్నది ఉన్నట్టుంటే సుఖం తెలియదునాకు.

దోసకాయకూరచేదుగాఉంది. పండినవిచేస్తే ఇంకొకరకముగా రుచి. రెండూ ఒకరకంగాచేసినా జిహ్వాలోతేడా తెలుస్తుంది. నాకు చేదు ఇష్టం. నాకు చేదంటే ఏమిటో తెలియదు. బాగుండకపోవటమే చేదా? చేదు బాగుండదా?

చల : అన్నీ ఇష్టంగా చూచుకోవడానికి మార్గం?

అమ్మ : ఉండవు. జిహ్వకు గ్రహించేశక్తి ఉంది. ఇష్టంలేకుండా చేసే శక్తిలేదు. ఏరసం ఎక్కువైన వాడికి చేదు సహిస్తుంది? ఏరసం ఎక్కువైనవాడికి తీపిసహిస్తుంది అనేది వైద్యమునకూ అందదు.

# జీవుడు

కొం : శాస్త్రం జీవుడిని గురించి చెప్తున్నది.

అమ్మ : జీవుడంటే చిన్నది అని కాదుగా!
ప్రాణశక్తినే జీవుడన్నారు.

కొం : ప్రాణమువేరు - వాడు ప్రత్యేకంగా లేడు.

అమ్మ : లేనప్పుడు ఆమాట అనటమెందుకు? అవయవాలు ఉండి ఉపయోగించే శక్తి పోవటం. ప్రాణంకాదన్నావే? ప్రాణంకల మనిషి ప్రాణంలేని మనిషిని గురించి మాట్లాడుతున్నాం. జీవుడంటే ప్రాణంకాదన్నావు. ప్రాణం పోయిందటే, ఆపోయింది జీవుడా? అదికానిది ఇంకొకటి వేరేవున్నదా?

కొం : ఇప్పుడు జీవుడు పోయినాడనేచెప్పాలి. దానికి ఉనికి ఏది?

అమ్మ : ఉనికి అంటే రూపమే.
మనతో మాట్లాడేశక్తే ప్రాణం.

కొం : అవిద్యతో కూడివున్న దానిని జీవుడంటున్నారు.
అజ్ఞానం ఉన్నంత వరకు జన్మరావటం, పోవటం ఉన్నది.
అజ్ఞానంపోతే జీవుడు కాదు. పరమాత్మ స్వరూపుడే.

అమ్మ : శరీరం వదలిన తరువాత ఈ జీవునకు అజ్ఞానం ఉందా?

కొం : లేదు. కాని శాస్త్రం తృణజలూక న్యాయం చెప్పింది.

అమ్మ : ఇంకో శరీరం చూచుకొని చేరటం, ప్రాణం పోవటం ఒకేసారన్నారుగా?
దానిని తెలుసుకొంటే ఇది ఉండటం వట్టి. ఫలానా తల్లి-
తండ్రి కడుపున పుట్టాలని నిర్ణయించు కొంటుందా?

కొం : అద్వైత సిద్ధాంతం ప్రకారం జీవుడు లేడు. సర్వవ్యాపకమైన చైతన్యమే ఉంది.

అమ్మ : సర్వవ్యాపకుడే క్షేత్రజ్ఞుడైనాడు. (క్షేత్రమో?)

కొం : (తన బృందంవైపు చూచి) ఎక్కడ తప్పినామో చూడండి అని అన్నారు.

అమ్మ : ఉన్నబాట ఒకటే. ఏమీ తప్పలా.

కొం : చైతన్యం అవిద్యా ప్రతిబింబములతో చేరినచో జీవుడని, అంతటా ఉన్నవాడు పరమాత్ముడని, ఇది గమనించినవాడిని బ్రహ్మ అన్నారు. జీవుని స్థానం అది. కారణ శరీరమని చెప్పారు.

అమ్మ : (ఒక పువ్వును తీసికొని దాని రేకులు విప్పుతూ) ఈ పువ్వు సర్వం. దీనిలో ఒక రేకు తీశాను. ఈ రేకు సర్వంలోదే. విడదీసినంత మాత్రాన దీనిని కాద అన్నాం. ఇది తొడిమ అన్నాం, ఇది బీజమన్నాం. ఏది సర్వం? ఏది చైతన్యం? ఏది మాయ? ఏది జీవుడు.

కొం : ఈ అవిద్య పోయి పడింది.

అమ్మ : ఈ చైతన్యం అవిద్యతో కూడి ఉంది.
నిర్వికార అచల బ్రహ్మ పరిపూర్ణుడై ఉన్నాడు. ఎక్కడదీ మార్పు? మాయ, అవిద్యలు ఎక్కడివి?

కొం : మాయ అవిద్య దానితోటే పుట్టాయని చెప్పారు. తెలియని తనమే అవిద్య.

అమ్మ : తెలియని తన మెక్కడిది? ఉన్నదే అదిగా?
మీరడిగింది చెప్పటానికి, నాకు తెలియంది తెలుసుకోటానికి, మీరు వివరించేది వినటానికి సిద్ధంగా ఉన్నాను.

కొం : ఆ దైవాన్ని చూడకపోటమే తెలియనితనం.

అమ్మ : చలించని ఆ (అచల) స్థితి నుండి జీవుడు ఎక్కడ నుండి వస్తాడు.

కొం : (రాయిలాగే) శుద్ధబ్రహ్మం ఏమీ చేసేది కాదు.

అమ్మ : రాయిని ఈ చైతన్యం అవతల పడేస్తుంది.

అందుకే వీడు కర్తకాదు అని అన్నది.

ఏది అందదో, ఏది తెలియదో, ఏది ఉన్నదో–ఏదో అంటే ఫలానా అని నిర్ణయించ లేనిది అని అంటారు. దానికోసం వీడి తాపత్రయం. రూపం లేదంటాడు. అందనిది అంటాడు. సుఖదుఃఖములు లేనిది అంటాడు.

కొం : శాస్త్రం ఆనందం వైపు త్రిప్పి – సౌలభ్యం కోసం చెప్పింది.

అమ్మ : భగవంతుదున్నాడను కోవడం నీసౌలభ్యం కోసం – నీ సౌలభ్యమే దైవం.

ఎవడికి వాడికి – నేను తప్ప ఇంకొకటిలేదు.

కొం : వారు లేని దానిని నిరూపించ వలసివచ్చింది. మీరు ఉన్నది చెప్తున్నారు.

అమ్మ : భగవంతుడిని సృష్టించుకొన్నా, మలచుకొన్నా, త్రిప్పుకొన్నా, భావించుకొన్నా – నేనే

# సాయం సమయంలో .... సంభాషణ

కొం : నీ దగ్గర ఉన్న ప్రశాంతత, వెళ్ళిన పిదప ఎందుకుండదూ?

అమ్మ : ఏలూరి నుండి ఒక వ్యక్తి వచ్చాడు ఇక్కడికి. ఆ వ్యక్తి తల్లి దైవమని నమస్కారం చెయ్యమన్నది. వెళ్ళి రోజూ **4** గం॥లు పూజ చేసేవాడు. పూజనుండి లేవాలనిపించదట. తల్లీ, తండ్రీ నాలుగు గంటలు పూజవద్దు అన్నారు. చదువుకు ఇబ్బంది అవుతుందని - వారు చెప్పినంత సమయమూ చదువుకు కేటాయించుకొని - పూజా సమయమును యధావిధిగా చేసేవాడు. చదువుకోక పోతే కోపం తెచ్చుకో మన్నాడు. మార్కులు రాకపోతే అడగమన్నాడు. "డోనేషన్" కట్టమని వారు అనగా 'స్కాలర్‌షిప్' తో చదువుతానన్నాడు. పూజమానన్నాడు.

నీవు నన్ను మర్చిపో! చదువుకో! నేను నిన్ను కనిపెట్టుకొని ఉంటానని అన్నాను.

కొం : మమ్ములను కూడా అంతేగా!

అమ్మ : ఔను.

చ : నిన్ను తల్చుకోగానే దుఃఖము గలుగుతుంది నేను దేనికోసం ఏడవను - కారణ మేమిటి?

అమ్మ : కారణం లేదు - మీరంతా పిల్లలు - పసిపిల్లలు - పసిపిల్లలేగా తల్లిని వదలి పెట్టలేక ఏడ్చేది? నాకు కూడా నావడినుండి లాగి పారేస్తున్నట్టు ఉంటుంది.

సో : సంవత్సరము నుండీ నీ వద్దకు రావాలను కొన్నాను. నాకు కారణం అర్థంగాలా-

అమ్మ : నీకు అర్థమయితే కారణమేముందీ?

అనంతపురం నుండి ప్రథమంగా - రాజగోపాల్, తర్వాత సోమిరెడ్డి, తర్వాత వెంకట్రావు వచ్చారు.

☆ ☆ ☆

కొం : ఉన్నది ఉన్నట్టుగా చూడటమే లోచూపు అన్నారు. ఈ వాక్యం వివరించండి.

అమ్మ : ఏది చూస్తున్నామో (దానినే) అది అదే అనిపించే చూపు ఏదో అది లోచూపు

మంచం, మంచముగా కనబడుతూ, మంచమూ అదే అని తోచడం (లో చూపు)

చూడగానే అదే ఇది అనిపించే చూపు ఏదైతే ఉందో అది లోచూపు.

అన్ని వస్తువులకూ ఏది ఆధారమో అదియే ఇదియని తోచే చూపు లోచూపు.



కొం : చీపురు, చేట వేదమని అన్నారట!

అమ్మ : ఏ వస్తువునకు ఆవస్తువును వేరు చేస్తుంది. కత్తిపీట తర్కం ఇది ఔను; ఇది కాదు అని. జల్లెడ, వడ్లకు వడ్లు, నూకకు నూక, తవుడు, వేరు చేస్తుంది. ఇన్ని పనులు చేస్తున్నది. అందుకే పంచమ వేదం అన్నాను. పొయ్యి పక్వం చేస్తున్నది. జ్ఞానాగ్ని దగ్ధ కర్మాణం అని పొయ్యి చెబుతున్నది.

కొం : శాస్త్రం చదవలేదంటారు? ఇన్ని విషయాలు చెబుతున్నారు!

అమ్మ : వేరు వేరుగా వివరించినా ఉన్నదంతా ఇదే? విచారణ ఎందుకంటే ఆత్మ ఏది? అనాత్మ ఏది అని! ఇదిగాదు, ఇదిగాదని బయలుదేరుతూ తుదకు ఇదే అదియని తెలుసుకోవటం ఆత్మ అంటూ తెలిస్తే అనాత్మ అనేది లేదు.

కొం : మీ థియరీలోనా?

అమ్మ : రెండు లేవు–

కొం : ఇది కాదు అన్నారే!

అమ్మ : ఇది కాదు, ఇది కాదు అని పోయినా చివరకు మిగిలేదంతా ఇదే?

చ : ప్రయత్నమూ, తరుణములోదేనా?

అమ్మ : కాలాన్ని తరుణమన్నాం. అంతా కాలమే. అది కానిది లేదు గనుక బ్రహ్మస్వరూపం అన్నాం.

☆ ☆ ☆

సో : పంచామృతాలని వేనినంటారూ?

అమ్మ : ఒక అమృతంలో నుండి పంచబడ్డవి గనుక పంచామృతాలంటారు - పాలు, పెరుగు, మీగడ, వెన్న, నెయ్యి.

☆ ☆ ☆

సో : బ్రహ్మ మారనిదా?

అమ్మ : ఏదైతే మారదు అని మీరు అంటున్నారో - చూచిన దల్లా మారేదే! మారనిది కనబడదు. కనబడితే మారేది ఔతున్నది.

# సంసారం

సో : సంసారం అంటే ఏమిటి?

అమ్మ : సంసారం అంటే భార్యా బిడ్డలనే అనుకోవటంలా - సంకల్పమే సంసారం.

కొం : సృష్టి మారదు.

అమ్మ : మారనిది ఏదన్నా ఉంటే చెప్పండి? నీచూపే మారుతుంది.

కొం : బ్రహ్మాం బట్టబయలు అంటే?

అమ్మ : ఖాళీలేనిదే బ్రహ్మాం
ఖేచర, భూచర, లేచరమని - ఈ ముద్రలో సూర్యుడు, చంద్రుడు, నక్షత్ర మండలం గన్పిస్తుందని - షట్ చక్రాలు దాటాలని - ఇంకొకడు సప్తభూమికలు దాటాలని - ఒకడు అన్నమయకోశం దాటాలని పలురకాలుగా చెబుతారు - నేను ఉన్నదే ఇది అంటాను.
నామరూపాలు లేని ఆత్మ సాక్షాత్కారం ఎట్లా అయిందీ?

కొం : జ్ఞాననేత్రానికి-

అమ్మ : జ్ఞానం నేత్రంగాదు -

కొం : నేత్రం అని ఎందుకన్నారూ?

అమ్మ : గ్రహించే దాన్ని నేత్ర మన్నారు.

కొం : ఇంకొక సిద్ధాంతం అంతః కరణము నశించాలంటారు.

అమ్మ : అంతఃకరణము నశించాలంటే, భ్రాంతి పోవాలని, కోరికలు నశించాలనే లేదే-

కొం : అయోమయంగా ఉంది.

అమ్మ : ఒకేరకంగా ఆలోచించటము అలవాటే- రెండోది వినకపోవటం వల్ల స్థితిని వదలి మాటలతో పోట్లాడుకొంటున్నారు. అక్కడే ఉన్న ముగ్గును చూపి, దాని రంగులు చూపుతూ-
ఒక్కొక్కడికి ఒక్కొక్కరంగు ఇష్టం.
దీనిని గురించే చెబుతున్నారు గనుక నాకు సరిపోతుంది.
ముగ్గు యావత్తూ నేను చూస్తున్నాను గనుక ఏవైపు నుండి వచ్చినా నాకు ఒక్కటే-

# అందరికి సుగతి - మోక్షం - కర్మ

8-11-74 Night at 8P.M.

## TALKS with MOTHER

SRIPADA AND PANNALA

అమ్మ : ఒకపదం చదివో, ఇంకో గ్రంథం చదివో స్టార్టు అయినవాడు దాని దాటిరావాలంటే భయం. యథార్థం తెలిసిన వాడిమాట వినటానికి భయపడవద్దు. జన్మఅంటే ఏమిటో తెలియకుండా ఆమె జన్మలు లేవదీస్తుందనుకోవడ మెందుకూ?
నేనుగా చెప్పను మీచేత చెప్పిస్తా. అదే టీచింగ్, మీచేత చెప్పిస్తే మీకర్థమౌతుంది. పిల్లవాడే గురువుకు టీచ్ చేస్తాడు. అప్పుడే వాడికి అర్థమయినట్టు.

శ్రీ : ఏదిమాయ?

అమ్మ : అర్థంగానిది మాయ.
అర్థంగానిదని, అనిర్వచనీయ మైనదని అర్థంగాని వాడికి! అర్థం అయినవాడికి?

ప్రి : పునర్జన్మ వీని అంశలో చేతబదులు. పూనకాలు, కొన్ని జరుగు తున్నాయి.

అమ్మ : శరీరాన్ని వదలిన మనసు జీవుడనా?
బంధానికి, మోక్షానికి కారణం జీవుడైతే చిక్కేముంది?

ప్రి : నీవు గౌరీ శిఖరము మీద ఉండి మాట్లాడుతావు. పాపం పుణ్యం లేవు. జన్మలేదని, పరలోకంలేదని – అంతా అదే అనే నీ విచిత్ర సిద్ధాంతము వల్ల మాలో నిర్వీర్యత, అకర్మణ్యత కలుగుతుందేమో అని భయం.

అమ్మ : గీతలో కూడా అన్నీనేనే అని ఉన్నది నీవు కర్తవుకాదు అని ఉన్నది. నీవు చెయ్యి అన్నాడు. ధైర్యానికి అట్లు చెప్పాడా? మన అనుభవంలో మనం

చేయగలిగినది చేయగలుగు తున్నామా? ఎందుకు చేయలేక పోతు న్నామూ అనే ఆలోచన. బ్రహ్మసత్యం, జగత్తు మిధ్యలని చెబుతారు. మిధ్య అయిన ఈ జగత్తు శ్రీకృష్ణుని నోట ఎందుకు చూపించాడు? విశ్వరూపం అంటే ఇక్కడ ఉన్నదే అక్కడ చూపించాడు. ఇదేనంటే నమ్మరేమోనని, అంతకుముందు అధ్యాయంలో ఫలానా నేను అంటాడు భక్తి యోగంలో అన్నింటినీ నమ్మమంటాడు. ఫలానా చెట్టు నేను అంటే తక్కినవి నిజము కావనా? కృష్ణుడు పరమాత్మ స్వరూపం. నామరూప రహితుడైనవాడు, అచలతత్వం కృష్ణుడుగా పుట్టాడు. విశ్వరూపంలో నదులూ, నిధులూ - చెట్లు, చేమలు, కొండలు, కోనలు చూపించాడు. పాండవులూ విశ్వములోని వారే- బ్రహ్మకూ, విశ్వమునకూ తేడాలేదు. అంతా బ్రహ్మస్వరూపముగా చూడలేమని ఏది కంటికి ఇంపుగా ఉంటే అది నేను అన్నాడు. పది మంది ఎక్కడ ఉంటే అక్కడనే ఉంటానన్నాడు.

ప్రి : సాధకులను దృష్టిలో పెట్టుకొని చెప్పారు.

అమ్మ : కర్మతో పుట్టానని - కర్మవల్లనే జన్మ, జన్మవల్లనే కర్మ అన్నారు- పండితుడు 2+2 నాలుగు. ఒకడు 3+1 నాలుగు ఒకడు నాలుగు ఒకట్ల నాలుగు తీస్తాడు. ఒకడు మొద్దు అంకె నాలుగు వేస్తాడు. కృష్ణలీలలు శంకర సిద్ధాంతము వొప్పుకోదు . ఉన్నది ఒకటే అద్వైతం. అంటే ద్వైతం గానిది. రెండుగా కన్పిస్తున్నా- ఆరెండూ ఒకటని గుర్తించిన స్థితే అద్వైతం. రెండులేని స్థితి లేదు. కనబడేదీ. చూచేది ఉన్నది.

ప్రి : భావాద్వైతమే గానీ, క్రియా ద్వైతం లేదు.

అమ్మ : నిర్వికల్ప స్థితిలో ఆనందమయుడై ఉంటాడా?
ఆనందం తెలియటానికి ఏదో ఉండాలి.
ఆనందం అనుభవించి, ఆత్మ సాక్షాత్కారం పొంది దిగి వచ్చుట ఏల?
ఉన్నది పరమాత్మ స్థితి తప్ప రెండోది లేదు.
ఉన్నది తనే గనుక. దేనికి దిగి వచ్చినాడూ

ప్రారబ్ధములలో అంటాడు. ప్రారబ్ధములో ఎట్లా పైకి వెళ్ళాడు? ప్రారబ్ధం అంటే ఏమిటి?

ప్రి : అది దైవమే.

అమ్మ : ప్రారబ్ధం దైవం అని చెప్పి ఉన్నాను.

ప్రి : మరో అర్థం బహుజన్మ కృతమైనది ప్రారబ్ధం.

అమ్మ : ఏ ప్రారబ్ధము చేత పైకి వెళ్ళినాడో, దానిచేతనే క్రింది దిగినాడు. సుకర్మ ... దుష్కర్మ.

ఈ రోజు నుంచి ఆనందం కాస్సేపు ఉంది. కాస్సేపు తీవ్రమైన దుఃఖము ఉన్నది. ఏ ప్రారబ్ధము ముందూ? ఏ ప్రారబ్ధము వెనక? ఏ కర్మకు ఏది ముందు అనుభవించాలి? దుష్కర్మముందు. తర్వాత సుకర్మ. దానిని అనుభవించ నీయకుండా దుష్కర్మ అడ్డుపడింది. సుకర్మ, దుష్కర్మ ఒకే సమయంలో అనుభవించ లేదు.

ప్రి : నీ దగ్గర ఈ క్షణం ఉన్న ఆనందం క్రిందకి పోతే ఉండదు.

అమ్మ : సహజమైన ఆనందం నీకురాలా నావల్ల. నామాటలతో గలిగినది శ్రవణానందం. నీలో పుట్టినది గాదు. స్వభావంగా గాదు. మల్లెల వాసన కాసేపు బుట్టకు అంటినట్టు.

అమ్మ : దుష్కర్మచేత సుకర్మ చెడిపోయింది. ఒకడిని చంపాను. ఒకడికి అన్నం పెట్టాను. చంపటం వల్ల అన్నం పెట్టిన సుకర్మ పోతుందా?

శ్రీ : దేనికదే!

అమ్మ : ఈ గొలుసుకు కర్మ ఎట్లా పోతుందీ? దైవాన్ని ఆరాధించే బుద్ధి కాసేపు వుంది.

శ్రీ : మంచి క్రమంగా ఎక్కువై – చెడు క్రమంగా తగ్గిపోతుంది.

అమ్మ : మంచి ఎక్కువ చేసుకొనేది నామనసు – ఈ మనస్సే మంచి చేస్తూ ఉన్నది. వేరేశక్తి లేదు. దేవుడు లేడు –

ప్రి : దేవుడు లేడంటే ఎట్లా?

అమ్మ : చేసుకొన్న దానికి నేనే కారణం
పోనీ ...
మంత్రోపదేశం జరిగింది. గురువు బ్రహ్మ
కాబట్టి నీవు పరబ్రహ్మ స్వరూపం.
నన్ను చేయమంటున్నావు మంత్రం.
నేను చేయవలెనా? నీవు చేయిస్తావా?
నన్ను చేసుకో! దేవుడు లేడంటావా! అదీసరే!
వాడిసంగతి అక్కరలేదు. నీవే కారణం అంటావా?
అదీసరే!
శాస్త్రం నమ్మకూడదని లేదు. నేను చదువలేదు.
చదవక పోవటంవల్ల అవినాకు ప్రమాణం కాదు.

ప్రి : నీ వాద ధోరణి మోహనమైనది. ఎదుటి వారిని ఎటూ పోకుండా పట్టుకొంటావు.
నీమాటతో పునర్జన్మ లేదంటే నాకు అభ్యంతరం లేదు. ఒక్కమాట- అన్నీ నీవు చూశావా? అని అడిగితే కుదరదు. కొన్ని సందర్భాలలో ఆప్తవాక్యం తీసుకోవాలి. ఒక బ్రాహ్మణ స్త్రీ ఉన్నది. ఆమెకు చదువురాదు. బ్రహ్మరాక్షసి ఆవేశం వచ్చినప్పుడు ఆమె నోటివెంట వేదం సుస్వరంతో పలుకుతుంది.

అమ్మ : ఏ లోకం నుండో సౌండ్ రికార్డు జరుగుతున్నది గదా! అది కొద్దిరోజులలో తేలుతుంది.

ప్రి : ఏదో కారణం వల్ల బ్రాహ్మణోత్తముడు, అంత విద్వాంసుడు ఈమె మీద ఆవేశించినప్పుడు ఆమె వేదం పలుకుతుంది. మామూలుగా ఆమె సాధారణ స్త్రీ. ఆమె సూక్ష్మ శరీరంవుంది. పండితుడు పోయాడు. ఆమెను ఆవేశించాడు. సూక్ష్మశరీరము పని చేయదానికి స్థూలశరీరము

ఆధారము. సూక్ష్మ శరీరము ఆధారము చేసుకొని నేర్చుకొన్నాడు. స్థూల శరీరము వదలిన మనస్సు జీవుడా? శరీరంలో ప్రాణముండగా, మనస్సు శరీరము కలసియే నేర్చుకొన్నది. ఓం అని పలికింది నోరు. పలక పట్టుకొన్నది శరీరము. అనుకొన్నది మనస్సు, ఓం అన్న మాటను నాలుక, అంగిలి కలిపియో అన్నది. అంగిలోపము వలన అయితే అనలేను. జబ్బువాడి మనస్సు పరిగెత్తు అని అన్నా శరీరము లేవలేదు. అప్పుడు మనస్సే ప్రధానమైనది. శరీరము లేకుండా మనస్సు ఉంటుందా? పలుకుతుందా? జీవుడు లేనప్పుడు ఇంత గొప్ప మనస్సు ఎందుకుపని చేయదు? అవయవాలు ప్రధానము కాదు అన్నావు. అన్ని ఇంద్రియాల ద్వారా పని చేసే మనస్సు అన్నీ సరిగావుండి, అన్ని అవయవాలు వుండి మనస్సు పనిచేయక పోతే అది పిచ్చి. అన్నీ బాగుండీ మామూలు వాళ్ళతో సమంగా నడవలేని వాడు పిచ్చివాడు. శరీరము లేని మనస్సు వింటుందా?

ప్రి : వింటుంది. కంటుంది. దాని అభిప్రాయము చెప్పడానికి వేరేశరీరము కావాలి.

అమ్మ : అన్ని అవయవాలు వుండి (మనస్సు) అర్థము చేసుకోవాలంటే అంగవైకల్యము కలవాడికి అవయవములు ప్రధానము.

ఈ శరీరం, మనస్సు ప్రాణం కలదానివి – ప్రాణం పోయిందని వాకిటిలో పెట్టాము.

మనస్సు ప్రాణమేమో తెలియదు. ప్రాణమే మనస్సేమో తెలియదు. ఆ శక్తి తెలియదు.

మనస్సు ప్రాణమయితే ఏదో మాట్లాడుతూ వుండే ప్రాణములా వుంది. ప్రాణము మనస్సు కాకున్న ఏ రకమయిన ప్రాణశక్తి ? మనస్సు వేరా?

ప్రాణశక్తివేరా? ప్రాణశక్తి వున్నప్పుడే మనస్సు పని చేస్తుందా?

ప్రాణశక్తి ద్వారానే మనస్సు వుంది.

ప్రాణశక్తి ఏర్పడ్డ తరువాత అన్నింటినీ గ్రహించే శక్తిని మనస్సు అంటున్నాము.

ప్రాణశక్తి, మనస్సు వేరా అంటే చెట్టు వుంటేనే కాయలు కాచేది.

ఒక దశలో ప్రాణముంది. కానీ మనస్సు పని చేయాలి. అన్నీ గ్రహించే మనస్సే శక్తి.

దానిలోని ఆకాడ, కొమ్మ మొగ్గ వానిలోని శక్తి కనపడకుండా హెచ్చుతుంది. ఈ వృద్ధి అయేది ప్రాణశక్తి.

ఆకృతి శరీరము బ్రతికి వుండి యీ ప్రాణశక్తి....

ఇది అంతా మనస్సు యై, ఈ ప్రాణ శక్తి శరీరము వదలి పెట్టింది. దీనిని జీవుడు అన్నారు. ఆ విగ్రహములో జీవము లేదండీ, నా శరీరములో జీవశక్తి లేదండి అంటాము.

ప్రాణము వుండగా మనస్సుకు యే రకమైన పోలిక.? ఏది చూస్తున్నా గ్రహించేది దాని పోలిక. సూక్ష్మ శరీరము అంటే గ్రహించేదనే కానిచిన్నది అనికాదు. ఈ రాధాకృష్ణమూర్తిని శరీరముతో కూడిన మనస్సుకే శరీరముపోగా పేరు పోయింది. ఈ విద్యను నేర్చుకొన్నది ఇదే.

ప్ర : విద్యసూక్ష్మశరీరంలో గుర్తింపురూపంలో ఉంది.

అమ్మ : గుర్తింపుసూక్ష్మములో చేరిందిగదా! సర్వవిద్యలూ ఆగుర్తింపు శరీరంలో చేరగానే చెప్పలేకుండా ఉందా?

శ్రీ : అన్నబ్రెయిన్‌లో ఉండిపొయ్యారు.

అమ్మ : విద్యస్థూలమే సూక్ష్మమైనదిగాదు.

ఆత్మవిద్యయే సూక్ష్మశరీరం గ్రహిస్తుందీ అన్నారే!

ప్ర : ఆత్మవిద్యలో అంతర్ భాగాలే అన్ని విద్యలు.

ఈ స్థూలశరీరం ఉండీ నేర్చుకొన్నగుర్తు అక్కడే జీవుడు.

చెప్పటానికి ఇంకోశరీరం అనుసరిస్తున్నాడు.

అమ్మ : పోలేదని ఎట్లా తెలుసూ?

ప్ర : ఈరకమైన విషయంవిని .......

అమ్మ : పుట్టుక ఎక్కడాని సమాధానంలేదు. ఆత్మకూ, జీవునకూ సంబంధము లేదు. అంటే దేవుడులేదు అనటయే జీవుడులేదు. బ్రహ్మారాక్షసి – బ్రహ్మ – రాక్షసి రూపంగా ఉన్నాడు.

బతికిఉన్నప్పుడు శరీరానికే కులం.

ప్ర : ఆస్త్రీని ఒక మాలవాడు స్పృశించటమువల్ల మైలపడినానని భయపడి పారిపోయింది.

అమ్మ : శరీరానికేగా మీరుచెప్పే వర్ణాశ్రమధర్మాలు.

ప్ర : క్రమానుగతంగా ఆత్మయే తాను ఔతాడు.

నిర్మలతత్వం. నిర్మోహత్వం. నిశ్చలతత్వం.

అమ్మ : వాడుచేసుకోవాలా? వాడు చేస్తాడా?

ప్ర : యథార్థము ఏమైనప్పటికీ మార్పులేదు.

ఈ రెండు ఒకటనుకోవటమే – ఇంకోమార్గంలేదు అని అంటావు నీవు.

భావాద్వైతమే.

బ్రహ్మవేరు; తానువేరు అనుకొంటున్నాడుగదా!

నీబాధ మరోమార్గం చేఱుతుందేమో!

అమ్మ : వారిమాటలతో దాన్ని గురించి మాట్లాడుదాము.

శాస్త్రం సిద్ధాంతములు గావు. నాకు తోచిన అభిప్రాయమే.

ప్ర : నీవు వద్దన్నా – సిద్ధాంతము ఔతుంది.

అమ్మ : సిద్ధాంతము అంటే ఏమిటి?

మీరు చెప్పుకొనే మాటలలోనే మాట్లాడు కొందాము.

ప్ర : పునర్జన్మకు నేను చెప్పినటువంటివే ఆధారాలు!
క్షితిఅంకురం భూమిలో బీజం అంకురం శాఖోపశాఖలు అయింది బీజం పోయి వృక్షం నిలుస్తుంది.

అమ్మ : బీజశక్తి ఉన్నదిగానీ, బీజంలేదు.

ప్ర : మానవునకు కలిగే సుఖదుఃఖాలకు కారణమేదో ఉండాలి. దీనిమీదనే పునర్జన్మ ఏర్పడిఉండవచ్చు.

అమ్మ : ఈశరీరం+మనసు కలిసినదే రాధాకృష్ణమూర్తి పేరు. ఈ రాధాకృష్ణ మూర్తియే అంటే నమ్మవు.

ప్ర : ఆమె చెబుతున్నది.

అమ్మ : ఆమె చెబుతున్నది అనటంతప్ప మీరు సమన్వయంచేసుకో లేరా?
సిద్ధాంతము మాట్లాడుతాను. వ్యక్తులుగారు.
ఒక సంఘటనే తీసుకొంటే ఎలా?

ప్ర : నీతో సూర్యుడు చాలా జన్మల తర్వాతనన్ను చెందుతావు. అని నాకు తెలుసు. నీకు తెలియదు అన్నాడు పార్థునితో

అమ్మ : నేను చచ్చేవాడినిగాదు. పుట్టేవాడినిగాదు అన్నాడు.
ఆత్మతత్వం. అద్వైతం, మరణాలు అవతారాలు, భక్తిసృష్టి ప్రళయం, కొంతభాగం.
కొంతకాలం తర్వాత శంకరులు పుట్టాడు. అందరూఒకే కాలములో పుట్టలా - శంకరులు ఉన్నసమయంలో రామానుజాచార్యులు లేరు. ఇందులో ఏదీకాదు అనేదానికి లేదు. అవీ నమ్ముతాను. శంకరులను హెచ్చించాలనో, రామానుజలను తగ్గించాలనోలేదు.
నిజమైన నమ్మకం నిలవకుండా ఉండటానికి వీలులేదు. రాముదని, కృష్ణుదని అవతారాలు, శంకరుని తీసుకోరు.

ప్ర : జ్ఞానస్వరూపుడు గనుక.

అమ్మ : చైతన్యను కృష్ణస్వరూపమంటారా?

రామునికి పోలిక ఎవరూలేరేమో?

వీరందరూ ఏకకాలంలోలేరు. ఒకరు చెప్పినది ఒకరుచెప్పలా వారిని అంచనావేయదానికి మనకు తాహతుచాలదు - ఇదితప్పు అనదానికి. ఎవరికి తోచిందివారు చెప్పారు.

ఆత్మకానిదిలేదు. అప్పుడు జీవుడులేదు.

ఆత్మ అంటే బ్రహ్మ అంటే ఉన్నది :

నిండి నిబిడికృతమైనది, (లోపలా, వెలుపలా) ఉన్నది. ఈ నిండిఉన్న దానిలో జీవుడుపుట్టాడు. పరిపూర్ణ బ్రహ్మకు ఎక్కడ చలనం గలిగింది? వాడే ఇన్ని అయినాడు.

ప్ర : వాడే ఇన్నిరకాలై పుడుతున్నాడు. నశిస్తున్నాడు. (ఆరూపం పోయింది.)

అమ్మ : వాడే అజ్ఞాని, జ్ఞాని - వాడికి ప్రారబ్ధం కర్మ, ఎక్కడిది.

ప్ర : వాడికిలేవు. వీడికి ఉన్నాయి ఇన్ని రకాలు అయినప్పుడు ప్రపంచం పోతుందేమోనని సంస్కృతిని కాపాడదానికి మహాపురుషులు, ధర్మాలు దేనికి?

అమ్మ : ఏదారిలో వెడదాం? ఫలనాఅంటే వెడతాం. శంకరులద్వారా పురాణాలా? మీరుఎట్లావస్తే నేను అట్లావస్తాను. జన్మతెలియటం లేదు. నమ్మకూడదని లేదు, అన్నినమ్ముతా. నోములు, వ్రతాలు అన్నీనమ్ముతా. నమ్మనిదే ముంది. నేనాచరించినట్టుగా మీరీ పూర్వాచారాలను పాటింపరు. మడి అంటేహద్దు. అన్నం వండీ మూతలు కదగిపెట్టమంటారు. అన్నం అమృతం, విషంకూడా అవుతుంది. అశుద్ధానికే 'లైఫు'ఉన్నది.

ప్ర : హనుమయ్యగారు నీజాతకం చూచి పంచమంలో కూడవున్నాడని వాడిని గురువుచూస్తున్నందున్న అమ్మతో ఎవరోమాట్లాదలేరు అన్నాడు.

శ్రీపాద : నశ్వరం అంటారు.

అమ్మ : నశ్వరమైన ఈజగత్తు ఆయననోట్లో ఎందుకు చూపించాడు? మారేదాన్ని నశించేది అన్నారేమో!

ప్ర : భాషలో ఒకశబ్దానికి ఒకేఅర్థం ఉంది. అంటే స్థూలమేగదా?

అమ్మ : మనిషి చచ్చిపొయ్యాడు అంటే నశించాడంటారు.

శరీరము+ మనసు రెండిటితో కూడినవాడు.

దానితో కూడినవాడి శరీరం నశించింది వీనితో కూడిన వాడే వీడు.

వాడు ఏసూక్ష్మశరీరంతో కూడియున్నాడు?

మారుతూ ఉండటమే నశించడం అన్నాడు.

శరీరం మారుతూఉన్నా (తిరిగి) రాదుగా!

శరీరం ఏఎలిమెంట్సు వల్ల ఏర్పడ్డదో అవిఅలాగే ఉంటాయి. దీనినే నశించడము అని వారన్నారేమో!

సముద్రములో అలలువస్తున్నాయి. ఆ అలరాదు.

శరీరం పోతున్నది. మారేది అయితే దీనితోపాటు అది (సూక్ష్మశరీరం) ఉంటుంది అంటూన్నారుగదా! అక్కడఏదో మిగిలింది ఉంటున్న దంటున్నారు. మిగలదు అనినేను అంటున్నాను

ప్ర : పంచభూతముల నాలుగింటితో ఏర్పడి - నశిస్తున్నది. పాపం - పుణ్యం లేవు అని చార్వాకము చెబుతున్నది.

అమ్మ : జన్మఉంది అనినమ్మి సాధన ఎందుకు అంటె జన్మరాకుండా చేసుకుందా మని. మనము ఎందుకొచ్చామో తెలియదు. ఆలోచనలు వస్తున్నాయి. భగవంతుని ద్వారా జన్మరాకుండా చేసుకోవటము వాడిని ఆరాధించి, చూస్తే జన్మకాదు. నీకు జన్మలేదంటే ఒప్పుకోవు. ఉన్నదని నమ్మిలేకుండా చేసుకోవాలెననే ప్రయత్నం. "సాధన చతుష్టయ సంపత్తి - మార్గాలు ఇది అవును, ఇది కాదు అని తగాదా! ఏదిముందు? ఏదివెనుక? ఏంచేస్తే పుట్టకుండా ఉంటాము? ఏదిచేస్తే వాడిని తెలిసికొంటాము? ఏదో ఒక రూపంగా ఉన్నదని ప్రయత్నిస్తూ రాముడనో, బ్రహ్మనో శివుడనో ధ్యానిస్తాడు. శివ, శివఅంటేనే సాక్షాత్కారం. ఈరాముడు, ఈకృష్ణుడు వీరిలో ఎవరైనా పుట్టకుండచెప్తారు. ఇంకొకమార్గములో, గురువు,

మంత్రము, మనస్సు ఏదైనా చేస్తుంది పుట్టకుంటే, మనస్సును నమ్ముకో మన్నారు. ఆశ్రయ ములా నీవురావు దైవమే నీరూపంతో వచ్చాదని నేను అన్నా.

దైవము ఉంది. ఇన్ని రూపాలతో ఉంది నీవు అనేవాడివి వాడే ఏదో అని భ్రమపడుతున్నావు. నాకునీవుగా వచ్చావని నేను చెప్పుతున్నాను. జన్మ ఉన్నది అన్నా, లేదన్నా నాకు ఇష్టమే. ఉన్నదనినమ్మి ఎవరిద్వారానో లేకుండా చేసుకొందామని.

లేదనేవాడు వాటిలో కలసిపోతానని అనుకొంటాడు. జన్మలేనంతమాత్రాన దైవాన్ని నమ్మలేనివాడున్నాడా? క్రైస్తవులది రకరకాలుగ ఉన్నది. మహమ్మదీయులు జన్మలనుగూర్చి ఎక్కడా మాట్లాడలా. నమాజు చేస్తున్నారు - దైవాన్ని వేడుకొంటున్నారు. అనుభవిస్తాడని చెప్పారుగాని, మళ్ళీ పుడతాడనిచెప్పలా. విగ్రహంలో, జండారూపమే. రూపము అంటే ముక్కు, మొహమేకాదు. నిర్వికారము రూపమే. చూడటము అందువస్తే.

ప్ర : కష్టసుఖాలను అనుభవిస్తున్నాడు కదా!

చార్వాకులు ఒకచెట్టుకు పువ్వులుకొన్ని పోతాయి, మొగ్గలు కొన్నిపోతాయి, కాయలు కొన్ని పోతాయి. పళ్ళుకొన్ని పోతాయి ఈ మార్పులన్ని ప్రకృతివల్లనే జరుగుతుందంటారు.

ప్ర : ఒకడు నిష్కారణంగానే కష్టమనుభవిస్తున్నాడు.

అమ్మ : ఉన్నది తాను తప్ప ఇంకొకటిలేదు. వాడు సర్వమైనాడు. ఆత్మ, దైవము, శక్తి ఇవి అన్ని ఒకేదానికి సంబంధించిన పేర్లు. ఏదైతే శక్తి ఉందో అదే ఇదంతా ఆశక్తి మందురూపములో ఉన్నది. వ్యాధి రూపముతోనూ ఉన్నది. మరోలా తోచదునాకు. పాపము పుణ్యము ఎక్కడిది? బాదేపాపము - సంతోషమే సుఖము.

ప్ర : సేవచేయాలని, సన్మార్గములో పెట్టాలని, అనిపిస్తున్నదిగదా మాకు.

అమ్మ : జబ్బువాడికి మందు వేద్దామని నాకు అనిపిస్తున్నది. సృష్టియే దైవము అనిపిస్తుంది.

బ్రహ్మకు రూపములేదు. కాలానికి రూపములేదు. దైవము పరిణామముగా నున్నాడు. పరిణామము లేకపోతే సృష్టిలేదు. వేరుగా లేదు. అచల పరిపూర్ణబ్రహ్మ రెండుగా ఎట్లావచ్చినది? ఆలోచన ఎక్కడిది? వ్యష్టిత్వము వస్తేగదా సృష్టి.

దైవము నేనెట్లాగుర్తిస్తే అట్లాఉన్నాదని కొందరు అంటారు. నాకు ఉన్నదే అనిపిస్తున్నది.

దైవము అనేపదానికి అర్థము - అసలు కేవలము ఉన్నది ఇంతకన్నా వేరేపదము దొరకలానాకు.

సృష్టిలోని మనము - మనమే దైవాన్ని సృష్టించుతున్నామనిపిస్తుంది.

శ్రీ : జంతువుల విషయము.

అమ్మ : జన్మలున్నాయనే వాడు చేస్తున్నదేమిటి? లేదనుకునేవాడు చేస్తున్నదేమిటి? లేవని దృఢము కలిగినవాడు నీవు తప్ప రెండోది లేదంటాడు.

జన్మ ఉందనుకొనేవాడు జన్మరాహిత్యము అడుగుతాడు.

దీనిలో అసంతృప్తి ఉన్నది.

దైవాన్ని తెలిసికోవటము అంటే దైవము లేదని తెలిసి కోవటమే!

శ్రీపాద : దైవము వేరుగా లేదని తెలిసికోవడమే.

అమ్మ : జన్మ ఉందనుకొన్న వానికి ఒక తృప్తి ఉన్నది. వాడు చావులో నుండి బ్రతుకును చూస్తాడు.

జన్మ రాహిత్యము అంటూ జన్మరాహిత్యాన్ని నిజంగా కోరుకోడు. గీతలో ధైర్యము కోసము చెప్పారేమో

ప్రి : మహా మేధావివి నీవు.

అమ్మ .: భాగవతములో నున్న దైవత్వము భారతములో కనబడదు.
మనస్సులో కలిగిన ఒక వరపిడియో అందాము.
బయటపడేది పోరాటము.

ప్రి : ఇంతకూ నీవెవరు?

అమ్మ : అంతకూ నేనే.

ప్రి : ఎంతకూ?

అమ్మ : ఎంతకైనా!

శ్రీపాద : జీవి ఇంకొక జీవిని తినిగాని బ్రతకడము లేదు.

శ్రీపాద : దైవము కరుణా సముద్రుడన్నారు.

అమ్మ : ప్రభూ! నీవల్ల నాకు కావలసినది కరుణ మాత్రమే. సముద్రములో అన్నీ ఉన్నాయి. అన్నీ అయినవాడివి కనుక నీ కరుణ ఉంటే అన్నీ ఉన్నట్లే.

ప్రిన్సి : దైవము అనంత కళ్యాణగుణాభిరాముడట.

అమ్మ : సద్గుణాలను నాకు ఇవ్వమని కోరడమేమో.

ప్రిన్సి : దైవానికి సద్గుణములనే ఆరోపించారు.

అమ్మ : దైవము స్వాధీనములో సృష్టి ఉండి సృష్టించాదన్నప్పుడు వాడి అంత కసాయివాడు లేదు.
భక్తియోగములో ఏం చెప్పినట్లుంది?
ఎంతోమంది భక్తులు ప్రభూ ! నన్ను నీలో కలిపేసుకో అనలా! త్యాగరాజు అతి లావణ్య రామా అంటాడు.

శ్రీపాద : చార్వాక సిద్ధాంతములో మనిషికి, మనశ్శాంతి, సుఖము లేదు. ఇక్కడ సుఖమున్నది.

అమ్మ : తాము నడచి చెప్పినదే సూక్తి.

# సుగతి

అంకదాసుకు అమ్మనోటినుండి వెలువడిన 'అందరికీ సుగతే' అన్నమాట ఆనందాన్ని కలిగించినది. ఆ సమయములోనే భిక్షుకుడైన తాతగారు నాగతేమిటమ్మా అని దీనవదనుడై అమ్మ నడిగాడు. అమ్మ దరహాసంగా "వాడిగతే నీగతి" - అందరికీ సుగతే నన్నది. "బ్రతికినవాడు" తాననుకొన్న కోరికలు కోరుతాడు. ఆరోగ్యము - కోరుకొంటాడు. సహజంగా లౌకిక వాంఛలలో మంచిగతిని అర్థిస్తారు. ఇప్పుడు ఈ తేడాలున్నా, మరణానంతరము ఏమిటి స్థితి అన్న ఆలోచనకు - శరీరము విడచిన తరువాత అందరికీ ఒకటే గతన్నది అమ్మ.

# మోక్షము

శ్రీపాద : మానవునికి (ప్రాణికి) సర్వములో చేరిపోతున్నా నన్న, స్ఫురణ ఉంటుంది. ఇక్కడ మరణించిన ఒక స్త్రీని ఆసమయములో ఫోటోగ్రాఫ్ చేయగా గ్లామర్ మిన్నగావుంది

గరుడాద్రి: ప్రతి వ్యక్తికి ఆ సర్వములో చేరుతున్నా నన్న స్ఫురణముంటుంది అనడానికి ఋజువేమిటి? కాగా చనిపోయిన వారిని నే చాలా మందిని చూసాను. భయానకంగా ఉండటమే కాక, కళాకాంతులులేని కళేబరములనే కన్నాను. మీరంటున్నారు. ఆ గ్లామర్ అందరిలో కనపడుతుందని నేను అనుకోను.

శ్రీపాద : మనిషిపోయిన పిదప ఏమౌతుంది.

అమ్మ : తన బిడ్డలను సమీపములోని వ్యక్తులకు అప్పజెప్పుచు తప్పనిసరిగా అవటము వల్ల 'ఆహా ' పోతున్నాను అనిపించవచ్చు.

శ్రీపాద : పుట్టక ముందు సర్వము లోని వాడే గదా!

గరుడాద్రి: జీవిస్తున్న ఈ సమయములో నేను సర్వము నుండియే వచ్చితినన్న స్ఫురణ కొద్దిమందికే ఉంటున్నది.

అమ్మ : లౌకిక వ్యవహారాలలో సహితము సుగతి పొందిన వారే బ్రతికి ఉండి త్వరగా కలుపుకోమని, ఒళ్ళుకాలి భరించలేక కోరవచ్చు. హఠాత్తుగా ఒక వ్యక్తి మరణిస్తాడు.

నేను సర్వములో చేరుతున్న నన్నీ ఆలోచనకు ఆస్కారము లేకుండా - అప్పుడు?

శ్రీపాద : ఇంకొకటి లేదు గదా. పోతున్నవారి మనస్థితికి రెండుగా కనపడుతుంది.

అమ్మ : భరించలేక ప్రాణము ఎప్పుడు పోతుందాని ఒకడు ఫీలు అవుతాడు.

శ్రీపాద : ప్రాణము పోతున్నదని తెలియకుండా పొయ్యేవారుంటారు. ఏది ఏమైనా అంతలో కలియటమే.

అమ్మ : ఒకడు స్మృతి విహీనుడుగా ఉంటాడు. అప్పుడు కూడ మన తెలివి లేదు -అంటే మనతో మాట్లాడే తెలివి లేదు. చెప్పలేక పోవటము వేరు. తెలివి లేక పోవటము వేరు.

శ్రీపాద : మృత్యువులో నుండి క్రమంగా పైకి వ్యాపిస్తుంది. జీవాణువులు నశిస్తాయి.

అమ్మ : వ్యాధి కూడా లోనుండి అంచలంచలుగా చర్మగత మవుతుంది.

శ్రీపాద : ప్రాణులు అంతలో కలువక మరో విధిలేదు. చంపిన వాడికి చంపబడిన వాడికి ఒకే గతి.

# కర్మసిద్ధాంతము

శ్రీపాద : గాంధి గాడ్సే చేత చంపబడటమంటే క్రిందటి జన్మలో లోపంచేసి ఉంటే అతనిచేత చంపబడినాడనా? అలాంటి బుద్ధి ఆయన కెందు కొచ్చింది?

ప్రియ : చెట్టుముందా? విత్తుముందా - అన్నట్టు ఇదిక్రమంగా వితండవాద మవుతుంది శాస్త్రము ఒప్పుకోదు.

అమ్మ : సిద్ధాంతమంటే? కర్మ సిద్ధాంతమును ఆధారము చేసుకొన్న కర్మ, జన్మనే కదా! ఈచేను అలాగే ఉంటుంది. ఎవరికేది తెలుసునో వారది చెప్పారు. ఎవరికేది కావాలనుకున్నారో వారది నమ్మారు.
ఆచరించి చెప్పింది సిద్ధాంత మవుతుందా?
చెప్పిందే సిద్ధాంతమవుతే దారిన పోయేవాడు చెప్పితే నమ్ముతావా?
పది మందికి సరిపోతే సిద్ధాంతమా?
జనములో సిద్ధాంతమనేమాట కొంతమందికి సరిపోతే చాలా?
ఈనాడు అనేక పార్టీలకు సిద్ధాంతాలుంటున్నాయి కదా -
నక్సలిజంది సిద్ధాంతమేనా?

శ్రీపాద : ఇంకొకరికి చెప్పి నమ్మించగలిగినది సిద్ధాంతము.

ప్రియ : పదిమంది నమ్మినది సిద్ధాంతమా?

అమ్మ : నక్సలిజంది సిద్ధాంతమెట్లా అయింది? ఇది ఒకప్పుడు ఉండి ఉన్నదా? అన్ని పార్టీలకు సిద్ధాంతాలుంటున్నా, గణితానికి జ్యోతిషానికి సిద్ధాంతా లున్నాయి.

శ్రీపాద : కమ్యూనిష్టు మనుష్యులనే లెక్కకు తీసుకుంటారట? నాకు జంతువులు కూడ లెక్కే అన్నాను.

అమ్మ : ఇంకొకడు చెట్లు, చేమలు తీసుకొంటాడు. జగదీసు చంద్రబోసు కొండలలో, చెట్లలో దైవత్వము చూసాడు.

శ్రీపాద : అవతలివాడు సమాధానము చెప్పటానికి వీలులేనిది సిద్ధాంతము

అమ్మ : సిద్ధాంతమంటే ఏమిటో చెప్పటానికి ఇంతసేపు పట్టింది. వాడు అచ్చగా కరుణాపయోనిధి కనుకనే కర్మ సిద్ధాంతము పుట్టాల్సి వచ్చింది. కర్మసిద్ధాంత ముండబట్టే ప్రారబ్ధం వచ్చింది. వాడు నిర్లిప్తుడు, నిరామయుడు అని చెప్పడములో ఉద్దేశ్యమేమి? అన్నీ తనే చేస్తున్నానా అని ఉంటే నీవు చేయి అని పుట్టదు. అన్నీ సమానంగా ఉంటే ఈ ఆలోచన రాదు. కర్మంటే ఎక్కడిది? దేనివల్ల ఈ కర్మ వచ్చింది? అనే దానికి ఆధారము దొరకదు. అప్పుడు బహుశ పూర్వముదేమో అంటారు. ఒకడు చంపితే, మరొకనికి శిక్షపడుతుంది. నేరము చేయలేదని వాడి మనస్సుకు తెలుసు. అయితే ఈ శిక్ష ఎందుకు పడిందని ఆలోచిస్తే వెనుకటి జన్మలో చేసి ఉంటానేమో అని అనుకొంటాడు.

శ్రీపాద : దీనినంతా రాజకీయ పరిస్థితిలో పెంచారు.

అమ్మ : పూర్వజన్మకు మొదటిగా వెళ్ళితే మొదలు దొరకదు. ఒక పదార్థము తింటే జబ్బు ఎక్కువవుతుంది. మరొకటి తింటే తగ్గుతున్నది. పూర్వజన్మ సిద్ధాంతానికి ఆధారము లేదు.

శ్రీపాద : వాడే వెరైటీగా ఉన్నాడు.

అమ్మ : భూమిలో నుండి సర్వము వచ్చినా - నాగజెముడు, పొన్నచెట్టు, కొబ్బరిచెట్టు దాని గుణము దీనికి - దీని గుణము దానికి రాలేదు. శక్తి ఇన్నైందను కుంటున్నాను. ఇన్నిగా అయింది కనుకనే.

శ్రీపాద : అద్వైత సిద్ధాంతములో రూపము, గుణము లేనిది నిరంజనము - ఏకమేవ అద్వితీయం బ్రహ్మ.

శ్రీపాద : కనబడేది + కనబడనిది రెండు కలిపితేనే పూర్ణత్వము.



# తెలుసుకోవడం - తెలుసుకునేది

2వ సంభాషణ

**7-11-74** (Night)

అమ్మ : నిద్రలో మనసు చావును గల్పించుకొన్నది. నిద్రలో కలలు చనిపోయిన వాడు తన వాడు అని ఏడ్వటం.

శ్రీ : ఊహించుకొని అనుభవించటం.

అమ్మ : ఒక్కొక్కసారి అతి ప్రేమలో కూడా యాక్సిడెంటువలె కానని ఊహించుకొని భయపడతుం ....

ఎక్కడో పిలిస్తే పలికే జాగ్రదవస్థే ఇవన్నీ ఆలోచిస్తున్నది. ఏకాగ్రత గాఢసుషుప్తిలోనే వుంది.

స్వప్నంలేని స్థితి సుషుప్తి.

తెలిసీ తెలియని స్థితి స్వప్నం.

ఫోటో ముందు ఉన్నా మనసు ఎక్కడో ఆలోచిస్తున్నది. అదే స్థితి నిద్రలో జరుగుతుంది.

శ్రీ : కలగంటున్నప్పుడు జరుగుతుంది.

అమ్మ : నిద్రలో కల, మెలకువగా ఉండి పని చేసే సంకల్పాలు. ఆలోచనలు వస్తూ పొయ్యేవి.

భావం స్థిరమైంది.

మనసుకు సంకల్పాలు రావటం పోవటంలో స్థిరమైనదనటం ఎట్లా? నాయందు స్థిరమైన భావం ఉండవచ్చు. అమ్మ దైవమనో, కావాలనో, ఇటువంటి భావం స్థిరమైంది. అనేకం రావచ్చు - పోవచ్చు. అనుభవం అనేది పైదాన్ని.

నిల్చిపోయ్యేది ఏదైతే ఉందో అది అనుభవం.

ఉద్దేశ్యాలు, అభిప్రాయాలు వుండవచ్చు.

భావం దృఢపడితే అనుభవం.

రామరాజు: ఒక్కొక్కరికి ఒక్కొక్కరకం.

గాఢసుషుప్తిలో సంకల్పాలు వికల్పాలు లేని స్థితి అది?

అమ్మ : నిద్రపోతున్నాను. కలవచ్చినదని తెలియదు. మెలకువ వచ్చిన తర్వాతనే తెలియటం కొన్ని సందర్భాలలో ....

ఆలోచన లేనిస్థితి కొన్ని లిప్తలు.

వస్తువుకై బజారు వెళ్ళతాము. ఏవో ఆలోచనలో దానిని మరచి ముందుకు వెడతాము.

ఒక సందర్భములో కావలసిందే గుర్తువుండి తక్కినవి స్మృతికిరావు. మనసు బరువుగా తీసుకొనే సందర్భాన్ని బట్టి ఉంటుంది. ప్రతిక్షణం చావు పుట్టుకలు జరుగుతున్నాయి.

వేల వేల ప్రాణులు చచ్చిపోతున్నాయి. ఎన్నో పుడుతున్నాయి.

ఎన్నో రూపాలు పోతున్నాయి. ఎన్నో ఉద్భవిస్తున్నాయి.

ఎందుకో బాధగా ఉందని చెప్పానే ఇందాక. నావాళ్ళ కోసం గురించి ఉంటుందా?

ప్రసవ వేదన. ఏదో చెప్పాలి.

విషయం వ్యక్తం చేసేలోగా ఉండవచ్చు.

బాధను వ్యక్తం చేయటానికి వేదన అవసరమే.

రామరాజు: వేదన ఎందుకూ?

అమ్మ : విషయం వివరించటానికి.

వేదన అంటే ఒరిపిడి.

నీ కర్థం అయేటట్లుగా నీ భాషలో దిగి చెప్పాలి గదా! చెప్పటంలో తరగతి వారిగా వస్తున్నది.

ఇప్పుడు కేవలం సైన్సు - మనసు - శరీరం చెబుతున్నది.

చెప్పే స్థితిలో మార్పులేదు. మాటలలో మార్పువుంది.

సాధన కొన్నాళ్ళు, జ్ఞానం కొన్నాళ్ళు వ్రాశారు. ఎవరు ఏది అడిగితే వారికిచ్చిన సమాధానాలు.

దైవం - సృష్టి, జ్ఞానం చాలా వ్రాశారు -

వాడే చేయిస్తున్నాడని లోగడ వ్రాశారు -

అన్నీ వాడే అయినాడని కొంతకాలం వ్రాశారు.

చేయిస్తున్నది. పోషిస్తున్నది ఏదో సర్వం అయి ఉన్నది తేడాలేదు.

ఇదిపరకటి కంటే మార్పు కనిపిస్తున్నదంటున్నారు.

మఱ్ఱిచెట్టు మఱ్ఱిచెట్టుగా, వేపచెట్టు వేపచెట్టుగానే కనిపిస్తుంది.

ఆకృతులు వేరు, గుణాలు వేరు. ఇవన్నీ ఆశక్తి, అయింది,

అనే దానిలో ఇప్పుడూ, అప్పుడూ తేడాలేదు.

వేరు వేరుగా కనబడుతున్న శక్తి ఒకటే.

శక్తి ఎలా ఉంది?

మనిషిలో మనసుగా, ప్రకృతిలో ప్రకృతిగాఉంది.

ఆశక్తిని రాముడనుకో, కృష్ణుడనుకో.

మనసు ఆకృతి ధరించక పోతే సాక్షాత్కారం లేదు.

ఆత్మ అని ఎట్లా అను కొన్నావూ?

జ్యోతియా ఆత్మ అంటే?

శ్రీ : వొప్పుకోడు.

రాముడిగా చూశానంటారు

అమ్మ : రాముడు అంటే రవివర్మ చిత్రమా?

కెమేరా పెట్టి ఆనాడు తీశారా?

రాముడు పోలిక తెలిసి ఉంటే మంధర, దశరధుడు ఎట్లున్నాడో చెప్పాలి.

శ్రీ : ఒకటి తెలిస్తే సర్వం తెలియటం ఉందన్న మాట

అమ్మ : అన్నీ తెలిసినట్లు అనిపించదు. మీరడిగినది తెలుస్తున్నది.

ఏది ఎప్పుడు అవసరమో అది తెలుస్తున్నది.

ఏ ఒక్కటి తెలిస్తే ఇవన్నీ తెలుస్తాయో అన్నది లేదు.

ఏది అవసరమైనప్పుడు అది తెలుస్తున్నది

వారు ఒకటి ఆధారమన్నారే; అది ఏమిటో ఆ ఒక్కటి తెలియదు.

శ్రీ : ఉద్దాలకుడు శ్వేతకేతువునకు చెప్పాడు

నల్లగా ఉన్నది పృధ్వియని - తెల్లగా ఉన్నది నీరు అని - ఎర్రగా ఉన్నది తేజస్సు అని - ఈమూడు ఆత్మనుండి వచ్చాయని - ఇవి ఎక్కడనూ - దీనికి మూలం ఆత్మ అని - ఆత్మ తెలిస్తే ఇవన్నీ దానినుండి తెలుస్తాయని చెప్పారు.

అమ్మ : సర్వం ఒకే వేళలో తెలియటం లేదు. శరీరంలో తేడా తెలుస్తున్నది. ఏర్పడటానికి ఒకే శక్తి అని తెలుస్తున్నది. ఏది కావలసి వస్తే అది కనబడుతుందా?

శ్రీపాద : కంటికి కనబడుతుంది.

రామ : జ్ఞాత అంటే?

అమ్మ : తెలుసుకొండేది.

రామ : జ్ఞేయం అంటే?

అమ్మ : తెలియబడేది

మల్లెచెట్టు గుర్తించేదిజ్ఞాత

మల్లెచెట్టు జ్ఞేయం.

శ్రీ : మొదటినుండీ అన్నిగానే ఉన్నది.

అమ్మ : ఆ ఒక్కటిగా ఎప్పుడూ లేదు.

మనకు తెలియనిది అమ్మకెలా తెలుస్తుందీ? అని అడుగుతారు

ఏమీ చదవని నీవు ఇన్ని విషయాలు ఎట్లా వివరిస్తున్నావని అడుగుతారు.

నానోటివెంట ఆ మాటలు వస్తున్నవి.

ఈవాక్యం తర్వాత ఈవాక్యం అని అంతక ముందు ఊహించుకొనడం లేదు.

ఇంక కొన్ని గంటల పిదప రామరాజు క్రిష్ణమూర్తి ఫలానా ప్రశ్న వేస్తాడని ఏపుస్తకంలోనూ లేదు.

ఒకనాటి వాడి అనుభవమే ఈనాటి శాస్త్రం.

# నాస్తికత్వం

అమ్మ నాస్తికురాలనో, అమ్మది నాస్తికత్వం అనో అంటారు.

ఉన్నది అని నేనే అంటున్న, ఆస్తికులనే మీరు మాయఅంటున్నారు.

ఎక్కడో ఉంది. ఏదో స్థితి అన్నారు. నాకు అందలా-

ఇది పొయ్యేది అంటారు మీరు.

శాశ్వతమైనది అంటున్నా.

చింత చెట్లన్నీ లేకపోయినా చింతచెట్టుఉంది.

శాశ్వతమైనదీ ఇది.

ఈపూట పుట్టిన వాడికి కొన్ని గంటలు గడిచిన పిదప మృదుత్వం తగ్గుతుంది. క్షణ క్షణం మార్పు ఉంది. ఆ గుణం పోయింది. ఆమార్పును నాశనమంటున్నారు.

ఇందాకటి స్థితి చూపించలేము. దానినే నాశన మంటున్నారు మీరు.

రామ : అంతా అయిందానికి అవసర మేముందీ?

అమ్మ : నీవు కవిత్వం గురించి అడిగావు. అందుకే గణాలు, యతులూ ప్రాసలు చెబుతాను.

# జ్ఞానము - జగత్తు

## అమ్మతో సంభాషణ

**7-11-74**

శ్రీపాద : బాలయోగి చేస్తున్నదేమిటి?

అమ్మ : అన్వేషణే

అంతర్ వేదినే అంతర్ యోగంగా పోల్చారు.

భూచరీ అంటారు మనసు - దృష్టి ఒకచోట పెట్టి సూర్యుని చూడమన్నారు ఆకాశంలో ఉన్నవాడు భూమి మీద ప్రకాశిస్తాడట.

ఖేచర అంటే చేప నిద్రలాంటిది. నిన్ను నీవు చూచుకో! గ్రుడ్డు అక్కడ పెట్టి మనసు నిలుపుకో అంటారు.

ఇంకొక ఆలోచనలేకుండా ఉండటమే ఆనందం. ఎక్కడ కదలకుండా కూర్చోంటే శరీరం లోపల ఉండే చైతన్యం అర్థమవుతుంది. (లోపల) రూపం గనబడకుండా స్ఫురణ తెలుస్తుంది. శరీరంలో మనసును కట్టడ మన్నారు. తర్వాత నీకు ఏదో స్థితి వస్తుందన్నారు. ఆ ముద్రఅనీ - ఈ ముద్రఅనీ మరిదమ్మగారు తెల్లవార్లూ తపస్సు చేస్తుండేది. వాళ్ళకు ఎంతో ప్రయత్నంతో వచ్చేది - నాకు సునాయాసంగా వచ్చేది.

జబ్బులు వచ్చినా, పండుగలు వచ్చినా ఎవరికి ఏ అవసర మొచ్చినా చేసేది. ఆమెకు 400 మందిదాకా శిష్యులు ఉండేవారు. సాకారం - పూజలు వీటి పట్ల ఆమెకు అంత శ్రద్ధలేదు. అయితే ఆమె గురువుగారిని పూజించేది. విసుగు అనేది లేకుండా పలక లేని వారికి సైతం - చెబుతూ పాడిస్తుండేది.

సుబ్బాయమ్మగారి శిష్యురాలిని చిన్నమ్మగారిని హైదరాబాదులో చూచాను. మరిదమ్మగారు, సుబ్బాయమ్మగారు ఒక గురువుగారి వద్ద ఉపదేశం పొందారు. సుబ్బాయమ్మగారికి తపస్సు చేతగాదు. శీతాయమ్మగారు ఈమెకు నేర్పుతాను అన్నది. సుబ్బాయమ్మకు శిష్యులు హెచ్చు. ఆ రోజుల్లో మహావాక్య రత్నావళీ, సీతారామాంజనేయం, పంచీకరణం మొదలైనవి చెప్పుకొనేవారు వారి ఉపదేశ మంత్రం ఇట్లా ఉందేది - నిర్వికార అచల పరిపూర్ణ బ్రహ్మ, నీవే నేను. నేనే నీవు. అని ద్వాదశాక్షరీ, షోడశాక్షరీ, గౌరీపంచాక్షరీ చెప్పేవారు.

మాటలతో గాక క్రియా రూపంగా సేవచేసే మనసు మరిదమ్మ గారిది - ఉన్నది బ్రహ్మ తప్ప రెండోది లేదు. అనేది. బ్రహ్మదండి ప్రక్కన సుషుమ్న నాడి అనేది, రమణమహర్షిదగ్గర వచ్చినదట.

బింబం కనబడుతుందీ అనేవారు.

శ్రీపాద : సాధనకూ, బింబమునకూ మధ్య ఏముందీ?

అమ్మ : భావముంది.

అమ్మ : భక్తుడు భగవంతుడు తన చేతిలో ఉన్నాడని ఫీలవుతాడు. కొంతకాలం జరిగిన తర్వాత, వీడే కడుగుతాడు వీడే నివేదన చేస్తాడు సర్వం చేస్తాడు. తాను పెడితేనే తింటాడని - నేను ఇస్తేనే కట్టుకొంటాడని - చివరకు నేను లేనిదే నీవు లేవు అంటాడు.

ఎంతదూరం పోయినా అహంకారము చావదు అని చెప్పటానికే - ఇటువంటి ఉదాహరణ.

నన్ను పాలించమంటాడు త్యాగరాజు. కానీ నన్ను నీలో కలిపేసుకో అనలా-

అష్టపదులలో కూడా నేను నీలో కలుస్తానని, కలుపుకోమని ఎక్కడన్నా ఉందా?

మంగళాలయ మామవ దేవ అంటాడు జయదేవుడు.

శ్రీ : తాను వేరేవుంటే తృప్తి ఏముందీ?

అమ్మ : తను అదే ఆనందమను కొన్నాడు.

రెండూ నీవే అని ధ్యానించారే

శ్రీ : నమ్మాళ్ వారు అన్నారు.

అమ్మ : ఉద్దై వరల్

శ్రీ : నీవూ నేనూ ఒకటే అనలా-

అమ్మ : ఐక్యం కంటే ద్వైతం రామాయణంలో కన్పిస్తుంది.

శంకరునిది అద్వైత మనేది ఏరకంగా?

శ్రీ : వారూ సర్వ దేవతలనూ స్తోత్రం చేశారు. తాను వేరని, వాడు వేరనేగా! ఇక్కడ ద్వైతమే కనబడుతుంది.

అమ్మ : అద్వైతం పూర్వపక్షం చేశారంటారు. పూర్వపక్షం అంటే ఏమిటి?

శ్రీపాద : .... .... ....

అమ్మ : శంకరాద్వైతం అంటే అద్వైతమే చెప్పేదనా?

అద్వైతమే అయితే మాయావాదం ఉండకూడదు.

మాయావాదం అంటే ఇది లేదు అనుకో అన్నాడు. జగత్తులేదు అనుకో. మంటాడా?

అద్వైతికి జన్మ పరంపరలు ఉండకూడదు.

శ్రీ : పునరపి మరణం - పునరపి జననం అనిచెప్పి ఉన్నది.

అమ్మ : వచ్చేవారు అనేక విధాల ఉంటారు.ఒక స్థితి ఉండదు. ఒక మాట వినలేదు. నాలుగు మాటలు ఏదో చదివి - దానితో బేస్ అవటమే తప్ప దూరమాలోచించరు.

అనుభవ మంటే ఏమిటి? మాయ అంటే ఏమిటి? మాయ వస్తూ తెచ్చాదా? మిధ్య అంటే?

"ఉన్నదే బ్రహ్మ. జ్ఞానం చేతనే ఉన్నదను కొంటాడు. అజ్ఞానం చేత జగత్తు లేదను కొంటాడు"

తొలగవలసినది అజ్ఞానంగాని, జగత్తుగాదు.

వేరుగా కనబదుతున్న జగత్తు జ్ఞానంచేత, జగత్తు బ్రహ్మ అయిపోతున్నది.

బ్రహ్మ సత్యము జగత్తు సత్యమే.

రెండోది తోచకుండా ఉండటమే జ్ఞానం.

ఒక విషయంలో తేలకుండా ఉన్న భావాన్ని ఆలోచన అన్నాం. ఆలోచన అనే ప్రక్రియ ఒకటే - ఫిగర్స్ మారుతుంటాయి. దానికి దృఢమైన దాన్ని నమ్మకం, విశ్వాసం, భావం - అన్నాం. మరో పరిభాష లేదు.

రా : భావం గలిగేదా? గలిగించేదా?

అమ్మ : వ్యక్తం చేయటానికే భాష. అనుభవించటానికి ఆచారాలా - తన అనుభవాన్ని ఇంకొడికి చెప్పటమంటే టీచింగ్ అది.

ఆలోచించే స్వభావం ఉన్నది. ఏదో పొందవలసినవి, నాకు కావలసినది ఆలోచించే ఆలోచనా భాగంలో ...

ఏదైనను ఒక విశిష్ట చరిత్ర గల మూర్తిని పెట్టుకొని, ప్రపంచాన్ని సృష్టించిన వాడిని పెట్టుకొని, ఎవరు ఉత్తములో అని నాకు తోస్తే, వాడు ఏమి చేశారో ఆలోచించి, వాడి చరిత్రను బట్టి, నమ్మకం కలిగిన తత్వంతో, ఉండలేక, దానిని ఆదర్శంగా తీసుకొని అనుసరించటం ఒక భాగం.

ఎవరికి తెలిసినంత వరకూ వారు చెప్పారు.

ఒకడు వచ్చిన రీతిని తీసుకొంటాడు.

అయినా వానిని, వారిని మన విద్యతో, మన నమ్మకంతో, మనఆలోచనతో నిర్ణయిస్తాం. నాలుగు అనేదాన్ని 3 +1 అని ఒకడు, 2+2 అని ఒకడు, నాలుగు ఒకట్లు అని ఒకడు. మీకు అమ్మ దగ్గర నాలుగే కనబడుతున్నది. అయితే నీ బాధ ఇక్కడ నాలుగు ఉందని చెప్పడానికి వారిది అంచె లంచెలుగా ....

సంపూర్ణ స్థితి అంటే, జ్ఞానా జ్ఞానాలు రెండూ ఒక్కటేనని.

శ్రీపాద : నశ్వరం అనే పదము కొంపముంచింది.

అమ్మ : వారు అది చిత్తు అన్నారు. ఈ మార్పునే నాశనంగా తీసుకొన్నారు. పరిణామం రూపంపోయే మార్పు.

నీకు పుట్టిన పిల్లవాడికి వృద్ధాప్యం వచ్చింది. నీ శైశవం నాశనమై పోయింది.

శ్రీ : కొవ్వొత్తి కరగి ముద్ద అవుతున్నది. నాశనం అవలా - వాయు రూపం అయిందే తప్ప కేండిల్ నశించలా -

అమ్మ : నశించటమంటే (వారి దృష్టిలో ) కనిపించక పోవటం. వస్తువు పోలా-

శ్రీ : రూపం పోయిందని వారి ఉద్దేశ్యమా? కాదేమో, ప్రళయములో విశ్వము పోతుందంటారు.

# ప్రళయకాలం

అమ్మ : ప్రళయ కాలంలో జల ప్రళయం.

శ్రీ : అంత మాత్రంకాదు. జగత్తులేదు. జీవుల కర్మ, పరమేశ్వరుడే ఉన్నాడు.

అమ్మ : అయితే అతను తను కాదట. యేమిటి?

శ్రీ : ఒక పరి జగములు ...

అమ్మ : అతనే అయితే లోపలకు తీసుకోవలసిన అవసరమే మొచ్చింది?
స్థూల సూక్ష్మ విశిష్ట కావ్య కారూ బ్రహ్మ ... చిత్తు, అచిత్తు - ఈశ్వరుడు రాముడు.

అమ్మ : చిత్తు అంటే

శ్రీపాద : జీవుడు

అమ్మ : అచిత్తు అంటే?

శ్రీ : జీవుడు గాని వాడు.

అమ్మ : చిత్తు అచిత్తులో కలసి పోతున్నది.
అచిత్తు ప్రళయంలో ఈశ్వరుడు అయిపోతున్నది.
జగత్తు ప్రళయకాలంలోనన్నా ఈశ్వరుడు కావల్సిందే! అక్కడి కొప్పుకొన్నా చాలు..

శ్రీ : జీవులు అవరట...

అమ్మ : వీరికై వీరు పుట్టిన తర్వాత గదా సృష్టి చేసేది?

శ్రీ : అనాది అంటారు.

అమ్మ : దేశమే తనా? దేశము లేదా?

శ్రీ : మొదట తానొక్కడే ఉండెను.

అమ్మ : మనతో పాటే....

శ్రీ : దేశమూ సర్వమూ అయి ఒక్కటే ఉన్నాడు.
జగత్తు పొగమంచులా ఉందో లేదో తెలియదు.
అది సత్ అన్నారు. సృష్టి సర్వమూ తానే అయి ఉన్నది ఆత్మ అన్నారు.
తననుండే బయట పెట్టబడినది అంటారు.
వ్యష్టి చెప్పుకోరు.

అమ్మ : ఇవన్నీ ఎట్లా వచ్చాయి?

శ్రీ : తను బహుశా అయ్యేదను గాక అనుకొన్నాడు. ఎందుకో చెప్పలా-

అమ్మ : దేవీ ఉపనిషత్తులో సర్వం నేనే అని ఉన్నది. అది శక్తి ఉపనిషత్తు పలికే?
తైత్తిరీయము, భృగువల్లి, ఆనందవల్లీ, వాటిలో కోశములు తప్ప ఏమీ కనిపించవు.
ఉన్నది అదే. ఎవరు తక్కువా, ఎక్కువా గాదు. ఎవరికందినంత వారు చెప్పారు. ఏది చూశారో ఏది భావించారో అది చెప్పారు.

# నేను-మీరు

**10-11-74** (Morning Time)
Sripada and Mother

శ్రీపాద : అమ్మా – మీరు, నేను అమ్మను మీరు బిడ్డలు అన్నారే, అప్పుడు మీరు వేరు, మేము వేరు అన్నట్టుకాలా? అంతా ఒక దానికే అయినప్పుడు ఈ మీరు, నేను అనే మాటలు ద్వైవిధ్యము వచ్చినట్టు వినిపిస్తున్నాయి అవి ఎలా అర్థం చేసుకోవటం?

అమ్మ : అదే ఇవన్నీ అయి ఉన్నదన్నానుగదా! నేనూ రెండుగనే చూస్తున్నా. అయితే ఈ రెండూ ఆ ఒక్కటే – (శక్తి) (అనుకొంటున్నాను) ఇవి రెండు చేతులు, రెండు కాళ్ళుగా? రెండు చేతులు, రెండు కాళ్ళు అనే అనుకొంటున్నాను. ఈ రెండూ రెండుగనే చూస్తున్నా. ఇవి నా చేతులే, నాకాళ్ళే అనుకొంటున్నా. బంతి పువ్వు ఉంది నాన్నా, సీతాఫలం ఉంది ఇవి చెట్టుతోనే ఉన్నాయి. కాని ఇది పువ్వు – ఇది సీతాఫలం అని వేరుగా చెబుతాము గదా! చెట్టుకు అది పువ్వు, ఇది పండు రెండూ చెట్టునే ఉన్నా – వాటిని చెట్టు అనం. పువ్వు – పండు అంటాము. కానీ మొత్తం ఒకటేగా! అవి చెట్టునుండి వచ్చిన ఫలాలు – మీరంతా మమతాఫలాలు–

శ్రీపాద : నేను మీలో దైవత్వం చూస్తాను – మీరు నాలో మానవత్వం చూస్తారు అన్నారే..........

అమ్మ : మీరు కానిది నేనేదీ కానన్నాను గదా! అందుకే మీలో నేను దైవత్వమే చూస్తా – నా తత్వమే చూస్త మీరు మీతత్వమే చూస్తారు – మానవత్వమే చూస్తారు (నాలో)

శ్రీపాద : అసలా రెండూ ఒకటే గదమ్మా

అమ్మ : ఔను భావమే తేడా!

శ్రీపాద : అందరి గతే సుగతే అన్నారు? – ... తాత అంకదాసుతో ... మహోదధి తరంగాలలో

***

అమ్మ : అడిగేవారి దృష్టిలో, - శరీరం ఉండగా 'గతి' అని అడిగారంటే దానికి లౌకికంగా డబ్బు, ఉద్యోగం, భార్యాబిడ్డలు యోగక్షేమాలు, ఆరోగ్యం ఇవి అని అర్థం. ఇదే మనమూ అనుకొంటాము. కానీ అక్కడ అది గాదు. తాత శరీరం వదలిన తర్వాత పొందే స్థితి అడిగాడు. ('అమ్మా నా గతి ఏమిటని') శరీరం వదలిన తర్వాత ఈ పొందబోయేది అందరిదీ ఒకటే, అందరికీ ఒకటే అందరిగతీ నీ గతే అన్నాను. అందరికీ సుగతీ, అదీ జన్మలు లేవను కొంటున్నాను గనుక, - జన్మలు లేవు గనుక

× × × ×

శ్రీపాద : అన్నీ నేనులు నేనైన నేనులు అన్నారూ. మాటలలో 'నేనులు అంటున్నారూ? నీవైన నేను అన్నారు. నేను, నేను నేనైన నేను అన్నారు. ఈ నేను లేవో కొంచెం వివరించండి?

అమ్మ : అన్ని నేనులు నేనైన నేను అంటే–

చెవితో విన్నది నేనే, కంటితో చూచేది నేనే. నేనే మనస్సు, ఈ మనస్సే శరీరాన్ని ఆధారం చేసుకొని, శరీరం మనసును ఆధారం చేసుకొని రెండు ఒక దానికొకటి ఆధారంగా ఉన్నది. ఇవన్ని కలసిన నేను - 'అన్ని నేనులు నేనైన నేను'

నా చెవి, నా ముక్కు అని వేరు వేరుగా అనుకొంటూ అన్ని నావే అని తెలుసు కొంటున్న నేను - నేను శరీర భాగాలు నేను అనుకొన్నది నేను. శరీరమూ. మనసు కలసిన నేను - నేను!

అదీ (శ్రీపాద) నేను, ఇదీ గరుడాద్రి నేను, వ్యక్తులను చూచినప్పుడు నేను అనిపించే నేను 'నీవైన నేను' వేరుగా కనబడుతూ అది నేను అని స్ఫురణకు వచ్చే నేను నీవైన నేను.

ఇన్నిటినీ వేరుగా చూస్తూ, మనసు మాత్రమే గాక ఇవన్నితో కూడిన నేను - 'నేను నేనైన నేను'

శరీరం వదలిన మనసును జీవుడంటున్నారు. జీవుడు వేరేలేడు. శరీరంలో అనేక జీవకణాలు ఉన్నాయి. అవే జీవులైతే అనేక జీవులై తాయి. (అసలు) ఉన్నది ఆత్మ గనుక శరీరమూ, మనసూ ఆత్మ గనుకనే 'నేను నేనైన నేను.'

## 21-4-76

# సేకరణ : గరుడాద్రి

అమ్మ : దీనిలో ఎక్కువ చెప్పారని, దానిలో తక్కువ చెప్పారని – అది బాగోలేదు. అలా అనడంకాదు ఉన్నదేదో ప్రతిపాదించటం.

వీ.ప్ర : ఇతరులవన్నీ పాక్షికసత్యాలే. అమ్మ చెప్పినదే పరిపూర్ణమైనది. మానవ తాత్విక చింతనలో అమ్మ చెప్పిన సిద్ధాంతం పరాకాష్ఠ. తదితరమైన శాస్త్రాలు ఎలా వ్యాప్తి చెందినవో, చారిత్రకంగా చూపెడుతూ ...

అమ్మ : సమూలంగాలేదు.

వీ.ప్ర : వీటన్నింటికి మకుటాయ మానంగా అమ్మచెప్పిన సిద్ధాంతం ఉందని, ఇవన్నీ పరిశోధించి వాళ్ళంతా ఏం చెప్పారని కాదు.

అమ్మ : ఉన్న సత్యాన్ని తలాకాస్త రుచిచూశారు అని చెప్తున్నాం. మతాలలోకూడ మనకువేరు అభిప్రాయంలేదు గనుక బైబిలు, ఖురానుకూడ తీసుకోవాలని నా అభిప్రాయం. దీనివల్ల ఏం ప్రమాదంలేదు. నామతాన్ని గురించి మీరెవరు రాయదానికని అనడానికి వీల్లేదు. అందులో చెప్పినది, నేను సమన్వయ పరుస్తాను కనుక – అన్నీ సమన్వయంచేసి చెప్పుకొనేవాళ్లమే కాని అందులో, ఇందులో తేడాలున్నాయని – ఇదిబాగోలేదు ఇందులో తప్పులున్నాయి – దానిలో ఎక్కువచెప్పారు – దీనిలో తక్కువ చెప్పారు అనికాదు ఉన్నదేదో ప్రతిపాదించటం

వీ.ప్ర : ఇతరులు చెప్పినవన్నీ పాక్షిక సత్యమే. మొత్తం theme ఏమిటంటే మానవతాత్వికచింతనలో అమ్మ చెప్పినసిద్ధాంతం పరాకాష్ఠ తతిమ్మావన్నీ పాక్షికసత్యాలే. ఇవన్నీ ఎలా వ్యాప్తి చెందినవో చారిత్రకంగాకూడ. చూపెడుతూ, ఉద్యమం ఎందుకు వచ్చింది చూపెడుతూ.

అమ్మ : సమూలంగాలేదు.

వీ.ప్ర : పూర్ణంగాలేదు. పైకివచ్చేటప్పటికి వీటన్నింటికి మకుటాయమానంగా అమ్మ చెప్పిన సిద్ధాంతముందని – ఇవన్నీ పరిశోధనచేసి వారంతా ఏం చెప్పారనికాదు. వారు చెప్పిన ప్రధాన సిద్ధాంతమేమిటో చెప్పి అందులో అన్నదేమిటో అ – ఉంకించటం.

అమ్మ : అందరు తలాకాస్తరుచి చూశారని చెప్తున్నాం. ఉన్న సత్యాన్ని తలాకాస్త రుచి చూశారు. పంచదార Chocolate ను తలో ముక్క పెట్టింది – చాక్‌లేట్ అంతా తానే తిన్నది అనేదాని కెంతతేడా. చిలుకతో పోల్చుతున్నాంగదా. అట్లాగే ప్రతిపాదన ప్రసాద్‌దే.

శ్రీ : అది ప్రసాద్ ప్రతిపాదనగనుక
ఇక్కడ రాస్తే, ఏదన్నాసందేహాలొస్తే – నన్నడగడానికి వీలుంటుంది మొదలు పెట్టండి.

వీ.ప్ర : వివరంగా ఏం వ్రాయాలో సినిమాస్క్రిప్టులా వ్రాసిపెట్టి అది మీకు చూపించి ఇక్కడేరాద్దాం అని అనుకుంటున్నాం. ఉపనిషత్తులను వాటిని తర్కించవలసిన పనిలేదు. అక్కడికి వెళ్ళినవారు, నేనుకాకపోతే వేదాలనుగురించి దీనికోసం చదవటంలేదు. రామక్రిష్ణ మిషనువాళ్ళు భారతీయ సంస్కృతి చరిత్ర అనివేశారు. భారతీయ తత్వశాస్త్ర చరిత్ర అని చెప్పి Das gupta ఒకటి వ్రాశారు. వేదాల్లో ఉండే ప్రధాన సూత్రాలు వాటిలో చెప్పడం జరిగింది వాటినుంచి ఎత్తుకుని ఆపని చేయదలచుకున్నాం.

శ్రీ : వేదాలు translation చేసిన కాపి నాకు పట్టుకొచ్చి చూపెడితే మీకు కావలసిన Matter లో ఇస్తాను.

అమ్మ : బ్రహ్మసూత్రాలు కూడ తీసుకొంటారా ఇప్పుడు?
శంకర సిద్ధాంతం వివరంగా తీసుకుని, ఎందుకంటే ...

వీ.ప్ర : భారతీయ తత్వసిద్ధాంతమంటే, శంకర సిద్ధాంతమే ప్రపంచంలో ప్రముఖంగా ఉంది.

అమ్మ : అజాతం....గౌడపాదులను తీసుకోరా?

శ్రీ : అఖ్ఖర్లేదు.

వీ.ప్ర : ఒక పెద్ద సిద్ధాంతం క్రిందరాలా

శ్రీ : ఎవరూ తీసుకోలా

వీ.ప్ర : వ్యాప్తి చెందలేదు. దీనిని పరిపుష్టం చేసింది శంకరులు గనుక

అమ్మ : ఉపనిషత్తులు వివరించారేమో మాండుక్యం....

శ్రీ : అదికూడ ఆయనే వ్రాశాదు అని వాళ్ళన్నారమ్మా

అమ్మ : ఎవరేది వ్రాశారో అందులో ఉండే వ్యాఖ్యానాన్ని బట్టి మనం అర్థం చేసుకుంటాం....

వీ.ప్ర : ఉపనిషత్తుల్లో చెప్పినటువంటి ఆధిభౌతిక చింతన పరాకాష్ఠ

శ్రీ : ఆయన అంతమటుకే వెళ్ళాదు.

అమ్మ : చరిత్రవస్తే .... అందులో క్రియా అద్వైతం కూడ ఉన్నట్టు ఆయనకు కనిపిస్తున్నది.

వీ.ప్ర : పూర్ణాద్వైతం అవుతుందని "నా" ఉద్దేశ్యం,
భావాద్వైతం వరకే ఉన్నదాన్ని క్రియాద్వైతం తన చరిత్ర ద్వారా....

అమ్మ : క్రియకుకూడ భావం ప్రధానమేనాన్నా. క్రియకు అవకాశముంది ఆరోజురాకపోదు, ఇప్పుదు కాకపోయినా ఒకటిఉందని...
రాముదుండగా రామాయణానికి విలువ ఉన్నదో లేదో తెలియదు. రాముడ్ని బంధువులందరు పూజించారో లేదో తెలియదు. దానికి ఉన్నటువంటి విలువ దీనికి వస్తుందని అలా అని నేనను కొంటున్నానని వారు నాతో అన్నారు.

శ్రీ : అది రావాలిగదా.

అమ్మ : వస్తే దానిని సంస్కృతంలో
అమ్మ చరిత్ర, అమ్మ సిద్ధాంతం రెండూ కలిపి పూర్ణాద్వైతం క్రింద ..

స్తో : క్రియా యోగమంటే ఏమిటి?

అమ్మ : అనుకుని చెప్పలేదు అన్నారు.

శ్రీ : చూశారు

అమ్మ : అనటానికీ, అనుకోటానికీ తేడాఉందన్నానుగా

శ్రీ : చూశారు అన్నదిFlash లాగా. అది నెత్తురులో దిగలేదు కనుక మళ్ళీవచ్చి తాము కూర్చున్న Seat మీదేకూర్చున్నారు.

అమ్మ : మాటనేంతవరకు...

శ్రీ : మన మనుకునేంత వరకు దిగింది.

అమ్మ : ఆ కాస్త సత్వంలో; ఉన్న దనుభావించాదేమో.

శ్రీ : అంతా అదేననండి; కొంతవరకనేముంది

అమ్మ : అనటానికో, అనుకోవదానికోగల ఎట్లా విడదీయ గలిగారు అని అదుగుతున్నాను.

శ్రీ : వీళ్లు అంతర్యామిత్వాన్ని - తర్వాత మళ్లీ ప్రార్థనను, మొదటికివచ్చి చెప్పదంనుంచి, అనుకున్నవాదు ఇవన్నీ మళ్ళీ అనలేదు ఒకసారి అనుకుంటే - ఆభావం దిగివుంటే ఇవన్నీ Absurd గా కనబదతాయి.

అమ్మ : అంతరంలో అనడానికి, సర్వమనడానికి తేడా వాళ్లకుతోచలేదేమో అందులో ఉన్న తేడా రుచిచూడలేదు.

శ్రీ : వాళ్లుచూచి వుంటే అంతా అవటమేమిటో తెలుసుకునేవారు. కనుక వారు అనివుండకూడదు అంతా అని వారికి తెలియదనే అనాలి.

అమ్మ : తెలిసిన విషయం చెప్పడానికి చేతకాకపోవచ్చుగా.

శ్రీ : రెండింటికీ తేడా ఏమీలేదు. వారికి తెలిసింది చెప్పలేదనే బాధ తప్ప నాకేం లేదు.

అమ్మ : వాళ్లనుకోలేదు.

శ్రీ : అవును. అనుకోలేదు. నేననుకున్నానుగానీ చెప్పలేదంటే?

వీ.ప్ర : ఆమాట వ్యక్తపర్చలేదు అని చెప్పమంటారు.

అమ్మ : అనుకోలేదని మనమెలా అనగలం?

శ్రీ : వాడనుకున్నారుగానీ, చెప్పలేదని ఎవరన్నా చెప్పారా? అలా అనడానికి ఏమన్నా అవకాశముందా?

వీ.ప్ర : అనుకున్నారనేది ఊహతప్ప దానికాధారమేముంది?

అమ్మ : ఇది మీ ఊహని వారనొచ్చుగా!

వీ.ప్ర : వారువ్యక్తం చేసిన దానిలో ఇదిలేదుకాబట్టి

అమ్మ : అమ్మ అనుకున్నారు అన్నారు. అంటున్నారు వారనుకోలేదు. అన్నారు అంటున్నారు.

శ్రీ : అవును అనడంవరకే వచ్చారు. వారు నాకువినబడేటట్లు అనుకోలేదు. అనుకొనిఉంటే ఆమాటలన్నీ ఆరకంగానే వచ్చిఉండును.

వీ.ప్ర : ఇది సత్యం. వాస్తవం అని అనుకొని ఉంటే.

అమ్మ : వారిచ్చిన ఉపమానాలను బట్టి అనుకోలేదు అని చెప్పినట్లయితే పూసల్లో దండలాగా....పూల్లోదారంలాగా

శ్రీ : వారుమళ్లీవచ్చి అంతర్యామిత్వములో కూర్చున్నారు అనటంలో నాఉద్దేశ్యం అదేగదా – చెప్పటమంతా అదే అనేసి మళ్లీ ..

వీ.ప్ర : దిఙ్మాత్రంగ ఎక్కడో ఉన్నసత్యాన్ని అలాచూశాదు కాని దాని మీద నిలబడలా.

శ్రీ : వాళ్లమీద కోపంకాదు. అనలేకపోయినారు వారు.

అమ్మ : కలిగిందేదన్నా ఉంటేగా అనడానికి – బాధేమిటంటే అది జీర్ణంకాకుండ ఉందని ఇక్కడ చెప్పింది వినటంలేదని మీ ఉద్దేశ్యంకావచ్చు.

మీరడిగిన పరిణామవాదం గురించి ...

నేనెప్పుడూ మనుషులు ఒకప్పుడు ఉన్నారు ఒకప్పుడులేరు అనే భావంలోకి వెళ్ళలేదు. జీవమంటే మనుషులే అనికాదు. జగత్తు ఎప్పుడూ ఉందనే. అదిఅట్లా అయింది. ఇదిఇట్లా అయిందనేది మీలెఖ్ఖ అది. నాది, అనేది ఉన్నది అదే, ఎప్పుడు ఉంది. అంతవరకే నామాట. జగత్తువేల లక్షలకోట్ల

సంవత్సరాలుగా ఉంది. వందలకోట్లు సంవత్సరాల నుండి జగత్తు ఎప్పుడూ ఉంది. వందలకోట్లు సంవత్సరాలలో జగత్తు ఎప్పుడూ ఇట్లాగే ఉన్నదా అంటే - నేను పుట్టేటప్పుడు ఉన్న ఆచార వ్యవహారాలు తేడా ఉండవచ్చు గాని పుట్టడం, చేయడం, ఉత్పత్తి వీటిలో తేడాఉందిగా : చవిటిభూములే అనుకున్నవి ఈనాడు సులువుగా యాభై బస్తాలు పండిస్తున్నారు. ఆనాటి రోజుల్లో వేసవికాలం కూరగాయలు అంతగా లభించేవికావు, ఎండాకాలం ఒరుగులు తప్ప ఇంకేమీ ఉండేవికావు. ఈనాడు పచ్చికాయలు దొరుకుతున్నాయి. ఇదీ పరిణామమే, ఇట్లాంటి వ్యవస్థను, మార్పులనుకూడ పరిణామం క్రిందనే తీసు కుంటున్నాం మనం. ఆనాటి రోజుల్లో వేసవిలో ఏం తినేవారంటే పెండలం, ఒరుగు ఇవి వాడేవారు. తర్వాత ఇప్పుడు ఒరుగు చేయటమేమిటో ఎవరికీ తెలియదు. వంగ ఒరుగుకు ముఖ్య స్థావరమైన గోదావరిజిల్లాలోనే రుచిచూస్తామంటే దొరకదు. ఇదీ పరిణామమే. వ్యవస్థ పరిణామం. మనిషిపుట్టడం, పెరగటం ఇదీ పరిణామమే. పుట్టిన తర్వాత శరీరంలో పెరుగుదల కన్పిస్తున్నది. పుట్టిననాడే తండ్రిని ఆస్తి పంచమని అడగటం లేదు. ఆస్తి మైనరు వెళ్లిన తర్వాతే వ్రాస్తున్నారు. అదీ పరిణామమే. నాదృష్టిలో ప్రొద్దుటికీ, ఇప్పటికీ పరిణామముంది. అనుక్షణం పరిణామం - అనుక్షణం యుగం.

అనుక్షణం యుగమనే నాసిద్ధాంతానికి, నాపరిణామ వాదానికి, నీది నాకుసరి పోతుంది.

ఏకకణజీవులు, ఎమీబాలను గురించి నేచదవలేదు. నాకు తెలియదుగదా! నాది అనాలి అన్నప్పుడు జగత్తు ఇట్లు ఉండకపోవచ్చు, జగత్తు ఎప్పుడూ ఉన్నదనే అంటాము నన్నాధారం చేసుకొని నాకు తెలిసినంతవరకూ జీవులు అనేకాలం ఎప్పుడూవున్నది. ఏకకణజీవి అబద్ధమనడానికిలేదు.

సో : ఇప్పుడు ఉందిగా.

శ్రీ : ఏకకణజీవి లేనికాలమున్నది.

సో : సృష్టి 'అనాది, నాది' అని నీవన్నప్పుడు జగత్తు ఎప్పుడూఉన్నదని మార్పు ఎప్పుదూ ఉన్నదని, ఉదా॥ భూమి ఎప్పుడూ ఉంది కాని భూసారంలో మార్పువచ్చింది, పద్ధతుల్లో మార్పువచ్చింది. అంతమాత్రాన ...

అమ్మ : ఆచార వ్యవహారాలు, ఉత్పత్తి వ్యవస్థే అవుతుంది. మనిషి, ప్రాణికోటి అంటే పరిణామమవుతుంది. రామాయణానికి ముందు మాట్లాడు తున్నారేమో.

వీ.ప్ర : ఇంకాముందు నుండి అమ్మా

అమ్మ : యుగాలకు ముందు సంగతి చెప్తున్నాం. కృత, త్రేతా, ద్వాపర యుగాలకు ముందు చెప్తున్నా.

నాకు యుగమనేదేలేదు. క్షణక్షణమూ యుగమే :

కారణమేమంటే L I C Building మీద నిలిస్తే ఊరంతా కనిపిస్తుంది.

శ్రీపాద : మొత్తం వస్తువుంది ఈరూపాన లేకపోవచ్చు.

అమ్మ : లేకపోవచ్చు! అని మీరు వదిలేస్తే – ఉండవచ్చు అని వారంటారు.

శ్రీ : ఈరూపాన లేదు.

అమ్మ : (చమత్కారంగ) వచ్చు అనేది మాలాగ మీరు వాడుకుంటే ఎలాగ!

శ్రీ : వదిలేస్తాం.

అమ్మ : వదిలెయ్యండి. సూర్యుడిలోGasగా ఉండినది, అంతకన్న ముందు ఏదో నక్షత్రంలో Gas గా ఉండినది. అదే సూర్యుడై, Gas అయి, సూర్యుడిలో Gas గా ఉందని గుర్తించింది ఒక మనిషా? శాస్త్రాలు ఎట్లా వచ్చాయి? ఇదంతాScience ఎట్లా కనిపెట్టింది?

శ్రీ : Science ఎట్లా కనిపెట్టింది అని అడిగితే.

అమ్మ : ఇది ఆత్మని గుర్తు పట్టాలిగదా. వీడు అనుభవించినప్పుడు ఇది ఆత్మ అని గుర్తు పట్టాలిగదా! గోచరించితే నీవు లేకుండ పోతావు అన్నాడు. నీవుండవు – నీవుగా ఉంటావు. ఎరుక మిగులుతుంది అన్నాడు. ఆఎరుక

ఉన్నప్పుడు భావం ఉంది. శూన్యాన్ని చూస్తున్నాను అనుకొన్నప్పుడు భావం ఉంది. ఆనందాన్ని పొందుతున్నాను అనుకున్నప్పుడు భావం ఉంది. ఎరుకే తానా? ఇవన్నీ మర్చిపోయి తనని తను గుర్తుపట్టే స్థితి ఉంటే ఆనందం. ఈ కనపడేవన్నీ మరలిపోయి తనను తాను గుర్తుపట్టే ఎరుకే ఆనందమా?

శ్రీపాద : అనే అంటున్నారు.

అమ్మ : దానిద్వారా పొందేదేమిటంటే నీలాకాశం - రెండు కారణాలు జ్ఞానికి మూలకారణం అంతేగా. పుట్టకుండ పోవటానికి - ఉండటానికి

వీ.ప్ర : వారు చెప్పేదంతే.వేరే చెప్పనిది లేదు.

అమ్మ : నేను చెప్పేదదే. కాదనటం లేదు. వారు చెప్పే ఆనంద మదేనా? నిర్వికల్ప సమాధిలో అని అడుగుతున్నాను.

నిర్వికల్ప సమాధి ఎట్లా ఉంటుందంటే తాను పెట్టుకున్నటువంటి, నమ్మినటువంటి ఇష్టదైవంలో ఐక్యమై - తతిమ్మావి మరచిపోవటం. వాడు కనబడటం, వాడినే చూడటం సమాధి స్థితి. నిర్వికల్ప సమాధి అంటే ఆకారం లేని శూన్యంలోకి చూడటం అన్నాడు. శూన్యమై పోవటం, ఆనందం మిగలటం - శూన్యాన్ని చూస్తున్నానన్న గుర్తున్నప్పుడు ఎరుక ఉన్నట్లేగదా. గుర్తు, అంటే ఒప్పుకోడు. ఎరుక అంటే ఒప్పుకుంటాడు. అభాష ..........

శ్రీపాద : ఎరుక అంటే రెండు కనిపించవు గుర్తు, అంటే రెండు కనిపిస్తున్నాయి.

అమ్మ : అందుకే వాళ్ళు ఎరుక అంటారు. ఎరుక కూడ లేనట్టిదైతే దానికి

సో : అనుభావమేముందక్కడ?

అమ్మ : ఆనందం లేదుగా.

సో : అప్పుడు ఈ మనసు కాదు.

అమ్మ : ఈ మనసనే పేరుండదు. ఈ మనసనే స్థితి ఇక్కడ ఉండదు. ఇది అన్నీ చూస్తున్నది. నా ఎరుక ఎట్లా ఉన్నదంటే ఆ పాకీదొడ్డి, దేవతార్చనగది

ఆ Current, ఇవి అది, చావు, బ్రతుకు, నవ్వు, ఏడుపు, కష్టం, సుఖం ఇవన్నీ ఉన్నవే. వాడు చూద్దామనుకుంటున్న దానికి ఇవి దాని పట్ల భిన్నంగాలేవు. అది ఏదో, ఇదీ అదే. సిమెంటు అదే. రాయి అదే. రాయి ఏదో చేసినవాడు అదే. చేసిన వాడెవడో గోడ అదే. మొత్తం కలిసి బ్రహ్మ అనుకుంటున్నాను నేను.

సో : అనుక్షణం ఆ ఎరుక అట్లాగే ఉంటుంది.

అమ్మ : ఆ ఎరుక అట్లాగే ఉంటుంది. కాని ఈ ఎరుక వస్తూ పోతూ వుంటుంది. అయితే శాశ్వతానందమనే పేరు ఎందుకు చెప్పారు. అని ఆలోచిస్తే, అనుభవించిన ఎరుక ఒక్కక్షణమో రెండుక్షణాలో కనుక అనుభవించిన ఆఎరుక శాశ్వతంగా గుర్తుండటమేమో! అనుకొన్నప్పుడల్లా ఆ ఎరుకకు వెళ్ళగలగటమో?

సో : అది ఎరుకేగా.

అమ్మ : ఎరుకే అంటున్నా ఎరుక శాశ్వతంగ ఉంటుంది గాని ........

సో : దానిలోకి వెళ్ళటమనే దేముంది; ఎప్పుడూ ఉండటమే.

అమ్మ : వాళ్ళట్లా చెప్పటంలా, నిర్వికల్ప సమాధిలోకి వెళ్ళి వస్తున్నాడంటు న్నారుగా! అనుభవించిన ఆఒక్క క్షణములో, రెండు క్షణాలో ఆగుర్తు మిగలటమో, వెడదామనుకున్నప్పుడల్లా ఆ ఎరుక ఉండగలగటమో ఏదో ఒకటై యుండాలి.

అనుకున్నప్పుడల్లా తను ఎరుకగా మిగలటమో అనుభవించిన ఆఎరుక శాశ్వతంగ గుర్తుండటం కాని – శాశ్వతానందమంటే అదేనేమో

శ్రీపాద : నిర్వికల్ప సమాధంటే మరి .... ...

అమ్మ : నిర్వికల్ప సమాధిని గురించి చెప్పినప్పుడు శూన్యమై ఉంటాడంటున్న ఆనందం.

ఎరుకలేని ఆనందం లేదు అంటున్నా నేను నిర్వికల్ప సమాధిని పొందాను నా అనుభవమని కాదు. నేనెప్పుడు భావంతోనే ఉన్నాను, ఆలోచనతోనే ఉన్నాను. ఇదంతా కాదని, నిర్వికల్ప సమాధి వేరే ఉందని అనుకోవటం

నా కనుభవంలేదు. సంకల్పమే, అన్ని సంకల్పాలు నిర్వికల్పమే. ఎందుకంటే వాడి ప్రయత్నం లేదు గనుక, వాడి చేతిలో లేదు గనక నాచేతిలో లేదని సర్వకాల సర్వావస్థలలోనూ మిగలటమే నిర్వికల్ప సమాధిని అనుకుంటున్నాను.

శూన్యంలోకి చూస్తాడా, శూన్యంలోకి వెళ్ళనంటాడు. శూన్యంలోకి వెళ్ళాదంటే మనసు లేకుండ చేసుకున్నాదని అర్థం చేసుకుందాం. మనసు లేకుండ పోయిన శూన్యం వీడి కర్థమైతే మనసున్నట్లే గదా! నిద్రమాదిరిగ నిద్రపోయి లేచి హాయిగా ఉన్నది అనుకొనే శూన్యమా? అది శూన్యమనేదే ముంది! తెలియని స్థితి

సో : ఇక్కడ మనసు లేకుండ పోయి, లేదనుకున్నది శూన్యంలో నుంచి, ఎరుక గలగటం

అమ్మ : గ్రహించగలగటం అన్నా, తెలుసుకోవటమన్నా, ఎరుకన్నా, భారమన్నా- ఎరుక వేరు, గుర్తువేరు. కనబడే దొకటి, కనబడేదాన్ని గుర్తించేది ఒకటే – గుర్తింపే

ఆనంద మంటే ఇంకొకదాన్ని చూచి ఆనందించటమా? తాను తానుగా ఉన్నాదంటే, ఉన్నాను అనుకున్నప్పుడు భావమొచ్చింది. నేను నేనుగా ఉన్నాను అని వాడనుకున్నాడు అంటే భావం పుట్టిందక్కడ. భావంకూడా లేకుండ ఎరుకగానే ఎరుకగానే అంటే?

సో : అదై ఉండటం

అమ్మ : అదై ఉంటాడనేది ఎట్లా ఉంటుందో మాటలలో చెప్పడానికి వీలుకాదు గనుక వారట్లా అన్నారేమో అని అనుకుంటా. ఎరుక కూడ ఉండదు అనటానికి లేదు. ఈ రూపాలన్నీ కానిది ఒక రూపం నిర్వికల్పమంటే కాదు. నేనిట్లా అనుకున్నా, అన్ని వేళల్లో అన్ని సంకల్పాలూ వాడివి అన్న స్థితి నిలిస్తే అదే నిర్వికల్ప సమాధేమో, ఇది నా అభిప్రాయం. కళ్ళుమూసుకుని 10 రోజులు కూర్చున్నా, పదకొండవ రోజు కళ్ళు తెరిస్తే పోయింది గదా! నెల కూర్చున్నాను. తెరిస్తే పోయింది గదా!

ఆకళ్ళు మూసుకుని కూర్చుంటే కలిగిన అనుభవం, శాశ్వతంగ గుర్తుండటమే శాశ్వతానందమేమో! ఒక అనుభవం అనుభవించాను. ఆనందంగ ఉన్నది ఆనందంగ ఉంది ఆ అనుభవం అంటావు కాని అది ఎట్లా ఉందో ఇప్పుడు చెప్పలేవు, హాయిగా ఉంది అన గలవు. కర్జకాయ పెట్టాను. తిన్నావు. తీయగా ఉంది అన్నావు. అది నీకొక అనుభవం శారీరకమైన అనుభవం కాని, మానసికమైన అనుభవం కాని, ఇంతకంటే స్థితి లేదు అని పొందే ఏ ఆనందమనన్నా గాని, క్షణికానందం కానీ ఆఖరికి, పొందేటప్పుడున్నది, పొందిన తర్వాత గుర్తుంటుందా? ఎట్లా ఉంటుందో చెప్పలేవు. గుర్తుంటుంది.

వీ.ప్ర : మాటల్లో వ్యక్తీకరించలేం.

అమ్మ : అనుభవించినపుడు తెలిసేదది అది సమాధి దాకా అఖ్ఖర్లే. నీవు పొందిన ఏ ఆనందమైనా సరే. బెల్లంతీసి తింటే గాని తెలియదు. అని ఈ మాట శాస్త్రం కూడ చెప్పియున్నది.

వీ.ప్ర : శాస్త్రం ఒకరి అనుభవమే గదా!

అమ్మ : అనుభవంలేని శాస్త్రం ఏముంది. పూలు దారానికి ఇమిడి పోతాయనేది సైన్సే. పొయ్యి మీద పెడితే అన్నం ఉడుకుతుంది అనేది సైన్సే. కట్టెపుల్ల వంకరగా ఉంటే పొయ్యిలో ఇమడదు అనేది సైన్సే. ప్రత్తి వడికితే దారంవస్తుందనేది సైన్సే. కనబడుతున్న వస్తువుల గుణాన్ని గ్రహించటం సైన్సే. దాని లక్షణమే అది - మనసు యొక్క లక్షణంకూడ అదే. ఉన్నదాన్ని గ్రహించడమే గదా Research అని చెబుతున్నది ఉన్న దానిని గ్రహించడమని అదేగా అర్థం?

శ్రీపాద : గ్రహించటమే కాదు. ఊహించటం కూడ.

వీ.ప్ర : మామూలు సత్యాలుగా ఏ బ్రహ్మ జ్ఞానంతెలిస్తే అంతా తెలుస్తుంది అని

చెప్పిన స్థితిప్రజ్ఞు లెవ్వరో ... మామూలు విద్యార్థులకు తెలిసిన విషయాలు కూడ ఉటంకించలేదు.

సో : వీడి దృక్పథంవేరు.

అమ్మ : ఆ రాసిన పురుషుడెవ్వరో అర్థంకాలేదు కాబట్టి అపౌరుషేయాలు అవి అనుకుంటున్నాను.

అప్పుడే మనసేమయింది. నిద్రంటే ఏమిటి? పని చేయలేదని అనగలడు. ఆలోచనలు అరికట్టబడింది. ఈకష్టపడి పోయిన కట్టను - వాకిట్లో మండి పిలుస్తుంటే - తట్టి పిలిస్తే ఎవరు అని తలుపు తెరుస్తున్నాడు. ఈస్పర్శ చెవికి తగిలింది కాని - ఆలోచన కట్టకు మెళుకువ వచ్చింది.

శ్రీపాద : ముందు తను లేచాడు తర్వాత ఆలోచన కట్టకూడ తయారయింది.

అమ్మ : లేవటమంటే, మనసు-ఆలోచనల కట్ట అని నిర్వచనం చెప్పినపుడు....

శ్రీపాద : శరీరపు స్ఫురణ కూడ ఒకటి ఉంది. అది తెలిసేలా లేదు.

అమ్మ : ఆ సమయంలో నేనిట్లా ఉన్నానన్నట్లుగా లేదు.

ఏదో ఆలోచిస్తున్నాం. నీ శరీరం మీద చీమ ఒకటి పాకుతున్నది. అది కుడితే కాని తెలియదు. నిద్రలో కూడ మనసుకు ఆలోచన వస్తుంది. మెళుకువలోనూ ఉంది నిద్రలోను ఉంది

శ్రీపాద : మెళుకువలో ఉన్నా -. నిద్రలో ఉన్నా శరీరంపై ఏదన్నా ఘాతం ఎంత మెత్తగా తగిలినా తగలవలసిన స్థలములో తగిలితే స్ఫురణ వస్తున్నది. శరీర స్ఫురణ అసలు లేకపోలేదు. స్ఫురణ ఉంది మళ్ళీ వెనక్కు వస్తున్నది ఉన్నది అన్నట్టు తెలియకుండ తగ్గుతున్నది వస్తున్నది - అంటే ఏకత్వమే లేదు.

వీ.ప్ర : మనసులయమై పోవటం లేదు.

అమ్మ : స్ఫురణ లేనిస్థితిని లయమంటారు.

శ్రీపాద : ఆలయములో కూడ వీడున్నాడు.

అమ్మ : లయం కాని స్థితిఉన్నది కాని - గుర్తులేని స్థితిని లయమంటున్నారు వాళ్ళు.

శ్రీపాద : వేరే ప్రపంచం లేకపోలేదు.

అమ్మ : వేరే ప్రపంచం నిద్రలో వాడికి ఉన్నదని తెలియదు. నిద్రపోతున్నానని ఎట్లా తెలియదో .....

శ్రీపాద : వాడికి తెలియదు గాని, లేదనటానికి వీల్లేదు.

అమ్మ : లేచినప్పుడు వెంటనే ఉంది.

శ్రీపాద : తట్టి లేపుతున్నది గదా వీడిని

అమ్మ : కొట్టింది గ్రహించేదేదో మెలకువతో ఉంది

శ్రీపాద : అంటే "ఆ" గ్రహించేదేదో ప్రపంచం వైపు తిరిగి ఉన్నదే.

అమ్మ : తిరిగి ఉన్నది గాని, ప్రపంచం వైపు తిరిగానని గుర్తులేదు ఆస్థితిలో.

శ్రీపాద : కొంచెమే ఉంది. తెలియదది తొంభై తొమ్మిదిపాళ్ళు అటు తిరిగి ఉంది. ఒకపాలు ఇటు వుంది.

అమ్మ : నిద్రలో మెళుకు వయితే లేస్తున్నాడు గాని ఆపరేషనుకు మత్తిస్తే లేవడు. నిద్రలో ఏస్థితిలో, అందులో అదే స్థితి

శ్రీపాద : తేడా వుంది.

అమ్మ : ఏమిటి తేడా?

శ్రీపాద : నిద్రపోయి లేస్తే హాయిగా. సుఖంగా ఉంటుంది అంటాడు

అమ్మ : సుఖం ఉండక పోవచ్చు

శ్రీపాద : నాకేమీ తెలియదంటాడు. హాయిగా నిద్రపొయ్యాను అని జ్ఞాపకముంటుంది.

అమ్మ : నిద్ర పోయి లేచిన తర్వాత శరీరానికి హాయి వుంది.

శ్రీపాద : అల్లరిపెట్టిన తాను విశ్రాంతి పొందినట్టు అనిపిస్తుంది.

అమ్మ : దాన్ని అణచి పెడుతున్నాడు. మత్తిచ్చినప్పుడు పని చేసేదాన్ని, ప్రపంచం వైపుతిరిగన మనస్సును శరీరం మీద తెలియకుండ ఉండే స్థితిలోనే ఉంచుతున్నాడు. శరీరానికి ఎంత గిల్లినా కదలకుండ ఉండే స్థితిలో........

శ్రీపాద : కదిలినా కదలకుండా ఉండేస్థితి .... నిద్రకన్నా గాఢమైనది.

అమ్మ : ఏమిటంటే తెలివివచ్చి బాధ అని తెలిసికూడ కదలలేదు, మత్తిచ్చాడు, కదలలేదు, నొప్పి తెలుస్తుంది.

శ్రీపాద : మత్తు అక్కర్లే. గ్యాసుపొయ్యి వదలితే మనిషి అలాగే చచ్చిపోతాడు.

అమ్మ : అటువంటి గ్యాసు పొగలో చచ్చిపోనివాడున్నాడు.

శ్రీపాద : గ్యాసు పీల్చగా పీల్చగా ఏదో అయిపోతుందని తెలుస్తుంది గాని ....

అమ్మ : చచ్చి పోనివాడున్నాడు అటువంటి గ్యాసు పొగలో

శ్రీపాద : అది తెలియదు. పనిచేసేనరాలు మొద్దుబారిపోతాయి. గ్రహించే నరాలకు మటుకు పులక ఉంటుంది ఏదో అయి పోతుందని తెలుస్తుంది గాని కదలలేదు.

అమ్మ : గ్రహించే నరాలంటూ ఉన్నాయా?

# అమ్మ - సహనము

## 25-4-76

సో : అమ్మంటే ఏమిటో తెలియదు. దేవుడంటే ఏమిటో తెలియదు. ఎందుకు దేవుడో తెలియదు. ఏ హేతువు చేత దేవుడో తెలియదు ఏదో తెలిసుకోవాలనే ఆరాటం.

అమ్మ : మీరు పిల్లలు అని పిస్తున్నది గనుక నేను మీకు అమ్మనని అనిపిస్తున్నది మీరు పిల్లలుగా ఉండగలుగు తున్నారు గనుక నేనమ్మనయినాను.

సో : ఏకాగ్రతకు భంగం కలుగుతుంది.

అమ్మ : ఎవరికైనా, ఏకాగ్రత అంటూ ఇంకొక ఆలోచన లేని స్థితి అంటూ లేదు గదా! మరి వచ్చి పోతుంటాయి. ఆలోచన వచ్చింది, భంగం కలిగింది అన్నప్పుడు మళ్ళీ ఏకాగ్రత దాని అంతట అదే రావడానికేగా ఇది గుర్తొచ్చింది మనసు ఒకచోట కూర్చొని వుండగా పరుగెత్తు చున్నది. కొంతదూరం పోయిన తర్వాత, ఇక్కడ కూర్చొని ఆలోచిస్తున్నానేం అనే ఆలోచన వచ్చిన తర్వాత నా మనసు నిలువలేదని అనిపించింది. ఆలోచన పోతున్నంత వరకు పోతూనే వుంటుంది. నీవు కూర్చున్నదిక్కడ ఆలోచనలు ఎక్కడో ఆలోచనవస్తే తెలుస్తున్నది కనుక ఆపోగొట్టే దెవరో - అయ్యో నిలవటం లేదేం ఏదో ఆలోచన వచ్చిందని జ్ఞాపకం చేసిందీ అదే - ఏకాగ్రత ఇచ్చేదీ అదే.

సో : Complete గా నిలవాలంటే దానికి Time factor ప్రధాన మౌతుందా?

అమ్మ : ఎట్లన్నా అనుకోవచ్చు మీయిష్టం . అనుకోగానే కూర్చునిచేసినప్పుడు మనం చేసింది ఏదో లభ్యమైనదని అనిపిస్తుంది

సో : ఒక State ఉందంటున్నారే

అమ్మ : ఏకాగ్రం గానే కూర్చోబెట్టి కొంతదూరం వెళ్లిమళ్లీ మధ్యలో ఆలోచన కలిగించిందో–అయ్యో ఆలోచనలు వచ్చినవే అని ఏది అనుకుంటున్నటో, ఏకాగ్రత కూడ ఇస్తుంది, అదే నిలబడుతుంది.

సో : అమ్మ ఫోటోముందు కూర్చుంటే (ఇది వరకు) Emoiton తో ఉండేవాడ్ని

అమ్మ : అదిరావాలనేగా అడుగు తున్నది. క్రమంగా మార్పుంటుందిగా

సో : Try చేస్తూ వుండటమే

అమ్మ : వస్తున్నది ప్రయత్నం, ప్రయత్నం జరుగుతున్నది. నిద్రలేవగానే వెళ్ళి ఫోటో ముందర కూర్చోమని ప్రేరణ కలుగుతున్నది. వెడుతున్నారు. కాసేపు కూర్చుంటున్నారు. ఆ ఆలోచన వస్తేనే లేచి కూర్చుంటావు గదా.

సో : అమ్మ అనుగ్రహముంటేనే గాని ఏపనీ జరగదు. ధ్యానం, జపం, ఏదైనా అమ్మ కటాక్షముంటే అన్నియు సాధించవచ్చు. అంతేగాని మానవుడు స్వశక్తితో సాధించగలనను కోవటం వెఱ్ఱితనం. కేవలం అమ్మ అనుగ్రహం వలన అది సాధ్యం. దాన్ని సంపాదించాలంటే అమ్మ పాదములు పట్టు కొనటమే. అంతకంటే వేరే మార్గం ఏదీ లేదు.

దా : అమ్మను ప్రార్థించాను. అమ్మా నీకు జబ్బేమిటి అసలు నీ వివన్నీనయం చేసుకో కూడదా అని! అమ్మన్నారూ అవీ అలాగే వస్తాయి, అవీ బిడ్డల్లాంటివే, అవివస్తే పోవాలని ఎప్పుడు అనుకోను. అట్లా నా కనిపించదు అని అమ్మ అన్నారు. నిజంగ నాకీ మాటలు నమ్మబుద్ధి కాలా, ఎప్పుడు నమ్మానంటే అమ్మకు చాలా చీము పట్టినగడ్డ ఉన్నప్పుడు కూడ, రక్తం పరీక్షించినప్పుడు తెల్లరక్తకణములు మామూలుగా ఎలా ఉన్నాయో అదే విధంగ ఉన్నాయి. Normal Count లో B Variation లేదు. ఇప్పుడేదైనా Infection శరీరములో ఉన్నప్పుడు తెల్ల రక్తకణములు enormous గా Incrase అవుతాయి. Body వైపునుండి Defence Mechanical గా fight చేయడమంటూ ఏమీలేదు. మనం జిల్లెళ్ళమూడికి

వస్తే ఎంతో అమ్మ శరీరంలో సూక్ష్మక్రిములు ప్రవేశించినా అంతే అని నిర్ధారణకు వచ్చాను తనకు తానుగా జబ్బుతగ్గాలని అనుకోరు.

వీ.ప్ర : ఈ శరీరం మామూలు మనకు తెలిసిన భౌతిక సూత్రాలను దేనికీ కట్టుబడదు.

దా : తెల్లకణాలు జబ్బు రాకముందు ఎట్లా వున్నాయో, తర్వాత ఈ జబ్బు వచ్చిన పిదప అట్లే ఉన్నాయి. చీము కొద్దిగా రావదానికి కారణమదే. గడ్డమాత్రం పెరిగి పోవటానికి కారణమదే తెల్లకణాలు వచ్చి అక్కడ పేరుకు పొయ్యాయి. అంతేగాని వాటికి, వీటికి యుద్ధమనేది జరగలా. They Were Just phiegmahi on lookars

అమ్మ : తెల్లకణాలు అట్లాకావదానికి కారణం శరీరంలో శక్తిలేక పోయినా అట్లాకాదు.

దా : అమ్మా నీతో వాదించి ఎవరూ గెలువలేరుగాని నేను Science మాట్లాడు తున్నాను. కానీ Sugar ఉన్న Patient కి చాలా తొందరగా చీముపట్టి కుళ్ళిపోతాయి. అవి జరగలా

అమ్మ : శరీరంలో తెల్లకణాలు అట్లా మారేశక్తికూడ తగ్గిపోయి....

దాక్టరు : కానీ, తెల్లకణాలు పెరుగుతాయి. కానీ తెల్లకణాలు Fight చేసే శక్తి తక్కు వుండవచ్చు

అమ్మ : శక్తి లేదు శరీరంలో

శ్రీపాద : శక్తితగ్గితే తగ్గవచ్చు గాని సంఖ్య పెరగాలి.

అమ్మ : సంఖ్య పెరగాలంటే ఒంట్లో శక్తిని బట్టి మార్పు వస్తుంది.

దా : నీకు Insulin ఇచ్చి Sugar control చేసినప్పుడు కూడ పెరగలేదు. Vitamin 'C' చాలా Large Dose లో ఇచ్చినప్పుడూ పెరగలేదు Vitamin C తెల్లకణాలు తక్కువైనప్పుడు అవి సూక్ష్మక్రిములతో Fight చేసే శక్తి కోల్పోతాయి. మామూలుగా ఆ Vitamin C ఇచ్చాము. Sugar Control చేశాం, అయినా అవి పెరగలేదు. తర్వాత Sugar ఉన్నవాళ్ళకు

Fight చేయదగిన పరిస్థితి వచ్చినప్పుడు ఆ Portion కుళ్ళిపోతుంది. అట్లాంటిది నీకు జరగలేదు. ఇవన్నీ బట్టి ఏమనుకోవాలంటే నీది దివ్య శరీరమనుకోవాలి. రెండవది మేము జిల్లేళ్ళమూడి వస్తే నీవు మమ్ముల నెట్లా Treat చేస్తావో – సూక్ష్మక్రిములు, జబ్బు శరీరములో ప్రవేశించినా వాటినదే విధమైన ప్రేమతో చూస్తావనుకుంటాను.

వీ.ప్ర : వాస్తవాన్ని ఆలోచించి వారు వచ్చిన నిర్ణయమది.

అమ్మ : నే చెబుతున్నాను నాకు శరీరంలో బాధలేదు, మీరువస్తే ఎట్లా ఉంటుందో వ్యాధి వచ్చినా అట్లాగే ఉంటుందనేది మనసుకు సంబంధించినది, మోకాళ్ళకు గుడ్డలు బిగించి కూర్చుంటాను. అంత జాలుపుదుతుంటాయి అయితే చెప్పుకోవాల్సిన అవసరం కాని, అయ్యో! నాకాళ్ళు పగిలి పోతున్నాయి అని చెప్పుకుందామనే అలవాటు ఏనాడూ లేదు. సాధ్యమై నంత వరకు ఓర్చుకోవడానికే అలవాటు పడ్డాను. నాశరీరములో Protein తక్కువ గమనించావా?

దా : Protein తక్కువకాదమ్మా, కాదు. ఎందుకంటే అమ్మ మద్రాసు Tour కెళ్ళినపుడు Protein Analysis Test చేశారు, Protein విశ్లేషణ చేశాం. Protein Normal గానే ఉన్నాయి. అవి సాధారణంగనే ఉన్నాయి. అమ్మా అప్పుడు ఆహారం తీసుకోవటం లేదు. అన్నీ Quatation Normal గా ఉన్నాయి.

అమ్మ : ఆహారం తీసుకోను అంటే మీరు తీసుకున్నట్టు తీసుకో లేకపోవచ్చు. నేనెందుకు తీసుకోను?

దా : పోనీ తీసుకున్నావో తీసుకోలేదో నాకు తెలియదు

అమ్మ : నేను నెల్లూరిలో తీసుకున్నాను, ఇప్పుడు తీసుకుంటున్నాను.

దా : మా ఇంట్లో ఒక్క పూటయినా భోజనం చేయమని అమ్మను ప్రార్థన చేశాను. (అంది అమ్మ నెల్లూరిలో ఆహారం తీసుకున్నాననటం) కానీ Proteins మాత్రం Normal గాఉన్నాయి. మద్రాసులోఉన్నప్పుడు ........

శ్రీపాద : Proteins Normal గా ఉన్నాయనేది Observation

డా : ఇప్పుడు నీవు తీసుకునే ఆహారం నీకు చాలదమ్మా. మరి లెఖ్ఖ ప్రకారం Protein తక్కు వుండాలి.

అమ్మ : ఆ మాట ఒప్పుకుంటాను. నేను తీసుకోకపోవటం లేదు. అనేది అబద్ధం గాని, నేను తీసుకుండేది చాలక పోవటమనేది నిజం.

Proteins తగ్గాలి, శుష్కించాలి ఇవన్నీ జరగాలి మామూలుగా. ఒకసారి పదిహేనువందల Calories ఇచ్చానంటే వసుంధరక్కయ్యకు – అమ్మకు ఆహారం పెట్టమని – దాంట్లో నాలుగవ వంతు కూడ అమ్మ తీసుకోవటం లేదని ఆమె చెప్పింది. She could not take one - fourth of it, Motion Test చేస్తే, మైక్రోస్కోప్ తో Test చేశాను. Motion as it is గా Undigested గానే వస్తున్నది. Motion లో జబ్బేమిలేదు. Vegetable cels as it is అదికూడ assimilate కావటం లేదు.

అమ్మ : ఎన్ని రకాల మందులు మింగితే, తగ్గక పోతే చినదోనియమ్ తీసుకున్నా నాకు Liver మీద ....

డా : నీకు Liver లో వాపు లేదు. లివర్‌లో జబ్బులేదు. హోమియో డాక్టరుగారు అంతకు ముందు మందిచ్చారు. నేనా రోజున Motion Test చేశాను. నేనొచ్చి Motion లో కాస్త Fungus ఉంది. Undigested particles వస్తున్నాయి అన్నాను. నీ వడిగి చినదోనియం వేయించుకున్నప్పుడు తగ్గింది. ఆమాట చెప్పమ్మా.

అమ్మ : నే నడిగితేనేం? వాడేస్తేనే?

డా : నీవు అడిగి వేయించుకున్నావు గనక తగ్గివుండవచ్చు అట్లా చేస్తే ఒప్పుకుంటాం.

అమ్మ : శరీరంలో తగ్గుదల మార్పుకనబడటం లేదా? ఇటీవల సావిత్రి వచ్చి గుర్తించలేక పోతున్నానంది. శరీరమే కాకపోతే ఎన్ని జరిగినా మార్పు లేకుండ ఉండవచ్చు గదా?

దా : నేను సమాధానం చెప్పలేను గానమ్మా, అందరి మానవుల లాంటి మానవ శరీరం కాదు నీది.

శ్రీపాద : మనస్సే శరీరమయింది.

అమ్మ : ఎట్లా? మనస్సే శరీరం

శ్రీపాద : ఇంకేం? మనసులో మార్పు లేనప్పుడు శరీరంలో కూడ

అమ్మ : దానితో తట్టుకొని తిరుగుతుండవచ్చు.

దా : మా శరీరమా మనసు చెప్పినట్టు వినదు. నీ శరీరం' నీ మనసు ఎట్లా చెప్పితే అట్లా వింటుంది.

అమ్మ : జరిగిన సంఘటనలు బట్టి కావచ్చు. జరుగుతున్న వాటిని బట్టి..... దేనికీ మనసు చలించలేదు. ఇది నేను పడలేను అని ఎప్పుడు అనుకోలేదు. ఏదివస్తే అది అనుభవించడమే ననుకున్నాను. అటువంటి మనస్తత్వం ఉన్నది. అది ఏదైనా సరే. అది ఇదా, అదా ఏమిటి అనే విచక్షణ నన్నడగవద్దు. ఏ సమయానికి ఏది లభ్యమైతే అది.

దా : చూచాము గదా! ఇంత లావు గడ్డతో సీటుమీద కూర్చో గలిగే వారెవరున్నారు?

అమ్మ : నేను నెల్లూరు వెళ్ళేనాడు ఆరోజు తొలి ఏకాదశి. రెండు టూరిస్టు బస్సుల యాత్రికులు వచ్చారు. (వెనుక) ఈ తొలి ఏకాదశి నాడే బొంబాయి నుండి వచ్చినావిడ ఇక్కడ చనిపోయింది. ఆమె కొడుకులు లేరు. ఆమె జ్ఞాపకార్థంగ సాగరమూల్చి నివేదనమివ్వాలి. సరే ఆమె సంగతి తద్దిన మంటే వేరే ఏముంది? వాళ్ళకు తలచుకోవటమేగా. ఆరోజుననే ఏలూరు నుండి అప్పారావు తన పుట్టినరోజు జరువుకునేందుకు వచ్చాడు. ఆ రోజే కలెక్టరు గారు నన్ను చూడటానికి వచ్చారు. ఇవన్నీ జరిగినై Latrine లో కూర్చుని స్నానం చేసేదాన్ని. అట్లా మూడు నెలలు చేశా. పీట మీద కూర్చోడానికి వీల్లేదు. లోపలకు దిగబడుతుందిగదా, కాలు దగ్గర పెట్టుకోవడానికి వీల్లేకుండ గుండ్రాయి పెట్టినట్టు అట్లా అయింది. **17-18,19** అన్నాళ్ళు ఓర్చుకున్న దానికి ఆ కాస్త కురుపు పెద్దది

కాగానే పారాడుతూ నడవవలసి వచ్చినది చీము పట్టింది కదా! బ్లేడుతోనన్నా మీరు కోస్తేనే దిగుతానన్నానుగదా! మూడు నెలలు ఓర్చుకున్న దానివి ఇప్పుడో, అప్పుడో దాన్ని కోయించుకోక తప్పలేదుగదా!

డా : ఆగడ్డ Compare చేస్తే వచ్చిన చీము Negligible అసలు

అమ్మ : తర్వాత గడ్డలుగా వచ్చింది.

డా : Masses of White Cells అంతే గాని liquid pass కాదు. గడ్డలో నుండి ఆ track లో అడ్డంపడినవన్నీ డాక్టరు జానకీదేవి తీసివేస్తుండేది.

శ్రీపాద : ... ..

డా : ... ...

అమ్మ : కృష్ణయ్య చౌదరి గడ్డచూసి అన్నాడు గదా! రేపో, ఎల్లుండో తగ్గిపోతుంది. అన్న తర్వాతనే పెరిగింది. ఆయన వేసిన మందు తగ్గి పోతుందిలే అని – గొడ్డళ్ళతో పగులగొట్టి నట్టుంటుంది. మీరు కాబట్టి Calm గా కూర్చొని మాట్లాడుతున్నారు. మమ్ములనందర్ని విచారిస్తున్నారు. దానిమీద సన్న సన్నటి చుక్కలు పుట్టినాయి. ఇంకొకరైతే ...... అక్కడలే అంది కాబట్టి గడ్డ అన్నాం – వీపు మీదయితే రాచకురుపు 'అంటాం' రాచకురుపే అది గొడ్డళ్ళతో పగలగొట్టినటుంటుంది 'మీరు కాబట్టి ఓర్చుకొంటున్నారు' అన్నారు. గొడ్డళ్లతో పగల గొట్టిన బాధ లేక పోవచ్చు దానికేముంది? బాధఉన్నా పై నుంచి రాలింది. గొడ్డలిపడింది పాదంమీద అనుకో నాన్నా! ఉలిక్కిడి అమ్మో! అనే అలవాటు లేదు.

వీ.ప్ర : నాన్నగారన్నారు ఈ శరీరం ఇప్పటిదాకా ఉండటమే పెద్ద మిరకిల్ అని, మామూలు మానవ శరీరానికి ఏవైతే భౌతిక సూత్రాలు వర్తిస్తాయో, అవి నీకు వర్తించవు.

అమ్మ : కారణంకూడ చెప్పారుగా పురుళ్లు ....
ఏ సంఘటనలకు ఎవరైతే బాధపడతారనుకుంటామో. అవి నన్ను బాధించ లేదు. అది మాత్రం నిజం.

శ్రీపాద : శరీరం విషయమై చెప్పారు. అక్కడ కూడ అంతేను అని

వీ.ప్ర : మనసు సంగతి మీరు చెప్తే తెలియాల్సిందే. చెప్పారు. శరీరం విషయం దాక్టరుగారు చెప్పారు.

అమ్మ : ఇదినాదని, నాచేతికే ఉండాలనుకోలేదు, (గాజు) ఎవరేసుకున్నా సరే. ఆ వస్తువు ఎవరికుపయోగపడ్డా ఒక్కటే అనే అలవాటు ఉన్నది మొదటి నుండి అదిచేతికుపయోగ పడ్డది కాబట్టి, ఎవరికి ఉపయోగపడ్డా ఒకటే, ఆ గాజు చేతి కమర్చబడ్డది, ఆ గాజు ఇంకొక చేతికున్నా ఒక్కటే - నా చేతికున్నా ఒక్కటే అనుకున్నాను.

అమ్మ : (వెనుక శ్రీపాద వారికి - సిరా ఒలికి, ఆ సిరా ఒక ఆకృతి దాల్చింది చూడగా వారికి ఆ బొమ్మ అమ్మే అనిపించింది) (దానిని చూచి ఆ సంఘటనను వివరిస్తు) - ఒక ప్రక్కన కృష్ణుడిలా గాను,

శ్రీపాద : పోలిక సరిగా లేదు. ఇలా పొడుగ్గా ఉంది తిప్పితే మగ ముఖంలా వుంది. ఇలా చూస్తే అమ్మ, ముఖం మామూలుగా కనబడుతుంది అమ్మ ముఖమే.

అమ్మ : ఇతరులతో - జనన మరణములతో సంబంధం ఉండకూడదుగా!

వీ.ప్ర : వారి మనస్సులో అనుకుంటే తప్ప, మామూలు శక్తి మూలంగ ఉండదు.

అమ్మ : ఈ జరిగే సంఘటనలన్నింటిని ఆపగల శక్తి ఉంటుంది గదా!

వీ.ప్ర : వారది కావాలను కుంటే .... ....

డా : నా ఇచ్ఛాను సారమని చెప్పమ్మా

అమ్మ : నా ఇచ్ఛానుసారమయితే నాకు హైమపోవాలని వుండదు గదా!

వీ.ప్ర : ఏ కోరికా లేదుగా!

డా : పుట్టడం, గిట్టడం రెండూ సమానమైన వాడికి ....

సో : అప్పుడు ఇచ్ఛాను సారమంటే ఎలా మరి?

అమ్మ : నా ఇచ్ఛానుసారమన్నప్పుడు, నా యిష్టప్రకారం జగత్తును నడిపించ గల్గినప్పుడు - కొంత మందిచేత కొన్ని పనులున్నాయనుకో నాన్నా: నాయిచ్ఛనే చేయించుకున్నా. నాయిచ్ఛే కష్టపెట్టించుకుంటా, నాయిచ్ఛేనే పొయ్యిలో చేయి పెడతా, నా యిచ్ఛే గొడ్డలితో నరికించు కుంటా. నాయిచ్ఛ పుట్టిన బిడ్డని చంపుకుంటూ, నాయిచ్ఛే కొట్టిరమ్మంటే కొట్టివస్తా

– నాయిచ్ఛ మీద ఆధారపడి వుంది. ఎవరన్నా చెప్పింది నాయిచ్ఛ అయిపోతుంది దాని మీద దుఃఖమెందుకుండాలి అక్కడ.

దాక్టరు : అది చెప్పలేం, నిన్ను గురించి తెలుసుకుంటే అంతకంటే కావలసింది ఇంకేముంది? అది తెలుసుకోలేకపోతేనే ఈ బాధంతా

అమ్మ : దుఃఖముండకూడదప్పుడు ఏది చేసినా ఒకటిగా ఉండాలి. ఏది జరిగినా ఒకటిగా వుండాలి. ఇచ్ఛే అయిన తర్వాత ఇంకొకటి లేదక్కడ లేదు, ఎవరేది చెప్తే అది చేయటమంటారా, ఒక పద్ధతిగా నడవాలని నిర్ణయించుకుని ఎవరేది చెప్తే అది చేద్దాం దీనికెదురుండకూడదు – తన ఇష్టాన్ని చంపుకుని, ఇంకొకసారి ఇష్టాన్ని ఆచరించటమే సహనమని పేరు పెట్టుకుని దాన్ని ఆచరించడం వేరు.

సోదరులు: అదికూడ నీకిష్టమైతేనేగా!

అమ్మ : అందరు చెప్పినట్లు వింటానా? నాకిష్టమైన వాళ్ళు చెప్తే వింటాను.

వీ.ప్రసాదరావు: అందరు చెప్పినది విన్నట్లుగా కనిపిస్తూ మీ ఇష్టప్రకారమే నడుస్తారు.

అమ్మ : నే కష్టపడేదయినా, నాకిష్టమైతేనే వింటా.

సోదరులు: అందువల్ల ఒకటే యిచ్ఛ పనిచేస్తుంది. ఇన్ని యిచ్ఛలు లేవు అసలు ఇతరుల యిచ్ఛలు కాదు. నీ యిచ్ఛే ప్రధానమై భావిస్తుంది.

అమ్మ : అప్పుడు యిచ్ఛలో ఇట్లా హింసించుకోవటంలో ఉద్దేశ్యమేమిటో.

సో : ఆ యిచ్ఛకు అది హింస కాదన్న మాట

అమ్మ : ఆ యిచ్ఛకు అది హింసకాదు, చూచే వాడికి హింస నీకు బాధ ఉంటే?

దాక్టరు : మీకు బాధ ఉంటేనా?

అమ్మ : నాకు బాధ ఉంటే, దాన్ని ఎట్లా చిత్రిస్తారు?

దా : బాధ లేకుండ ఎట్లా ఉంటుంది? శరీరమున్న తర్వాత బాధ తప్పదు.

అమ్మ : బాధ ఉంటుంది. బయటికి చూపించవచ్చు చూపించలేక పోవచ్చు.

దాక్టరు : గడ్డ ఉందనుకోమ్మా! నాకే అంతలావు గడ్డఉంటే మూలుగుతూ పడుకుంటాను. అంతేగాని బాధలేదంటే ఒప్పుకోను నేను. అది ఓర్పే అంటాను నేను.

సో : ఓర్పే అయితే అది బాధ కాదు.

డా : బాధపడుతూ బాధకాదంటే ఎలా? ఇతరులకు కనిపించనీయకుండ ఉండటానికి......

సో : బాధంటే?

శ్రీపాద : నొప్పులేవా అమ్మా? అని చీరాలలో డాక్టర్లడిగారు? ఎందుకులేవండి? అన్నారమ్మ అయితే అరవటంలేదేం? అన్నారు డాక్టర్లు అరవద్దన్నారుగా, అన్నారమ్మ.

సో : అమ్మంటుందీ, నాకు బాధనిపిస్తే ఎప్పుడైనా .... ...

శ్రీపాద : అనిపించదు.

సో : ఎక్కడా ....... ....

అమ్మ : అనిపించింది అనిపిస్తుంది

సో : అనిపిస్తుందీ, అదివేరు అనిపించిందా?

అమ్మ : అనిపించిందా అంటే ......

సో : అనిపించి ఉండదు. ఎంచేతనంటే అనిపిస్తే అది జరగదేమో?

అమ్మ : తన ఇష్టాన్ని చంపుకుని, ఒకరిష్టాన్ని - తన యిష్టం చేసుకోవటమే సహనం. అది కురుపే కావచ్చు - జ్వరమే కావచ్చు అట్లకాడ గుచ్చుకున్నప్పుడు ఇటునుంచి అటు వచ్చింది. చాకు గుచ్చుకున్న గుర్తు మొన్నటిదాకా ఉంది. ఇటునుండి అటు వచ్చింది.

డాక్టరు : అది కూడా అట్లాగే మానిపోయిందా?

అమ్మ : నేనే లాక్కున్నా ఎవరూ లాగలా.

నాన్నగారు: అది కాదండీ : కూర్చుని కాఫీ పెడుతున్నది నీళ్ళు తెర్లుతే గాని కాఫీపొడి వేసే వారు కాదు నీళ్ళలో అప్పుడు తెర్లిపోతున్నాయి చేయికూడా అందులో వుంది. కళ్ళు మూసుకుని వుంది. ఏమైంది? చెయ్యి కందలేదు. అట్లాగే పెట్టి వున్నది. తనకు తెలియదు కాగిన నీరు - అవన్నీ చూసినవే.

అమ్మ : చాకు ఇటు నుండి అటు దిగినప్పుడు కొమ్మూరు డాక్టరుగారికి కబురు పోయింది రమ్మని ఏ కబురు వచ్చినా ఇప్పుడు నీకెట్లా తెలియ పరుస్తున్నామో, ఆనాటి రోజుల్లో వారికట్లా కబురు చేసేవారం. అప్పుడు ఏ మొచ్చినా ఆయనే.

# ఉన్నది ఒకటే - సృష్టేశక్తి

సోదరులు: మీతో అధ్యాత్మిక విషయములను మాట్లాడుదామని

అమ్మ : అట్లాగ ... మీకు ఏమి కావాలో అడగండి.

సోదరులు: హిందూ సాంప్రదాయములో విగ్రహారాధన చూస్తున్నాను మిగతా మతాలలో విగ్రహారాధన లేదు. ఈశ్వరుడిని సమాజపరం చేశాం.

అమ్మ : విగ్రహం అంటే ఆకృతి ... రూపం.

జండా, సిలువ, ఆకాశం .... ఏది రూపంగాదూ? రూపంకాని వస్తువు లేదు. నాకు కనిపించటంలేదు. రెండు హస్తముల మధ్యఖాళీ ప్రదేశమునకూ రూపం ఉంది.

నిగ్రహం కోసమే విగ్రహం.

సృష్టిలో ప్రతీది రూపంతో ఉంది.

సో : పాప పుణ్యాలపై మీ అభిప్రాయం?

అమ్మ : నా దృష్టిలో పాపం లేదు.

సో : ప్రపంచములో పాపమే లేదంటారా?

అమ్మ : ఇది అంతా దైవస్వరూపమని నేనను కొంటున్నాను.

సో : ఎవరెలా నడిచినా ఫర్వాలేదా?

అమ్మ : ఎవరినీ ఇట్లా నడువమని నేశాసించలేదు.

సో : మానాలెడ్జి తక్కువ గనుక (శాస్త్రము) చెప్పిన భావనలను గ్రహించటం కష్టం.

అమ్మ : ప్రవక్తలు ఎందరోవచ్చారు ఒకరు చెప్పినది; మరొకరు చెప్పలా .... ఒకరి యుగంలోనే (కాలంలో) అందరూ రాలేదు. ఎవరికి ఏది అందుబాటులో వుంటే వారు అది తీసుకొన్నారు. బైబిల్, ఖురాన్ తక్కువ అనుకోను. ఎవరికి ఏది అందితే వారు అది చెప్పారు. నీకేది ఇష్టమో అది తీసుకో ఆబాటనసాగు. ఆచరించదానికి ఏమతమైతేనేం ఏభావమైతేనేం నీతోటివారిని నీలాగా చూచుకో అనే మాటను ఆచరించగలవా?

సోదరులు: అన్నివేళలా సఫలంకాదు.

అమ్మ : విఫలమైనప్పుడు? యహోవా! రక్షించు అని క్రీస్తు ప్రార్థించక తప్పలేదు. ప్రహ్లాదుడు ప్రార్థించక తప్పలేదు. ఏది మీకు హత్తుకుంటే అది మీరు చేయండి.

సో : విగ్రహం అవసరమా? కాదా?

అమ్మ : విగ్రహారాధన నీవు ఉన్నదనుకున్నా, లేదనుకున్నా - ఉన్నది ఇప్పుడు మనం వెలుగులో ఉన్నాం. ఏదో కొంత అనుభవించాలంటే .... .... ....చీకటి వెలుతురు కాధారం.

సో : దేవుడు ఒకడని అందరికీ తెల్సు. దేవుడిని ఆరాధించేవారు తిరుపతివెళ్ళి మొక్కుబళ్ళు చెల్లిస్తున్నారు. అది బలహీనతా? తిరుపతికి అనేకులు వెళుతున్నారు. అసలు అలా వెళ్ళటములో అక్కడ ఏదైనా "వర్తు" ఉందా?

అమ్మ : మనిషికి రెండూఉన్నాయి. ఆలోచన వచ్చిందికదా - మనసుకు ఆలోచన స్వభావం - వెళ్లాలనుకునేది ఆ మనసే, వద్దనుకునేదీ ఆమనసే. తప్పుచేయడం బలహీనతా? అలా అయితే ఏదైనా బలహీనతే.

సో : మంత్రాలవల్ల అక్కడ ఏదైనా ప్రత్యేకత అపాదించ బడినదని నేను అనటం తప్పా?

అమ్మ : తప్పు అనేదిలేదు నాదృష్టిలో. అంతా'రైటే' ఎందుకంటే నీకు అందినది అది.

సో : అదిరైటే అయితే ఏదితోస్తే అదిచేయవచ్చా!

అమ్మ : అదినాకా, నీకు అట్లా అనిపిస్తుందా?

సో : స్వశక్తితో కొంత ప్రయత్నిస్తే

అమ్మ : ఇంకోగంటకు ఏమి ఆలోచిస్తావో చెప్పు, నీస్వశక్తి ఏమిటో తెలుస్తుంది. చర్మానికి, మాంసానికి, ఆలోచనకు ఆధారమై - వీటి అన్నిటితో కూడినదే నేను. (కన్నుగాదు, కాలుకాదు. శరీరంకాదు, మనస్సుకాదు, ఇంద్రియాలు కాదు) ఇవి కాను అని చెప్పే నేను, శరీరమున్నప్పుడే చెబుతున్నది.

శరీరం లేని తర్వాత చెప్పటం లేదు. ఇదికాదు అని చెప్పటం శరీరంతో కూడిన నేనే. వస్తువులేని గుణం, శరీరం లేనిమనస్సు వుందా? అర్థంకాదు శరీరం లేని మనస్సు తెలిస్తే శరీరంలో వున్న నేను ఏడవదు; అందుకు శరీరంతో కూడిన మనస్సు, పంచభూతాలతో కూడిన శరీరం కలసినదే. విడివిడిగా విడదీస్తే ఏ ఒక్కటీ నేను కాదు. అన్నీ కలిస్తే నేను - ఈ చెప్పే చెవా? ముక్కా? తలకాయా? ఆలోచనా? అన్నీ కలిపితే మాట్లాడుతుంది. (అమ్మచేయి వూపిచూపి) వూపేచేయి అంటే ఇదిపోతున్నది. అది కనిపించటంలేదు శరీరం పోయేదైయున్నది. ఇకనేనెవరు? నేను ప్రత్యేకంగా ఒకటిగాలేదు. అన్నిటితో కూడినదే నేను. నేను అంటే ప్రాణమా? అచ్చుగాకాదు. ప్రాణంకూడాను అర్థంకాదు గాని నేను అని తెలుస్తున్నది. నేను అని నేను చెబుతున్నది నామనస్సు నాకు చెబుతున్నది. మనస్సుకు రూపమేమిటి?

కొండముది రామకృష్ణ : ఆలోచన.

అమ్మ : అది గుర్తించేదానిగా, గ్రహించేదానిగా అనేకంగా వున్నది ఆలోచనేనా? అయితే నేనెవరు: ఇదికాదని చెబుతున్నారు వారు, అన్నిటా వున్నది. చెప్పటానికి వీలు అయినది, వీలుకానిది. శుక్లశోణితాలు పంచుకొన్నది. అన్నింటికీ మూలమైయున్నది, అర్థం కాని, అతీతమైన శక్తి పరిమితంగా వుంది నేను. అపరిమితంగా ( ఈ నేను జగత్తుగా వుంది. ఈనేను పరిమితంగా నేను అయివచ్చింది. గొడ్డుకూడా నేను అనుకుంటుంది. ఏ రూపంకాని రూపం. ఆశక్తి ఒకరూపం ధరించినపుడు నేనుగావుంది. నీవుగావుంది. నేనుగావుంది, శక్తిగావుంది ఈరానీవలేను నేను అనే నేను ఈనీవనేనే శక్తి - నీవూ నేను నేను. గుర్తించనప్పుడు నీవున్నావని తెలియదు నీవైననేను, నేనైననేను, అన్నినేనులూ నేనైననేను - ఆశక్తి శరీరం అయి మనస్సై ఇన్నింటితో కూడిననేను. ఆనేను బ్రహ్మ, ఆశక్తి అనేకమైనది కాబట్టి నేనుగా, అనేకంగా వున్నది? ఇది అనుభవంలోకి

రావడమెట్లా? మనస్సు, శరీరం, రక్తం, శుక్లం, ప్రాణం - కాదు అని పించింది. నేను ఏమిటి? తల్లి దండ్రులు పరిమితం, నారాక వారికే తెలియదు. వచ్చిన తర్వాత ఆలోచన. ఆలోచన చేసే మనిషినేనా? కన్నుచూడలేదు. మనస్సు ద్వారానన్నుచూస్తున్నది. మనస్సు ఒకదానిమీద లగ్నమైనపుడు ఎదురుగా. ఎవరుపోయినా కనబడదు. మనస్సుకు ఆలోచన వృత్తి ఆలోచనలు ఇంద్రియాలను వాడుకొనేగుర్తు. ఒకడు ఒకడిని కొట్టాలనిపించింది. మనస్సుతో కొట్టడు. మనస్సుద్వారా అవయవాలతో. ఎవరునేను: బ్రహ్మను గూర్చిన ఆలోచన ఎందుకు నాకు? మనస్సును గూర్చి 24 గంటలూ ఆలోచించి నాచేతికి అందలా. ఎక్సరేకు అందలా. ఇంతమహత్తరమైన దానిని (జగత్తును) ఏదైవమో సృష్టించాడనేది నామనస్సు ఒప్పుకోవడంలా - ఈ అమ్మ అందుకు ఒప్పుకోవడంలా శక్తి రూపంలేకుండా కాదు. అర్థంగాకుండావుంటే ఏమిటి దాని ప్రయోజనం తెలుసుకోమని వృద్ధిలోకివస్తారని. జన్మరాహిత్యమని నిన్నునీవు తెలుసుకోమని చెబుతారు. చూపుతో చూచినట్లని, ముల్లుతో ముల్లు తీసినట్లని .... శక్తి బొంగులో బద్దగా గింజగా. మొక్కగా, పూవుగా, కాయగా, పండుగా, వాడి పోయేశక్తిగా. ఇవన్నీ అయితేనేను అని చెప్పడమేమిటి? నేను పరిమితంగా వున్నా - ఈ శరీరంరావటానికి, పలుకుగా, మాటగా, ఈశక్తి గోపాలకృష్ణమూర్తిగా, నేనుగా, అన్నిగా వుంది. అట్లా గోచరించింది గనుక అన్ని నేనులు నేనైననేను అని అన్పించింది అన్నాను. నీకూ అటువంటి అనుభవం వస్తుంది. కళ్లు మూసుకుంటే బ్రహ్మరంధ్రం కనిపిస్తుందనే భావాలు అర్థంగావు. నేను యిట్లా అనడానికి కారణమిది. ఏపసి పిల్లప్పుడో యీ ఆలోచన కలిగినపుడు ఇదంతానేనే అన్పించింది. జపతపాలు చేసినందువల్లకాదు. నడుస్తేనీడ అదే అనిపించింది. దేనిని పరిశీలించిచూచినా అదే అన్పించింది. దృఢం కలిగిన మనసుకు అనేక ఆలోచనలుకూడ ఆఒక్క

దానికే అంకితమైతాయి. ఆస్థితికలుగుతుంది. మీరనేకసూక్తులు చదివేవుంటారుకదా! సర్వానికి సర్వం ఆధారమెలాంటిదో ఈమాటా అలాంటిదే. అన్ని నేనులూ నేనైన నేను అన్నా అదే ఇంతెందుకు? ఉన్నదే అది నీవుగా నేనుగా! ఏవిధమైన మార్పుతో మాటగాచెప్పలేను. ప్రేమఅని ఎందుకు అన్నానంటే ఆధారం తనే అవుతాడు. వాళ్లుచెప్పేవి తీసెయ్యి - ఏమన్నా ఏమిచేసినా ప్రేమలేకుండానాకు మరోలా కన్పించలా. ప్రేమకు నిర్వచనమేమిటి? కావాలి అనిపించటమే. డబ్బు, భార్య, పిల్లలు అంతా ప్రేమమయం. ఒకణ్ణి ఒకడు చంపదమన్నా ప్రేమే, చావును ప్రేమిస్తున్నాడు. వాడిచావు పైతనకు ప్రేమ. చంపాలిగనుక కత్తిని ప్రేమిస్తాడు. ద్వేషం కూడా ప్రేమకు రూపాంతరమే. దారిన పోయేవాడిమీద కలగటంలేదుగా. నావద్దకు నీవుప్రేమతోవచ్చావు. అందకపోతే నాపైకోపం. తల్లీ తండ్రి అందరూ వున్నా నీకు ప్రేమవుందని తెలియదు. ఈభావం తల్లి దండ్రుల యందువుంటే అదీ ప్రేమే. దైవ మందుంటే భక్తి. అట్లాతీసుకున్నాకూడా ప్రేమే - జగత్తు సత్యమేగాని అసత్యంకాదు. నేను పోయినా జగత్తువుంది. తన పిల్లలకొర్కై 4 యకరాలు సంపాదిస్తాడు. తాను పోయినా జగత్తువుంటుందనేగా! అట్లాకాకపోతే ఎవరికి నిలవాలని ఆసంపాదన: జగత్తు ఎప్పుడూవుందనేదే నిజమైనది. మరి అసత్యమని ఎందుకన్నారు? మార్పును అసత్యంగా తీసుకున్నారు. ఈ మార్పేచైతన్యం. దానినే బ్రహ్మఅని విధిఅనీ అనవచ్చును. విధి అంటే బ్రహ్మ అని లిఖించటం అనేమాట అదే. భూమి ఒకటే. ఈ ధరణిలో రకరకాలయిన వస్తువులు పుట్టాయి. బొగ్గు, పెట్రోలు, వడ్లు, బంగారం, సముద్రం వచ్చింది. ఇవన్నీ ఎక్కడివి? ఒక దానిలో ఒకటి కలిపితే ఇంకొకటి, అధ్యాత్మికంగానే ఒకటే అనేకమైంది అనుకోక్కరలా. సృష్టియేదైవం. సృష్టిలో అన్నం, అశుద్ధం గింజమొక్కయి, పైరయి, గడ్డిఅయి, గొడ్డునోటికి ఆహారమయి అదే పేడ అయింది. నేచెప్పేవన్నీ

సృష్టిలోనే. ఎంత ప్రేమతో బిడ్డను పెంచినా చావక తప్పటంలేదు. చావుపుట్టుకలు వీడి చేతులలోలేవు. చావుపుట్టుకలు సృష్టిలోనే మూలం – దేనికేది మూలం? అన్నింటికీ అన్నీ మూలం. సర్వానికి సర్వం ఆధారం. శక్తి అనేకమయింది. ఆశక్తి నేను అనేవ్యక్తినేగాక నీవుగా, మరొకడిగా, యింకొకడిగా, అందుకే ఎవడికి వాడుఅను అన్నింటితో కూడినదే ఆశక్తి. దానిపేరు బ్రహ్మఅనిపెట్టు, అసలు అనిపెట్టు, అసలు ఇదిఏమిటి? అనిపెట్టు ఎట్లా అర్థమవుతుంది? అసలే గనుకనే మనస్సుకు గోచరిస్తుంది, ఇట్లా తోచి నేను నేనైన నేను అనుకొన్నమాట అది. ఎవడికి వాడు నేను అనుకొంటాడు. ఏమిటో ఎక్కడో వుందని మనస్సు బ్రెయిన్ కాదని అంటున్నారు. అదికానిది మిగిలినదేది? జ్వరం వస్తే మాటాడలేదు. శరీరం జడపదార్థమంటున్నారు. జ్వరం మనస్సుకు కాదుగదా! శరీరానికిగదా! **104** టెంపరేచరులో మనస్సు పడిపోతున్నది. ఒకడికి పక్షవాతం. మాటపడిపోయింది. మనస్సుకు పవర్‌పోయింది. ఎందుకు మాట్లాడలేదు? ఆకలి దప్పులకే మనస్సు ఓర్చుకోలేదు. శరీరం రోగాలకు వాసయోగ్యం ఆజబ్బుకు ఆశరీరం అనుకూలంగా వుంటేనే ఎంచుకుంటుంది. సౌఖ్యంగల గృహాన్ని మనం ఎంచుకున్నట్లు రోగం కూడా సౌఖ్యంగల శరీరాన్ని చూచుకొని చేరుతుంది. మందుబిళ్ళలు వాడుతాం. దాని తాహతు చాలకపోతే మందు పనిచేయదు. మన శరీరంలో ఏది లోపించిందో ప్రకృతిలో అదే వుంది గనుక ఆలోపించిన దానినే ఔషధంగా స్వీకరించటం. శరీరంలో కూడా మందును భరించేశక్తి లేకపోతే మందు పనిచేయదు. అన్ని లక్షణాలు శరీరంలో వున్నాయి. జబ్బూ శక్తే. ఇన్నిపాళ్ళూ కలసి నిర్మాణమయింది ఇంకొకటి లేదనిపిస్తుంది నాకు . ఇది కాదు అది అంటారు వారు. అందింది అర్థమయింది ఇదే. అర్థం గానిది అది.ఏది అది? అర్థం కానిదే వారు చేప్పేది. బ్రహ్మ స్థితి అందనిది. నీవంత దూరంలో వుండి మాట్లాడుతున్నపుడు అది లేచి

నాలుగు అడుగులు వేసివస్తే ఇది అదే. అందుకే రెండుకాదు ఉన్నదే అది.

గో.కృ : ధర్మా ధర్మాలకు, పాప పుణ్యాలకు, నీతి అవినీతులకు ఇదమిత్థమనే అర్థంవుందా? వీటిని గూర్చి వివరంగా చెప్పండి.

అమ్మ : ధర్మా ధర్మాలు, పాప పుణ్యాలు, నీతి అవినీతులు – వీటిని గూర్చి నాకు తెలియదు. ప్రేమ ఒక్కటే తెలుసును నాకు. అదియే న్యాయమను కుంటాను నేను.

గో.కృ : ఇట్లా నడిస్తే ధర్మమనో, ఈ విధంగా చేస్తే న్యాయమనో ఈ విధంగా వుంటే నీతి అనో ప్రత్యేక అర్థం లేదంటారా?

అమ్మ : చెప్పానుగా నాన్నా! వాటిని గూర్చి నాకు తెలియదని ఉన్నాయేమో గాని, నాకు ప్రేమ ఒక్కటే తెలుసు. నేనదే ధర్మమను కుంటున్నాను.

గో.కృ : కాలమంటే ఏమిటి? కాల పరిణామమంటే ఏమిటి?

అమ్మ : జరిగేదంతా కాలమే. ఉన్నది కాలమే – ఉన్నదే జరిగేదే కాలం. పరిణామ మంటే మార్పేగదా! అనుక్షణం పరిణామం జరుగుతున్నది.

గో.కృ : ఈ మార్పు ఒక లక్ష్యం వైపు పురోగమిస్తున్నదా?

అమ్మ : కాలంగాదు (మన) అభిప్రాయమది. ఇంకొక వైపుతిరగాలనో, రావాలనో.

గో.కృ : జరిగినదని, జరుగుతున్నదని, జరుగబోవునదని (కాలాన్ని) గూర్చి చెప్తారే!

అమ్మ : కాలం ఒక్కటే. జరిగే పరిస్థితులు వేరు.

గో.కృ : దైవమంటే ఏమిటి? మానవత్వ మంటే ఏమిటి?

అమ్మ : సృష్టియే దైవం. మానవత్వమంటూ వేరే లేదు. సృష్టి దైవమని గుర్తించలేక పోవటమే మానవత్వం కావచ్చు.

గో.కృ : మతమంటే ఏమిటి? శాస్త్ర మంటే ఏమిటి? కొందరికి కొన్ని మతాలు గొప్పవి మరి కొందరికి కొన్ని శాస్త్రాలు పరమ ప్రమాణం. సత్యాన్ని సమగ్రంగా బోధపరచేది ఏది?

అమ్మ : నా అభిప్రాయం అనుభవమే శాస్త్రం. అయితే ఎవరి అనుభవాన్ని వారు చెప్పారు. ఎవరి అనుభవం వారికి శాస్త్రమే. అంతేగాదు శాశ్వతంగా నిలువ గలిగేది శాస్త్రం. శాసించేది శాస్త్రం. అట్లా నడుపుతున్నది నాదృష్టిలో సృష్టియే తతిమ్మావన్నీ మార్పు చెందుతున్నాయి.

గో.కృ : అయితే సృష్టియే శాస్త్రమంటారా?

అమ్మ : అంతే.

గో.కృ : ఎవరి అనుభవం వారికి శాస్త్రమైనపుడు సమన్వయ మెట్లా చేసుకోవాలి? నిజా నిజాలు ఎట్లా తెలుసుకోవాలి.

అమ్మ : నాకు నిజా నిజాలు లేవు. శక్తి - ఎట్లానడిపిస్తే, మానవుడు అట్లా నడుస్తున్నాడు. ఆశక్తి మనస్సిచ్చి నడిపిస్తున్నదని అంటాను.

గరుడాద్రి: కాలాన్ని గూర్చి మరింత వివరంగా చెప్పమ్మా!

అమ్మ : కాలమంటే జరుగుతున్నది. గడియారముల కాలం కాదు. అది గుర్తు తెలియపరచేది. తెలిసినా తెలియక పోయినా జరుగుతున్నది. కాలం ఎప్పుడూ వున్నది. గ్రహించేది కాలమే. కాలమంటే సమయమని కూడా. సమయం ఎప్పుడూ వుంది ఏ సమయానికి ఆ సమయం ఎప్పుడూ వుంది. కాలమంటే శక్తి అని: సమయమని, పరిణామమని, పరిణామం చెందేదానికి అధారమైనదని, బ్రహ్మమనీ, చైతన్యమని, సత్యమైన పదార్థమని, బ్రహ్మ స్వరూపమని (సమస్త జగత్తు) శక్తి ఎట్లా నిండివున్నదో, కాలమట్లా నిండి వున్నది. వెలితి లేకుండా చెప్పటానికి వీలులేకుండా వుంది. గర్భితంగా వుంది అర్థమవుతూవుండి అర్థంగాకుండా వుంది. తెలుస్తూనూ వుండి తెలియకుండా వుంది. కాలమే దైవం. కాలమే సర్వమూ. గింజ పెట్టి పెరిగే సమయం కాలం. అక్షరం పూర్తి అగుటకాలమే. కాలమంటే ఏమిటి అని అడగడం కాలమే. క్షణమన్నాను కాని క్షణమంటే ఏమిటో తెలియని కాలం. ఆక్షణాన్ని అర్థంచేసే కాలం. వ్యక్తంచేసేది,

వ్యక్తంచేయ లేనిదికాలం. సర్వకాల సర్వావస్థలయందు కాలమే. నీవూ కాలమే నేనూ కాలమే. ఎన్నో కాలాలు అన్నిటికీ కాలమే. గణితానికి. అక్షరానికి పదానికి కాలమే ఒక కాలంలోని అంకెమరో కాలంలో పడకూడదు. కాలం గణేశుడని, వినాయకుడని అన్నారు. జగత్ అంతా కాలంలో నిండి వున్నది. చూస్తూ, చేస్తూ, నడుస్తున్నది - కాలమే. వింటూ అంటూవున్నది కాలమే. వెలితి లెకుండా 'ఇంత' అని ఏదో అని.

నీవు నన్ను అడగటం కాలమే 'నేను నీకు చెప్పటమూ కాలమే. ఉన్నది కాలమే.

ఎన్ని రకాలుగా తీసుకున్నా చెప్పేరీతి వేరుగాని ఉన్నది ఒకటే. భాషమారవచ్చుగాని భావం మారరాదు. జగత్తన్నా, దైవమన్నా, బ్రహ్మాన్నా ఒకటే అర్థం మరొకటి లేదు. ఉన్నది ఒకటే గనుక యింకొకటి ఎట్లా వస్తుంది? కాలమెట్లాంటిదో ప్రేమ అటువంటిది. ప్రేమ ఎటువంటిదో శక్తి అటువంటిది. శక్తికీ సృష్టికీ తేడాలేదు. మాటలలో మార్పు అభిప్రాయాలు ఇన్నిరకాలుగా **వున్నాయన్న** విషయం ఒక్కటే సృష్టికీ ప్రేమకూ తేడా లేదని గదూ చెప్పింది? **సృష్టివేరు శక్తి వేరుకాదు సృష్టే శక్తి - శక్తే సృష్టి.** సృష్టి అంతా ప్రేమమయం. ధర్మా ధర్మాలు, పాపపుణ్యాలు, నీతి అవినీతులు - అన్నీ ప్రేమలో యిమిడి వున్నాయి. ప్రేమకంటే భిన్నమైనది మరొకటిలేదు. ప్రేమయే సర్వం. మానవత్వం, దైవత్వం ప్రేమలో యిమిడి వున్నాయి. ధర్మం - తల్లి బిడ్డలను పెంచటం లాంటిది. పదిమంది కలసి, కొన్ని కట్టుబాట్లు చేసుకొని యిట్లా నడుచుకుందాం అనేది ధర్మం. ఏది మంచి ఏది చెడు? అని విచక్షణ చేసుకొని ఉచితమైన విధంగా నడచుకొనటం న్యాయం. హితోపదేశాలు ఈ విధంగా ఏర్పడినవే. న్యాయం చేసేవాడికా? చేయించుకొనే వాడికా? కాదు. న్యాయమనేది దొరకదు. జరిగింది న్యాయం. ఒకరిని ఒకడు

చంపడం న్యాయమా? ముప్ఫై ఏండ్లవాడు చస్తున్నాడు. అరవై ఏండ్లవాడు జీవిస్తున్నాడు. న్యాయాన్యాయ విచక్షణ మానవుడు చేయదగినది కాదు. ఇట్లా నడుద్దామనుకొని ఆ విధంగా వుండటం ధర్మంకావచ్చు. హితోపదేశం ప్రపంచానికి అవసరమా? నిత్య జీవితంలో ఎక్కడి కక్కడ హితోపదేశం జరుగుతునేవుంది. ఇది మంచి, ఇది చెడు అని చెప్పుకోవటం హితోపదేశమే. గురువు చెబితేనే హితోపదేశం కానక్కరలేదు. మనిషికి మనిషి చెప్పుకుంటూనే వుంటారు. పిల్లలకు విద్యాలయంలో చదువు చెప్పిస్తాం. ఆ చదువు వల్ల సంస్కారం లభిస్తుంది. ఉద్యోగం వుంటుంది. పాండిత్యం వస్తుంది. భోజనం వుంటుంది. అనేకం కలుగుతుంది. వీటన్నిటికీ మూలం మొదట అక్షరం దిద్దించిన గురువా? తల్లిదండ్రులా? వీరంతా నిమిత్త మాత్రులుగా కనబడతారు. అన్నీ చేయించేందుకు ఆ శక్తే కారణం. అన్నిటికీ మూలం అక్షరం అన్నారు. ఇది 'క' అని ఇది 'మ' అని అక్షరాలను ఎవరు నిర్ణయించి వుంటారు. శాస్త్రాలకు కాళిదాసును (పురాణ పురుషులలో) రామ, కృష్ణులను అద్వైత బోధకుడిగా శంకరులను తీసుకుంటారు. వీరే ఆధారమైతే ఎన్నిసార్లు రామ, కృష్ణులు వచ్చారు? శంకరుని కంటే ముందు అద్వైతం లేదా? వీరి కాలం లెక్కకు అందుతుంది. జగత్ ఎప్పుడూ వుంది. అంతకు ముందు యీ మతాలన్నీ ఏ మైనాయి? అప్పుడు తత్త్వ విచారణ లేదా? వ్యాసుని కంటే శంకరుడు విశేషంగా చెప్పిన దేమిటి? సాధనను గూర్చి, యోగాన్ని గూర్చి, జ్ఞానాన్ని గూర్చి, భక్తిని గూర్చి సమగ్రంగా, సంపూర్ణంగా వ్యాఖ్యానం చేసింది గీత మాత్రమే. గీతకంటే శంకరుడు మిన్నగా, క్రొత్తగా చెప్పిన దేమిటి? నిశ్శబ్దం బ్రహ్మ అని ఒకచోట, శబ్దం బ్రహ్మని మరొక చోట అన్నారు. ఈ బ్రహ్మ అన్ని కనుక శబ్దము, మౌనము - ఎవరికి ఎక్కడ ఏవిధంగా ఎట్లా గోచరించిందో ఆరూపంగా చెప్పారు.

వేదాలు శబ్దం బ్రహ్మ అన్నాయి. **బ్రహ్మను ఎవరికి ఎట్లా అవగాహన అయితే అట్లా మలచారు.** అన్నం బ్రహ్మ - ఎవరికి ఏది అందుబాటులో అయితే అదే బ్రహ్మ అనుకుంటున్నారు. ఒకడు జ్యోతిని బ్రహ్మ అన్నాడు. ఎవడికి తోచింది వాడు బ్రహ్మ అన్నాడు. ఒకడు భక్తి ముఖ్యమని, ఒకడు జ్ఞానం ముఖ్యమని, ఒకడు యోగం ముఖ్యమని, ఇంకొకడు నామం ముఖ్యమని, ఇంకొకడు మౌనం ముఖ్యమని - ఎవరికి ఏది అందితే అది ఒకటి గొప్పది. ఒకటి తక్కువది లేదు. శబ్దం వుంటేగాని, నిశ్శబ్దానికి దారిలేదు. మంత్రాలన్నీ గొప్పవే అక్షరాలలో ఇమిద్చారు. 'నమోనారాయణాయ' అష్టాక్షరి. 'నమశ్శివాయ' పంచాక్షరి. అయితే అక్షరాలకే పవరువుందా? మననంతో మంత్ర మవుతుంది. మనస్సే మంత్ర మవుతుంది. 'ఆహా' 'ఓహో' రెండక్షరములు గల క్షుద్రమంత్రములు కొన్ని అట. పవరు అక్షరాలకా? మనస్సుకా? మననంతో మనస్సే మంత్రమయింది. (మనస్సు). అదే మంత్రమయితే మనన మెందుకు?

సాధన వద్దనలా. ఎవరికి ఏది సాధ్యమైతే అది సాధన సాధ్యసాధనములు వేరుకాదు. ఉన్నది ఒక్కటే. ఆలోచనే దైవం. మంత్రాలే కావాలని లేదు. ఈ సాధనే చేసి తీరాలి అనేదేంలేదు. ఎవరికి ఏది కావాలో అది.

# శక్తి - తరుణం

## 5-7-76

అమ్మ : గ్లాసు నాకు కాలుతుంది గనుకనే నీకు కాలుతుందని గుర్తించాను. కాలకుండా లేదెప్పుడు! ఈ కాల్పు ఆ స్వరూపం కాదని నేననుకోలేదు. ఈ కాల్పు ఆ శక్తి కాదనుకోలేదు. నాకు కాలకపోతే నీకు కాలుతుందని నేనెట్లా అంటాను? నాకు కాలదులే - పైగా ధైర్యం చూడు నాకు కాలదులే. నీకు కాలుతుందన్నాను. కాలడం యొక్క స్వరూపం తెలుసు నాకు. కానీ అది నాకు ఎప్పుడూ వద్దనుకోలేదు. ఏది అనుభవానికి వచ్చినప్పుడు అది అనుభవించడమే (నా) స్వభావం అన్నాను. ఇక్కడ ధర్మం అనబోయి నానుకో! మళ్ళీమారి స్వభావం అన్నాను. ఇక్కడ స్వభావం - దేని స్వభావం దానికుంటుంది గదా! గాలికుండే స్వభావం గాలిది. ఎడారిలో పోతుంటే విపరీతమైన గాలి కొట్టిందనుకో దారి కనబడదు. దొంకా కనబడదు. ఏదీ కనబడదు. కానీ ఆ గాలి నాకు వద్దని నన్నుబాధ పెడ్తుందని నేననుకోలేదు.

భాగ్యమ్మ : ఇంత ఒక్క విషయానికే ఓర్చుకోలేనటువంటి వాళ్ళు ఇటు వంటివి అన్నింటినీ ఓర్చుకోవాలంటే - ఓర్పు కలగాలంటే అది అంతా అయినప్పుడే ఆ ఓర్పు కల్గుతుంది కానీ -

అమ్మ : ఈ పంచభూతాల యొక్క - ఈ పంచభూతాలతో చెలగాటం ఎట్లా ఉంటుందంటే పంచభూతాలయొక్క సమ్మేళనమే ఈ సృష్టి అంతా. ఈ కనపడుతున్నదంతా అన్నప్పుడు, బ్రహ్మ అంటే వేరే ఎక్కడో ఇట్లా ఉంటాడు కాబోలు - మూడు తలకాయలు బొమ్మవేసి వీడే బ్రహ్మ అనీ చెప్తారు. ఆ మూడు తలకాయలవాడి దృశ్యం నేను చూడలేదు. చలనం - పువ్వు గనుక విచ్చుతుంటే దానికి విచ్చేటువంటి పరిణామం అర్థం కాదుగానీ విచ్చిన తరువాత అర్థం అవుతుంది అట్లాగే ఆ శక్తి. ఆ చైతన్యం.

బాగ్యమ్మ : అనుభవం అయినప్పుడు

వీ.ప్ర. : వ్యక్తమయినప్పుడు కన్పిస్తుంది. అవ్యక్తమయినప్పుడు చైతన్యం అని పేరు పెట్టుకున్నాం దానికి.

అమ్మ : ఇక్కడ వ్యక్తంగానే ఉంది. కంటికి కన్పించే వ్యక్తత లేదు.

వీ.ప్ర. : పూవు అయిన తరువాత కన్పిస్తుంది.

అమ్మ : ఒక విత్తనం నాటామనుకో నాన్నా. అక్కడే పైకి కన్పించక పోయినా పంచభూతాలు భూమిలోపల ఉన్నాయి గదా. ఆతత్త్వం - పంచభూత తత్త్వం అనేది ఉందిగదా. అగ్నితత్వం - అంటే నిప్పని కాదుగా - తత్త్వం । ఆ స్వభావం.

వీ.ప్ర. : పరిణామ క్రమం కన్పించదు. పరిణామం కన్పిస్తుంది. అందుకే వ్యక్తం కానిదాన్ని చైతన్యం అంటున్నాం. వ్యక్తం అయినదాన్ని ప్రకృతి అంటున్నాం.

అమ్మ : నేను స్పందనం అంటాను. వ్యక్తంకానిదాన్ని స్పందనం వ్యక్తం అయ్యేదే చైతన్యం. చైతన్య మంటే కదలిక. కనబడుతున్న దాన్ని -

వీ.ప్ర. : భావమంటే - మాటలు వేరువేరుగా-

అమ్మ : ఉపయోగించాం.

వీ.ప్ర. : వ్యక్తం, అవ్యక్తం రెండూ అదే అనేగా భావన.

అమ్మ : రోజులు పన్నెండు గంటలే ప్రధానం కాదు. రాత్రి పగలు కలిపితేనే ఒక రోజు అయ్యేది. చీకటి వెలుతురు కాధారం అయినప్పుడు.

ఒక్క వెలుగే ఉంటే - వెలుగ్గా గుర్తించంగా. చీకటి ఉన్నప్పుడే వెలుగు,

సో : అట్టిస్థితి ఒకటి ఉందా?

వీ.ప్ర : తెలియదు ఉందని అనుకుంటున్నాం.

అమ్మ : ఉన్నది అంటున్నారు.

వీ.ప్ర. : కన్పించడం లేదుగా

భా : అర్థంకానిస్థితే ..........అవ్యక్తం అంటుంటే.

అమ్మ : కనబడని స్థితి లేదుగానీ అర్థంకాని స్థితి ఉంది. నాకు కనబడంది ఉన్నది. లేదని ఎట్లా అంటాను. కనబడంది లేదు అని ఎందుకంటున్నా నంటే ఈపూవు నాధారంగా తీసుకొన్నప్పుడు వస్తువు కనబడుతుంది గానీ అర్థంగావటంలే అర్థంగాని స్థితి ఉందంటే నాకు తెలియదు అన్నాననుకో ఏమైనా నాకు తెలియనివి కొన్ని ఉన్నాయి కదా. ఇప్పుడు మీరు బాపట్లలో బండి ఎక్కి బయల్దేరారు ఇక్కడకు మీరు వచ్చిందాకా తెలియదు. అది తెలియని స్థితేగా. అమ్మకు ఎందుకు తెలియదు. దూరంవాడు కనబడతాడు అనుకోవడం వేరు. మామూలుగా చెబుతున్నా – ఎప్పుడొచ్చావు నాన్నా అంటాను.

సో : సృష్టిలో ప్రతిదానికీ వ్యక్త స్థితి – అవ్యక్త స్థితి రెండున్నాయా?

వీ.ప్ర. : వ్యక్తమయిన ప్రతిదానికీ పేరు పెట్టాం.

అమ్మ : పువ్వు అనాలని ఏమి ఉంది నీవు పెట్టావు ఇంకొక పేరుపెట్తే అదే అవుతుంది. మనకు తెలియని రకరకాలు. ఇప్పుడు తెలిసిన పేర్లు చెప్పుకుంటున్నాం గానీ 'వస్తుగుణదీపిక' తీసికొని చదువుకుంటే గుర్తించదానికి వీలులేని చెట్లను నిరూపిస్తాడు. మనకు కనబడే చెట్లపేర్లు అందులో ఉన్నాయా? వాడు చెప్పిన పేర్లు గల చెట్లను నేను చూస్తున్నానా? అనుకుంటే మనకు తెలియని చెట్లూ ఉన్నాయి(వస్తుగుణదీపికలో) అందులో చదివినా అర్థంకాని చెట్లు కనబడుతున్నాయి. Botany Professor గార్కి ఏం తెలుసయ్యా అంటే ఆ అడివిలో ఆ ప్రాంతంలో తిరిగే వాడికి తెలిసిన చెట్లు కూడా ఇతనికి తెలియవు.

వీ.ప్ర. : ప్రొఫెసరు అంటే తెలియదని తెలుసుకున్నవాడమ్మా

అమ్మ : జ్ఞాని అన్నా అంతే.

వీ.ప్ర. : తెలుసుకొనేందుకు మొదలు పెట్టినవాడు ప్రొఫెసరు.

అమ్మ : ఆ జ్ఞానమనే జ్ఞానదీపికను గైకొని అన్నాడు రాజు.

భా : వ్యక్తమా అవ్యక్తమా అంటే - వాటిని అంతరాంతలుగా చెప్పారు. ఎట్లా గుర్తిస్తాం వ్యక్త స్థితి శక్తిం - అవ్యక్తాం శక్తిం వ్యక్తా వ్యక్త పరశక్తిం, జ్ఞానశక్తి ,మజ్ఞాన శక్తిం, ప్రజ్ఞానాత్మక పరశక్తిం, ఇవన్నీ అంతరాంత రాలుగా మనం ఏరుకుంటాం. అమ్మ అట్లా ఏమనకుండా అంతాఅదే నని చెప్తుంది.

అమ్మ : తెలిసిన స్థితి. తెలియని స్థితి బ్రహ్మయే అని చెప్తున్నా.

భా : వ్యక్తా వ్యక్త పరశక్తి

వీ.ప్ర. : సర్వజ్ఞత్వం అంటే అంతా తెలియదని తెలుసుకోవడమే. దానికే వాళ్ళు సర్వజ్ఞత్వం అన్నారేమో.

అమ్మ : సర్వజ్ఞత్వం అంటే, అంతా తానై ఉండి మూడుకాలాలు తెలిసికొని మూడుగా గుర్తించక ఉన్నస్థితిని వాళ్ళు సర్వజ్ఞత్వం అన్నారు.

వీ.ప్ర. : ఏ ఒకటి తెలిస్తే అంతా తెలుస్తుందో, అది తెలిసికొన్న స్థితిని : సర్వజ్ఞత్వం అన్నారు.

భాగ్యమ్మ : ఎట్లా అయినా ఉన్నదే గదా!

అమ్మ : నాకేం తెలుసునో తెలియని స్థితి.

వీ.ప్ర. : ఏ ఒకటి తెలిస్తే అంతా తెలుస్తుందో, ఆ ఒక్కటి తెలియదు గానీ ఎప్పుడు ఏది కావాలంటే అది తెలిసే స్థితి ఉన్నది.

అమ్మ : ఏ ఒక్కటి తెలిస్తే సర్వం తెలుస్తాయో అది తెలిసికుంటే అన్నీ తెలుస్తాయా అని మీరడిగినప్పుడు ఏది తెలిసికుంటే అన్నీ తెలుస్తాయో అది నాకు తెలియదు గానీ ఎప్పుడు ఏది కావాలంటే అది నాకు తెలుస్తుంది అన్నాను. తెలిసికొన్నదేదో అర్థం గావటంలే.

భా : అంటే శాస్త్రాలు చెప్పినా అంతే చెప్పింది. అమ్మ అయినా అంతేగా చెప్పింది.

వీ.ప్ర. : మీరు శాస్త్రానికీ, అమ్మకూ ముడిపెడుతుంటే నాకు అభ్యంతరం లేదుగానీ అమ్మ చెప్పింది అంతకంటే ఉన్నతంగా ఉందని మా ఉద్దేశ్యం.

భా : అమ్మను కాదంటున్నానని అర్థం చేసుకుంటున్నారేమో. అమ్మ చెప్పిన మాట 'అదేమిటో నేను చెప్పలేను' అంటుంది. అగోచరమని వాళ్ళు చెప్తారు. మనసుకూ వాక్కుకూ అగోచరమని వాళ్ళు చెప్తున్నారు.

వీ.ప్ర : నాకేం తెలుసో తెలియదు. అంతా తెలిసిన వాడికి ఎప్పుడు ఏది కావాలంటే అది తెలుస్తుంది. అమ్మను ఏదయినా అడిగితే నాకు తెలియదు నాన్నా అంటారు.

అమ్మ : నీవు ఏం చదువు కున్నావురా? ఫలానా డిగ్రీ పొందినప్పుడు ఫలానా చదువుకున్నారు అంటారు. ఒకళ్ళకి చదువురాలేదు. ఏ పనికి పంపిస్తే ఆ పని చేసుకొస్తాడు. ఆ పని చేయడం సాధ్యం అవుతున్నది చేస్తున్నాడు. చదవాల్సి వచ్చినప్పుడు ఛదువుతున్నాడు. ఏది కావాల్సి వచ్చినప్పుడు అది చేస్తున్నాడు. ఎక్కడికి పంపించనప్పుడూ ఆ పని జరుగుతున్నది. ముందుగా నేను ఆ పని చేస్తానని వీడికి తోచడం లేదు. వాడికి డిగ్రీ లేదు. నీవు B. A. చదువు కుంటే B. A. డిగ్రీ నీ చేతిలో ఉంటుంది. కానీ నా కదిలేదు. ఏం చేశానో తెలియదు, ఎట్లా సాధన చేశానో అని తెలియదు. ఫలానావాడు ఆత్మ అని తెలియదు. ఫలానాది రూపం ఆత్మస్వరూపం అని తెలియదు బ్రహ్మ ఇట్లా ఉంటాడని తెలియదు. బ్రహ్మకు రూపం తెలియదు బ్రహ్మ స్థితి ఇట్లా ఉంటుందని తెలియదు. అర్థం అవుతున్నది తెలుస్తున్నది ఎంతవరకూ అర్థం అయిందో చెప్తున్నాను. ఏ దైనా ఒకటి చేసిఉంటే, ఎప్పుడైనా ఓనామాలు దిద్దుకొని ఉంటే నేను ఈ ఫారం Pass అయ్యాననో, డిగ్రీ ఇదనో చెప్పవచ్చు ఒక సాధన చేసి ఉంటే నా ఆ సాధన ద్వారా నేను ఇట్లా వచ్చానని చెప్పవచ్చు.

వీ.ప్ర. : సాధన ద్వారా చేస్తే డ్రిల్లు మాత్రమే మిగుల్తుంది. అవి సాధించ దల్చుకున్నవాడు సాధిస్తాడు చదువుకున్న వాడికి చదువు ఒక్కటే తెలుస్తుంది మిగతావి తెలియవు. చదువే తెలియని వాళ్ళకు చదువ వలసిన అవసరం లేదు.

అమ్మ : ఏ సమయానికి ఆ పని జరగటమే నాకు అర్థమగుతున్నది కనుక ఏమి తెలుసో తెలియదు. ఏ దైనా మీరు ప్రశ్న వేసినప్పుడు ఆ ప్రశ్నలోనుంచి (సమాధానం) పుడుతున్నది. చెబుతున్నాను అంతకు ముందు నాకు తోచనిది కూడా మీరు ప్రశ్న వేసిన తరువాతనే తడుతుంటాయి ముందుగా వీటిని గురించి ఆలోచించి ఒక లిస్టు రాసిపెట్టుకోను.

సోదరుడు: మాకు సమాధానాలు వస్తేచాలు.

భాగ్యమ్మ : ఏది తెలుసో అది చెప్పలేనంటే..... .......

అమ్మ : ఏది తెలిసి ఉంటుందో చెప్పటానికి ఆస్థితి వ్యక్తం కాదేమోనమ్మా స్వభావం – మల్లెపువ్వు తను మల్లె పువ్వునని చెప్పుకోలేనట్టే (ఆ స్థితిని) మనం గుర్తించాల్సిందే కానీ దానికి తెలియదు నేనీ స్థితిలో ఉన్నానని.

వీ.ప్ర. : అది బాగుంది.

భా : ఆ మాటలని అన్నింటిని మార్పులుగా చెప్పారు. మనోవాక్కులకు అందదని – తెలియక చెప్పక పోవటమా? తెలిసి చెప్పక పోవటమా? ఆ స్థితి?

అమ్మ : చెప్పడానికేదో తెలియదు.

భా : అది అందరూ ఒప్పుకోవలసిన మాటే దానికేం? రూపమా? నామమా?

అమ్మ : అభిప్రాయం మాత్రం అంతే. ఈ కనబడేదంతా మీరు ఇవి కలసి కనబడుతున్నది. అర్థమవుతున్నది. మీరు భాగ్యమ్మ అని, వారు రాఘవయ్యగారనీ, వారు శ్రీపాద అనీ అన్పిస్తున్నది. వీళ్ళంతా నా పిల్లలన్పిస్తున్నది. వీరికి పెట్టుకోవాలన్పిస్తున్నది. వీళ్ళంతా నాకు కావాలన్పి స్తున్నది. మమకారంపోలేదు. పోగొట్టుకోవాలనే ప్రయత్నమూ లేదూ. ఇది బాధకల్గించడమూ లేదు. స్థితి చెప్పగల్గుతాను. ఇది ఏ స్థితి అంటే నేను వివరించలేను. దీనికి పేరు పెట్టలేను. మీరంతా కావాలి అన్పిస్తున్నది. ఏదీవద్దని అన్పించడం లేదు. కత్తిపీట కోసుకుంటే దాని స్వభావం అనుకుంటున్నాను గానీ ఇదినా ప్రారబ్ధమని గానీ, ఇది నాకు

ఎందుకు కోసుకోవాల్సి వచ్చింది అని అనుకోలేదు ఎప్పుడూ. ఏ పరిస్థితిలో ఏది అనుభవించ వలసి వచ్చినా అదంతా సహజంగానే ఉంది. దాని సమయం అది అన్పించింది. దాని స్వభావం అనిపించింది. మరి అది ఏ స్థితి? దానికి పేరు పెట్టమంటే ఆ పేరు నేను పెట్టలేను.

భా : ఆ ఏకత్వంలో ఉన్నావు కనుక నీ కట్లా అన్పిస్తుంది. ఆ ఏకత్వం రావద్దూ?

వీ.ప్ర. : సహజ సహనం కష్టమే తోచకపోవడం.

శ్రీపాద : కష్టంసుఖం అన్నీ సహించడం.

అమ్మ : ఇది వ్యవహార భాష, వేదాంత భాష అనీ మీరు విడదీసి చెప్పినట్లయితే వేరుచేయవచ్చు. సహజ సహనం అనేది లౌకిక భాష. తూర్యమనీ మహాతూర్యమనీ ఈ పదాలన్నీ ఏవేవో ఉన్నాయి. ఆ పదాలు నాకురావు తెలియవు.

భా : అవన్నీ తెలియకనేగా అమ్మ మిమ్మల్ని అడుగుతున్నది. పదాల్లో అనుభవం కాకనే ప్రత్యక్షంగా మిమ్మల్ని అడుగుతున్నది.

అమ్మ : ఏదీ బరువులేదు. ఏదీ అక్కర్లేదు అనుకోవడం లేదు. ఏది వచ్చినప్పుడు అది అనుభవించడాన్కి అడ్డులేదు. మీరు వేసే ప్రశ్నలేవో వేయండి. నాకు తడితే చెప్తాను.

భా : గీతలో కూడా నిందాస్తుతులను సమంగా తీసుకోవడం మీరు చెప్పిన మాటేగా.

అమ్మ : ఆ ఏమో అదేనా. అనేకమంది ఉన్నాం. అనేక మనస్తత్వాలు అవసర మయినాయి. అనేక విషయాలు అనేక రూపాల్లో చెప్పిఉండవచ్చు అందరూ. కాదనటానికి ఎట్లా నేను ఒకటి ఒప్పుకుంటాను. నాకు సుమతీశతకం దగ్గర నుండి ఆచరించడానికి ఒక్క – సుమతీశతకం చాలుగదా. ఏ ఉపనిషత్తులు ఎట్లా చెప్పినవో అర్థంగాదు. సమత సుమత అంటూ అన్నాడు. అది సాధ్యం కావటంలేదు. ఎవరు

చెప్పినా విని ఆలోచించుకోమన్నాడు గాని వేగిరపడమని చెప్పలే 'వినదగునెవ్వరు చెప్పిన' విషయాలు చెప్పాలి – వచ్చినప్పుడు ఆచరణకు ఏ ఒక్కటయినా చాలు. చదవడానికి చెప్పడానికి వచ్చిందిగనుక ఇవన్నీ పోగుచేసుకోవాల్సి వస్తుంది. ఆచరించడానికి ఒకటే చాలు. వీడి చేతిలో ఉంటే వదిలి పెట్టేవాడా? ఇన్ని పుస్తకాలు చదివి ఇంత వేదాంతం విని ఇంతమందికీ సేవచేసి ఆ ఒకటి చేయలేదా. ఆ పద్యం ఎప్పుడూ జీవితంలో గుర్తువస్తుంటుంది. అన్నాడో లేదో. నిజమో అబద్ధమో మనం నమ్మడం లేదా. అన్పించడం లేదా ఫలానావాడు మిమ్మల్ని ఇట్లా అన్నాడు అంటే, అనగానే.... ఆచరణకు ఒక్కటి చాలు. ఉన్నవ లక్ష్మీనారాయ గారితో మాట్లాడేటప్పుడు ఇదే వచ్చింది **1939** లో ఆగస్టు **8** న ఆయనతో సంభాషణ జరిగింది. మాలపల్లిని గురించి ఆయన ఏదో...ఆయన అతి మూత్ర వ్యాధితో మంచానపడిపోయాడు. మా లక్ష్మమ్మా లక్షమ్మా అని ఆయన లక్షమ్మతోనే తగాదా పెట్టుకున్నాడు. నేవెళ్ళి మీరు ఫలానాచోట ఉపన్యాసం ఇచ్చినచోట నేవచ్చాను అన్నాను. నీ వెవరు అన్నాడు. మీకు నీళ్ళు తోడిచ్చాను. చిదంబరరావు గారింట్లో ఉన్నాను. జీవుడి గురించి మీరు ఉపన్యాసం ఇచ్చారు. మీరు జీవుణ్ణి గురించి ఉపన్యాసమిచ్చిన దానికి, ఎందులోనో ఎత్తుకొని రాసుకొని ఇచ్చిన దానికి మాలపల్లి రాతకు ఎక్కడా పోలిక లేదు. అది మీరు ఇచ్చిన ఉపన్యాసం గీతలో నుండి రెండు మూడు శ్లోకాలు వ్రాయకుండా వ్యాఖ్యానమంతా వ్రాసి ఉపన్యాసం ఇచ్చారు. అది తిలక్ వ్రాసిన 'గీతారహస్యము' లోనిది. అందులోంచి తీసుకొన్నది. ఒకే విషయాన్ని ఏదేశస్థుడు ఏమన్నదీ వ్రాశాడు ఆయన. అవి తీసికొని చెప్పారు. నీవు ఇంత గుంటవే నీకు ఎట్లా గుర్తున్నదీ? అన్నారు గుంట అనే పదం ఎక్కడ నుంచి వచ్చిందో అది ఆయనకు గుంటూరు వాడికి తెలియదు. ( ఇది మా భాష కాదే అన్నా)

శ్రీపాద : విశాఖపట్నం మాట.

అమ్మ : నీకెట్లా గుర్తున్నదీ ఈ మాట అన్నారూ. ఇది మా భాష కాదే అన్నా. ఆ తరువాత మాలపల్లి చదివావా అన్నారు. ఎప్పుడో ఒకసారి చూశానండి అన్నాను. నాకు మీ నాయుడమ్మ, సంగదాసు, అప్పదాసు, లక్ష్మీరాందాసు అన్ని పాత్రల్లోకి ఆయన చిత్రించిన వాటిల్లో లక్ష్మిపాత్ర రామదాసు పాత్ర బాగాచిత్రించారు అన్పించింది. మోహన్రావు అక్కడ కులభేదం. అభిప్రాయాలు వాళ్ళని వీళ్ళు అనడం డబ్బుగల వాళ్ళ మీద ఈర్ష్య ఇవన్ని కూడా చూపించారు. ఇన్ని చూపించిన వాడికి ఇప్పుడు ఆమెతో తగాదా ఏమిటి? అన్నాను నేను. ఆయన కారణం చెప్పాడు. తరువాత సుమతీ శతకం చాలు. ఆచరించడానికి అని నేనన్నాను. ఊరక మీవంటి వారికి ఏమిటి? పుచ్చిపోయిన పెసరబద్దం కూడా ఆమె అదుక్కొచ్చి నిలిపింది దాన్ని. లక్ష్మినారాయణదని అనరు. శారదానికేతన్ లక్ష్మీ బాయమ్మ గారి దంటారు. ఆమె పిల్లలకు ఇవ్వమంటున్నది. మీవాళ్ళకు రాయమంటున్నావు. జీవుడి గురించి ఆత్మను గురించి ఉపన్యాసం ఇచ్చిన నీవు ఆస్తి కావాలను కుంటున్నావు. ఆమె శారదా నికేతన్‌కే చెందాలంటున్నది. ఈ రెండింటిలో ఏది ఎక్కువ అంటారు అని అడిగా? మొత్తం మీద ప్లీడర్ దగ్గర పెరిగినట్లే ఉన్నావే అన్నాడు. అప్పుడే కొంచెం బంధువులలో మొలకెత్తు తున్నది. ఏమిటది? ఆహారం లేకుండా ఎట్లా ఆ పని అంతా చేయగల్గు తున్నది. ఏమిటి అని ఆరా .... .... అత్తవారి వైపు ఆలోచన వచ్చింది. పులిపాక చలపతిరావు తదితరులకు. వంట లేకుండా పని చేయటం వండటం, పెట్టడం ఇదంతా చూచి – వాళ్ళు భోజనాలు చేసి పెళ్ళికి రమ్మన్నారు.
65 తరువాత.... .... ఆయన కూడా నిన్ను చూస్తుంటే ఎంత చూసినా చూడాలన్పిస్తుంది ఎందుకనీ అని అడిగారు. ఉన్నవ లక్ష్మినారాయణగారు ఎంత చూసినా నిన్నే చూడాలన్పిస్తున్నది ఎందుకమ్మా అన్నారు. నీలో

అంత ప్రేమ ఉంది అన్నారు. ఆ చూపులో ఏమున్నదో అన్నాను నేను. ఎంత చూచినా చూడాలన్పిస్తుంది. ఎంత సేపయినా మీ దగ్గర కూర్చోవాలని నాకు లేదు. కాబట్టి ఆ చూపులో ఏ మున్నదో? అని నేనన్నా. నాకు లడ్డు తెచ్చిపెట్టు అన్నారు. ఎవ్వరూ తీపి పెట్టడంలేదు. డయాబిటీస్ ఇచ్చ దానిమీదకే పోతుందిగదా! ఇంకొక దాని మీదకి పోదు. అతి మూత్రవ్యాధితో మంచంమీద ఉన్నారు. వెంటనే 20 లడ్లు తీసుకెళ్ళా.

ఏ ముంది. అది ఒక కోరిక ఎందుకూ అని ఆయనకు తీసికెళ్ళి 20 లడ్లు ఇచ్చాను. 20 లడ్లు తిన్నాడు గుంటూరులో మరిది పెళ్ళికోసం చేసినవి వారి ఇంట్లో పెళ్ళి జరిగింది. వెంటనే నేను ఇటు వచ్చాను - ఆయన అటు పోయారు.

భా : కనుకనే

అమ్మ : చెవిటివాడికి మాట వినపడటంలేదు. అప్పుడేం చేస్తుందని అడిగాడు.

భా : చెవిటివాడికి ఇంద్రియ లోపం.

అమ్మ : చెవుల ద్వారానే వినగల్గుతున్నాడా. మనస్సు ద్వారానే వినేదైనా ....

భా : ఇంద్రియాలు వాటికి తోడు లేకపోతే ఎలా?

అమ్మ : వాటి ద్వారా వినగల్గుతున్నాడు దాని ద్వారా చూడగల్గుతున్నాడు గనుక మనసుకు ఎంత విలువ ఉందో శరీరానికీ అంతే విలువ ఉందన్నాను నేను. నాకు తేడా కనిపించడం లేదు. ప్రధానం అది గావచ్చు.

వీ.ప్ర. : స్వతంత్ర సత్తా లేదా?

అమ్మ : సత్తా అనేది మనసుకూ శరీరానికీ కలిపేశాను. వేరుగా చూడటం లేదు. ఎందుకు ఒకరు అడిగితే నాకు ఈ సమాధానం వచ్చింది. వినేది చెప్పమన్నారు గదా! చెముడు వచ్చి నప్పుడు అయితే గ్రహించేది ఒకటే నన్నప్పుడు చెముడు వచ్చినా గ్రహిస్తాడు. గుడ్డితనం వచ్చినా గ్రహిస్తాడు. ఏరకమైన అవిటి తనం వచ్చినా గ్రహించేది మనసే కనుక

గ్రహింపు ఉంటుంది. దాని ద్వారా జరగదు ఆపని. ఆ ఇంద్రియం ద్వారా జరుగదు గానీ గ్రహిస్తాడు.

భా : గ్రహించేది మనసేగా ?

అమ్మ : గ్రహించేది మనసే గనుక అది గ్రహిస్తుంది. కానీ ఈ ఇంద్రియాన్ని ఈ వస్తువును ఉపయోగించుకోడు. ఉపయోగపడదు వాడికి. పడక పోయినంత మాత్రంచేత వాడికి గుర్తుపోలేదు. అన్ని పనులు గ్రహించేశక్తి ఉంది వాడికీ మూగవాడు ఉన్నాడు. సంజ్ఞలతో గ్రహిస్తాడు గుడ్డివాడు ఉన్నాడు. చెవులతో వింటాడు. స్పర్శతో గమనిస్తాడు వాడు. అందుకే లేవలేని వాడికి మనిషి సహాయంగానీ, గుడ్డి వాడికి మనిషి సహాయం ఎంతవరకంటే దారి చెప్పటమే గానీ వాడికి ఓపిక లేదని బలవంతంగా లేపుతుంటారు కొంతమంది. వాడికి కనబడనంత మాత్రాన శారీరక శక్తి నశించాలా – వాడు లేవగలడు, నడవగలడు, దారి చెబితే చాలు. ఈ వాడు బాధపడతాడు పాపం, వీళ్ళకు కుదరదు. గ్రహించే శక్తిపోదు.

భా : దేని శక్తి దానిదే.

అమ్మ : దేని శక్తి దానిదే అయినా గ్రహించే శక్తి ప్రధానంగా ఇస్తున్నారు మీరు, అయితే నేను అన్నింటికి ఒకటే కలుపుతున్నాను. అవయవ లోపం వల్ల కొరత ఉంటుందిగా!

భా : అందుకేగా ఏర్పడిన ఇంద్రియాలు, ఆ మనసు అన్నింటితో కూడుకొని

అమ్మ : ఇంద్రియాలకు ఆ వృత్తి పోవటంగాదు. చిత్తవృత్తి నిరోధం అంటున్నారుగా!

భా : ఇంద్రియాలకు విషయాలు గ్రహించే శక్తి వాటికి ఉంది. శక్తి ఉన్నదంటున్నారు – శక్తి పోయిందంటున్నాం.

అమ్మ : కాబట్టి మిగిలింది. తరిగింది, పెరిగిందీ ఉన్నదంతా శక్తేనంటున్నాం. దాన్నే ఆత్మ అంటున్నాం. ఆత్మకు మార్పు లేకపోలేదు అంటున్నాను. ఎట్లా మార్పు అంటే ఇట్లా మార్పుగా ఉంది. చెట్టుగా, గుట్టగా, కాయగా, పిందెగా, ఒక కాలంలోనే పూలుపూయటం. ఒక కాలంలోనే కాయలు

గాయటం - మామిడి చెట్టువుంది - అది వేసవి కాలమే కాస్తుంది. దాని ఋతువులోనే అది గాస్తుంది. తరుణం రావాలి అనే దానికి నే చెప్పిన అర్థం అది ఏమిటి? అమ్మ అన్నింటికీ తరుణం అంటుంది. కాలమంటుందేమిటి? అంటే సమయాన్ని కాలం అన్నాను.

భా : దాని మీద ఆధారపడి ఉండలేదు. అందుకే ఇన్ని తికమకలు.

అమ్మ : అందుకే అది ఆత్మ అన్నా, వాటి అన్నింటికీ తరుణ మెట్లా ఉన్నదో ఈ మనసుకు తరుణ మట్లా ఉన్నది. ఈ మనసును ఆత్మ అనటానికి కారణం అదే, దీనికీ తరుణముంది. తరుణమొస్తే గానీ రాలేక పోతున్నారుగదా! మనసేగా! తనువును కదిలించింది తనే. ఆ తనువునే మనసు కాలంవస్తేనే గానీ కదిలించ .........

భా : అన్నీ కూడుకోనే ఉన్నవి.

అమ్మ : అన్నీ కలసే ఉన్నది. ఏది అని విడదీద్దాం? మనం. ఈ అవయవాల్లో ఏది ముఖ్యం అంటే ఏదని చెబుతాం. ఏది అవసర మైనప్పుడు అది ముఖ్యమనిపిస్తున్నది. అందుకే 'అవసరం విలువైనది' అని అన్నాను.

భా : అర్థం గావటం లేదు.

అమ్మ : ఏది ఎక్కువో, ఏది తక్కువో నాకు ఈ జగత్తులో అర్థం గావటం లేదు. ఏది అవసర మైనప్పుడు దానికి విలువ ఇస్తున్నాం. పని మనిషి అవసర మైనప్పుడు ఆ మనిషికి విలువ ఇస్తున్నాం - ఒకప్పుడు చూస్తేనే అసహ్యమవుతున్న మనిషి - చూడకూడదనుకున్న మనిషిని, ఎప్పుడెప్పుడు చూద్దామా అని తపన కలగవచ్చు. ఒకరోజు కత్తి పెట్టి అయినా సరే పొడిచి చంపేద్దామనుకున్న మనిషి ఇంకొక రోజు ఎవరన్నా పొడిస్తే చూడలేని స్థితికి రావచ్చు.

శ్రీపాద : గనుక దానికీ మార్పు ఉన్నది.

అమ్మ : మార్పు ఉన్నట్లుగ అనిపిస్తున్నది నాకు. నా అనుభవంలో అన్పించి చెబుతున్నాను.

వీ.ప్ర. : ఇంద్రియం అదికాదుగానీ అది లేకపోతే పని జరుగదు.

అమ్మ : జరుగదు కనుకనే నేను రెండూ అదేనన్నా. రూపం వచ్చినదనుకో శరీరంతో వచ్చినప్పుడు చేసినవే మనకు ఆధారంగా ఉన్నవి. తర్వాత భక్తుల అనుభవరీత్యా ఉన్నాయిగానీ - వీడి భక్తి ప్రభావం గానీ - వాడి దృష్టి ప్రభావంగా అనిపించడం లేదుగదా! ఎవరిని కొలిస్తే వాడే కనబడటం ఎందుకూ?

సో : అప్పుడు కూడా చూచేవాడి ప్రభావమే.

అమ్మ : చూచేవాడి ప్రభావమేనని నేనంటాననుకో తగాదాకు రాకుండా. ఎందుకంటే ఉన్నప్పుడు పదివేల గోపికల దగ్గర ఒక కృష్ణుడు వచ్చినట్టుగా తెలుస్తున్నదిగా! ఉన్నప్పుడు కొన్ని భావాలు జరిగినట్టుగా - పోనీ మహిమలు చేసినట్టు తెలుస్తున్నది. వాడిని చంపినట్టో - వీడిని చంపినట్టో. అది అనుకో లేదుగదా మనం, కృష్ణుడు సత్యభామను తేసికెళ్ళి నరకాసురుని - ఒక దుర్మార్గుని చంపితే అది హత్య అనుకొని ఆయనకు ఉరిశిక్ష వేశారా? దుష్ట శిక్షణ అనుకున్నాం మనం. మన అందరం ఈ నాటికీ పండుగలు చేసుకుంటున్నాం. అది మంచి పనిగా అనుకుంటున్నాం చెడు అనేది ఒకటి ఉంది. ఆ చెడు నశింపచేసిన వాడను కుంటున్నాను నేను. చెడు నశింపచేసిన రోజు లేక - దుర్మార్గాన్ని చంపగలగటమే చంపించి యుండవచ్చు. మనిషిని చంపితే ఆయనకు దోషముండదా? పుట్టి ఉంటాడు గాబట్టి చంపటంలో లేదా? చంపటములో కుడా అట్లా తీసికొని బాణాలువేసి చంపటమా? ఎట్లా చంపినా చంపడము కాదా? పుట్టించినవాడే గిట్టిస్తాడని - సిద్ధాంత మేమిటి? బాణంతోనే కొట్టవలసి వచ్చిందా? ఇక్కడ ఉండి సంకల్పిస్తే చావదా? ఇవన్నీ అడిగే వాడికి ప్రశ్నలేగదా? పరంపరగా మొదలు పెడితే అనేకం. అట్లా అని ఇప్పుడు ప్రపంచములో దుర్మార్గుడిని చంపితే శిక్షవేయకుండా ఉన్నారా? దొరికిన వాడిని వేస్తున్నారు. చంపిన

వాడిని వేస్తున్నారనుకోను నేను. దొరికిన వాణ్ణి. ఒకడు చంపవచ్చు. ఒకడు దొరకవచ్చు. మంచిగా కనబడుతూ ప్రాణం తీయవచ్చు. అన్నం పెడతారమ్మని విషం పెట్టవచ్చు. ఎవడు దొరుకు తున్నాడు? వాడు తప్పుకు వాడే ప్రపంచంలో ....? కాలేదుగదా?

భా : అది అంతా కర్మ అనుకోవడం.

అమ్మ : ఆ కర్మ పూర్వజన్మ కర్మ, క్రిందటి జన్మలో వీడేమైనా చంపి ఉంటాడు. మళ్ళీ వీడు చంపి ఉంటాడు. అంతకు ముందు జన్మలో వాడు... ...

శ్రీపాద : మొదట ఎవడు చంపాడు? ఆ మాట అడగవద్దు.

అమ్మ : అది విత్తుముందా? చెట్టుముందా? అన్నట్లు వస్తుంది.

భా : మొదట పుట్టినవాణ్ణి ఇప్పుడు వాడు ఏం తెలుసుకుంటాడు. అనేటట్లయితే.

అమ్మ : మొదట పుట్టినవాడు ఇప్పుడు లేదు అంటే మొత్తం దెబ్బతింటుంది మొదట సృష్టించిన వాడు లేదు.

భా : మొదట వాడు ఎవడు అని అడిగి నప్పుదు.

అమ్మ : చెప్పలేదుగా! పూర్వజన్మ వాసన ఉన్నదో లేదో తెలియదుగాని నాన్నా

సో : ఈ వైవిధ్యానికి కారణాన్ని అట్లా ఊహించారు లేకపోతే వైవిధ్యం రావాలి అని చెప్పడంకోసం.

అమ్మ : కర్మ సిద్ధాంతం కూడా అంతా కలిపితే సమిష్టి కర్మ అయితే కేవలం ఆదరణకు ఉపయోగపడుతుంది. సమిష్టికర్మ ఒకటేనని నా అభిప్రాయం. ఆ మనీషి మనిషినే వీడుకర్మ ఏర్పరిచేటప్పటికి ఆదరణ కోసం ఏర్పడ్డట్లుగా నాకన్పిస్తుంది, ఒకడు బాధపడుతున్నాడు. ఏమీచెయ్యలేను. మందులవల్ల నయం కావటంలేదు. బాధపడు తున్నాడు. వాడికి తృప్తి ఎప్పుడు కల్గుతుందంటే 'నాయనా ఏజన్మదో అనుభవిస్తున్నావు. ఈ జన్మలో వాడేం చేయలేదు. మనకు కనిపించ లేదు - మంచి పని చేశాడు కొన్నివేల మందికి అన్నం పెట్టిన వాడికి అన్నం లేకుండా పోతున్నది. లక్షల జనానికి అన్నం పెట్టినవాడికి అన్నం లేకుండా పోతున్నది. ఇష్టం లేనివాడి కోసం బాధపడం - ఆకలి ఉండి తినాలనిపించి అన్నం

లేనివాడిని గురించి ఆలోచిస్తాం. మనం వాడు అన్నంలేని వాడంటే, అన్నం లేని వాడంటే జబ్బుచేసి లంఖణాలు చేసిన వాడుగాదు. ఆకలి ఉండి తినాలనిపించి ఏకారణాలతో నైనాసరే తినవద్దు అని శాసించే వాడొకడుంటాడు, శాసనానికి బద్ధుడైన వాడుంటాడు. బద్ధుడు కావడమంటే బద్ధుడుగా ఉందామనుకుంటాడు. రకరకాలుగా ఉంటారు. వాడు అన్నంతినలేదనుకో బాధ అనిపించదు. కానీ ఆకలై, తినాలనిపించి అన్నం దొరక్క ఇంకొక కారణంగా గానీ బాధపడితే వాడి గురించి మనకు బాధ ఏదీ? అది జ్వరమొస్తే డాక్టరువచ్చి 20 రోజులు అన్నం పెట్టవద్దు అన్నాడనుకో'. వాడు దరిద్రుడే అనుకో మంటావా. లక్షాధికారే ఒక లక్షాధికారి నెలకు నాల్గువేలు సంపాదిస్తూ బాపట్లలో చిట్టుదుకు నీళ్ళు తాగేవాడు వాడిని గురించి జాలి పడుతున్నావా! సందాకవళం తల్లీ అని అడుక్కొనేవాడు ఆ కేకలోనే ఉట్టిపడుతుంది మధురం – ఆ అడగటంలో. నాకు ఆకేక మహా ఇష్టం. తగ్గిపోయారు ఇప్పుడు అలాంటివాళ్ళు.

భా : అవిద్యఅనో, మాయఅనో, కర్మఅనో ఎన్నో వాళ్ళుచెప్పారు. వాటివల్ల తృప్తిపడి విచారణ చేసుకుంటున్నారు. కర్మగాక, జన్మగాక......

అమ్మ : పోట్లాడకుండా ఉన్నారా? ఏదన్నా విషయం వచ్చినప్పుడు మనిషేకారణం అనుకోకుండా కర్మని నమ్ముతున్నారా? కర్మ ఆధారం అని నమ్మినవాడు – నేనువచ్చి నీ మీద ఒకదెబ్బవేసి పోతాను. కర్మ కొద్ది అనుకొని ఊరుకుంటే, కర్మ సిద్ధాంతాన్ని నమ్మితే చాలా సంతోషిస్తా. నా కర్మే కొట్టించింది అనుకుంటే నీకు ఏదన్నా నష్టం కల్గించినప్పుడు వ్యక్తి మీద విరోధం వస్తుంది. కర్మా ఎగిరి పోతుంది. నీ కర్మ కొద్దీ నిన్ను కొడితే వాడిమీద కోపం ఎందుకు? వాడిమీద కోపంరావటం కూడా కర్మేనా? సుకర్మ – దుష్ట కర్మఅని విడదీశారు అందులో. ఎక్కడ తప్పు ఎక్కువ ఉంటే ఆ తప్పును ఖండిస్తూ కర్మను మర్చిపోయి ప్రవర్తిస్తున్నాం మనం. ఎక్కడ ఇష్టమయితే అక్కడ కన్పించటం లేదు. ఏ పని చేసినా కర్మే

అనుకోనప్పుడు, ఇష్టం - కష్టం అనేవి రెండూ ఉండకూడదు. కర్మ సిద్ధాంతరీత్యా కేవలం ఆదరణ కోసం ఉపయోగ పడుతుందనుకుంటే పిల్లవాడికి జబ్బు చేస్తుందని దగ్గర మిఠాయి పెట్టుకొని లేదునాన్నా ! ఉష్ కాకి అన్నట్టుగా ! ఏ పూర్వజన్మ కర్మ నాన్నా ! అంటే అదరణకోసం ఉపయోగ పడుతుందంటే. చేయూతలాగా సరే. ఏమయ్యేటట్టాఅని అడుగుతున్నారు గనుక, జన్మ లేదంటే నీవు ధైర్యంగా ఉంటావా? కర్మను నమ్మి కోపం లేకుండా ఉంటావా? ఈ రెండూ ఉండాలిగా ! నీవు ఇంతావాడు కనబడితే అడిగేదేమిటి? పుట్టకుండా చేయమనే గదా! ఇంత ప్రార్థించి ఇన్నీ చేసి ఉపోషాలు చేసి. యోగాలు చేసి వీళ్ళ అందర్నీ వదలుకొని అన్నీ చేసిన తరువాత సిద్ధాంతరీత్యా వాడుకనబడితే మళ్ళీ పుట్టకుండా పోవటం. మరి పుట్టడు అని నేనన్నాను. నమ్మలేదు. ఒక పుట్టుక కోసమే బాధపడితే.... ....

భా : పుట్టకుండా చేయమని తపస్సు చేసి పుట్టకుండా చేస్తాడా?

అమ్మ : అనేగా మనం అనుకోవడం.

భా : కర్మలు అనేవి ఉంటే వీడిని పుట్టకుండా ఎలా చేస్తాడు?

అమ్మ : వాడు కన్పించిన తరువాత నీకు బాధలనేవి ఉండవనిగా! ఆత్మ సాక్షాత్కారం అయితే జన్మరాహిత్యం అవుతుందనేగా........

భా : ఆత్మతానే అయితే సాక్షాత్కారం ఏముంది అక్కడ?

అమ్మ : సరియైన మాట సాక్షాత్కారం అంటూ లేదు. ఆత్మే తానైనప్పుడు సాక్షాత్కారం అనే పదం వట్టిది అని ఒప్పుకుంటారా? సాక్షాత్కరించి నపుడు వాడు వేరు, వీడు వేరు.

భా : విచారణాంతములో, తేలేదది.

అమ్మ : తేలేదది. తేలిన తరువాత జన్మలేదుగా!
అది లేదనే భావమా? లేదనే దృశ్యమా?

భా : లేదనే దృశ్యం కాదుగా.

# అమ్మ - రాఘవరావు మామయ్య

## 6-7-76

వీ.ప్రసాదరావు : అమ్మ పుట్టినప్పుడు ... ...

రాఘవరావ మామయ్య : దేవాలయం దగ్గరనుండి ఇంటికి వచ్చేటప్పటికి మా అమ్మ నీళ్ళాడింది అని తెలిసింది. అంటే నీళ్ళాడ్డానికీ - ఇంటికి రావటానికి కారణమేమిటంటే కిష్టయ్యగారి ఇంటికి క్రిష్ణశర్మగారు రా ు. ఆయన పీఠం వేసుకొని కూర్చొని అక్కడ పీటలమీద కూర్చోనేవా ు. వీరు రారు గంగరాజు చలపతిగారు వస్తున్నారు అనేటువంటి మాట తెలిసింది. కారణమేమిటి అంటే మన్నవ సీతాపతిరావుగారి భార్య నీళ్ళాడింది అన్నారు అదివిని ఇంటికివచ్చా. వచ్చేటప్పటికి అమ్మకా స్త్రా - నురగలు గక్కుతూవుంది.

వీ.ప్ర. : అమ్మ చిన్నప్పటి గాధలేమన్నా .... .....

రాఘవ : అప్పుడప్పుడివి కొన్నిగుర్తు ఉన్నాయి. కానీ క్లియర్‌గా గుర్తు ఏమిటంటే అమ్మ మెళ్ళో ఆంజనేయస్వామి బిళ్ళ ఉండేది. ఆంజనేయస్వామి బిళ్ళ తీసికెళ్ళి వీరాస్వామి అనేవాడికి ఇచ్చి అమ్మించాలని ప్రయత్నం చేశాను. వాడు కొట్టాడు. వెంటనే నన్ను పట్టుకొన్నారు. వాడి దగ్గరకు వచ్చేటప్పటికి ఇవ్వలేదు అన్నాడు. తర్వాత మా అమ్మగారు చనిపోయే రోజున - నాకు 14వ ఏడు. అమ్మకు ఐదవ సంవత్సరం. మాకు 9 ఏళ్ళు తేడా....

వీ.ప్ర. : రంగమ్మగారిని తేసికెళ్ళేటప్పుడు అమ్మ అక్కడే ఉన్నది గదా!

రాఘవ : ఔను. నేఏడ్చి గందరగోళం చేసి మా అమ్మది పట్టుపట్టి ఫోటో తీయించుకున్నాం.

వీ.ప్ర. : అమ్మ సంభాషణ అప్పటిది గుర్తు ఉందా మీకు?

రాఘవ : గుర్తులేదు. నాకవి పట్టేవిగావు. నాకీ దృష్టి ఉండేదికాదు. అప్పుడుకొట్టే వాణ్ణీ, తిట్టేవాణ్ణిగూడా.

వి.ప్ర. : కొట్టినప్పుడు ఆమె మాట్లాడేది కాదా? ఏడ్చేవారా?

రాఘవ : దేనికీ మాట్లాడేది గాదు. ఏడ్చినట్టు గుర్తులేదు.

వీ.ప్ర. : గద్దించేవారా ఎవరన్నా?

రాఘవ : ఎవరూ లేరు. నాకు ఇష్టంలేని పనిచేసినా, నా దృక్పథానికి వ్యతిరేకంగా కనబడితే నేను తప్ప మరెవ్వరూ ఏమనేవారుగాదు. తర్వాత పెళ్ళిఘట్టం బాగా గుర్తు

వీ.ప్ర. : అమ్మ వివాహంలో మొదట అనుకున్న దెవరండీ? నాగేశ్వరరావుకు ఇస్తే బాగుండును అనే ప్రస్తావన వచ్చింది ఎప్పుడో మీకు తెలుసా?

అమ్మ : నేను తెనాలిలో ఉండగా మా తండ్రి ఉత్తరం వ్రాశారు. మా తాతగారి ఇంట్లో ఇస్తే బాగుంటుందని మా తండ్రిగారు వ్యక్తం చేశారు. కానీ నేను అప్పుడు దీర్ఘంగా ఒక ఉత్తరం వ్రాశాను. మా తాతగారు ఆ పెళ్ళికయ్యే వరకట్నం తను పెట్టుకుంటారు. పెళ్ళిఖర్చు అంతా పెట్టుకుంటారు మీరు సంబంధం నిర్ణయించండి అని – అనవలసిందా నాడు. తెనాలి తాతగారు. కొడుకు కొంచెం ఇల్లుపట్టకుండా తిరుగుతుండే వాడు ఆయన వృద్ధుడై దయాబిటిక్ పేషంటు అయి ఎక్కువ బజార్లు తిరుగలేకుండా ఉండేవాడు. అప్పుడు మా తండ్రికి ఒక ఉత్తరం వ్రాశాను. తాతగారు ఇట్లా అంటున్నారు. మీరు సంబంధం నిర్ణయిస్తే బాగుంటుందని... ఆయన తిరిగి చేయలేదు గదా అని – అంతా ఆయననే బాధ్యత వహించమన్నారు. మా నాన్నగారు. అది బాగుందని వ్రాశాను. వరకట్నం ఇచ్చి కలవారి ఇంటఇస్తే బాగుంటుందని.

వీ.ప్ర. : మరిదమ్మగారి అభిప్రాయం ఉండేదా?

రాఘవ : బాగా ఉండేది. నాగేశ్వరరావును బాగా పెంచింది గనుక ఆమెకు చిదంబరరావుగారికి ఉండేది.

వి.ప్ర. : [illegible]

రాఘవ : భరించాలా. కలవారింటికి ఇస్తే వారు ఖర్చుపెడతానన్నారు గానీ ఈ సంబంధానికి గాదు. చివరకు ఇక్కడ నిశ్చయించమని మా నాన్న ఉత్తరం వ్రాశారు నాకు. నిర్ణయించబడ్డది గనుక నేనూ వచ్చాను.

వీ.ప్ర : వివాహం కాగానే చాలా జబ్బు చేసింది. (అమ్మకు) మన్నవలోనే. నా కార్యమునకు అమ్మ కార్యమునకు రెండు రోజులు తేడా. మన్నవలో ఉండగా వస్తూ, పోతూ ఉండేవారు ఆ దశలు కూడా చెబుతుండేవారు నాచెల్లెలికి, నా భార్యకి హిందీ అక్షరాలు నేర్పమన్నారు. గుణింతాలు వస్తే మెల్లగా నేను అభివృద్ధి చేసుకుంటానని, సాయిబుగారు, అమ్మాయిలూ! మీఇద్దరూ ఇటురండి అని పిలిచారు – వచ్చారు. చిన్న భగవద్గీత ఒకటి ఉండేది. చదవమని నా భార్యకు ఇచ్చాడు. ధర్మక్షేత్రే ... ... అన్న శ్లోకం గడగడా చదివింది. ఏవమ్మా ఎప్పుడన్నా చదివావా ఈ శ్లోకం అన్నాడు, చదవలేదండి. అప్పుడు ఇంకొక శ్లోకం ఇచ్చారు, అది చదివింది. ఇంకొకటి ఇచ్చాడు, అదీ చదివింది. తర్వాత నా చెల్లెలికి ఇచ్చాడు. అది శ్లోకం ఒక్కొక్క అక్షరం కలుపుకొని చదివింది ఇల్లా వాకిలీ పట్టకుండా తిరుగు తుండేవాణ్ణి. విద్య ఈస్థితిలో ఇంతహీనంగా ఉందా అని నేను చాలా ఆశ్చర్యపోయాను. తర్వాత హిందీ అక్షరాలు గుణింతాలు నేర్పారు. నాభార్య వెనుకబడ్డది. మెల్లగా సంస్కృత పదాలు కొద్దిగా నేర్చుకుంది. అక్కడినుండి కాపురానికి వెళ్ళింది. మొదట్లో బాపట్లలో ఉండేది.

వీ.ప్ర : బాపట్లలో ఎంతకాల మున్నారు?

రాఘవ : రెండు సంవత్సరాలు

వీ.ప్ర : చిదంబరరావుగారి ఇంట్లోనా?

రాఘవ : వేరుగా ఉండేవారు. నేను ఒకటి రెండుసార్లు వెళ్ళాను.

వీ.ప్ర : ఎవరెవ రుండేవారు ఆయింట్లో?

రాఘవ : బొమ్మ, నాగేశ్వరరావు, లోకనాధం, నాగేశ్వరరావు చెల్లెలు. తరువాత జిల్లెళ్ళమూడి వచ్చారు. ఇక్కడికి వచ్చిన తరువాత మంత్రాయి అని జీతగాడు ఉండేవాడు. జిల్లెళ్ళమూడి నుండి వార్త వచ్చిందంటే గుండెలు ఆగి పోవటమే అప్పుడు. సాదావార్తలు ఎప్పుడూ వచ్చేవిగావు. గర్భంపోయిందనో, చాలా ప్రమాదంగా ఉందనో, ఏదో ఇట్లాంటి వార్తలే. నేను వస్తూ – పోతూ తిరుగుతుండే వాడిని. మంత్రాయితో – ఇక్కడ గ్రామ పాలన అనే పుస్తకం తప్ప ఇంకో పుస్తకం చదివేందుకు ఉండేది గాదు.

వీ.ప్ర : ఎబార్షన్ జరిగిన తరువాత మన్నవ తీసికెళ్ళారా?

రాఘవ : ఔను.

అమ్మ : **10**వ నెల తీసికెళ్ళారు. ఆనాడు ఆయింటి పేరు గలవాళ్ళు పోయారు. వారి అత్తగారు. మామగారు ఉన్నారు. మన్నవ చిన్నయ్య గారింట్లో కాపురమున్నారు నాన్న – అన్నయ్య వేరుపడ్డ తరువాత నేను వెళ్ళలేదు. వెళ్ళడం అదే వెళ్ళడం అన్నయ్య వచ్చి నన్ను తీసి కెళ్ళడం – రెండు నెల్లు ఉందువు గానీ సామాను తీసుకురమ్మని తీసుకెళ్ళాడు. ఆ రోజు – అన్నయ్య నన్ను తీసికొని వెళ్ళే రోజు గాలిబ్ సాహెబ్ పెళ్ళి. కొల్లిమర్లలో మా వదినగారి మేనమామ ఒక ఆయన ఉన్నాడు. ఒకాయనకు T.B. వచ్చి యున్నది ఒకాయన కులాసాగా ఉన్నాడు. ఒకాయన పేరు పుల్లయ్య అనుకుంటా? ఔనా?

రాఘవ : చిన్న పుల్లయ్య.

అమ్మ : ఒకాయన సుబ్బారావు, రెండు ఇళ్ళకు వెళ్ళాను. ఆ ఊరుకు దాదాపు మధ్యాహ్నం **12** గం॥కు చేరాము. కొల్లిమర్ల అనే ఊరు పడవలో తీసికెళ్ళాడు నన్ను. ఇక్కడ నుండి రెండు ఎడ్లబండిలో మంత్రాయి అప్పాపురం తీసుకెళ్ళాడు. అక్కడ నుండి బోటులో కొల్లిమర్ల లాకులో దిగాము. సాయంకాలం **4** గం॥ వరకు అక్కడ ఉన్నాము. స్నానంచేసి

పిల్లవాడిని తీసికొని మన్నవ వెళ్ళాము. నడవటం అనంటే పెద్ద లెక్క లోది గాదు. చావలి సుబ్బయ్య బండి రమ్మంటానంటే వద్దులే కాస్తదూరం అన్నాను. అబ్బాయిని అన్నయ్య ఎత్తుకున్నాడు. ఇద్దరం కలసి వెళ్ళాం. 10 నెలల వాడికే చాలా చురుగ్గా మాటలు వచ్చు. పిల్లల్లో సుబ్బారావునే చెప్పాలి. అంత త్వరగా పిల్లల్లో మాటలు వచ్చిన వాళ్ళు ఎవరూ లేరు. 10 నెలల వాడు ఇంటి పేర్లతో సహా పలికేవాడు. పొలము పొలాల నెంబరు చెప్పేవాడు. అంతచురుకు. నేను ప్రొద్దుగూకి వెడుతూంటే తను వేసిన పొట్లపందిరి, కాయలు తలనే తగులు తుండేవి. ఇన్ని పాములా అనిపించేటట్లు ఉండేది. అదంతాసరే - లోపలి కెళ్ళి. వీళ్ల అత్తగారు కురుపులు వచ్చి మంచములో పడుకున్నారు. సుస్తీగా ఉన్నారు. లోపలికి వెళ్ళగానే ఆ రాత్రి ఆమె వండి పెట్టారు. ఆమె దగ్గరకు పిల్చి పొద్దుపోయిన తరువాత ఈ రోజుకు మీ వదిన వస్తే చేసింది: రేపటి నుండి చెంబులు అంట్లు తోమమని చెప్పింది. వెళ్ళిన రోజునే నాకు పని చెప్పింది - అన్నయ్య విన్నాడు. వీళ్ళకు ఈర్ష్య ఉన్నది అని అన్నయ్య మనస్సులో పెట్టుకున్నాడో ఏమో నాకు తెలియదు. వాళ్లకు బాధ ఉందని తాను గ్రహించాడు. ఈమె ఇంకొకరి కైతే ఇట్లా చెబుతుందా అనుకున్నాడు గాబోలు - పులిపాక ఆదినారాయణ తాతయ్య పోయిన మర్నాడే రాఘవయ్యగారు పోయినారు. దాని తర్వాత ఎవరో పోయినారని కబురు 22 రోజులు దానితో సరిపోయింది. నీ వరకు వండుకొని పిల్లవాడికి పెట్టుకో. తతిమ్మా వాళ్ళకు వదినా వాళ్ళే చేస్తారు. నీవు చేయవద్దు అని చెప్పాడు. ఇది గ్రహించి వాళ్ళ కట్లా ఉంటుందని నాకే మనిపించలేదు. వీళ్ళ మామగారి లక్షణాలు. అంటే ఇట్లా ఉంటున్నారు గరికపాటి పొలం మన్నవ పొలం వ్యవసాయం చేస్తున్నాడు. బండి కట్టుకొని మర్నాడే 11వ రోజునే అన్నయ్య అక్కడకు వెళ్ళాడు. అప్పుడు బుర్రకథ వ్రాస్తున్నాడు. మంగళ పాండ్య; ఝూన్సీ లక్ష్మీబాయి - 42లో ముసుగువేసి చిరుకప్పులో

ప్రాణం వదులుతున్న చోట చాలా బాగుంది. తాను ఉండగానే పూర్తి అయింది. చెప్పటం కూడా మొదలు పెట్టాడు. కథ చెప్పేవాడు. అవన్నీ వేసుకొని – వాళ్ళ మామయ్య చెబుతుంటే – వీడు (సుబ్బారావు) చిటికెలు వేస్తుండే వాడు – ఇట్లా ఉన్నవాడికి ప్రథమంగా పాల ఉబ్బసం వచ్చింది. మొదటిసారి భయపెట్టింది. బాధపడుతున్నారు – నాన్నవచ్చి, నీకిష్టమైనప్పుడు వెళ్ళేలోగా నాల్గు రోజులు మా యింట్లో కూడా ఉండమని చెప్పారు. అక్కడ వారమో పది రోజులో ఉన్నాను. మొత్తం రెండు నెలలు ఉన్నాను. మన్నవలో కట్రపాటి లక్ష్మీనారాయణగారి బావి నీరు చాలా తియ్యగా ఉండేది. వీరంతా అక్కడ నుండి నీరు తెచ్చుకొనేవారు. నీళ్ళు తెచ్చేదాన్ని. మామగారికి అల్లుడికి ఏదో ఘర్షణ ఉంది. మధ్య నాకు తెలియకుండా నన్ను గురించి ఏదోవుంది. అప్పటికే – తరువాత ఒక ఎకరం వ్రాశారు నాకు వాళ్ళు. మామయ్య రాస్తే అమ్మమ్మ నేరాస్తానంది. అమ్మమ్మ వ్రాస్తే మామయ్య నే వ్రాస్తానన్నాడు. నేలేను ఆ సమయంలో. నాకు రాయటం జరిగింది. ఏమీ ఇవ్వలేదు. తల్లిసొమ్మంతా మనం వాడుకున్నాం అని – మామయ్య ఇచ్చారు. రెండు ఎకరాలు రాద్దామను కొని గరికపాటిది వ్రాశారు. **30** రు॥లు కొన్న ఎకరం **1200** రేటు రాగానే నాన్నగారు దాన్ని వదిలించేసి తనుకూడా ఇక్కడికే వచ్చారు. భార్యను పెట్టుకుందామా అని – హైమ **5** నెలల పిల్లప్పుడు నేను మన్నవ వెళ్ళాను. నల్లాఖాసింను పంపారు అమ్మాయిని తీసుకురమ్మని. – ఎందుకురా అంటే, కొప్పరపు కవులు తిరుమలకు వస్తున్నారని పిలిపించారు. కొప్పరపు కవుల తండ్రుల గురించిన పద్యాలు విన్నానుగానీ – వాళ్ళ కొడుకులచే ఎప్పుడూ వినలేదని, ఎందుకో ఒక నెలరోజులకై వెళ్ళినదాన్ని మూడో రోజుననే ఎందుకో వచ్చాను. కారణం తెలియదు. వద్దామనిపించింది, హైమకు కాలులో కురుపులు ఏవో వేసినవి. ఇక్కడికి వచ్చేశాను. తరువాత **12** ఏళ్ళదాకా నేను మళ్ళీ వెళ్ళలేదు. అదే ఆఖరు – కిష్టయ్య తాత కొడుకు భూషయ్య పెళ్లికి వెళ్ళాను.

# దైవత్వము - గుర్తింపు

## 6-7-76

అమ్మ : నాటకమే గదా, చీరాల వాళ్ళు మేనా మోస్తుంటే మన్నవ ప్రసాదు, సుబ్బారావు తండ్రి మేము వస్తామంటే మేము వస్తామని మొత్తం మీద అందరు కలసి అమ్మవారి దగ్గరకు వెళుతున్నాంగదా అని కుంకుమ, రెండు రవిక గుడ్డలు, పూలు, పసుపు తీసుకు వెళ్ళాను. ఏమీ లేదను కుండేది. అన్నీ ఉండేదను కుండేది - ఒకటే ఈ గుళ్ళో - ఈ విగ్రహంలో ఏ ముంది అని అట్లాగే అమ్మవారికి తీసుకెళ్ళాను పూలు, పండ్లు కుంకుమ

మహర్నవమి - నేనట్లాగే గడపలో నించున్నాను. అమ్మవారి చేతుల్లో నుండి పువ్వట్లారాలింది. లోపలికి రా! నించుంటావేం అనే భావం - పిల్చినట్టుగా ఉంది నాకు. వెళ్ళాను. అక్కడ గట్టు ఉంది. ఎత్తుగా ఉంటుంది. ఆ యంత్రం తీశాను. (పూజారి) ఆయనను పిలిచాను. యంత్రం తీసి ఆబీజాక్షరాలని చూపించాను. ఆ బీజాక్షరాలు పైన, క్రింద అంతా వ్రాసి ఉన్నది

సో : యంత్రం మంటే ఒక రేకులా ఉంటుందా?

అమ్మ : (చేతితో చూపించి) అంత వెడల్పున ఉన్నది.

సో : చిన్న అరలో పెట్టి ఉంటుందా?

అమ్మ : అడుగున ఉంటుంది.

సో : విగ్రహాన్ని ఎత్తి తీయాలా?

అమ్మ : ఎత్తితీయాలి. ఊరకే అలా ఎత్తి తీస్తే వచ్చింది. దాన్ని ఎవరూ శ్రద్ధగా చూడటం లేదు. సరే తీశాను. రాజరాజేశ్వరీ యంత్రమది స్పష్టంగ! అది నేను రెండేళ్ల పిల్లప్పుడో, ఏడాది పిల్లప్పుడో వేసింది (తన నుద్దేశించి) ఈమె కెట్లా తెలిసింది అని అడగొచ్చును. (పూజారి) ఆయన నామాలు చెబుతున్నాడు. నేను బీజాక్షరాలను చదువుతూ పోలంరాజు సుబ్బయ్య

గారితో కలిసి పూజ చేశాను, కుంకుమతో - (తన) ఈ చెయ్యి తెల్లగా పొడ వెక్కువైనట్టుగామా వదినగారికి, అందరికి కనిపించినదట. అయితే ఆ రోజున నా గొంతు ఎంత దూరం వినిపించింది అంటే ఊరంతా వినిపించింది. మైకులేదు. అత్తయ్య ఒకతే వచ్చింది గుడికి. నాన్నగారు మామయ్యగారింట్లో పడుకున్నారు. మేనా వస్తుందని అనుకొంటున్నాము. ఇంకా దూరం వినిపించిందన్నమాట. గుడి ఎక్కడ? వీళ్ళ ఇల్లు ఎక్కడ? అంటే ఎంత పెద్దగొంతు అయినా వినిపించదానికి మామూలుగ వీలులేదు. మొత్తం ఆ పూజ అంతా అయిన తర్వాతనే బయటికి వచ్చాను. మా వదినగారు మీరంతా లేవండి లేవండి అంటూ నా దగ్గరకు వచ్చి ఒక్కసారిగా గట్టిగా కౌగలించుకుంది. ఏడ్చింది. ఏడవటమంటే అది ఏడ్పు కాక పోవచ్చు. ఇటువంటి పిల్ల ఇంట్లో పుడితే మేము కనుక్కోలేక పోయాం గదా అన్న బాధకావచ్చు. ఇందాక చెప్పానే ఆ సంఘటన బాధేగా! కొట్టాడనుకో. చిన్నప్పుడు కొట్టారంటే అది ఆలోచనకాదు. సరైన ఆలోచనతో ఆలోచించని సంఘటనలూ ఊహ వచ్చిన తర్వాత అయినా జరగవచ్చు. అవి ఎవరికైనా రావచ్చు. అదే చెప్పాగా. తెలియబడితే తెలుసుకుంటారు గాని, తెలుసుకుంటే తెలియబడేది కాదు కాబట్టి వాళ్ళదేమీ దోషం కాదు. ఏదైనా సరే. నేకనపడితే వాళ్ళు చూస్తారు గాని కనిపించకుండ దాక్కుంటే వాళ్ళేం చూస్తారు. ఏ సంఘటనలు జరిగినా అందరిపట్ల ఎవరూ కారణం కాదని నేననుకుంటున్నప్పుడు ఇది వాళ్ళు కారణమనేముంది? చరిత్ర అవసరం కనుక ప్రపంచాని కందించాలని అనుకొని మీరడుగు తున్నారు కాబట్టి నే చెబుతున్నా. ప్రపంచాని కందించాలని అనుకుండే పదే పదే చెబుతున్నాను. ఒక బాధ కలిగినప్పుడు ఆబాధకు - నేను బాధనుకోలేదు. అనేది ఒక్కటి ఈబాధలు పడటానికి, భరించదానికి ధైర్యమొస్తుంది. ఈ చరిత్ర వింటే - అని అలా అనుకుంటే - ప్రతి మానవుడు ధైర్యంగ తిరగ గల్గుతాడు.

ఈ చరిత్ర విన్న మర్నాడు అనుకో గల్గిన నాడు చరిత్ర వ్రాయాలి. లేకపోతే అనవసరం. ఎవరికీ ఉపయోగించని చరిత్ర దేనికి? వాడు కొట్టాడు - వాడు తిట్టాడు. అదా? అదికాదుగా వాళ్ళకోసంగాదు. ఇతరుల కోసం. వాళ్ళల్లోమార్పు వచ్చింది. ఆమార్పు ఎటువంటి మార్పు అంటే ఎవరి చరిత్రల్లోనూ అత్తగారు కోడలిని దైవంగ చూచినట్టుగాని, తండ్రి కూతుర్ని దైవంగ చూచినట్టు గాని భర్తకు కూడ భార్య పట్ల (దైవం) అనే భావం కల్గిందని గాని తోబుట్టువుకు (దైవం) అనేభావం కల్గిందని గాని - అవి లేవుగా, అమ్మా అని గుర్తించని వాళ్ళం పం గుర్తించలేదెన్నడు కనీసం అని వారి బాధ. మౌలాలీ విషయం ఇప్పుడు గుర్తుచేస్తే గుర్తుకు వస్తుంది నాన్నగారికి. ఎవరో గ్రుడ్డివాడు, ముసలివాడు చదలవాడ సుబ్బారావుగారి ఇంటి ప్రక్కన అవతల సాయిబులపాటెం ఉండేది అక్కడ నుండి వాడితో నాకు పరిచయమున్నట్టు నేచెబితే మీకు జ్ఞాపకమొస్తుంది. ఈ అంకదాసు నాన్నగార్కి తెలియకుండ ఉండదు. కాని ఎందుకు పరిచయ ముంటుంది వాళ్ళతో? ఆ తాతయ్యగారింటి కొచ్చారే ఆ ముగ్గురని నే చెబితే గుర్తుకొచ్చింది. మా పినతండ్రి రామబ్రహ్మా మన్న మాట మరలా జ్ఞాపకం చేస్తున్నాను. అనంత లక్ష్మమ్మగారి చరిత్ర చెప్పడంకోసం .. కాని ఎందుకో. ఏదో ఒక సంఘటన - అన్నయ్య బాధించిన సంఘటనే ఈసారి నోరు ఎత్తావంటే దౌడ పగుల్తుందిరా అన్నాడు. రాఘవరావు మామయ్య అన్న రోజున ఆయన ఉద్రేకం, కోపం ఆ రోజుననే నేచూచింది. కోపముందనేది ఒక కారణ మొస్తేగదా బయటపడేది. ఆ రోజులు కూడ రాస్తాంగదా. రాసేటప్పుడు ఇవీరాస్తాం. అవీరాస్తాం. వాడికి వచ్చిన మార్పులు కూడా సోదరుడు పూజించుకోవట మనేది నామర్దా. పూజ చేయకూడదు. అమ్మాయికి జరగాలి. వీళ్ళందరిలో ఏ మున్నదంటే అమ్మాయి ఇంత ప్రచార మవుతున్నది. ఒకవేళ మాట్లాడ లేకపోతే అడిగిన వారికి సమాధానం చెప్పలేకపోతే ఎక్కడ నవ్వుతారోనని

దీని వెనక దాగి ఉన్నది. భర్తగారి దగ్గర నుండి, అన్నగారి దగ్గర నుండి, మరదిగారి దగ్గర వరకూ ఉన్నది. నాకింత మందిలో సరైన సందేశం ఇచ్చిన వాడు మా లోకనాధం. ఆపిల్ పండు ముక్కలు చేసి ముక్క వాడి చేతిలో పెట్టాను. చరిత్ర రావాలంటే వాడు కొట్టాడు. వీడు తిట్టాడు, వాడు హింస పెట్టాడు ఇట్లా రావాలని కాదు నా ఉద్దేశ్యం. ఈ బ్రతుకు భయం లేదు అనిపించ గలిగిన సంఘటనలు ఉండి వ్రాయించ గలిగితే ... ... వాళ్ళల్లో వచ్చిన మార్పును వ్రాయించాలి గాని – మార్పు లేకపోతే ఏముంది. – మార్పులొస్తున్నాయి గదా! అన్నయ్య ఎప్పుడూ ఇట్లా లేదు గదా. ఈ భావంతో లేదుగదా.

నాన్న : ఇప్పుడు పళ్ళు లేవు – అప్పుడు పళ్ళుండేవి

అమ్మ : ఎట్లా అయితేనేం పళ్ళూడి నన్నయ్య, కోరలు తీసిన అన్నయ్య, కోరలు ఉన్న అన్నయ్య అట్లయినా సరే. మరి బామ్మ ఉన్నది – ఆమె ఎప్పుడు ఎవరన్నా అంటే బాధపడటం తప్ప ప్రత్యేకమైన ద్వేషం, కోపం ఏమీ లేవామెలో.

రామకృష్ణ: ఆమె కాలానికి కట్టుబడినామె.

అమ్మ : అంతేగదా – ఎవరైనా అంతేగా అయితే ఎందుకు చరిత్ర నేనబద్ధం – చరిత్ర బద్ధమనన్నాను గనుక దానికేమిటి ఆధారాలు అని చెప్పమంటే – ఉన్నదున్నట్టుగా మన మన్నీ రాయాలి. వాళ్ళల్లో వచ్చిన మార్పులు కూడా రాయాలి.

రామకృష్ణ: అందరికి అవసరంలేదమ్మా. చరిత్రలో కొన్ని కొన్ని మార్పులు లేకుండ చివరిదాకా ఉండవచ్చు. మార్పున్న సంఘటనలే చెయ్యాలని లేదు.

వీ.ప్ర : చరిత్ర సమగ్రంగా ఉండాలంటే అన్నీ ఉండాలి.

రామకృష్ణ: మార్పు అందరికి సహజంగాదు. అందరికీ అవసరం లేదు

అమ్మ : జరగింది వ్రాసేటప్పుడు ఇట్లా అనుకొని వ్రాయాలి అనే నియమం లేదు. కథయితే అనుకొని రాయాలి.

వీ.ప్ర : మార్పు జరిగిన చోట మార్పు జరిగింది అని చెప్తే ఉపయోగం

అమ్మ : చరిత్రంటే కొన్ని దాటేసే దానికి అవకాశముంటే దాటేసుకోవచ్చు గాని – వ్రాయటానికిఎవరికైనా బాధకలుగుతుందనుకుంటే వాటేసుకోవాలి. ఎవరికి బాధకలిగినా అందరిలోనూ మార్పువచ్చింది మా నాన్నగారు, సుబ్బారావుగారు మౌలాలీతో మాట్లాడుతుంటే అనుమానించి చిదంబరరావు గారిని పిలిపించాడు. చూడరా!ఏమిటో! ఎవరితోనో మాట్లాడుతుంది అని, గొంతు వినబడి – మౌలాలీ అంధుడు నేను **12** యేళ్ళదాన్ని. మనసుకు అర్థం లేదు. ఈ కథంతా వ్రాస్తుంటే మంచీ, మార్పు, అనుకున్నవి, అనుకోనివివాళ్ళల్లో వచ్చిన మార్పు – నన్ను పరాయి వాళ్ళు గుర్తించవచ్చు. కాని ఇంట్లోవాళ్లు గుర్తించడం ఆలస్యమయింది గదా. నీవు దైవమనుకుంటున్నాంగాని కోడలిని అనుకోవటం లేదనడానికి కొంత కాలం పట్టింది గదా! కాని నిజానికి మంచి వివరణ. రాజుపాళెం రామచంద్రరావు గార్కి Information ఇచ్చింది బామ్మే. (రామకృష్ణ నుద్దేశించి) నిన్ను స్నానం చేయమని పోట్లాడి నాప్రక్కన కూర్చోబెట్టింది బామ్మే మరి అది వరకు ....

పోని నా ప్రక్కన కూర్చొని పూజచేయటం గుర్తుందా? ప్రక్కన కూర్చుని పూజచేయటం, కలశం పెట్టడం. నేను బీజాక్షరాలు చదవటం .... ....

**56** లో కొమ్మూరు డాక్టరుగారు రావటం అప్పుడే మొదలు. తర్వాత మన్నవలో కూడ చేశాను. ముందు చీరాలవారు (అర్చన) అమ్మకు చేయాలి అనేవారు. ఎందుకులే ముందు కలశానికే చెయ్యమని బామ్మ అనేది అట్లాగే మొత్తం మీద వీళ్ళ కోరికా తీరింది. వాళ్ళకోరికా తీరింది. రెండూ తీరినయ్యి. వాళ్ళేమో నాకు చేశారు. నేనేమో టెంకాయకు చేసేదాన్ని ఒక కాయ పెట్టి అక్కడ ... ...

బాపట్ల దేవాలయంలో పరిశీలించిన అమ్మే (మన్నవ దేవాలయంలో) ఆ అమ్మ వారికి చీర రవిక తీసుకెళ్ళింది. మన్నవలో అమ్మ వారికి మహర్నవమినాడు అన్నీ తీసుకెళ్ళింది. కాని బాపట్లలో భావనారాయణ స్వామి దేవాలయంలో అన్నీ విప్పి చూసిన అమ్మే - మన్నవలో గుళ్ళో అన్నీ పెట్టి చూసింది, ఆగుళ్ళో కాలు పెట్టడం మెరుపు రావడం గ్రహించిన కొమ్మూరు డాక్టరుగారు నాన్నగారు మామయ్య ఇంట్లో ఉన్నారు. అత్తయ్య ఒకతే వచ్చింది. మీరక్కడే ఉన్నారు. నేను మీరింటికి వచ్చిన తర్వాత చూస్తే ఇంతదూరం వినిపించిందన్నారు.

రామకృష్ణ: మెరుపు దేంట్లో నుండి వచ్చింది?

అమ్మ : ఒక నక్షత్రం రాలిన తర్వాత ... ... ఏముంది?

అమ్మ : ఆ ఆవరణలో అడుగు పెట్టగానే అంతటా ఒక మెరుపు మెరిసింది. అందరూ చూసిందే అది. ఆ గడపలో ఎక్కాను. ఆ పూవు విగ్రహంలో నుండి అట్లా రాలింది. నే లోపలి కెళ్ళాను. వెళ్ళి అక్కడ కూర్చున్నాను. ఎక్కడో అడుగున ఉన్న యంత్రం దానంతట అదే ఇలా అనగానే వచ్చింది. ఆ రోజుల్లో ఇంతకంటే బలంగ ఉండేదాన్ని. పోలంరాజు సుబ్బయ్య అనే ఆయన నామంచదువుతున్నాడు నేను పూజ చేస్తున్నాను. బీజాక్షరాలు చదివితే ఊరంతా వినబడ్డది మైకు లేకుండా. ఎంత పెద్ద గొంతు అయినా అది వినబడదు. బయటి కొచ్చానో లేదో పులిహోర పంచుదామని మా వదినగారు అట్లా గట్టిగా కౌగలించుకుంది. నా ఆకారం చూచి ఏడ్చింది. ఇంట్లో పుట్టిన పిల్లనర్థం చేసుకోలేక పోయానని - ఆమె వుద్దేశం వాటేసుకోవటంలో ఎత్తుకోవాలనే ప్రయత్నమున్నది. మామయ్యకు ఇంటికి వెళ్ళి చెప్పింది. ఆమె ఆయనకు ఊపిరాడనివ్వలేదు. పూజచేయడానికి ఇంట్లోఏమి లేదు వాడికి. పరిస్థితులు బాగాలేవు. గజేంద్రమ్మ ఆమెతో అంది. నీవు పిల్చుకునేటట్లయితే పాలు పెరుగు సప్లయి చేస్తానంది.

నాన్నగారికీ వ్యతిరేకంగ దాచిపెట్టి వాడికి అన్నంపెట్టాను. ఒక రోజున నాన్నగారు చెప్పారు. శేషశాస్త్రీ అన్నంతిని వెదుతున్నాదని నాకు తెలుస్తున్నది అన్నారు. అన్నం పెట్టడం అయిష్టత లేదు వారికి. నీఇష్ట మన్నారు. ఊరిలో పార్టీలు ఉన్నాయి. జాగ్రత్తగా చూచుకో అన్నారు నీవన్నా గిట్టటంలేదు. నిన్ను ఎవరెప్పుడు ఏం చేస్తారో.

ఈ అన్నం పెట్టడం ఎందుకంటే వాడ్ని పట్టుకొని మునసబు గారింట్లో అట్టి పెట్టారట. అట్టేపెట్టి కబురు చేశారు. ఎక్కడికి పోతున్నావంటే కరణంగారింటికి పోతున్నానన్నాడట. ఎందుకంటే భోజనానికి అన్నాడట నీవంటి వ్యక్తి మాపార్టీలో ఉంటేనా! ఎంత బాటుంటుంది మాపార్టీ అనేవాడు లోకనాథం అన్నాడు. నిన్నర్థం చేసుకోకుండ ఉండాలనిగాని అర్థం చేసుకోవాలని గాని ఈరెండు ప్రయత్నించకు. 'అన్నాడు' నీ మీద భక్తి కలగాలని కాని, నీకున్న శక్తిని ఎవరూ తెలుసుకోకుండ ఉండాలని గాని రెండు ప్రయత్నించవద్దు. 'రెండూదాచవద్దు' అన్నాడు. బెజవాడ పోయేటప్పుడు అందరూ భయపడ్డారు గదా. కమ్యూనిస్టు సెంటరు గదా అమ్మను ప్రశ్న వేస్తే ఎట్లా సమాధానం చెబుతుందోనని ఆదుర్దా పడ్డారు. నమ్మించడానికి ప్రయత్నించవద్దు, నమ్మకుండ ఉండడానికి ప్రయత్నించవద్దు' అని లోకనాథం అన్నాడు. సందేశమే అది. ఆపిల్‌ముక్క పెట్టాను. వీళ్ళందరు వాసనలు వస్తున్నాయని చెప్పుకొంటున్నారు. అది వాడికే తగిలింది. అందరికి ఉంది ఆభయం. నాన్నగారికీ ఉంది. ఎవరన్నా చదువుకున్న వాళ్ళు ప్రశ్న వేస్తే ఏం చెబుతుందోనని మానాన్నగారు ఒక రోజున బాపట్లలో ఉండగా స్వాములవారు వస్తే ఈయన అప్పుడే వెళ్ళిపోతున్నారేం అని అడిగాడు. బ్రహ్మానంద సరస్వతి స్వామి. వీరయ్య చౌదరిగారు అక్కడికి వచ్చారు. అల్లూరి శేషయ్యగారు వేదాంతం ప్రారంభించారు. అమ్మ మాటలు వినడానికి వచ్చాం గాని మీరు కాసేపు ఊరుకోండి అని

అన్నారు. వీరయ్య చౌదరిగారు 57వ సంవత్సరం సంవత్సరాది పండుగనాడు రావటం. మానాన్నగారు దేవాలయం సందులో కాపుర మున్నారు. (బాపట్ల) పార్థసారథిగారి ఇంట అక్కడ మొదట బాగుండేది. సిద్ధాంతం వల్ల ఉపయోగముంటుంది. ఈ చరిత్ర వల్ల ఏదన్నా సార్థకత ఉంటుంది అనడానికి - పుస్తకాలవల్ల, శాస్త్రాలవల్ల, మనుషులు మారుతున్నారు అని మీకు దానిపట్ల నమ్మకముంటే చెయ్యవచ్చు. రామాయణం చదివి రాముడు ఏకపత్నీవ్రతుడని తెలియని వారున్నారా? పతివ్రతల కథలు తెలియని వారెవరైనా ఉన్నారా? అట్లా అని మనం అట్టా నడవగలుగు తున్నామా? ఏదయినా అంతేనేమో అని అభిప్రాయ మైతే .... ...

కొన్ని కష్టాలుపడ్డ వాళ్ళను ఉదాహరణగా తీసుకుంటే మనకు మనశ్శాంతినిచ్చి, మనం ధైర్యంగ బ్రతకడానికి ఆధారాలవు తున్నాయి. దరిద్రం వచ్చింది హరిశ్చంద్రుని గుర్తుకు తెచ్చుకొంటున్నాము. అట్లా అని చింతపడకుండ ఉండగలుగుతున్నామా? బాధలంటే శరీరబాధలు కొందరికి తెలిసినవి కొన్ని వున్నాయి. కొందరికి తెలియనివీ కొన్ని ఉన్నాయి. నాన్నగార్కి తెలియకుండ జొన్నలగడ్డ సత్యనారాయణ ఇంటి నుండి బెండపూడి సీతారావమ్మ ఇంటికి బొమ్మ అకస్మాత్తుగా మార్చింది. జిల్లెళ్ళమూడి నుండి బాపట్లవచ్చేలోగా మేము నాన్నగార్కి చెప్పకుండ ఈ ప్రాంతంలో చేరాము. బేరన్‌లో దిగాము. వస్తే ఎక్కడ కాదంటారో – ఆచోటు మంచిది కాదని బేరన్‌లో కాపురమున్నాము. అన్నీ అందరికీ అందరం చెప్పం. కొందరికి కొన్నే తెలుసు. అయినా అన్ని వేళ్ళలో చెప్పం.

నాన్న : ఒకసారి మీఅమ్మగారి నడిగితే ఎవరు ఏప్రశ్న వేసినా అప్రయత్నంగ సమాధానం అదే పెల్లుబుకుతుంది – ఆలోచించి గాని తరచిగాని చూడను అని అన్నారు.

అమ్మ : హైమ ఉన్నది 17న వస్తాను అని కబురుచేసి మళ్ళీ వచ్చారు నాన్నగారు. అక్కడ మేనా ఎక్కాను. ఊర్లో అందరు బారులుతీరి నించొన్నారు. ఊర్లో కలరా బాగా ఉంది. అమ్మ కా జబ్బు లేదు. ఎక్కడికి పోతుంది అనుకున్నారు. ఊళ్ళో ఇట్లాంటి పరిస్థితి ఉండగా అమ్మకూడ ఇక్కడ లేకుండపోతే ఎట్లా అని ఆందోళన పడ్డారు. మన్నవ ప్రయాణమై వెళ్ళే టప్పుడు ఆ వెళుతున్న తీరుచూచి ఝాన్సీలక్ష్మీభాయి యుద్ధానికి పోతున్నట్టుగా ఉందని హైమ అన్నది.

రాఘవ : నాలాంటి వాళ్ళకు మార్పు వచ్చింది గదా! మార్పు రావడానికి హేతు వేమిటి?

వీ.ప్ర : గోర్కీ వ్రాసిన పుస్తకం ప్రపంచ చరిత్రలో మార్పు తీసుకు వచ్చింది బౌద్ధజాతక కథలు ఆసియాను ప్రభావితం చేశాయి. (బౌద్ధులుగా మారడానికి)

రామాయణం ఎవరినీ ప్రభావితం చేయలేదని చెప్పగలమా? ఈ చరిత్రలో మార్పు వస్తుందనే మా విశ్వాసం. అదీ నిర్ణయంలోని భాగమనే. ఈ తరంగాలు ప్రపంచమును ఊగించబోతున్నాయని మావిశ్వాసం. ఈ సిద్ధాంతం ప్రపంచమంతా వ్యాపించ బోతుందని నమ్మకం.

అమ్మ : ప్రతి జీవితంలో రకరకాల సంఘటనలు–

ఉన్నవాళ్ళ మనసులకు బాధ కలగకుండ చెబితే ఉండే ఉత్సాహం లేదు. బాధ కలిగించేవి చెబితే ఉండే ఉత్సాహానికి తేడా ఉందేమోనని .... ....

వీ.ప్ర : బాధ కలుగుతుందేమోనని వదలి వెయ్యటం చరిత్ర లక్షణం కాదు. కొంతమందిలో వాస్తవంగ మార్పు వచ్చింది. రాఘవరావుగారు నేను మారాను అంటున్నారు.

అమ్మ : లోకనాథంకు Base ఏమీ లేదు వాడి వదినగారిని ఎవరో ఆక్షేపించకుండ ఉండటమే వాడి ధ్యేయం. వదినగారిగా దణ్ణం పెడతానన్నాడు ఒక రోజున నమస్కారం వాడికోసం, వాడు చేస్తున్నాడనేది రూఢి. ఏది చేస్తున్నా మనకోసమే. పెళ్ళిసంగతి వస్తే లగ్నం పెట్టిన మూడూళ్ళకు పెండ్లయింది. Inter చదవడం ఇష్టంలేదు నాన్నగారికి. నాకు మొదట లగ్నం పెట్టినప్పుడు చెల్లమ్మ రెండువందల యాభైరూపాయలివ్వగానే పెళ్ళిచేస్తానన్నాడు. పులిపాక చెల్లమ్మగారని ఉండేది ఆమెతో సంప్రదించే వారు మానాన్నగారేదైనా. ఆమె వడ్డీకిస్తుండేది. సీతాపతీ! నేనిస్తాను అంది ఇచ్చింది. ఇద్దరికీ హనుమంతయ్య గారి దగ్గర కూర్చుని దగ్గరే రాత్రిపూట మాయింట్లో పడుకునేది. నిద్రలో ఆమెకు మూర్ఛ వస్తుండేది నీవు ముల్కి సంపాదించుకోరా అని హనుమంతరావు చెప్పారు. తెనాలి వెళ్ళారు అత్తయ్యకు చెప్పి వాడ్ని పిలిపించమని బామ్మతో చెప్పి తెనాలి వెళ్ళారు నాన్నగారు. తెనాలి వెళ్ళితే అక్కడ తలా ఒకమాట అన్నారు. నాకు సరిగా **11** సంవత్సరాలే. గురువారం లగ్నం పెట్టారు. (**1934** మార్చి **11**వ తారీఖు.) చదువుకుంటున్నాను. అన్నయ్య కిష్టంలేదు. పిల్లి మెడలో గంట కట్టిస్తున్నారు అని తెనాలిలో హాస్యమాడిన వారు కూడ వాళ్ళను చూచి ఎగతాళి చేయడమేగా.

నాన్న : మామయ్య ఉత్తరం వ్రాయటం – మీ మామయ్య ఇట్లా అంటున్నాడని సుబ్బారావు (రామకృష్ణ తండ్రి) నాకుత్తరం రాయడం బసవయ్యగారికి చేయిచూపి అవుతుందా లేదా అని అడగటం.

అమ్మ : ఈపిల్లే నీకవుతుందని చెప్పారా.

నాన్న : చెప్పారు.

అమ్మ : పులిపాక చెల్లమ్మ అనే ఆమె 200 రూపాయలిచ్చింది. కనకమ్మ గార్కి వంద ఇస్తాను. నేను వంద రూపాయలు తీసుకుంటాను. పెళ్ళిచేపి స్తానన్నారు సరే. వెళ్ళి చెప్పాడు. ఆమె ఏమని చెప్పినదంటే తల్లి సొమ్మంతా అమ్ముకున్నారు వీరు. అత్తయ్య! నీవు ఇట్లా చేశావా! అని ఆ పిల్ల పెరిగిన తర్వాత అడిగితే నేనేమని చెప్పేదిరా? అన్నది నడుముకు ఒక వడ్డాణం పెట్టాలని అన్నది. సన్నగా ఉండేదాన్నిగదూ. ఇంకొక వంద ఇవ్వమంది అక్కడనుండి తెనాలి వెళ్లితే మాతాతగారు సుబ్బయ్యగారు సంతోషించారు. అమ్మమ్మ వరాలమ్మగారు వచ్చారు. ఒకరేమో ఉండ ఇల్లులేదు. పండ మంచం లేదు. అన్న వ్యక్తి ఒకరు, గుండెజబ్బు వాడు వద్దులే అని ఇంకొకరు, తర్వాత వరాలమ్మ, శేషమ్మగారు తలా ఒక రకం అన్నారు. మా నాన్నగారు చెల్లమ్మగారితో చెబితే విన్నమాటలు. నే లేనక్కడ. నేను మన్నవలో ఉన్నా పెద్దత్తయ్య నాన్నమాట ఒకటి.

# నాన్నగారి మాటల్లో - అమ్మ

## 6-7-76

వీ.ప్రసాదరావు : "మీ అమ్మగారు నయం చేసుకోవాలంటే తీసేస్తుంది. అది చిలక కొయ్యకు చొక్కా తీసి తగిలించినట్టు" అన్నారుగా!

నాన్నగారు :మీ అమ్మగారి విషయం కనబడుతుంది గదా! ఏమీ బాధ లేనట్టుగా, క్రొత్తవారికి ఏమీ తెలియని స్థితిలో ... ...

as usual గా కనబడుతుంది గదా అనేక సందర్భాలలో బాధతో ఉన్నప్పుడు ఎవరైనా వస్తే ఆ బాధ కాసేపు ... ... వంకెన తగిలించి మామూలు కార్యక్రమం పూర్తిచేస్తుంది.

డాక్టరు : జ్వరమొచ్చినప్పుడు అమ్మ మీరు చెప్పిన పరిస్థితులలో జ్వరం తగ్గించుకుని లేకుండ వెళ్లి కూర్చుని మళ్ళీ శరీరానికి జ్వరం వస్తే దాని కోర్చు కోవచ్చు. ఓర్పంటాను నేను.

నాన్న : మీరు చెప్పినట్టు ఓర్పనవచ్చు జ్వరం తగ్గించుకోవడం ... ... ఎక్కించుకోవటం ఇన్ని సమస్యలు లేవక్కడ జ్వరానికి జ్వరమూ ఉంటుంది. మనిషి హాయిగా కనబడుతుంది. (జ్వరము) ఉన్నా కూడా బాగానే ఉంటుంది. P.S.R వాళ్ళ అన్న కులపతి ఖండకావ్యం Inauguration సందర్భంలో మీ అమ్మగారికి ఆ రోజున విపరీతమైన విరేచనాలు, temperature వాంతులు కూడా ఉన్నాయేమో. ఈ స్థితిలో వాళ్లొస్తున్నారు ఎట్లా కూర్చుంటుంది అనే తహ తహ దత్తు గారు ముందు వచ్చారు. ఆ క్షణం వరకు పడుకుని ఉండటమే లేవలా. మీ అమ్మగారు స్నానం చేసి వేదిక మీదికి వచ్చిన తరువాత షుమారు మూడు నాలుగు గంటల కాలం కూర్చుంది. మీ అమ్మగారు ఇట్లా అనేక సంఘటనలు.

"నా కెట్లా ఉన్నా నేనే స్థితిలో ఉన్నా ఏదైనా నాకు ఈ శరీరం నిలవదని తోచినప్పుడు ముందుగా మీకు చెబుతానని నాకు చెప్పింది. ఆమెకు తెలుస్తుందని చెబుతుందనే ధైర్యముంది నాకు. ఫరవాలేదనే విశ్వాసం నాకు. మీ అమ్మ గారి శరీరం మీద ఇది వరకు రంగులు బాగా మారేవి. మాహైమ మాదిరిగ ఉండేది చిన్నప్పుడు, రోజా రంగు చీర కట్టుకుంటే ఆ చీర రంగులో ఆమె శరీరం రంగు కలసి పోయేది." నేను ప్రయాణమైనప్పుడు వెళ్ళిరానా అంటాను. నాభయం నాకుంటుంది. దానితో పాటు ఏదో ధైర్యమూ ఉంటుంది. ఆదుర్దా కూడా ఉంటుంది నాకు. ధైర్యమూ కలుగుతుంది. కొద్ది క్షణాల తేడాలోనే మార్పు వచ్చేది.

అమ్మ : 104 డిగ్రీల జ్వరముతో కూడా పడుకోవటం కూర్చోవటం పనులు చేసుకుండేదాన్ని.

నాన్న : ఆనాటి రోజుల్లో మీ అమ్మగారి శిరస్సును స్పృశిస్తే చాలు రక్తం వచ్చేది చేతికి. ఏదో సువాసన కూడ ఉండేది. ఇదిట్లా అని చెప్పడం చాలా కష్టం. భ్రుకుటి నుండి చిమ్మిన రక్తధారనే స్వయంగా చూశాను. అప్పుడు హైమ కూడ అక్కడే వుంది. ఆ రక్తం క్రింద పడగానే భస్మమయింది. వెంటనే నీళ్లలో కలిపి తీర్థంగా తీసుకున్నాం ఆ భస్మాన్ని. సెలవు తీసుకునేందుకు పూర్ణచంద్రరావు వచ్చి కొబ్బరి కాయ కొట్టి ప్రదక్షిణ చేస్తుంటే మీ అమ్మగారు కళ్ళు మూసుకున్నారు. వారికా రోజున ప్రసాదం లేదు. ఆయన ఊరికి పోలేదు. ఆ రోజున మీ అమ్మగారు కళ్ళు తెరవలేదు మీఅమ్మగారు తనను తాను చూచుకో గలదు మన చక్షువులకు బయట ఎట్లా కనబడుతుందో లోపల మీఅమ్మగారికి అట్లా కనబడుతుంది. ఇట్లాంటి చిన్న చిన్నవి ఎన్నెన్నో, రాముడమ్మ క్రిష్ణవేణమ్మ గారు మీ అమ్మగారిని చూస్తూ ఎంతసేపు కూర్చునే వారో వారికి గంటలు గంటలు కాలం తెలిసేది కాదు. పిల్లిపాలు కుక్కతాగిన సందర్భాలున్నాయి. పిల్లి

ఓంకారాన్ని పలికిన ఘట్టాలున్నాయి. మీ అమ్మగారు గంటల తరబడి కూర్చునేది. చాలా హాయిగా ఉండేది ఒకసారి మోదదుగు రామచంద్రయ్య గారు మా గురువుగారు వారి రెండో అబ్బాయి ప్రశ్నలు వేసుకొచ్చాడు రాగానే ఏదో అడగాలని – ఇప్పుడు హైమాలయం ఉండిన స్థలములో అనాడు పాక ఉండేది. ఆరోజుల్లో ఓరుగంటి నరసింహ యోగిగారు వస్తుండేవారు. కాసేపు ఏమీ లేదని – కాసేపు ఏదో ఉందని కొంతమంది కనిపించేది. అన్నీ ఉన్నాయందులో (మీ అమ్మగారిలో) స్వయంగ చూచినవే చెప్పాను. **1954 – 56** ప్రాంతముల నుండే గుర్తించటం ముందు ముందు వచ్చేజనం ఏడవ మైలు రాయి దగ్గర నుండే చూచి పోవలసి వస్తుందేమో అనేది. వర్షమొచ్చినట్టుగా కలవస్తే మరునాడు కుంభవర్షం వచ్చేది. అటువంటి దృష్టాంతరాలు ఎన్నెన్నో ఉన్నాయి.

శ్రీపాద : ఏది అడ్డు వచ్చినా Worry లేదు.

నాన్న : తెచ్చిపెట్టుకున్నదంటూ ఏదీలేదు. సహజంగా ఉన్నది.

వీ.ప్ర : పంచభూతాలతో కూడిన దేహం మీద (అమ్మకు) Control ఉంది.

నాన్న : కనబడుతూనే ఉందిగా!

వీ.ప్ర : ఇలా జరుగుతుందనుకుని fail అయ్యాడు అరవిందుడు

నాన్న : "ఇంకా ఎన్నాళ్ళు చాలాకాలం గడచినట్టనిపిస్తుంది" అలా అప్పుడప్పుడు అంటుంది. ఎందుకంటుందో తెలియదు.

వీ.ప్ర : మీరెంత దుఃఖిస్తారోనని – అని ఉంటుందను కుందాము.

నాన్న : మన కోసం ఉన్నట్టుగా కనపడుతున్నది. మాటల సందర్భంగ తన పిల్లలు, ఇతరులు – ఇతరులను కూడ సమంగ చూచుకోవద మనేది ఆక్షేపణ అనా ప్రశ్న? తన పిల్లలు ఎక్కువంటుంది. రామరాజు కృష్ణమూర్తి తనకు కనబడితే అంటుంది. నాకు interest పోయింది. చెవినపడ్డదేమో, దానికి reply ఏమో అనుకున్నా.

వీ.ప్ర : చూడగానే కంచిస్వామి ముకుళిత హస్తుడై అలాగే నిల్చున్నాడు

# అమ్మ - నాన్నగారు

## 6-7-76

అమ్మ : చూడవలసిన రీతిగా చూడలేక పోతున్నాము అనే బాధ వీడికుండటం సహజమే. జొన్నలగడ్డ సత్యనారాయణగారింట్లో ఉన్నప్పుడు జరిగిన సంఘటనలు (భారతి పిన్ని)ఆమె ఉన్నప్పుడే అడిగాను.

మంతెన కృష్ణారావు, గరికపాటి శేషగిరి, దేశిరాజు ఆనంద రామును తీసుకొచ్చాడు మానాన్నగారు. నేనప్పుడు తెనాలిలో ఉన్నా హార్మోని నేర్చుకుంటూ, సావిత్రి, రామలింగం - 'నీ శేషగిరిరావు మామయ్య వచ్చాడు. కాళ్లకు నీళ్ళివ్వు' అని పిలిచారు నన్ను. కాళ్లకు నీళ్ళు ఎవరైనా ఇవ్వవచ్చు గదా అనుకుంటే ఒకరు వచ్చి ఓణివేయను, ఒకరు వచ్చి గొలుసు వేయటం ఇవన్నీ చేశారు. రామలింగం పోయి రామ్మా అన్నాడు. సినిమా హాలులో శ్యామల అమ్మాఅని పడిపోవటం నాకు జరిగిన సంఘటనలు నాకు సంబంధమున్న వ్యక్తులు అందరూ వస్తారు చరిత్ర అంటే

రాఘవ : అమ్మ మెడలో ఆంజనేయుల బిళ్ళ దొంగిలించాను.

అమ్మ : చేసినట్టు కనబడేవాడు కాదు గాని దాగేవాడు కాదు. చెప్పిచెయ్యటమే. చివరకు వందరూపాయలు, బస్తా బియ్యం ఇచ్చాడు. మానాన్న చిదంబరరావుగారు, కొండముది సుబ్బారావుగారు చందా లేసుకున్నారు. నూరు రూపాయలు బస్తా బియ్యం వరాల పిన్ని పాతికిచ్చింది. (నాన్నగారికి, అమ్మకు కలిపి) ఇరవై నాలుగు రూపాయలు పుల్లయ్యగారు చదివించారు. పెళ్లిలో (మామయ్య) అలక పీటల మీద కూర్చుని వున్నాడు. పెళ్ళి పీటల మీద కూడ బంగారం తీసుకుని ఏ రోజు ఖర్చుకు ఆరోజు వాడారు. నేను Bare hospital లో ఉంటే పెళ్ళి కొచ్చిన డబ్బు, బంగారం, అదీ ఖర్చు పెట్టారు. ఎనిమిది నెలలు ఉన్నా నక్కడ మీరు వచ్చి అమ్మన్నత్తయ్య పోయినాదని తీసుకొచ్చారు నన్ను. ఇన్ని నెలల్లో

వాళ్ళు నన్ను ఎక్కువగా చూశారు. నా మీద వాళ్ళకు ప్రేమ ఎందు కేర్పడిందో తెలియదు. అందరిని అట్లాచూడరు. రెండుసార్లు లోపల పిండం పోయింది. నే రోజూ చర్చికి వెళ్ళేదాన్ని. బైబిలు బాగా చూసేదాన్ని. చర్చలకు వెళ్ళలేదు గాని, చర్చీలకు వెళ్ళేదాన్ని ధర్మామీటరు పెట్టి చూడటం, ఇంజక్షను చెయ్యటం ఇలాంటివి విని నేర్చుకున్నాను. Dr.Thomas **64**లో పోయినాడు. ఇంత తెల్లని శరీరంలో కూడా కనీసం నరాలు కనిపించడం లేదని విసుక్కున్నాడు. నీవు మనిషివా గొడ్డువా అని అడిగాడు. నెత్తురు తోటి వస్తే ఒకసారి అన్నయ్య వచ్చాడు, ఆ నెత్తురు చూస్తే రావాలనిపించింది అన్నాడు. గుంట తీసిపోశా. అకాన్పప్పుడు నేను బామ్మ తప్ప ఇంకెవ్వరు లేరు ఆమె మగ, ఆడ అయి చేసింది. ఏదన్నా చెప్పుకుంటున్నా – నాన్నగారు రాగానే ఆపేసేవాళ్ళం. గౌరవమని కాని, ఎందుకులే తెలిస్తే మనసు కష్టపడుతుందని గాని. అంతే ఉద్దేశ్యం

ఈ రోజుకు జొన్నలగడ్డవారి ఇంటి నుండి బెండపూడి వారి ఇంటికి ఎందుకొచ్చామో తెలియదు. చిన్నప్పుడు అంతా తిరిగిందే. రైలుపేట, అర్జీరుపేట, సుబ్బారావుకు జబ్బు చేసినప్పుడు అరవ డాక్టరుగారి ఇంట్లో ఉన్నాను. ఆశ్రమములకు వెళ్ళి నీళ్ళు తెచ్చేదాన్ని గదా. రెండు సందర్భాలలో బామ్మకు బాధ. అంతకు తప్ప ప్రత్యేకమైన బాధ ఏం లేదు. నేనిట్లా అయినా నన్నది ఒకటి జొన్నలగడ్డవారి ఇంట సంఘటన మరొకటి. ఇంట్లో ఖర్చును గురించి .... పూజ చేసుకుని 'నిన్ను బాధపెట్టాను. మనసు కష్టపెట్టాను. అనేది బామ్మ.' ఆమెకు దయ్యాల మీద భూతాల మీద నమ్మకం. లలితా సహస్రనామాలంటే మక్కువ. జొన్నలగడ్డవారి ఇంట జరిగిన సంఘటన సంధ్యావందనం తెచ్చి పెట్టింది. చదువుకుంటామన్నా బెండపూడివారి ఇంట్లో హాస్పిటలు దగ్గర .... **15, 20** రోజులు ఎదురుగా కూర్చో బెట్టుకొని జపం చూసిన సందర్భాలున్నాయి.

నాన్న : జపం చేశాను.

అమ్మ : నాన్నగారు కూర్చున్నప్పుడు నేనక్కడే కూర్చునేదాన్ని. వాళ్ళందరూ తెలిసినట్టు మాట్లాడుతున్నారు. నే తెలుసుకోలేక పోయాను. నే నర్థం చేసుకోలేక పోయానని బాధపడ్డాను. కట్రపాడులో మీ అమ్మగారు చాలా బాగా మాట్లాడేది. కట్రపాడు మునసుబుగారు దశరథుడికి రాముడు తన కుమారుడుగానే తెలుసు గాని భగవంతుడుగా తెలియదన్నారు. సాయంకాలమమ్మగారితో ఏకాంతంలో మాట్లాడాలి అన్నారు. సుబ్బయ్య చేత నాన్నగారు 'నీకడ్డు లేదు. నేనూ వచ్చి కూర్చోవచ్చునా' అని కబురు చేశారు. వాళ్ళడిగిందీ, నేను చెప్పిందీ వినటం జరిగింది. నాన్నగారు నన్నిలా అడిగారు. 'పెద్ద వాళ్ళు వచ్చి ప్రశ్నలడిగితే నీవేం చెప్తావు? అని నాన్నగారితో ఇలా అన్నాను. నాకేం తెలియదు. వాళ్ళు ప్రశ్న వేస్తేతోస్తుంది చెబుతాను. ముందుగా తెలియదు అన్నాను.

నాన్న : అప్రయత్నంగ వాటంతటవే సమాధాన మొస్తుందన్నావు గదా

అమ్మ : ఒక రోజున నాకళ్ళు ఇదంతా కాలిపోయనట్టుగా అనిపించింది. అప్పుడు కబురు చేస్తే – రాత్రి – నాన్నగారు లోపల పడుకున్నారు. నేను బయట పడుకున్నాను. నాన్నగారు ఉదయం చూచి ఇప్పుడొస్తే వచ్చారు, ఇక మీదట ఇట్లారావద్దు నాకు చాలా కోపమన్నారు. ఆ వ్యక్తి అమ్మ కళ్ళు అట్లా ఉండే వచ్చానంతే అన్నారు. చేతిలో నుండి చాకు చొచ్చుకుని పోయిందప్పుడే.

నాన్న : అట్లకాడ పాదములో అటు ఇటు దిగి పోయింది.

అమ్మ : ఆవకాయ సంఘటన. అప్పుడే పెట్టిన ఆవకాయను నూనె వేసి బాపట్లలో ఒక ఇంట్లో ఉండి కలుపుతున్నాను. జాడిలో పెట్టబోతుంటే .... నాన్నగారు జిల్లెళ్ళమూడి నుండి అప్పుడే వచ్చారు మొక్కజొన్న కండె తెచ్చారు. నాకు ఇప్పటికి ఇష్టమే దోసకాయ లిష్టం నవరంధ్రాలలో ఆవకాయ. ఆ మంట ఎంత మంటంటే వర్ణించాలనుకుంటే చెప్పలేం. అట్లాపడ్డది. Fit వచ్చి ఒకసారి జొన్నలగడ్డవారి బావిలో పడ్డావనుకో ఆ నీళ్ళు త్రాగలేదు. నన్నేం చెయ్యలేదు గదా. నాటకానికి వెళ్ళారు నాన్నగారు.

నాన్న : మాఅబ్బాయి పుట్టే దాకా హిస్టీరియా, ఫిట్సు వస్తుండేవి

అమ్మ : దయ్యాల రంగాచారిగారు శ్రీరంగపురం నుండి వచ్చారు. నాకు దయ్యాలు బాగు చేయడానికి వచ్చింది పిడుగు లక్ష్మీనారాయణ. బొమ్మ రుద్రాక్షమాల తీసుకుని ( ఆవ్యక్తి ) వీపంతా బాధ పెట్టాడు. పలుకు పలుకు అని. ఈ సంఘటన **42**లో జరిగింది.

మళ్ళీ కదుపులో ఉన్నప్పుడు శ్రీరంగపురం నుండి ఇంకొల్లుకు నడిచి వెళ్ళాను. బొమ్మ మాటలతో సుబ్బారావు నెత్తుకుని వెళ్లాను. చేబ్రోలు వంతెనల దాకా నడచి వచ్చి చేబ్రోలు తర్వాత ఒక దేవాలయం, నాగమణి, సుబ్బలక్ష్మీ దేవాలయానికి నాట్యం చెయ్యడానికి వచ్చారు. రాఘవరావు మామయ్య ఏం చేస్తాడో బయటికి కనపడేది. దాచటంలేదు. అమ్మమ్మ నాకు పంచెలు పెట్టాలని వెతుకుతూ ఉంటే రెండు రూపాయలు పెట్టి కొన్నాడు. మీ చెల్లెలే గదా అది ఇచ్చింది రాజ్యలక్ష్మీ యంత్రమా? రాజరాజేశ్వరీ యంత్రమా? నవరాత్రులలో మన్నవలో ఇచ్చి వచ్చింది. నాన్నగారు మొదట ఒప్పుకోలా, తాతయ్య, నీవు, నవరాత్రులు ఉండటం ఇక్కడే చేసుకో అని బొమ్మ నాకు చెప్పింది. మేనా వచ్చింది. నీవు వెళ్లు నేను రావడం ఆలస్యమైనా అన్నారు.

పొన్నూరు నుండి నాన్నగారు దిగారు. హైమ, నేను మేనాలో - మన్నవ చంద్రుడు అదిగో అమ్మ వచ్చింది అన్నాడు. దివ్వెల వెంకటేశ్వర్లు మా అమ్మాయిగారేనా అనుకున్నాడు. ఇంత పటిక బెల్లం నాచేతులో పెట్టి సంతోషము, ఏడుపుతో - మళ్ళీ చూస్తే తట్టుకో లేక పోయేవాడు, నీవట్లా చూడవద్దు అన్నాడు వెంకటగిరి ఉన్నాడు గదా. మొన్నచూశా. నేను ఎవరెవరునన్నారో వెతుక్కుంటా.

# జీవుడు - జన్మలు

అమ్మ : సాధనకు అంతకంటే ముఖ్యమైన మాట ఏమైనా ఉందా? లేదుగదా లోపల చూస్తున్నారు. అర్థమైతే అంతా అదే ఏం చెప్పాదంటే ప్రతి వాళ్ళల్లో కొన్ని ఉన్నాయిగదా. అవన్నీ చక్కగా ఉంటాయి.

శ్రీపాద : ఒకదంటే సూది కన్నంలో ప్రవేశించగలదు. గానీ భగవంతుదు పరలోకరాజ్యంలో ప్రవేశించలేదు అన్నాదు క్రైస్తు.

అమ్మ : నేతీసుకోలా - పరలోకాన్ని, నే తీసుకొన్నది తనను చూచుకొన్నట్టుగా - ఎదుటి వాణ్ణి చూడమన్నది - ఎంతబాగుందీ అనుకున్నా. ఇంకొకటి తీసికొని అది బాగుందా లేదా అనుకొనే దానికంటే ఇది తీసికొంటే ఆచరించడానికి బాగుంటుంది.

శ్రీపాద : నే చెప్పిన దానికీ అతను చెప్పిన దానికీ తేడా ఏం లేదు అనే, ఇది ఏం లేదు మీకు.

అమ్మ : నే తీసికొనేవి ఇటువంటివే.

శ్రీపాద : పరలోక రాజ్యంలో వాదు ప్రవేశించలేదు అన్నదిగాదు మీరు చూదరు అని వారన్నారు.

వీ.ప్ర. : మీరు చెప్పేవాక్యాలు అందులో కొన్ని ఉన్నాయి. గాబట్టి నే చెప్పినదానికీ దీనికి తేడా లేదు అంటారు.

అమ్మ : అది ఒకటే తీసుకుంటా. అన్నీ తీసుకోను.

వి.ప్ర. : గీతలో కూడా ఒకటే తీసుకుంటారు.

అమ్మ : అన్ని శ్లోకాల్లోకి మనఏవమనుష్యానాం, కారణం బంధమోక్షయోః అనే శ్లోకం ఒక్కటి తీసికుంటా.

శ్రీపాద : గీతలోది కాదు.

అమ్మ : గీతలో అటువంటిది ఇంకొకటి ఉండవచ్చు.

శ్రీపాద : నేను గానే చెప్పిన దానికీ, గీత చెప్పిన దానికీ తేడా లేదు.

వీ.ప్ర. : ఆ దృష్టితో తేడా లేదు.

శ్రీపాద : గాలివాన లేని పరిస్థితిలో నేమట్టి పెట్టేనే. అకుకి నేస్తం.

అమ్మ : వాళ్ళు చెప్పినవి ఉన్నవిగదా! మమాత్మా సర్వభూతాత్మ అంటే ఏమిటి?

శ్రీపాద : నా ఆత్మ సర్వభూతముల యొక్క ఆత్మ.

అమ్మ : వేరుగా కనబడుతున్నా శరీరాలే భూతాలు.
నేగాకుండా కనబడుతున్న శరీరాన్ని

శ్రీపాద : శరీరాల్లో ఆత్మ నా ఆత్మ.

అమ్మ : శరీరాల్లో అన్నారు.
మామూలుగా శరీరాన్ని ఆత్మ అంటే నమ్మరని.

శ్రీపాద : అన్నాము అని చెబితే నమస్కారం.

అమ్మ : మరిచే పోయినారు -

వీ.ప్ర : చీమలు దోమలుగాదు. చీమగా, దోమగా -

అమ్మ : శరీరం ఆత్మే అనే మాట వచ్చింది.

వీ.ప్ర. : అందులో చెప్పినవి నే చెప్పిన వాటికి భిన్నంగాదు గాబట్టి, రెండూ ఒకటే అలా అంటున్నాను - అన్నీ తీసుకోను నమస్కారం - దానినుంచి ఉన్నదంతా అమ్మ చెప్పిందే అన్న నిర్వచనం ఎక్కడా రాదు.

శ్రీపాద : మనకు సరిపడేది తీసికుందాం - సరిపడింది ఏదో కారణంతో చెప్పాడులే అని అనుకోవాలి- మా దురలవాటు వేరే ఉందిగదా!

అమ్మ : భాగవతంలో కొన్ని పద్యాలు ఉన్నాయి. సర్వం కృష్ణమయంగా ఉంది భక్తి గొప్పదా, జ్ఞానం గొప్పదా అని ప్రశ్న వేస్తుంటారు, నన్ను నేను ఏం చెబుతానంటే అన్నీ ఒకటే ననిపిస్తుంది. భక్తిలో యోగముంది. యోగంలో జ్ఞానముంది. జ్ఞానంలో ఈ రెండూ ఉన్నాయి. కర్మ అంటే అన్నీ చేయటమే. ఏది చేస్తే అదీ కర్మ. చేసేదే కర్మ, ప్రేమకు భక్తికి తేడా లేదుగా! మనుషుల మీద ఉంటే ప్రేమ అన్నాం. దైవం మీద ఉంటే భక్తి అన్నాం. నేను వస్తుంటే అమ్మాయి ఏడ్చిందనుకో భక్తిచేతనా - ప్రేమ చేతనా?

వీ.ప్ర. : ఏ ఒక దానిలోనూ రెండోది లేకుండా లేదమ్మా. కేవలం భక్తి, కేవలం జ్ఞానం అని లేదు.

అమ్మ : పంచ భూతాలలోనే ఒకే భూతంలో ఇంకో భూతం కలిసే ఉన్నది. ఆ భగవంతుని తలపెట్టను అన్నాడు.

శ్రీపాద : 20 వేల మంది ఖైదీలను నరకివేస్తే కారణం లేకుండా ఊరుకున్న భగవంతునిపై నాకే విశ్వాసం లేదు అన్నాడు; ఒకడు - రామకృష్ణ పరమహంసతో, అందుకు పరమహంస అన్నారు - భగవంతుని పద్ధతు లేమిటో తెలుసుకోగలమా, మనము. ఇది సమాధానంగాదు - సర్దుకోవడం. నేననుకొంటున్నది భక్తికి పరాకాష్ఠ. సర్దుకోమంటున్నాడు గానీ సమాధానం చెప్పినట్టులేదు. నాకు సమాధానం వచ్చింది. దానిపైది ఏమిటి? అన్నీవాడే-

అమ్మ : శాస్త్రాలన్నీ నాకు సరిపోవదానికి క్షుణ్ణంగా నేనేం చదువుకో లేదు. మామూలుగా ఏదన్నా ఒక వాక్యం తీసికొన్నప్పుడు - నాకు చాలా సరిపోతున్నట్టుగా ఉంటే ఒక్కొక్కటి తీసికుంటా కవ్వంచుట్టూ మజ్జిగ ఉన్నట్టు అని ఎక్కడో వ్రాశారు. అది నాకు చాలా బాగుంది. కుండలో ఉన్నప్పుడే ఉంటాయి. విడదీసినప్పుడు లేవనుకో. కవ్వం చుట్టూ మజ్జిగ ఉన్నాయంటే కుండలో ఉన్న కవ్వంచుట్టూ అన్నట్టుగా! అట్లాగే తతిమ్మావి గుర్తుండవు. బాగున్నవి హత్తుకొని - అవే మాట్లాడుతా! నాకు శాస్త్రపరిచయం శాస్త్రజ్ఞానం లేదు చదువుకోలేదు. నాకు వస్తువులు పరికరాలు - ఇవే శాస్త్రాలు. అనుభవం శాస్త్రాన్ని ఇస్తుందనే నమ్మకముంది. ఎవరేది చెప్పినా కాదనాలనీ వద్దనాలనీ లేదు. చేతబడులనీ కాదనీ అంటున్నా. కాదని అనకుండాలేను. ఇప్పుడు జన్మలను గురించి నాకు నమ్మకం లేదని స్పష్టంగా అంటాను. ఆధారంలేదు అంటూ ఉన్నాయంటే - ఉండటానికి ఆధారం చూపితే నమ్మకుండా ఉండాలని లేదు. కానీ ఎంత ఆధారం చూపిస్తే అంత

ఆసక్తితో విందామని ఉంది. అర్థంచేసుకుందామనీ ఉంది. ఎవరైనా చెప్పేవాళ్ళు దొరికితే నాకు అర్థమయ్యేటట్లుగా చూపిస్తే ఇంకా చూద్దామని ఉంది. తెలుసుకుందామనీ ఉంది. నా మాటే గెలవాలనీ, నాకు తోచిందే నిజమనీ అంతకంటే లేదు. నా మాటే నిజమనిగానీ ఇదే అందరూ నమ్మాలని నాకేం లేదు. నాకు తోచిన అభిప్రాయమిది. ఉండటానికి వీలులేదు. ఉన్నాయంటే చూద్దాం, నమ్ముదాం – పుట్టాలనే ఉంది పుట్టనేమోనని దిగులు. నాకు తప్పకుండా పుడతానని ఎవరైనా హామీ ఇస్తే ధైర్యంచెబితే – సంతోషమే. ఈ ఊరునుండి ఇంకో ఊరు పోయినట్లేగా అప్పుడు. దేహమేమో ఇక్కడే ఉంటున్నది. ఆత్మ నశించేది గాదు. జీవుడు ఎక్కడో ఉంటున్నాడని – జీవుడూ ఆత్మ కలిస్తే గానీ మనస్సు లేదంటున్నారు. మనస్సు లేని జీవుడెట్లా ఉంటాడు. ఎక్కడ వుంటాడు? ఎట్లా పుడతాడూ? ఎట్లా ఆలోచనలు వస్తాయి? ఎట్లా ఉంటాడు? (జీవుడు) ఏమౌతాడూ? ఏమైవస్తాడు? ఎందుకై వెళ్ళాడు? ఎందుకై వచ్చాడు? ఏమై ఉంటాడు వాడు? ఏమిటంటాడు? వస్తానంటాడా? ఎట్లా వస్తాడు? ప్రాణం పోవటం ఎంత గుర్తించలేమో – జీవుడు ఉన్నాడని అంత గుర్తించలేము. ప్రాణం ఎదురుగా ప్రాణం పోతున్న మనం జీవుడు ఉన్నాడని నిర్ధారణ ఏమిటి? పోయేదేమిటి? ప్రాణం అంటేగాలా? గాలి తెలియకుండా ఎట్లా పోతుంది? ముక్కు దగ్గర చేయి పెట్టాను నోటి దగ్గర చేయి పెట్టాను. మామూలుగా ఉండే గాలి కూడా లేదే? ప్రాణం పోవటం అంటే ఏమిటో అర్థంగావటం లేదు. అర్థంగానిది ఏదో మనకు అవసరమైనది ఏదో తెలియకుండా మాయమైంది. మనకు ఉపయోగించలేదు గాబట్టి చచ్చాడంటున్నాం. ఎక్కడికి పోయింది ఎట్లా పోయింది అర్థంచేసుకోలేం గనుక. సత్ పదార్థం పోయింది – పోయిందనుకుంటాం. అయితే వచ్చేదేమిటి అన్నప్పుడు దానికి అర్థంలేదు. ఎవరు జీవుడు ఇందులో? జీవుడున్నాడని – చూచా

వేమిటి? అర్ధంగాని శక్తిని ఆత్మ అని పేరు పెట్టాం. అర్ధంగాని ఆవరించి యున్న శక్తిని ఆత్మ అని పేరు పెట్టాం. జీవుడికి పేరు పెట్టడానికి గుర్తులు ఆధారాలు ఏమైనా ఉన్నాయా?

శ్రీపాద : శరీరంలో ఉన్నాయి.

అమ్మ : ఏవీ చూపించండి - శరీరంతో ఉన్న ఆత్మ ఎదురుగుండా లేకుండా మరోరకంగా ఎట్లా ఉంటుందో? ఊహించారా? ఏదన్నా ఉన్నదా? ఉన్నదంటే తీసికొచ్చి చూపించండి. ఊహించారా? దైవం అంటే ఎంతో ఇదీ అంతే.

సోదరుడు: ఎదురుగుండా కనిపించే శరీరాన్ని బట్టి జీవుడున్నాడను కుంటున్నాం.

అమ్మ : శరీరం వదలిన తరువాత?

సో : శరీరంతో ఉన్నప్పుడు మాట్లాడే ఈ మాటలు, వినే చెవులు, చూసే చూపులు చేసే పనులను కలిపి వీడూ - జీవుడన్నాం, శరీరం వదలిన తరువాత ఈ పనులు చేయడం లేదుగాబట్టి - జీవుడన్నాం. ఎటుపోయిందో తెలియదు. ఎట్లా పోయిందో తెలియదు. ఎక్కడికి పోయిందో తెలియదు. ఏమైందో తెలియదు. ఎట్లా ఉంటాడో తెలియదు. శరీరం ఉన్నప్పుడే జీవుడు అనే ఒక వస్తువును గుర్తించగలం. ఈ లేని దాన్ని ఉన్నదని ఆధారమేమిటి?

శ్రీపాద : మనిషి వెళ్ళిపోతే ఏదో ఫోటో గ్రాఫ్ చేస్తే ఉన్నాయని! దొరకలేదనుకోండి?

అమ్మ : దొరికితే నమ్మకుండా ఉండాలని నాకు లేదు. ఏమైనా గట్టి ఆధారాలు దొరికితే నమ్మకూడదని నాకేంలేదు. దొరకలేదు గనుక లేవను కుంటున్నాం. చూస్తే కనిపించలేదు. వెతికితే దొరకలేదు. ఆధారం కనిపించటం లేదు గనుక అన్నా. ఆ మాట ఏ దేశంలోనే పుట్టి ఎవడో ఒకడు అమ్మా అన్నాడు. ప్రతి జీవి అనటం లేదే? ఇన్ని కోటానుకోట్లు చచ్చిపోతే అనండి - ఎవడో ఒకడు అన్నదాన్ని పట్టుకొంటున్నా. అది ఆ ఒక్క వ్యక్తికేనా? తతిమ్మా వాళ్లకులేదా? ఆధారం అది ఒకటేనా?

అనుభవం ఉన్నదెవరి కంటే బ్రహ్మ జ్ఞానులకు ఉండవచ్చు. ఏ రామకృష్ణ పరమహంసో, పరమ పక్షో ఇలాంటి గొప్పవాళ్ళంతా పోయినారనుకో, నాన్నా! ఆ జీవుడు ఆ ఆత్మ ఉండవచ్చుగా! వారికి రెండు లేవుగా! ఆ శరీరం వచ్చినప్పుడు మాట్లాడితే నేను ఇక్కడే ఉన్నాను. నేను వెళ్ళలేదు. ఆత్మ అంటే ఇది అన్నప్పుడు చెబుతారా వచ్చి? రాముదు కృష్ణుదు ఉన్నారు. వాళ్ళు బ్రతికి ఉన్నప్పుడు చేసిన లీలలే చరిత్రబద్ధంగా ఉన్నాయి గానీ పోయిన తరువాత చరిత్ర ఏమైనా ఉందా? వాళ్ళు చేసిన చర్యలను ఆధారం చేసికొని ఆ జీవుణ్ణి ఆ ఫొటోలోని మనం ఆరాధిస్తే మన మనస్తత్వానికి తగిన విమర్శనలు వస్తే వాడు కృష్ణుదు అనుకొంటున్నాము. రామదాసుకు పట్టినటువంటి – ఆ సమయంలో రక్షణ జరిగితే. ఆ రాముదు ఎప్పుడూ ఉన్నాడు. వాడు ప్రత్యక్షమైనట్లు కనబడుతున్నది. రాముదు కనిపించాడా? చూచాడా?

వీ.ప్ర. : భక్తులు చూడటమే.

అమ్మ : కనుపించ లేదంటావు.

అయితే ఈ మాట అనటానికి ఆధారం ఏమిటంటే భక్తుడే చూస్తాడని ఎవరు ఏ రూపంతో ధ్యానిస్తే ఆ రూపంతో ప్రత్యక్షమైనప్పుడే నాకు కనిపించింది అంటాడు. నేను మామూలుగా దారిన పోతున్నప్పుడు పెద్ద ముత్తైదువు కనిపించినా అమ్మలాగా ఉందంటావు. ఆ రూపాన్ని గుర్తించి నీవు దారిన వస్తున్నప్పుడు ముత్తైదువు కనబడితే అమ్మ అనుకోవు – దైవం ప్రత్యక్షమైనాదనుకోవు. నీ ఇష్టదైవం – ఎక్కడ పరమహంసతో లగ్నమైపోయిందో ఆ రూపంలో కనిపిస్తేనే నీకు దేవుదు కనిపించినట్టు.

సోదరుడు: మనసు తనకు ఏ ఆకారాన్ని గావాలంటే ఆ ఆకారాన్ని సృష్టిచేసుకోగలదు. అయ్యే సృష్టి కూడా పూర్వం ఉన్న అనుభవాన్ని బట్టి సృష్టి జరుగుతూ ఉంటుంది. లేదా తను ఊహించుకోగల శక్తిని బట్టి ఉంటుంది. మనస్సు తప్ప వేరే ఆత్మ లేదని యోగవాశిష్ఠం చెబుతుంది. మనస్సే

భగవంతుడంటుంది. మనసు లేకుండా ఉండేటటువంటి స్థితి ఈ మరణదశ అయ్యేటట్లయితే అంతా మనస్సే అని చెప్పుకోవడానికి అభ్యంతరం ఏముందీ?

అమ్మ : అభ్యంతరం లేనప్పుడు అంతా మనసు అయినప్పుడు ప్రత్యేకించి జీవుడిగా ఉన్నదా? లేదా? ఈ మనసు శరీరములో ఉన్నప్పుడు మనస్సేనా? శరీరం వదలిపెట్టిన తరువాత మనసు ఏ రూపంతో ఉంటుంది.

వీ.ప్ర. : అంతా మనసు అయినప్పుడు శరీరం వదలిన తరువాత మనసు ఏ రూపంలో ఉందో చెప్పుకోవాలి.

అమ్మ : మనస్సే దైవం - మనస్సే సర్వం అని యోగవాశిష్ఠం చెబుతుంది. మనస్సే మనిషి - మనసే దైవం మనిషీ మనస్సే, దైవం మనస్సే అయినప్పుడు శరీరం లేనప్పుడు కూడా మనసు ఉండవచ్చు గదా! మనసుకు ఒక ఆకృతి ఏమన్నా చెప్పారా?

మనసుకు ఆకృతి యోగవాశిష్ఠం ఈ సర్వ సృష్టి అని చెప్పింది. అమ్మ ఈ సర్వసృష్టి అని చెప్పినప్పుడు మనసుకు ఒకే రూపం ఉండటం లేదుగా!

సు : ఒక రూపం లేదు. అమ్మ, అన్ని రకాలుగా మురికికాలువగా పరమాత్మ స్వరూపాలు అవుదామనుకున్నాడు.

అమ్మ : అశుద్ధంగా, అన్నంగా. మలయ మారుతంగా మురికి కాలువగా సర్వంగా ఉంది. ఎవరు ఏ రూపం దైవ మనుకుంటారో ఆ రూపంగ అది కనబడవచ్చు. అప్పుడది కానిది అంటూ లేదు. అయితే ఈ శరీరం వదలి పెట్టిన మనస్సు ఎట్లా ఉంటుంది? వదలిపెట్టేదేది? ఎట్లా వదలి పెడుతుంది? ఏ రూపంతో వదలి పెడుతుంది? లోపల మనసు ఏ రూపంగా ఉంది?

సు : పదార్థమైనదంతా మార్పు చెంది మనసుగా మారటమే గాని ఇంకొకటి లేదు అని.

అమ్మ : అని-తర్వాత నాకు మనసొద్దు ఉన్నప్పుడు నీలో మనసెట్లా ఉంటుం దిప్పుడు?

సు : నా శరీరంలో ఉండే మనసు అన్నీ కలుపుకొని సూక్ష్మమైపోయి ఈ రక్తప్రసారం వల్ల మెదడుకు కలిగనటువంటి సంచలనం వల్ల పూర్వజన్మ అనుభవాన్ని ఆధారం చేసుకుని ఏదో ప్రయాణం వల్ల నడుస్తున్నది. ఏదో అర్థంకాని శక్తిని మనస్సుగా ఏదో ఒకటి కనబడుతున్నది.

అమ్మ : మనసంటే రక్తంగా, మాంసంగా, కండరాలుగా ఇవన్నీ అయి ఉంటుందంటారా?

సు : అయివున్నదనే అర్థం.

అమ్మ : ఇవన్నీ అయివున్న మనసు ప్రాణం పోయిన తర్వాత - రక్తం మాంసం ఇక్కడే ఉన్నవి. రక్తం, మాంసం, కండలు ఇవన్నీ ఇక్కడే ఉన్నాయి. కానీ మనసు లేదు. ఇక్కడ ప్రాణం లేదు పోయింది. మనసంటే ఎట్లా పోయింది? ఏదైపోయింది? పోయిందేమిటి?

సు : పరమాత్మ మనస్సును కున్నప్పుడు - మనసు తత్వమే గాని - సూక్ష్మంగ కావలసినటువంటి .... .... శక్తి ఉంది. సర్వం మనోమయం అనుకున్నప్పుడు దీనిలోనూ మనోమయమే కాని మనసు వ్యక్తమయ్యే మనసు కాదు - వ్యక్తం కాని మనసు యోగ వాశిష్ఠములో ఇలా చెప్పలేదు. యోగ వాశిష్ఠంలో అంతా మనసునే చెప్పింది. సృష్టి, పాషాణాలు, చరాచరాలు స్థావర జంగమాలు అంతా అదే అయింది. నేనిట్లా అవుదామనుకున్నది. అయి ఊరుకున్నాడు. నేను మార్పు అవుదామనుకున్నాడు. మార్పుగా అయినాడు. సర్వం ఈ జగత్తులో జరిగే సర్వ కార్యక్రమాలు మార్పులో వ్యవహారం - ఆ మనసు యొక్క మార్పులే అని చెబుతున్నది. ఇందులోనే శవం, మరణం, జీవితం అంతా అని.

అమ్మ : సూక్ష్మం, సూక్ష్మం అంటున్నారే. సూక్ష్మం అంటే ఏమిటి?

సు : గట్టితనం కంటే జలం, జలం కంటే వాయువు, వాయువు కంటే అగ్ని – ఈవిధంగా సూక్ష్మాతి సూక్ష్మ తరంగాలై పోయేటువంటి – వ్యాపకభావం సూక్ష్మ తరంగం.

అమ్మ : సూక్ష్మమంటే వ్యాపక భావమా? గ్రహించటమేనా?

సు : ఆ స్థితి వచ్చేటప్పటికి గ్రహించడం కూడ వస్తుంది.

అమ్మ : సూక్ష్మ శరీరమంటే?

సూక్ష్మ శరీర మంటే ప్రత్యేకంగా శరీరం దాల్చింది లేదని.

వీ.ప్ర. : యోగ వాశిష్ఠమభిప్రాయమా? ఇది మీ అభిప్రాయమా?

సు : యోగ వాశిష్ఠములో ఉన్నదంతే అంతా కూడ మనసు – మనోమయ మయిందే సృష్టి కూడ మనస్సే. పరమాత్మ మనస్సే.

వీ.ప్ర : యోగ వాశిష్ఠంలో సూక్ష్మ శరీరం సంగతి ఉందా?

అమ్మ : సూక్ష్మశరీర మనేమాట ఉందా?

సు : యోగవాశిష్ఠములో ఉంది?

అమ్మ : ఇంకా ఉన్నాయి గదా గ్రంథాలు?

సు : సూక్ష్మశరీరం – స్థూల శరీరం – కారణ శరీరమని ఉంది. ఈ విధంగా నాలుగురకాల సృష్టేఉన్నాయని .... ....

అమ్మ : సూక్ష్మశరీరమంటే ఏమిటని?

సు : సూక్ష్మ శరీరమంటే ఈ మనసు శరీరాన్ని విడిచిపెట్టి జీవుడు న్నాడని – జీవుడు లేచి పోయిన తర్వాత సూక్ష్మశరీరంలో అక్కడా అక్కడా తిరుగుతాడని – నరకాదిలోకాలకు వెళ్ళి కొంత కాలముండి మళ్ళీ తను చేసిన పాప కర్మల ననుభవించి, తిరిగి ఇంకొక దేహాన్ని సంస్కరించు కొనేవరకు సూక్ష్మరూపంగ ఉండేవాడు సూక్ష్మశరీరం.

అమ్మ : ఆధారముందా?

సు : దీని కాధారం శాస్త్రాలు చెప్పాయి కాని

అమ్మ : ఏ శాస్త్రాలు చెప్పినవి.

సు : గరుడ పురాణం చెబుతుంది ఉపనిషత్తులలో ఓ ఉపనిషత్తు చెబుతుంది.

శ్రీపాద : ప్రతి ఉపనిషత్తు చెబుతుందా?

అమ్మ : దాని విషయం జ్ఞాపకం లేదు గాని

సో : పూర్వజన్మలను గురించి కేనోపనిషత్తులో చెప్పారా కఠోపఖిషత్తులోనా?

సు : కఠోపనిషత్తులో చెప్పలేదు గాని కేవలం పరబ్రహ్మ పదార్థాన్ని గురించి చెప్పింది. సూక్ష్మ శరీరాన్ని గురించి చెప్పలా.

అమ్మ : నా అభిప్రాయం లేదని (జీవుడు)
స్పష్టంగా లేదనే అనిపిస్తుంది. లేదనే మాట అందరూ నమ్మాలని నాకు లేదు. నాకు (జీవుడు) ఉన్నాడని ఋజువు చేస్తే నమ్ముదామనే ఉంది. మీ అందరితో ఆడుకోవాలనే ఉంది. అయితే పుట్టటం నిజమా? ఏం పోతున్నది? ఎట్లా పోతున్నది? ఎక్కడికి పోతున్నది? ఎక్కడ నుండి వస్తుంది? తెలుసుకోవాలి. ఏ ఇద్దరు ముగ్గురో పూర్వజన్మలు చెబుతున్నారంటే....

సు : బాగా ఆలోచించే వాడికి ఎవరికీ నమ్మకం లేదు. నాకూ నమ్మకం లేదు.

వీ.ప్ర. : యోగవాశిష్ఠం, శాస్త్రం ఏం చెబుతుందని?

సు : యోగవాశిష్ఠం జన్మలు లేవనే చెబుతుంది.

అమ్మ : సృష్టంతా మనోమయం తప్ప రెండోదిలేదు. మనోమయం సృష్టి. మనసే దైవం. మనసే చావు. మనసే పుట్టుక అని చెబుతుంది.

శ్రీపాద : యోగ వాశిష్ఠం జన్మలు లేవని చెబుతుందా?

సో : చెబుతుంది. యోగవాశిష్ఠం చెప్పే పునర్జన్మ ప్రకారం చాలా వింతగా వుంటుంది. కౌశికుడు తాను బ్రతికుండగానే ఎన్నో జన్మ లెత్తానని చూస్తాడు. ఆ భ్రమతీరగానే అయ్యో! నేనవన్నీఎత్తానా? అనుకుంటాడు. అక్కడ కటంజకుడు ఉన్నాడు. ఆ దేశాధిపతి ఉన్నాడు. కలలో నిజంగానే చూస్తాడు.

అమ్మ : నే ననుకునేది చావు పుట్టుకల పరిణామం. మనిషుండగా అనేక సార్లు పుడతాడు. అనేకసార్లు చూస్తాడు. మార్పే చావు పుట్టుక. ఒక స్థితి పోయి మరొక స్థితికి రావటం మార్పు. బాల్యం గుర్తు లేదు. అదంతా చచ్చిపోయినట్టే అనిపిస్తుంది నాకు. ఆ పరిణామమే చావుపుట్టుక లనుకుంటాడు.

శ్రీపాద : మరణం తర్వాత. అమ్మా! అప్పుడూ పరిణామం లేదా?

అమ్మ : లేదు. అదేనేననేది. దేహంలో పరిణామమా?

దేహం తర్వాత పరిణామముందా? దేహాన్ని పరిణామం చెయ్యకలిగిన ఆ శక్తి – దేహాన్ని విడిచి అది ఏమవుతుంది? మనం వేసుకో వాల్సిన ప్రశ్న అది. దేహాన్ని పెంపుచేస్తున్నది బాల్యం, యౌవనం, వృద్ధాప్యం దేహాన్ని ధరించిన ఆ శక్తి అదేదో అర్థంకాని శక్తి పెంచుతున్నది. లయం చేస్తున్నది, మార్పు చేస్తున్నది. శరీరం వదలిన ఆ శక్తి ఇంకొకరకంగా ఎట్లా పరిణామం చెందుతున్నది? ఆ పరిణామం అర్థంకాలేదు. గనక దాన్ని మనం జన్మలు అన్నాం. ఆ పరిణామం అర్థంకాక దాన్ని జన్మలుగా తీసుకున్నాం మనం. అర్థంకాలేదు గనక దానికి జన్మలుగా పేరెందుకు పెట్టాలి అని అడుగుతున్నాను. అర్థం కాలేదనే వదిలేద్దాం! ఏమిటో తెలియనప్పుడు జన్మలని పేరు పెట్టి భయపెట్టవద్దు. హుష్ కాకి! అనవద్దు. ఆధారం దొరికేదాకా లేదనుకుంటున్నాను. మీరట్లాగే నమ్మితే నమ్మండి. నమ్మకపోతే పోండి.

సు : పరిణామ మంటే ఏమిటి?

అమ్మ : మార్పు నాన్న.

సు : జన్మలకు పరిణామ మేముంది?

అమ్మ : ఏముంది? శరీరంలో పరిణామ మొస్తుందిగదా! ఆ శక్తి పరిణామం చేస్తున్నది గదా! వృద్ధాప్యం వస్తున్నది గదా! పెరుగుదల కన్పిస్తున్నది గదా! ఇది శరీర ధర్మ మంటున్నాను. దీన్ని ఈ శరీరానికి ధర్మం ఏర్పరచిన

ఈ మార్పు–శరీరాన్ని వదలి పెట్టిన తర్వాత అది ఏదో ఉందను కుంటున్నామే అది ఆ మార్పు ఏమవుతుంది అని ప్రశ్న నాకు తెలియదు. అంతా అది అయినది ఏదైతే ఉందో - అది, అందులో కలుస్తుం దనుకుంటాం కలవడమేముంది? అదే. రెండు చెంబులలోని నీరు - దానిలో నీరు, దీనిలోని నీరు కలిపితే ఏమవుతుంది అంటే ఏమి చెప్పేది? నాకు చెప్పడం చేతగాక వదిలేశాను.

సు : ప్రతి రోజూ ఒక జన్మ.

అమ్మ : అనను. ప్రతి సెకండూ.

వీ.ప్ర. : ప్రతి క్షణములో జరిగే మార్పుకు చావనుకునే మార్పుకు తేడా లేదా?

అమ్మ : ఇది గుర్తింపు వస్తుంది. తేడా లేకపోతే ఇంత ఏడుపెందుకేదుస్తాం?

వీ.ప్ర. : సాధారణమైన మార్పుకాదు. అది విలక్షణమైన మార్పుగా కనిపిస్తుంది. యౌవనం నుండి వృద్ధాప్యం వరకు కేవలం పరిణామంలోనే మార్పు వస్తుందేమో - గుర్తు మాత్రం అది ఉన్నది. చావన్న తర్వాత ఆ గుర్తు కూడ లేకుండ పోతున్నది. ఇదీ పరిణామమే అదీ పరిణామమే. చెప్పలేముగా?

అమ్మ : అందుకే చెప్పలేనిదంటున్నా. శరీరం వదలిన తర్వాత అది ఏమవుతున్నదో; ఉందో, లేదో తెలియదు. అందుకే చెప్పలేకపోతున్నాను.

వీ.ప్ర. : ప్రతిదఫా కణాలు పుట్టి - చావటమనేది.

అమ్మ : మార్పును .... .... ఒక స్థితి మారి .... .... ఇంకొక స్థితి పొందే మార్పును

వీ.ప్ర. : ఆ మార్పు మన కర్థం కాని మార్పు.

అమ్మ : అంతే.

శ్రీపాద : మరణంలో ఉన్న తేదాలను బట్టి, అనుభవాలలో ఉన్నతేడాలన్నీ ఎందు కున్నాయి. అన్న ప్రశ్న వేసుకుని మనం ఇది వరకుండటాన్ని బట్టి అనుభవాలు ఉన్నాయి అంటున్నారు.

వీ.ప్ర. : క్రిందటి జన్మలో ఇది జరిగింది అని ఒకడు చెబితే స్మృతులను బట్టి ఆత్మ ఉంది దేహధారణ చేసి ఉండాలి అనే నిర్ణయానికి వస్తున్నారు. అట్లా ఉండాల్సిన అవసరం లేదుగా. స్మృతులు వేరే రూపంలోనైనా రావచ్చు. కేవలం గత శరీరం ధరించటం మూలంగ - ఆ జీవుడే ఇక్కడ వుండటం మూలంగా స్మృతులుండక పోవచ్చుగా, దాన్ని నిర్ధారణ చెయ్యలేరుగా. స్మృతులున్నాయి కాబట్టి దేహధారణ చేశాడు అన్నప్పుడు ఈ మధ్యకాలంలో ఎక్కడున్నాడు అన్న ప్రశ్నకు సమాధానం లేదు. మామూలు వాడు కాకపోయినా ఇంకొకడు ఆత్మ జ్ఞానం తెలిసినవాడైన ఆ సంగతి చెప్పటం లేదు.

శ్రీపాద : ఉపనిషత్తులు పరలోకాలు వీళ్ళు చెప్పటంలా. మేఘాల్లోకి చూశాను. వర్షమైనాను, యవలైనాను. జన్మలెత్తాను; అని చెప్పటంలేదు వీళ్ళు. అక్కడ చచ్చిపోయి ఇక్కడ పుట్టిన తర్వాత చెబుతున్నారు. ఉపనిషత్తులలో ఈ మధ్య ప్రయాణాన్ని వాళ్ళు కన్సిడర్ చెయ్యటం లేదు.

సు : ఇప్పుడు ఒక ఉదాహరణకు సాయిబాబాను తీసుకుంటున్నాను. తాను 1918లో అతను పోతే 1926లో సత్యసాయిబాబా జన్మ ఎత్తాడని అంటారు. ఇప్పుడాయన చిన్నతనంలో గత షిర్డీసాయిబాబా చిన్నతనంలో ఏం చేశాడో ఊహ తెలియనప్పుడు ఈయన చెప్పలేకపోతున్నాడు. అంత వర్తమానం జ్ఞానం గల అమ్మ విషయంలో షిర్డీసాయిబాబా తన బిడ్డగా ఉన్నప్పుడు - బిడ్డలాగ ఎలా వ్యవహరించాడో అమ్మ చెప్తే వినాలని వుంది.

అమ్మ : అంతా వర్తమానమంటే కనబడుతున్న వర్తమానమే గాని జన్మకు ముందుగాని జన్మకు తర్వాత గాని ఏం లేదు. నేను ఈ శరీర ధారిణి అయిన విషయమే మాట్లాడుతున్నాను. సాయిబాబా చిన్నతనం చెప్పడమంటే ఇప్పటిది కాదుగా.

సు : అమ్మ పుట్టక ముందు పూర్వ సంగతి చెప్పారని అన్నారుగా.

అమ్మ : సంవత్సరం తేడా ఏమోగాని పుట్టకముందు చెప్పిన విషయాలు ఏవీ లేవు.

శ్రీపాద : సంవత్సరం తేడా! మీరు పుట్టిన తర్వాత చెప్పిందే మీరు పుట్టక ముందు చెప్పినవి కావు.

అమ్మ : చిన్నతనం గుర్తుంది అని ఒప్పుకుంటాను గాని, పుట్టక ముందు చెప్పినవి లేవు.

శ్రీపాద : **1918**లో మంగళగిరి బాలాంబ సత్రంలో అన్నం వడ్డించలేదా అని అడిగారుగా గోవిందరాజు దత్తాత్రేయశర్మగారిని.

అమ్మ : అంత మాత్రాన ఎట్లా? అది వద్దనేనా అభిప్రాయం.

సు : నేను నిజంగా సందేహంతోనే అడిగాను. ఒకా నొక పూర్వ జన్మదశలో రెండు మనసులు ఆకర్షించగలిగి చెప్పగలిగితే అది నిబద్ధం కానక్కర లేదని.... ....

అమ్మ : తెలిస్తే నాకు చెప్పాలనే వుంది. నాకు పుట్టాలనే ఉంది. అందుకే నేను ఋజువు కావాలంటున్నానుగా.

# శక్తి - నమ్మకము

సోదరుడు: అక్కడ న్యాయస్థానం దగ్గరికిపోతే, ధర్మాన్ని అధర్మంగా వాదించి Judgement ను కూడా మార్పించ కలుగుతున్నాం. మానవుడికి ఈ విధంగా రాక్షస ప్రకృతి పెరిగిపోతోంటే, ఇలాటి మనుష్యుల్ని దైవం వేపు మళ్ళించటానికి ఎవరైనా ప్రవక్త అవసరమంటారా?

అమ్మ : 24 గం॥ లూ అనుష్ఠానం చేసి, నా వృత్తి ప్లీడరో, జడ్జియో అయినప్పుడు... ఓ కేసు తీసుకున్నాను, తప్పని తెలుసు, అయినా వాదించి గెలుస్తాను. భయం వున్నదిగా. ఇంట్లో చేసిందంతా అనుష్ఠానం. అదేగా కుటుంబంతో సహా సంకల్పం చెప్పుకుని మరీ చేస్తాడు గదా! ఇక్కడ అబద్ధమాడినా, అది (అనుష్ఠానం) కొట్టేస్తుందన్న ధైర్యమంటారా?

సో : మరి అంతేకదా! వెంకటేశ్వరస్వామి దగ్గరికి వెళ్ళి మొక్కుకుని వచ్చి, దాంతో చేసిన పాపం పోయిందని, మళ్ళీ ఓ ముడుపు కట్టి ఇంకో పాపకార్యం తలపెడ్తాడు.

అమ్మ : అప్పుడు రెండూ మన చేతుల్లోనే వున్నాయి పాపం చెయ్యటం తీసెయ్యటం మన చేతిలోనే వుంది. మరి దీన్ని నిరోధించటం ఎలా? నిరోధం నీలోంచే కదా రావాలి, నిన్ను నువ్వే నిరోధించుకోలేక పోతున్నావు కదా. అందువల్లనే నిన్ను నువ్వు నిరోధించుకోలేవు, నీ చేతుల్లో లేదని చెప్పేది. అట్లా నిరోధించు కోగలనంటావా, పాపం పుణ్యం నీ చేతుల్లోనే వున్నాయి. లేదంటావా, ఇంకోటి ఏదో వుంది అనుకొని, డ్యూటీ చేసుకుంటూ పోతూ.... డ్యూటీ చేయిస్తుంటే చేస్తున్నాను. అనుకో.

ఒకరు : మనిషి ఒక అన్యాయం చేసిం తర్వాత, అన్యాయం చేశానని ప్రార్థన చేస్తే - ఆ పాపం పోతుందా, పోదా?

అమ్మ : అట్లాంటప్పుడు రెండూ వీడి చేతుల్లోనే వున్నాయి. ఆ చేసిన తప్పులకి మంత్రాలు చదివితే పాపం పోయేట్టయితే నాలుగు మంత్రాలు చదివితే వీడికి మనశ్శాంతి. రెండూకాడే.

సీతామహాలక్ష్మి : అమ్మా చాల ప్రశ్నలు అడిగాం. ఇదొక్కటే చెప్పండి. ఈ జన్మలో మనం చేసిన చెడ్డపనులకి ఫలం ఇక్కడే అనుభవిస్తాం అంటారు. ఈ జన్మలో మనం చేసిన కర్మలకి ఇక్కడే అనుభవిస్తున్నాం అనే feeling వస్తోంది, తెలుస్తోంది. అది కొంతవరకూ నిజమేనంటారా?

అమ్మ : అలా తెలియనప్పుడో? తెలుస్తున్నప్పుడు హాయిగానే వుంటుంది తెలియనప్పుడు బాధ.

ఒకరు : క్షమించండి. ఇంకొక ప్రశ్న అడుగుతాను. మీరు ఆహారం తీసుకోరని, నిద్రపోరనీ విన్నాం. అదెట్లా సాధ్యం?

అమ్మ : రెండూ చేస్తాను నాన్నా. ఆహారమంటే, అన్నమే ఆహారం కాదుగా. అసలు ఏమీ తీసుకోకుండా వుండను. తీసుకుంటాను. ఎప్పుడైనా పండ్లు - పండ్లు లేకపోయినా ఇబ్బంది లేదు.

సో3 : అంటే మనిషి శరీరానికి సరిపడిన ఆహారం.

అమ్మ : ఆహారం లేకపోతే శరీరానికి ఇబ్బందని లేదుగాని, తినకూడదనే నిషేధం కూడా లేదు. ఏ సాధనా చెయ్యలేదు. ఇప్పుడిట్లా కూచున్నాం. కూచుంటాను. మీరు లేరు, పడుకుంటాను. నిద్ర నిషేధం లేదు. నిద్రపోనని లేదు. ఈ నిద్ర పోకపోతే శరీరానికి బడలిక లేదు.

సో4 : ఇది కూడా ఒక సాధనేగా.

సో5 : సాధన లేకుండానే మీకొచ్చింది.

అమ్మ : సాధనమేగాని, సాధన లేదు. ఇదంతా కాంది ఏదో వుందని అనుకుంటే గదా, సాధన చేసేది. పశువులకి మేత వేస్తే, అవి తింటే తృప్తి అనిపించేది. చల్లచేస్తే, పదిమందికీ విస్తళ్ళల్లో పొయ్యొచ్చుగదా అని తృప్తి. మీరు అన్నం తినటం నాకు తృప్తి. మీ సదుపాయాలు చూడటం తృప్తి. ఇప్పుడొక కుక్క వాకిట్లోకి వచ్చింది. అది అకలి గొన్నది. అన్నం పెడితే తృప్తి ఇట్లా.... .... మీరే సర్వం. కనపడుతున్నదే అది. ఇవన్నీ బరువు, ఇది అక్కరలేదు అనే ఆలోచన రాలేదు. ఇది ఆధ్యాత్మికం అని చెయ్యలేదు. దానికోసం కృషి చెయ్యలేదు.

సో4 : అయితే మమ్మల్ని మనసు వెంబడే పొమ్మంటారా? నిరోధించే ప్రయత్నం చెయ్యొద్దంటారా?

అమ్మ : చెయ్యవద్దనటంలేదు. మనసు చెప్తే చెయ్యండి.

సో4 : తప్పని తోచినప్పుడు చెయ్యొచ్చన్న మాట (నిరోధించే ప్రయత్నం).

అమ్మకి ఎదురుగా కూర్చున్న ఒక సోదరుడు తూలుతున్నట్లుగా కన్పిస్తే అమ్మ, నిద్ర వస్తోందా? అని అడిగారు.

సో6 : ఇప్పుడు నాకొక దర్శనం అయిందమ్మా నిద్రలో పెద్ద గుహ. అందులో ఏదో రంధ్రం కనపడుతోంది. రెండుసార్లు నిద్రపట్టి, రెండుసార్లు ఇలా కన్పించింది. నాకేమీ అర్థంకావట్లేదు. ఇలా నాకు చాలా దర్శనాలు అవుతూనే వుంటాయి. ఈ కనబడే సూర్యుడు, చంద్రుడు, నక్షత్రాలు కాకుండా. ఇంకా ఇంతకంటే పెద్ద గోళాలు సృష్టిలో వున్నాయని, అవి మనకు కనిపించటల్లేదని చెప్తున్నారు. మనకి కనిపిస్తున్న సూర్యుడు చాలా చిన్న సూర్యుడు. ఆ పెద్ద సూర్యుడి సంగతి మనకు తెలీదు. ఆ కనిపించని లోకాల సంగతి మనకు తెలీదు. కనిపించే దగ్గర నక్షత్రానికి వెళ్ళటానికే ఎన్నో కోట్ల కాంతి సంవత్సరాలు పడుతుందంటారు.

అటువంటప్పుడు జన్మపరంపర కూడా అంతే ఇప్పుడన్నారే, ఏదో స్థితిని గురించిన ఆలోచన నాకు లేదు. సాధ్యమేగాని సాధన నాకు లేదూ అని; అంటే ఇది వరకు ఎన్నో జన్మల నించి చేసిన స్థితి మీకిప్పుడు వచ్చింది. అందుకని లోకాంతరాలూ వున్నాయి. జన్మపరంపరలు కూడా వున్నాయి. మానవుడు జన్మిస్తాడు అంటే, ఈ లోకంలోనే కాదు, ఇంకే లోకంలో నైనా జన్మ ఎత్తవచ్చు. అనేక కోటి బ్రహ్మాండాలు అంటున్నారు గనుక భౌతికమైన సిద్ధులు, సిద్ధులే కాదు. సృష్టి అంతా పరతంత్రమే మీరు ప్రతిదీ మా మనసులకి అర్థమయ్యేటట్లుగా చెప్తున్నారేగాని... మీది మాత్రం అతీతమైన స్థితి.

ఇందాక మేం భోజనాలు చేస్తున్నప్పుడు, సంభాషణలో ఒక విషయం వచ్చింది. టేప్‌రికార్డర్‌లో ఇప్పుడేగా చెప్పింది' ఇప్పుడేగా చెప్పింది అని రెండు సార్లు విన్పించింది. ఆ సమయంలో వరండాలో టేప్ రికార్డర్, ఆన్ చేసి వుంది. రాజు పాటలు శ్రీపాదగారి ఉపన్యాసం విన్నారు. వాళ్ళు ప్రతి సంఘటనకీ మౌలికమైన సూచనలు సూక్ష్మంగా వుంటాయి. అటువంటి సూక్ష్మ స్థితి ఇక్కడ గోచరమవుతోంది, అని ఆయన తన అనుభవాన్ని విశదీకరించారు.

అమ్మ : మౌనంగా విని వూరుకున్నారు.

సో3 : మన ఆంధ్ర రాష్ట్రంలో పుట్టపర్తి సాయిబాబాగారని ఒకరున్నారు. ఆయన నేనే దైవం, అవతారం, నన్ను నమ్మండీ అంటున్నారు. దానిమీద మీ అభిప్రాయం?

అమ్మ : నాకేం అభిప్రాయం లేదు.

సో : ఆయన నేనే దేవుడ్ని, నన్ను నమ్మండీ అంటున్నారు.

అమ్మ : నమ్మేవాళ్ళనే గదా నమ్మమంటున్నది. నమ్మనివాడు ఎటూ నమ్మడు. నమ్మేవాడికి, బాధలేదు.

సో1 : నమ్మనివాడు నరకానికి పోతాడు అంటున్నారు.

ఈయన ఇలా అనగానే, దీన్ని వాళ్ళల్లో వాళ్ళు తర్కించుకుని సాయిబాబా అలా అనలేదని తీర్మానించుకున్నారు.

సో2 : ఎవ్వరూ అనలేదు అట్లా, ఏ మహాత్ముడూ అనలేదు అట్లా.

సో1 : ఎందుకు అనలేదంటే, క్రైస్తవులు అంటూనే వున్నారు గదా, నమ్మకపోతే మీరు మోక్షం లేదంటున్నారు.

సీతామహాలక్ష్మి : క్రీస్తు అనలేదు. వీళ్ళంటున్నారు. (క్రైస్తవ మతస్థులు)

సో4 : వాళ్ళు చెప్పే దొకటి చేసేదొకటి. ఇన్ని రకాలుగా వీళ్ళంతా చెప్తోంటే, ఎవరిని నమ్మాలో ఎలా తెలుస్తుంది?

అమ్మ : ఇందాక చెప్పానుగా నాన్నా. సత్యసాయిని నమ్ముకో, నిన్ను నమ్ముకో, నన్ను నమ్ముకో... ఏదయినా ఒకటే, నమ్మకమే గొప్పది, నమ్మకమే దైవం అని నా ఉద్దేశ్యం. తను దైవం అంటే, మీరు దైవం కాదని ఉద్దేశ్యం కాదు. హాయి, సుఖం, నరకం, మోక్షం ఎక్కడో లేవు. ఇక్కడే తెలుస్తోంది. నమ్మిన వాడికి మనసు హాయిగా వుంటుంది. అదే స్వర్గం. నమ్మనివాడికి బాధ కలిగితే, అదే నరకం అనుకుంటూ వుంటారు. అందువల్ల స్వర్గం నరకం ఎక్కడోలేవు. ఇక్కడే వున్నాయని తెలుస్తోంది. నమ్మకం పాకీదొడ్డిని నమ్మినా గొప్పదే. అక్కడి వరకెందుకు, నీ మనసుకి నువ్వే తేల్చు... నీ మనసుని నువ్వు నమ్మ లేనప్పుడు, ఆయన నమ్మమన్నా ఎట్లా నమ్మగలవు? ఇప్పుడు మీరు నమస్కారం చేశారు. నమస్కారం చేయించుకున్న వాడికంటే, చేసినవాడు గొప్పవాడనుకుంటాను. మీకు మీరే నమస్కారం చేసుకుంటున్నారు అనుకుంటాను. నమ్మిందెవరు? నువ్వు కదా. నాలో దైవత్వం చూసిందెవరు, తనుకదా నువ్వు చూసిందేదో అనుభవిస్తున్నావు. ఇక్కడ ఏది చూసి అనుభవించాడో, అక్కడ అది వచ్చింది. సుఖం, శాంతి, హాయి అనుభవించేది మీరేగా ఇది ప్రేరణగా అది అనుభవిస్తున్నారు. నేను మీ అందరిలో ఒకటే చూస్తున్నాను. నా పిల్లలు, ఒక్కొక్కళ్ళది ఒక్కొక్క స్వభావం అనుకుంటాను. వీడికిది ఆనందం, ఇది వీడి స్వభావం వాడికది ఆనందం వాడికది స్వభావం అనుకుంటాను. నరకం అనేది వేరేలేదు. ఇదే నరకం. బాధే నరకం. కృష్ణుడు నన్నే నమ్మమన్నాడు. కాని ఎందరు నమ్మగలిగారు. నమ్మినవాడికి బాధలేదు. నమ్మనివాడికి అసలు దాన్ని గురించి ఆలోచనే లేదు. మనల్ని మనం నమ్ముకోవటమే.

ఇందులో మామూలుగా మనం చదివే శ్లోకం అర్థం అదే కదా. గురువులో బ్రహ్మని చూడమన్నాడు. గురువులో విష్ణువుని చూడమన్నాడు. వాటిని విడతీస్తే, సృష్టి, స్థితి, లయ హేతువులు అంటున్నాం. ఇంకా

విడతీస్తే తినే పదార్థాలు విష్ణువు అనుకుంటున్నాం. ఆలోచనలు కలిగించేది బ్రహ్మ అనుకుంటున్నాం. రూపాంతరాలన్నీ శివుడు అనుకుంటున్నాం. వస్తువు విష్ణువు కాదనేదేముంది? బియ్యం విష్ణువు రూపమే. పోషించే శక్తి వుందిగా. కనపడే వాటిల్లో ఆ ముగ్గురే వున్నారు. అనుకునే వాటిల్లోనూ ఆ మూడే. బ్రహ్మ ... .... .... సరస్వతి ఆయన భార్య అన్నారు. మనసుకి ఆలోచనలు వస్తోంది, ఆలోచన ద్వారా చేస్తున్నాం కాబట్టి మనసు బ్రహ్మ కాదూ.

దేనికి భిన్నత్వం వేరేలేదు.

ఒకరు : నమ్మకమే దైవం అనుకున్నప్పుడు ఎవరి నమ్మకాన్ని బట్టి వారికి దైవం మార్తున్నాడు. కొందరు వెంకటేశ్వరస్వామిని, ఇంకొందరు ఇంకో దేవుడ్నీ నమ్ముకోవటం వల్ల, సంఘర్షణకి అవకాశం ఏర్పడుతోంది, నా దైవం గొప్పంటే, నా దైవం గొప్పని.

అమ్మ : నిజమే, ఎవరి దైవం వారికే గొప్ప. రూపం పరిమితం కానీ, శక్తి అనంతం. మనం పరిమితంగా మామూలుగా ఆలోచిస్తే....

తల్లికి బిడ్డ ఎట్లాగో, భక్తుడికి భగవంతుడంతే. భగవంతుడు ఎట్లాంటివాడో మనకి వద్దు. అది తీసెయ్యి. భక్తుడికి భగవంతుడట్లా. తల్లికి ఎంత అనాకారి వాడైనా తన వస్తువు మీద ఎంత మమకారం వుంటుందో, భక్తుడికి భగవంతుడి మీద అంతే మమకారం వుంటుంది. ప్రేమేగా అక్కడా ప్రేమే, ఇక్కడా ప్రేమే, భగవంతుడి మీద ప్రేమని భక్తి అంటున్నాం. మానవుల మీద ప్రేమని బంధం అంటున్నాం. పరిమితంగా వుంటే రాగం అన్నాం. లేక పోతే మాధవత్వం అన్నాం.

ఒకరు : కానీ, ఈ ఆధ్యాత్మిక దృష్టితో నమ్మకాన్ని ఏర్పరుచుకుంటే, తన నమ్మకాన్నే ఇతర్లు నమ్మాలనుకుంటాడు.

అమ్మ : అనేకం అనుభవిస్తున్నాను, వంకాయకూర తింటున్నాను. ఒరేయ్ ఇది బావుందిరా తినమంటాడు.

ఒకరు : మరి అంటువంటప్పుడు ద్వేషించటం ఎందుకు.

అమ్మ : ద్వేషించదు.

సో : క్రైస్తవులు, మా మతంలో అయితేనే ముక్తి దొరుకుతుంది. రమ్మంటున్నారు.

అమ్మ : మాట్లాడటం కుదరకనే నాన్నా, అది నిజంగా బైబిలు అర్థం అయితే అలా అనను కదా. వాళ్ళకి అర్థం కాలా, ఏం చేస్తారు మరి. ఒక్కమాట చాలు కదా, పొరుగింటి వాళ్ళని ప్రేమించ మన్నాడు. వాళ్ళ సూక్తి వాళ్ళు మర్చిపోయి మనకేం బోధిస్తారు.

ఒకరు : పరమతాల సంగతి కాకుండా, మన మతంలోనే ఎన్నో వైరుధ్యాలున్నాయి.

అమ్మ : మతాలు ఎవరి వయినా ఒకటే. భక్తులకీ, పీఠాలకీ పీఠాలకూ, బొట్టు బొట్టుకీ వున్నది. అంతవరకెందుకు కుర్చీకీ, కుర్చీకీ వున్నది. ఇట్లా వున్నాయి నాన్నా.

ఒకడు : ఒక లక్ష్యం కోసమే ఆలోచిస్తూ, ఇన్ని వైరుధ్యాలేమిటి?

అమ్మ : పొట్ట నిండటంకోసం అన్నం తిని, పదార్థం కోసం అనుకుంటాడు. ఈ మార్గం కోసం బాధలు. అన్నం మానుకోడు, రోజూ వంకాయ కూరేనా అంటాడు. అనుపాకాలు వేరే కావాలి. అన్నాన్ని విసుక్కోడు. అనుపానాల్ని విసుక్కుంటాడు. ఇవన్నీ అటువంటివే. ఆ వస్తువుని పొందటంకోసం అనుపాకాలు.

ఒకడు : మీరేమైనా పొందగలిగారా ఆ వస్తువును.

అమ్మ : చెప్పానుగా, మీ అందర్నీ చూడటమే, నేను పొందటం, ఇది కాకుండా ఇంకోటి ఏదో వుంది చూద్దామను కోవటం లేదు.

ఒకరు : పీఠాధిపతులు బోధించే బ్రహ్మ పదార్థాన్ని గురించి మీకేమైనా తెలుసా?

అమ్మ : వాళ్ళు చెప్పే పదార్థం నాకు తెలీదు. వాళ్ళేం చెప్తున్నారో నేనెక్కడికి వెళ్ళలేదు. బోధలేవీ వినలేదు. నాకు మీరే బ్రహ్మ పదార్థం అని చెప్తున్నాగా.

ఒకరు : ఎవరి అనుభవాలు, అనుభూతి వారిదే అయినప్పుడు, ఒకరి అనుభవాన్ని ఇంకొకరితో మాట్లాడటానికి అసలు వీలు లేదుగా.

సో 2 : అనుభవం కాదు అనిపించేది.

అమ్మ : అట్లా అనుకుంటే వేదాంతం మాట్లాదేది కాదు. వేదాంతం ఎప్పుడూ, చెప్పేవాడికి, వినేవాడికీ తెలీదు, వ్యావహారికం అయితే, ఒకడికి తెలిసి వినేవాడికి తెలీక వింటాడేమో గానీ, ఇది ఇద్దరికీ తెలియంది.

సో 6 : పరబ్రహ్మాని గురించి చెప్పమంటే, అది మౌనవ్యాఖ్యానం అంటారు.

సో 2 : మీరు ఇతర నగరాలకి రారా?

అమ్మ : రాననేం లేదు కాని, ప్రస్తుతం రావటంలేదు.

సో 6 : వేదాద్రి ఎప్పుడయినా వెళ్ళారా?

అమ్మ : వెళ్ళలేదు. ఇందాక నువ్వు చెప్పింది అక్కడిదే. (పెద్దగుహ అందులో ఓ రంధ్రం కన్పించటం)

సో 4 : ప్రపంచం విషయాలు ఈ ఎలక్షన్లు పార్టీలు వున్నాయి కదా, ఎలక్షన్లప్పుడు వాళ్ళు వచ్చి ఎవరికి ఓటెయ్యాలీ అని అడిగితే ఏం చెప్తారు?

అమ్మ : ఎలక్షన్ల దాకా అక్కర్లా. నిత్యకృత్యం దొంగ దొంగతనానికి పోతూ, పోగానే వస్తువు దొరకాలని దండం పెట్టుకుంటాడు. యజమాని తాళం వేసి, నా వస్తువు పోకుండా వుండాలని దణ్ణం పెట్టుకుంటున్నాడు. నిత్య ఎలక్షనే ఇదంతా. ఎప్పుడు ఎవరికేం అవసరమో అది అందుతోంది.

సో 4 : హైద్రాబాద్ రావటానికి - ఏర్పాట్లవీ చేస్తే వస్తారా?

అమ్మ : ఏర్పాట్లేమీ అక్కర్లేదు. రావలసిన సమయం వస్తే వస్తాను. వచ్చే సమయం నాకు రావాలి కదా. అది వస్తే వస్తాను.

సో 3 : భజనలూ, అవీ మీకు ఇష్టమేనా.

అమ్మ : నాకన్నీ ఇష్టమే. ఏమీ చెయ్యని వాడు, అన్నీ చేసేవాడు.

సో 3 : ఆస్తికుడూ, నాస్తికుడూ.

అమ్మ : పూర్తి నాస్తికుడు, పూర్తి ఆస్తికుడే గదా. మాటలు గాకుండా పూర్తిగా ఆస్తికత్వం వున్నవాడూ, పూర్తిగా నాస్తికత్వం వున్నవాడూ ఒకటే.

ఒకరు : నాస్తికుడు, దేవుడు లేదు లేదు అంటూ, దేవుణ్ని గురించి స్మరిస్తూ వుంటాడు.

అమ్మ : ఏం లేదు వాడికి? ఫలానిదని వెతికి లేదనుకుంటాడు. వీడికేదో వుందనుకొని వీడు చూస్తున్నాడు. వీడికి దొరికిందీ లేదు. వాడికి దొరకందీ లేదు.

సీ.మ. : ఒకసారి మీ దగ్గరికి వచ్చిపోయిన వాళ్ళు పిచ్చి వాళ్ళవుతారు.

సో 3 : ఇంతమంది మీ దగ్గరకు వస్తూ వుంటారు కదా. వీరంతా మీకు గుర్తుంటారా?

అమ్మ : ఇదివరకు లేదు మరుపు. సాధ్యమయినంతవరకూ వుంటారు నాన్నా.

సో 3 : వుండదని తెలుసు, (మరుపు) మీ దృష్టిలో మేం వుంటామా అని.

అమ్మ : తప్పకుండా వుంటారు. గొఱ్ఱెలవాడికి గొఱ్ఱెల మంద గుర్తుండదా. (పగలబడి నవ్వారంత 'బాగా చెప్పారు' అంటూ.)

సో 4 : మీ మాటల్లో ఏన్నో అర్థాలున్నాయి.

సో 2 : వారు మాట్లాడితే. అది రిసీవర్. ఎక్కణ్నించి వస్తున్నయ్యా ఆ రిసీవర్‌కి, ఆ అతీతమైన శక్తి ప్రవాహంలా వస్తోంది. హిమాలయాల మీద నించి గంగాలహరి వచ్చి ఇలా ప్రవహిస్తోంది.

సో 3 : మీకు ఒక గురువు కానీ, ఒక సాధన కానీ లేనప్పుడు, మరి ఈ వ్రతాలు ..... నోములూ.....

అమ్మ : వ్రతాలు, నోములూ నేను పట్టలేదు. ఇవన్నీ ఎందుకూ అంటే .... నా అనుభవంతో చెప్తున్నా! సాధారణంగా మనం వాడుకుండే వస్తువుకి విలువ ఇస్తాం. ఎప్పుడు ఏవ్యక్తితో అవసరం అయితే వాటికి విలువ ఇస్తాం. అన్నీ మనకు కావాలసినవే. కానీ అవసరాన్ని బట్టి విలువ ఇస్తూ వుంటాం. పులి ఆకు కూడా కొన్ని సమయాల్లో పవిత్రం మనకి.

పూర్వం మనవాళ్ళు పిల్లలకోసమని పులి ఆకు తెచ్చి పూజచేసేవారు. అది ఎవరు తిన్నదో తెలీదు. మనం తిన్న విస్తరే, తిన్న తర్వాత దాన్నిచూస్తే అసహ్యం వేస్తుంది. కానీ అవసరం విలువయింది. అదే విస్తరికి పూజ చేస్తాం. దానంతటది కొట్టుకు వచ్చి తాకితే, స్నానం చేస్తారు. 24 గంటలూ, 360 రోజులూ మనకి వ్రతాలున్నాయి. చిన్న పిల్లలప్పటి నించీ 5 ఏళ్ళ పిల్లలప్పటినించీ వ్రతాలున్నాయి. డబ్బాలో పసుపు వుంటుంది. దణ్ణం పెట్టం. అదే పసుపు గోడకి రాసి, బొట్టుపెడితే, పోలేరమ్మని నమస్కారం చేస్తాం. 10, 11 సంవత్సరాల వయసు వచ్చిం తర్వాత ఒకనాడు రోకలికి దారం కట్టి మళ్ళీ రెండోనాడు దాన్ని కాళ్ళతో తన్నాం. అది దైవంగా చూసేవారు. ప్రతి వస్తువుకీ విలువ ఇవ్వటానికే ఆ ప్రత్యేకత చూడటం కోసమే ఇవన్నీ పెట్టారు. చేసే రోకలీ, రోలూ కనబడుతున్న పంచ భూతాలూ దైవంగా చూడటానికి ఇవే ఆధారం. ఈ విధంగా నియమాలు, స్నానాలు, జపాలు, వీటిల్లో ఆరోగ్యం, శరీర తత్త్వం, మనసు ఏకమయి వున్నాయి. ఆధ్యాత్మికం, ఆచారం, ఆరోగ్యం అన్నీ కలిసి వున్నాయని నా ఉద్దేశ్యం.

ఒకరు : మరి అటువంటి విశ్వాసం వుండి, మీరు అనుష్ఠించక పోవటానికి కారణం ఏమిటి?

అమ్మ : నా చేత ఎవరూ పట్టించలేదు. నేను వాటిని తక్కువగా చూడటల్లేదు. ఇప్పుడు ఆవు పాలు, బఱ్ఱి పాలు వున్నాయి ఏదితాగాలో నీకు తెలీదు నాన్నా! ఆవు పాలు, తాగు అన్నాననుకో ముందు నేను తాగి అనుభవిస్తేనే నీకు చెప్తాను. వాళ్ళ చేత పట్టిస్తున్నానంటే నేను అనుభవించే. ఒకటి ఎక్కువని లేదు. ఒకటి తక్కువని లేదు ఏది చేసుకుంటామన్నవాడికి అది వద్దా అని లేదు. ఏది వచ్చినా మంచికే వస్తుంది అని. అప్పుడు తెలియక పోవచ్చు. ఇంకో నాడు అనుభవంలో దాని అర్థం మార్తుంది.

ఒకరు : మీరు కొన్ని మాటలు చెప్పి వుండొచ్చు, ఆ మాటలు ఇంకోరికి నే చెప్పినప్పుడు, కొన్ని కల్పించవచ్చు. ఉన్నవి తీసెయ్యవచ్చు. అట్లాంటప్పుడు మీకేమి బాధ కలగదా.

అమ్మ : ఏం కలగదు. అట్లా జరుగుతూనే వుంటాయి. సాధారణంగా వాడికి అందింది వాడు చెప్తున్నాడు, వీడికి అందింది వీడు చెప్తున్నాడు. అందిన దాన్ని కూడా మరుగు పర్చాలని చూసే వాళ్ళు వుంటారేమో! దానివల్ల నాకొచ్చేనష్టం ఏం లేదు.

ఒకరు : సత్యం అనేది బయటకు తెలియటల్లేదు కదా!

అమ్మ : మీ ద్వారా తెలిసే సత్యం ఎన్నాళ్ళుంటుంది. నాకు గొప్పతనం నువ్వు తెచ్చిపెడితే ఎన్నాళ్ళుంటుంది. తీసెయ్యటం చేతయితే తెచ్చిపెట్టగలవు. తెచ్చి పెట్టటం చేతయితే తీసెయ్యగలవు. నువ్వు తీసేస్తే, ఎన్నాళ్ళు తీసేస్తావు, ఎంత తీసేస్తావు? రెండూ నీ చేత కావు.

ఒకరు : ఈ నిరతాన్నదాన శక్తి మీ కెక్కడిది?

అమ్మ : ఎవరి అన్నం వాళ్ళు తింటున్నారు.

ఒకరు : మీరు పెడుతున్నారు కాబట్టి తింటున్నాం.

అమ్మ : నేనుగా పెట్టడం లేదు. అదీగాక, ఇప్పుడు తినలేనివాడు వచ్చినప్పుడు, విస్తరి వేసినా తినలేడు. ఎవరైనా వచ్చి నాలుగు రోజులుండి, వెళ్ళమంటున్నారనుకో, వెళ్ళమంటున్నా వెళ్ళడు. ఎవరి అన్నం వారు తింటున్నారు. నేపెట్టడం అంటే బరువే.

ఒకరు : మనుష్యుల్ని ఉద్ధరించాలని, వారిని దైవం వైపు మళ్ళించాలని కొందరు మహాత్ములు చేస్తూ వుంటారు. అట్లా చేస్తే వారి శక్తి తగ్గుతుందంటారు. నిజమేనా?

అమ్మ : శక్తి తరిగేది, పెరిగేది కాదు నాన్నా. ఇప్పుడు నమస్కారాలు చేస్తే పాపం అంటుతుందని, జబ్బు లొస్తాయని కొంత ఏదన్నాచేస్తే శక్తి తరుగు తుందని అనుకోవటంలేదు.

ఒకరు : ఇప్పుడు శాయిబాబాగారున్నారనుకోండి. భక్తులకీ, ఉంగరాలు తీసిఇస్తూ వుంటారు. దానివల్ల వారి శక్తి తగ్గుతూ వుంటుంది అనే విధానం ఒకటి వుంది.

అమ్మ : వున్నది. (విధానం) తెలియదు.

ఒకరు : క్షుద్ర శక్తులు వున్నాయంటారు.

అమ్మ : శక్తి ఒక్కటనే నా ఉద్దేశ్యం.

ఒకరు : దయ్యాలు, భూతాలు ఉన్నాయా అమ్మా?

అమ్మ : దయ్యాలు, భూతాలు సంగతేమో గాని, దయ్యాలు పట్టినవాళ్ళు ఇక్కడికి వస్తూ వుంటారు. దాన్ని బట్టి వారి మానసిక స్థితి అర్థమవుతోంది లేదూ అంటే లేదనుకుంటున్నారు (దయ్యం), వున్నదంటే వున్నదను కొంటున్నారు, కొంతమంది. ఈ మధ్య ఒక అమ్మాయి వచ్చింది. ఆ అమ్మాయికి దయ్యం పట్టిందని అక్కడ ఎవరో యంత్రాలు కట్టారట. నన్నడిగితే, ఏం లేదు ఇట్లాంటివి అన్నా. తట్టుకోలేక పడిపోయింది. ఉంటాయిగా కొన్ని గొప్పలు. మనం అట్లా చేస్తే దయ్యం వున్నదనే అనుకునేది లెక్క చెయ్యకపోతే తనంతట తనే లేచి కూచుంది. భయం వుండొచ్చు (దయ్యం పట్టిందని) భయం వల్ల కావచ్చు.

ఒకరు : ఈ మధ్య హైద్రాబాద్‌లో, అక్కడ ఒక ఇంటిమీద రాళ్ళు పడటం చూసాం. అది చూసి నప్పుడు, కొన్ని దుష్టశక్తులు వున్నాయనిపించింది. మరి దీనికెట్లా సమన్వయం?

అమ్మ : నిన్న ఒక విషయం జరిగింది. ఒక కుఱ్ఱాడు అద్దంమీద ఏదో చూపిస్తాడని చెప్తే, చూపించు నాయనా, చూస్తా నన్నాను 'ఆ మీ దగ్గర రావులెండి'. అన్నాడతను. ఇట్లాంటివి కొన్ని ఇక్కడ చెయ్యమని అడిగాను నాన్నా. ఎవరూ చెయ్యలేదు. నా అనుభవం లోకి రాందే నేనేం చెప్పను.

సోదరులు: మధ్యప్రదేశ్ నుంచి ఒక కోయవాడు వచ్చాడు. నలుగురం కూచ్చున్నాం. ఓ కాగితం పడవలాగా చేశాడు. అది అక్కడ పెట్టి, ఆ కాగితం కేసి

నన్ను చూడమన్నాడు. చూస్తున్నాను. అతను దాని వైపు చూస్తూ దేవీ, దేవీ, అంటుంటే, అది నడిచి నా దగ్గరకు వచ్చింది. అదిచ్చి, ఇది చేసుకో, అది చేసుకో అని చెప్పాడు నాకు పూజల మీద నమ్మకం లేదు. దైవం ఉన్నాడని నమ్మకం వుంది కాని మరి దీని సంగతేమిటి?

అమ్మ : మూలిక ప్రభావం నాన్నా. కోయవాడు అంటున్నావు గనుక.

సో : వేదమాత దంపతుల్ని గురించి మీరు విన్నారా?

అమ్మ : ఇక్కడి కొచ్చారు వాళ్ళేనా ! చూశాను. నేనేం మాట్లాడలేదు. వారూ ఏం మాట్లాడలేదు, కాసేపు కూచుని వెళ్ళారు.

సో : ఆ వేదమాత ఆమె సమాధి స్థితిలోకి వెళ్ళి అనేక భాషలు మాట్లాడుతుంది, పైగా అనేకమైన సంగతులు చెప్తుంది.

అమ్మ : పక్కన వున్నవాళ్ళకి కూడా ఆ భాషలు అర్థమయితే ...... మనక్కూడా అన్ని భాషలు వస్తే చెప్పేవాళ్ళం.

సో : ఆమెకు మళయాళం మామూలు స్థితిలో వున్నప్పుడు రాదు సమాధిలో వున్నప్పుడు మాట్లాడుతుంది. నేను ఫలాన జన్మలో ఇది చేశాను, అది చేశాను అంటుంది.

అమ్మ : కావచ్చు నేను వాటిని గురించి చెప్పలేను.

సో : వాళ్ళు కూడా ప్రచారం చేస్తూ పోతుంటారు. వాళ్ళని గురించి మీ అభిప్రాయం!

అమ్మ : ఇతర్లని గురించి నన్నడిగితే, నేను మొదట చెప్పిన సమాధానంలో అన్నీ ఇమిడి వున్నాయి.

సో : ఇవన్నీ మాబోటి అల్పజ్ఞానం కలవాళ్ళని సందేహాల్లో ముంచెత్తుతున్నాయి.

అమ్మ : సందేహమూ కలుగుతుంది, నమ్మకమూ కలుగుతుంది. ఎంత నమ్మకం లేదనుకున్న వాడైనా, ఏం తోచనప్పుడు గత్యంతరం లేనప్పుడు నమస్కారం చేస్తాడేమో అనుకుంటా మనసులో నాలో గొప్పతనం అవసరం లేదు. నేనెట్లావున్నా ఏం చేసినా నీకు విశ్వాసం వున్నప్పుడు అదే రక్షణ. ఏమీ

లేకపోయినా నమ్మినప్పుడు మీ విశ్వాసమే మీకు హాయి. మనశ్శాంతి కంటే రక్షణ ఇంకోటి లేదుగా. అన్నీ ఇంట్లో వుండి కూడా మనశ్శాంతి లేకపోతే బాదే. అందులో కూడా నేనేమను కుంటున్నానంటే, ఈ దుర్మార్గాలూ, ఈ పద్ధతులు లోకంలో ఎట్లా అయితే వచ్చాయో, ఎక్కడి వాళ్ళు అక్కడ మొక్కటానికి, వీలుగా ఇట్లా బయల్దేరి వుండొచ్చు కదా అని.

ఏ ఆపద వచ్చినా నమస్కారం చెయ్యటానికే వచ్చిందేమో ఇదంతా! ఎక్కడి కక్కడే వున్నారు కదా!

సో 3 : దుర్మార్గాలూ అని ఇప్పుడు అమ్మ అన్నారు, దానికి ఒక్క ఉదాహరణ చెప్పండి.

అమ్మ : ఇలా అంటున్నారు ( లోకంలో దుర్మార్గం ప్రబలుతోందనే వాడుక) కదా అంటున్నా.

నాలుగు నిమిషాలు నిశ్శబ్దం. ఎవరూ ఏమీ మాట్లాడలేదు మౌనంగా అమ్మ కేసి చూస్తూ కూర్చున్నారు. మొదట సంభాషణ ప్రారంభించిన ఆయనే (ఇజ్రాయేల్) "చాలా శ్రమకల్గించాం, క్షమించాలి" అన్నారు నమస్కరిస్తూ

అమ్మ : చిరునవ్వుతో "ఈ సారి వచ్చి సుఖ పెట్టు" అన్నారు.

అంఅ



మాతృదేవికి మంగళం మూ మంగళాంగికి మంగళం!
శ్రీకరంబై దివ్యమై భాసిల్లు తల్లికి మంగళం ॥

1. సాక్షియై పరమాత్మయై సద్రూపమై సత్యంబునై
సర్వకారణశక్తియై శోభిల్లు తల్లికి మంగళం ॥మాతృ॥

2. సర్వజీవప్రేరణంబై సర్వాంతర్యామియై ।
సర్వమంత్రమయశ్శివంబై వెలగుతల్లికి మంగళం ॥మాతృ॥

3. నిత్యమై నిస్తత్వమై నిర్వ్యాజమై నిర్లిప్తమై ।
నిష్కళీ భూతంబునై విలసిల్లుతల్లికి మంగళం ॥మాతృ॥

4. అవ్యయంబై అద్వయంబై అవాఙ్మానసగోచరంబై
సగుణనిర్గుణత్వమౌ అనసూయతల్లికి మంగళం ॥మాతృ॥

లోకాస్సమస్తా స్సుఖినోభవన్తు





"సృష్టివేరు శక్తివేరు కాదు సృష్టే శక్తి ... శక్తే సృష్టి. సృష్టి అంతా ప్రేమమయం. ధర్మాధర్మాలు, పాపపుణ్యాలు, నీతి అవినీతులు .. అన్నీ ప్రేమలో యిమిడి వున్నాయి. ప్రేమ కంటే భిన్నమైనది మరొకటిలేదు. ప్రేమయే సర్వం. మానవత్వం, దైవత్వం ప్రేమలో యిమిడి వున్నాయి. ధర్మం - తల్లి బిడ్డలను పెంచటం లాంటిది. పదిమంది కలసి, కొన్ని కట్టుబాట్లు చేసుకొని యిట్లా నడుచుకుందాం అనేది ధర్మం. ఏది మంచి, ఏది చెడు - అని విచక్షణ చేసుకొని ఉచితమైన విధంగా నడుచుకొనటం న్యాయం."

